

Dr. C. Radhakrishna Sarma




రచన :

సాహిత్యకళాసాగర

డా॥ వక్కలంక లక్ష్మీపతిరావు, ఎమ్.ఏ., పిహెచ్ డి.,

From :

Prof. S. V. Joga Rao, M.A. Ph.D.,
Head, Dept. of Telugu
Chairman, Board of PG Studies &
Faculty of Oriental Learning,
Andhra University, Waltair.

Dt. 12-10-'79.

# CERTIFICATE

*This is to certify that this thesis entitled "పారిజాతాపహరణప్రబంధసౌందర్యసమీక్ష" submitted by Sri Vakkalanka Lakshmipati Rao,* M.A., *for the award of the Ph. D. degree of our University has never formed the basis for any degree or diploma of this or any other university.*

*(Sd.) S. V. Joga Rao*
Director of Studies



# అంజలి

కాలుసేతులతోడఁ గదలాడుమన్మథుఁడు
మనసెల్ల మల్లియలమాల యౌనరవరుఁడు
సంస్కృతాంధ్రాంగ్లభాషామహాంభోనిధుల
నాపోశనము పట్టినట్టియపరాగస్త్యుఁ
డెందతో డాక్టర్ల సృష్టించుగురుదేవుఁ
డుద్దండకవిపండితోత్తముఁడు రసహృదయ
సమ్రాట్టు జనహృదయచయపశ్యతోహరుఁడు
జాతీయగురుఁడు ఆచార్య జోగారావు !
ఖండాంతరఖ్యాతిఁ గని అమెరికానుండి
అసమగౌరవబిరుద మందుకొనుమొనగాఁడు
ఈమహారచనలో నామార్గదర్శకుఁడు
యస్వీ యశస్వికిదె అంజలింతును గూర్మి !

ఇట్లు,

డాక్టర్ లక్ష్మీపతిరావు



*Prof. S. V. JOGA RAO,*
M. A., Ph. D., D. Litt. (Hony)
National Professor of Telugu
PAST PRINCIPAL, ACL COLLEGES
**Andhra University, Waltair.**

VISAKHAPATNAM
1-5-1986

# సహృదయభూమిక

పంచకల్పకములలో ప్రముఖ మైనది పారిజాతము. ప్రపంచ స్థాయిమహాకావ్యములలో ప్రముఖ మైనది పారిజాతాపహరణము. తత్కర్త అష్టదిగ్గజపరివేష్టితవిజయనగరసమ్రాట్ శ్రీకృష్ణదేవమహారాయభువనవిజయసభాభవనగోష్ఠీప్రతిష్ఠాపారీణుఁడు నంది తిమ్మనార్యుఁడు. ఆమహాకావ్యపారిజాతసౌరభమును గుబాళింపజేయుసమగ్ర సమీక్షాగ్రంథరాజ మిది.

ఏతత్కృతికర్త మహాకవి డాక్టర్ శ్రీవక్కలంక లక్ష్మీపతి రాయలు పరమభావుకపట్టభద్రులు. ఇతఃపూర్వమే పారిజాతము పేరుతో ఆకృతి పద్యగద్యాకృతులతో వెలయించినమహాభాగుఁడు. బహుకావ్యరచనాచణభాగధేయుఁడు. వీరభారతాదికవిస్తృతానేకశిల్ప మహితకావ్యకరణధౌరేయుఁడు.

ఇంతటియీమహాకృతిని అంకితము గొనుచున్నభాగ్యశాలి డాక్టర్ శ్రీ జిల్లెళ్ళ వెంకటసత్యనరసింహాభానో వితరణవిఖ్యాతు లైన పేరూరు జమీందారులవంశమునకు చెందినవాఁడు. జీవితరంగమునను సాహిత్యరంగమునను సరసాంతరంగశేఖరుఁడు. సహృదయసార్వభౌముఁడు. క్షోదక్షమశ్రమఫలితమును, కఠోరపరిశోధనదీక్షాకంకణ

సంవలితమును, రసవిస్మృమరతాదృశకావ్యపరమార్థమునకు "మిన్నేటి పసిండినెత్తమ్మిచిగురుటాకునం జొదివిన పారిజాతంపుఁగ్రొన్ననయు" నైనయీపరిశోధననిబంధమునకు కృతిపతి యగుట ఆయనభాగ్యవిశేషము.

రాష్ట్రమున కొక్కఁడు ఏతాదృశుఁడు కృతికర్తయు, ఊరి కొక్కఁ డేతాదృశుఁడు కృతిభర్తయు నున్నచో ఈదేశ మెంతమహాసౌభాగ్యసన్నివేశ మగునోకదా యని అస్మదాదులఅభిసంధి.

(సం.) యస్వీ జోగారావు

*Dr. G. V. S. N. Bhano,*
M. Sc., (Ag.) ; Ph. D.,
SREE LAKSHMI JANAKI MANSIONS

*Meher Baba Street,*
*S. K. B. Ramars College Rd.,*
**AMALAPURAM-533 201.**
Phone : 388.

# అక్షరాంజలి

సాహిత్యకళాసాగర డాక్టర్ వక్కలంక లక్ష్మీపతిరావుగారు జగమెఱిగినమహాకవి. కవిసమ్రాట్ విశ్వనాథాదిమహాకవులు మెచ్చిన కవితాశిల్పి. మాజనకులు అమలాపురంలోని శ్రీకోనసీమాభానోజీ రామర్సుకళాశాలాసంస్థాపకులు పేరూరుజమీందారు కీ. శే. జిల్లెళ్ళ వెంకటభానోజీరామర్సుగారూ, మాసోదరులమూ డాక్టర్ లక్ష్మీపతి రావుగారిశిష్యులము కావడం మాఅదృష్టవిశేషం. సరిగా ముప్పైఏళ్ళ క్రితం 1957 మేనెలలో కవిసమ్రాట్ శ్రీవిశ్వనాథసత్యనారాయణగారి అధ్యక్షతన మహావైభవంగా జరిగినచిరస్మరణీయరసమయసాహితీ సదస్సులో వీరు 'పారిజాతసౌరభము' అనేతమతొలిపద్యకావ్యాన్ని మాజనకులైన శ్రీభానోజీరామర్సుగారికి అంకితం చేశారు. ఆసాహిత్య బాంధవ్యం మాకుటుంబాలను మరింత సన్నిహితం చేసింది. పద్యగద్య గేయకావ్యరచనలో లబ్ధప్రతిష్ఠులైనమాగురువుగారు నలభై కావ్యాల వరకూ రచించారు. వీరు కవులే కాక సుప్రసిద్ధవిమర్శకులుగా నంది తిమ్మనపారిజాతాపహరణంలోనిసౌందర్యాన్ని సమీక్షించి ఈఉద్గ్రంథ రచనకు ఆంధ్రవిశ్వవిద్యాలయంనుండి డాక్టరేట్ పట్టం స్వీకరించారు. ఒకమహాకవిహృదయాన్ని మరోమహాకవి ఎలా ఆవిష్కరిస్తాడో మనకు చాటిచెప్పేగ్రంథరాజ మిది. ఈసౌందర్యసమీక్షకు నన్ను కృతిపతిగా చరితార్థుని చేసి నాఅభీష్టాన్ని నెరవేర్చినమాఆస్థానకవి డాక్టర్ లక్ష్మీ పతిరావుగారికి కృతజ్ఞతాంజలి.

" దేవు డిచ్చినకానుక తీయనైన కవిత సొమ్ముల కమ్మెడు కవిని కాను" – అని ప్రతిజ్ఞ చేసినఈకవినుండి కృతు లందుకొని సాహితీ జగత్తులో చిరంజీవు లైన శ్రీ రామానుజమీాందారుగారు, మాజీరాష్ట్రపతి శ్రీ.వి.వి.గిరిగారు, సహృదయచక్రవర్తులు శ్రీ దామోదరం సంజీవయ్యగారు, నటసమ్రాట్ డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావుగారు వంటిఅగ్రగణ్యులసరసన కృతిభర్తగా నాకుకూడా స్థానం లభించడం నాకు గర్వకారణం.

ఈకృతిసమర్పణమహాసభను అలంకరించి మాపై ఆశీరక్షతలు కురిసినఆంధ్రప్రదేశ్ రాష్ట్రాస్థానమహాకవిపండితులు డాక్టర్ దాశరథిగారికీ, ఈసౌందర్యసమీక్షారచనలో డాక్టర్ లక్ష్మీపతిరావుగారికి మార్గదర్శకు లైనవిశ్వవిఖ్యాతమహాకవిపండితులు ఆచార్య డాక్టర్ యస్వీజోగారావుగారికి నాకృతజ్ఞతలు.

ఇట్లు,

అమలాపురం<br>
15–4–1987

డా॥ జిల్లెళ్ల వెంకటసత్యనరసింహభానో



శ్రీః

ఉ. శ్రీకమలామనోహరుని శ్రీకరనేత్రము కర్మసాక్షి ప
ద్మాకరహాసకారకుఁడు - అందఱకుం గనిపించుదైవమై
లోకహితైషి యై యిల వెలుంగులు నించు సహస్రభానుఁ డ
స్తోకశుభేక్షణాంశువులఁ జూచుత మా నరసింహభానునిన్.



కృతిభర్తృదంపతులు

డాక్టర్ జిల్లెళ్ల వెంకటసత్యనరసింహభానో

శ్రీమతి శ్రీదుర్గానాగరాజేశ్వరి

సీ. భరతజాతికి మూలపురుషుఁ డై యసమవి
ఖ్యాతుఁ డౌభరతునితాతగారు
సృష్టికిఁ బ్రతిసృష్టి చేసి యాశ్రితరక్ష
కుం డన్నప్రథ నిల్పుకొన్నజాణ
జగదేకరక్షకుం డగురఘూద్వహునికి
నస్త్రవిద్యాగురుం డైనమేటి
అతిలోకనిష్ఠచే నమరలోకేశ్వరు
గుండెగాలం బైనదండిమగఁడు

తే. గీ. క్షత్త్రతేజము బ్రహ్మతేజమ్ము నొకటఁ
గూడి తానుగ రూపముం గొన్నవాఁడు
సప్తఋషులందు నొక్కఁ డై సద్యశమ్ముఁ
గాంచి తారాపథం బందెఁ గౌశికుండు ।

తే. గీ. అట్టికౌశికమునిపవిత్రాన్వయమున
వెలసి గోత్రాభిమానమ్ము విడక కౌశి
కీతటమ్మునఁ బేరూరఁ గీర్తిధనులు
లీలఁ జెలువారుచుంద్రు జిల్లెళ్ళవారు ।

మ. క్షితినాథుం డయి మౌనినాథుఁ డయి వాసిం గాంచుతన్మౌనిసం
తతియౌన్నత్యము నెంచ శక్యమె? తపోధన్యుల్ ప్రజామాన్యులుం
బ్రతిభాశూరులు దానవీరులును బ్రహ్మక్షత్రతేజోనిధుల్
సతతప్రీతబుధుల్ తలిర్తురు సదాచారుల్ మహోదారు లై.

తే. గీ. చిత్ర మేమొ। విశ్వామిత్రగోత్రు లయ్యుఁ
ద్యాగధను లౌట విశ్వమిత్రములు వారు ।
అదిర। జిల్లెళ్ళవంశమం దవతరిలియుఁ
గవులపాలిటికల్పవృక్షములు వారు ।।

కం. యాబన్నపంతు - కరో
యాబర్సను తంద్రికొడుకు లసమప్రజ్ఞా
ప్రాబల్యవై భవముల మ
హాబలు లెకీరి గాంచి రావంశమునన్.

మ. సరదార్లై 'యకరాను' 'జబ్తులు' 'బాషంద్' 'బాఫియ' త్తన్నమేల్
బిరుదంబుల్ గని ఫౌజుదారు లయి ఢిల్లీపాదుషా మిత్రుఁ డై
కర మర్పించిన 'జాలమూడి,' 'విలస' గ్రామాదులన్ దక్షతన్
బరిపాలించిరి దేశపాండ్యు లయి తత్ప్రఖ్యాతభూమీసురుల్.

ఆ. వె అజమీనుదార్ల కావాసభూమి యై
కోనసీమ యయ్యెఁ గోనసీమ ।
ఆయుదారులుంటసార్థమై పేరూరు
పేరుదెసలనెల్లమాఱుమ్రోసె ।।

ఉ. ఆమహిపావతంసములయన్వయమం దుదయించి భానుజీ
రామరుసుప్రభుండు నజరామరకీర్తి గడించె దీనర
క్షామహిమోజ్జ్వలుం డయి యఖండతపోనిధి యై మహీసుర
గ్రామణియై బుధార్చనపరాయణుఁ డై నిరతాన్నదాత యై.

శా. ఆరామర్సుమహీతలేశ్వరునిదానాంభోధునీస్పర్ధచేఁ
దారుణ్యం బఱి కౌశికీనది కృశత్వం బందెఁ ; దత్కీర్తితో
వైరం బూనియు గెల్వలేక తలవం పై శంభుజాటాటవిన్
దూరం జొచ్చె నమర్త్యవాహిని ; పడంతుల్ వంతు సైరింతురే ?

కం. అవిభుననంతరంబ ధ
రావలయముఁ గేలఁ దాల్చె రామాజీభా
నోవిభుఁడు దత్తపుత్త్రుం
డై వంశయశమ్ము దశదిగంతము లంటన్.

మ. వలకేలం దనచేయుదానమును ఆభానోజిసూనుండు డా
పలికేలైన నెఱుంగనట్టు లొనరింపం దద్రహస్యమ్ము భూ
వలయం బంతట మాఱుమ్రోగుటకు నబ్రంబందు నయ్యారె ! ఇ
ట్లలతిన్ లోకముకన్ను గప్పుట కొకండా ? రెండ ? తత్కృత్యముల్.

చం. అతులపతివ్రతాతిలక మై సకలార్యనుతాభిమాన యై
శ్రితజనకల్పవల్లి యయి శ్రీనిధి యై సుగుణాలపేటి యై
నుతి గను తిర్మలాంబిక మనోహరి గాఁగ మహీవరుం డహో !
వితరణశీలుఁ డౌచు మఱపించెను దండ్రియుదారవర్తనన్.

సీ. మనిచె నేమహినేత మరువాద ఖండన
శాస్త్రిపండితుని నాస్థాని గాఁగ
నెఱపినాఁ డేదాత నిరతాన్నదానముల్
తనగేహ మన్నసత్రమ్ము గాఁగ
ఆదరించె నెవండు వేదవిద్వాంసుల
స్వగృహమ్ము శ్రుతిపాఠశాల గాఁగ
అర్పించె నేత్యాగి యాచకవ్రతతికిఁ
దనయర్థ మెల్ల సార్థమ్ము గాఁగ

తే. గీ. సకలవేదాంత శాస్త్రార్థసార మవధ
రించి రాజర్షి యనఁగ వర్తిల్లె నెవ్వఁ
డతఁడు కకుబంతవిశ్రాంతసితయశుండు
దానకర్ణుండు రామాజిభానువిభుడు ॥

కం. ఆరామాజీభానో
ద్ధారమణుననంతరంబ భూపతి వలచెన్
కారుణ్యభాసు విద్యా
శ్రీరమ్యవిలాసు భానుజీరామరుసున్.

ఉ. పిల్లలు లేనిలోటు కనిపింపఁగనీయక పెంచుకొన్నఆ
తల్లినిఁ దండ్రినిం దనిపి ధర్మవిశిష్టపథమ్మునందు వ
ర్తిల్లుచుఁ గడ్పు నిండుగ ఫలింప నిజాంకము విల్లునిండ సం
పల్లలితుండు తా నలరు భానుజిరామరు సెంతధన్యుడో ॥

సీ. తనమాతృభక్తి సజ్జనకీర్తనీయ మై
జగతికి మార్గదర్శకము గాఁగఁ
దనరసజ్ఞత కవీంద్రవ్రాతకలకంఠ
తతికి శాశ్వతవసంతమ్ము గాఁగఁ
దనయేకపత్నీవ్రతమ్ము కామాంధు లౌ
సామాన్యులకుఁ బ్రదపాస్థాని గాఁగఁ
దనసత్స్వభావమ్ము తాను నిల్పినకళా
శాలకు జీవనౌషధము గాఁగ

తే. గీ. అల 'సినేటు' న సభ్యు డై యాంధ్రహూణ
భాషలం దెల్ల గడిదేటి పట్టభద్రుఁ

డై నిరంతరవితరణుం డై యెసంగు
భానుజీరామరుసుసాటివారు కలరె ?

తే. గీ. ఏమహాత్యాగశీలము వింత వినిన
మేను పులకించి యొకకళాపీఠమగునొ !
ఏరసజ్ఞునిచేయి యొక్కింత తవిలి
విపులగోసంతతులు కుంభవృష్టి కురియు ?
నతఁడు కవిపారిజాతము సితయశుండు
జానకీజాని రామర్సుజమీనుదారు.

సీ. జానకీసతి నొక్కక్షణమైనఁ బాయక
రంజింపఁజేసెడురాముఁ డతఁడు
పరకామినీసహోదరుఁడును మ్మిత్రఁ డన్న
ప్రఖ్యాతి గన్నగోపాలుఁ డతఁడు
పుడమిచేడియయొడల్ పులకింప సిరితోడ
సౌఖ్యాబ్ధిఁ దేలుభూస్వామి యతఁడు
స్థానికరోటరీసంస్థాపకాధ్యక్షుఁ
డై కీర్తిఁగాంచినత్యాగి యతఁడు.

తే. గీ. పారిజాతసౌరభములఁ బరవశించు
నట్టిభూలోకదేవేంద్రుఁ డామనస్వి !
శత్రువులకైన మేల్గోరుశాంతమూర్తి
భానుజీరామరుసుసాటివారు కలరె ?

తే. గీ. మఱచిపోలేదు తన్మహనీయదాతృతా
గుణము లీనాఁడును కోనసీమ
మూఁగవోలేదు తద్రాగరాసిక్యమ్ము
కీర్తించుసుకవికోకిలగళాలు
వాడిపోలేదు తా వలచినకృతికాంత
పారిజాతసుమాలపరిమళాలు
చెఱిగిపోవదు శిలాక్షరపట్లు భానోజి
రామర్సుపేరికళాలయమ్ము

తే. గీ. ఆంధ్రభాషాకవిత్వము లవనియందు
నుండువఱకు నాతండును నుండువాఁడె

సితయశోదేహమునఁ జిరంజీవి యైన
ధన్యతముఁడు రామర్ప్రజమ్మిందారుగారు ।

తే. గీ. జానకీరామరుసు అదృష్టమ్మ పండి
ఆర్యప కుమారులును మువ్వు రాత్మజలును
కలిగి నవరత్నకాంతులు కడలుకొనఁగ
ఆననము లిల్లు కలకలలాడసాగె ।

తే. గీ. ఆకుమారులలోన మూఁడవయతండు
మూఁడుమూర్తులఁ దండ్రినిఁ బోలి యుండు
వాఁడు డాక్టరు నరసింహభాను సుకృతి
వైణికుఁడు సర్వవిద్యల జాణ యతఁడు ।

గేయము. కాలుసేతులతోడఁ గదలాడుగురుభక్తి
నరసింహభానుగా నవతరించిన దిచట ।
సత్కళారాసిక్యసంస్కారవిభవమ్మ
నరసింహభానుగా నడయాడు నిచ్చోట ।
మహనీయపితృభక్తి మానవాకృతిఁ దాల్చి
నరసింహభానుగా నగుపించు నిచ్చోట ।

తే. గీ. వేణువును వీణగా మార్చి విపుల పటుగ
ణమ్మ పోషించి కాంచెను నవ్యరీతి
వైద్యపద్ధతు లెఱుగువిశిష్టుఁ డయ్యె
నతఁడు శ్రీస్వామి భూస్వామి యై రహించె ।

తే. గీ. ఎందఱో బీదవిద్యార్థిబృందములకు
గుప్తదానము లొనరించి - కొలఁది యెఱుఁగ
కిచ్చి శస్త్రచికిత్సకై హృదయరోగ
పీడితుల నాదుకొనియె నీవితరణఖని ।

సీ. శ్రీకోనసీమాఫిలింసొసైటీవ్యవ
స్థాపకాధ్యక్షుఁ డై యేపుమీరి
ఎగ్రికల్చరలు పీ. హెచ్. డి. యై డెన్మార్కు
కేఁగి యున్నతవిద్య లెనసి యెనసి
ప్రతియేట జనకుస్మారకసభల్ జరిపించి
కవిపండితులకు సత్కార మొసఁగి

త్యాగరాట్సభలలో - తల్లి జానకిపేర
సంగీతవిబుధుల సత్కరించి
రోటరీక్లైర్మనై దీటుగా సంఘసే
వాకార్యములయందుఁ బరవశించి

తే. గీ. సరగ డిస్ట్రిక్టురోటరీక్లైర్మ నగుచు
సంఘసేవావిధుల్ పెక్కు సంఘటించి
సీమ లెఱుగని శ్రీకోనసీమవేద
శాస్త్రపరిషత్తుపాలకసంఘసభ్యుఁ
డై పురాతనసంస్కృతి యతిశయింపఁ
జేయు పుణ్యాత్ముఁ డీనరసింహభాను ;

తే. గీ. అందుకొన్నాఁ డటే యావదాంధ్రరాష్ట్ర
కర్షకప్రతినిధి యై యఖండయశము ;
స్వీయవిద్వత్తుచే భారతీయనారి
కేళసంఘంపుసభ్యుఁడై కీర్తిఁ గాంచె ;

తే. గీ. ఆతఁ డాదుర్రు పేరూరు అందు జీర్ణ
మైనయాలయముల కిచ్చె నధికధనము ;
మదనగోపాలదేవుసద్మమ్మునందు
ధర్మకర్తృసంఘంపుటధ్యక్షుఁ డయ్యె ;

ఉ. వాగధినేత్రి శిక్తుఁ డయి వైదికసంస్కృతిపట్టుగొమ్మ యై
సాగినయంతకున్ మహితసంస్కృతసాహితి నాదరించు కాం
డ్రేగులవంశవార్ధిశశి శ్రీకుఁ డుదారుఁడు శ్రీనివాసరావ్
తాఁ గలరాణ్మహేంద్రమున దాతృత గౌతమిపీఠి నిల్పుచున్.

శా. నారీమారుఁడు కాశిపట్నపుజమీందార్ శ్రీనివాస్‌రావుకున్
తారామండలకీర్తి తత్సతికి సీతారామబాయమ్మకున్
గారా మైనతనూజ శ్రీయుతను దుర్గానాగరాజేశ్వరిన్
శ్రీరమ్యుండు నృసింహభాను గ్రహియించెం గూర్మియిల్లాలిగన్

సీ. కనులలో సిరులు తొల్కాడుచేజవరాలు
కదలాడ నేర్చుబంగారుబొమ్మ
నరసింహభానోమనస్సు కెక్కినజాణ
చాంచల్య మె ఁగనిమించుతీవ

కాలు సేతులతోడ కదలుశాంతరసమ్ము
కవిపండితులపాలికల్పవల్లి
మాటలో మనసులో మధు వొల్కునిల్లాలు
పరమాభిజాత్యంపుపట్టుగొమ్మ

తే. గీ. మామపేరిటిభానోజిరామరుసును
జానకీకృష్ణపూర్ణిమన్ సాఁకికొనుచు
నెలఁత సీతారమారంజనీకుమారిఁ
గాంచి కన్నుల వెన్నెలల్ కాయు దుర్గ।

చం. వినుతయశుండు శ్రీయుతుఁడు వేంకటసత్యనృసింహభానుచ
ల్లనికరుణాకటాక్షములలాలనలోఁ గవితాకుమారి అ
ల్లన నొకమెట్టుమెట్టుగ విలాసములం బచరించి యావదాం
ధ్రిని విహరింపఁజేయు రసతీరములన్ నవమోహనాకృతిన్.

కం. కవితానవలావణ్యము
తవిలినయెద వొంగి అమృతధారాశ్రీపై
భవవాగ్విచిత్రి మెఱయఁగ
అవురా। నరసింహభానొ ర్థించె ననున్.

తే. గీ. "నీదుశిల్పవేత్తృతకు స్పందించి ఆంధ్ర
విశ్వవిద్యాలయము సమర్పించె డాక్ట
రేటుపట్టము - కైతలో వాట మెఱుఁగు
కవివి నీవ - మాయాస్థానకవివి నీవ।

సీ. శిల్పాభిరామవిశిష్ట మౌ వీరభా
రతమహాకావ్యనిర్మాణమందు
ధ్వని ప్రధానమ్ముగాఁ దగుపారిజాతసౌ
రభకావ్యరచనాకలాపమందు
కవికులగురుని మేఘమునకుం దెనుఁగుతీ
యందనమ్ములు నేర్పునదనునందు
భారతీయప్రభుత్వపుబహూకృతు లందు

తే. గీ. పద్యగద్యగేయాత్మకభణితులందు
నవలలన్ నృత్యనాటికానంతగతుల

నీరచించినముప్పదికృతులలోన
నిలిచిపోదువుగద చిరంజీవి వగుచు.

తే. గీ. మునుపు మాతండ్రి కంకితమ్ముగను పారి
జాతసౌరభకావ్యమున్ ప్రీతితో నొ
సంగితివి- నేఁడు సాహిత్యజగతిలోన
నాకు నిర్మింపు మొక్కరత్నాలమేడ!

కం. నిత్యవినూతనకవితా
నృత్యకళారంగభూమి నీహృదయము సా
హిత్యకళాసాగర! సౌ
హిత్యముతో నాదుకోర్కి నీడేర్పఁగదే!

తే. గీ. ఒకమహాకవికవితలో నుండుశిల్ప
మింకొకమహాకవీశ్వరుఁడే యెఱుంగు;
ముక్కుతిమ్మనకవితలోఁముద్దుపలుకు
లెఱిఁగినమహాకవివి- నీకు నెవరు సాటి?

తే. గీ. కవిత కానీ- విమర్శయే కాని- నీవు
పట్టినది యెల్ల బంగార మిట్టె యగును!
పారిజాతాపహరణప్రబంధమందు
నందచందాలు వివరింపు మరసి యరసి.

కం. కవితాకళాప్రపూర్ణా!
నవరచనము మాకు ని మ్మనంగాఁ గూర్మిం
దవిలినమదితో ని త్తున్
వివిధశుభపరంపరాభివృద్ధిగ దీనిన్.



# గ్రంథరచనాసమ్ముచ్చయము

ఆంధ్రసారస్వతప్రక్రియలలో ప్రబంధ మొకయతివిశిష్ట మైన ప్రక్రియ. పారిజాతాపహరణ మాలక్షణము లన్నియు సమగ్రముగా సంతరించుకొన్నప్రప్రథమప్రబంధ మగుటయే కాక ఆవాఙ్మయకోటి యందు కోటికి పడగెత్తినప్రబంధరాజము.

సంస్కృతాంధ్రానుబంధములకు శాశ్వత మైనసంధిపత్రమును సంఘటించినబహుశాంధ్రోక్తిమయప్రపంచపరమేష్ఠి యైననన్నయభట్టారకునిప్రసన్న గంభీరమును, నాపాతమధురమును నైనశయ్యావైయాత్యమును పుణికిపుచ్చుకొన్నట్టిది.

శబ్దాలంకారములయాడంబరము లేక ముక్కుతిమ్మనార్యుని ముద్దుపలుకులు నాఁటికిని నేఁటికిని సర్వాంధ్రసారస్వతప్రపంచమున నొకసామెతగా, సహృదయు లైనచదువరులరసనాగ్రముల కొకయామెతగా నిలిచినవి.

అద్యతనాంధ్రభావుకు లనేకులతలంపున నాంధ్రపంచమహాకావ్యములలో నొకటిగా గణన కెక్కిన దీప్రబంధము. రసరాజ మగు శృంగారమును సుకుమారముగా, సురుచిరముగా, స్వతంత్రకల్పనాకల్పముగా పరమతాత్పర్యరమణీయముగా పోషించినట్టిది.

రసోచిత మైనరచనతోడనేకాక – ఉత్తమరసపాకమున కాధారభూతముగా నుదాత్తపాత్రచిత్రణము చేసినది.

"నామరూపాత్మకం విశ్వం దృశ్యతే యదిదం ద్విధా
యత్రాద్యస్య కవి ర్వేధా ద్వితీయస్య చతుర్ముఖః"

అన్నారు పెద్దలు. అందుచే స్మరణమాత్రమున మనశ్చక్షువు ముందు సద్యస్సాక్షాత్కరించునొక్క సజీవపాత్రచిత్రణము కవిబ్రహ్మపట్ల 'స్రష్ట' శబ్దమును సార్థక మొనరించును. ఒక్కటి కాదు - సత్యభామా శ్రీకృష్ణనారదాద్యనేకపాత్రములను తనసజీవచిత్రణశిల్పమున నాంధ్రావళికి తిమ్మనగారు చిరస్మరణీయమనోజ్ఞభూమికలుగా ప్రసాదించినప్రబంధరాజ మిది. ఆపాత్రలు పౌరాణికజగత్ప్రసిద్ధములే యగుంగాక - కాని - తిమ్మనగారితీర్పు సరిక్రొత్తది. నిర్దిష్టపూర్వసమయపరిపాలితము లగునాపాత్రలను నిసర్గమధురముగా పరిపోషించుటయే కాదు- నిపుణోపజ్ఞాచణముగా, నిత్యప్రత్యగ్రముగా ప్రాణకళను ప్రతిష్ఠించినట్టి చిత్రణమును నిర్వహించినమహాశిల్పి తిమ్మన.

తన కాశ్రయదాతయు, మనుమార్గనిష్ఠుండును నగుమహా ప్రభువుయొక్క జీవితమునందలియొకసున్నితమైనసన్నివేశమును (జనశ్రుతిగతమును) పూర్వరంగముగా చేసికొని, యాపునాదిపై నొకమహాకావ్యసౌధమును నిర్మించి, కృతినాయకుం డగుకృష్ణరాయలకును, కథానాయకుం డగుశ్రీకృష్ణునికిని నభేదమును సంభావించి, పట్టమహిషికరణపుంగవిగా వచ్చినతానా మెసంసారమును జక్కదిద్ది, తనఋణమును దీర్చుకొను ప్రయోజనమును సాధించుకొనుటే కాక సహృదయాంధ్ర పాఠకప్రపంచమును తనకు ఋణగ్రస్తము గావించుకొనుమఱియొకమహత్తరప్రయోజనమును సాధించినాడు మహాకవి తిమ్మన. ఏవంవిధవిశేష లక్షణవిశిష్ట మైనయీరసవత్తరమహాకావ్యమును, దత్పూర్వరంగ కథయును నన్ను చిన్ననాంటినుండియు పరమాకృష్టునిం జేసి, నాచేత నొకపద్యకావ్యమును, నొకగద్యకావ్యమును రచింపంజేసి, యంతటితో నాగక యీసమీక్షారచనకు నన్ను ప్రేరేచినది. పారిజాతాపహరణ మహాప్రబంధరసాస్వాదతుందిల మైనహృదయముతో పరిశ్రమించి

యీ పరిశోధననిబంధమును వెలయించితిని. రసగ్రహణపారీణు లెట్లా కావ్యరాజమును పఠించి హృదయాహ్లాదము నందుదురో - అట్లే గుణగ్రహణపారీణు లగుచదువరు లీసమీక్షను సమాదరింతురుగాక.

ఈ పరిశోధనవ్యాసంగమున వెన్ను తట్టి నన్ను ముందునకు నడిపించినమహాకవిపండితులు ఆచార్య శ్రీ యస్వీజోగారావుగారికి నాకృతజ్ఞతాంజలు లర్పించుకొనుచున్నాను.

ఇట్లు,
లక్ష్మీపతిరావు.

# విషయసూచిక

# పారిజాతాపహరణము - ఒక సమీక్ష

ఉపోద్ఘాతము :-

ఆంధ్రవాఙ్మయచరిత్రలో శ్రీకృష్ణరాయయుగము స్వర్ణయుగముగా ప్రసిద్ధి గాంచినది. ఆంధ్రులకళారాసిక్యము పరాకాష్ఠ నందినప్రబంధయుగ మది. యావద్దక్షిణభారతావని యేకచ్ఛత్రచ్ఛాయకు వచ్చి తెలుగు జాతి సమైక్యముగా వెలు గొందినశుభసమయ మది. సాహితీసమరాంగణసార్వభౌము డైనకృష్ణరాయలచల్లనియేలుబడిలో రాజకీయసుస్థిరతకు నోచుకొని సుభిక్షమై శాంతిభద్రతల కాలవాల మైన తెలుగుమాగాణమున ప్రజాజీవితము భోగమయముగా పరిణమించినది. రాయలయాదరాభిమానములు కారణముగా నిరుపహతిస్థలమును, రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చుకప్పురవిడెమును, నాత్మ కిం పయినభోజనము, నూయెలమంచము, నొప్పు ర ద ప్పరయురసజ్ఞశేఖరులు, నూహ తెలియంగలలేఖకపాఠకోత్తములును లభించుటచే సుఖమయజీవనము గడపుకవిరాజులయెదలు పొంగి యందుండి శృంగారసురభిళము లైనప్రబంధము లావిర్భవించుటతో తెలుగుసీమ కళకు కళ్యాణధామ మై కవితకు పెండ్లిపందిళ్లు కప్పించినది.

సార్వకాలికమును, సార్వజనీనమును నైనధర్మము నుపదేశించుటలో భారతభాగవతరామాయణములు కృతకృత్యత వహించినవి. దేశమున వానిపఠనపాఠనములకు లోటు లేదు. అంతకు మించి నీతి నుపదేశించుటకై యితరులు చేయదగినదియు లేదు. కనుక రాయల నాటికవులు నీతి నుపదేశించుటకన్న చక్కనిచిక్కనికవితలో కళాధర్మము నిలువరించుటపై దృష్టిని కేంద్రీకరించినట్లు కన్పట్టును. కనుకనే రసోదంచితములును, కళాసురభిళములును నైనరచనలు వారిలేఖిని నుండి జాలువారినవి.

క్రీస్తుశకము ప్రథమశతాబ్దిప్రారంభములో నుండినహాలుని గాథాసప్తశతినిబట్టి తెలుగునాఁట నగరములకన్న జనపదము లెక్కు వగా నుండి జానపదుల రాసిక్యము మూఁడుపూ లారుకాయలై ముచ్చట గొలిపినట్లు స్పష్ట మగును.

సీ॥ 'ధరియింప నేర్చిరి దర్భ వెట్టెడువ్రేళ్ళ లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింప నేర్చిరి గంగమట్టియఁమీఁదఁ గస్తూరికాపుండ్రకములు నొసల
సవరింప నేర్చిరి జన్నిదమ్ములమ్రోలఁ దారహారములు ముత్యాలసరులు
చేర్పంగ నేర్చిరి శిఖలనెన్నడుములఁ గమ్మనిక్రొత్తచెంగల్వవిరులు

తే॥ గీ॥ ధామముల వెండియును బైడి తడబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములలోన,
వేమభూపాలుఁ డనుజన్ము వీరభద్రు
ధాత్రి యేలింప గౌతమీతటమునందు'

శ్రీనాథునికాశీఖండమునను, భీమఖండమునను గన్పట్టునీ సీసపద్యము రెడ్డిరాజులనాఁటిశ్రోత్రియబ్రాహ్మణులసంపన్నతకును, సర సతకును నద్దము పట్టుచున్నది. రెడ్డిరాజులనాఁటికే యింతగా వెల్లివిరి సినయాంధ్రజాతిరాసిక్య మపరభోజుఁ డైనకృష్ణరాయలకాలమున బహుముఖోల్బణముగ ప్రగల్భించుట వింత గాదు. కనుకనే రాజకవి యును, గవిరాజును నైనరాయలపోషణలో శృంగారరసప్రధానము లైనప్రబంధములు తల యెత్తినవి.

మ॥ 'ఇవి యేనున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబు లై యుండు పా
యవు భూదేవకులాభితర్పణమహీయఃప్రీతియున్ భారత
శ్రవణాసక్తియు పార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో
త్సవమున్, సంతతదానశీలతయు, శశ్వత్సాధుసాంగత్యమున్'

అని నన్నయ్యగారితో నన్నరాజరాజనరేంద్రుఁడు రసికుఁడే కాని కవి కాఁడు. మఱి రాయలో- సాహితీసమరాంగణసార్వభౌముఁడు. కవితా ప్రావీణ్యఫణీశుఁడు. ఆముక్తమాల్యదాకృతికి నాకృతి దిద్దినయాగర్భ కవివతంసుఁడు.

కం॥ "భువనవిజయాఖ్యసంప
న్నవరత్నవిభాప్రభాతనలినాప్త ! రమా
ధవచరణకమలసేవా
ప్రవణమతీ ! వీరరుద్రపర్వతవజ్రీ !

అని పారిజాతాపహరణకావ్యమునందలిపంచమాశ్వాసాంతపద్యములో (5అ-110 ప) నందితిమ్మనగారును

కం॥ "భువనవిజయాఖ్యసంస
ద్భవనస్థితసింహపీఠిఁ బ్రాజ్ఞులగోష్ఠిన్
గవితామధురిమ డెందము
తవులన్ గొలు వుండి సదయతన్ నన్నుఁ బలికెన్"

అని మనుచరిత్రప్రబంధమున నవతారికలో నల్లసానిపెద్దనగారును శ్రీకృష్ణరాయలకవితాసభను బ్రశంసించిరి.

రెడ్డిరాజులకవితాసభకు త్రైలోక్యవిజయ మను పేరు కాగా-కృష్ణరాయలరాజధానీనగరమున కళాసరస్వతి గజ్జె కట్టి నర్తించినభవనరాజము భువనవిజయము. ఆత్రైలోక్యవిజయమే యీభువనవిజయ నిర్మాణమునకు రాయలవారిని ప్రేరేచి యుండవచ్చును. నందితిమ్మనగారిచే

కం॥ "ప్రతివర్షవసంతోత్సవ
కుతుకాగతసుకవినికరగుంభితకావ్య
స్మృతిరోమాంచవిశంకిత
చతురాంతఃపురవధూప్రసాదనరసికా !"

అని సముచితప్రశంసకు పాత్రుడైన శ్రీకృష్ణరాయసార్వభౌము డీభువనవిజయమున కొలువు దీర్చి తనయాస్థానము నలంకరించినయష్టదిగ్గజమహాకవులకావ్యామృతము నాస్వాదించుటయే కాక దేశమునలు మూలలనుండి వచ్చుకవితల్లజులరచనల కుల్లము పల్లవించి వారిని యథోచితముగా సత్కరించువాడు. రాయ లింతటిరసికావతంసుడు కనుకనే

అంతటిరససంపన్న మైనప్రబంధకవిత యానాడు పల్లకి యెక్కి క్రొత్త యందము లొలుకబోసినది. రాళ్లపల్లివా రన్నట్లు "రాయలనాటి రసికత" యనుమాట తెలుగుభాష నొకసామెతగా తెలుగులసంస్కృతి కొకయామెతగా మఱపురానిమధురస్మృతిగా మనసులలో నిలచినది.

నన్నయాదులు సంస్కృతమూలములను యథాతథముగా కాక యథోచితముగా ననువదించి కొంతకు కొంత తమవ్యక్తిత్వమును నిలబెట్టుకొనినమాట నిజమే యైనను కృష్ణరాయలకాలపుప్రబంధకవులు మాత్ర మట్లు చేయక యేపురాణమునుండియో కథనుమాత్రమే గ్రహించి తమయనల్పకల్పనాశిల్పముతో ప్రాచీన మైనయితివృత్తము నకు క్రొంగ్రొత్తరూపమును ప్రసాదించి స్వతంత్రప్రతిపత్తిని చూపు కొన్నారు. అతినవ్యమును, స్వతంత్రమును నైనకథను సృష్టించి కావ్యమును రచించుశక్తి రాయలకాలపుకవులకు పుష్కలముగా నున్నను పురాణకథలనుమాత్రమే గౌరవించుకాల మది కనుక వారు కల్పనాకథలజోలికి పోలేదు. కావ్యేతివృత్తముగా ప్రాచీనకథను స్వీక రించినను ప్రబంధకవులు ప్రతిభాసంపన్నులు కనుకను, ప్రతిభయొక్క స్వభావజీవలక్షణము నవ్యతాసిసృక్ష కనుకను ప్రాతకథ యనుపునాదిపై వారు ప్రబంధ మనుమహోన్నత మైనవినూత్నసౌధమును వినిర్మింప గలిగిరి. యథార్థముగకు ప్రబంధయుగముననే చెందినపింగళిసూరనగారి కళాపూర్ణోదయమును, మాదయగారిమల్లన రచించినరాజశేఖరచరిత్ర మును స్వతంత్రకథావిలసితప్రబంధములే. కాని యానాటివిద్వాంసు లాకావ్యములను జూచి పెదవి విరచినా రని

" కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము - లాద్యసత్కథల్
వావిరి బుట్టురత్నము - లవారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు సానలఁ దీరినజాతిరత్నముల్ "

అనురామరాజభూషణునిపద్యము సాక్ష్య మిచ్చుచున్నది. కనుకనే రాయలకాలపుకవులు కల్పనావిభూషావహపూర్వవృత్తములతోనే

సంతృప్తిపడక తప్పినది కాదు. అవియే ఆనాడు సానలఁ దీరిన జాతిరత్నములుగా గణుతి కెక్కినవి. రాయలవారి కంకిత మైనపారి జాతాపహరణమును, మనుచరిత్రమును నీకోవకు చెందినజాతిరత్నములే.

# అష్టదిగ్గజములలో తిమ్మకవిప్రాముఖ్యము

కృష్ణరాయలయాస్థానమున అష్టదిగ్గజము లనుకవు లుండినట్లు కర్నాటకరాష్ట్రమునందలి కోలారుజిల్లాలోని నందిదుర్గమునందలి భోగేశ్వ రాలయమున నున్న శ్రీకృష్ణరాయల శాసనమునుబట్టి తెలియుచున్నది. కాని ఆయష్టదిగ్గజకవులపే ర్లందు లేవు. ఆయష్టదిగ్గజము లెవ రనువిష యమున విమర్శకులలో విభిన్నాభిప్రాయము లున్నను - నంది తిమ్మన తనపారిజాతాపహరణమును, అల్లసాని పెద్దన తనమనుచరిత్రమును కృష్ణరాయల కంకిత మొనర్చుటచే వా రాయనయాస్థానమున నుండి రనుట కెట్టివిప్రతిపత్తియును లేదు. రాయలనాడు జీవితరాసిక్యముతో సాహిత్యరాసిక్యమును పడుగుపేకలవలె నల్లుకొని యుండుటచే నెందఱో సరసులును విదగ్ధులు నైనకవీంద్రులు వెలసి యేటేటను విజయనగర మున జరుగువసంతోత్సవములకు వచ్చి కావ్యగాన మొనరించువారు. వెల లేనికవితలో విలువ నెఱిగినరసికాగ్రేసరు డైనకృష్ణరాయప్రభువు తత్కవితామాధుర్యమునకు నిలు వెల్ల పులకించి ఆయాకవులను సత్క రించువాడు. అట్టికవు లెందఱో యుండినను నందఱికిని రాజాస్థానమున ప్రవేశించుట సాధ్యము కాలేదు.

ఇటీవలివఱకు మైసూరు నేలినమహారాజు కొలదిమందిసంగీత విద్వాంసులకుమాత్రమే తనయాస్థానమున స్థాన మిచ్చినను నాస్థానమున లేనియితరగాయకుల నెందఱినో పోషించువాడు.

భోజు డెందఱో యితరకవులను పోషించినను, సత్కరించినను తనయాస్థానమున "నవరత్నము" లనువారికిమాత్రమే ప్రవేశ మిచ్చి

నాడు. అట్లే యితరకవుల నెందఱినో పోషించినను కృష్ణరాయ లుద్దండ పిండము లైనయష్టదిగ్గజములకే యాస్థానప్రవేశ మిచ్చినాడు. రసిక శేఖరు డైనరాయలు తిమ్మకవిని, పెద్దనగారిని నెంతగానో గౌరవించిన శ్లోకవులపద్యములే చెప్పుచున్నవి.

"కృష్ణరాయక్షితీశకరుణాసమాలబ్ధఘనచతురంతయానమహాగ్రహారసన్మానయుతుఁడ" నని తిమ్మన తనకావ్యాంతమున తెల్పుకొనగా –

"మనుచరిత్రం బందుకొను వేళఁ బురమేఁగఁ బల్లకి తన కేలఁ బట్టి యెత్తె" నని పెద్దనగారు చెప్పికొన్నాడు.

వైష్ణవు డైనకృష్ణరాయలు సహవైష్ణవు డైనపెద్దనగారిని గౌరవించుట వింత కాదు. కాని – "శివపరాధీనమతి" యైనతిమ్మకవిని చతురంతయానమహాగ్రహారము లిచ్చి సన్మానించుట రాయల కళారాసిక్యమునకు ప్రబలనిదర్శనము. పారిజాతాపహరణము వీరశృంగారవిహారభూమి యన దగినది. అటు మనుచరిత్రమును – ఇటు పారిజాతాపహరణమును శృంగారరసప్రధానప్రబంధములే యైనను పెద్దనగారు పోషించినశృంగారము వేఱు – తిమ్మకవి తీర్చి దిద్దినశృంగారరసప్రపంచము వేఱు. ఆంధ్రప్రబంధప్రపంచమున పెద్దనగారిమనుచరిత్ర మొకగంధగజేంద్ర మనుకొన్నచో – తిమ్మనగారిపారిజాతాపహరణ మాపజ్జనే తల యెత్తుకొని సగర్వముగా నిలువగలయాజానేయము. ఆయనరచన మల్లికజిగిబిగికి పేరొందగా నీయనకావ్యము ముద్దుపల్కులతో ముచ్చట గొల్పునది. మనుచరిత్రమున వస్త్వైక్యము లోపించినదని కొందఱు వ్రేలెత్తి చూపగా నట్టివిమర్శకవకాశ మీయనికావ్యాభరణము పారిజాతాపహరణము. ఆధునికవిమర్శకులు ప్రబంధవాఙ్మయలక్షణములుగా పరిగణించువస్త్వైక్యమును, నేకనాయకాశ్రయత్వమును, శృంగారప్రాధాన్యమును, వర్ణనాప్రాచుర్యమును, నాలంకారికశయ్యావైగనిగ్యమును – నిత్యాదిగుణము లేకత్ర పారిజాతాప

హారణములో రాశీభూత మైనట్లుగా మనుచరిత్రాదిప్రబంధములలో కానరావు. కావున ప్రబంధలక్షణములను సమగ్రముగా సంతరించు కొన్నయుత్తమోత్తమప్రబంధము పారిజాతాపహరణము. అర్వాచీన ప్రబంధసరణికేని - తథాపి శృంగారకావ్యములకును - ఉపరి శృంగార ప్రథాప్రధానకృష్ణకథాకావ్యములకు శృంగారరసజనకసామగ్రీసజ్జీకరణ ములో రసోచితరచనావిధానములో శైలీలాలిత్యములో చమత్కార చారుత్వములో రూపకోచితచతురసంవిధానములో తిమ్మనగారిపారి జాతాపహరణము మార్గదర్శక మైనది.

అనంత మైనకాలములో నెన్నో యగ్నిపరీక్షలకు తట్టుకొని, సుకుమారభావుకతకును సునిశితమానవమనఃపరిశీలననిపుణతకును పేరెన్నిక గన్నది పారిజాతాపహరణము. భావనామృదులతకును, కల్పనాచతురతకును, పదప్రయోగనిపుణతకును, తావల మై, తావులు విరజిమ్మి రసవత్ప్రబంధము పారిజాతాపహరణము.

> " నిరంతరరసోద్గారగర్భా సౌందర్యనిర్భరాః
> గిరః కవీనాం జీవంతి న కథామాత్ర మాశ్రితాః "

అని యాలంకారికశిరోమణి యైనకుంతకుడును, [1]

> తే॥ గీ॥ " కవిప్రతిభలోన నుండును కావ్యగతశ
> తాంశములయందుఁ దొంబదియైనపాళ్లు ;
> ప్రాగ్వివశ్చిన్మతమ్మున రసము వేయి
> రెట్లు గొప్పది నవకథాధృతిని మించి "

అని కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారును ప్రవచించిరి. [2]

కనుక కావ్యములో కథ ముఖ్యము కాదు. రసమే ముఖ్యము. కవిప్రతిభమీదనే కావ్యోత్కర్ష యాధారపడియుండును.

1. కుంతకుడు
2. విశ్వనాథసత్యనారాయణగారిరామాయణకల్పవృక్షము

" దృష్టపూర్వా అపి హ్యర్థాః
కావ్యే రసపరిగ్రహాత్
సర్వే నవ ఇవాభాంతి
మధుమాసఇవద్రుమాః "

అని తనధ్వన్యాలోకములో నానందవర్ధనుడు వక్కాణించెను.[1]

కావ్యమునందలివస్తువులు పరిచితపూర్వము లయ్యును రస పరిగ్రహమువలన వసంతకాలమునందలివృక్షములవలె సరిక్రొత్తగానే కనిపించు నని పై శ్లోకభావము.

రసవత్ప్రబంధ మైనపారిజాతాపహరణము కొన్నిశతాబ్దములక్రిందట రచింపబడినను నిత్యనూతన మైన దనుటలో నతిశయోక్తి లేదు. అతి పురాతన మైనసంస్కృతహరివంశకథ యాధారముగా రచింపబడిన కావ్యము పారిజాతాపహరణము. కథ ప్రాఁత దైనంతమాత్రమున కావ్యమున కేలోపమును రాదు.

" ఇందులో రహస్య మెచ్చట నున్న దనగా - కవి తీసికొనిన కావ్యములోనికథ, సాధింపదలచినరసము, వాని కభిముఖముగా చూపించెడిశిల్పము - వీనికి ప్రాధాన్య ముండును. ఈచేఁతలో నతడు కవితాశక్తిని జూపించెనేని ఆకావ్యము రమ్యముగా నుండును. కథ ప్రాఁత దనుప్రశ్న లేదు. కల్పన క్రొత్తదిగా నున్నచో కథకు ప్రాఁత దనము లేదు. కథలోనినామములు ప్రాఁత వైనను కల్పన క్రొత్త దైనచో కావ్యము క్రొత్తది. ఈ చిన్నికావ్యములో కథ ప్రాఁత దైనను కల్పన క్రొత్తది." అని కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు మఱియొక కావ్యమునుగూర్చి చెప్పినమాటలు[2] పారిజాతాపహరణ కావ్యమునకు పూర్తిగా వర్తించును.

1. ఆనందవర్ధునిధ్వన్యాలోకము

2. నారచించినపారిజాతసౌరభకావ్యమునకు విశ్వనాథ సత్యనారాయణగారు 16-6-1957న రచించినప్రవేశిక - పుటలు - 2, 3.

"త ఏవ పదవిన్యాసా స్త ఏవార్థవిభూతయః
తథాపి భవతి నవ్యం కావ్యం గ్రథనకౌశలాత్"

అనుసూక్తి కనుగుణముగా ననల్పశిల్పనైపుణ్యముతో నిత్యనూతనముగా నొప్పుచున్నది పారిజాతాపహరణము. ఇది యొకమధుర మైన కృతి. శిశిర మైనకృతి. సురభిళ మైనకృతి.

## 2. తిమ్మనయుదంతము

నంది తిమ్మన తనపారిజాతాపహరణకావ్యమున పంచమాశ్వాసమున 108 వపద్యమున స్వీయోదంతమును వివరించుచు

సీ॥ "కౌశికగోత్రవిఖ్యాతు డాప స్తంబ
సూత్రు డార్వేలపవిత్రకులుఁడు
నంది సింగామాత్యునకును తిమ్మాంబకుఁ
దనయుండు సకలవిద్యావివేక
చతురుఁడు మలయమారుతకవీంద్రునకు మే
నల్లుండు కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధఘనచతురంతయా
నమహాగ్రహారసన్మానయుతుఁడు

తే॥ గీ॥ తిమ్మయార్యుండు శివపరాధీనమతి య
ఘోరశివగురుశిష్యుండు పారిజాత
హరణ మనుకావ్య మొనరించె నంధ్రభాష
నాదివాకరతారాసుధాకరముగ."

ననియును,

"ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధసారసారస్వతాభినంది నంది సింగయామాత్యపుత్త్ర కౌశికగోత్రపవిత్ర సుజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతం బైనపారిజాతాపహరణం బనుమహాప్రబంధంబునందు .... ఆశ్వాసము"

అని యాశ్వాసాంతగద్యలలోను జెప్పికొన్నాడు.

దీనినిబట్టి తిమ్మకవి యారువేలనియోగిబ్రాహ్మణు డనియు, నాపస్తంబసూత్రు డనియు, "కౌశిక"గోత్రు డనియు, నంది తిమ్మాంబా సింగనలపుత్రు డనియు, ప్రబోధచంద్రోదయ, వరాహపురాణాదిగ్రంథములు రచించి ప్రసిద్ధి గన్నమలయమారుతకవికి మేనల్లు డనియు, శివభక్తు డనియు, "అఘోరశివగురు"నిశిష్యు డనియు, శ్రీకృష్ణరాయల యాస్థానకవి యై, యాప్రభువుచే చతురంతయానమహాగ్రహారసన్మానము లందినా డనియు తెలియుచున్నది.

మాదయగారిమల్లన తనరాజశేఖరచరిత్రలో "శ్రీమదఘోరశివాచార్యగురుకరుణావిశేషలబ్ధసారస్వత మాదయామాత్యపుత్త్ర ప్రణీతం బైనరాజశేఖరచరిత్రంబున ...."[1] అని యాశ్వాసాంతగద్యలలో పేర్కొనినఅఘోరశివగురువును, నంది తిమ్మనగారిగురువును నొక్కరే యని చెప్ప నొప్పును.

జంటకవు లైననంది మల్లయ, ఘంట సింగయలలో నొకడయినఘంటసింగయ మలయమారుతకవిబిరుద మందినవా డని వారు రచించినప్రబోధచంద్రోదయమువలన స్పష్ట మగుచున్నది :-

సీ॥ "కలఁడు కౌశికగోత్రకలశాంబురాశిమం
దారంబు సంగీతవంది నంది
సింగమంత్రికిఁ బుణ్యశీల పోచమ్మకు
నాత్మసంభవుఁడు మల్లయమనీషి
యతని మేనల్లుఁ డంచితభరద్వాజగో
త్రారామచైత్రోదయంబు ఘంట
నాగధీమణికిఁ బుణ్యచరిత్ర యమ్మలాం
బకుఁ గూర్మితనయుండు మలయమారు

1. మల్లనరాజశేఖరచరిత్రము.

తే॥ గీ॥ తాహ్వయుఁడు సింగనార్యుఁడు నమృతవాక్కు-
లీశ్వరారాధకులు శాంతు లిలఁ బ్రసిద్ధు
లుభయభాషల నేర్పరులు సమరులు స
మర్థు లీకృతిరాజనిర్మాణమునకు. " [1]

నంది తిమ్మనకు ముక్కు తిమ్మన యనియు నామాంతరము కలదు. "ముక్కు తిమ్మనార్యుముద్దుపలుకు" అనుట యేనాటి నుండియో ఆంధ్రసాహిత్యవీథి నొకపరిపాటిమాట యైపోయినది.

కవిచరిత్రలయందును, వాఙ్మయచరిత్రలయందును తిమ్మకవి నంది తిమ్మన యనియే వ్యవహరింపబడినను రాయలకాలమునుండియు నాతడు ముక్కు తిమ్మనగా వ్యవహృతు డయినట్లు ప్రమాణములు లభించుచున్నవి.

"రాయవాచకము" అనువచనచారిత్రకగ్రంథమున

"స్వామివారు కృతు లందుకుంటే కీర్తిప్రతాపములు శాశ్వతముగా నిలుచును కనుక తిమ్మరసయ్య ........ తెలుపగా రాయలవారున్ను సంతోషపడి ముక్కుతిమ్మయ్య అల్లసాని పెద్దయ్య మాదయ్యగారిమల్లయ్య మొదలైనకవీశ్వరులతో కృతు లందుకో వలె నని .... ప్రసంగించి.... ........ పారిజాతాపహరణమున్ను మనుచరిత్రను చెప్పమని ఆన తిచ్చినారు." * ........అని రాయవాచకమున ముక్కుతిమ్మయ్య యనుపేరే కలదు.

కృష్ణరాయనికి నూటేండ్ల వెనుక క్రీస్తుశకము 1630 సంవత్సర ప్రాంతమున రచింపబడిన "కృష్ణరాయవిజయము" న తత్కర్త యైన కుమారధూర్జటి ఇట్లు రచించెను :-

........................................................................................................

1. ప్రబోధచంద్రోదయము.

* రాయవాచకము. పుటలు : 115-116.

తే॥ గీ॥ "సరససాహిత్యరచనవిస్ఫురణ మెసఁగు
సారమధురోక్తి మాదయగారిమల్లి
నార్యుఁ డల యల్లసాని పెద్దార్యవరుఁడు
ముక్కు తిమ్మన మొదలైనముఖ్యకవులు" [1]

కృష్ణరాయలవిజయమున నిర్ధారణగా "ముక్కుతిమ్మన" యని యతిస్థానమున నుండుటచే- రాయల కాలమునుండియు తిమ్మనకు "ముక్కు తిమ్మన" యను పేరు వాడుకలో నుండినట్లు స్పష్టమగు చున్నది.

కం॥ భారతికి ముక్కు నిలిపిన
ధీరులకును దిక్కు ముక్కు తిమ్మయనూ : యం
చారసి యారసికునికృతి
సారస్యముఁ దలఁతు ధీరసారస్యముగన్."

అని పట్టమట్ట సరస్వతిసోమయాజి తనపృథుచరిత్రమున ముక్కు తిమ్మ యను బ్రశంసించినాడు. ముక్కునుగూర్చి మనోహర మైనపద్యమును రచించుటచేతనే భారతికి ముక్కు నిలిపి ముక్కు తిమ్మయగా బ్రసిద్ధి నందినాఁ డని పై పద్యమును రచించినసరస్వతిసోమయాజియభిప్రాయ మగుట సుస్పష్టమే.

ఆముక్కునుగూర్చినకథను కీర్తిశేషులు కందుకూరి వీరేశ లింగముపంతులుగారు తమ "ఆంధ్రకవులచరిత్రము" 50వపుటలో నిట్లు చెప్పి యున్నారు :-

శా॥ "నానాసూనవితానవాసనల నానందించుసారంగ మే
లా న న్నొల్లదఁటంచు గంధఫలి బల్కాకం దపం బంది యో
షానాసాకృతిఁ దాల్చి సర్వసుమనస్సౌరభ్యసంవాసి యై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు లిర్వంకలన్"

1. కృష్ణరాయవిజయము. పుట 72.

అని ముక్కును వర్ణించినయీపద్యమును తిమ్మకవి రచించినా డనియు, ఈపద్యచమత్కృతిని జూచి మెచ్చి రామరాజభూషణుడు నాలుగువేల వరా లిచ్చి కొని తనవసుచరిత్రమునందు వేసికొనె ననియు, ముక్కుమీఁదియీపద్యమును రచించుటచేతనే యీకవిని ముక్కుతిమ్మన్న యని యెల్లవారును వాడుచు వచ్చి రనియు లోకప్రవాదము కలదు. కాని, "యిదియు కవులనుగూర్చి మనవారు సాధారణముగా చెప్పుకొను కల్పనాకథలలో చేరినదే కాని నిజ మైనది కాదు. మొట్టమొదట రామరాజభూషణు డికవికాలములో లేనేలేడు. ఒకవేళ నున్నా డనుకొన్నను - వసుచరిత్రవంటిమహాప్రబంధమును రచియింపగలిగినకవిగ్రామణి యింతమాత్రపుకల్పనను నాసికావర్ణనమునుగూర్చి చేయలేకపోయె ననుట పరిహాసాస్పదము." అని వీరేశలింగముగా రనగా - ఈయైతిహ్యము "అంతవిశ్వాసపాత్రముగా లేదు." అని డాక్టరు దివాకర్ల వెంకటావధానిగారును అన్నారు. [1]

"ఈపద్యాన్ని తిమ్మనగారిదగ్గర కొనుక్కునే తనగ్రంథంలో వసుచరిత్రకారుడు పెట్టుకొన్నా డని సాహితీపరులు సరదాకు చెప్పుకొంటారు. గాని యిది సత్యానికి సగ మెఱుక." అని ఆరుద్రగారు కూడ అభిప్రాయపడిరి. [2]

ఆఁడుదానియంగప్రత్యంగవర్ణనము చేయుట వసుచరిత్రకారునిలక్షణము. ఈలక్షణము తిమ్మనగారిపారిజాతాపహరణకావ్యములో మచ్చునకైన లేదు. అట్టివర్ణనలు చేయుట తిమ్మనగారిస్వభావములోనే లేదు. కనుక "నానాసూనవితానవాసనల నానందించు...." అను పద్యము రామరాజభూషణుడు రచించినదే కాని, తిమ్మకవికృతము కా దని నిస్సందేహముగా చెప్పవచ్చును.

1. కావ్యలహరి - యువభారతిప్రచురణ - 12 సెప్టెంబరు 1971 పుట. 83

2. సమగ్రాంధ్రసాహిత్యం - ఆరుద్ర - 7వ సంపుటం - పుటలు. 143, 144

విద్యానాథాపరనామకుడును, ఓరుగంటిచక్రవర్తి రెండవ ప్రతాపరుద్రదేవునియాస్థానగీర్వాణకవియును, "ప్రతాపరుద్రీయ" మనునాలంకారికగ్రంథమును రచించినవాడును నగుఅగస్త్యమహాకవి రచించిన "నలకీర్తికౌముది" యనుసంస్కృతకావ్యమున నీక్రిందిశ్లోక మున్నది.

"భృంగానవాప్తిప్రతిపన్నఖేదా
కృత్వావనే గంధఫలీ తపఃఫలమ్
తన్నాసికా భూ దనుభూతగంధా
స్వపార్శ్వనేత్రీకృతభృంగసేవ్యా"

ఈ శ్లోకభావమును గ్రహించి రామరాజభూషణుడు "నానాసూన వితానవాసనల...." అనుపద్యమును రచించియుండవచ్చు నని చేకుమళ్ళ అచ్యుతరావుగారియభిప్రాయము. [1]

మఱి - నందివా రని యింటిపేరు గలయీకవికి ముక్కు తిమ్మన్న యనుపే రెట్లు వచ్చినదో పరిశీలింపవలయును.

"ఈకవికి ముక్కు పెద్ద దనియు, అందుచేత నెల్లవారును ముక్కు తిమ్మన్న యని పిలుచుచు వచ్చి రనియు నింకొకవాడుకకూడ గలదు. ఈతనిని ముక్కు తిమ్మన్న యని యాడుట కిదియే నిజమైన కారణము కావచ్చును." అని వీరేశలింగముగారు వ్రాసి యున్నారు.[2]

ఆయనముక్కుయొక్కయాకారమో - పరిమాణమో - లేదా- యీరెండునో- విలక్షణముగానో- వికారముగానో యుండుటచే ఆయనకు ముక్కు తిమ్మన యనుపేరు వచ్చి యుండవచ్చును.

........................................................................................

1. ఆంధ్రవాఙ్మయచరిత్రము - పుట. 208 - చేకుమళ్ళఅచ్యుతరావుగారు.

2. ఆంధ్రకవులచరిత్రము - కందుకూరివీరేశలింగముగారు.

రసజ్ఞశేఖరుడును, సాహితీసమరాంగణసార్వభౌముడును నైనకృష్ణరాయలు తనయాస్థానమున సంస్కృతాంధ్రద్రవిడకర్ణాటాది బహుభాషాకవు లెందఱినో పోషించినాడు. వారిలో కుమారవ్యాసభారతము పరిశిష్టభాగమును పూరించినకన్నడకవి తిమ్మణ్ణ యొకడు. ఈవిధముగా రాయలవారికొలువున మంత్రి తిమ్మరాజు (తిమ్మరుసుమంత్రి), కన్నడకవి యైనతిమ్మణ్ణ, పారిజాతాపహరణకర్త యైన (తెలుగుకవి) తిమ్మన్న, కవితాప్రియు డైనవాకిటికావలితిమ్మన్న యనునలుగురు వ్యక్తు లొకేపేరు గలవా రుండిరి. ఆతక్కినముగ్వురినుండి ప్రత్యేకించుటకై యీ తెలుగుకవిని "ముక్కు తిమ్మన్న" గా నానాటివారు వ్యవహరించి యుండవచ్చును.

"ఓవిడ్" అనుపేరు గలయొకయాంగ్లకవిముక్కు కొంచెము పొడవుగా నుండెడి దట - ఇతరులనుండి ఆయనను వేఱుపఱచుటకై ఆకవిని "NOSE OVID" (ముక్కు ఓవిడ్) గా నానాటివారు వ్యవహరించినట్లు తెలియుచున్నది. అదేవిధముగా ముక్కునందలి యేదోవిలక్షణత్వముచే నంది తిమ్మనగారికి ముక్కు తిమ్మన యని పేరు వచ్చి యుండవచ్చును.

ఐనను - ఈ సందర్భమున గమనింపదగినమఱొక్కముఖ్యవిషయ మున్నది :-

చింపిరిజుట్టు చిట్టెమ్మ, సొట్టకాలు సోమరాజు, బూరెబుగ్గల బుల్లెమ్మ, చీపికళ్ళ పాపాయమ్మ, మిడిగ్రుడ్ల వెంకయ్య, బొట్టముక్కు బుచ్చిరాజు, గూని గోవిందు - ఇత్యాదినామములు వ్యవహారములో నున్నను - ఏవో విశేషణములతో గూడి కాలు, ముక్కు మొదలైనయవయవములపేర్లు వ్యక్తులనామములకుముందు చేర్పబడి వ్యవహారములో నున్నవి. కాని - కేవలము కాలు సోమయాజులు, బుగ్గల బుల్లెమ్మ, ముక్కు బుచ్చిరాజు-ఈవిధముగా నిర్విశేషణము లై,

కేవలావయవవాచకశబ్దపూర్వకముగా వ్యవహారము తెనుగునాట లేదు. అందుచే ముక్కు తిమ్మన్న యనునామ మెట్లేర్పడినదో అంతుపట్టుట లేదు.

ఏకవితాగోష్ఠిలోనో ముక్కునుగూర్చి సుప్రసిద్ధ మైనపద్య మును (నానాసూనవితానవాసనల - అనుపద్యము కాక నుఱొకపద్య మును) చెప్పి యుండుటచే నీకవికి ముక్కు తిమ్మన్న యనుపేరు కలిగి యుండవచ్చు నన్న డాక్టర్ పి. యశోదారెడ్డిగారియూహ సమంజసము గానే యున్నది.

నస్యమలవా లైన కొందఱివలె తిమ్మకవి యనునాసికధ్వను లెక్కువగా నుండునట్లు మాటాడుటచే ఆయన నానాటివారు "ముక్కు మాటలతిమ్మన్న" యని వ్యవహరించి యుందు రనియు, ఆ తరువాత ఆపేరే సూక్ష్మముగా "ముక్కు తిమ్మన్న" అయి యుండునేమో యనియు తాపీ ధర్మారావుగా రూహించిరి.

ఇవన్నియు నూహాజనితము లైనయుపపత్తులే. నంది తిమ్మన గారికి ముక్కు తిమ్మన యనుపే రెట్లు వచ్చినదో చెప్పుట కూహయే శరణ్యము కనుక మఱొక్క క్రొంగ్రొత్తయూహమునకుకూడ నవకాశము లేకపోలేదు :-

తెలుగుభాషలో "ముక్కుట," "మూల్గుట" యనెడి ధాతువు లున్నవి. "ముక్కునటువంటి" అనగా - శ్వాసమును బిగపట్టు నట్టి - అనుధాతుజవిశేషణముతరువాత తిమ్మనపేరు చేర్చినచో "ముక్కు తిమ్మన" యగునుగదా! మాటిమాటికిని ముక్కుచుండెడునలవా టున్నవా డగుటచే ఈకవికి "ముక్కు తిమ్మన" యనుపేరు వచ్చి యుండు నని- యొకక్రొత్తయూహను వెనుకటియూహలకు జోడింప వచ్చునేమో యని నామనవి.

తాపీ ధర్మారావుగారు పారిజాతాపహరణమునకు రచించిన తమపీఠికలో చెప్పినట్లుగా– ఈ "ముక్కు" గేలి చేయుటకు పెట్టిన పేరు కాదు. సదుద్దేశముతో సకారణముగా పెట్టినదే. కనుకనే ఆక్షేపణ చెప్పక అందఱు నంగీకరించినారు.

ఇవి కాక మఱొక్క విలక్షణమైన యూహాముకూడ నున్నది: పారిజాతప్రసూనపరిమళములను తిమ్మనకవిగారి నాసిక యాఘ్రాణించినంతగా నానాటికవులు మఱెవ్వరును నాఘ్రాణించినవారు కారను నుద్దేశముతో సమకాలీనసాహిత్యరసికు లాయనను ముక్కు తిమ్మనగా వ్యవహరించియుండవచ్చు నన్నయీనాటిసాహిత్యరసికులయూహకూడ సమంజసముగనే యున్నది.

కృష్ణరాయలతండ్రి నరసనాయకునికి వరాహపురాణము నంకితము చేసినజంటకవులలో నొక డైనఘంటసింగయ నంది తిమ్మనకు మేనమామ కనుక బాల్యమునుండియు రాయలవారికి తిమ్మకవితో స్నేహముండి యుండవచ్చు నని పరిశోధకులు భావించుచున్నా రని శ్రీ ఎం.వి.యల్.నరసింహారావుగా రనుచున్నారు.[1]

శ్రీకృష్ణరాయలు గయలో వేయించినశాసనమును తిమ్మకవియే రచించినాడు. ఈశాసనమునుగూర్చి తొలిసారిగా శ్రీ కె. వి. హెచ్. శర్మగారిచే ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక 47వసంపుటి 2–3 సంచికలలో ప్రచురింపబడినది.[2] పారిజాతాపహరణమునందలి ద్వితీయాశ్వాసములోని 105వసంఖ్య కల

1. కావ్యపరిచయాలు - పారిజాతాపహరణం - శ్రీ ఎం. వి. యల్. నరసింహారావు సంపాదకీయము తొలిపుటలు.

2. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక - సంపుటి 47 - సంచికలు 2-3.

కం॥ " తిరుమలదేవీవల్లభ ।
కరుణామయహృదయ । రాజకంఠీరవ । ఈ
శ్వరనరసభూపురందర
వరనందన । బాసదప్పవరగండాంకా । "

అనుపద్య మీగయశాసనములో నున్నది. దీనినిబట్టి తిమ్మకవి కృష్ణ రాయలవారిశాసనములు రచించువిద్యాధికారిపదవిలో నుండిన ట్లూహించుట కవకాశ మున్నది.

తిమ్మకవి పారిజాతాపహరణమునుమాత్రమే కాక "వాణీ విలాస" మనుమఱియొక కావ్యమునుకూడ రచించినట్లు తెలియు చున్నది.[1] ఆకావ్య మిప్పుడు లభింపకపోవుట తెనుగుజాతిదురదృష్టము.

## తిమ్మకవినిగూర్చి ప్రచారములో నున్నకథలు

తిమ్మకవి మహాదాత యని చెప్పుకథ యొకటి చిరకాలముగా ప్రచారములో నున్నది. కృష్ణరాయలకు తిమ్మకవి తనపారిజాతాప హరణకావ్యము నంకితము చేసినప్పుడు ఆప్రభువు చతురంతయానమహా గ్రహారములును, మణికుండలములును తిమ్మకవికి బహూకరించినా డట. సుందరము లైనయీసువర్ణకుండలములు ధరించి తిమ్మకవి వెళ్లు చుండగా నొకబట్టుకవి చూచి

కం॥ మాకొలఁదిజానపదులకు
నీకవనపుతీవి యబ్బునే కూపనటత్
భేకములకు గగనధునీ
శీకరములచెమ్మ నంది సింగయతిమ్మా । "

1. కూచిమంచివెంకటరాయకవి రచించిన కవిమనోరంజని యను అప్పకవీయవిమర్శ.

అని తిమ్మకవికవితానైపుణిని స్తుతించినాఁడట. అంతట తిమ్మకవి సంతసించి, అప్పటికప్పుడు తనయొద్ద మఱియొకయమూల్యవస్తువు లేక పోవుటచే తనచెవి నున్నసువర్ణకుండలము నొకదానిని తీసి, యాబట్టు కవికి కానుకగా నొసగి ఆ మరునాడు రాయలవారియాస్థానమున కొంటి కుండలముతోనే పోగా నచ్చటి కాభట్టుకూడ వెళ్లినాఁడట. ప్రసంగ వశమున నావిషయ మంతయు నెఱిగినరాయలు భట్టుమూర్తి చెప్పిన పద్యమును విని

కం॥ "మాకొలఁదిజానపదులకు
నీకవనపుఠీవి యబ్బునే కూపనటత్
భేకములకు నాకధునీ
శీకరములచెమ్మ నందిసింగయతిమ్మా!"

అని భట్టుపద్యములోని "గగన" యనుదానిని "నాక" యని యుండినచో పద్యము మఱింతసరసముగా నుండు నని రాయలవారు సెల విచ్చినారట! తనపద్యమునకు రాయలవారు వన్నె తెచ్చినా రని బట్టుకవియు, రాయలవారి కవితారాసిక్యమునకు తిమ్మకవియు సంతోషించి తమదగ్గరనున్న యొకొక్కకుండలమును ప్రభువునకు కాను కగా సమర్పింపగా వారియౌదార్యమునకు మనసులో పొంగిపోయిన ప్రభువు వారిద్దరికిని సముచితబహుమానము లందజేసె నట! ఈకథ కల్పితమే కావచ్చును. కాని, తిమ్మనకు ముద్దుగా కవిత నల్లునైపు ణ్యమే కాక యితరులకవితను మెచ్చుకొనుసహృదయతకూడ కల దనియు, నతడు మహోదాత యనియు స్పష్టము చేయుచున్నది. †

తిమ్మన రాయలవారియాస్థానమునకు రాణివాసమువారియర ణపుకవిగా వచ్చె నని యొకవదంతి చిరకాలముగా నున్నది. కీర్తిశే

† ఆంధ్రకవులచరిత్రము - వీరేశలింగంగారు - పుటలు 55,56.

షులు గురజాడ శ్రీరామమూర్తిప్రభృతులు ఆవిషయమును [1] గ్రంథస్థముకూడ చేసిరి. " ఈముక్కుతిమ్మన అరణపుకవి యని చెప్పుదురు. " అని విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాకుచ్చిరి. [2]

" ఈతనినిఁ గృష్ణదేవరాయనిభార్య తనపుట్టినింటియరణపుఁ గవిగాఁ దెచ్చె నని చెప్పుదురు గాని- యది పుక్కిటిపురాణమే " యని కందుకూరి వీరేశలింగముగారు తమ " ఆంధ్రకవులచరిత్రము " లో వ్రాసిరి. [3]

" అతఁడు చిన్నాదేవితోడనో తిరుమలదేవితోడనో అరణముగా వచ్చినకవి యని లోకమునఁ బ్రతీతి కలదు. చిన్నాదేవి వేశ్య యగుటచేతను, తిరుమలదేవి కర్ణాటకు డైనమైసూరురాజుతనయ యగుటచేతను అతఁడు వారిరువురిలో నెవరితోఁ గానియరణపుకవిగా వచ్చె నని తలంచుట కవకాశము లేదు " అని చాగంటి శేషయ్యగారు చెప్పి యున్నారు. [4]

" అరణపుకవి కాకపోయినను వా రాతని నెక్కువగా గౌరవభావముతో చూచుచుండి రని తలంపవచ్చును " అని డాక్టర్ దివాకర్ల వెంకటావధానిగారు కావ్యలహరి 82వపుటలో వ్రాసి యున్నారు.

" తిమ్మనగారు అమ్మ తెచ్చినవిద్వాంసులు కాకపోయినా అమ్మ మెచ్చినసత్కవులు కాకపోరు " అని ఆరుద్రగారు వ్రాసిరి. [5]

1. గురజాడవారికవిజీవితములు - పుట 178.
2. పారిజాతాపహరణము (ఎమెస్కో-ప్రచురణ. విశ్వనాథకవివారిపీఠిక)
3. ఆంధ్రకవులచరిత్రము - పుట 52.
4. ఆంధ్రకవితరంగిణి - చాగంటి శేషయ్యగారు.
5. ఆరుద్రగారి సమగ్రాంధ్రసాహిత్యం - పుట 146

తెలుగునాట చిరకాలమునుండి బహుళప్రచారములో నొక జనశ్రుతి యున్నది.[1]

ఒకనాడు ముక్కుతిమ్మనగారు తనయింట తూగుటుయ్యాలలో నూగుచుండగా నచటికి కొంటెకోణంగి యైన తెనాలిరామకృష్ణుడరుదెంచి "తాతా! ఊఁకునా?" అనగా - "అట్లే కానిమ్ము మనుమడా!" అన్నారట తిమ్మనతాతగారు. ఆయన యట్లనుటయే తడవుగా - దుడుకుచేష్టలకుఁ బేరొందినరామకృష్ణుడు కాండ్రించి ముక్కుతిమ్మనగారి మోముపై నుమిసె ననియు, నంతట తీవ్రకోపముచే తిమ్మనతాత రామకృష్ణునినోటిపై తన కాలితో తన్నగా రామకృష్ణునిపన్నొకటి యూడిపోయె ననియు, నామరునాడు రామకృష్ణుడొక కృత్రిమదంతమును దగిలించుకొని రాయలవారియాస్థానమునకు రాగా, రామకృష్ణునిగుట్టు బట్టబయలు చేయుటకై ధూర్జటికవి యీక్రిందిపద్యమును జెప్పె ననియు జనశ్రుతి :-

ఉ॥ " ఆరవి వీరభద్రచరణాహతి డుల్లినబోసినోటికిన్
నేరఁడు - రామలింగకవి నేరిచెఁబో - అలముక్కుతిమ్మరాట్
క్రూరపదాహతిన్ బడినకొక్కిరిపంటికి దుప్పికొమ్ము పల్
గా రచియించె నౌర! రవి కాననిచోఁ గవి కాంచునేకదా!"

పై జనశ్రుతి కాధారముగా నున్నయీచాటుపద్యము నమ్మదగినదిగా లేదు. ఊడిపోయినదంతమునకు బదులుగా కృత్రిమదంతము నతికించు పద్ధతి యమలులో నున్నకాలమున నీపద్యము పుట్టుటమాత్రము యథార్థము.

తిమ్మకవితో సంబంధ మున్నట్లు చెప్పబడుచున్న మఱియొక కథ ఈక్రిందివిధముగా నున్నది :-

1. వేటూరివారి చాటుపద్యమణిమంజరి — ప్రథమభాగము పుటలు 155-156.

కృష్ణరాయలయాస్థానమున కొంతకాల మొకబట్టుపలుకుబడి ప్రబలముగా నుండుటచే నత డితరకవులను లక్ష్యము చేయక యవమానించుచుండగా నొకనాడు పెద్దనాదికవు లందఱును తిమ్మకవివాకిట కూరుచుండి యాలోచించుచుండగా నామార్గమున నవు డేగుచుండిన బట్టు వారందఱికిని వినబడునట్లుగా తనభటు డైనమాధవు డనువానితో

కం॥ " వాకిటికావలితిమ్మని
వాకిటికవికోటి మాధవా ! కిటికోఁచే "

అని పరిహసించుచు పద్యములో సగము భాగమును చెప్పునంతలో నది విని కుపితు డైనయాంధ్రకవితాపితామహు డైనఅల్లసాని పెద్దన్నగారు కలుగఁ జేసికొని

కం॥ " ప్రాకృతసంస్కృతఘుర్ఘర
మూకీకృతకుకవితుంగముస్తాతతికిన్
వాకిటికావలి తిమ్మన
వాకిటికవికోటి మధవా ! కిటికోఁచే "

అని ఆపద్యమును పూరింపగా బట్టుకవి సిగ్గుపడి తల వంచుకొని పోయె ననియు నొకకథ ప్రచారములో నున్నది. వాకిటికావలితిమ్మన నంది తిమ్మన కా డనియు - నతడు ప్రభువుదగ్గర సేనానాయకుడై దుర్గరక్షణము చేయుమఱియొకతిమ్మన యనియు, అత డొకనాడు రాజభవనము వాకిట రాజుగా రిచ్చినయమూల్యవస్త్రమును గప్పుకొని కావలి కాయుచుండగా రాజును దర్శించుటకై యచటికి పెద్దనగారును, తిమ్మకవియు, బట్టుమూర్తియు, తెనాలిరామకృష్ణుడును వచ్చి రనియు, వారిలో పెద్దనగారు తొలుదొల్త

కం॥ " వాకిటికావలితిమ్మా ! "

అని కందపద్యములోని మొదటిపాదమును చెప్పి లోనికి పోయె ననియు, నాపిమ్మట నంది తిమ్మనగా రందుకొని

"ప్రాకటముగ సుకవివరులపాలిటిసొమ్మా !"

అని రెండవపాదమును జెప్పి లోని కేగె ననియు, నాతరువాత బట్టుమూర్తి వానిని జూచి

"నీ కిదె పద్యము గొమ్మా"

అని మూడవపాదమును బూర్తి చేసి వెళ్లె ననియు, నపుడు చిట్టచివరకు మిగిలిన తెనాలిరామకృష్ణుడు తనవికటకవిత్వధోరణిలో

"నా కీపచ్చడమె చాలు నయముగ నిమ్మా"

అని పద్యమును పూర్తి చేయగా నతడు వెంటనే తనపచ్చడమును రామకృష్ణకవిమీఁద వైచె ననియు, ప్రభు వావిషయము నెఱిగి యాతనియౌదార్యమును ప్రశంసించి వెల లేనిబహుమాన మొసగె ననియు చిరకాలముగా నుండినకథ. తిమ్మనగారు కవిగా వెలుగొందిన కాలమున తెనాలిరామకృష్ణుడు పసివాడుగా నుండె నని పరిశోధకులు భావించుటచే నీకథ నమ్మదగినదిగా లేదు. కాని – ఈ కథ వీరేశలింగముగారిఆంధ్రకవులచరిత్రము 56-57 పుటలలో చెప్పబడినది.

విద్యావినోదియగుకృష్ణరాయ లొకనాడు తనయాస్థానకవుల నొక్కకరినే వేఱువేఱువిషయములపై పద్యములు చెప్పు డని కోరుచు – తామరాకుమీఁదినీటిబొట్టును దిరస్కరించుచునొకపద్యమును జెప్పు మని యడుగగా తిమ్మకవి యీక్రిందిపద్యమును జెప్పినాఁ డట :–

ఉ॥ "స్థానవిశేషమాత్రమునఁ దామరపాకున నీటిబొట్టు ! నిన్
నూనిక మౌక్తికం బనుచుఁ బోల్చినమాత్రన యింతగర్వమా ?
మానవతీశిరోమణులమాలికలందునఁ గూర్ప వత్తువో ?
కానుక లీయ వత్తువా ? వికాసముఁ దెత్తువా ? విల్వఁ దెత్తువో ?"

తిమ్మకవిగారిరచనావైయాత్యమును, నూహాలాలిత్యమును నీపద్యమునం దుట్టిపడుచున్నవి. ఈ పద్యము వీరేశలింగముగారిఆంధ్రకవులచరిత్రము

57 వ పుటలోను, వేటూరివారిచాటుపద్యమణిమంజరిలోను నుదాహరింపబడినది. [1]

కాకమాను మూర్తికవి రచించిన "పాంచాలీ పరిణయము" లో

ఆ॥ వె॥ "అల్లసానివారియల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకు
పాండురంగవిభునిపదగుంభనంబును
కాకమానురాయ ! నీక తగుర"

అని కృతిభర్త కృతికర్తతో నన్నట్లుగా నున్నది. దీనినిబట్టి "ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకు" అనుట తెలుగునాట పరిపాటి యైనట్లు స్పష్టమగును.

ముక్కుతిమ్మనకాలమునకు తరువాత ప్రసిద్ధుడైనకొంటెకోణంగి యైన తెనాలిరామకృష్ణుడు ఆనాటికే సుప్రసిద్ధులైనకవుల రచనాపద్ధతులను విమర్శించుచు

"అల్లసానివార లల్లనల్లన నేడ్చె
ముక్కుతిమ్మ దేడ్చె ముద్దుగాను
భట్టుమూర్తిగారు బావురు మన్నారు
రమ్యవాక్యలింగ ! రామలింగ !"

అన్నాడని యొకవదంతి చిరకాలముగా నున్నది. తిమ్మనగారికవితారీతి అది - యని తెనాలిరామకృష్ణునియభిప్రాయము.

ఉ॥ "ఈసునఁ బుట్టి డెందమున హెచ్చినశోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖ మైనమోముపయిఁ జేలచెఱం గిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్."

1. వేటూరివారి చాటుపద్యమణిమంజరి — ప్రథమభాగము - 154-155 పుటలు

అని తిమ్మనగారు పారిజాతాపహరణమున సత్యభామయేడుపును వర్ణించు సందర్భమున రచించినపద్యమును దృష్టిలో నుంచుకొనియే తెనాలిరామ కృష్ణుఁ డ ట్లన్నాఁ డని వదంతి.

చ॥ "కొనరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చినభంగి నేడ్చె న
బ్జసరుహనేత్ర కొండవటిఁ బెద్దయెలుంగున వెక్కి వెక్కి వె
క్కస మగుమన్యువేగమునఁ గాటుకకన్నులనీరు సోన లై
యుసిరికకాయలంతలు పయోధరముల్ దిగజారునట్లుగన్."

అని కాశీఖండమున పంచమాశ్వాసములో శ్రీనాథుడు రచించిన (167వ సంఖ్యకల) పద్యము "ఈసునఁబుట్టిడెందమున...." అను తిమ్మనగారి పద్యమునకు ప్రచోదక మై యుండవచ్చును.

పారిజాతమును వర్ణించినపద్యము లాయాగ్రంథములలో నీక్రిందివిధముగా నున్నవి :

కం॥ "ఏతరువు సురాభ్యర్చిత
మేతరువు కరం బభీష్ట మింద్రాణికి వి
ఖ్యాతం బేతరువు నిజవి
భూతికి భువనంబులం బ్రభూతస్థితులన్" *

కం॥ ఏతరువుసమీపమునకు
నేతేరఁగ నాశణంబ యెంతయు నరు డై
జాతిస్మరత్వ మగు నే
జాతికినే నట్టిపారిజాతముఁ గనియెన్."
(ఉత్తరహరివంశము – 4వయాశ్వాసము)

మ॥ "హరికేలం బెకలించి తెచ్చి భుజగేంద్రారాతిపైఁ బెట్టె సుం
దరగంధానుగతభ్రమద్భ్రమరనాదవ్రాతముం బల్లవాం

* నాచన సోముని ఉత్తరహరివంశము – 4వయాశ్వాసము.

తురశాఖాఫలపర్ణపుష్పకలికాగుచ్ఛాదికోపేతమున్
గిరిభిత్త్రాతము( బారిజాతము( ద్రిలోకీయాచకాఖ్యాతమున్ " *

నాచనసోముఁడును, పోతనగారును పారిజాతమును బైవిధముగా వర్ణింపగా తిమ్మనకవి తనపారిజాతాపహరణమున పారిజాతము నీక్రిందివిధముగా వర్ణించెను :-

కం॥ " పరిమళము చెడదు వాడదు
పరువము తప్పదు పరాగభరభరితం బై
నిరతము జగదేకమనో
హర మగు నీకుసుమరాజ మంబుజవదనా !

మ॥ అలినీలాలక ! నీవు నీపతి రహస్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు( గల్పించును
జ్జ్వలదీపాంకుర మై రతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబుల్ తొలఁగింపఁగా సురటి యై రంజిల్లు నిచ్ఛాగతిన్.

చ॥ అడిగినయంతలోన సరసాన్నములన్ సమకూర్చు నాఁకటన్
బడలికఁ జెందనీక యశుభంబు లడంచు జగత్త్రయంబునన్
బడయఁగరానిదివ్యసుమభవ్యమును మ్మిది - దీనిఁ దాల్చి యి
ప్పడఁతులలోఁ గనుంగొను మపారమహామహిమానుభావముల్.

చ॥ కువలయపత్రనేత్ర నెఱిగొప్పున నీకుసుమంబుఁ దాల్చుటన్
సవతులు వచ్చి నీచరణసారసయుగ్మము నాశ్రయింపగా
ధవుఁ డల లేనికూర్మి జవదాఁటక నీపలు కాదరింపఁగా
నవిరళభోగభాగ్యమహిమాన్విత వై విహరింతుగావుతన్.

కం॥ నెలకొని వేసవిఁ జలువయుఁ
జలివేళల నుష్ణగుణము సముచితభంగిన్
గలిగించు నీలతాంతము
కొలఁదులు సెప్పంగ నిచ్ఛక్రొత్తలుసుమ్మీ ! "

* పోతనగారిభాగవతము – 10వస్కంధము - 216వపద్యము.

పై నుదాహరింపబడినయుత్తరహరివంశ, భాగవతపద్యముల నీతిమ్మనగారి పారిజాతవర్ణనపద్యములు మించి యున్న వని వర్ణనరత్నాకరమున * చెప్పబడి యున్నది.

ఉ॥ రాయలరాణివాసమున రాకలు పోకలు రాయబారముల్
సేయఁగఁ బోవ నొక్కమహిషీనవమాలికనుండి రాలి చాం
పేయమధూళి నీకలము వెన్టైడుబ్రేళుల నంటి కావ్యమున్
వ్రాయుచు నున్నవేళ రసపాత్రముఁ దాల్చె నఁటోయి తిమ్మనా ! ”

అని డాక్టర్ యస్వీజోగారావుగారు తిమ్మనగారికావ్యకళావైశిష్ట్యమును ప్రశంసించిరి. (చూ. పంచకళ్యాణి)

సీ॥ “ తెనుఁగు బాసం గలతీయందనం బెల్లఁ
దనగంటమున నిల్పుకొనినజాణ
ప్రకృతిసౌందర్యసర్వస్వమ్ము పరితల
కన్నులముం దుంచుగారడీఁడు
కలకంఠకులవధూకాకలీధ్వని నేడ్పు
వాటమ్ము చవి చూపువన్నెలాఁడు
విడినసంసారమ్ము ముడి పెట్టునందాఁకఁ
గునుకు పట్టనిజాలిగుండెవాఁడు

ఆ॥ వె॥ ఆలివంకనుండి యరణమ్ముగా వచ్చి
రాజుగారికొలు వలంకరించి
పలుకుఁజెలికి ముద్దుపలుకులు నేర్పుచు
న్నాఁడు నంది తిమ్మనార్యుఁ డదిగొ ! ”

అని పారిజాతసౌరభకర్త తిమ్మకవికి కవితానీరాజన మర్పించినాఁడు. †

* వర్ణనరత్నాకరము — 328, 329 పుటలు.
పంచకల్యాణి — ఆచార్య యస్వీజోగారావుగారు
† పారిజాతసౌరభము — పద్యకావ్యము - 77వ పుట.
రచన : వక్కలంక లక్ష్మీపతిరావు.

# పారిజాతాపహరణకృతిసమర్పణకాలము

శ్రీకృష్ణదేవరాయలు క్రీస్తుశకము 1509వసంవత్సరము నుండి క్రీస్తుశకము 1530వసంవత్సరములో మరణించువఱకు విజయనగర రాజ్యము నేలినట్లు చరిత్రకారు లందఱు నంగీకరించినవిషయమే.

నంది తిమ్మన తనపారిజాతాపహరణమున మొదటియాశ్వాసమునందలియిరువదిమూడవపద్యములో కృష్ణరాయలవిజయములను వర్ణించుచు నీక్రిందిపద్యమును రచించెను :-

సీ॥ "ఉదయాద్రి వేగ నత్యుద్ధతి సాధించె
వినుకొండ మాటమాత్రన హరించెఁ
గూటముల్ సెదరంగఁ గొండవీఁ డగలించె
బెల్లముకొండ యచ్చెల్లఁ జెఱిచె
దేవరకొండయుద్వృత్తి భంగము సేసె
జల్లిపల్లె సమగ్రశక్తి డులిచెఁ
గినుక మీర ననంతగిరిఁ గ్రిందుపడఁ జేసె
గంబంబుమెట్టుఁ గ్రక్కున నదల్చె

తే॥ గీ॥ బలనికాయము కాలిమట్టులనె యడఁచుఁ
గటకమును నింక ననుచు నుత్కలమహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు ?"

పైన చెప్పినకంబముమెట్టు తెలంగాణములోని దగుటచేతను, రాయలవారు తనతూర్పుదండయాత్రలలో మూడవఘట్టమునందు క్రీస్తుశకము 1516వసంవత్సరములో తెలంగాణమును గైవసమొనర్చుకొనుటచేతను, క్రీస్తుశకము 1519వసంవత్సరారంభము రాయలవారికళింగదిగ్విజయము నందలిచరమఘట్టపుకాల మగుటచేతను తిమ్మనగారు తనపారిజాతాపహరణకావ్యమును రాయలతెలంగాణావిజయమైన 1516 వసంవత్సర

ప్రాంతముననే రాయల కంకితము చేసి యుండును. ఆరుద్రగారియూహా కూడ నిదియే.[1]

" రాయలవారికళింగవిజయము 1519వసంవత్సరము ఆగష్టు నెలలో పూర్తి యైనది. ఆవిజయమును తిమ్మన పారిజాతాపహరణమున పూర్తిగా వర్ణింపనికారణమున నతడు 1519వసంవత్సరమునకు పూర్వమే ఆకావ్యమును రచించి యుండు నని విమర్శకు లభిప్రాయపడుచున్నారు. దీనినిబట్టి మనుచరిత్రకంటె నిదియే ముందు రచింపబడి యున్నట్లు తోఁచుచున్నది." అని డాక్టర్ దివాకర్ల వెంకటావధానిగారియభిప్రాయము.[2] ఈఅభిప్రాయముకూడ క్రీస్తుశకము 1516వసంవత్సర ప్రాంతమున రాయలకు నంది తిమ్మన తనపారిజాతాపహరణము నంకితము చేసియుండు నన్నయూహాను బలపఱచుచున్నది.

పారిజాతాపహరణమునందలిపంచమాశ్వాసములోని108వ పద్యమున "కృష్ణరాయక్షితీశకరుణాసమాలబ్ధఘనచతురంతయానమహాగ్రహారసన్మానయుతుఁడు తిమ్మయార్యుండు" అని తనచరిత్రను చెప్పికొనుటనుబట్టి తిమ్మకవి పారిజాతాపహరణకావ్యమును కృతి యిచ్చుటకుముందే రాయలవారు తిమ్మకవికిఁ బల్యంకికలును నగ్రహారములును నిచ్చి సన్మానించినట్లు స్పష్ట మగుచున్నది.

మధ్యయుగమునందలిప్రసిద్ధకవులు, వారి కాలము, వారి గ్రంథములు నొకపట్టికగా నిచ్చుచు శ్రీకృష్ణదేవరాయలు క్రీస్తుశకము 1510వసంవత్సరమునుండి 1530వసంవత్సరమువఱకును రాజ్యము చేసెననియు నంది తిమ్మనక్రీస్తుశకము 1510వసంవత్సరమునుండి 1526వ సంవత్సరమువఱకు రాయలయాస్థానమున నుండినట్లును కాశీనాథుని

1. సమగ్రాంధ్రసాహిత్యం — 7వసంపుటము - పుట.103

2. కావ్యలహరి — యువభారతిప్రచురణ : 6. సెప్టెంబరు 12,1971సం. పుట-82.

నాగేశ్వరరావుగారు తమ "ఆంధ్ర వాఙ్మయ చరిత్ర"లో వ్రాసి యున్నారు. [1] ఈకాలనిర్ణయ మించుమించుగా చరిత్రకారు లెల్లరు నంగీకరించినదే. మఱి యీపదునేడేండ్లలో నంది తిమ్మన తనకావ్యము నెప్పుడు రచించి యుండునో పరిశీలింతము :

పారిజాతాపహరణరచనాకాలమునుగూర్చి విమర్శకులలో విభిన్నాభిప్రాయము లున్నవి.

మనుచరిత్రమును, పారిజాతాపహరణమును ననునీరెండు కావ్యములును నించుమించుగా నొకేకాలమున - అనగా - క్రీస్తుశకము 1520వసంవత్సరప్రాంతమున రచింపబడి యుండు నని కందుకూరి వీరేశలింగముగారిసిద్ధాంతము. మనుచరిత్రమే తెనుగున వెలసినప్రథమప్రబంధమనియు, దాని నొజ్జబంతిగా నిడుకొనియే పారిజాతాపహరణాదిప్రబంధముల నాయాకవులు రచించిరనియు కొందఱువిమర్శకులయభిప్రాయము.

"పారిజాతాపహరణము క్రీస్తుశకము1516వసంవత్సరమునకుఁ బూర్వమే రచింపబడి తదనంతరము మనుచరిత్రతోబాటు రాయలకుఁ గృతిసమర్పణము గావింపబడి యుండవచ్చును" అని ఓేకుమళ్ళ అచ్యుతరావుగారియభిప్రాయము. [2]

"ప్రబంధములలో మనుచరిత్రము, పారిజాతాపహరణమును రాయలకళింగవిజయానంతరమే కృతి సమర్పింపఁబడినవిగాఁ గానవచ్చుచున్నవి. అయ్యును పారిజాతాపహరణము క్రీస్తుశకము 1516నకు

1. కాశీనాథునినాగేశ్వరరావుగారిఆంధ్రవాఙ్మయచరిత్ర — 95వపుట తరువాత నిచ్చిన మధ్యయుగమునందలిప్రసిద్ధకవులు - వారిగ్రంథములు - అనుపట్టిక.

2. ఓేకుమళ్ళఅచ్యుతరావుగారు — విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము - పుటలు 212,213.

ముందు వ్రాయబడిన దని తలంపవచ్చును " అని " ఆంధ్రకవిసప్తతి "లో వ్యక్తము గావింపబడినది. [1]

ఆంధ్రకవిసప్తతి ననుసరించి కుందూరి ఈశ్వరదత్తుగారు పారిజాతాపహరణప్రబంధమునందు కానవచ్చుచారిత్రకాంశములను బరిశీలించి యీప్రబంధము ఆముక్తమాల్యద, మనుచరిత్రలకంటె ముందుగనే వ్రాయబడి కృష్ణరాయని కంకితము చేయబడిన దని నిర్ణయించినారు. [2]

ఈవాదములలోనియౌచిత్యానౌచిత్యములను బరామర్శింతము.

నంది తిమ్మనగారు రచించినపారిజాతాపహరణమును, అల్లసాని పెద్దనగారు రచించినమనుచరిత్రమును కృష్ణదేవరాయలకే యంకితము చేయబడినవి. ఈరెండుకావ్యములలోను కృష్ణరాయలవిజయయాత్రలు పేర్కొనబడినవి. అయినను మనుచరిత్రలో చెప్పబడినన్ని విజయములు పారిజాతాపహరణమున చెప్పబడలేదు. ఉదాహరణమునకు

" బలనికాయము కాలిపట్టుల నడంచఁ
గటకమును నింక ననుచు నుత్కలమహీశుఁ
డనుదినమ్మును వెఱచు " (1ఆ - 23ప)

నని తిమ్మకవి రచించుటచే పారిజాతాపహరణకావ్యము నాకవి రచించునాటికి రాయలు కటకముపై దండెత్తు నని యుత్కళరాజు భయపడుచుండెనేకాని – అప్పటి కింకను కటకమును కృష్ణరాయలు పట్టుకొనలేదని తెలియుచున్నది..

కృష్ణరాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని " కటకమును గాల్చె గజరాజు కలఁగి పఱవ " నని పెద్దనగారు మనుచరిత్రపీఠికలో 37వపద్యములో చెప్పుటచే మనుచరిత్ర రచింపబడునాటికి కటకమును

1. ఆంధ్రకవిసప్తతి – పుట 86.

2. కుందూరి ఈశ్వరదత్తుగారు – భారతి - 1925 జూలై నెల.

శ్రీకృష్ణరాయలు నిర్ధూమధామ మొనరించె నని తెల్ల మగుచున్నది. కనుక మనుచరిత్రముకన్నముందే పారిజాతాపహరణకావ్యము రచింప బడిన దనుట నిర్వివాదాంశము. ఈవిషయమును నిరూపించుటకు సాహిత్యపర మైనమఱియొకయాధారముకూడ కలదు. కృష్ణ దేవ రాయలు తనపూర్వదిగ్విజయయాత్రకు శాశ్వతచిహ్నముగా క్రీస్తు శకము 1516వసంవత్సరములో సింహాచలముసమీపమున నున్నపొట్టు నూరిదగ్గర విజయ స్తంభమును నాటించినా డని తనమనుచరిత్రయవ తారికలో పెద్దనగా రీక్రిందిపద్యమును రచించినారు :-

చం॥ ''అభిరతిఁ గృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్టునూరికడ నిల్పినకంబము సింహభూధర
ప్రభుతిరునాళ్ళకున్ దిగుసురప్రకరంబు కళింగమేదినీ
విభునపకీర్తికజ్జలము వేమఱు పెట్టి పఠించు నిచ్చలున్''

(మనుచరిత్రము - 1ఆ - 36ప)

"పొట్టునూరివిజయ స్తంభోపలోట్టంకితాంక .... కృష్ణరాయ"

అని ఆముక్తమాల్యదలోకూడ ఆవిషయము చెప్పబడినది.

మనుచరిత్రములోను, ఆముక్తమాల్యదలోను నుండినయీ పొట్నూరిప్రశంస పారిజాతాపహరణములో లేకపోవుటచే పారిజాతాప హరణము మనుచరిత్రకంటెను ఆముక్తమాల్యదకంటెను ముందే రచింప బడిన దని నిస్సందేహముగా చెప్పవచ్చును.

తిమ్మకవి యెన్నడో ముందుగనే పారిజాతాపహరణమును రచించి పిమ్మట మనుచరిత్రతో బాటే రాయలవారి కంకితము చేసి యుండినచో - ఆకృతిసమర్పణకాలమునాటికి మనుచరిత్రకారుడు పేర్కొన్న రాయలదిగ్విజయము లన్నిటిని పారిజాతాపహరణమున తిమ్మకవి చెప్పియుండవలయునే. తనకు తెలిసియు నాయాసమస్తదండ యాత్రావిజయములను తిమ్మనగారు పారిజాతాపహరణమునఁ బేర్కొ

నకపోవుట - అందును - ముఖ్యముగా పెద్దనగారు పేర్కొన్నవిజయ ములను తిమ్మకవి పేర్కొనక యుపేక్షించుట యావిజయములను దక్కువ చేయుటయే యగును. ఉచితజ్ఞుఁ డైనతిమ్మన యీవిధముగా రాయలవిజయము లన్నింటిని తెలిసియు తనకావ్యమున పేర్కొనలే దనుట నిరాధారమైన, నీరస మైనవాదము. ఒకవేళ - పారిజాతాప హరణకావ్యరచనమును తిమ్మనగా రేనాఁడో పూర్తి చేసి రనుకొన్నను- ఆతరువాత జరిగిన ట్లూహించుకృతిసమర్పణమునాటికి కృతిభర్త యైన రాయలు సాధించినవిజయము లన్నిటిని తిమ్మనగారు తనకావ్యమున పేర్కొనలే దనుటకన్న హాస్యాస్పద మైనవిషయము మఱియొకటి యుండదు. ఏకవియైనను తనప్రభువు సాధించినవిజయములను దనకు తెలిసినవానిలో కొన్నింటినే పేర్కొని, కొన్నింటిని విడిచిపెట్టడు. అందును తిమ్మకవివంటియుచితజ్ఞు డట్టిపని నసలే చేయడు. కనుక పారి జాతాపహరణము మనుచరిత్రకన్న ముందే రచింపబడి, మనుచరిత్ర కన్న నెంతో ముందుగానే- రాయలు కటకమును జయించుటకుముందే- ఆప్రభువున కంకిత మైన దని రూఢిగా చెప్పవచ్చును. అందుచే మను చరిత్రమే తెనుగున వెలసినప్రప్రథమప్రబంధ మనియు, దాని నొజ్జ బంతిగా నిడుకొనియే పారిజాతాపహరణాదిప్రబంధముల నాయాకవులు రచించినా రనియు చెప్పువారియభిప్రాయములు నిశితపరిశీలనమునకు నిలుచునవి కావు. అంతే కాదు - మనుచరిత్రము నొజ్జబంతిగా నిడు కొని కావ్యమును రచింపవలసినదుర్గతి పరమస్వతంత్రుడును, మహా కవియు నైనతిమ్మనగారికి లేదు. కాఁగా - పారిజాతాపహరణమే తెలు గున వెలసినప్రప్రథమప్రబంధ మని విజ్ఞు లెల్లరు నంగీకరింతురు.

రాయలవారికళింగవిజయము క్రీస్తుశకము 1519వసంవత్స రము ఆగష్టునెలలోఁ బూర్తి యైనది. ఆవిజయమును తిమ్మన పారిజా తాపహరణమునఁ బూర్తిగా వర్ణింపనికారణమున నతడు (క్రీస్తుశకము) 1519సంవత్సరమునకుఁ బూర్వమే ఆకావ్యమును రచించియుండు నని

విమర్శకు లభిప్రాయపడుచున్నారు. దీనినిబట్టి మనుచరిత్రకంటె నిదియే ముందు రచింపబడి యున్నట్లు తోఁచుచున్నది. ఐనను ప్రథమప్రబంధ మనుగౌరవము మనుచరిత్రకే దక్కినది." అని దివాకర్లవారు వ్రాసి యున్నారు.[1]

మనుచరిత్రకంటె పారిజాతాపహరణమే ముందుగా రచింప బడిన దని యొకవంక నంగీకరించినఆచార్య వెంకటావధానిగారు

"ఐనను ప్రథమప్రబంధ మనుగౌరవము మనుచరిత్రకే దక్కినది." యనుట సమంజసముగా లేదు. అది యితరులయభిప్రాయ మని వా రనుకొన్నను - ఇంత చర్చించినదివాకర్లవారు "మనుచరిత్రము ప్రథమప్రబంధము కాదు" అనినిష్కర్షగా చెప్పకపోవుట శోచనీయము.

"షష్ఠ్యంతములపిదపఁ బట్టణచాతుర్వర్ణ్యచతురంగబలపుష్ప లావికావర్ణనాదులును, నాయికావిరహావస్థాచంద్రమారుతోపాలంభా దివర్ణనములును నగపడకుండుటయు దీనిప్రాచీనతకు దృష్టాంతము కానో పును. పారిజాతాపహరణము ప్రబంధవాఙ్మయసౌధనిర్మాణమునకై తొలుదొల్త నెలకొల్పినశంకు వనియుఁ, ప్రాబంధికనియమములఁ బూర్ణముగ వెదజల్లుమనుచరిత్రాదులు తదనంతరకాలికసౌధము లనియు నొక్కి వక్కాణింపనగును. క్రీస్తుశకము 1516-1520 సంవత్సరముల నడుమఁ బారిజాతాపహరణమును, క్రీస్తుశకము 1521 తరువాత మను చరిత్రమును విరచితము లయ్యె నని నిర్ధారణ చేయుట కడ్డంకి లేదని తోఁచెడిని" అన్న దూసి రామమూర్తిశాస్త్రిగారియభిప్రాయము[2] సాహిత్యవిమర్శకు లంగీకరింపఁదగినది.

1. పారిజాతాపహరణము (సురభివ్యాఖ్యాసహితము)
2. విద్వాన్‌దూసిరామమూర్తిశాస్త్రిగారిభూమిక. 6,7 పుటలు.

# 3. పారిజాతాపహరణకావ్యావతరణ పూర్వరంగము

కృతి భర్తయైనకృష్ణరాయలు కర్పూరతాంబూలము పట్టి కృతి సమర్పింపు మని తన్నడుగకుండగనే తిమ్మకవి తనంత తానుగా రాయలవారికి తనకావ్యము నంకితము చేయుటకును - అందును ప్రత్యేకించి పారిజాతాపహరణకథనే తనకావ్యేతివృత్తముగా గ్రహించుటకును - కారణముగా నొకకథ చాలాకాలమునుండి ప్రచారములో నున్నది :-

ఒకనా డొకముఖ్యమైనరాజకీయసమస్యపై రహస్యాలోచనామందిరమున రాత్రి ప్రొద్దు పోవువఱకును రాయలు మంత్రియైన అప్పాజీతో చర్చలు జరిపి ఆసమస్య కొకపరిష్కారము లభింపక, అదే విషయముపై దృష్టిని కేంద్రీకరించి, అలవాటుచొప్పున తనపదము లంతఃపురమునకు కొంపోవగా అన్యథాయత్తచిత్తుడై నరాయలు ఒడలెఱుంగనినిద్రలో నున్నరాణిపాదములచెంత తనతల నుంచి పాన్పుపై పరుండి, ఆరాజకీయవిషయమునే ఆలోచించుచుండెను. అంతలో నిద్రావివశయైనరాణి తిరుమలదేవి యొక్కమాఱుగా ప్రక్కకు నొత్తిగిలినది. అప్పు డాయర్ధాంగిపాదపద్మము బలవద్రాజకిరీటమణిమరీచికానీరాజితపాదపంకజు డగురాయలయుత్తమాంగమును తాకినది. ఆలోచనలు చెదరి తన్ను తా నెఱిగినరాజు అమాయికురాలైన యర్ధాంగి నపార్థము చేసికొని, యిక నామెమొగమైనను చూడక చిన్నాదేవిని పరిణయమాడి ఆమెతోనే లోకముగా గడపుచుండెను. రాయలు తనయెడ నెందులకు విముఖుడైనాడో తెలియక రాణి బెంగతో కృశించిపోవుచుండెను. ఆమెతో నరణపుకవిగా వచ్చిననంది తిమ్మన కొంతకాలముతరువాత రాణిని పరామర్శించి, రాయలు పరాకుగా నర్ధరాత్రమున తిరుమలశయనమందిరమునకు వచ్చి, చిరాకుగా మరలిపోయినట్లు విని తక్కినది కొంత తా నూహించుకొని -

సపత్నీమాత్సర్యముతో ఉద్దేశపూర్వకముగా ప్రాప్తించిన సత్యభామాపాదతాడనమును సహృదయముతో స్వీకరించిన యితివృత్తముగాఁ గలపారిజాతాపహరణకావ్యమును రచించి, రాయ లర్థింపకుండగనే – అతని కంకితము చేసి, విడిననంసారమును ముడిపెట్టుసదుద్దేశముతో – ఆపద్ధర్మముగా – కావ్యము రచించి, తనవ్యంగ్యమర్యాదచే రాయలను ఆత్మపరీక్షకు పురికొల్పి, తిరుమల దేవికాపురమును తిమ్మకవి నిలబెట్టినాఁ డఁట !

పై విషయమునుబట్టి చూడగా పారిజాతాపహరణ మితర కావ్యములవలె కాక యొకనిర్దిష్టప్రయోజనమును సాధించుటకై రచింపబడినదనియును, అందుచే నీకృతి రచనావైలక్షణ్యమునకు స్థాన మనియు మనము గ్రహింపవచ్చును.

"కావ్యమ్ యశసేఽర్థకృతే వ్యవహారవిదే
శివేతరక్షతయే సద్యఃపరనిర్వృతయే
కాంతాసమ్మితతయా ఉపదేశయుజే"

అనునాలంకారికప్రవచనమున కుదాహరణభూత మై యున్నది తిమ్మ నగా రీకృతిని కృష్ణరాయల కంకిత మొనర్చి, కాంతాసమ్మిత మైనతన యుపదేశముచే రాయలకు కనువిప్పు కలిగించి, రాణికి కలిగినయవమంగళమును పరిహరించి, రసహృదయులకు రసామృతమును చూఱ లిచ్చి, తనకవితాకళను చరితార్థ మొనరించుకొని, యజరామరయశము నార్జించుకొన్నాడు.

ఈకథనే యితివృత్తముగా గ్రహించి, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారిప్రశంసలందుకొన్న "పారిజాతసౌరభము" మొదలగుపద్యకావ్యములును, "పారిజాతము", మున్నగునెన్నో నవలలును రచింపబడినవి.

పారిజాతసౌరభము – పద్యకావ్యము – రచయిత : శ్రీవక్కలంక లక్ష్మీపతిరావు.
పారిజాతము – చారిత్రకనవల – ,, ,, ,,
పారిజాతాపహరణపీఠిక (పుట 11-12) – ఎమెస్కో ప్రచురణ.

" భార్యయొక్క పాదము భర్తశిరమునకు తగులుటలో తప్పు లేదని నిరూపించుటకై తిమ్మన్న యీ కావ్యమును వ్రాసెనని యొకపెద్దకథ. ఆకథ పాతుకొనిపోయినది. దీనినిగురించి కొన్ని కావ్యములు పుట్టినవి. కొన్నివిమర్శలు పుట్టినవి. ఇప్పటికిని కొందఱు దానినిగూర్చి వ్రాయుచునే యున్నారు." అని విశ్వనాథ సత్యనారాయణగారియభిప్రాయము.

ఈకథ యథార్థముగా జరిగినదే యనియు, నందుచేతనే తిమ్మకవి పారిజాతాపహరణకావ్యమును రచించి కృష్ణరాయలకు తనంతతానై యంకితము చేసెననియు విశ్వసించి, తనవిశ్వాసమున కాధారముగా పారిజాతాపహరణకావ్యమునుండి కొన్ని పద్యముల నుదాహరించుచు సముద్రాల నాగయ్యగారు తాము రచించినసాహితీసుధాలహరిలో "నందితిమ్మన" యను శీర్షికక్రింద వివరించి యున్నారు.

" ఈకవి రాజదంపతులమధ్య అల్పకారణముగా పొడసూపిన వైరస్యమును సున్నితముగా తొలగించి, వారిని అభిన్నహృదయుల నొనర్చుసదాశయముతోనే ఈకావ్యరచనము చేసి యుండు ననుటలో నౌచిత్య మెంతయేని కనబడును." అని నాగయ్యగారియభిప్రాయము.

కావ్యావతారికలోనిపద్యములు కొన్ని ఈకథ యథార్థముగా జరిగిన దని యూహించుట కవకాశ మిచ్చుచున్నవి.

"పొలఁతుల్ కౌఁగిటఁ గ్రుచ్చి యెత్తి తలఁబ్రాల్ వోయించునవ్వేళ" అనుపద్యములో చిత్రింపబడినపార్వతీగత మైనయీర్ష్య సత్యభామయందలిసపత్నీమాత్సర్యమునుమాత్రమే కాక రాయలదేవేరులైనతిరుమలదేవీ, చిన్నాదేవులయీర్ష్యనుకూడ సూచించుచున్నది.

.................................................................................

సాహితీసుధాలహరి: పుటలు 132 నుండి 143 వరకు. రచయిత: సముద్రాల నాగయ్యగారు.

"సరసపుటల్కఁ దీర్చుతఱి" అనుపద్యము శ్రీకృష్ణుడు సత్యభామప్రణయకోపమును తీర్చుటను, శ్రీకృష్ణరాయలు తిరుమలదేవి ననునయించుటను సూచించుచున్నది.

ఇక నీకృతియందు తిమ్మన రాయలను చిత్రించిన తెఱగును పరిశీలించినచో కవి యీకావ్యరచనమున నాశించినప్రయోజనము విశద మగును. తిరుమలాపాదతాడనము ననుభవించినకృష్ణరాయలను సత్యభామాపాదతాడనము నంగీకరించినశ్రీకృష్ణునితో పోల్చుట తిమ్మనగారియాంతర్యము! ఈయాంతర్యమును పైకి తేటపడనీయక అలనాటికృష్ణుడే ఈనాడు కృష్ణరాయలుగా నవతరించె నని తిమ్మకవి రాయలనుగూర్చి యొకపద్యమును రచించినాడు. అల్లసానిపెద్దన తన మనుచరిత్రలో కృష్ణరాయని నొకచారిత్రకమహాచక్రవర్తిగా చిత్రింపగా తిమ్మన యలౌకికభావనావిష్టుడై కృష్ణరాయలు శ్రీకృష్ణునియవతారమే యని చారిత్రకవిశేషములతో సమన్వయించి, కృతిపతివర్ణనము సత్యద్భుతముగా తీర్చిదిద్ది కృతిపతివర్ణనములో తెలుగుసాహిత్యమున నొకవిశిష్టస్థానమును గడించినాడు.

ద్వాపరయుగమున నవతరించినశ్రీకృష్ణభగవానుడే కలియుగమున కృష్ణరాయలై పుట్టె నని తిమ్మకవి యెంతో చమత్కారముగా నీక్రిందిపద్యమును రచించినాడు :-

సీ॥ "యాదవత్వమున సింహాసనస్థుఁడు గామి
సింహాసనస్థుఁడై చెన్ను మెఱయ
గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁ జేసి
పరకామినీసహోదరత నెఱప
మఱి జరాసుతునికై మధుర డించుటఁ జేసి
పరవర్గదుర్గముల్ బలిమిఁ గొనఁగఁ
బారిజాతము నాసపడి పట్టి తెచ్చుట
నౌదార్యమున దాని నడుగువఱుపఁ

తే॥ గీ॥ గోరి తొలిమేనఁ దన కై నకొదువ లెల్ల
మాన్చుకొనఁ గోరి భువనైకమాన్యలీల
నవతరించినకృష్ణుఁ డొ నన(గ మించె
నరసవిభుకృష్ణరాయభూనాయకుండు ।"

(పారిజాతాపహరణము – 1వ ఆశ్వాసము - 17వ పద్యము)

పై రీతిగా శ్రీకృష్ణుడు తనపూర్వజన్మలోపములను సవరించుకొని శ్రీకృష్ణరాయలరూపమున పూర్ణపురుషుఁ డైనాఁ డన్నాడు తిమ్మన.

అంతే కాదు – కృష్ణరాయలకును శ్రీకృష్ణునికిని నభేదము చెప్పుచు చమత్కారముగా మఱియొకపద్యమునుకూడ తిమ్మకవి రచించినాడు :–

సీ॥ "చక్రవర్తిమహాప్రశస్తి నాఁడును నేఁడు
చెలఁగి ధర్మక్రమస్థితి ఘటించె
భూభృదుద్ధరణవిస్ఫూర్తి నాఁడును నేఁడు
గోరక్షణఖ్యాతిఁ గుదురుపఱచె
సాధుబృందావనసరణి నాఁడును నేఁడు
వంశానురాగంబు వదలఁ డయ్యె
సత్యభామాభోగసక్తి నాఁడును నేఁడు
నాకల్ప మవని నింపార నిలిపె

తే॥ గీ॥ నాఁడు నేఁడును యాదవాన్వయమునందు
జనన మందెను వసుదేవమనుజవిభుని
కృష్ణుఁ డనుపేర నరసేంద్రుకృష్ణదేవ
రాయఁ డనుపేర నాదినారాయణుండు ।"

(పారిజాతాపహరణము – 1వ ఆశ్వాసము - 19వ పద్యము)

వసుదేవసుతు డై నకృష్ణుడుగా ద్వాపరమున నాదినారాయణుడు జన్మించెను. నే డాతడే నరసరాజునకు కృష్ణరాయలుగా నవతరించెను. వారిపోలిక యీ క్రింద చూపబడినది :–

| కృష్ణావతారము | కృష్ణరాయావతారము |
| --- | --- |
| 1. చక్రవర్తిత్వము: కృష్ణావతారమున చక్రమును ధరించి ధర్మరాజునకు తోడ్పడి ధర్మమును రక్షించెను. | రాయలు చక్రవర్తియై ధర్మమును నాలుగుపాదముల నడిపించెను. |
| 2. గోవర్ధనగిరి నెత్తి గోవులను కాపాడెను. | దుష్టులైనశత్రురాజుల నడచి భూమిని రక్షించెను. |
| 3. రమ్యమైనబృందావనమున వంశమునందును (పిల్లనగ్రోవియందు) అనురాగము చూపెను. | సాధుబృందమును కాపాడి తనవంశమున ననురాగమూనెను. |
| 4. సత్యభామకొఱకై పారిజాతమును భూమికి తెచ్చి నిలిపెను. | సత్యమునందును, భామలయందును నాసక్తిని నిలుపుకొనెను. |

పైపద్యమున కృష్ణునికిని, కృష్ణరాయలకును గలసమానధర్మములన్నియు శ్లేషచమత్కారముచే సాధింపబడినవి.

| | |
| --- | --- |
| 1. చక్రవర్తియనగా చక్రమును ధరించినవాడు. | చక్రవర్తి యనగా రాజ్యము నేలెడువాడు. |
| 2. భూభృత్ + ఉద్ధరణము - అనగా కొండను (గోవర్ధనమును) ఎత్తుట. | భూభృత్ + ఉత్ + హరణము - అనగా రాజులను వారి స్థానములనుండి హరించుట. |
| 3. సాధుబృందావనము - అనగా శ్రేష్ఠమైనబృందావన మనుపేరు కలవనము. | సాధుబృంద + అవనము - అనగా సజ్జనసమూహమును రక్షించుట. |
| వంశానురాగము - అనగా వెదురు బొంగు (వేణువు) నందనురాగము. | రాయలకు తనవంశమునందు మోజు. |

4. సత్యభామ – అనగా సత్రాజిత్తు తనయ. సత్యమనెడిభామ.

కృష్ణునియవతారమునకును, కృష్ణరాయలయవతారమునకును పైధర్మములు సమానములే కనుక తిమ్మనగారియీకల్పన లోకోత్తరముగా నున్నది.

శ్రీకృష్ణుడుసురలోకతరువును దెచ్చి సత్యభామయింట పెరటిచెట్టుగా నాటింతునని యోదార్చుటతో – ఆయాలుమగలనడుమ రవరవ లంత మైనట్లు రచించినతిమ్మకవి – "భర్తయైనవాడు భార్యనట్లు ఆదరింపవలెనుసుమా –" అని అన్యాపదేశముగా రాయలవారి కుపదేశించినాడు.

సాపరాధ మైనసత్యభామనే పూర్వావతారమున మన్నించి, యామెప్రీతికై దేవేంద్రునితో యుద్ధము చేసి, దివినుండి పారిజాతతరువును భువికి దింపిననీవు – ఒడ లెఱుగనినిద్రలో అర్ధాంగివలన జరిగిన తప్పుకానితప్పును పట్టించుకొనరాదుసుమా ! అను కాంతాసమ్మిత మైన యుపదేశ మున్నది.

మ॥ " ఒకభృంగమ్ము పరాశినీమదనతంత్రోన్మాది ప్రాణేశ్వరిన్
మకరందాసవమత్త నబ్జగృహసీమం బెట్టి తాఁ బోయి సం
జకడన్ వచ్చి తదానమమ్మృతుశ మేజాడన్ జొరన్రాక యా
మికుడో నాఁ దిరిగెన్ - కొలంకురమకున్ మే లెంత హీనం బొకో ! "

(పారిజాతాపహరణము – 2వ యాశ్వాసము – 88వ పద్యము)

ఇది తిమ్మనగారు సాయంకాలవర్ణనసందర్భమున రచించినపద్యము. మకరందాసవమత్త యగుటతక్క ఆప్రాణేశ్వరియందు దోషము లేదు. అట్లే – తిరుమలదేవి నిద్రావివశ యగుట ప్రాణిధర్మము. ఆనిదురలో తనపాదము రాయలశిరమును స్పృశించుటయే ఆయిల్లా లెఱుగదు. అది దోష మనుకొన్నను – ఆమె కావలె నని చేసినది కాదు. అయి

నను కృష్ణరాయ లామె నపార్థము చేసికొని యామె నాయంతఃపుర మునసే విడిచి, తాను పరాంగనా (చిన్నాదేవి) మదనతంత్రోన్మాది యైనాడు. తుమ్మెద లనేకపుష్పములపై వ్రాలునట్లు నవప్రియు లైన ధరాధినాథులు బహుకాంతాసక్తు లగుట జగ మెఱిగినసత్యము !

ఇందు పరాళినీమదనతంత్రోన్మాది యైనభృంగము పడిన పాట్లు చెప్పి, కవి అన్యాపదేశముగా - అనుచిత మైనకోపముతో పట్ట మహిషిని విడిచి అన్యకాంతామదనతంత్రోన్మాది యైనకృతిపతిలోని లోపము నెత్తి చూపినట్లుగా నూహించుటకు వీ లున్నది.

కం॥ "శ్రీవర్ణనీయ ! తిరుమల
దేవీహృదయేశ ! అమృతదీధితికులపా
రావారపారిజాత ! ధ
రావలయశరణ్య ! కృష్ణరాయవరేణ్యా ! "

ఇది పారిజాతాపహరణకావ్యమున చిట్టచివరి దైనపంచమాశ్వాసము ప్రారంభములో కృతిపతి యైనరాయలకు తిమ్మన చేసినసంబోధనము. ఇది సంబోధన మనుటకన్న నభ్యర్థన మనుటయే యుచితము.

అమృతదీధితికులపారావారమున పొడమినపారిజాత మైన కృష్ణరాయలు అమృతహృదయు డై పారిజాతమువలె నాశ్రితుల నాదు కొనవలయు ననియు, ధరావలయమునకే శరణ్య మైనరాయలు కట్టు కొన్నయిల్లాలికిని శరణ్యు మనియు, ఆతిరుమలదేవి నిరాదరింపబడు చున్నను ఆమె తనహృదయమున నిరంతరము దైవముగా భావించు వాడు కృష్ణరాయలే యనియు, కావున నాపరమపతివ్రత యవశ్య మాదరణీయయే కాని, శిక్షార్హ కా దనియు కవిగారిచిట్టచివరియభ్య ర్థనము. ఈ యభ్యర్థనము సఫల మైనది కనుకనే తిమ్మకవి "నిర్భర దయారసపయోధీ ! " అని కృతిపతిని కావ్యాంతమందలిమంగళమహాశ్రీ వృత్తమునఁ బ్రశంసించినాఁ డనియు, వ్యథితహృదయ యైనతిరుమల

దేవికథ మంగళాంత మైనట్లును, కవిగారికావ్యరచనోద్దేశము నెరవేరి నట్లును నూహించుటకు వీ లగుచున్నది.

మఱొక్కమాట - శయనమందిరమున రాణిపాదము తనశిర మునకు తగులగా కుపితు డైనకృష్ణరాయ లామెను విడిచి చిన్నాదేవిని పెండ్లాడినట్లు ప్రచారములో నున్నకథ నిజమే కావచ్చును.

అందుచేతనే పెద్దనగారితో పరీక్షై తిమ్మకవి పారిజాతాప హరణకావ్యమును రచించి రాయ లడుగకుండగనే ఆయన కంకిత మిచ్చు టయు, అందలి కాంతా సమ్మిత మైనధర్మబోధచే రాయలకు కనువిప్పు కలుగుటయు జరిగినది. కట్టెదుట - తనంతట తానుగా వలచి వచ్చిన యప్సరోఙ్గన యున్నను నగ్నిసాక్షిగా పెండ్లాడినయిల్లాలి కన్యా యము చేయ నొల్లనిప్రవరునిపాత్రమును విస్పష్టరేఖలతో పెద్దనగారు తనమనుచరిత్రమున చిత్రించుటకూడ - ఒకవిధముగా తిరుమలదేవి నుండి మనసు మరలించుకొని, చిన్నాదేవిని తెచ్చికొన్నరాయల నన్యాపదేశముగా తప్పుపట్టుటయే యని యూహించుట కవకాశ మున్నది!



# 4. పారిజాతాపహరణకృత్యాది

శ్రీమదికిం బ్రియం బెసఁగఁ జేర్చినయయ్యెలలీల వైజయం
తీమిళితాచ్ఛకౌస్తుభము నిద్దపుఁగాంతిఁ దనర్చి యాత్మవ
క్షోమణివేదిఁ బొఁ ల్పెసఁగఁ జూడ్కులపండువు సేయువేంకట
స్వామి కృతార్థుఁ జేయు నరసక్షితినాథుని కృష్ణరాయనిన్.

"ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశో వాపి తన్ముఖమ్." అనులక్షణము ననుసరించి నంది తిమ్మనకవి పారిజాతాపహరణకావ్యారంభమున తన కృతిభర్త యగుకృష్ణదేవరాయలకు నిష్టదైవతాశీస్సంఘటనరూప మైనయాశీర్వాదము నీపద్యమునం దనుసంధించినాడు.

"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతానిచ కావ్యాని ప్రథంతే" అనునభియుక్తోక్తిప్రకారము దేవతావాచకమును, మంగళ వాచకమును నైన 'శ్రీ' శబ్దము నీవిధముగా కావ్యాదిని ప్రయోగించు టయే కాక కావ్యాంతమున —

"చిత్తజభిదంఘ్రియుగచింతన.... "

అని ప్రారంభించినమంగళమహాశ్రీవృత్తమున "మంగళమహాశ్రీ" అనుపదమును ప్రయోగించి శ్రీశబ్దముతోనే కవి యీ కావ్యమును పరిసమాప్త మొందించుట విశేషము. †

చంద్రవంశీయు డైనకృష్ణదేవరాయలు కృతిపతిగా నున్న యీకావ్యము చంద్రదేవతాక మై, శుభావహ మైనభగణముతో ప్రారంభ మగుట తిమ్మనగారియౌచిత్యదృష్టికి నిదర్శనము.

వేంకటస్వామి (విష్ణువు) శ్రీమదికి ప్రియ మొసంగినట్లు వర్ణించినయీపద్యములో శ్రీకృష్ణుడు లక్ష్మ్యంశసంభూత మైనరుక్మిణికి

.................................................................

† నన్నెచోడమహాకవియు తనకుమారసంభవకావ్యాంతమున నిట్లే చేసి యుండుట గమనార్హము.

సురలోకపారిజాతసుమ మిచ్చి సంతోషపెట్టినప్రధానకథావిషయము వ్యంగ్యమర్యాదచే కావ్యాదిని ఈప్రార్థనపద్యములోనే తిమ్మకవి సూచించినాడు. అంతే కాదు - భార్యమదికి ప్రియ మొసగు వేంకట స్వామివలెనే యర్థాంగి యైనసత్యభామకు ప్రియము సేయుటకై శ్రీ కృష్ణుడు పారిజాతాపహరణ మొనర్చుటయు నిందు సూచింపబడినది. ఇది తిమ్మనగారికవితాశిల్పచమత్కారము. అర్ధాంగి యైనశ్రీదేవిని హృదయమున నిలిపి సంతుష్టాంతరంగనుగా చేసినశ్రీమహావిష్ణువు కృష్ణరాయలను కృతార్థుని చేయవలె నని తిమ్మకవియాకాంక్ష.

తండ్రిపేరుతో కలిపి కృతిపతినామమును పేర్కొనుట కృష్ణరాయలనాటికవులయాచారమైనను - పదిమంది నడచుదారిని నడవక తన దైనయొకప్రత్యేక మైనమార్గమున సాగుమహాకవి యైనతిమ్మనగారికృత్యాదిపద్యములో

"నరసక్షితినాథునికృష్ణరాయనిన్"

అనుటలో కొంత విశేష మున్నట్లు తోచుచున్నది. అది యే మనగా :-

శ్రీదేవిని క్షణమైన నెడబాయక నిరంతర మెద నిలుపుకొన్నప్రేమైకమూర్తి ఆవేంకటస్వామి కాగా కృష్ణరాయలుమాత్ర మట్టివాడు కాఁడట! పారిజాతాపహరణకృతిసమర్పణకాలమున కృతికర్త యైనతిమ్మకవిదృష్టికి కృతిభర్త కృష్ణరాయలు నరసక్షితినాథుని కృష్ణరాయలుగామాత్రమే గోచరించినాడు. అనగా - తిరుమలదేవీవల్లభుడుగా కాక - క్రాంతదర్శి యైనకవిదృష్టికి ఒకరాజుకొడుకుగా - రాజసమూర్తిగా - ఉగ్రుఁడైననరసింహునాత్మజుడుగామాత్రమే గోచరించినాడు. "ఆత్మా వై పుత్త్రనామాసి" - క్షితినాథునికొడుకుకూడ క్షితినాథుడే! నరసక్షితినాథునికృష్ణరాయలు క్షితినాథుడుగా తనధర్మమును నెరవేర్చుచున్నాడే కాని - అర్ధాంగి నపార్థము చేసికొని భర్త్రుధర్మమునుండి వైదొలగినాడు. కనుకనే శ్రీదేవిని సదా యెద నిలిపి

లోకమునకు భర్తృధర్మమును చాటుపురుషోత్తముఁడైన శ్రీ వేంకట స్వామి (పతిగాకృతార్థతగాంచని) కృష్ణరాయని కృతార్థుని జేయవలె నని కవిహృదయ మిందు ధ్వనించుచున్నది. ధర్మసింహాసన మెక్కి-పదుగురకు తగవు చెప్పెడిప్రభువునకు ధర్మోపదేశము చేయవలసివచ్చిన ప్రభుశ్రేయోఽభిలాషి యైనకవికి వ్యంగ్యమార్గమే శరణ్యము. వాచ్య ముగా నీతిబోధ చేయువాడు కవిశబ్దవాచ్యుడే కాడు – కనుక మహాకవి యైనతిమ్మకవి సార్థకమును మహార్థకమును నైనతనపదప్రయోగముతో చిత్తమునకు హత్తుకొనునట్లు కాంతాసమ్మిత మైననీతిబోధకు కడంగుట యీతొలిపద్యమున గోచరించుచున్నది.

కావ్యేతివృత్తముగా గ్రహించుటకు లోకమున నెన్నో కథ లుండగా తిమ్మన యీపారిజాతకథనే గ్రహించుటకును – అందులోను-అమూలక మైనసత్యభామాపాదతాడనఘట్టమును జొప్పించుటలోను – ఆకావ్యమును కృష్ణరాయలు కోరకపోయినను తనంతట తానై ఆయన కంకితము చేయుటలోను – కవిలక్ష్య మొక్కటే! ఆవేశమునకు లొంగి, ఆలోచనమును గోలుపోయి అపార్థముతో అర్ధాంగి యైనతిరుమలదేవి యందు విముఖుఁడైనకృష్ణరాయప్రభువు మరల నామెయం దనురక్తుడు కావలెను. తాత్కాలికముగా ధర్మపురుషార్థమునకు దవ్వైనరాజు కృతార్థుడు కావలెను. ఇదే తిమ్మనకవియేకైకలక్ష్యము.

ఇందు మఱొక్కరహస్య మున్నది. శ్రీకృష్ణుడే శ్రీకృష్ణ రాయలుగా నవతరించినట్లు తిమ్మకవి "యాదవత్వమున సింహాసనస్థుడు కామి" అనుపద్యమున వర్ణించుటచే ఆవేంకటస్వామికిని, ఈరాయ లకును నభేదము చెప్పినట్లే. ఆవేంకటస్వామికివలెనే ఈరాయలవక్షస్సు మణివేది. స్నిగ్ధ మైనఆవేదినుండి యొకసారి జారుట తటస్థించెనేని మరల నట ప్రవేశించుట దుష్కరము. ఆవక్షోమణివేదినుండి జాఱిన రాణి తిరుమలకు మరల నందు తావు కల్పించుటకే తిమ్మనకవి కలము పట్టినాడు! ఇది యిందలిచమత్కారము!

లక్ష్మియే రుక్మిణిగా నవతరించినది. వేంకటస్వామి శ్రీమదికి ప్రియ మొసగువాడు. అట్లే కావ్యనాయకు డైనశ్రీకృష్ణుడు రుక్మిణికి ప్రియం బొసగ పారిజాతప్రసూన మిచ్చుట యిందు సూచింపబడినది.

కృష్ణరాయలయాస్థానకవి యైనపెద్దనకూడ ఇట్లే "శ్రీవక్షోజకు రంగనాథ మెదనై జెన్నొందు"…. నను తొలిపద్యమున నే తనకావ్యేతి వృత్తమునందలియొకప్రధానసన్నివేశమును సూచించినాడు! ఇది రాయలవారియాస్థానకవుల కబ్బినవిద్య!

> " పాలఁతుల్ కౌఁగిట గ్రుచ్చి యెత్తి తలఁబ్రాల్ వోయించునవ్వేళ నా
> దలగంగం దననీడఁ దాన కని మౌగ్ధ్యం బొప్ప వేఱొక్కతొ
> య్యలి యంచున్ మది నెంచుపార్వతియసూయావాప్తికిన్ నవ్వుగ్రొ
> న్నెలపూఁదాలుపు కృష్ణరాయనికి సంధించున్ మహైశ్వర్యముల్."
>
> (పారిజాతాపహరణము – 1 వ ఆశ్వాసము - 2 వ పద్యము.)

పాలతులు తలఁబ్రాలు పోయించువేళ తలమీఁదిగంగలో తననీడను తానే చూచి మౌగ్ధ్యముచే వేఱొకతొయ్యలి యనుభ్రమచే పార్వతి యీర్ష్య చెందిన దట! ఆమెయీర్ష్యకు క్రొన్నెలపూఁదాలు పైనయా శుండు నవ్వినాఁ డట! అట్టిమహేశ్వరుడు కృష్ణరాయలకు మహైశ్వర్య ములు సంధించు నని తిమ్మనగారియాశీర్వాదపూర్వక మైనసంప్రార్థ నము. ఐశ్వర్యప్రదాత యైనయీశ్వరు నిట్లు ప్రార్థించుట సముచితముగా నున్నది. వరుడు నూతనాలంకారములు ధరించుట సహజము. క్రొత్త చంద్రుని తలపూవుగా నలంకరించుకొని నవవధువును చూచి మంద హాసము చేయుచు కల్యాణపీఠమున సుప్రసన్నుఁడై నశివుడు కృష్ణరాయ లకు మహైశ్వర్యసంధాత కావలె ననుట యాచితీశోభితముగా నున్నది. చంద్రుని తలఁ దాల్చినశివుడు ఆచంద్రునివంశమువాఁడై నరాయలను కటాక్షించుట సహజమే యని కవిహృదయము. చల్లనివాఁడైన చంద్రుని తలఁ దాల్చినశివుడు శ్రీకృష్ణరాయలను చల్లగా చూచు నను భావ మిందు స్ఫురించుచున్నది.

పార్వతీదేవి యీర్ష్య వహించినట్లు చెప్పినయీపద్యమున కావ్యనాయిక యైనసత్యభామసపత్నీమాత్సర్యము వ్యజ్యమాన మగుచున్నది. ఇట్లు కావ్యమునందలిప్రధానవిషయమును ప్రార్థనపద్యముల లోనే ధ్వనింపజేయుట కవితాశిల్పరహస్యము లెఱిగినమహాకవుల లక్షణము.

సత్యభామపాదతాడనసన్నివేశమున "జలజాతాసనవాసవాది..." అనుపద్యములో "నాథుల్ నేరముల్ సేయ..." అని శ్రీకృష్ణుడు నేరము చేసినట్లు తిమ్మకవి కంఠోక్తిగా చెప్పినాడు కనుక "సత్య యూరకే భ్రమఁజెంది యీర్ష్యఁ బూనె ననియు, నిందు శ్రీకృష్ణునిత ప్పేమియు లే దనియు వ్యంగ్యములు స్ఫురించుచున్నవి" అన్న సురభివ్యాఖ్యతో నే నేకీభవింపజాలకున్నాను. శ్రీకృష్ణుడు సత్యభామపట్ల నేరము చేసినాఁ డనియే నంది తిమ్మనగారితిరుగులేనినిర్ణయము. ఈతీర్పున కిక మార్పు లేదు.

పారిజాతాపహరణకృతిపతి నరసక్షితినాథునినందనుఁ డైన కృష్ణరాయలు. * "పొలఁతుల్ కౌఁగిట గ్రుచ్చి యెత్తి" అనునీపద్యమున పార్వతీపరమేశ్వరులనడుమ భ్రాంతిచే నిరాధార మైనయపార్థము పొడసూపినట్లు కవి వర్ణించి శయ్యామందిరమున జరిగినయెదో దానికి నమాయికురా లైనయర్ధాంగి నపార్థము చేసికొన్నకృతిభర్తయొక్క భ్రాంతిమూలక మైనదోషమును వ్యంగ్యముగా నెత్తి చూపుట జరిగినది. బీటలువారినరాజదంపతులయన్యోన్యతను మరల యథాపూర్వస్థితికి తెచ్చుటకే తిమ్మనగారు పారిజాతాపహరణరచనకు పూనినట్లు మన మూహింపవలసుపడుచున్నది. పార్వతీగతభ్రాంతికి నవ్వుకొన్నప్రసన్నమూర్తి యైనక్రొన్నెలపూఁదాల్పువలెనే రాయలును సుకుమార మైన కావ్యపుష్పమును తలఁ దాల్చి, పట్టమహిషియందు ప్రసన్నుఁ డగు

* పారిజాతాపహరణపీఠిక – 1వ పద్యము.

ననియు – కావలె ననియు – నీపద్యమున కవి సూచించినాడు. ఐశ్వర్య మనగా నీశ్వరత్వము. రాయల కాయీశ్వరుఁ డీయగలిగినది యీశ్వరత్వమే. అందుచే ఆయనవలె నీయనయు నర్ధాంగితో పెనవైచుకొని పోవలె నని తిమ్మనగారియాశయము.

" ప్రభుని కిల్లాలిపై నెంతప్రణయ మున్న
సమయమునఁ దొంగిచూచురాజసము పోదు ; " A

రాజసము హద్దులు దాఁటినరాజును దారిలో పెట్టుటకు కవి హైనవాడు చేయగలిగినది కాంతాసమ్మితోపదేశమేకదా ! ఆయాశయసిద్ధికే యీకావ్యరచనము – అడుగబడనియీకృతిసమర్పణము !

" కార్యేషు దాసీ కరణేషు మంత్రీ
భుక్తేషు మాతా శయనే తు రంభా
రూపే చ లక్ష్మీ క్షమయా
షట్కర్మయుక్తా ఖలు ధర్మపత్నీ " *

ఇల్లాలు క్షమాగుణముతో ధరిత్రిని పోలి యుండవలె నని నీతిశాస్త్రము చెప్పుచున్నది. క్షమకు పేరొందినభూదేవి సత్యభామగా జన్మించి తన సహజలక్షణ మైనక్షమను గోల్పోయి, సపత్నీమాత్సర్యమును వహించుట చిత్ర మైనవిషయము. పార్వతీగత మైనయీర్ష్యలో సత్యభామ యీర్ష్యయే సూచింపబడినది. పార్వతియసూయావాప్తికి క్రొన్నెల పూఁదాలు పైనశివుడు నవ్వినట్లే – రుక్మిణియెడ సత్యభామకు గల యసూయకు శ్రీకృష్ణుడు నవ్వుకొన్నాడు. సత్యభామ బుద్ధిపూర్వకముగా తనశిరసున తన్నినను నామెయజ్ఞానమునకు కృష్ణుడు తనలో తాను నవ్వుకొనుచు నామెయెడ ప్రసన్నతనే చూపినాడు.

A చూ. పారిజాతసౌరభము – కావ్యములోని 60 వ పుట.
రచన : వక్కలంక లక్ష్మీపతిరావు.

* నీతిశాస్త్రము – ప్రథమభాగము - 60వ శ్లోకము.

ఈపద్యమున వర్ణింపబడినపార్వతీకల్యాణఘట్టము కావ్యము నందలిసత్యభామాకల్యాణము (శుభము) నకు సూచనగా నున్నది.

అమవసచీకటితో పోరి పోరి విజయ మంది వచ్చినక్రొన్నెల నవ్వుచునే యుండును. అనార్తవంపుపూవైనయాక్రొన్నెలను తల దాల్చినక్రొత్తపెండ్లికొడుకైనశివుడుకూడ కల్యాణవేదిపై నవ్వులు ప్రసరించుట సహజమే. క్రొన్నెల, పూవు - వీనికి శృంగారరసముతో నున్నసన్నిహితసంబంధమునుబట్టి యీశబ్దములచే కావ్యములో శృంగారము ప్రధానరస మని తిమ్మన సూచించినాడు. పార్వతి ముగ్ధ కనుకనే తలఁబ్రాలు పోయించవలసివచ్చినది. తననీడను జూచి తానే యీర్ష్య నొందుటయు మౌగ్ధ్యమే. లేనిసవతిపైన కల్యాణవేదికపైననే యీర్ష్య వహించినపార్వతికన్న - పెండ్లి యైనతరువాత సకారణముగా నిజముగా నున్నసవతిపై నీర్ష్య వహించినసత్యభామ యెన్నోరెట్లు నయ మని సత్యభామపక్షము వహించి తిమ్మనగారు సూచించుట యిందలిచమత్కారము. కావ్యగత నాయిక యైనసత్యభామయొక్క పాదతాడన చర్యను సమర్థించునెపముతో తిరుమలదేవీపాదతాడనమును సమర్థించుట తిమ్మకవిహృదయముగా తోఁచును.

" కావ్యార్థసూచనము కావింపవలె ననునుద్దేశముతోడనే తిమ్మన సపత్నీమాత్సర్యముతో కూడినభావము నీపద్యమున చెప్పియుండెను " అని డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారియభిప్రాయము. *

వధువైవివాహవేదికపై నున్నపార్వతియందు తిమ్మనగారు ఆరోపించినయీభ్రాంతి - ప్రాణసదృశబంధువైనతనపతి తనకు కాకుండ రుక్మిణివాఁడయిపోయె ననుకొన్నసత్యభామభ్రాంతికి సూచక మగుటయే కాక పార్వతీగత మైనభ్రాంతిని వర్ణించినయీతిమ్మనగారిపద్యము -

* కావ్యలహరి - 92వ పుట.

శ్రీమహావిష్ణుప్రవత్తమానందలికురంగినాథమును జూచి విశ్వంభరాదేవిగా భావించినసనందనాదులభ్రాంతిని చిత్రించినపెద్దనగారిమనుచరిత్ర కృత్యాదిపద్యమునకు నొజ్జబంతి యైన దనవచ్చును.

"మనుచరిత్రయే తెలుగున వెలసినప్రథమప్రబంధమనియు దాని నొజ్జబంతిగా నిడుకొనియే పారిజాతాపహరణాదిప్రబంధముల నాయాకవులు రచించినా" రనియు చెప్పి పెద్దనగారి నాకాశమున కెత్తి, తిమ్మనగారిని తక్కువ చేసి మాటాడువిమర్శకుల కిది (నా) యెదురుసమాధానము. (పారిజాతాపహరణమే మనుచరిత్రకన్న ముందుగా రచింపబడినది కనుక నదియే తెలుగున వెలసినప్రథమ ప్రబంధ మని "తిమ్మనయుదంతము" లో నింతకు ముందే నిరూపింప బడినది.)

ఇక విఘ్నేశ్వరప్రార్థనములో తిమ్మకవి "గజముఖుడు తీక్షణ మైనతనదంతాగ్రముచే రాయలకు తీక్షణ మైనబుద్ధిని, ఉన్నతమైన కుంభయుగ్మముచే నున్నతిని, నుత్సాహపూర్ణ మైనదానస్ఫూర్తిచే నుత్సాహమును, దీర్ఘ మైనశుండాముఖముచే దీర్ఘాయువును ప్రసాదించుఁ గావుత మని చెప్పుట హృద్యముగా నున్నది. ఇందు విఘ్నేశ్వరునిపరముగా ప్రయుక్తము లైనసాభిప్రాయపదములు సరసముగా నున్నవి.

"సరసపుటల్క తీర్చువేళ నడుముపై, కటిపై, జడపై, గళంబుపై విష్ణుపుశార్ఙ్గ సుదర్శన నంద కాబ్జ సంభరణగుణాప్తితో నాలుగు చేతులు నుంపగా సుఖాంబుధి నోలలాడునిందిర నరదేవశిఖామణి యైనకృష్ణరాయలను కృప జూచుగావుత" మనుచున్నాడు తిమ్మకవి.

"నాఽవిష్ణుః పృథివీపతిః" అని యార్యోక్తి. కనుక విష్ణ్వంశసంభూతు డైనకృష్ణరాయలను - ప్రణయకోపము తీరి సుఖాబ్ధి నోలాడునిందిర కృప జూడవలె ననుట సముచితముగా నున్నది.

ధనువును ధరించినచేతితో ధనువువలెనే పిడికిట నిముడుకటిని, అసిని ధరించినచేతితో జడను స్పృశించె ననుటచే లక్ష్మీదేవిజడ ఖడ్గము వలె నల్లగా, పొడవుగా నున్నదనియు, శంఖమును ధరించినచేతిని గళముపై నుంచె ననుటచే నిందిరగళము శంఖమువలె నొప్పె ననియు రమణీయార్థము లిందు స్ఫురించుచున్నవి.

ఇందిరయొక్క సరసపుటలుకను విష్ణువు తీర్చినట్లు వర్ణించుటను బట్టి పారిజాతాపహరణకావ్యమున సత్యభామప్రణయకోపమును శ్రీకృష్ణుడు అపనయించుట యనువిషయము సూచ్యార్థసూచనగా చెప్పబడినది.

## ఇక సరస్వతీప్రార్థనము

"తనమృదుగీతికాపరిణతధ్వనివైఖరి నేర్పుచున్నదో" యనునట్లు చేతివీణియకు చెక్కులు గీటుచు తంత్రులు మీటి గాన మింపొనరగ జేయువాణి కృష్ణరాయనిఁ బ్రతిభోన్నతుని జేయుత మనుచున్నాడు తిమ్మనకవి. వాణి మృదుగీతికాపరిణతధ్వనివైఖరి కల దనుటనుబట్టి వీణియలో లేనిమృదుగీతికయు, పరిణతియు, ధ్వనివిశేషమును వాణిలో నున్న వని యర్థము. వీణాపాణి యైనఆవాణిమాట సరే – తిమ్మనగారి వాణిలోను ఆమృదుత్వమును, పరిణతత్వమును, రసమయధ్వనియు నింపొనరించుట గమనింపదగినవిశేషము.

తనమృదువైనకవిత పరిణతధ్వని కలిగిన దని తిమ్మకవి యీపద్యమున చెప్పకయే చెప్పుచున్నాడు! వీణచెక్కిళ్లు మీటి వాణి నయమ్మున తంత్రులను మీటు నట! ఆవాణిసంగతియెట్లున్నను – ఈతిమ్మకవివాణిమాత్రము నయముతో తనకళావిలాసములతో సుతారముగా కృతిపతి యైనకృష్ణరాయలబుగ్గ గిల్లి, ఆయనహృదయ తంత్రులు మీటి, మూగవోయినఆయన ప్రేమవీణను పలికింపవలె ననియే తిమ్మనగారియాంతర్యము.

నఖరాంకురంబుల నయమ్మ్మన తంత్రులుమీటుట, చెక్కులు గీటుట, ఈపదములనుబట్టి యీకావ్యమునందలిశృంగారరసప్రాధాన్యము సూచింపబడినది.

## ఇక చంద్రవర్ణనము

తనకృతిపతి యైనకృష్ణరాయలవంశమునకు మూలపురుషు డైనచంద్రుని తిమ్మన వర్ణించినతీరు హృద్యముగా నున్నది. ఆచంద్రుఁడు "వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించిన పూవుగుత్తి" యఁట! వైష్ణవు డగుకృష్ణరాయలవంశపుమూలపురుషు డైనచంద్రుని శివుడు తలఁ దాల్చినాఁ డట! ఇంతకన్న రాయలవారి కాహ్లాదకర మైన దేమి యుండును? "పూవుగుత్తి" యనుపదప్రయోగము పారిజాతపుష్పవిషయమునకు సూచకముగాకూడ నున్నది. చంద్రునికిని, పూలకును శృంగారరసముతో నున్నసంబంధమునుబట్టి "పాల్కడలి ముద్దులపట్టి," "పూవుగుత్తి" - మొదలైనపదములచే తిమ్మనగారి యీకావ్యము శృంగారరసభరిత మనియు స్ఫురించుచున్నది. ఆయీశ్వరుడు వలిమలయల్లువా డగుట యటుంచి యీతిమ్మనకపీశ్వరుడు మాత్రము విడిపోయిన కృతిభర్తృదంపతులమనసులలో కాంతాసమ్మిత మైనతనకావ్యముచే మమత లల్లినవా డయినాడు.

అంతే కాదు - ఆచంద్రుడు స్వచ్ఛ మైనపాలవంటికులమునకాదు - పాలకడలియందే పుట్టినవాడు. ఇది రాయలవంశపవిత్రతను వేనోళ్ల చాటువిశేషణము.

ఆచంద్రుడు "వేల్పులగమిజీవగఱ్ఱ." యనుచున్నాడు తిమ్మన. తండ్రియైనక్షీరసముద్రు డతికష్టముతో- తన్ను మథించిన దేవతలకు నమృత మీయగా - ఆపాలకడలిముద్దులపట్టి యైనయమృతాంశుడు అమృతాంధసులకై తనంత తానుగా సర్వసమర్పణము చేసి,

క్రమముగా క్షీణించిపోవుచు, నమవసనాడు రూపము లేకుండ బోవుచు, వేల్పులగమికి జీవగఱ్ఱ యగుచున్నాడు. ఆయమవసనాటి కాఱుచీకటి యీచంద్రునికీర్తిజ్యోత్స్నకు ప్రతీకగా నిలచుట విచిత్ర మైనవిషయము.

అంతటిత్యాగధనునివంశమునఁ బుట్టినకృష్ణరాయలు వితరణ శీలి యనువిషయ మీపద్యమున సూచనగా నుండగా -

" నితాంతదానపరతంత్రునకున్ " అని షష్ఠ్యంతపద్యము లోను, " త్యాగవిద్యాయితప్రాభవా ! " అని ద్వితీయాశ్వాసాంతము నందలిస్రగ్విణీవృత్తమునను వాచ్యము చేయబడినది.

" అత్యుత్కటైః పుణ్యపాపైః
ఇహైవ ఫల మశ్నుతే."

అని ఆర్యోక్తి.

వేల్పులగమికి జీవనాధార మై, తనజీవమును గోల్పోయిన చంద్రుడు అత్యుత్కట మైనతనపుణ్యప్రభావముచే మరల జీవించి, యమవస గడచినవిదియనాఁడు లోకమునకు దర్శన మిచ్చుచున్నాడు. ఆచంద్రుడు " ఉడిపోవనిచల్వలకెంకి "- అనగా - తఱుగనిశైత్యము నకు నిలయ మైనవాఁడు కనుకనే లోకపుతాపము నపనయింపగలుగు చున్నాడు. ఆయనవంశీయు డైనరాయలు చల్లనిమనసును, చల్లని చూపులును గలవా డని కవిహృదయము.

ఆచంద్రుడు " వెన్నలల్ మొలిచినపా " దట! చంద్రు డను పాదునుండి బయలు దేరినవెన్నెలతీవ లెదిగి యెదిగి యెగప్రాకి, యాకస మనుపందిరినిండ నల్లుకొని, యాపందిరి చాలకపోగా భూమికి దిగజారిన వన్న మనోహర మైనభావ మిం దున్నది. కనుక చంద్రుని " వెన్నెలల్ మొలిచినపాదు " గా వర్ణించుట యందముగా నున్నది.

ఇన్నియుత్తమలక్షణము లుండుటచేతనే తెల్లనివాఁడైన శివుడు తెల్లనిపాల్కడలిముద్దులపట్టిని తెల్లనిమిన్నేటితో తలఁ దాల్చి నాడు. శివజటాజూటమున పూవుగుత్తి యైనయాచంద్రునివలెనే ఆయన వంశమువాఁడైనకృష్ణరాయలును పూవువంటియెడద కలవాఁ డనియు, త్యాగి యనియు, చల్లనివాఁ డనియు, చిరునవ్వు వెన్నెలలు చిందించువాఁ డనియు – లేదా – కీర్తిచంద్రికలను ప్రసరింపజేయువాఁ డనియు, స్వచ్ఛమైనవంశమున పుట్టినవాఁ డనియు, కనుక చంద్రుని తలఁ దాల్చినచల్లనిమంచుఁగొండయల్లుఁడు చంద్రునివంటివాఁడైనకృష్ణరాయఁని చల్లనిచూపులఁ జూడవలె ననియు తిమ్మకవియాశయము. అచ్చమైన తెనుగుమాటలతో ముద్దులు మూట గట్టుచున్నయీపద్యము "ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకు" లకు పరమోదాహరణముగా, కవితాశిల్పమునకు కాణాచిగా నున్నది.

"తలవాఁక ధరించినపూవుగుత్తి" యనుట యీకావ్యమునందు ప్రధానమైనపారిజాతపుంబూవును స్ఫురింపజేయుచున్నది.

ఇతరకావ్యములలో కృత్యాది నుండనిచంద్రవర్ణన మీకావ్యమున నున్నది. చంద్రుడు మనఃకారకుడు. చంద్రునికిని, శృంగారరసమునకును గలసంబంధముచే కావ్యాదిని గలచంద్రవర్ణనము కావ్యములోనిశృంగారరసప్రాధాన్యమును సూచించుచున్నది.

విరహిణుల నేఁచులక్షణము చంద్రునిలో నున్నది. ఆయన వంశమున జన్మించినకృష్ణరాయలుకూడ పట్టమహిషి తిరుమలను (అపార్థము చేసికొని) విరహములో ముంచినా డనుకథ ప్రచారములో నున్నది.

ఆచంద్రునికొడుకు బుధుడు. ఆబుధునికి పురూరవుడును, అతనికి నహుషుడును, అతనికి యయాతియు, నతనికి తుర్వసుడును

జన్మించిరి. ఆతుర్వసునివంశమున దుష్టారిగర్వభంజను డైనయియాశ్వర రాజు జనించెను.

ఆయియాశ్వరరాజు మిక్కిలి గొప్పవాడు. "తామసవృత్తి లేక, సతతంబును నుగ్రుఁడు గాక, పౌరుషం బేమియు వెల్తి గాక, తన కెందును పై మఱి రాజు లేక, సంగ్రామములోన నొక్కనరుగానికి వాసి దొరంగక," పూర్ణపురుషు డైనఈశ్వరరాజునకు నేవిధముగాను భగ వంతు డైనయియాశ్వరుడు సాటి కాఁ డని తిమ్మన వర్ణించెను. ఎంత చమ త్కారమునకై చెప్పినను - శివుడు సగ మాఁడుది యనియు, నాయనపై నొకరా జున్నాఁ డనియు, ఆయన సమరమున నొకనరునిచే నోడింప బడినాఁ డనియు, కనుక నిన్ని లోపము లున్నయాపరమేశ్వరునికన్న నీయియాశ్వరరాజే గొప్పవాఁ డనియు కవి వర్ణించెను. శివభక్తుఁ డైన తిమ్మన యిట్లు వర్ణించుట కేవలము తనకవితాచమత్కారముతో విష్ణు భక్తుడైనతనకృతిభర్త కృష్ణరాయలను సంతోషపెట్టుటకే కాని - శివ నిందచేయునుద్దేశ మాయనకు లేదని మనము గ్రహింపవలయును. ఈ పద్యము తిమ్మకవిగారిశ్లేషరచనాచమత్కృతిని వేనోళ్ల చాటుచున్నది.

పరశురాముడు రాజులనెత్తుటితో రెండు మూఁడు (2+3=5) మడుగులనుమాత్రము కావించుట యాశ్చర్యము కానే కాదు. ఈతిమ్మయగారియియాశ్వరరాజు బెడందకోటయందలితురుష్కుల రక్తముతో నసంఖ్యాకనదీప్రవాహములను సృష్టించి, క్షత్రియాంతకుఁ డైనయాపరశురాముని తలఁ దన్నినాడు! (1వయాశ్వాసము - 10వ పద్యము.)

పరశురాముఁ డైదురక్తపుమడుగులను సృష్టింపగా - వానిని రెండో మూఁడో - యని తక్కువ చేసినట్లుగా రెండు మూఁడు వ్రంతలు చేసె ననుట చమత్కారము.

ఆయీశ్వరరాజునకును, గౌరీసమానురాలైనలక్కాంబిక కును విశ్వాతిగయశుఁడైననరసరాజు పుట్టెను. (1వఆశ్వాసము - 11వ పద్యము.)

దిగంతములందలిశైలవితతులే ఉన్నిద్రతేజుఁడైననరసరాజు దిగ్విజయస్తంభము లయిన వట! అనగా - నీరాజు సర్వసర్వంసహామండలమును జయించె నని భావము. కాళింగాదులు తనకు సామంతులు కాగా - నిరంతరతులాపురుషదానము లొనరించుచు, సకలవసుంధరాధిదేవతాదర్పణ మైనవిజయనగరమున సింహాసన మధిష్ఠించిననరసరాజు కీర్తిని సురలోక, నాగలోకాంగనలు గానము చేయుచుందు రట!

ఆనరసరాజు కుంతలరాజును చిక్కువడఁజేసి, విద్యాపురమును కైవస మొనర్చుకొనెను. పారసీకునకు దుర్భరమానవత్వమును తొలగించి, స్వర్గమున కంపి, మానవదుర్గము నాక్రమించెను. చోళరాజునకు సురవధూమధురాధరము లిప్పించి, తాను మధురాపురమును గైకొనెను. యవనరాజునకు తనఖడ్గనటీవినోదమును చవి చూపెను. షోడశ మహాదానము లొనర్చెను. మండలీకరమేఘమార్తాండబిరుద మందిన ఘను డీనరసరాజు. (1వ ఆశ్వాసము - 13వ పద్యము.)

విష్ణువునకు శ్రీభూదేవులవలె నీనరసరాజునకు తిప్పాంబయు, నాగాంబయు భార్యలు. (1ఆ - 14వపద్యము.) వారిలో తిప్పాంబ కొడుకు వీరనరసింహరాయలు. పరిపంథికంథిమంథాచల మైనయీరాజు వారాశిపరీతభూవలయము నేలెను. (1వ ఆశ్వాసము - 15వ పద్యము.)

ఆవీరనరసింహరాజుపిమ్మట నాగాంబకొడు కైనకృష్ణరాయలు రాజ్యసింహాసన మధిరోహింపగా - ఆయనవిరోధు లందఱును గహనశైలము లారోహించిరి. (1వయాశ్వాసము - 16వపద్యము.)

శ్రీకృష్ణావతారములో లేనిరాజ్యసింహాసనార్హత నీయవతారమున సాధించుటకును, అప్పుడు గోపికలతో కోడిగించెను కనుక

నిప్పుడు పరకామినులను సోదరులుగా చూచుటకును, ఆయవతారమున జరాసంధునికి భయపడి మధురను విడిచిపెట్టినలోటు తీరుటకై పరవర్గ దుర్గములను బలిమిమై గ్రహించుటకును, ఆయవతారములో పారిజాతము నపహరించె నన్నవాదు తొలగుటకై యీజన్మమున పారిజాతమును మించినయౌదార్యమును జూపుటకును, భగవాను డైనకృష్ణుడే కృష్ణరాయలుగా నవతరించె నని - అనగా- నీకృష్ణరాయలు ఆకృష్ణుని కన్న మిన్న యని - మచ్చు లేనిరా జని - తిమ్మకవి వర్ణించెను. (1 ఆ - . వపద్యము.)

శ్రీకృష్ణరాయలు శ్రీరంగమును, చోళమును, సహ్యాద్రి ప్రాంతభూములను, కావేరీతీరస్థశత్రుసమూహమును జయించెను. (1ఆ - 18ప.)

ఆదినారాయణుడే యాదవాన్వయమున కృష్ణు డనుపేరుతోను, కృష్ణదేవరాయ డనుపేరుతోను జనన మంది, నాఁడును, నేఁడును చక్రవర్తిమహాప్రశస్తిచే నొప్పి, ధర్మక్రమస్థితి ఘటించెను. భూభృదుద్ధరణవిస్ఫూర్తిచే గోరక్షణఖ్యాతి నందెను. సాధుబృందావనసరణిచే వంశానురాగము వదల డయ్యెను. సత్యభామాభోగసక్తిచే నాఁడును నేఁడును నాకల్ప మవని నింపార నిలిపెను. (1వయాశ్వాసము - 19వపద్యము.)

ఈపద్యమున తిమ్మకవి తనశ్లేషరచనాచమత్కృతిచే అటు భగవంతు డైనకృష్ణునికిని, ఇటు కృష్ణరాయలకును వర్తించున ట్లుభయార్థస్ఫోరకముగా నీపద్యమును రచించుట గమనింపదగినవిశేషము.

కృష్ణరాయలభుజములపై నుండి, సుఖించుచున్నభూదేవి ఆరాయలభుజకీర్తులందలిమణులను, భుజములకస్తూరిపరిమళమును చూచి, పూర్వము తనభారమును వహించినయాదిశేషునిపడగలమీఁది

రత్నము లీరాయలభుజకీర్తిమణులకాంతికి సాటి రా వనియు, ఆయష్ట దిగ్గజములగండస్థలములందలిమదజలపరిమళ మీరాయలభుజములకస్తూరి సువాసనకు సాటి కా దనియు, ఆభుజకీర్తిమౌక్తికకాంతిమిదముగ పరి హసించుచున్న దని చెప్పి " ధూర్త లంగనల్ " అనుచున్నాడు తిమ్మ కవి. (1వ ఆశ్వాసము – 20 వపద్యము.)

భూదేవియే సత్యభామగా పుట్టిన దనుట సుప్రసిద్ధము. భూదేవీగత మైనధూర్తత్వమును వర్ణించుసందర్భమున కవి – అంగనల్ ధూర్త లనుచున్నాడు. శ్రీకృష్ణునిశిరమును సత్యభామ వామపాద మున తొలగఁద్రోసినట్లు ముందుముందు కావ్యములో చెప్పబోవుచున్న తిమ్మకవి ఆధూర్తత్వమును అవతారికలోనే యిట్లు సూచించినాడు. భూదేవిధూర్తత్వమునకు కారణము కృష్ణరాయలసాంగత్యమే. అట్లే సత్యభామధూర్తత్వమునకు కారణము కృష్ణునిసాంగత్యముచే నామెలో తల యెత్తినగర్వమే. ఈవిషయమును కవి " ధూర్త లంగనల్ " అను రెండుమాటలలోసూచ్యార్థసూచనగా చెప్పినాడు. ఇది శిల్పవేత్త యైనకవి నేర్పు.

పూర్వము రుద్రుడు మూఢత్వముచే కొండవీటికడ కృష్ణ నందను డైనమనసిజుని మసి చేసి, అమానుషముగా ప్రవర్తించినను – ఆకృష్ణునియవతార మైనకృష్ణరాయలు కొండవీటిదగ్గర జరిగినదారుణ రణమున ప్రతాపరుద్రనందనుఁ డైనవీరభద్రుని కరుణామతి యై కాచినాఁ డట! అందుచే ఆరుద్రునికన్న ఈకృష్ణరాయలే దయా మయుఁ డని కవితాచమత్కారము. (1ఆ – 21వపద్యము.)

ఆరుద్రుడు తొలుత దొంగసన్యాసి యై బెట్టు చూపి, మన్మ థుని మసి చేసి, ఆపిదప నశరీరుఁ డైనయావిరోధికి లొంగి గృహ స్థయి నాఁడు! అనగా – చచ్చినవిరోధిచేతిలో సదమద మగుచు, సగ మాఁడుది యైనవాఁడు. కనుకనే ఆరుద్రుని మెచ్చనికరుణాసముద్రు డై, రాయలు వీరవైష్ణవభావ మందినాడు.

ఈసందర్భమున " కొండవీడు " శబ్దమును తిమ్మకవి చక్కగా సొమ్ము చేసికొన్నాడు.

" త ఏవ పదవిన్యాసాః
త ఏవార్థవిభూతయః
తథాऽపి భవతి నవ్యమ్
కావ్యమ్ గ్రథనకౌశలాత్. "

అనుసూక్తి కనుగుణముగా సాగినది తిమ్మనగారిరచనము.

తాను శివపరాధీనమతి నని పంచమాశ్వాసమునందలి 108వ పద్యములో చెప్పికొన్నతిమ్మకవి తనరచనాచమత్కారదృష్టితో - తనయారాధ్యదైవ మైనశివుని తక్కువ చేయుట గమనింపదగినది. కళాదృష్టికిని, తనభక్తికిని ముడి పెట్టనొల్లనివిశాలహృదయు డీకవిశేఖరుడు! ఇది తిమ్మనగారివ్యక్తిత్వములోనివిశిష్టత!

" నెలకొని కృష్ణరాయధరణీవిభుఁ డుత్కలభూమిపాలుతోఁ
గలన నెదిర్చి హస్తికరకాండతతుల్ మసకంపుఁబాము లై
మలసినచోటఁ గూడినసమగ్రయశోవసనంబుఁ గప్పి తా
వలవఁగఁ జేసె భూసతిని వశ్యవిధిజ్ఞుఁడు గాన నేర్పునన్. "

(1వ ఆశ్వాసము - 22వ పద్యము.)

కృష్ణరాయలకరవాలధారచే నుత్కలరాజునేనుగులతొండములు తెగి రణభూమిపై నొండొంటిని పెనవైచుకొని పడి మసకపుపాములై మలసిన వట. ఆవిజయముచే రాయల కనంతకీర్తి లభించిన దట!

ఒక తెల్లనివస్త్రముపై సర్పమిధునములు సంభోగించినచో ఆవస్త్రమును పురుషు డేస్త్రీమీాద కప్పిన నాస్త్రీ యతనికి వశ్యురాలై పోవు నని స్త్రీవశీకరణ తంత్రము.

రాయలవారిస్వచ్ఛకీర్తి యనెడివసనమునందు తెగి పడిన యేనుగుతొండము లనెడుసర్పమిధునములు పెనవైచుకొనగా - ఆవస్త్ర

మును కప్పి, నేర్పరి వైనరాయలు భూదేవిని తనవశము చేసికొన్నాఁడని యీపద్యమున కవి చమత్కరించెను. ఇది కవియొక్కలోకజ్ఞతకును, కల్పనాచమత్కారమునకును నిదర్శనము.

" ఉదయాద్రి వేగ యత్యుద్ధతి సాధించె
వినుకొండ మాటమాత్రన హరించె"

అది చెప్పినట్లు వినుకొండ కనుక (పోటరితనము చూపక) మాటలతోనే రాయలు లోఁగఁదీసికొన్నా డని చమత్కారము!

" కూటముల్ సెదరంగఁ గొండవీ డగలించె.
బెల్లముకొండ య చ్చెల్లఁ జెఱిచె. "

కూటమి – అనగా – సంధి. సంధిబంధములు చెదరిపోయినపుడు కొండవీ డగలిపోవుట సహజమే కదా! అచ్చుతో బెల్లమును తయారు చేయుదురు. అచ్చు నంతటిని చెఱిచివేసినచో నింక బెల్లముకొండ రూపు చెడదా మఱి? ఇది యొకచిన్నిచమత్కారము.

" దేవరకొండయుద్వృత్తి భంగము సేసె "

" నేను దేవరయొక్కకొండను – లేదా – దేవర నివసించు కొండను "– అని యాకొండపొగరు! ఆదేవరకన్న ఈరాయలు మిన్న యగుటచే ఆదేవరకొండయుద్ధతిని భంగించినా డన్నమాట!

" కినుక మీఱ ననంతగిరి క్రిందుపడఁ జేసె
కంబంబుమెట్టు గ్రక్కునఁ గదల్చె. "

గిరి నేలపై నున్నను – నేలకన్నను పైయెత్తున నుండునుకదా! పైగా అది అనంతగిరి – అట్టిదానిని తృణీకరించి రాయలు క్రిందువడఁ జేసెను. కనుక తలయెత్తి విఱ్ఱవీఁగుకొండను క్రిందుపడ (లొంగునట్లు) చేసిన కృష్ణరాయనరేంద్రుఁ డింద్రుడే యన్నమాట!

కంబము (స్తంభము) యొక్క మెట్టును గ్రక్కున కల్పి నచో మఱి అది నిలువగలదా ? కనుకనే పడిపోయిన దని యర్థము.

" బలనికాయము కాలిమట్టులనె యడఁచు
గటకమును నింక ననుచు "
నుత్కలరాజు వెఱచుచున్నా డట !

కాలితో మట్టించినచో – అందును – బలనికాయము కాలిమట్టులకు కటకము (కడియము) ఆగునా మఱి ? ఇది యుత్కలరాజుయొక్క భయము.

రాయలు వినుకొండ, కొండవీడు, బెల్లముకొండ మొదలైనవానిని జయించినట్లు కేవలము చారిత్రకవిషయమును చెప్పుటలో కూడ తిమ్మకవి యింతటిచమత్కారము పాటించినాడు. (1ఆ – 28వ ప.)

" బాహుసౌధక్రీడఁ బరఁగుపంబవలంతి
తొయ్యలినిడుదకస్తూరిబొట్టు
వైరిసైన్యాబ్ధిలో వచ్చుగెల్పులనావఁ
గడఁ జేర్చుప్రాకుడుఁ గడపుఁజేయి

చేత ననిలోన మించుకౌక్షేయకంబు." ( 1 ఆ - 24వ పద్యము )

నల్లగా నున్న రాయలచేతిఖడ్గమును ఆయనభుజమున నున్న భూదేవికి కస్తూరీతిలకముగా, శత్రుసేనాసముద్రమున నుండి విజయనౌకను దరి జేర్చుపాఁచి పట్టినచుక్కానిగా, ఆకత్తి జయలక్ష్మి చదువుకొనుపలకగా, ఆ కత్తి పై నంటినరిపుకుంభికుంభమౌక్తికము లక్షరపంక్తిగా, ఆకత్తి విరోధిరాజులదరికి అచ్చెరల నాకర్షించునింద్రజాలపుం గుంచెగా, రాయలస్వచ్ఛయశము తెల్లనిశివుడు కాగా ఆకత్తి నల్లనిదైనపార్వతిగా, శౌర్యములో సూర్యుడైనరాయలను గోరి వచ్చిన

చాయగా తిమ్మన వర్ణించెను. నల్లనికత్తిని నల్లనిపలకవంటివస్తువులతోను, తెల్లనిరాయలకీర్తిని శివునివంటివారితోను బోల్చుట రమణీయముగా నున్నది.

# కృతిపతి కృష్ణరాయలచిత్రణము

శ్రీకృష్ణదేవరాయలవంశమునకు మూలపురుషుఁడైనచంద్రుఁడు పాల్కడలిముద్దులపట్టి. వలిమలయల్లువాఁడు పూవుగుత్తిగా తలదాల్చినవాఁడు. వేల్పులగమికి జీవగఱ్ఱయై ఉడివోవనిచల్వలరెంకియై వెన్నెలలు మొలచినవాఁడై, స్వచ్ఛతకును, నున్నతికిని, త్యాగమునకును, శీతలత్వమునకును, కాంతికిని పేరొందినవాఁడు. అట్టిచంద్రునివంశమున నవతరించినకృష్ణరాయ లాచంద్రునిసుగుణముల నెల్ల పుణికి పుచ్చుకొని, ఆయనవలెనే కువలయానందకరుఁడైనాఁ డని తిమ్మనగారియాంతర్యము.

నవతియన్న వీరనరసింహరాయలపిదప నాగాంబానరసరాజులపుత్త్రుఁడైనకృష్ణరాయఁడు రాజు కాఁగానే విరోధు లందఱును గహనశైలావాసము చేసిరి. కృష్ణావతారమునందలి సింహాసనస్థుఁడు కాకుండుట, గొల్లయిల్లాండ్రతో కోడిగించుట, జరాసంధునికి వెఱచి మధురడించుట, పారిజాతము నాసపడి పట్టి తెచ్చుట – యనుకొదువలను మాన్చుకొనుటకై ఆకృష్ణుఁడే కృష్ణరాయలుగా నవతరించి, సింహాసనస్థుఁడై, పరకామినీసహోదరుఁడై, పరవర్గదుర్గవిజేతయై, పారిజాతముకన్న నుదారుఁడై, మించె నని తిమ్మనకవి వర్ణించెను. (1ఆ – 17ప.)

కృష్ణరాయఁడు శ్రీరంగమును, చోళదేశమును, సహ్యాపర్వతభూములను, కావేరీతీరమునందలిరిపుసమూహమును జయించి, శత్రువులరక్తపుఁజేరులతో కావేరీతోయము లెఱ్ఱబడునట్లు చేసెను. (1ఆ – 18వ పద్యము)

నాఁడును, నేఁడును యదువంశమునందు నరసేంద్రుఁకృష్ణ రాయ డనుపేర నవతరించినయాదినారాయణుఁడు చక్రవర్తి యై (చక్రముతో నుండి - అని శ్రీకృష్ణభగవానునిపర మైనయర్థము) ధర్మక్రమస్థితిని (ధర్మరాజునునికిని) ఘటించెను. భూభృదుద్ధరణ విస్ఫూర్తిచే (గోవర్ధనము నెత్తి - అని కృష్ణపరముగాను, భూభృత్, ఉత్, హారణము - అని కృష్ణరాయలపరముగాను నర్థములు.) నాఁడును, నేఁడును గోరక్షణ (గోపాలు డై, భూపాలు డై) ఖ్యాతి నందెను. సాధుబృందావనసరణిని ( లెస్స యైనబృందావనమార్గమున, సాధుబృందరక్షణమార్గముచే) నాఁడును, నేఁడును వంశానురాగమును ( పిల్లనగ్రోవియందలి కూర్మిని, ఆత్మవంశీయులయందలిప్రేమను) వదల డయ్యెను. సత్యభామాభోగసక్తిని ( సత్యభామతో భోగించుటయందలియాసక్తిచే - అని కృష్ణపరముగాను, సత్య మనెడిభామయందును, భోగములయందును నాసక్తిని - అని రాయలపరముగాను నర్థములు ) ఆకల్ప మవని నింపార నిలిపెను ( కల్పవృక్ష మైనయాపారిజాతమును భూమికి తెచ్చె నని కృష్ణపర మైనయర్థము. కల్పాంతమువఱకును భూమిపై సత్యమనెడిభామయందలియాసక్తిని నిలిపె నని రాయలపర మైనయర్థము) ( ప్రథమాశ్వాసము - 19 వపద్యము )

ఈవిధముగా ప్రథమాశ్వాసములో 17, 19 సంఖ్యలు గల పద్యములలో మొత్తము రెండు పద్యాయములు తిమ్మకవి కృష్ణరాయలకును, కృష్ణభగవానునికిని నభేదము చెప్పుట గమనింపదగినవిశేషము.

కృష్ణరాయలభుజములపై నుండి సుఖించుభూదేవి యాప్రభువుయొక్కభుజకీర్తిమణులకాంతిని, భుజముల నున్నకస్తూరిపరిమళములను గాంచి, పూర్వము తన్ను భరించినయాదిశేషునిఫణామణులును, అష్టదిగ్గజములమదజలపరిమళమును బరిహసించి, రాయలభుజకీర్తిమణికాంతి మిషతో నవ్వుచున్నదఁట! ఆదిశేషునికన్న, అష్టదిగ్గజములకన్న కృష్ణ

రాయలే భూదేవి నెక్కువగా సుఖపెట్టె నని తిమ్మనగారిభావము. (1ఆ - 20వపద్యము)

పూర్వము కొండవీటికడ మూఢుఁడైనరుద్రుడు కృష్ణనందనుఁడైనమనసిజుని హరించెను. ఈకృష్ణరాయ లట్లుగాక - కొండవీట ప్రతాపరుద్రనందను డైనవీరభద్రుని కరుణతో కాచినాడు. అనగా - ఆరుద్రునికన్న ఈరాయ లెంతో యుదారుఁడని తిమ్మకవి చమత్కరించినాఁడు!

ఉత్కళరాజుతో జరిగినఘోరయుద్ధమున రాయలు శాత్రవగజములతొండములను తెగ నఱికి యఖండయశము నార్జించి భూసతికి ప్రేమపాత్రు డయ్యెను. ( 1వ యాశ్వాసము - 22 వపద్యము )

ఉదయాద్రి నుద్ధతితో సాధించి, వినుకొండ మాటమాత్రన హరించి, కూటములు చెదరఁ గొండవీ డగలించి, బెల్లముకొండయచ్చెల్ల జెఱచి, దేవరకొండయుద్వృత్తి భంగము చేసి, జల్లిపల్లెను దులిచి, అనంతగిరిని క్రిందు పడఁజేసి, కంబముమెట్టును గ్రక్కున నదల్చినకృష్ణరాయలబలనికాయము కాలిమట్టులతోనే కటకము నడంచు నని యుత్కలమహీశుడు కంపము నందునట్లు చేసెను. (1వ యాశ్వాసము - 23 వ పద్యము)

రణరంగమున కృష్ణరాయక్షితీంద్రునిచేతిలో మెఱయుకౌక్షేయక మాయనభాహుసౌధమున నుండుభూపతికి కస్తూరీతిలక మై, వైరిసైన్యాబ్ధిలో వచ్చువిజయనావ నొడ్డునకు చేర్చుచుక్కాని యై, అరికుంభికుంభముక్తాక్షరములతో కూడి విజయలక్ష్మి పఠించుపలక యై శత్రురాజులకప్సరఃస్త్రీల నాకర్షించుయుద్ధ మనెడునింద్రజాలపుఁగుంచె యై, యశోమహేశానునియర్ధశరీర మై, పరాక్రమ మనెడిసూర్యుని వరించి వచ్చినఛాయాదేవి యై, ప్రకాశించిన దట! (1వయాశ్వాసము - 24వ

పద్యము) దీనినిబట్టి కృష్ణరాయలఖడ్గవిద్యానైపుణ్య మెంతటిదో మన మూహించుకొనవచ్చును.

ద్యోవనితాప్రార్థ్యమానధూర్తారిరాజసంగతి కను వైనరణ మొనర్చి, కలహపారణమునిని సంతోషింపజేయుగుణఖని యైనవాడు రాయలు. కావ్యనాయకు డైనయాశ్రీకృష్ణునివలెనే యీకృష్ణరాయ డును కలహాశనుని సంతుష్టుని జేయువాడు. (1వయాశ్వాసము - 25వ పద్యము.)

కృష్ణరాయలు దానములో కర్ణు నధఃకరించువాడు. అసాధా రణమేధాశక్తి కలవాడు. పండితులందు దయ గలవాడు.

శశాంకుని నపహసించుస్వచ్ఛకీర్తిచే త్రికాలములందలిరాజు లను మించినవాడు కృష్ణరాయలు (1ఆ - 27 ప) విరోధివీరభట, గజ, హయరక్తప్రవాహములచే సముద్రములను నిండించినవా డాయన. పండితులకు కొంగుబంగార మైనవాడు. (1 ఆ - 28 ప.) కోదండ ద్రోణుడు, వేదార్థస్థాపనప్రవీణుడు. శత్రుమాంసభోజనముచే మత్తిలిన కత్తి కలవాడు. (1 ఆ - 29 ప.)

వైభవోపేత మైన కృష్ణరాయలగృహమున (నున్న) వింధ్యో ద్భవము లైనయేనుగులమదజలము గ్రోలి మత్తెక్కినతుమ్మెదలు ఝుంకారములు చేయుచుండును. ఆరాజు ప్రబంధకృతిసంబంధ మైన మహిమ గలవాడు. (1ఆ - 30 ప.)

రాయలహస్త మనుపడగయం దున్నకత్తి యనునాలుక విరోధులప్రాణవాయువులను గ్రసించుటయందు రుచి మరగినది. (1ఆ - 31 ప.)

ఆయన వనితాజనతాస్మరుడు. నితాంతదానపరతంత్రతచే కామధేనువును, మేఘుని, కర్ణుని, చంద్రుని మించి, సంస్తుతు లందిన వాడు. (1 ఆ - 32 ప.)

శత్రురాజులబాహాబల మనుసమిధలచే రాయలప్రతాపాగ్ని జ్వలించుచుండును. సరసకళాధోరణీధుర్యుఁ డాయన. (1 ఆ - 33 ప.)

తిమ్మనగారిదృష్టిలో రాయలవారు దయమానాక్షివిలోకుఁడు. లోకహితకృత్ప్రారంభుఁడు. రంభాకుచద్వయదుర్గాధిపతిద్విషత్ప్రతగాధావ్యక్తదోస్సారుఁడు. సారయశస్సాంద్రదిశాంతుఁడు. శాంతహృదయార్జవ్యన్నయాచారుఁడు. చారయుతోపాయవిచారుఁడు. చారణగణప్రస్తూయమానోదయుఁడు. (1 ఆ - 138 ప.) ప్రతివర్షవసంతోత్సవకుతుకాగతసుకవినికరగుంభితకావ్యస్మృతిరోమాంచవిశంకితచతురాంతః పురవధూప్రసాదనరసికుఁడు. (1 ఆ - 139 పద్యము)

ప్రసృతివిలోచనాకుసుమబాణుఁడు. దిశాలలనాఘుసృణపటీరలేపకృతికోవిదుఁడు. బాహుతటీవిస్ఫురమరకీర్తిజాలుఁడు. రణవీక్షితవైరినృపత్యసృగతిపంకిలాసిముఖుఁడు. ఐందవవంశమణి.

శ్రీకృష్ణరాయమహీశుఁడు శ్రీసదనలోచనాబ్జదయాసారమరందపోషితార్థిభ్రమరోల్లాసగుణమలయకూటప్రాసాదనివేశుఁడు. (2 ఆ - 1 పద్యము)

శ్రీకృష్ణరాయలు సమ్మర్దక్షముఁడుగా, ధీనిబంధనవిధాసంక్రందనాచార్యుఁడుగా, శూరమ్మన్యాచలవజ్రపాతముగా, జగతీరత్నాంబుజాక్షుఁడుగా, శరధ్యమ్మార్గస్థదశాస్యరాజ్యసమసహ్యప్రోద్భవాతీరభాగుమ్మత్తూరికివంసముద్రపురవప్రోన్మీలనాడంబరుఁడుగా (2 ఆ - 104 ప.)

కరుణామయహృదయుఁడుగా, రాజకంఠీరవుఁడుగా, బాసదప్పువరగండాంకుఁడుగా తిమ్మనచే కీర్తింపబడినాఁడు. (2 ఆ - 105 ప.)

భోగలీలాపరాభూతసంక్రందను డైనరాయలు త్యాగవిద్యానిషద్వ్యాఖ్యాతప్రాభవుఁ డై, సాగరాంతక్షమాసంపదేకాస్పదుఁ డై నాఁడు. (2 ఆ - 106 ప.)

శ్రీమహితగేహుఁడుగా, ఉత్కలభూమీధవదర్పహరణభుజసారుఁడుగా, సుధాధామకులజలధికౌస్తుభముగా, రామాపాంచాలుఁడుగా, రాయలవారిని తిమ్మకవి యభివర్ణించినాఁడు. (౩ఆ–1 ప.) ఈకవిదృష్టిలో కృష్ణరాయలు ఆర్చిష్మత్ప్రతిమప్రతాపుఁడు; చతుస్సముద్రపరివేష్టితభూమిభోగానుభవుఁడు; జాగ్రదశ్వశ్చర్యాసాంద్రదిగంగనాంగుఁడు; జయంతచంద్రదర్ప స్తేనశరీర మోహితవామాబృందుఁడు; కళామానసుఁడు. (౩ఆ–59ప.) విదళితకాళింగమదాస్పదసింధురకుంభరత్నశర్కరిలారాదుదయగిరికొండవీటీపదవీస్థలుఁడు. మండలీకభాస్కరబిరుదాంకితుఁడు. (౩ ఆ–60 ప.) మరుత్పతిస్వరుక్షుత్క్రమత్రుటత్ఖ్రభృద్వరస్స్ఫురధ్వానిప్రవృద్ధయుద్ధపుంఖతాన కార్భటి. (౩ ఆ – 61 ప.)

శ్రీవేంకటగిరివల్లభసేవాపరతంత్రహృదయు డైనకృష్ణరాయఁడు కవితాప్రావీణ్యఫణీశుఁడు. (4 ఆ – 1 ప.)

హరిమథితాంబుధిధ్వనికళాపాణింధమానీకనిస్సాణస్వానభిదేలిమాద్రితటుఁ డై, నిస్సామాన్యచాపాగమద్రోణాచార్యుఁ డై, సురీసమూహావరణోద్యుక్తాహితశ్రేణినిశ్రేణీభూతకృపాణుఁడును నైనకృష్ణరాయలు మాంసల మైనతనభుజములచే భూ భా ర ము ను వహించి, శేషాహి కాభారము లేకుండఁ జేసెను. (4 ఆ – 91 ప.)

కృష్ణరాయ లశ్వశిక్షలో నకులుడంతటివాఁడు. సమరమున శత్రువు లాయనకీర్తిని గానము చేసి ప్రాణాపదను దప్పించుకొనువారు. శత్రురాజసంహారముచే నాయనకీర్తి దిగంతవిశ్రాంత మైనది. ఆయనకు మూరు రాయరగండ డనుబిరుదము కలదు. కటకేశుఁ డనుసింధువును మథించినమంథరకుధర మాయన. కొండపల్లిని, కొండవీటిని జయించుటచే కొండలకును భయము గొల్పుపరాక్రమశాలి యైనా డారాజేంద్రుఁడు. (4 ఆ – 93 ప.)

వాయువేగమును మించినరాయలగుఱ్ఱపుగిట్టలనుండి రేగిన ధూళిచే సూర్యబింబము మఱుగు పడిపోయెడి దట! ఆయనసేనలు మత్తేభములను తుత్తునియలు సేయునేర్పరు లట! (4 ఆ - 94 ప.)

శ్రీవర్ణనీయు డైనశ్రీకృష్ణరాయలు అమృతదీధితికుల పారావారపారిజాతము. ధరావలయశరణ్యు డాయన. (5 ఆ - 1 ప.)

నృసింహేంద్రక్షమాభృత్తపఃపాకద్యోతితరూపుఁ డైనకృష్ణరాయడు ఏకచ్ఛత్రితసర్వభూతలుఁ డై, మౌక్తికతులాభారప్రదానోన్నతుఁ డై, కోకస్తన్యసమాస్త్రిసన్నిభుఁ డై, హరిత్కూలంకషోద్యద్యశః శ్రీకర్ణాటమహీశుఁ డై, వైరికరిరాట్సింహప్రతాపోదయుఁ డైనాడు. (5 ఆ - 109 ప.)

ఆయన భువనవిజయాఖ్యసంసన్నవరత్నవిభాప్రభాతనలినాప్తుడు. రమాధవచరణకమలసేవాప్రవణమతి. వీరరుద్రపర్వతవజ్రి. (5 ఆ - 110 ప.) అంతే కాదు - ఆయన చిత్తజభిదంఘ్రిచింతనకళాధిగతజిష్ణుసమవైభవుడు. విత్తరమణామరగవీతరణిభూజలదవిశ్రుతకరాంబురుహుడు. గోష్ఠీనృత్తమణిరంగతలుడు. నీతిమనురాజనిభుడు. నిర్భరదయారసపయోధి. మత్తగజయూధమదమగ్నసుఖితాళిరవమాన్యగృహుడు. సకలమంగళమహాశ్రీయుతుడు. తెలుగుదేశము నేలినరాజులలో నంతటివాడు మఱి లేడు.

ఈవిధముగా పారిజాతాపహరణకావ్యమునందు శ్రీకృష్ణరాయప్రభువు చంద్రవంశాబ్ధిచంద్రుడుగా, భగవానుఁ డైనశ్రీకృష్ణునియవతారముగా, రుద్రుని మెచ్చునికరుణాసముద్రుడుగా, పరవీరభయంకరుఁ డైనప్రతాపశాలిగా, ధనుర్విద్యయం దన్యుల కాచార్యస్థానీయుడుగా, అలోకసామాన్యవితరణవ్రతుడుగా, వనితాజనతానవమన్మథుడుగా,

ప్రణయకుపితాంతఃపురికాప్రసాదనరసికుడుగా, దేవేంద్రభోగిగా, ప్రతి వత్సరవసంతోత్సవకవిపరిషత్ప్రవర్తకుడుగా, శ్రుతపూర్వమధురకవితా స్మృతిమాత్రపులకితగాత్రరసజ్ఞలోకరాకాశశాంకుడుగా, కవితాప్రావీణ్యఫణీశుడుగా, కవిజనకల్పకముగా, చిన్నమదేవీజీవితనాయకుడుగా, తిరుమలదేవీహృదయేశుడుగా, దిగంతవిశ్రాంతయశోవిశాలుడుగా చిత్రింపబడినాడు.

## 5. పారిజాతాపహరణకథ - తదాకరములు

సంస్కృతమున విష్ణుపురాణములోను, బ్రహ్మపురాణమునందును, పద్మపురాణములోను, భాగవతమునందును, బ్రహ్మవైవర్త పురాణమునందును, హరివంశములోను పారిజాతాపహరణవృత్తాంతము కలదు. ఆయా గ్రంథములందలి యాకథావిశేషము లెట్లున్నవో యిటుపై వివరింపఁబడుచున్నవి :-

## పారిజాతాపహరణకథాకరములు

### విష్ణుపురాణమునందలి పారిజాతహరణవృత్తాంతసంగ్రహము :-

నరకాసురుని సంహరించిన శ్రీకృష్ణుడు వరుణచ్ఛత్రమణి పర్వతములతో సత్యభామతో వినతాసుతవాహనుఁడై స్వర్గద్వారమును జేరి శంఖమును బూరించెను. దేవత లందఱును జేయుపూజల నందుకొనినయుపేంద్రు డింద్రునితో గలిసి వెళ్లి దేవమాత యైనయదితికి నమస్కరించి, పూర్వము నరకు డపహరించినకుండలముల నదితి కర్పించెను. అంతట దేవమాత శ్రీకృష్ణుని ననేకవిధముల స్తుతించెను. †

---

† అదితి చేసినశ్రీకృష్ణస్తవము :-

నమస్తే పుండరీకాక్ష భక్తానా మభయంకర — వి. పు. 30 అ.
సనాతనాత్మన్ సర్వాత్మన్ భూతాత్మన్ భూతభావన । — 6వ శ్లోకము

ప్రణేతుర్మనసో బుద్ధే రింద్రియాణాం గుణాత్మక
త్రిగుణాతీత నిర్ద్వంద్వ శుద్ధసత్త్వ హృది స్థిత — 7

సితదీర్ఘాదినిశ్శేషకల్పనాపరివర్జిత
జన్మాదిభిరసంస్పృష్ట స్వప్నాది పరివర్జిత — 8

సంధ్యా రాత్రిరహో భూమిర్గగనం వాయురంబు చ
హుతాశనో మనో బుద్ధిర్భూతాదిస్త్వం తథాచ్యుత — 9

సర్గస్థితివినాశానాం కర్తాకర్తృపతిర్భవాన్ వి. పు. 30 అ.
బ్రహ్మవిష్ణుశివాఖ్యాభి రాత్మమూర్తిభిరీశ్వర 10వ శ్లోకము.

దేవాదైత్యాస్తథా యక్షా రాక్షసా స్సిద్ధపన్నగాః
కూష్మాండాశ్చ పిశాచాశ్చ గంధర్వా మనుజా స్తథా 11

పశవశ్చ మృగాశ్చైవ పతంగాశ్చ సరీసృపాః
వృక్షగుల్మలతా బహ్వ్యః సమస్తా స్తృణజాతయః 12

స్థూలా మధ్యా స్తథా సూక్ష్మాత్సూక్ష్మతరాశ్చ యే
దేహభేదా భవాన్సర్వే యేకేచి త్పుద్గలాశ్రియాః 13

మాయా తవేయ మజ్ఞాతపరమార్థాతిమోహినీ
అనాత్మన్యాత్మవిజ్ఞానం యయా మూఢో నిరుధ్యతే 14

అస్వే స్వమితి భావోఽత్ర యత్పుంసా ముపజాయతే
అహం మమేతి భావో యత్ప్రాయేణైవాభిజాయతే
సంసారమాతు ర్మాయాయా స్తవైత న్నాథచేష్టితమ్ 15

యైః స్వధర్మపరై ర్నాథ నరైరారాధితో భవాన్
తే తర న్త్యఖిలా మేతాం మాయా మాత్మవిముక్తయే 16

బ్రహ్మాద్యాస్సకలా దేవా మనుష్యాః పశవస్థథా
విష్ణుమాయామహావర్తమోహాంధతమసావృతాః 17

ఆరాధ్య త్వా మభీప్సంతే కామానాత్మభవక్షయమ్
యదేతే పురుషా మాయా సైవేయం భగవంస్తవ 18

మయా త్వం పుత్రకామిన్యా వైరిపక్షజయాయచ
ఆరాధితో న మోక్షాయ మాయావిలసితం హి తత్ 19

కౌపీనాచ్ఛాదనప్రాయా వాంఛాకల్పద్రుమాదపి
జాయతే యదపుణ్యానాం సోఽపరాధః స్వదోషజః 20

తత్ప్రసీదాఖిలజగన్మాయామోహకరావ్యయ
అజ్ఞానం జ్ఞానసద్భావభూతం భూతేశ నాశయ 21

నమస్తే చక్రహస్తాయ శార్ఙ్గహస్తాయ తే నమః    వి. పు. అ.
గదాహసాయ తే విష్ణో శంఖహసాయ తే నమః    22వ శ్లోకము.

ఏతత్పశ్యామి తే రూపం స్థూలచిహ్నోపలక్షితమ్
న జానామి పరం యత్తే ప్రసీద పరమేశ్వర ।    23

(పై శ్లోకములు విష్ణుపురాణములోని 30వ యధ్యాయమునుండి యుద్ధరింపబడినవి. అదితి శ్రీకృష్ణు నుద్దేశించి చేసినశ్రీకృష్ణస్తవ మిది.)



కృష్ణుడు వర మి మ్మని కోరగా నదితి "భూలోకమున సురాసురులకు నజేయుడ వయ్యెద" వని దీవించెను.[1]

శచీదేవితో వచ్చి తనకు నమస్కరించినసత్యభామను వార్ధక్యమును, రూపవికారమును జేరక స్థిరయౌవన వౌదు వని[2] యదితి దీవించెను.

ఇంద్రు డదితియానతి-చొప్పున కృష్ణుని పూజించెను. శచీదేవి కల్పతరుప్రసూనములతో తన్ను తా నలంకరించుకొని మానవాంగన కదా యని సత్యభామ కొకపారిజాతపుపూవైన నీయలేదు.[3]

కృష్ణుడు సత్యతో నందనోద్యానవనమున కేగి యందు పారిజాతవృక్షమును జూచెను. అంతట సత్య కృష్ణునితో "ఇతర కాంతలపై లేనిప్రేమ నాపై నీ కున్న దందువుకదా! అది నిజ మైనచో నీపారిజాతవృక్షమును పెకలించి తెచ్చి నా పెరటిలో నాటింపుము. ఈ పూవును సిగ దాల్చి సవతులలో శోభింతు"[4] నని సత్యభామ ముచ్చటపడగా కృష్ణుడు పారిజాతమును పెకలించి గరుత్మంతునిపై నుంచెను. అది యుచితము కా దని యెన్నోవిధములుగా చెప్పి వనపాలకులు వారించిరి. నీవు చేయుచున్నఈపనివలన నింద్రాదులతో నీకు యుద్ధము తప్ప"[5] దని హెచ్చరించిరి.

1. ఏవ మస్తు యథేచ్ఛా తే త్వమశేషై స్సురాసురైః — 30 అధ్యాయము
అజేయః పురుషవ్యాఘ్ర మర్త్యలోకే భవిష్యసి. — 25వ శ్లోకము.

2. మత్ప్రసాదాన్న తే సుభ్రు జరావైరూప్య మేవవా
భవిష్య త్యనవద్యాంగి సుస్థిరం నవయౌవనం. — 27

3. శచీచ సత్యభామాయై పారిజాతస్య పుష్పకం
న దదౌ మానుషీం మత్వా స్వయం పుష్పై రలంకృతా. — 29

4. తుతోష పరమప్రీత్యా తరురాజ మనుత్తమం 30 అధ్యాయము
తం దృష్ట్వా ప్రాహ గోవిందం సత్యభామా ద్విజోత్తమః 33వ శ్లోకము
కస్మాన్న ద్వారకామేష నీయతే కృష్ణ పాదపః

యదిచే త్త్వద్వచః సత్యం త్వ మత్యర్థం ప్రియేతి మే
మద్గేహనిష్కూటార్థాయ తదయం నియతాం తరుః 34

న మే జాంబవతీ తాదృ గభీష్టా నచ రుక్మిణీ
సత్యే యథా త్వ మి త్యుక్తం త్వయా కృష్ణాసకృత్ప్రియం 35

సత్యం తద్యది గోవింద ! నోపచారకృతం మమ
త దస్తు పారిజాతోఽయం మమగేహవిభూషణమ్

బిభ్రతీ పారిజాతస్య కేశపక్షేణ మంజరీం
సపత్నీనా మహం మధ్యే శోభేయ మితి కామయే. 37

5. భో శచీ దేవరాజస్య మహిషీ తత్పరిగ్రహమ్
పారిజాతం న గోవింద ! హను మర సి పాదపమ్ 39

ఉత్పన్నో దేవరాజస్య ద త్త స్సో పిదదౌ పునః
మహిష్యై సమహాభాగ దేవ్యై శచ్యై కుతూహలాత్ 40

శచీవిభూషణార్థాయ దేవై రమృతమంథనే
ఉత్పాదితోఽయం నక్షేమీ గృహీత్వైనంగమిష్యసి 41

దేవరాజో ముఖప్రేక్షీ యస్యా స్తస్యాః పరిగ్రహం
మౌఢ్యాత్ ప్రార్థయసే క్షేమీ గృహీ త్వైనం హి కో వ్రజేత్ 42

అవశ్య మస్య దేవేంద్రో నిష్కృతిం కృష్ణయాస్యతి
వజ్రోద్యతకరం శక్ర మనుయాస్యంతి చామరాః 43

త దలం సకలై ర్దేవై ర్విగ్రహేణ తవాచ్యుత
విపాక కటు యత్ కర్మ త న్న శంసన్తి పండితాః 44

అంతట సత్యభామ కోపించి "ఈ పారిజాతమునకు శచి యెవ్వతె? ఇంద్రుఁడెవ్వఁడు? అబ్ధిమథనవేళ పొడమినయీవృక్ష మందఱికిని సొత్తు. సురను, చంద్రుని, లక్ష్మిని అందఱును సమానముగా ననుభవించుచున్నట్లే యీపారిజాతముకూడ నందఱికిని ననుభవింపదగినది. తనభర్తభుజబలమునకు శచీదేవి గర్వించుచున్నచో- సత్యభామ యీపారిజాతము నపహరించుకొనిపోవు నని చెప్పుడు. ఆమె తనమగనికిఁ బ్రియురా లయినచో- నామెకు భర్త విధేయు డైనచో వచ్చి నాభర్త పారిజాతము నపహరింపకుండ నిరోధింపు మనుడు. ఆయింద్రుడు నే నెఱుగనివాడు కాడు. అయినను మానవ కాంత నైననే నీవృక్షము నపహరించుకొనిపోవుచున్నాను" అని గర్వముగా పలికి, "ఈ నామాట లన్నియు మీయజమానికి తెల్పు" డన్నది సత్యభామ.[1]

---

30 అధ్యాయము
46వ శ్లోకము

1. కా శచీ పారిజాతస్య కో వా శక్ర స్సురాధిపః ।
సామాన్య స్సర్వలోకస్య యద్యేషోఽమృతమంథనే
సముత్పన్న స్తరుః కస్మా దేకో గృహ్ణాతి వాసవః 46

యథా సురాయథై వేందు యథా శ్రీర్వనరక్షిణః
సామాన్య స్సర్వలోకస్య పారిజాత స్తథా ద్రుమః 47

భర్తృబాహుమహాగర్వా ద్రుణ ద్ధ్యేన మథో శచీ
తత్కథ్యతా మలం క్షాన్త్యా సత్యా హారయతి ద్రుమమ్ 48

కథ్యతాంచ ద్రుతం గత్వా పౌలోమ్యావచనం మమ
సత్యభామా వద త్యేత దితి గర్వోద్ధతాక్షరం. 49

యది త్వం దయితా భర్తు ర్యది వశ్యః పతి స్తవ
మద్భర్తు ర్హారతో వృక్షం తత్కారయ నివారణమ్. 50

జానామి తే పతిం శక్రం జానామి త్రిదశేశ్వరమ్
పారిజాతం తథా ప్యేనం మానుషీ హారయామి తే. 51

ఆవిషయము వనపాలకులవలన విని, శచీదేవి యింద్రుని యుద్ధమునకు పంపినది. సకలదేవతలతో కూడి యుద్ధమునకై వచ్చి యైరావతముపై నున్నవజ్రి నరసి కృష్ణుడు పాంచజన్యమును పూరించి బాణవర్షముతో సర్వదిక్కులను కప్పివేసెను. దేవత లెన్నో శస్త్రాస్త్రములు ప్రయోగింపగా కృష్ణుడు వానిని వేయి ముక్కలుగా చేసెను. [1]

గరుత్మంతుడు పాములను ముక్కలు చేసినట్లు వరుణపాశములను ఖండించెను. [2]

యముడు ప్రయోగించినదండమును కృష్ణుడు గదతో ముక్కలు చేసి కుబేరునిశిబికను ధ్వంసము చేసెను. సూర్యచంద్రులు కృష్ణునిదృష్టి సోకగానే నిస్తేజులైరి. [3]

అగ్ని శతధా ఖండింపబడెను. అష్టవసువులును కాందిశీకులైరి. ఏకాదశరుద్రులును వచ్చి ధరపై బడిరి. వారిత్రిశూలములు కృష్ణునిచక్రముచే భిన్నమైనవి. కృష్ణుడు శార్ఙ్గమునుండి విడిచినబాణ

1. చకార శంఖనిర్ఘోషం దిశ శ్శబ్దేన పూరయన్ — 30 అధ్యాయము
ముమోచ శరసంఘాతాన్ సహస్రాయుత శశ్శితాన్. — 56వ శ్లోకము.

ఏకైక మస్త్రం శస్త్రంచ దేవై ర్ముక్తం సహస్రశః
చిచ్ఛేద లీలయై వేశో జగతాం మధుసూదనః — 58

2. పాశం సలిలరాజస్య సమాకృ ష్యోరగాశనః
చకార ఖండశశ్చం చ్వాబాలపన్నగదేహవత్. — 59

3. యమేన ప్రహితం దండం గదావిక్షేపఖండితం
పృథివ్యాం పాతయామాస భగవాన్ దేవకీసుతః — 60

శిబికాంచ ధనేశస్య చక్రేణ తిలశో విభుః
చకార శౌరి రర్కంచ దృష్టిదృష్టహతౌజసమ్. — 61

ములు సాధ్య, గంధర్వ, విశ్వదేవాదిగణములను దహించి యాకాశమున నెగురగొట్టినవి. [1] గరుత్మంతుడు ఆకాశమున నెగురుచు ముక్కుతో, తెక్కలతో, గోళ్ళతో దేవగణములను బాధించెను. [2] రెండు మేఘము లొకదానిపై నొకటివలె నింద్రోపేంద్రు లొండొరులపై శర ధారలు వర్షించిరి. [3] అంతలో గరుత్మంతు డైరావతమును డీకొనగా కృష్ణు డింద్రాదిదేవతల డీకొనెను. [4] సకలశస్త్రాస్త్రములును నిరర్థకము కాగా వజ్రి వజ్రాయుధమును, కృష్ణుడు సుదర్శనచక్రమును ధరించిరి. [5] అంతట ముజ్జగము లందు హాహాకారములు చెలరేగినవి. ఇంద్రుడు వజ్రాయుధమును ప్రయోగింపగా కృష్ణుడు [6]

.........................................................................................................................

1. సాధ్యా విశ్వేఽథ మరుతో గంధర్వాశ్చైవ సాయకైః — 30 అధ్యాయము
శారిణా ప్రేరితైరస్తా వ్యోమ్ని శాల్మలి తూలవత్. — 62వ శ్లోకము.

2. గరుత్మానపి తుండేన పక్షాభ్యాంచ నఖాంకురైః
భక్షయం స్తాడయన్ దేవాన్ దారయంశ్చ చచారవై. — 64

3. తత శ్శర సహస్రేణ దేవేంద్రమధుసూదనౌ
పరస్పరం వవర్షాతే ధారాభి రివ తోయదౌ. — 65

4. ఐరావతేన గరుడో యుయుధే తత్ర సంకులే.
దేవైః సమస్తై ర్యుయుధే శకే్రణ చ జనార్దనః — 66

5. భిన్నే ష్వశేషబాణేషు శస్త్రే ష్వస్త్రేషు చ త్వరన్
జగ్రాహ వాసవో వజ్రం కృష్ణ శ్చక్రం సుదర్శనమ్ — 67

6. క్షిప్తం వజ్ర మథేంద్రేణ
జగ్రాహ భగవాన్ హరిః
న ముమోచ తదా చక్రం
శక్రం తిష్ఠేతి చాబ్రవీత్.

దానిని చేతితో పట్టుకొనెను. తన వజ్రాయుధము కృష్ణు నేమియు చేయ లేకపోగా నింద్రుడు రణము మాని పలాయనము నారంభింపగా వానితో సత్యభామ యి ట్లనెను: [1]

లోకేశ్వరుడ వైనయో దేవేంద్రా! శచీనాథా! నీ విట్లు పరు వెత్తి పారిపోవుట తగదు. పారిజాతప్రసూనాలంకృత వై శచి నీదరికి ప్రేమతో వచ్చును. [2] పారిజాతము నలంకరించుకొని వచ్చినశచిని చూడనినీరాజ్యభోగ మొకభోగమా? [3] నీవు మనసులో బాధపడ వద్దు. ఈపారిజాతవృక్షమును తీసికొనియే పొమ్ము. దీనిచే దేవత లంద అను సుఖింతురుగాక! [4] నీబాహుబలముచే గర్వించిననీభార్య నేను తనఇంటికి వెళ్ళినపుడు న న్నాదరింపలేదు. [5] నేనును ఆడుదాననే. కనుక గంభీరచిత్తను కాను. నామగనిగౌరవముకొసమే నే నీయుద్ధమును ప్రోత్సహించితిని. [6] ఇతరులసొ త్తయిన ఈ వృక్షమును హరింపవలసిన యవసరము నాకు లేదు. తనయందమును,

1. ప్రణష్టవజ్రం దేవేంద్రం గరుడక్షత వాహనం సత్యభామా బ్రవీ ద్వీరం పలాయనపరాయణం. — 30 అధ్యాయము 70వ శ్లోకము.
2. త్రైలోక్యేశ న తే యుక్తం శచీభర్తుః పలాయనం పారిజాతస్రగాభోగా త్వా ముపస్థాస్యతే శచీ — 71
3. కీదృశం దేవరాజ్యం తే పారిజాతస్రగుజ్జ్వలాం అపశ్యతో యథాపూర్వం ప్రణయాభ్యాగతాం శచీమ్. — 72
4. అలం శక్ర! ప్రయాసేన న వ్రీడాం గన్తు మర్హసి నీయతాం పారిజాతోఽయం దేవా స్స న్తుగతవ్యథాః — 73
5. పతిగర్వావలేపేన బహుమానపురస్సరం న దదర్శ గృహం యాతా ముపచారేణ మాంశచీ. — 74
6. స్త్రీత్వా దగురుచిత్తాహం స్వభర్తృశ్లాఘనాపరా తతః కృతవతీ శక్ర! భవతా సహ విగ్రహమ్. — 75

తనభర్తభుజబలమును జూచి శచీదేవి గర్వించినదే- అందఱు స్త్రీలును నామెవలెనే గర్వింతురుకదా ! [1] ” అని సత్యభామ పలికినది.

అంతట నింద్రుడు “ అమ్మా ! మీవాఁడ నైననాపట్ల నీనిష్ఠురోక్తు లిక చాలును. [2] సృష్టిస్థితిలయకారకుఁడైనపరాత్పరు డీకృష్ణుడు. ఈతనిసూక్ష్మాంశము జగత్కారణము. తనయిచ్ఛచే లోకోపకారదృష్టితో మానవరూపము ధరించినయీపరమేశ్వరు డజేయుడు. ఈయనచే పరాజితుడ నైననాకు సిగ్గెందులకు ? ” అన్నాడు. [3]

అప్పుడు కృష్ణుడు “ ఓయీ ! నీవు దేవతాసార్వభౌముడవు. నేను మర్త్యుడను. నాయపరాధమును క్షమింపుము. [4] సత్యభామ

1. తదలం పారిజాతేన పరస్వేన హృతేన మే — 30 అధ్యాయము
రూపేణ గర్వితా సా తు భర్త్రా స్త్రీ కా న గర్వితా ? — 76వ శ్లోకము.
2. అలమ్ చండి ! సఖ్యుః ఖేదోక్తివిస్తరైః
3. న చాపి సర్గసంహారస్థితికర్తాఖిలస్య యః
జితస్య తేన మే వ్రీడా జాయతే విశ్వరూపిణా — 78
యస్మాజ్జగత్సకలమేతదనాదిమధ్యా ద్యస్మి న్యతశ్చ న భవిష్యతిసర్వభూతాత్
తేనోద్భవప్రలయపాలనకారణేన వ్రీడా కథం భవతి దేవి! నిరాకృతస్య — 79
సకలభువనసూతి ర్మూర్తి రల్పాల్ప సూక్ష్మ
విదితసకలవేద్యైః జ్ఞాయతే యస్య నాన్యైః
తమజమకృతమీశం స్వేచ్ఛయైనం
జగదుపకృతి మర్త్యం కో విజేతుం సమర్థః ? — 80
4. దేవరాజో భవా నింద్రో వయం మర్త్యా జగత్పతే — 31 అధ్యాయము
క్షంతవ్యం భవతైవేద మపరాధం కృతం మమ. — 2వ శ్లోకము.

కోరికపై నేను పెకలించినయీపారిజాతముతో నీవజ్రాయుధమునుకూడ నీవే గ్రహింపుము." [5]

5 పారిజాతతరు శ్చాయం నీయతా ముచిరాస్పదం — 31 అధ్యాయము
గృహీతో యం మయా శక్ర! సత్యావచనకారణాత్ — 3వ శ్లోకము.
వజ్రం చేదం గృహాణ త్వం యదత్ర ప్రహితం త్వయా
తవైతత్ ప్రహరణం శక్ర! వైరివిదారణం.

అనగా నింద్రుడు "స్వామీ! సకలజగన్నాయకుడ వైననీసూక్ష్మ రూపమును నేను గ్రహింపలేను. నాయపరాధమును మన్నించి యీ పారిజాతమును ద్వారకకు గొనిపొమ్ము. నీవు భూలోకమును విడువగనే యీవృక్షరాజ మచట నుండజాలదు కనుక స్వర్గమునకు తిరిగి వచ్చును గాక." [1] అనగా కృష్ణుడు సమ్మతించి పారిజాతమును గైకొని సర్వ దేవతాగణములును స్తుతించుచుండగా బయలుదేరి ద్వారకను ప్రవేశించి విజయశంఖమును బూరించి యచటివారి నానందపఱచి [2] సత్య భామపూఁదోఁటలో నాపారిజాతవృక్షమును నాటించినాడు. [3] ఆపారి జాతమును సమీపించువారికి పూర్వజన్మజ్ఞానము [4] కలిగినది.

1. విమోహయసి మా మీశ ! మర్త్యోఽహ మితి కిం వదన్ ? 31 అధ్యాయము
జానీమస్త్వాం భగవతో నతు సూక్ష్మవిదో వయం. 5వ శ్లోకము.
యోఽసి సోఽసి జగత్త్రాణప్రవృత్తౌ నాథ ! సంస్థితః
జగత శ్శల్య నిష్కర్షం కరో ష్యసురసూదన ! 6
నీయతాం పారిజాతోఽయం కృష్ణ ! ద్వారవతీంపురీం
మర్త్యలోకే త్వయా త్యక్తే నాయం సంస్థాస్యతే భువి. 7

2. తథే త్యుక్త్వా చ దేవేంద్ర మాజగామ భువం హరిః
ప్రసక్తైః సిద్ధగంధర్వైః స్తూయమానః సురర్షిభిః 9
తత శ్శంక ముపాధ్మాయ ద్వారకోపరి సంస్థితః
హర్ష ముత్పాదయామాస ద్వారకావాసినాం ద్విజ. 11

3. అవతీర్యాథ గరుడాత్ సత్యభామాసహాయవాన్
నిష్కుటే స్థాపయామాస పారిజాతం మహాతరుమ్. 11

4. యమభ్యేత్య జన స్సర్వో జాతిం స్మరతి పౌర్వికీం
వాస్యతే యస్య పుష్పోత్థ గంధే నోర్వీ త్రియోజనమ్. 12

యాదవులు ఆపారిజాతముదగ్గరకు పోగానే వారిశరీరము లమానుషము లై కనిపించెను.[1] నరకునింటినుండి తెచ్చినధనకనకాదులను కృష్ణుడు బంధుమిత్రులకు పంచి యిచ్చి, నరకాసురునిచెఱనుండి తాను విడిపించిన పదారువేలనూర్గురుకన్యలను (కృష్ణుడు) పదారువేలనూరురూపములతో నొక్కొకతె కొక్కొక్కడుగా తోచి పరిణయ మయ్యెను.[2] శ్రీకృష్ణుడు తననొక్కతెనే పెండ్లాడె నని యెవతె కామె భావించినది. ఆవిశ్వరూపు డందఱియిండ్లలోను నొకేరూపముతో నొకేకాలమున సుఖించెను.[3]

ఇది సంస్కృతమున విష్ణుపురాణమునం దున్నపారిజాతహారణ వృత్తాంతము.

1. తత స్తే యాదవా స్సర్వే దేహబంధా నమానుషాన్ 31 అధ్యాయము
దదృశుః పాదపే తస్మిన్ కుర్వంతో ముఖదర్శనమ్. 13వ శ్లోకము.

2. తతః కాలే శుభే ప్రాప్తే
ఉపయేమే జనార్దనః
తాః కన్యా నరకేణాసన్
సర్వతో యా స్సమాహృతాః 16

ఏకస్మి న్నేవ గోవిందః కాలే తాసాం మహామునే
జగ్రాహ విధివ త్పాణీన్ పృథగ్గేహేషు ధర్మతః 17

షోడశ స్త్రీసహస్రాణి శత మేకం తతో ఽధికమ్
తావంతి చక్రే రూపాణి భగవాన్ మధుసూదనః 18

3. ఏకైక మేవతాః కన్యా మే నిరే మధుసూదనః
మమైవ పాణిగ్రహణం మైత్రేయ కృతవా నితి 19

నిశాసు చ జగత్స్రష్టా తాసాం గేహేషు కేశవః
ఉవాస విప్రసర్వాసాం విశ్వరూపధరో హరిః 20

# బ్రహ్మపురాణమునందలిపారిజాతాపహరణకథ

విష్ణుపురాణమునందలిపారిజాతహరణకథయే అందలిశ్లోకము లతోఁబాటు బ్రహ్మపురాణమునందును గలదు. విష్ణుపురాణమునందు నూరుశ్లోకములలో నున్నయీకథ బ్రహ్మపురాణమున నూటపందొమ్మిదిశ్లోకములలో నున్నది. "వ్యాస ఉవాచ" అని యందం దధికముగా నుండి అదితి చేసిన కృష్ణస్తవములో కొన్నిశ్లోకము లధికముగా నుండుటచే బ్రహ్మపురాణములో 19శ్లోకము లెక్కువగా నున్నవి. కృష్ణుడు పదారువేలకన్యలను పెండ్లాడినతరువాతనే పారిజాతమును దెచ్చినట్లు హరివంశమున నున్నది. ఈయొక్కవిషయములో మాత్రము హరివంశమును బ్రహ్మపురాణ మనుసరించినను, బహ్మపురాణమునందలితక్కినశ్లోకము లన్నియు విష్ణుపురాణమునే పోలినవి.

# పద్మపురాణమునందలిపారిజాతకథ

క్లుప్తముగా పద్మపురాణమున నున్నపారిజాతకథప్రకారము అదితి కృష్ణుని స్తుతించుట లేదు. తనకు కృష్ణుడు నమస్కరింపగా నదితి మాతృప్రేమతో లేవనెత్తినట్లుమాత్ర మున్నది. ఇంద్రునియానతిచే నింద్రకింకరులు తెచ్చినపారిజాతపుష్పములను సత్యభామసమక్షమున శచీదేవిమాత్రమే ధరించి మానవకాంతకదా యని సత్యభామను తక్కువగా చూచి సత్యభామ కాపుష్పముల నొసగక శచీదేవి సత్యకు కోపము తెప్పించినది.

ఇంద్రాణీభవనమునుండి వచ్చినసత్యభామవలన శచీదేవి గర్వమును దెలిసికొన్నకృష్ణుడు పారిజాతమును పెకలించి గరుత్మంతునిపై నుంచి ద్వారకకు బయలుదేరగా దేవగణసమేతుడైనఇంద్రుడెన్నో శస్త్రాస్త్రములను కృష్ణునిపై ప్రయోగించియు నోడిపోయి

కృష్ణునిపాదముల వ్రాలి, స్తుతించి, "కృష్ణా! దేవతలయుపయోగార్థమై నీ విచ్చినయీవృక్షము మర్త్యలోకమునఁ నెట్లుండగలదు?" అనగా-కృష్ణుడు "సురేంద్రా! నీభార్య సత్యభామ కీపారిజాతసుమముల నీయక యవమానించినది. నే నీపారిజాతవృక్షమును సత్యభామ పెరటిలో నాటింతు నని యామెకు మాట యిచ్చితిని. కనుక నీ కీవృక్షము దక్కదు. నేను భూలోకమున నున్నంతకాలమును నీవృక్షముకూడ భువిపై నుండి, యాపిమ్మట నీయిష్టముచొప్పున జరుగును." అని యింద్రునివజ్రాయుధమును తిరిగి యిచ్చివేయగా నింద్రుడు సమ్మతించి వెడలిపోయెను.

సత్యాసమేతుడై శ్రీకృష్ణుడు ద్వారకాపురమును జేరి సత్యభామ పెరటిలో పారిజాతవృక్షమును నాటించెను. శ్రీకృష్ణుడొక్కొక్కభార్య కొక్కొక్కరూపముతో గోచరించి వారందఱితోను రమించినాడు. ఇది పద్మపురాణమునందలిపారిజాతకథ. ఈకథ యంతయు ముప్పదిశ్లోకములలోమాత్ర మున్నది.

## పద్మపురాణోత్తరఖండమునందలిమార్పులు

1. సత్యాసమేతుడై నశ్రీకృష్ణుడు స్వర్గలోకమున దేవమాతను సందర్శించినతరువాత సత్యభామ శచీదేవిభవనమునకు వెడలును.
2. ఇంద్రునియానతి ననుసరించి యింద్రకింకరులు పారిజాతపుష్పములను శచీదేవిమందిరమునకుఁ దెత్తురు.
3. పూర్వము శ్రీకృష్ణుడే తనకు పారిజాతతరువు నిచ్చినట్లు కృష్ణునితో నింద్రుఁ డనును.
4. తాను భూలోకమున నున్నంతకాలమును పారిజాతవృక్షము కూడ భూలోకముననే యుండు నని దేవేంద్రునితో తనంత తానుగా శ్రీకృష్ణుడే చెప్పును.

~~విష్ణుపురాణము~~నందు లేనియీనాలుగువిషయములును పద్మపురాణోత్తరఖండమునం దున్నవి. తక్కినకథావిషయములన్నియు విష్ణుపురాణములోనివే - యిందు సంక్షిప్తముగా నున్నవి.

## భాగవతమునం దున్నపారిజాతహరణకథ

భాగవతమునందు దశమస్కంధములో సంక్షేపముగా పారిజాతాపహరణకథ కలదు. నరకాసురుని జంపి సత్యభామాసమేతుడైన కృష్ణుడు స్వర్గమును జేరి, అదితికి (నరకాసురు డపహరించిన) కుండలములను, దేవేంద్రునికి వరుణచ్ఛత్రమును నిచ్చి శచీదేవేంద్రులచే పూజింపబడెను. తరువాత సత్యభామప్రేరణచే పారిజాతతరువును పెకలించి, గరుత్మంతునిపై నుంచినకృష్ణుడు తన్ను ప్రతిఘటించినదేవతల నోడించి, ద్వారకను చేరి సత్యభామయుద్యానమున సురలోకతరువును నాటించెను. పారిజాతసుమపరీమళాసక్తిచే స్వర్గలోకపుతుమ్మెదలు ఆవృక్షమును వెంబడించి ద్వారకకు వచ్చినవి. ఆతరువాత శ్రీకృష్ణు డనేకరూపములు ధరించి యొకేముహూర్తమున నెందఱో కన్యలను పెండ్లాడెను.

కృష్ణుడు దేవేంద్రునికి వరుణచ్ఛత్రము నిచ్చినా డనువిషయము నెక్కువగా చెప్పుటతక్క తక్కినకథయంతయు విష్ణుపురాణములోని పారిజాతహరణకథనే యనుసరించినది.

# బ్రహ్మవైవర్తపురాణమునందలి పారిజాతహరణకథ

శ్రీకృష్ణునిమహిమను పార్వతి దుర్వాసునికి చెప్పుసందర్భమున నాలుగేనాలుగు శ్లోకములలో పారిజాతాపహరణకథను చెప్పినట్లుగా బ్రహ్మవైవర్తపురాణమునందు కలదు.

శ్రీకృష్ణుడు పారిజాతముతో బాటుగా నింద్రునిగర్వమును కూడ హరించెను. సత్యభామచే పుణ్యకవ్రతము మొదలైనవ్రతముల నెన్నిటినో చేయించెను. ఈవిధముగా మానవతి యైనసత్యభామయభిమానమును పోషించి, శ్రీకృష్ణుడు రుక్మిణిమొదలైనభార్య లందఱిచే వ్రతము లన్నియు శాస్త్రోక్తముగా చేయించెను.

ఈకథ హరివంశములోనిపారిజాతాపహరణకథ ననుసరించినది. పారిజాతాపహరణకథను వర్ణించినపురాణము లన్నియు విష్ణుపురాణమునే యనుసరించి, సత్యభామపుణ్యకవ్రతప్రసక్తిని తేనేలేదు. కాఁగా - ఈబ్రహ్మవైవర్తపురాణము హరివంశమునందలిసత్యభామపుణ్యకవ్రతవిషయమును స్పృశించినది. కనుక బ్రహ్మవైవర్తపురాణ మీకథావిషయమున హరివంశము ననుసరించిన దని చెప్పవచ్చును.

# హరివంశమునందలిపారిజాతాపహరణకథ

సంస్కృతహరివంశమునందు 65వ యధ్యాయమునుండి 76వ యధ్యాయమువఱకును ననగా పండ్రెం డధ్యాయములలో పారిజాతాపహరణవృత్తాంత మున్నది.

నరకాసురుని సంహరించి కృతదారు డైనశ్రీకృష్ణు డొకనాడు రుక్మిణికోరికను మన్నించి, యామెపుణ్యకవ్రతమునుద్యాపనకై

సర్వభార్యలతో రైవతకపర్వతమున నుండగా నచ్చటికి దేవర్షి యైన నారదు డేతెంచి, పూజితు డై, తాను తెచ్చినసురలోకపారిజాతసుమ మును కృష్ణునికి కానుక వెట్టెను. కృష్ణుడు తనచెంతనే యున్నరుక్మిణి కాపూవు నీయగా నామె దానిని తనసిగలో తుఱిమికొన్నది.

అంతట నారదు డాపుష్పప్రభావమునువర్ణించి, కృష్ణునినుండి త్రిలోకరత్నసర్వస్వరూప మైనపారిజాతమును బడసినరుక్మిణి యాకృష్ణునిద్వితీయాత్మ * యని ప్రశంసించి, యామె జీవితాశయవస్తువిశేషము నందిన దని యభినందించి, యామెసపత్నులను కించపరచి మాటాడినాడు. తక్కినకృష్ణభార్య లీవిషయమును విన్నను సరిపెట్టుకొన్నారు కాని – రూపయావనసౌభాగ్యగర్వితమైనసత్యభామమాత్రము తన చెలికత్తెవలన నీవిషయ మెఱిగి, యీర్ష్యాళు వై యెఱ్ఱనిచీరను విప్పివేసి, యేకమాత్ర మైనతెల్లనిచీర ధరించి, తెల్లనిదుకూలమును లలాటపట్టికగా కట్టుకొని కోపగృహమున ప్రవేశించెను.

సర్వజ్ఞు డైనకృష్ణుడు వెంటనే నారదుని వీడి, సత్యాగృహము జేరి, భయపడుచున్నట్లు నటించుచు, కోపగృహమున ప్రవేశించి, యీర్ష్యాపరితాపవివశ యై, యసురుసు రగుచున్నసత్యభామ నరసి, యచటిసఖిజనములను సంజ్ఞలచే నవ్వలికి పంపి, సత్యభామను సమీపించి, తాలవృంతముచే విసరుచు నిలబడినాడు. తనకోపగృహమునందు పారిజాతపరిమళము లలమికొనగా నచ్చెరు వందినసత్యభామ ఆయపూర్వపరిమళ మేమో – యెక్కడిదో – యని యరయుటకై ముఖావగుంఠనమును తొలగద్రోసికొని, తనచెంత నిలచినకాంతుని జూచి, పెడమోము పెట్టి కూర్చుండి యేడ్వసాగినది.

కృష్ణు డామె నోదార్చుచు, నెన్నో ప్రణయశపథములు చేసి, యామెదుఃఖమునకు కారణ మడుగగా సత్యభామ తనయందు లేని

---

* ఆత్మా ద్వితీయః కృష్ణస్య భోజే త్వ మితి భామినీ. (హరివంశము)

ప్రేమను మాటలలో చూపుచు, మనసుమాత్రము రుక్మిణికే యిచ్చినా డని కృష్ణుని నిందించినది. అంగుచే తప్పు చేసికొనుటకు తన కనుజ్ఞ నిమ్మని జీవితముపై విరక్తి ప్రకటించినది.

ప్రణయకుపిత యైనసత్యభామను చూచి కృష్ణుడు "నీదుఃఖ మును నేను జూడ లేను. నీదుఃఖకారణము నెఱింగింపు" మని సత్యభామ నడిగెను. అంతట గద్గదకంఠి యైనసత్యభామ శ్రీకృష్ణు డిదవఱకు తన్ను గౌరవించుటయు, నానాడు రుక్మిణియం దమితానురాగము చూపి, నారదుడు తన్ను తక్కువ చేసి మాటాడుచున్నను వినుచు, కృష్ణుడు మిన్నకుండుటయు నేకరవు పెట్టి విలపించినది. ఆమానవతి ననునయించుటకై శ్రీకృష్ణుడు "దేవి! నేను చేసినయీయొక్కయప రాధమును మన్నింపుము. పారిజాతపుష్పములే కాదు – నీవు కావలె నన్నచో పారజాతవృక్షమునే తెచ్చి, నీపెరటిచెట్టుగా నాటెంతును." అనగా – సత్యభామ "వల్లె" యని యమితానందము నందినది.

అంతట స్నానాదికములు పూర్తి చేసి, కృష్ణుడు నారదుని స్మరింపగా నా దేవముని వచ్చెను. ఆయనను సత్యాకృష్ణులు పూజించిరి.

పరమాన్నభోజనము చేసి హాయిగా నాసీను డైననారదునికి సత్యభామ నమస్కరించినది. "విశేషసౌభాగ్యముతో వర్థిల్లు" మని యాపతివ్రతను నారదు డాశీర్వదించి యి ట్లన్నాడు :–

"ఇక నేను స్వర్గమునకు పోవలెను. అక్కడ గంధర్వులు మహేశ్వరప్రీతికై నిర్వహించునృత్యవిశేషముల నా దేవదేవు డవ్యగ్రు డై చూచుచుండును. ఆవిశేషములను చూచుటకై యింద్రుడు పారి జాతపుష్పమును కానుక పెట్టి క్రిందటిదినమే పిలిచినాడు. ఆపూవును నేను శ్రీనారాయణునికి కానుకగా నిచ్చితిని. శచీదేవి కాపూ వెంతో యిష్ట మైనది! దానిని ధరించుమగువలు సౌభాగ్యముచే శోభిల్లెదరు.

కశ్యపప్రజాపతి తన్ను సేవించినయదితికి వరముగా దానిని సృష్టించి నాడు. అంతట నదితి ఆపారిజాతసుమాలమాలను కశ్యపునికంఠసీమ నలంకరించి యతనిని నాకు దాన మొసగి యెంతో పుణ్యము నార్జించి నది. ఆతరువాత మూల్యముగా కొన్నినిష్కములను గైకొని కశ్యపు నాయదితికి తిరిగి యిచ్చివేయగా, శచీదేవియు నదితివలెనే నాకు తన భర్తను దాన మిచ్చి, మూల్యము చెల్లించి, మరల తీసికొన్నది. ఆపారిజాతమునే మందార మనియు, కోవిదార మనియు పిలుతురు."

నారదు డాడినయామాటలువిని కృష్ణుడు "ఓమహర్షీ! ఆపారి జాతకథవిన్ననాభార్యలు అదితియు, శచీదేవియు చేసినపుణ్యకవ్రతమును దామును జేసి సౌభాగ్యమును వర్ధిల్లజేసికొనం గోరుచున్నారు. పుణ్యక వ్రతము పూర్తికాగానే తిరిగి యిచ్చివేసెదను - కనుక వ్రతార్థము పారిజాతవృక్షమును ద్వారకకు పంపు మని నామాటగా నీ వింద్రునకు చెప్పుము" అన్నాడు.

అపుడు నారదుడు నవ్వి "కృష్ణా! నీ వడిగినను దేవేంద్రుం డాపారిజాతము నీయడు, ఎందుచేత ననగా - పార్వతికోఅకై పారిజాత మును గోరుటకు పరమేశ్వరుడు రాగా ఆశివుని వేడి పారిజాతము శచీ దేవిపూందోంటలో నుండునట్లు దేవేంద్రుడు వరము వడసినాడు. అపుడు శివుడు పార్వతిని సంతోషపెట్టుటకై మందరపర్వతముపై రెండుక్రోశులమేర పారిజాతవనములో నిండించినాడు. కనుక నింద్రుడు నీకు పారిజాతము నీయడు" అన్నాడు.

"నారదా! పుణ్యకవ్రతము చేయుటకై ఆపారిజాతతరువును తెచ్చి యిత్తునని సత్యభామకు నేను మాట యిచ్చితిని. నేనే మాట తప్పినచో జగత్ప్రళయ మేర్పడును. జగద్రక్షణము చేయవలసిననేను దేవగంధర్వయక్షరాక్షసు లేకమై యడ్డు వచ్చినను నా ప్రతిజ్ఞను భంగింపజాలను. నా కాపారిజాతము నీయడేని నాగదతో నింద్రుని

వృక్షమును నొప్పించి, యావృక్షమును గైకొందు నని దేవేంద్రునికి చెప్పుము " అన్నాడు కృష్ణుడు.

నారదుడు స్వర్గమునకు పోయి, యారేయి యచటియుత్సవమును విలోకించి, యింద్రునికి కృష్ణునిప్రతిజ్ఞను దెలుపగా నింద్రు డిట్లన్నాడు :-

"నారదా! నాతరువాత శ్రీకృష్ణుడు పారిజాతమునకే కాదు – సకలరత్నములకును నధికారియే. కాదనను. కాని – భూభారమును తగ్గించుటకై పుడమి నవతరించినయాకృష్ణుడు మానవుడుగానే చరించుచున్నాడు. అతడు మరల స్వర్గమును జేరినపుడు సత్యభామ వాంఛితము నెరవేర్ప వచ్చును. ఇట్టిస్వల్పవిషయమునకై సురలోకరత్నములను మర్త్యలోకమునకు తరలించుట మంచిపని కాదు. మనమే మరియాదల నతిక్రమించినచో నిక మానవదానవులమాట చెప్పవలెనా? కృష్ణుడు స్వర్గమునకు వచ్చి నాతో సమానముగా భోగముల ననుభవింపవచ్చును.

భార్యావిధేయుడై వర్తించుట కృష్ణుని కపకీర్తి తెచ్చును. ఆకృష్ణుడు అగ్రజుడనైననాయం దవినీతితో ప్రవర్తించుట మేలు కాదు. పారిజాతమును పుడమికి చేర్చినచో కోరిక లన్నియు తీరినమానవు లెవ్వరును స్వర్గమునకు రా నొల్లరు. స్వర్గవాంఛచేతనే మానవులు జపములును తపములును చేయుచు దేవపూజలు చేయుచున్నారు. పారిజాత మచ్చట నున్నచో నరు లెవ్వరును యజ్ఞములే చేయరు. యజ్ఞభాగములు లభింపనిచో దేవతలు తమ తేజమును గోల్పోవుదురు. కనుక ఆసత్యభామను సంతోషపెట్టుటకై నేను కృష్ణునికి మణికనకవస్తువాహనాదు లిత్తును గాని దేవతలకుమాత్రమే యనుభవయోగ్యమైనపారిజాతమునుమాత్ర మీయ నని కృష్ణునికి చెప్పుము."

ఇంద్రు డాడినయామాటలు విని నారదుడు "ఓ సురేంద్రా! శ్రీకృష్ణునిప్రతిజ్ఞ వింటివికదా! పారిజాతమును శ్రీకృష్ణుని కిచ్చుటయే యుత్తమము" అన్నాడు.

ఇంద్రుడు దుగ్రుడై "నారదా! ఆకృష్ణుడెన్నో కొఱగానిపనులు చేసినను సోదరప్రేమచే సహించితిని. నామాతాపితలవంశమర్యాదలు నీ వెఱుగనివి కావు. నేను యుద్ధమునకు భయపడువాడను గాను. యుద్ధములో న న్నోడింపక కృష్ణుడు పారిజాతమును గొంపోవుట జరగనిపని యని యాకృష్ణునికి చెప్పుము" అన్నాడు.

"దేవేంద్రా! ఆకృష్ణు డెవ రనుకొంటివి? వ్యక్తావ్యక్తుడైన సనాతనపురుషుడే కాని సామాన్యుడు కాడు. అతడు సృష్టిస్థితిలయకారకుడైనపరమేశ్వరుడు" అని నారదుడు చెప్పగా నింద్రుడామాటలు పెడచెవిని బెట్టి యిట్లనెను :-

"కృష్ణు డధోక్షజుడై లోకహితార్థము ఉపేంద్రుడై నటులే అన్నగారినైననాయందు భక్తితో వినయముతో ప్రవర్తింపవలె" నని యింద్రుడు నిష్కర్షగా చెప్పెను.

కృష్ణునిదగ్గరకు వచ్చి యింద్రునిమాటలు చెప్పి మరల నారదుడు కృష్ణునిమాతగా నింద్రుని జేరెను. ఇంద్రుడు కృష్ణునిప్రతిజ్ఞను బృహస్పతికి తెలిపెను.

"ఇంద్రా! నీవును జయంతుడును వెళ్ళి కృష్ణునితో యుద్ధము చేయుచుండుడు" అని సలహా యిచ్చి బృహస్పతి వెళ్లి తపము చేయుచున్నయదితికశ్యపులకు సర్వము నెఱింగించెను. కశ్యపుడు కోపించి, "కాముకుడైనయింద్రుడు పూర్వము దేవశర్మభార్యయైన రుచిని పొందగోరినాడు. ఆపాప మిప్పు డింద్రుని కట్టికుడుపును. కనుక నీయుద్ధము జరిగితీరును" అని పలికి యాదోషము తొలగుటకై శివుని గూర్చి తపము చేసెను. కశ్యపునికి శివుడు ప్రత్యక్షమై "ఇంద్రోపేంద్రు లెప్పటివలె నుందురు. కాని - పారిజాతమును కృష్ణుడు గొంపోయి తీరును." అని చెప్పగా కశ్యపుడు కలత బాసి స్వర్గమునకు బోయెను.

తాను మృగయావినోదార్థము రైవతకాద్రికి వెడలుచున్నట్లు ప్రకటించి, యామరునాడే శ్రీకృష్ణుడు సాత్యకితో గరుడారూఢుడై నందనవనమున ప్రవేశించెను. ఒకరథముపై ప్రద్యుమ్నుడు శ్రీకృష్ణు ననుసరించెను. అనేకశస్త్రాస్త్రములు ధరించిన దేవవీరులు చూచుచుండ గానే కృష్ణుడు పారిజాతమును పెకలించి, గరుడనిపై నుంచెను. ఆసుర తరువు శ్రీకృష్ణననుసరించెను. వనరక్షకులవలన నీవిషయ మెఱిగిన యింద్రు డైరావతము నెక్కి వచ్చి సురపురద్వారమున కృష్ణుని చూచి "కృష్ణా! యే మిది?" యన్నాడు. ఉపేంద్రు డింద్రునికి నమస్కరించి "సత్యభామవ్రతమునకై యీతరువును గొంపోవుచున్నాను" అన్నాడు.

"నీగదతో నందకముతో నన్ను నొప్పించి యాపిమ్మట నీ వృక్షమును గొనిపొమ్ము." అన్నాఁ డింద్రుడు.

ఇంద్రుఁ డట్లు పలుకుచుండగనే తనవాడిబాణముల నింద్రుని మీఁదను, నైరావతముమీఁదను శ్రీకృష్ణుడు ప్రయోగించినాడు. అంతలో ప్రవరుని శైనేయుడును, జయంతుని ప్రద్యుమ్నుడును డీకొని ఘోరముగా పోరిరి. ఐరావతమును గరుత్మంతుడు తాకినాడు. అట్లు పోరుచు వారందఱును పారియాత్రపర్వతమును జేరుకొనగా నాపర్వత మార్తనాదము చేసినది. అది విన్న శ్రీకృష్ణు డాపర్వతమున కొంత భాగముమాత్రమే పుడమిపై నున్న దని గమనించి యాగిరిని విడిచి యాకాశమున కెగురు మని గరుడని కాజ్ఞాపించి, ప్రద్యుమ్నుని పిలిచి, "ప్రద్యుమ్నా! నీవు వెంటనే ద్వారకకు పొమ్ము. ఇంద్రుని జయించి నేను రేపు వత్తు నని యుగ్రసేనునికి చెప్పుము. దారుకుడు రథము సిద్ధము చేసి తెచ్చునట్లు చూడుము" అని చెప్పి యాప్రద్యుమ్నుడు తెచ్చిన రథము నధిరోహించెను. అపుడు శైనేయుడును, ప్రద్యుమ్నుడును గరు డనిపై నెక్కి పోరుచుండగా సూర్యు డస్తమించుటచే పారియాత్రపర్వతము చెంతనే యింద్రుడును, ఆపర్వతమునందు కృష్ణుడును నారాత్రి విడిది

చేసిరి. అంతలో దేవర్షిగణములును సిద్ధులును సాధ్యులును ఆదిత్యరుద్ర గణములును, అదితికశ్యపులును వచ్చిరి.

ఆపారియాత్రమునకు కృష్ణుడు వరము లిచ్చి, గంగోదకము లందు స్నాన మాడి, బిల్వోదకములతో శివుని పూజింపగా శివుడు ప్రత్యక్షమై "ఓకృష్ణా! నీ వవధ్యుడవును, నజేయుడవును నయ్యెదవు. ఇందలిదేవుడు బిల్వోదకేశ్వరు డని పిలువబడును. ఇచటిగంగ "అవింధ్య" యనుపేర ప్రసిద్ధి నందును. బ్రహ్మవరగర్వితులై యీ పర్వతశిఖరమున నున్నదానవులను నీవు సంహరింపుము" అని చెప్పెను.

ఆబిల్వోదకేశ్వరునియనుగ్రహ మందినకృష్ణుడు రథ మెక్కి యుద్ధమునకు వచ్చి రథము నెక్కి వచ్చినయింద్రునితో భయంకర యుద్ధ మొనరింపగా నెన్నో భయోత్పాతములు పొడమినవి. అంత నారణభూమికి నదితికశ్యపులు రాగా నింద్రోపేంద్రులు రథములు దిగి వచ్చి నమస్కరించిరి.

"స్వల్ప మైనవస్తువునకై మీ రిట్లు దారుణముగా రణ మొనరించుట నాబిడ్డ లైనమీకు తగదు. మాపై మీకు గౌరవ మున్నచో మీ రీయుద్ధము నాపుడు." అన్నది దేవమాత యదితి. ఇంద్రోపేంద్రు లంతట నాయుధములు పారవేసి యామెయానతిని పాలించి, యదితికశ్యపులతో స్వర్గమున కేగిరి. శచీదేవి యత్తమామలను పూజించినది.

"కృష్ణా! పారిజాతమును భూలోకమునకు గొంపోయి సత్య భామవ్రతము పూర్తి కాగానే స్వర్గమునకు జేర్పుము" అని యదితి చెప్పగా "సరే" యని కృష్ణు డతిదికశ్యపులకును, నింద్రునికిని నమస్కరించి, ద్వారకకు బయలుదేరగా, శచీదేవి కృష్ణునిభార్యల కెన్నో కానుక లంపినది.

శ్రీకృష్ణు డాకానుక లన్నింటిని గైకొని రైవతకపర్వతమును జేరి యచ్చట పారిజాతము నుంచి ద్వారకకు సాత్యకిముఖమున వార్త నంపెను. పురమందలిపూరవులును, రాజులును, బంధువులును, కుమారు లును సాత్యకిచే కృష్ణుడు పంపినవార్త విని వచ్చిరి. ప్రద్యుమ్నుడు గరుడారూఢుడై పారిజాతమును ద్వారకకు దెచ్చెను. ఆవృక్షము సమస్తరోగములను, అంగవైకల్యములను, వృద్ధాప్యమును బోగొట్టుచు తనసుగంధముచే నందఱకు నింపు గొలిపినది. సత్యభామ పెరటిలో నాట బడినయాతరువు కామరూపముతో నెన్నో రూపము లందుచు కృష్ణుని కానంద మొసగినది. ఆవృక్షమువలన సంతుష్టయైనసత్యభామ పుణ్యక వ్రతము చేయుప్రయత్నములో వలయువస్తువులను సేకరింపసాగినది. శ్రీకృష్ణునిసంకల్పమాత్రమున నారదుడు ప్రత్యక్షము కాఁగా నాదేవర్షిని గంధమాల్యాదులచే పూజించి కృష్ణుడు విందు పెట్టినాడు.

శ్రీకృష్ణునిమెడలో పూలమాల వేసి, సత్యభామ ఆయనను పారిజాతవృక్షమునకు కట్టివేసి, కృష్ణునానుమతితో నతనిని నారదునికి సువర్ణపర్వతముతో సహస్రధేనువులతో దాన మిచ్చినది.

ఎంతో సంతోషముతో నారదుడు కృష్ణుని చూచి "స్వామీ! నీ విప్పుడు నావాఁడవు కావున నేను చెప్పినట్లు నడచుకొనవలె" నని పరిహాసముగా పలికి, "నీ విచ్చట నుండుము – నేను వెళ్లెదను" అని కృష్ణునిగళమునందలిపుష్పహారమును దొలగించుచు, కపిలగోవును వత్సముతోబాటు నిష్క్రయార్థము పంపు మనుచు నెన్నో విధములుగా వినోదించెను. కృష్ణుడు నారదుడు తనకు చెప్పినట్లెల్ల వర్తించి, నారదు నికి కోరినవరము లిచ్చెను.

నారదునియానతి శిరసా వహించి సత్యభామ తాను చేయు పుణ్యకవ్రతమును జూడ రమ్మని కృష్ణునిపదారువేలస్త్రీలను ఆహ్వా నించి, శచీదేవి పంపినకానుకల నందఱకు నిచ్చినది. శ్రీకృష్ణునియాహ్వా

నము నందుకొని కుంతీ ద్రౌపదీ సుభద్రల దోడ్కొని పాండవు లరుదెంచిరి. కృష్ణుడర్జునునితో క్రీడావినోదముల నానందముగా గడపెను. ఒక సంవత్సరము గడువగనే కృష్ణుడు స్వయముగా పారిజాతమును స్వర్గమున చేర్చినాడు.

అంతట నదితి తన్ను జూడ వచ్చినయాయింద్రోపేంద్రులను జూచి "సోదరభావముతో మీ రిద్దరు నెల్లప్పుడును మెలగుడు" అని కోరగా వా రందుల కంగీకరించిరి. కృష్ణుడు పదిరోజులతరువాత తాను చేయబోవు రాక్షసవధకు జయంతప్రవరులసహాకారము నర్థింపగా నింద్రుడు "వల్లె" యన్నాడు. ఇంద్రోపేంద్రులసఖ్యముతో కథ సుఖాంతమై వా రిరువురు నొకరి నొకరు వీడుకొనిరి.

ఇది సంస్కృతహరివంశమునందలిపారిజాతాపహరణకథా సంగ్రహము.

# నందితిమ్మనగారిపారిజాతాపహరణ కావ్యకథాసంగ్రహము

హరి నరకాసురుని గెలిచి యాతనియింట నుండినయచ్చరల కులమునకుఁ జెందినపదారువేవురు లలనామణులను నారదునిపంపున బెండ్లాడి వారితోను, అష్టమహిషులతోను క్రీడించుచు సౌఖ్యాబ్ధి నోలాడుచుండెను. అందఱిని సమానముగఁ జూచియు, రుక్మిణీసత్యభామలను మన్నించి యెక్కువ చన విచ్చుచుండెను. ఎవరికి వారే కులమును, రూపమును మగనికూరిమియుఁ గలదాన నని తలంచునాయిద్దరు సవతులమనసులలో రవరవలు పొడమినవి.

ఒకనాడు కృష్ణుడు రుక్మిణితో ద్యూతకేళి నుండగా నటకు నారదుడు వచ్చెను. కృష్ణుడు రుక్మిణితో మునికి నెదు రేగి సత్కరించెను. నారదుడు శ్రీకృష్ణునియవతారములను ప్రశంసించి, తాను

స్వర్గమునుండి తెచ్చినపారిజాతపుష్పమును మిన్నేటిపసిండినెత్తమ్మిచిగురుటాకునం బొదివి యా శ్రీకృష్ణుని కిచ్చెను.

"ఇది భోజాత్మజ కిచ్చినచో సాత్రాజితి కినుక వహించునేమో - ఆమె కీపూవును బంపినచో నీరుక్మిణి నెల్లిదము చేసిన ట్లగునేమో" యని డోలాందోళితమనస్కుఁడై నకృష్ణుఁడు నారదునికను సన్నచే నాపుష్పమును చెంత నున్నరుక్మిణి కిచ్చెను. ఆపారిజాతమును దనకొప్పున జెరివికొన్నరుక్మిణి వింతసోయగముతోఁ బ్రకాశించెను.

అపుడు నారదు డాపారిజాతప్రసూనమహిమను వర్ణించి, రుక్మిణిని జూచి "శ్రీహరి సత్యభామకనుసన్నలఁ ద్రిమ్మరు నని విందును కాని - ఈయనకు నీయెడఁ గలగౌరవ మింకెందును గానను. ఇంతటివిలువగలపుష్పమును నీకుఁ గాక మఱియెవ్వరికైన నిచ్చెనా? చక్కనిదాన నని, యెలజవ్వని నని, పేరెక్కినదాన నని, పతి నాకను రక్తుఁ డని, నిక్కుచు, విఱ్ఱవీఁగుచు, సవతులను గణింపనిసత్య యీవిషయము చూచినబోఁటులు విన్నవించినచో స్రుక్కకుండునా? ఈపారిజాతసుమము ధరించినమొద లొకసంవత్సరముమాత్రము నీకడ నుండి మరల పారిజాతతరువున కరుగును." అని చెప్పగా విని, యానారదుని మాటలును, నచటివృత్తాంతమును సఖీజనులు తమతమదేవేరులకు విన్నవించిరి. మానవతి యైనసత్యభామతక్క తక్కినవా రందఱు నెట్లో సరిపెట్టుకొని యూరకుండిరి.

సత్యభామ తనశృంగారవనములో చంద్రకాంతశిలావేదికపై కూర్చుండి, దక్షిణాంసచూచుకనయనప్రకంపగుణసూచనలకు బెదరి, ప్రాణనాథు డింకొకచపలాక్షిని గూడి తన్ను నొల్లనిచెయ్దము లేమి చేసెనో యని శంకించుచుండగా నామెచెలికత్తె వచ్చి రుక్మిణీసౌధవృత్తాంతము నంతటిని పూస గ్రుచ్చినట్లు చెప్పి, తక్కినసవతు లందఱును మచ్చరము విడిచి రుక్మిణిని భజించుచున్నా రనియుఁ దెలుపగా

నామానవతి తనయందు లేనిప్రేమను నటించి తననాథు డైనకృష్ణుడు తన్ను మోసగించె నని యెంచి, ప్రేటు వడ్డయురగాంగనవలె, నేయి వోయగా భగ్గన దరికొన్నభీషణహుతాశనకీల యనునట్లు లేచి, కన్నె లెఱుపెక్కగా మాసినచీర గట్టికొని మానముతో నిరస్తభూష యై కోపగృహమున కేఁగి మానక్రోధముచే కుమారిలసాగెను.

సత్యభామతో నామెచెలికత్తె యేమేమి కల్పించి చెప్పెనో యని కలవరపడుచు, శ్రీకృష్ణుడు ప్రద్యుమ్నుని నారదునికడ నుంచి, తాను తత్తరపాటుతో సత్యభామసౌథమునకు వచ్చెను. చిన్నవోయిన నగరును జూచి యనుమానించుచు కృష్ణుడు కోపగృహమున కేఁగి సత్యభామకు విసరుచున్నచెలికత్తెనుండి తాళవృంతమును దాను గైకొని విసరుచుండగా పారిజాతకుసుమాగతనూతనదివ్యవాసనలకు విస్మయ మంది సత్యభామ ముసుఁగు దొలగించుకొని సంభృతతాలవృంతుఁ డైనకాంతుని జూచి తల వాల్చి మగుడ ముసుఁ గిడుకొన్నది. ఆమె చెక్కుల దిగజాఱుబాష్పకణములను జూచి జాలిపడి యనునయించుటకై కృష్ణుడు చేసినప్రయత్నము లన్నియు విఫలము కాఁగా కృష్ణు డామెపాదములకు ప్రణమిల్లగా నామె వామపాదముతో కృష్ణునిశిరమును దొలఁగఁద్రోసినది. అంతట కృష్ణునిమెయి గగుర్పొడువగా – "నెయ్యపుఁగినుకతో తాఁచినను దాసుడ నైననా కిది మన్ననయే. మత్తనుపులకాగ్రకంటకవితానము సోకి నీపదపంకజము నొచ్చు నని నే నందును. ఓయరాళకుంతలా! యిఁకనైన నల్క మానవుగదా" యని కృష్ణుడు ప్రార్థేయపడెను. సత్య జంకెననెఱిచూపు చూచి కృష్ణుని పలు తెఱగుల ఎత్తిపొడిచి యింక మాటాడజాలక కలకంఠవధూకలకాకలీ ధ్వనితో నేడ్చెను. కృష్ణు డామెను గౌఁగిటఁ జేర్చి బుజ్జగించి "ఓలలి తేంద్రనీలశకలోపమకైశికా! నే నుండగా లతాంతమాత్రమున కింత వంత నీ కేల? ఇంద్రు డెత్తివచ్చినను జయించి యాపారిజాతతరువునే తెచ్చి నీపెరటిచెట్టుగా నాఁటింతు" ననుటతో సత్యభామయలుక తీరినది.

సత్యాసౌధమునకు నామధ్యాహ్నము నారదుడు రాఁగా సత్యాకృష్ణు లతిథిసత్కారము లొనరించిరి. తనకు సత్యభామ నమస్కరింపగా "ఓకుటిలాలకా! నీమగఁడు తా నెంతటికార్యమైనను డించి నీకోరికలు ఘటించుగాక" అని నారదుడు దీవించెను.

"నారదా! నరకు డపహరించినకుండలములను నేను స్వయముగా వచ్చి యదితి కర్పింతు నని చెప్పుము." అని కృష్ణుడు నారదునికి వీడ్కోలు చెప్పెను. ఆ రేయి కృష్ణుడు సత్యభామసౌధముననే గడపెను.

ఆమరునాడు గరుత్మంతుడు వచ్చి శ్రీకృష్ణునికి నమస్కరింపగా కృష్ణుడు సత్యభామకు తాను చేసినవాగ్దానముప్రకారము పారిజాతమును భూమికి తెచ్చుటకై స్వర్గమునకు పోవ నున్నట్లు చెప్పెను. ఇంద్రునిపైఁ దన కున్నపూర్వవైరమును దలచి, ఆపగ తీర్చుకొనునవకాశము కలిగిన దని గరుడడు సంతసించెను. సత్యాకృష్ణు లధిరోహింపగా గరుత్మంతుడు వినువీధి కెగసినాడు. ఆప్రయాణములో నటనట విశేషములను సత్యభామకు వివరించుచు, మేరువును, సిద్ధవిద్యాధరగంధర్వులను, అమరావతిని కృష్ణుడు వర్ణించెను.

పరివారముతో వచ్చి ఇంద్రుడు కృష్ణునికి స్వాగతము నెఱపినాడు. ఇంద్రోపేంద్రు లొండొరులఁ గౌఁగిలించుకొనిరి. ఇంద్రునితో కృష్ణుడును, సత్యభామయు వెళ్లి, యదితిని సందర్శించి నమస్కరించిరి. కృష్ణు డామెకు తాను తెచ్చినకుండలముల నర్పించెను. కృష్ణునిదశావతారములను ప్రశంసించి అదితి సత్యాకృష్ణులను రెండునాళ్లు తమ కతిథులుగా నుండు డని కోరెను. ఇంద్రుడు చూపినవైజయంతమున నాయాలుమగలు విడిది చేసి ఆపిమ్మట నచ్చరలు కొలువగా నందనోద్యానమును జూడఁబోయిరి. అందు షడృతువులు నొకేసారి సాక్షాత్కరించినవి. కృష్ణు డాయారామవిశేషములను సత్యభామకు వివరించెను. ఆపిదప వారు పారిజాతవృక్షముకడకు వచ్చిరి.

“ ఇక నాలస్య మేల? ఈవృక్షమును నా కేళీవనమున నిలిపి నీప్రతిన చెల్లించుకొమ్ము ” అని సత్యభామ మగనితో పలికెను. కృష్ణు డట్లే యని నవ్వుచు నొకపూలగుత్తిని సత్యభామకు కర్ణావతంసముగా నిడి యామెతోఁ గూడి పుష్పాపచయ మొనరించెను. ఆమధ్యాహ్న వేళ సత్యతో, దివ్యాంగనలతో కృష్ణుడు స్వర్గంగలో జలక్రీడ లాడి యింద్రునిపురికి మరలి వచ్చెను. ఆరాత్రి వైజయంతమున గడపి సత్యాకృష్ణు లామరునాటియుదయమున నందనోద్యానమునకు వచ్చిరి. కృష్ణుడు పారిజాతవృక్షమును పెకలించి గరుత్మంతునిస్కంధమున నుంచగా నందనవనపాలకు లడ్డు వచ్చి “ఈపని నీకు మేలు కా ” దని కృష్ణునితో పలికిరి. వారికి సమాధానము చెప్పబోవుకృష్ణుని మాన్పి, సత్యభామ “ ఈపారిజాతతరువున కింద్రాణి యెవ్వతె? ఇంద్రు డెవ్వడు? తోడియిందిరను, కౌస్తుభమును అధిపుడై యెవ్వడు ధరించెనో యాతడే దీనినికూడ జేకొనుగాక. నే నిప్పుడు దీనిని నావిభునిచే నొడియించుకొని పోవుచున్నాను. మీశచీదేవి వీరపత్ని యగుచోఁ దన ప్రాణేశు డైనయింద్రుని బంపి సత్యభామావిధేయునిచే మరల దీనిని గ్రహించుటయే మేలు ” అన్నది.

సత్యభామగర్వోక్తులను వనపాలకులవలన విన్నయింద్రుడు కుపితుడై యామెగర్వము నడచి పారిజాతమును విడిపింతు నని శచీదేవికి చెప్పి, దిక్పాలురతో, నమరవీరులతో వచ్చి కృష్ణుని తాకెను. కృష్ణుని బాణవర్షమున కోర్వనిదిక్పాలకులకు ధైర్యము చెప్పుచు ఇంద్రుడు పోరగా నింద్రునిపెక్కేమును కృష్ణు డొకబాణముచే గూల్చెను. ఇంద్రు డేసినవజ్రమును కృష్ణుడు బంతివలెఁ బట్టుకొనెను. గంధర్వులును, విద్యాధరులును భయమున పరువెత్తిరి. ఇంద్రుడు కృష్ణునికి పాదాక్రాంతు డై తనయపరాధమును మన్నింపవేడెను. కృష్ణు డింద్రుని లేవనెత్తి “ నీయెడ నేయపరాధమును లేదు. నీమరద లీపారిజాతము కావలె నని కోరగా నేను దెచ్చితిని. నీసొమ్ము నీవే గ్రహింపుము. ” అని వజ్రాయుధము

నింద్రుని కిచ్చివేసి, పారిజాతతరువునుసైత మీయబోవగా నింద్రుడు శ్రీహరికి మ్రొక్కి "సర్వప్రపంచమును నీసొమ్మే. నీ వుర్వి నుండువఱకును పారిజాతమును నీకడనే యుంచుకొమ్ము." అని పలికి కృష్ణుని వీడ్కొలిపెను.

సత్యభామకు యుద్ధవార్తలను జెప్పుచు గరుడనిపై కృష్ణుడు పారిజాతముతో ద్వారకను బ్రవేశించెను. ఆవృక్షమహిమచే ద్వారకయందలివృద్ధులు సంప్రాప్తనవయౌవను లైరి. దరిద్రులు సంపన్నులైరి. అంగవికలు రంగవైకల్యము పోగా సంపూర్ణ మైనయారోగ్యము వడసిరి. కృష్ణుని ప్రశంసించి సత్యభామ తనమందిరారామమున పారిజాతతరువును ప్రతిష్ఠించి పూజించుచు కోరికలు సఫల మొనరించుకొనుచు కృష్ణునితో సుఖముండెను.

అంత నొకనాడు సత్యభామసౌధమునకు నారదు డరుదెంచి, యామెసౌభాగ్యమును ప్రస్తుతించి, పుణ్యకవ్రతమున కామెను బ్రేరేపించెను. పూర్వ మావ్రతమును గౌరియు, శచీదేవియు, నరుంధతి మొదలైనవారును నాచరింపగా చూచితి నని నారదు డావ్రతవిధానము నామెకు వివరించెను.

సత్యభామ పతిఅనుమతితో నావ్రత మారంభించెను. ఆవ్రతమును జూచుటకై ఆప్తులు, బంధువులు, మహీపతులు నరుదెంచిరి. కృష్ణునియానతిని శిరసా వహించి విశ్వకర్మ రైవతకాద్రిసమీపమున దానమంటపమును నిర్మించినాడు. శుభముహూర్తమున సత్యాసమేతుడైనకృష్ణుడు వ్రతదీక్ష వహించి, వ్రతోచిత మైనదానమును గ్రహించుటకు నారదుని సమ్మతింపజేసెను. ధౌమ్యాదిఋషులు ఋత్విజులుగా వచ్చిరి. నారదుడు చెప్పినప్రకారముగా ప్రాతఃకాలమున సత్యభామ స్నానము చేసి, యత్తమామలకును, భర్తకును నమస్కరించి, సవతులందరియిండ్లకును బోయి, స్వయముగా వారి నాహ్వానించి, ప్రతిదిన

మును పదివేవురుపేరటాండ్ర నర్చించి, చైత్రశుద్ధనవమి మొదలుగా నొకనెల పుణ్యకవ్రతము చేసినది.

ఆవ్రతమును జూచుటకై రుక్మిణి తనమోమున కృతకవికాస మచ్చుపడగా పదారువేవురుసవతులతో వచ్చినది. పాండవులును ఆవేడుక చూడ వచ్చిరి. సత్యభామ కృష్ణునితో దానమంటపమునకు వచ్చి, పారిజాతవృక్షమునకు ప్రదక్షిణ మొనరించి నారదుని శాస్త్రోక్తముగా నర్చించెను.

ఆచారధురీణుడును, అధ్యయనసంపన్నుడును, శుభాకారుడును, శాస్త్రరహస్యజ్ఞుడును, శాంతిదయాపరతంత్రుడును నైనవిప్రునికి ధారోదకపూర్వకముగా సత్యభామ పారిజాతముతోబాటు తనప్రాణేశ్వరునికూడ ధారవోసి, ఆవిప్రుడు కోరినయర్థము లిచ్చి భర్తను మరల గ్రహింపవలయుట యావ్రతనియమము. ఆనియమమును సత్యభామకు నారదుడు జ్ఞాపకము చేయగా సాత్రాజితి నాథునివంక జూచినది. "ఆగమోక్తము కావున విచారింపక ధారవోయు" మని కృష్ణుడు ప్రోత్సహింపగా సత్యభామ కృష్ణునికాంచనాంబరాంచలమును క్రొవ్విరుల మాలతో పారిజాతవృక్షమునకు కట్టి, గర్గు డనుముని సంకల్పము చెప్పుచుండగా దక్షిణతో సురతరువును, ప్రాణేశ్వరునిగూడ నారదునికి దానమిచ్చినది. ఆపిదప తనయాభరణము లన్నియు మూల్యముగా చెల్లించి, నారదునినుండి తనభర్తను మరల గైకొని సవతులకు వాయనము లిచ్చినది. నారదుడు కృష్ణుని సంస్తుతించి యథేచ్ఛగా వెడలిపోయెను. కృష్ణుడు మిత్రులతో ద్వారకకు వచ్చి, పారిజాతతరువునుండి లభించిన భూషణావళులతో నాహూతు లందఱిని సత్కరించి పంపి, సౌఖ్యరసైకలోలు డై నిరంతరము కాలము గడపుచుండెను. ఈవిధముగా తిమ్మనగారు రచించినపారిజాతాపహరణకథ సమాప్త మైనది.

# 6. పారిజాతాపహరణమునకు హరివంశముతోడియనుబంధము

పారిజాతాపహరణకథ సంస్కృతమున విష్ణుపురాణములోను, బ్రహ్మపురాణములోను, పద్మపురాణములోను, భాగవతమునందును, బ్రహ్మవైవర్తపురాణమునందును, హరివంశములోనునున్నది.

సీ. "హరివంశకథ లెల్ల నానుపూర్విగ నిట్లు
        విని కృతార్థుఁడ నైతి మునివరేణ్య!
ఆదానవారాతి యమరులఁ బ్రోవంగఁ
        బూని యాయదువంశమున జనించె
నతఁడు క్రమ్మఱ వారి కాధార మగుపారి
        జాతంబు పుడమి కేరీతిఁ దెచ్చె?
ననుమతి యిచ్చిరో యావేల్పు లొండేని
        బలిమిఁ జేకొనియెనో పాడి దొఱఁగి!
తే. గీ. తెలియ నాసతి యిమ్మ సందియము దీఱ
        వినఁగ వేడుక య య్యెో సవిస్తరముగ"

అని జనమేజయజనవల్లభు డడుగగా వ్యాసమునిశిష్యుడైన వైశంపాయనుడు హరివంశమునందలిపారిజాతాపహరణకథను జెప్పినట్లు తిమ్మకవి కంఠోక్తిగా చెప్పినాడు. కనుక నందితిమ్మనగారిపారిజాతాపహరణకథకు సంస్కృతహరివంశముతోడిసంబంధ మెంతవఱకు కలదో తులనాత్మకముగా పరిశీలించి, సంస్కృతాంధ్రగ్రంథములమెఱుగుతఱుగుల నెత్తిచూపుప్రయత్న మీయధ్యాయమున చేయబడుచున్నది:–

వ్యాసభారతమును యథాతథముగా నాంధ్రీకరింపక యథోచితముగా తెనిగించిననన్నయాదులమార్గము ననుసరించి సంస్కృతహరివంశమునందలిపారిజాతహరణకథ నాధారముగామాత్రమే గ్రహించి,

తిమ్మనగారు తనకావ్యమును రచించిరి. కనుకనే సంస్కృతమూలము కథాకథనప్రధానము కాఁగా తిమ్మనగారిపారిజాతాపహరణము స్వతంత్ర తారమణీయ మైనరసమయప్రబంధముగా రూపు దిద్దుకొన్నది. కనుక హరివంశకథకును, తిమ్మనగారిపారిజాతాపహరణకథకును కొన్ని పోలిక లున్నను నెన్నో భేదములుకూడ చోటు చేసికొన్నవి.

కావున తెలుగుప్రబంధ మెంతవఱకు యథామూలకముగా నున్నదో, మూల మెందు ప్రపంచింపబడినదో, యెచ్చట త్యజింపబడి నదో, యెచట కుంచింపబడినదో, అన్యథాప్రకల్పన మెందు జరిగినదో, యమూలకముగా రచన మెందు సాగినదో, యందలియాచిత్యానౌచి త్యము లెట్టివో పరిశీలింతము: –

కన్నడమున రుద్రభట్టు రచించినజగన్నాథవిజయమే నంది తిమ్మనగారిపారిజాతాపహరణమునకు మూల మై యుండు నన్నవారివా దమును పూర్వపక్షముచేసి, తిమ్మకవి కన్నడములోనిజగన్నాథవిజయ మును చూచియైన నుండఁ డని సోపపత్తికముగా నిరూపించుచు సమీా క్షావ్యాసమును సమర్పించి డాక్టర్ చెన్నాప్రగడ తిరుపతిరావుగారు పిహెచ్. డి. పట్టము నందుకొన్నారు. సంస్కృతభాగవతమునందలి మూడుశ్లోకము లాధారముగా నంది తిమ్మన పారిజాతాపహరణమును రచించె ననియు, నీమొదలైనవాదములను డాక్టర్ పి. యశోదారెడ్డి గారు తమపారిజాతాపహరణపర్యాలోచన మనువిమర్శగ్రంథమున ఖండించియున్నారు.

'కన్నడాంధ్రమహాకవు లిరువురు పారిజాతహరణవృత్తాంత రచనావసరమునం దొకేమూలగ్రంథము నాధారముగాఁ గొనుటచే నక్కడక్కడ కొంతవిషయసామ్యము గోచరించుచున్నదే కాని

యయ్యది ఈయిరువురుకవులం దొకరి ప్రభావముచేతమాత్రము గా దః
చెప్పుట కెట్టిసందియము లేదు.' [1]

'పారిజాతాపహరణకథ మూలహరివంశమందే కల దనియు
నాకథయే జగన్నాథవిజయకర్త యైనరుద్రభట్టునకును తెలుగు పారిజా
తాపహరణకర్త యైననందితిమ్మనకును మూల మైన దనియును రూఢిం
గాఁ జెప్పవచ్చును' అని డాక్టర్ యశోదారెడ్డిగారు సోపపత్తికముగా
నిరూపించి యున్నారు.

ఆవాదము లన్నిటిని మరల నిక్కడ నేకరు వెట్టుట చర్విత
చర్వణ మగును.

## (a) యథామూలకత

"మమ్మ్మ షేన సపత్న్యాస్తు
తత్సౌభాగ్యగుణోదయం
సత్యభామా ప్రియా నిత్యం
విష్ణో రతులతేజసః
(65 అ - 49 శ్లో)

రూపయౌవనసంపన్నా
స్వసౌభాగ్యేన గర్వితా
అభిమానవతీ దేవీ
శ్రీతై్వ వేర్ష్యావశంగతా."
(65 అ - 50 శ్లో)

అను సంస్కృతశ్లోకములకు

1. పారిజాతాపహరణపర్యాలోచనము - పు. 83 – డాక్టర్ పి. యశోదారెడ్డి

తే. గీ. "వారిజోపల సౌందర్యవతియు మాన
వతియు మహనీయసౌభాగ్యవతియు నైన
సత్య ........."
(1 ఆ - 70 ప)

అనుననువాదముతో తిమ్మకవి సత్యభామాపాత్రమును పఠితలకు పరి
చయము చేసినాడు. ఈయనువాదము యథామూలకముగా నున్నది.

" అవగుంఠ్య యదా వక్త్రి
ముపధానే న్యవేశయత్
ఇద మంతర మిత్యేవం
తదా గత్వా జనార్దనః "
(66 అ - 12 శ్లో)

అనుహరివంశశ్లోకమునకు

" సత్రాజిత్తనయ ముసుం గిడి యుండఁగ " (1 అ - 107వ పద్యపాదము)

అని తిమ్మనగారు చేసినయనువాదము యథామూలకమైనది.

" కించా నాభరణం గాత్రం
సుగాత్రి ! తవ కథ్యతాం
చిత్రకస్థాన మాక్రాంతం
కస్మాద వరవర్ణిని ! "
(66 అ - 31 శ్లో)

అనుశ్లోకమునకు

ఉ. " ఇందునిభాస్య ! మైతొడవు లేల ధరింపవు ? " (1 ఆ - 115 ప)

అని యథామూలకానువాదము.

" పారిజాతకపుష్పాణి
యదీచ్ఛస్యతి కోపనే !

ప్రదా దాతాస్మి సుశ్రోణి !
సత్యే నైత ద్బ్రవీమితే "
(67 అ - 31 శ్లో)

" స్వర్గాస్ప్రదానయిత్వా
పారిజాతం ద్రుమేశ్వరం
గృహే తే స్థాపయిష్యామి
యావత్కాలం త్వ మిచ్ఛసి "
(67 అ - 32 శ్లో)

" పారిజాతపుష్పములను కోరుదువేని నిచ్చెదను. సత్యమునే చెప్పుచున్నాను. స్వర్గమునుండి పారిజాతవృక్షమును దెచ్చి నీ కిష్టమున్నంత కాలమును నీ యింట నుంచెదను " - అని పై శ్లోకములభావము.

తిమ్మకవి పై భావమును తనకావ్యమున

ఉ. " ఓలలితేంద్ర నీలశకలోపమ కైశిక ! యింతవంత నీ
కేల లతాంతమాత్రమున కేఁ గలుగన్ విను - నీకు దేవతా
కేళివనంబు సొచ్చి యనికిన్ బలసూదనుఁ ద్రెత్తి వచ్చినన్
దీలుపడంగఁ దోలి యిటఁ దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్. "
(1 ఆ - 135 వ పద్యము)

తే. గీ. వామలోచన ! నీకేళివనములోనఁ
జలువ వెదచల్లుచెంగల్వకొలనికెలన
సరసకర్పూరకదళికాతరులనడుమఁ
బెరటిచెట్టుగ నాఁటింతుఁ బెంపుఁ గనుము "
(1 ఆ - 136 ప)

అని కృష్ణుడు సత్యభామకు వాగ్దాన మొనర్చినట్లు మూలవిధేయము గానే రచించియున్నాడు.

" దధ్యాచ నారదం దేవః
స్నాతో దేవముని ర్నృప !

అభ్యాజగామ స్నానాంతే
మునిశ్రేష్ఠో మహోదధా ''
(67 అ - 38 శ్లో)

అన్న మూలశ్లోకమునకు

కం. " చనుదెంచెఁ గలహభోజన
మని రుక్మిణి వీడుకొల్పు మున్నిటిజలం
బున మజ్జనాదిమాధ్యం
దినకృత్యము లాచరించి నిష్ఠాపరుఁడై ''
(2 అ - 16 ప)

అని తిమ్మకవియనువాదము.

''తమాగతం నృపతే
సతాం గతి రధోక్షజః
సత్యయా సహధర్మాత్మా
యథావిధి అపూజయత్
(67 అ - 39 శ్లో)

పాదౌ ప్రక్షాళయం చక్రే
మునేః సాత్రాజితీ స్వయం
జలం దేవః స్వయం కృష్ణో
భృంగారేణ దదౌ తదా ''
(67 అ - 40 శ్లో )

అన్నపై రెండుశ్లోకములను

చ. '' అతనికి సత్యభామయు మురాసురవైరియు నాతిథేయస
త్కృతు లొనరించి యుండఁగ..........''
(2 అ - 17 ప)

అని తిమ్మకవి మూలవిధేయముగా ననువదించెను.

'సచ బాణసహస్రైస్తు కృష్ణో గజ మపాతిరత్
గరుడంచ మహాతేజా బలభి ద్ధరివాహనమ్'
(75 అ - 9 శ్లో)

కృష్ణు డైరావతమును, దేవేంద్రుడు గరుత్మంతుని బాధించినట్లు మాత్రమే పై శ్లోకమునందుండగా - తిమ్మకవి యాభావమునకు మెఱుఁగు పెట్టినాడు.

'తమద్భుత మబిస్త్వంచ మదకేలికలాభ్రజం
వృష్ట్వోత్తమం పశ్యతాంవై వృద్ధానామగమజ్జరా'
(75 అ - 55 శ్లో)

అనుదానిని, అంధులు దివ్యచక్షువు బొందినట్లును, రోగులు రోగ రహితులైనట్లును చెప్పిన 56వ సంఖ్యగలశ్లోకమును తిమ్మన యథాతథముగా ననువదించెను.

'యోఽయం సంకల్పయామాస గన్ధం హృద్యం సమ స్తథా
స తదైవ తమాజఘ్రౌ పారిజాతసముద్భవం'

అని 75వఅధ్యాయములో నున్న 59వశ్లోకమునుండి 68వశ్లోకమువఱకును నున్నశ్లోకములను తిమ్మకవి యథాతథముగా ననువదించెను.

'పుష్పదామావసజ్యాథ కణ్ఠే కృష్ణస్య భామినీ
బబన్ధ కృష్ణం సుభగా పారిజాతే వనస్పతౌ'
(76 అ - 5 శ్లో)

అని మూలములో నుండగా -

తే. గీ. 'పరమమునిమానసాలానబంధనమునఁ
గుదురుపడకుండుయాదవకుంజరుండు
వికచరాజీవనేత్రచే వేడ్కమీరఁ
గమ్మపూవులదండచేఁ గట్టువడియె ;
(5 అ - 80 ప)

అని మూలముకన్న వేయిరెట్లు మిన్నగా తిమ్మకవి రచించెను.

సత్యభామ ధేనుసహస్రమును, కాంచనమును, కృష్ణునికూడ ధారాపూర్వకముగా నారదునికి దానమిచ్చినట్లున్న 76వఅధ్యాయము లోని 6వశ్లోకమును, 'కేశవా! నీవు నావాఁడవు – సత్యభామ నిన్ను నాకు ధారాపూర్వకముగా దాన మిచ్చినది. నేను చెప్పినదెల్ల చేయుము' అని నారదుడు కృష్ణునితో నన్నట్లుగా నున్న 9వశ్లోక మును, తిమ్మకవి యథామూలకముగా ననుసరించినప్పటికిని –

సీ. 'మేళవించినవిసుమ్మీ దీనిమె ట్లని
మాంసలాంసంబున మహతిఁ జేర్చి
మిన్నేటిజలముసుమ్మీ తొలంకెడు నని
డాచేత మకరిషండలు వొసంగి
యిది జపోచితముసుమ్మీ జతనం బని
వలకేలఁ బద్మాక్షవలయ మిచ్చి
యీశానుఁ డిచ్చెఁజుమ్మీ మాకు నిది యని
శార్దూలచర్మంబుఁ జంకఁ జొనిపి

పొమ్ము పొ మ్మని యొకకొంత పోవఁ బోవ
రమ్ము ర మ్మని మరలఁ జేరంగఁ బిలిచి
కపటనటనాపరుం డైనకంసవైరిఁ
బరముని సవ్వటాలకుఁ బనులు గొనియె'
(5 ఆ - 86 ప)

అనుపద్యమును రసవంతముగా రచించినాడు.

'పరిహాసం బహువిధం కృత్వా మునివర స్తదా'

అని మాత్రమే (75 అ – 11 శ్లో) మూలమున నుండగా దాని నెంతో ప్రపంచించి పై సీసపద్యమును రచించినతిమ్మనగారికళాకౌశల మద్వితీయము.

## (b) మూలకుంచనము

హరివంశము - 65వయధ్యాయములో పారిజాతప్రసూన ప్రశస్తిని నారదుడు రుక్మిణీదేవికి వర్ణించి చెప్పుచు

'తాం నారద స్తథోవాచ
ముని ర్బ్రహ్మసుర స్తదా
తవై వౌపయికం పుష్ప
మేకం దేవి ! పతివ్రతే !

(65 అ - 18 శ్లో)

అని ప్రారంభించి

"త్రైలోక్యరత్నసర్వస్వ
మదదాద్య త్త వాచ్యుతః
జీవితాతిశయ స్తేన
త్వయా ప్రాప్తో హరిప్రియే !"

అని యున్న నలుబదిమూడవశ్లోకమువఱకును మొత్తము ఇరువదారు శ్లోకములలో వాకొనిన ట్లుండగా - తిమ్మకవి తనకావ్యమున పై విషయము నంతటిని కుదించి ఈక్రిందిపద్యములు రచించినాడు :-

సీ. "జలజాక్షి ! యిది పారిజాతప్రసూనంబు
నరులకు ధరియింప నరిదిసూవె !
పౌలోమి పార్వతి పద్మ పద్మజురాణి
యును శిరంబునఁ దాల్తు రనుదినంబు
హరిబహిఃప్రాణంబ వగుట నేఁ దెలుఁగంగ
వచ్చె నీ కిపు డిది యిచ్చెఁ గాన
వెలఁదుల పదియాఱువేవురలో నెన్న
సరి లేరు సౌభాగ్యగరిమ నీకు

తే. గీ. నీవు దాల్చినకతన నీపూవు నేఁడు
భాగ్యము వహించె నుచితోపయోగ్యవృత్తి

నీప్సితార్థంబు లొడఁగూర్చు నిది లతాంగి !
దీనిమహిమంబు చెప్పెదఁ దెలియ వినుము.
(1 ఆ - 58 ప)

కం. పరిమళము సెడదు వాడదు
పరువము తప్పదు పరాగభరభరితం బై
నిరతము జగదేకమనో
హర మగు నీకుసుమరాజ మంబుజవదనా !
(2 ఆ - 59 ప)

మ. అళినీలాలక ! నీవు నీపతి రహస్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు కల్పించును
జ్జ్వలదీపాంకుర మై రతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబుల్ తొలఁగింపఁగా సురటి యై రంజిల్లు నిచ్చాగతిన్.
(2 ఆ - 60వ పద్యము)

చ. అడిగినయంతలోన సరసాన్నములన్ సమకూర్చు నాఁకటన్
బడలిక జెందనీక యశుభంబు లడంచు, జగత్త్రయంబునం
బడయఁగరానిసర్వగుణభవ్యమును మ్మిది, దీనిఁ దాల్చి యి
ప్పడఁతులలోఁ గనుంగొను మపారమహామహిమానుభావముల్.
(2 ఆ - 61 ప)

చ. కువలయపత్త్రనేత్ర ! నెఱికొప్పున నీకుసుమంబుఁ దాల్చుటన్
సవతులు వచ్చి నీచరణ సారసయుగ్మము నాశ్రయింపఁగా
ధవుఁ డలు లేనికూర్మి జవదాఁటక నీపలు కాదరింపఁగా
నవిరళభోగభాగ్యమహిమాన్విత వై విహరింతు గావుతన్.
(1 ఆ - 62వ పద్యము)

కం. నెలకొని వేసవిఁ జలువయుఁ
జలివేళల నుష్ణగుణము సముచితభంగిన్
గలిగించు నీలతాంతము
కొలఁదులు చెప్పంగ నిచ్చక్రొత్తలుసుమ్మీ.
(1 ఆ - 63 ప)

కం. అలరుం బోఁడులలోపల
నలరుం బోఁడుములు నీకు నగ్గల మగుచున్
దలపూ వాడక యుండును
తలపూవు ధరించి వికచతామరసాక్షీ !

(1 అ - 64 ప)

ఉ. ఇన్నిదినంబులున్ సవతు లిందఱిలో నల సత్యభామకన్
సన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై యన విందుఁ గాని యో
కన్నియ ! నీయెడం గలుగుగారవ మెయ్యెడఁ జూచి కాన: లే
కున్న సమస్తదివ్యకుసుమోత్తమ మేరికినైన నిచ్చునే ?

(1 ఆ - 65 వ పద్యము)

ఉ. చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ బే
రెక్కినదాన నంచుఁ బతి యెంతయు నా కనుసన్నఁ బెంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య; యింతకున్
స్రుక్కక యున్నె నీమహిమ సూచిన బోఁటులు విన్నవించినన్ ?

(1 ఆ - 66వ పద్యము)

కం. ధరియించినమొద లోకవ
త్సరమాత్రము తావకీనధమ్మిల్లములో
నిరవుకాని మగుడ నివ్విరి
తరుణీ ! యలపారిజాతతరువున కరుగున్.

(1 ఆ - 67 ప)

అని తిమ్మకవి కుదించినాడు. దీనికి సంబంధించినవివరములు కొన్ని యీ క్రింద చూపబడుచున్నవి -

" బుభుక్షా వా పిపాసా వా
గ్లాని ర్వా ప్యథవా జరా
దేవవ ద్ధారయంత్యాస్తే
స్వచ్ఛందేన భవిష్యతి."

(65 అ - 29 శ్లో)

అన్నమూలశ్లోకభావమును తిమ్మకవి తనకావ్యమున

"అడిగినయంతలోన సరసాన్నములన్ సమకూర్చు ; నాఁకటన్
బడలికఁ జెందనీక యఖిలంబు లడంచు"

అని తెలుఁగు చేసి, యెన్నో మూలశ్లోకభావములను కుదించి

"జగత్త్రయంబునన్ బడయఁగ రానిసర్వగుణభవ్యముసు మ్మిది"

యనుమాటలలో నిమిడ్చినాడు.

"సపత్ని స్త్రే గుణోపేతే
సర్వాః సర్వేశ్వరప్రియే
అవమానావసేకేన
త్వయా సిక్తాద్య భామిని"
(65 అ - 37 శ్లో)

అనుశ్లోకభావము నంతటిని

"ఇప్పుడఁ తులలోఁ గనుంగొను మపారమహామహిమాను భావముల్"

అనునొక్క (పద్య) పాదములో సంతరించుట తిమ్మనగారి నేర్పు.

"షోడశస్త్రీసహస్రాణామ్
మధ్యే త్వమ్ ఖలు వర్తసే
అద్యేష్టామ్ వాసుదేవస్య
వేద్మి త్వామ్ భోజనందిని !
(65 అ - 36 శ్లో)

"అద్యాహమవగచ్ఛామి
సర్వథా సర్వశోభనే
ఆత్మాద్వితీయః కృష్ణస్య
భోజే త్వ మితి భామిని !"
(65 అ - 42 శ్లో)

అనుపై రెండుమూలశ్లోకములలో నమితముగా నున్న విషయమును తెలుగులో "హరిబహిః పాణింబు వగుట నేఁ డెఱుఁగంగ వచ్చె నీ కిపు డిది యిచ్చెఁ గాన" అని యొక్క సీసపద్యపాదములో తిమ్మకవి కుదించి పాఠకులకు విసుపు జనింపకుండఁ జేసినాడు.

'సంవత్సరపరం కాలం
కాలజ్ఞే! గుణసమ్మతే
ఈప్సితా నపి గంధాంశ్చ
దదాతి వదతామ్ వరే
(65 అ - 21 శ్లో)

పూర్ణే సంవత్సరే దేవి!
పుష్ప మేతత్ తవాంతికాత్
నిర్వర్త్స్యతే తరువరం
సమయే న ప్రయాస్యతి "
[65 అ - 31 శ్లో]

అని మూలములో పాడినదే పాటగా చెప్పినదానిని తెలుగున

కం. " ధరియించినమొద లొకవ
త్సరమాత్రము తావకీనధమ్మిల్లములో
నిరవుకొని మగుడ నివ్విరి
తరుణీ! యలపారిజాతతరువున కరుగున్ "
[1 అ - 67 వ పద్యము]

అని తిమ్మన యందముగా చెప్పినాడు.

"తవైవౌపయికం పుష్ప
మేకం దేవి! పతివ్రతే!
[65 అ - 18 శ్లో]

అలంకృతం పుష్ప మేతత్
సంసర్గా త్తవ సర్వథా
అత్యర్హా చ తామే త్వ
మేతత్పుష్పా ద్ధృతవ్రతే "
[65 అ - 19 శ్లో]

అని యీరుశ్లోకపాదములలో మూలమున నుండగా

"నీవు దాల్చినకతన నీపూవు నేఁడు
యోగ్యత వహించె నుచితోపయోగ్యవృత్తి"
[1 ఆ - 68 వ పద్యము]

అని తిమ్మనగారు రెండు తేటగీతిపాదములలోనికి కుదించుట గమనింపఁ దగినది.

"కిం చానాభరణం గాత్రం
సుగాత్రి ! తవ కథ్యతాం
చిత్రకస్థాన మాక్రాంతం
కస్మాద వరవర్ణిని !"
[66 అ - 31 శ్లో]

పై హరివంశశ్లోకములోనినాలుగుపాదములభావమును కుదించి

"ఇందునిభాస్య ! మైతొడవు లేల ధరింపవు ?"
[1 ఆ - 115 ప]

అని నాలు గేనాలుగుమాటలలో పొదిగినతిమ్మకవి మాటలు పొదుపుగా వాడునలవాటు కలవాడు ! అనవసర మైనమాట ఆయనలేఖినినుండి జాఱదు.

హరివంశము కేవలము పురాణఫక్కికము. కావ్యమర్యాద సద్యోహృద్యమును సహృదయైక వేద్యమును నైనపదార్థము నందించుట - అనగా - రసోత్పాదన చేయుట. ఆనందవర్ధనుఁ డన్నట్లు -

"రస ఏవ వస్తుతః ఆత్మా" [1]

అనగా రసమే కావ్యాత్మ. ఐనను ఆరసోత్పత్తికి ఆలంబనమును ఉద్దీపనమును నైనసామగ్రిని సజ్జీకృతము చేయవలె నన్న నొకకథాశరీరము నాశ్రయింపక తప్పదు. కనుకనే -

1. ఆనందవర్ధనుడు - ధ్వన్యాలోకము

"ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితః" 1

అని భరతమునివక్కణ. కనుకనే తిమ్మకవి ఆప్రాక్తనగాథలో రసగ్రంథులు విస్ఫారితము చేయుట కున్నయవకాశములను వినియోగించుకొను దృష్టితో మూలకథను ప్రపంచించినాడు. యథార్థమునకు - ఇతివృత్తనిర్వహణములో ఆరితేరినవాఁడే మహాకవి. అది యొకశిల్పము కదా !

## (C) మూలప్రపంచనము

"నారదాఖ్యో యయౌ మునిః"

అని మాత్రమే హరివంశమునందలి 65వయధ్యాయములోనిపండ్రెండవశ్లోకమున నుండగా – తిమ్మకవి

సీ. "సరిగమపధనిస సప్తస్వరంబుల
 మహతి నభోవాయునిహతి మొరయ
భాగీరథీపయఃపరిపూర్ణమణికమం
 డలువు హస్తంబునఁ జెలువు మిగులఁ
బ్రణవమంత్రావృత్తిపావనస్ఫటికాక్ష
 వలయంబు కర్ణశష్కులిక వ్రేల
సమరస్మృత్యోచితచమరవాలంబును
 గక్షపాలయు భుజాగ్రమున మెఱయ

తే. గీ. "దేహకాంతు లకాలచంద్రికల నీన
 జడలు మోక్షద్రుపల్లవశంక సేయ
 గగనముననుండి వచ్చె నాకస్మికముగ
 నారివేరంపుఁదపసి ద్వైత్యారికడకు."

అని తనపారిజాతాపహరణకావ్యమున ప్రథమాశ్వాసములోని 44 వ పద్యములో వర్ణించి, ఆ వచ్చిననారదునిస్వరూపస్వభావాదుల నక్షరరూపమున పఠితలమనఃఫలకములపై చిత్రించినాడు.

1. భరతముని – నాట్యశాస్త్రము

శబ్దమాకాశమున పుట్టును. వ్యక్తివేగముకన్న ధ్వనివేగము హెచ్చు. ఆకాశమార్గమున భువి కవతరించునారదుఁడగుపించుటకన్న ముందుగా నభోవాయునిహతిచే మహతినుండి వినదించుసప్తస్వరము లును వినిపించుచున్నవి. ఆకాశమున నేగువిమానము కంటికగుపించు టకుముందే దానిధ్వని వినిపించుట సహజము. ఆధ్వనివేగ మట్టిది. అట్లే నారదాగమనముకన్న నారదునిరాకను సూచించునాయనవీణా నినాదము ముందుగా కర్ణగోచర మగుటచే నావిషయమును ముందు గానే చెప్పుట యిందలి విశేషము. ఇక భాగీరథీపయఃపరిపూర్ణమణి కమండలువు – దీనిని నారదుడు భూలోకమునకు వచ్చునప్పుడెల్ల తెచ్చి కొనువాడు. వీణతరువాత నాయనకు ముఖ్యమైన దీకమండలువు. దివి నుండి భువికి దిగుచున్ననారదునికన్న ముందుగా ద్వారకావాసులకు కనిపించినది క్రిందికి చాచియున్ననారదునిచేత నున్నకమండలువే. ఆయన మఱింత క్రిందికి దిగినకొలఁది నాయనకర్ణశష్కులికను వ్రేలాడు స్ఫటికాక్షవలయము భూలోకవాసులకు స్పష్టముగా నయనగోచర మైనది. కనుకనే రెండవపాదమున కమండలువు వర్ణితమైనతరువాతనే జపమాలప్రసక్తి వచ్చినది. సరే. సురలోకమాని యెంతవఱకును దిగ వలెనో యంతవఱకును దిగినాడు. ఆయన తెచ్చికొన్నసమరసృత్యో చితచమరవాలమే ఆయన "అరివేరంపుఁదపసి" యనువిషయమును చెప్పకయే చెప్పుచున్నది. వ్యక్తులను మఱింతసన్నిహితముగా చూచి ననే వారిస్వభావము స్పష్ట మగును. నారదుడు కృష్ణునికి దగ్గరగా రాగానే ఆయన కలహాశనుఁ డని స్పష్ట మైనది. కనుక నీవర్ణనము సాభిప్రాయ మైనది.

రుక్మిణీప్రియుఁ డనియో – యుపేంద్రు డనియో వర్ణింపక దైత్యారిగా కృష్ణుని వర్ణించి, కృష్ణుని కింటను (సత్యభామతోను) బయటను (దేవేంద్రునితోను) రాబోవునిష్ఠురమును, విరోధమును తిమ్మకవి సూచించుట గమనింపదగినవిశేషము. తిమ్మనగారియీా పద్యము మూలమునకు మెఱుగు పెట్టినది.

ఈ సీసపద్యముపై తిమ్మకవి తనదృష్టి నెంతగానో కేంద్రీకరించినాడు. పై పద్యక్రమము - వీణ, కమండలువు, జపమాల - వీనిలో వరుసగా నాకొక్కటే తనదాసుఁడైనకృష్ణుని కిచ్చి నారదుడు

సీ. " మేళవించినవిసుమ్మీ దీనిమె ట్లని
మాంసలాంసంబున మహతిఁ జేర్చి
మిన్నేటిజలముసుమ్మీ తొలంకెడు నని
డాచేత మణికమండలు వొసంగి
యిది జపోచితముసుమ్మీ జతనం బని
వలచేతఁ బద్మాక్షవలయ మిచ్చి "
[పారిజాతాపహరణము. 5 ఆ - 86 పద్యము]

కంసవైరిచే పరమముని నవ్వూటాలకై పనులు గొనినాడు. అప్పుడు - మొదట వచ్చినప్పుడు నారదుడు " ఆరివేరంపుఁదపసి ". ఆకలహము పెట్టుట యైనపిమ్మట - పుణ్యకవ్రతవేళ - పరమమునిగా గోచరించి, కపటనటనాపరు డైనకంసవైరికి యజమానిగా నటించుచు నవ్వూటాలకై శ్రీహరిచే పనులు గొనుచున్నాడు. ఇక నిప్పుడు కయ్యముతో నిక్కడ పని లేదు కనుక నిదివఱకు తెచ్చినసమరనృత్యోచిత చమరవాలమునకు బదులుగా నిప్పుడు శార్దూలచర్మమును దెచ్చుకొన్నాడు. కనుక

" ఈశానుఁ డిచ్చెఁ జుమ్మీ మాకు నిది యని
శార్దూలచర్మంబుఁ జంకఁ జొనిపి "

నారదుడు కృష్ణునితో నాట లాడినట్లు తిమ్మన రచించెను.

ప్రథమాశ్వాసమున రచించినయాసీసపద్యమునకును, పంచమాశ్వాసమున రచించినయీసీసపద్యమునకును నింతగా పొంతన కుదిర్చిన తిమ్మకవి తాను చేసినప్రతివర్ణనమును దూరదృష్టితో సార్థకపదవిన్యాసముతో రచించుట ఆయనకళాకౌశలమునకు నిదర్శనము.

" సోఽర్చితో వాసుదేవేన
మని రర్చ్యతమః సతాం
పారిజాతతరోః పుష్పం
దదౌ కృష్ణాయ [భారత] "

అనిమాత్రమే (65 వ యధ్యాయమున పదునాలుగవశ్లోకము) మూలములో నుండగా తిమ్మకవి.

"నిజవాసనాబిరుదగాథాకథనవందిబృందాయమానేందిందిరంబును, నుచితోపయోగజనితానందబాష్పసందోహశంకావహమకరందబిందుతుందిలంబును, నిఖిలమనోరథప్రదానకీర్తిశంకాకరవిశదప్రభానిచుళితంబును నగుపారిజాతంపుఁగ్రొన్నన "

యని యాపూవున కెన్నో విశేషణములను మూలములో లేనివానిని చేర్చి యాపుష్పోత్కర్షను గుబాళింపజేసినాడు. ఈవిశేషణములందలి యౌచిత్యమును, లాలిత్యమును సహృదయహృదయరంజకములు గదా! ఆపారిజాతపుష్పము తాకిన కందిపోవునంతటిసౌకుమార్యము కలది. పైగా – సమర్పించుచున్నది మహావిష్ణువునకు. కనుక మిన్నేటిపసిండి నెత్తమ్మిచివురుటాకునఁ బొదివి నారదుడు భగవానుని కర్పించినట్లు తిమ్మనగారు కల్పించుట గమనింపదగినది.

సంపెంగపువు లమ్మువాఁడాపూవులు వాడిపోకుండ శీతలవాతావరణమున నుండుటకై యరటియాకున నుంచి యిచ్చుట మనము చూచుచున్నాము. అట్లే ఆపారిజాతపుష్పము పరిమళము చెడనిదియు వాడనిదియు నైనను, వట్టిపూవుమాత్రమే యొసంగక మిన్నేటి నెత్తమ్మి చివురుటాకున పొదివి యిచ్చుట యాపూవువిశిష్టతను, నారదునికి కృష్ణునియం దున్నభక్తిని ప్రకటించుచున్నది.

" త్రైలోక్యరూపసర్వస్వమ్
నారాయణమనోహరా

ఋఋభే దేవపుష్పేణ
ద్విగుణమ్ భైష్మకీ తదా."
[65 అ - 17 శ్లో]

రుక్మిణీదేవి యా దేవపుష్పమును ధరించుటచే ద్విగుణీకృతసౌందర్య ముచే భాసించిన దని పై శ్లోకమున నుండగా -

"అవ్విరిం దననెఱిగొప్పునం జెరివినన్ వలిగుబ్బలిముద్దుపట్టి లేఁ
తనెల ధరించిన ట్లమరెఁ దద్దయు మోహనకాంతిసంపదన్.
[1 ఆశ్వాసము - 55 పద్యము]

సీ. "మగమీల నగఁజాలుతెగఁ గీలుకొనువాలుఁ
గనుఁగవ కొకవింతకాంతి యొదవె
వలిజక్కవలపెక్కువలు తక్కువగ నిక్క
చనుదోయి కొకవింతచాయ తోఁచె

తే. గీ. "విభ్రమంబున కొకవింతవిభ్రమంబుఁ
గలిగె నద్దివ్యకుసుమంబుకతన సతికి"
[1 ఆ - 56 పద్యము]

అని మూలకథలోనివిషయమును తిమ్మకవి ప్రపంచించి శతసహస్రాధిక మైనయామన్మథజననిసౌందర్యమును పఠితలమనఃఫలకముల సాక్షాత్కరింప జేసినాడు.

"అద్య సాత్రాజితీ దేవీ
జ్ఞాస్యతే వరవర్ణినీ
సౌభాగ్యాద్యం సదా వేత్తి
యాఽత్మానం సుభగం" .
[65 అ

అని మాత్రమే సత్యభామపై రెత్తి రుక్మిణితో నారదుడు పలికినట్లు మూలములో నుండగా తిమ్మకవి యీవిషయము నిబ్బడిముబ్బడిగా ప్రపంచించి

చం " ఇన్నిదినంబులున్ సవతు లిందఱిలో నల సత్యభామకన్
సన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై యన విందుఁ గాని యో
కన్నియ! నీయెడం గలుగుగారవ మెయ్యెడఁ జూచికాన; లే
కున్న ననర్ఘ్యదివ్యకుసుమోత్తమ మేరికినైన నిచ్చునే?"
[1 ఆ - 65 పద్యము]

ఉ. " చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ బే
రెక్కినదాన నంచుఁ బతి యెంతయు నా కనురక్తుఁ డంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య; యింతకున్
స్రుక్కక యున్నె నీమహిమ సూచినబోఁటులు విన్నవించినన్.
[1 ఆశ్వాసము - 66 వ పద్యము]

అని యిన్నిమాటలును నారదుఁ డన్నట్లు తిమ్మకవి కల్పించెను. రుక్మిణి మహిమ సూచినబోఁటి సత్యభామ కావిషయము విన్నవింపవలె ననియే నారదునియుద్దేశము. అభిమానవతి యైనసత్యభామలో మానరోషమును రెచ్చగొట్టుటకును, తద్ద్వారా కథ ముందునకు సాగుటకును ఈకల్పనము దోహదము చేసినది.

" నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య "

— ఈమాటలలో సత్యభామలోనియసమానసౌందర్యయౌవన మదమును, ఆమెస్వాధీనపతికాత్వమును, అన్యకాంతల సరకుగొనని యామెయహంకారమును మూర్తిభవించుచున్నవి. తిమ్మకవిగారు ముందుముందు రచింపనున్నసత్యభామాపాత్రచిత్రణ మనెడిమహాసౌధమునకు పునాదిరాళ్ళవంటి వీమాటలు.

ఒకపాత్రయొక్కస్వరూపస్వభావాదుల నిట్లు పొడిపొడిమాటలలో రూపుకట్టించుట కొండ నద్దములో చూపుటవంటిది. కథాగమన

మును పాత్రపోషణనైపుణిని దృష్టిలో నుంచుకొని చూచినచో తిమ్మనగారియీపద్యము మూలశ్లోకముకన్న వేయిరెట్లు మిన్నగా నున్నది.

కృష్ణుడు త్వరితముగా సత్యభామయింటికి వెడలినా డని మాత్రమే హరివంశమున నుండగా [1] నావిషయమును ప్రపంచించి

చ. " అరదము నెక్కి కేతనపటాంచలచంచల మైనతాల్మితోఁ
దురగజవంబు మున్ గడవఁద్రోచి కడంగెడుతత్తరంబుతోఁ
దిరిగెడుబండికండ్లపగిదిన్ భ్రమియించుమనంబుతోడ నా
హరి సను దెంచె సత్యసముదంచితకాంచన సౌధవీథికిన్."

[1 ఆశ్వాసము - 104 ప]

అనుపద్యమును రచించి తిమ్మకవి మూలములో లేనిసొగసులను సంతరించి, సత్యభామావిధేయునిసంభ్రమమును బళితలకన్నులఁ గట్టునట్లు చేసినాడు.

"మనసా కర్మణా వాచా
నత్వామతిచరామ్యహమ్
సరథా సర్వచార్వంగి
సత్య మేతద్బ్రవీ మ్యహమ్.
[66 అధ్యాయము - 41 శ్లో]

"బహుమా న్యోపమాన్యాసు
స్త్రీషు సర్వాసు శోభనే
స్నేహశ్చ బహుమానశ్చ
త్వామృతేఽన్యాసు నా స్తి మే."
[66 అ - 42 శ్లో]

అని మూలములో నున్నదానిని ప్రపంచించి తిమ్మకవి తనకావ్యములో

1. జగామ త్వరిత శ్చైవ సత్యభామాగృహం మహత్. (66 అ - 2 శ్లో)

చ. మనమున మాటలం బ్రియల మన్నన లీ నొకవాఁడు నెట్టికా
మినులకు గారవంబు మెఱమెచ్చులకై పచరింతుఁ గాని, పా
యనియనురక్తి నీయెడనె యగ్గల మై కనుపట్టు నాకు నీ
పనిచినపంపు సేయుటయ ప్రాభవ మౌ టది నీ వెఱుంగవే?"

[1 ఆ - 118 ప]

అనుపద్యమును రచించినాడు. రుక్మిణియందు తాను చూపినప్రేమ మెఱమెచ్చులకై పచరించినదే కాని, నిక్కపుమన్నన కా దని సత్యభామ కూరట కలిగించుట కృష్ణునియుద్దేశము. "నాకు నీపనిచినపంపు సేయుటయ ప్రాభవ మౌ టది నీవెఱుంగవే?" యనుటనుబట్టి సత్యభామను సంతోష పెట్టుటకై తా నేమైన చేయుదు నని సూచీపడినాడు. ఇది కృష్ణుడు సత్యభామప్రీతికై పారిజాతాపహరణ మొనర్చుటకు సూచనగా నున్నది. మూలశ్లోకములలో నిట్టిసొగసు మచ్చునకైన లేదు.

"వాఙ్మాత్ర మేవ పశ్యామి
మాధుర్యం సంప్రయుజ్యసే
మయి స్నేహశ్చ కృతక స్త
వాన్యత్ర న కృత్రిమః"
[66 అ - 50 శ్లో]

అనిమాత్రమే హరివంశమున నుండగా - శ్రీకృష్ణునిశిరమును వామ పాదమున తొలగద్రోసినసత్యభామ

ఉ. "ఈనయగారవంబ్రియము లీపస లీమొగమిచ్చుమాట లే
లా? నిను నమ్మియుండినఫలం బిదె తోడన కల్గె నాకు నీ
యానసుమీ! ననుం జెనకి యారడిపెట్టిన నవ్వువారలం
గాన; వెఱుంగునే పసులకాపరి భావజమర్మకర్మముల్?"

[1 ఆ - 125 వ పద్యము]

అని నిష్ఠురముగా పలికి గోపాలమాత్రుడైనకృష్ణుడు భావజమర్మకర్మము లెఱుంగ డని శృంగారరసాధిదేవత యైనసత్యభామ కోపావిష్టురాలై

నిరసించుట మనోహరముగా నున్నది. మూలభావమును ప్రపంచించు టలో నమూలక మైనయీసొంపు తిమ్మనగారిపద్యమున చోటు చేసి కొన్నది.

" మానార్థం జీవ్యతే లోకే సద్భి రిత్యుక్తవా నసి
త దేవం సతి నేచ్ఛామి జీవితుం మానవర్జితా "
[67 అ - 15 శ్లో]

అని మూలమున నున్నది.

కం " మానంబె తొడవు సతులకు
మానమె ప్రాణాధికంబు మాన మఖిలస
మ్మానములకు మూలం బగు;
మానరహిత మైనబ్రతుకు మానిని కేలా ? "
[1 ఆ - 129 ప]

ఈ తెలుగుసేతలో మూలభావము అందముగా ప్రపంచింపబడినది. " మాన మఖిలసమ్మానములకు మూలం బగు " - ఇది మూలములో లేకున్నను మూలప్రపంచనముచే కలిగినభావము. సత్యభామ మానరోషము పతిని పదాక్రాంతుని జేసి సురలోకపారిజాతము నామె పెరటిచెట్టును జేయించి యామెకు పుణ్యకవ్రతఫల మిప్పించి, యెన్నో విధములుగా నామెకు సమ్మానములనే కలిగించినది. కనుక నిది సార్థకమైన - యమూలకమైనభావము.

" వసంతకుసుమై శ్చిత్రం
తదా రైవతకం గిరిమ్
ప్రియాభూత్వా ప్రియాభూతా
కథం ద్రక్ష్యే హం పునః ? "
[67 అ - 19 శ్లో]

"జలక్రీడాం తవాంకస్థా
దేవకృత్వా మహోదధౌ
కథం దౌర్భాగ్య మాపన్నా
పశ్యేయ మపి సాగరమ్ ?"

[67 అ - 21 శ్లో]

అన్నమూలభావములకు మఱికొన్ని భావములను మేళవించి తిమ్మకవి యీక్రింది సీసపద్యమును రచించినాడు :

సీ. "ఉవిద యెవ్వతె నోఁచి యున్నదో ! యీశమం
తకరత్న మింక నొందల ధరింప ?
సిరైవతకశైలచారుకూటవిటంక
కేళి కిం కెవ్వతె పాలుపడునొ ?
యెవ్వతె కబ్బునో యీవసంతారామ
కర్పూరకదళికాగారవసతి ?
లీల నీమణిసౌధజాలకంబుల నిన్నుఁ
గూడి యెవ్వతె వార్ధిఁ జూడఁగలదొ ?

తె. గీ. అకట ! నేఁ బెంపఁ బెరిగినశుకమయూర
శారికాబృంద మెవ్వతెఁ జేరు నొక్కొ ?
నన్ను నాతోడిసవతులు నగకమున్న
పంత మలరంగ నిన్ను మెప్పింతుఁగాక"

(1 ఆ - 131 ప)

అని సత్యభామ యాత్మహత్య చేసికొందు నన్నట్లు సూచించుసీసపద్యమును రచించి, అంతవఱకును కృష్ణునితో గూడి సత్యభామ విహరించుటలును, శమంతకరత్నధారణమును, నామెవసంతారామవిహారమును, చిలుకలను, గోరువంకలను, నెమిళ్ళను పెంచుట మొదలైనయామె యభిరుచులును దెలిపి మూలములోకన్న సత్యభామవ్యక్తిత్వము మఱింతగా స్ఫుట మగునట్లు చిత్రించినాడు.

" నాహం త్వాం కితవం ధూర్త
మజ్ఞాసిష మరిన్దమ ।
అద్యజ్ఞాతోఽసి తత్వక్ష
చంచలో జనవంచక "

(67 అధ్యాయము - 25 శ్లో)

" స్వైరపర్ణేంగితాకారై
ర్నిగూఢో దేవయత్నతః
చౌర జ్ఞాతోఽసి తత్వక్ష
వాఙ్మాత్రమధురః శఠః "

(67 అ - 26 శ్లో)

అన్నమూలశ్లోకభావమును

ఉ. " గట్టివచేఁతలుం బసలు గల్లదనంబులు నీవు పుట్టగాఁ
బుట్టిన; వెందు లేనిపలుపోకలమాయలు నీకు వెన్నతోఁ
బెట్టిన వౌ నెఱింగియును బేలతనంబున నిన్ను నమ్మి నా
గుట్టును దేజమున్ మిగులఁ గోల్పడిపోయితి నేమి సేయుదున్ ; "

(1 ఆ - 127 ప)

అనుపద్యములో ప్రవచించినాడు తిమ్మకవి. "ఎఱింగియును బేలతనంబున నిన్ను నమ్మి నాగుట్టును దేజమున్ మిగులఁ గోల్పడిపోయితి నేమి సేయుదున్ ?" అన్నయమూలకభావ మెంతో యందముగా, స్త్రీస్వభావసహజముగా నున్నది.

కం. " పతి ప్రాణసదృశబంధువు
పతి దైవం బేడుగడయుఁ బతి సతులకు న
ప్పతియ కడు మేర దప్పిన
గతి కులకాంతలకు వేఱ కలదే చెపుమా "

(1 ఆ - 96 వ పద్యము)

అనిచెలికత్తెకు చెప్పుకొని వాపోయినసత్యభామబాధ యంతయు పైమాటలలో గూడు కట్టుకొన్నది.

"సపత్నీపక్షమువాఁడ వనియు, జనవంచకుఁడ వనియు నిప్పుడు తెలిసికొన్నాను" అన్నహరివంశములోని 67వయధ్యాయము నందలి 25వశ్లోకభావము

ఉ॥ "నామొగమాటకై వలసి నాటకముల్ ఘటియించి రుక్మిణీ
కామినిమీఁదటం గలుగుగౌరవముం గృపయుం బ్రియంబుఁ దా
నేమియుఁ గాననీక యిట నిన్నిదినంబులు నన్నుఁ దేల్చె నో
తామరసాక్షి ! మెచ్చవలదా ! మురదానవభేదికృత్యముల్ !"

(1 ఆ - 89 ప)

అని ప్రపంచింపబడి, (ఆమాటలు సత్యభామ కృష్ణునితో పలికినట్లు మూలమున నుండగా) తన్నభిమానించెడియాఁడుతోడై నచెలికత్తెతో చెప్పుకొని సత్యభామ వాపోయినట్లు తిమ్మకవి మార్చి రచించుట సరసముగా నున్నది.

స్వర్గమునుండి తెచ్చి పారిజాతవృక్షమును పెరటిచెట్టుగా నాఁటింతు నని కృష్ణు డనగా సత్యభామ సంతోషించిన దని మాత్రమే [1] మూలమున నుండగా

కం. "అని పలుకునంబుదశ్యా
మునిగర్జామధురవాక్యముల సత్యామా
నిని నీపలతికవోలెం
గనుపట్టె సఖీమయూరికలు సెలరేఁగన్"

(1 ఆ - 137 ప)

అని మూలభావమును తిమ్మనగారు ప్రపంచించిరి.

1. తథే త్యుక్తేతి కృష్ణేన తుతోష సమితింజయ
సత్యభామా సతా మిష్టాకంస నాశనవల్లభా. (67 అ - 36 శ్లో)

" తతః స్నాతో జగన్నాథః
సర్వేశః సర్వభావనః
చకారావశ్యకం సర్వం
సర్వకామప్రదః సతాం "
(67 అ - 37 శ్లో)

కృష్ణుడు స్నానము చేసి, యవసర మైనకర్మల నాచరించె నని మాత్రము పై శ్లోకమున నుండగా తిమ్మకవి

తే. గీ. " సమయకృత్యంబు లప్పుడు సలుపఁదలఁచు
నలిననాభునిచిత్తంబుఁ దెలిసి సత్య
భామకనుసన్న నుడిగంపుఁబద్మముఖులు
నిలిచి రంతంత వినయంబు తొలఁక నెదుట
(1 ఆ - 4 ప)

కం. తలిరాకుఁబోణి యొక్కతె
జలకమునకు వేళ యనుచు శౌరికి వీణా
కలకలములఁ గలకల నగు
పలుకుల మెల మొలయ విన్నపము గావించెన్.
(2 ఆ - 5 ప)

ఉ. ఇంచినవేడ్కనాత్మహృదయేశ్వరిఁ గన్గొని శౌరి మందహా
సాంచితనేత్రుఁడై జలక మాడఁగ రమ్మని పైఁడిచేలకొం
గించుక జాఱ నొక్కతరళేక్షణహస్తముఁ గేల నూఁదుచుం
గంచుకిసంచయంబు సముఖా ! యన గద్దియ డిగ్గె, డిగ్గినన్.
(2 ఆ - 6 ప)

క. ప్రామినుకులపూఁబోఁడుల
సీమంతపుఁజెందిరంబుచే బలె నరుణ
శ్రీ మించునతనిపదముల
భామామణి యోర్తు పయిఁడిపావలు తొడిగెన్.
(2 ఆ - 7 ప)

తే. గీ. కేళిగతి మీఱ మజ్జనశాల కరిగి
శాతమన్యవమణిమయాసనమునందుఁ
గౌస్తుభాదివిభూషణోత్కరము లెల్ల
నొయ్య నొయ్యన సడలించి యున్నయంత
(2 ఆ - 9 ప)

ఉ. కంపనలీలమై నసదుఁగౌ నసియాడఁ గుచద్వయంబు న
ర్తింప, లలాటరేఖ చెమరింపఁగ, హారలతాగుళుచ్ఛముల్
తుంపెసలాడఁ, గంకణమృదుధ్వని తాళగతిం జెలంగఁగా
సంపెఁగనూనె యంటె నొకచంద్రనిభానన కంసవైరికిన్.
(2 ఆ - 9 ప)

ఉ. తామరదోయిలోఁ దగిలి దాఁటెడుతేఁటులువోలెఁ బెన్నెఱుల్
వేమఱు చేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులం
గోమలలీల దువ్వి తెలిగొజ్జఁగినీ రెడఁ జల్లి చల్లి గం
ధామలకంబు వెట్టె నొకయంగన కాళియనాగభేదికిన్
(2 ఆ - 10 ప)

మ. చెలువల్ గొందఱు హేమకుంభములతోఁ జేసే నొసంగన్ విని
ర్మలదోర్మూలరుచుల్ వెలిం బొలయఁ దోరం బైనచన్దోయిసం
దొలయన్ వేనలి జాఱ నిక్కి యరమే నొయ్యారమై వ్రాలఁగా
జలకం బార్చె లతాంగి యొర్తు యదువంశస్వామికిన్ వేడుకన్.
(2 ఆ - 11 ప)

సీ. చంద్రికపూవన్నె జిలుఁగుదువ్వలువను
దడి యొత్తె నొక్కకాంతాలలామ
కొనగోళ్ల నెఱులు చిక్కులు వాపి మెలపున
శిర సార్చె నొక్కలేఁజిగురుఁబోఁడి
వెన్నెలనిగ్గులు వెదజల్లెడుమడుంగు
లందిచ్చె నొక్కపూర్ణేందువదన
నవరత్నమయభూషణవ్రజంబులు మేనఁ
గీలించె నొకరాజకీరవాణి

తే. గీ. విరులసరు లిచ్చె నొకయరవిందగంధి
యలఁదెఁ జందన మొకధవళాయతాక్షి
సుదతి యొక్కతె కపురంపుసురటి విసరె
నిలువుటద్దంబు నొకయింతి నిలిపె నెదుట
(2 ఆ - 12 ప)

కం. కలికినిడువాలుఁగన్నుల
తళుకులు మణిదీపశిఖలుఁ దడఁబడ లక్ష్మీ
నిలయున కిచ్చిరి కొందఱు
నెలఁతలు మౌక్తికవిచిత్రనీరాజనముల్."
(2 ఆ - 13 ప)

మ. జలకం బాడి మడుంగు కట్టి మణిభూషాదీప్యమానాంగియై
కలపం బెంతయు వింతగా నలఁది చెంగల్వల్ నెఱిన్ మించువే
నలిఁ గీల్కొల్పి పసిండియందెరవళిన్ రాయంచ లంతంత రాఁ
జెలులుం దానును సత్యభామ చనుదెంచెన్ నాథుఁ డుప్పొంగఁగన్."
(2 ఆ - 14 ప)

అని యీస్నానవిషయమును తిమ్మనగా రెంతగానో పెంచి పదునొకండు పద్యములు రచించిరి. రాయలవారియొక్కయు, రాణులయొక్కయు స్నానవైభవమును దృష్టిలో నుంచుకొనియే తిమ్మకవి యీఘట్టమును రచించినట్లు తోఁచుచున్నది. "రాజులు స్నానము చేయుట యనగా నది యొకబ్రహ్మాండము. మనము పోసికొనుతలంటికి పదిరెట్లెక్కువగా నుండును. అత్తరులు, పన్నీరులు నింపినజలములు [1]" అని విశ్వనాథ సత్యనారాయణగారియభిప్రాయము.

"తతః కృష్ణః శరైస్తీక్ష్ణై ర్దేవరాజగజోత్తమమ్
బిభే ద శవిసంకాశైః ప్రహసన్నివ భారత"
(73 అ - 19 శ్లో)

1. పారిజాతాపహరణపీఠిక - పుట xxii - విశ్వనాథవారిపీఠిక ఎమెస్కొప్రచురణ.

కృష్ణు డశనిసంకాశము లైనతీక్ష్ణబాణములతో నైరావతమును భేదించె నని మాత్రమే పైశ్లోకముయొక్క సారాంశము కాఁగా -

'అలుకం గంసవిభేది నందకముచే నయ్యస్త్రిముల్ ద్రుంచి వే
బలుతూపుల్ దృఢముష్టిఁ గూర్చి బలభిద్భద్రేభకుంభంబు వ్ర
క్కలుగా నేసిన బోరనం దొరఁగె ముక్తాశ్రేణి, పైపై హిమా
చలశృంగావతరన్నభశ్చరధునీచంచత్ప్రవాహాకృతిన్'

(5 ఆ - 28 ప)

అని తిమ్మనగారు మూలభావమునకు మెఱుఁగులు దిద్దుట గమనింప దగినవిశేషము.

'చండస్థూలరదద్వయద్వయమహాస్తంభంబులం బూని యు
ద్దండస్ఫారపతాకికాసహితమై దానచ్ఛటాచిత్రవ
ద్గండాభోగవిశాలకుడ్యములచేఁ గన్పట్టునద్దేవతా
శుండాలం బరుదెంచె సంగరరమాశుద్ధాంతసౌధం బనన్'

(4 ఆ - 78 ప)

ఆదేవతాశుండాల మెంతగా మదించినదో (వర్ణించిన) పైపద్యముతో పోల్చినచో శ్రీకృష్ణబాణాహతికి కుంభస్థలములు వ్రక్కలైనయామత్తకరి దయనీయస్థితిని మన మూహించుకొనవచ్చును. దెబ్బతిన్న వెల్ల యేనుగుకుంభంములనుండి జాఱుము త్తెములవరుస హిమాచలగళిత స్వచ్ఛగంగా ప్రవాహామువలె నున్న దఁట! ఈసొగసు మూలములో లేదుకదా!

'విహ్వాథగరుడమ్వజ్రీ
దివ్యైః శరవరై స్తథా
బాణాం శ్చిచ్ఛేద సహసా
కేశవస్య తరస్వి నః' - 73 అ - 20 శ్లో.

అనిమాత్రమే మూలమున నుండగా -

'అలనాఁటినన్ను మఱచితె ?
నిలు నిలుమీ తగినయాజ్ఞ నీ కిదె ! యనుచుం
బులుఁగులఁజేని సురేంద్రుం
డలుఁగులపెనుగూటఁ జిక్కునట్టుగ సేసెన్'
(5 ఆ - 27 ప)

అని యెంతో ముద్దుగా శిల్పసుందరముగా మూలభావమును కవి ప్రపంచించుట ప్రశంసింపఁదగినది. పక్షిని "అలుఁగులపెనుగూటఁ జిక్కునట్టుగఁ జేసెన్" అనుటలోనియందము సహృదయైకవేద్యముకదా !

## (d) అన్యథాప్రకల్పనము

"ప్రాప్తదారో మహాతేజా వాసుదేవః ప్రతాపవాన్
రుక్మిణ్యాసహితో దేవ్యా యయౌ రైవతకం నృప."

అని హరివంశమునందలి 65 వ యధ్యాయములోని నాలుగవశ్లోకమున నుండగా –

"అంతట నొక్కనాఁడు ధవళాంబుజనేత్రుఁడు వచ్చి రుక్మిణీ
కాంతగృహంబులోన శశికాంతశిలామయవేదిమీఁద నే
కాంతమునందుఁ గొందఱు మృగాయతనేత్రలు గొల్వ జూద మ
త్యంతవినోదకేళిమెయి నాడుచు నుండగ"

నారదుడు శ్రీకృష్ణసందర్శనార్థమై వచ్చుటతో – మూలమునందువలె రైవతకాద్రియందుగాక ద్వారకలో రుక్మిణీసౌధమున కృష్ణుడు జూద మాడుచుండగా కథాప్రారంభమైనట్లుతిమ్మనగారు రచించిరి.

రైవతకమున కృష్ణభార్య లందఱునొకేచోట నుండగా సత్యభామనుగూర్చి రుక్మిణిసమక్షమున నారదుడు దుయ్యబట్టుట సంభవింపదు. రైవతకమున రుక్మిణితో మాత్రమే కృష్ణు డుండగా నారదుడచటికేగుటయు, రుక్మిణికి కృష్ణుడు పారిజాతపుష్పము నిచ్చుటయు జరిగినను – ఆవిషయము ద్వారకలోనో మఱెక్కడనో యున్నసత్య

భామకు తెలియునవకాశము లేదు. అట్లు తెలియనిచో కథ ముందునకు సాగుటకు వీ లుండదు. కనుకనే రుక్మిణియింట సత్యభామచెలికత్తె యుండగా ద్వారకలోనే కథాప్రారంభ మైనట్లు తిమ్మకవి రచించుట సముచితముగా నున్నది.

" తద్వృక్షరాజకుసుమం
రుక్మిణ్యాః ప్రదదౌ హరిః
పార్శ్వస్థా సా హి కృష్ణస్య
భోజ్యా నరవరాఽభవత్
(65 అ - 15 శ్లో)

ఆపుష్పమును కృష్ణుడు రుక్మిణి కిచ్చె ననియు, పార్శ్వమున నున్న రుక్మిణి కృష్ణునకు భోజ్యురా లయ్యె ననియు పై శ్లోకమున నుండగా- తిమ్మకవి రచించినపారిజాతాపహరణములో నారదు డిచ్చినపారిజాత సుమమును

కం. " వినయంబు విస్మయంబును
మనమునఁ బెనఁగొనఁగ నపుడు మాధవుఁ డాక్రో
న్ననఁ గయికొని భీష్మకనం
దనఁ గనుఁగొని సత్యభామ తలఁపున నిలువన్
(1 ఆ - 53 ప)

మ. ' ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో
మది సాత్రాజితి దాని కే నిపుడు ప్రేమం బంపినన్ దీని నె
ల్లిదముం జేసినజాడ దోఁచునొకొ ? యాలె మ్మిందు నే నున్కిఁ జె
ల్లదువో యేరికిఁ బంపగా ' ననుచు లీలన్ రుక్మిణీకాంతకున్
(1 ఆ - 54 ప)

చ. కనుఁగవఁ బిన్ననవ్వు దొలఁకన్ మునినాథునికన్నుసన్న ని
చ్చినఁ దగభోజనందనయుఁ జేకొని మౌనికి మ్రొక్కి యవ్విరిం

దననెఱికొప్పునం జెరివినన్ వలిగుబ్బలిముద్దుపట్టి లేఁ
తనెల ధరించిన ట్లమరెఁ దద్దయు మోహనకాంతిసంపదన్ "

(1 ఆ - 55 ప)

అని యుండుటనుబట్టి సత్యభామ కినుకతో నేమని యూహించునో యని మనసులో సందేహించియు కృష్ణుడు తనచెంత నున్నరుక్మిణికే "మునినాథునికన్నుసన్న నిచ్చిన" యట్లు తిమ్మనగారు మార్చి కృష్ణునిసత్యభామావిధేయతకును, నారదునికలహాశనత్వమునకును చక్కనిప్రాతిపదికమును వేసిరి. ఈసొగసు మూలములో లేనిది.

వచ్చిననారదుని శాస్త్రోక్తముగా కేశవుడు పూజించె నని హరివంశమున నున్నది. తిమ్మకవి తనకావ్యమున

కం. "వచ్చినమునిపతి కెదురుగ
వచ్చి నమస్కృతులొనర్చి వనితయుఁ దానున్
పొచ్చెమ్ము లేనిభక్తి వి
యచ్చరరిపుభేది సలిపె నాతిథ్యంబున్ "

(1 ఆ - 45 ప)

తే. గీ. "అపుడు రుక్మిణికనుసన్న నబ్జముఖులు
రత్నసింహాసనంబు నారదున కిడిరి "

(1 ఆ - 46 ప)

అని రచించెను.

మూలములో కృష్ణు డొక్కడుమాత్రమే నారదునిఁ బూజించిన ట్లుండగా రుక్మిణీసహితు డై కృష్ణుడు నారదుని కెదు రేఁగి నమస్కరించి యాతిథ్య మిచ్చినట్లు రచించి తిమ్మన యౌచిత్యమును మఱింతగా పోషించినాడు. "రుక్మిణికనుసన్న" నబ్జముఖులు రత్నసింహాసనమ్ము నారదున కిడి రనుట భగవానునిపట్టపుదేవి యైనరుక్మిణీ దేవిఠీవికి తగిన ట్లున్నది.

కం. " సురసంయమివర ! మీ రిట
కరుదేరఁగ నిప్పు డేఁ గృతార్థుఁడ నైతిన్
నిరతంబు మీరు నాపయిఁ
గరుణ గలిగి యునికి యిది యకారణముసుఁడీ. "

(1 ఆ - 47 ప)

అన్నాడు శ్రీకృష్ణుడు. నిజ మారసినచో నారదునిరాక సకారణమే. ఆవిషయము లీలామానుషవిగ్రహుఁడైనకృష్ణునికి తెలియనిది కాదు. అయినను కేవలము మర్యాదమాత్రముననే భగవాను డిట్లు పలికినాడు.

తెనుఁగుకావ్యములో నున్నయీయందచందములు మూలములో లేవు. తిమ్మకవి తీర్చి దిద్దిననారదుడు - కృష్ణుఁ డవతారపురుషుడైనభగవంతుడే యని యెఱింగి, ఆయెఱుకకు వాగ్రూప మిచ్చినవాడు. కనుకనే -

............మర్త్యుఁ డాడెడురీతిన్
నీ విట్లు పలుక నుచితమె ?
యేవిశ్వజనీనచరిత ! యెఱుఁగనె నిన్నున్ ? "

(1 ఆ - 48 ప)

అని వాకొని

సీ " ప్రామినుకులదొంగ పాతాళకుహరంబుఁ
జొరఁ బాఱి చీఱినచోఱ వీవ
తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పులఁ గూటి
చవిఁ దేల్చినట్టికచ్ఛపమ వీవ
నీటిలో మునిఁగిననేలచేడియఁ గొమ్ము
కొన నుబ్బ నెత్తినఘోణి వీవ
మునిమాపుబలుగంబమునఁ బుట్టి బంటున
క్కఱఁ గాచినట్టిసింగంబ వీవ

తే. గీ. క్షితిజు మెట్టినయాపొట్టిదిట్ట వీవ
పుడమితేఁడుల నడఁచినప్రోడ వీవ
కడలిఁ గోలకుఁ దెచ్చినగబ్బి నీవ
యిపుడు ద్వారక వసియించునీవు నీవ ! ”
(1 ఆ - 49 ప)

అని మత్స్యావతార మాదిగా నభివర్ణించినాడు. ఈసీసపద్య మాచ్ఛిక పదబహుళ మయ్యును లలితలలితముగా సాగిపోయినది.

కం. “ ద్వారక వైకుంఠపురం
బీరుక్మిణి లక్ష్మి - మీర లిచ్చట మునికిన్
సారెకుఁ గొల్వఁగ వత్తును
గోరికతోఁ గంసహర ! ముకుంద ! మురారీ ! ”
(1 ఆ - 51 ప)

“ అని కృష్ణుని బహుప్రకారంబులఁ బ్రశంసించి పారిజాతంపుఁగ్రొన్నన మిన్నే టిపసిండి నెత్తమ్మిచిగురుటాకునం బొదివి విరించినందనుఁడు మాధవుని కందించినాఁ ” డని తిమ్మకవి రచించినాడు. దీనినిబట్టి నారదుని దివ్యజ్ఞానమును, కృష్ణునియం దాయనకు గలభక్తియు స్పష్ట మగుచున్నవి.

సముత్సృజ స్త్రీ వసనం సకుంకుమం
శుచిస్మితా శుక్లతమైక మంశుకం
జగ్రాహ రోషాకులితేన చేతసా
వహ్నా స్తదా శ్రీరివ వర్ధితేంధనా.
ఆ - 51 వ శ్లోకము)

మానరోషాకులితస్వాంత యైనసత్యభామను వర్ణించునీశ్లోకములోని మొదటిరెండుపాదములభావమును “ సన్నకావు లీ వెందును మాన లేవు – తెలు పేటికిఁ గట్టితి ? ” వని (1 ఆ – 115 ప) కృష్ణుడు సత్యభామ నడిగినట్లుగా తిమ్మకవి మార్చినాడు. ఆమె యెఱ్ఱనివసనమును విడిచి శుక్లవస్త్రమును ధరించిన దని కవి చెప్పుటకంటె – ఆమెభర్తయే

యి ట్లేల చేసితివి ? అని యేమియు నెఱుగనివాడువలె నడుగుట రమ్య ముగా నున్నది.

"వహ్నిస్తదా శ్రీరివ వర్ధితేంధనా" అనుటకంటె "నేయి వోయ భగ్గన దరికొన్న భీషణహుతాశనకీల యనంగ లేచి" (1 ఆ – 82 పద్యము) అన్నతిమ్మకవిగారిరచనమే బాగున్నది. ఏల యనగా – ఇంధనవర్ధిత మైనవహ్ని సకలజనసేవ్యము కావలె నన్న నియమము లేదు. మఱి – ఆజ్యధారాప్రవర్ధిత మైనహుతాశనకీలయో? వలపు నిండారి పవిత్రమై నరలోక సురలోకసేవ్య మై కనువిం దొన రించునది. సత్యభామ నట్టిదిగా తిమ్మకవి వర్ణించి యామెకు సురలోక మున జరగనున్నసత్కారమును సూచించినాడు. చెలికత్తెమాట లాజ్యధార కాగా సత్యభామ హుతాశనకీల యైనది. సత్యభామపర ముగా వాడబడిన "కీలా" శబ్దము స్త్రీలింగము కావున నిక్కడ లింగౌచిత్యమును పాటింపబడినది.

ఎంతగా ప్రజ్వలించిన నంతభీషణముగా నగుపించుటయు, నెంతగా ప్రజ్వలించిన నంతగా చల్లబడుటయు హుతాశనకీలలక్షణము. కనుక మానరోషముచే మండిపడి సమాశ్వాసింపబడి చందనశీతలత్వము నందినయాఖండితనాయిక కీయుపమాన ముచితముగా నున్నది.

ఇంద్రాదిదేవతలయనుభవమునకై యుద్దేశింపబడినద్రవ్య మును తాను స్వీకరించి, యాపిమ్మట నాయాయమరుల కందజేయుట హుతాశనలక్షణము. ఇక్కడ దేవతానుభవయోగ్య మైనపారిజాత మును సత్యభామ స్వీకరింపగా నాపిమ్మట నది దేవతలకు దక్కుట జరిగినది కనుక సత్యభామను తిమ్మనగారు హుతాశనకీలతో నుపమిం చుట మనోహరముగా నున్నది. నేయి వోసినకొలది వాయువుతో డైనకొలది హుతాశనకీల భూమినుండి యాకాశమంతయెత్తునకు లేచుట సహజమే.

హుతాశనకీలవంటిసత్యభామ చెలికత్తెమాట లనెడియాజ్య ధారచే ప్రజ్వలించి, సర్వభూతస్వరూపు డైనకృష్ణభగవానునిసహ కారముచే నున్నతి నంది మి న్నందుట జరిగినది కనుక నిచ్చట ప్రయో గింపబడిన "లేచి" యనుక్రియాపదముకూడ సార్థకముగా నున్నది.

"క్రోధాన్వితా క్రోధగృహమ్ వివిక్త
నివేశ తారేవ ఘనమ్ సతోయమ్"
(65 వ అధ్యాయము - 52 వ శ్లోకము)

సతోయ మైనమేఘమును తారవలె సత్యభామ క్రోధగృహమును ప్రవే శించిన దని యీహరివంశశ్లోకము చెప్పుచున్నది.

కోపము వేఱు - క్రోధము వేఱు. ఎదుటివ్యక్తిని హత మార్చువఱకును చల్లారనిది క్రోధము కాగా - కోపములో నట్టిహింసా ప్రవృత్తి యుండదు. కనుక సత్యభామ క్రోధగృహమున ప్రవేశించినట్లు హరివంశమున చెప్పుట సముచితముగా లేదు. "కోపసదనంబునకుం జనియెను లతాంగి" (1 ఆ - 98 ప) అన్నతిమ్మనగారిరచనమే సముచిత ముగా నున్నది.

కం. "అని వగల మిగులఁ బొగులుచు
జనితామర్షమునఁ గోపసదనంబునకుం
జనియెను లతాంగి హరిచం
దనకోటరమునకు నాగతరుణియుఁబోలెన్"
(1 ఆ - 98 వ పద్యము)

అని తిమ్మనగారు మూలమునకు భిన్న మైనకల్పనము చేసిరి. పగపాము కన్న నాఁడుపాముస కౌద్ధత్య మెక్కువ. పాములకు పరిమళించెడు చందనతరు వన్న ప్రాణము. దెబ్బ తిన్నయురగము లోకమునకు తన మోమును జూపలేక కన్నములోనో చెట్టుతొఱ్ఱలోనో దాగి యుండి పగ తీర్చుకొనుసమయము వచ్చువఱకును వేచియుండుట సహజము. అట్లే కృష్ణుడు వచ్చి పాదాక్రాంతుడు కాఁగా నాయనశిరమును వామ

పాదమున తాడించి ప్రతీకారము తీర్చుకొనునంతవఱకును సత్యభామ కోపగృహముననే యుండిపోయినది. అంతే కాదు – కోపగృహము వలెనే చెట్టుతో్జకూడ చీకటితో[1] నిండి యుండును. కనుక తిమ్మన గారు వాడినయమూలక మైనయీయుపమాన మిన్నివిధములుగా గుణ వత్తరముగా నున్నది. హరిచందన మనగా మంచిగంధపుచె ట్టనియే కాక – కల్పవృక్ష మనియు నర్థము కనుక సత్యభామ హరిచందనమును దరియునాగతరుణివలె నున్న దనుటచే కృష్ణునితో సత్యభామ పారిజాత తరువు దగ్గరకు పోవు నన్నభవిష్యత్కథ సూచించుటయు జరిగినది. మూలములోనియుపమానములో నిన్నిసొగసు లెక్కడివి? తిమ్మనగా రాగర్భకవి యనుట కాయన కల్పించినయీపద్య మొక్కటి చాలును.

కోపగృహమున కేగినసత్యభామ సజలమేఘముమాటునకు పోయినతారవలె నున్న దన్నహరివంశముకన్న –

“ జలదాంతచంద్రరేఖాసదృశాంగి యై ” (1 ఆ – 99 ప) అని వర్ణించినతిమ్మకవిగారి యుపమానమే అందముగా నున్నది. సత్య భామ చంద్రముఖి. కోపములచే నామె యిపుడు చంద్రరేఖ యైనది. అంతే కాక – చిక్కుట యనులక్షణము చంద్రునికే కాని తారకు లేదు. తార మార్పు లేనిది. వృద్ధి నందుట, కృశించుట యనునవస్థాభేదముల ననుభవించునది చంద్రబింబము. కనుక నీతిమ్మనగారియుపమానము లోనిసొగసును, నీయౌచిత్యమును ఆమూలశ్లోకములో లేవు.

“ బద్ధ్వా లలాటే హిమచంద్రశుక్లమ్
దుకూలపట్టమ్ ప్రియరోషచిహ్నమ్
పర్యంతదేశమ్ సరసేన దేవీ
విలిప్యసా లోహితచందనేన ”
(65 అ – 53 వ శ్లోకము)

1. చీకటింటికడకంకటిపై.... (1 ఆ – 99 వ పద్యము)

(లలాటమునందు సత్యభామ హిమచంద్రశుక్లమును, ప్రియరోష చిహ్నమును నగుదుకూలపట్టమును గట్టి, లలాటప్రాంతదేశమున లోహితచందనమును పూసికొన్నది - అని పై శ్లోకభావము)

" సంస్మృత్య సంస్మృత్య శిరః సరోషమ్
ప్రకంపమానా సముపోపవిష్టా
దీర్ఘోపధానే శయనేఽ పనీయ
విభూషణాన్యేవ నిబద్ధవేణీ "
(65 అ - 54 వ శ్లోకము)

" విచూర్ణయామాస కుశేశయం సా
నిఃశ్వస్య నిఃశ్వస్య నఖై ర్నతభ్రూః " (65 అ - 55 శ్లో)

అని హరివంశమున నుండగా తిమ్మనగారు దాని నిట్లు మార్చిరి :-

' సంస్మృత్య సంస్మృత్య శిరస్సరోషం ప్రకంపమానా సముపోపవిష్టా
దీర్ఘోపధానే శయనేఽపనీయ విభూషణాన్యేవ నిబద్ధవేణీ '
(65 అ - 54 శ్లో)

సత్యభామ రోషముచే కంపించుచు నాభరణములను దీసివైచి శయ్యపై కూర్చుండిన దని పై శ్లోకమున నున్నది. కాని -

మాసినచీర కట్టుకొని మౌనముతోడ సిరస్త్రభూష యై
వాసెనకట్టు కట్టి నిడువాలిక కస్తురిపట్టు వెట్టి లో
గాసిలి చీకటింటికడకంకటిపై జలదాంతచంద్రరే
ఖాసదృశాంగి యై పొరలె గాఢమనోజవిషాదవేదనన్ '
(1 ఆ - 100 ప)

' వెడవెడ కన్ను మూయుఁ గను విచ్చు నగుం దల యూఁచుఁ బాన్పుపైఁ
బడు నుసు రంచు లేచుఁ దడఁబాటును దత్తరముం జలంబు లో
నడరఁగఁ గోపవేగమున నగ్గలమైనమనోజబాధలన్
బడి మదహస్తిహస్తగతపద్మినియుంబలె సొంపు పెంపఱన్ '
(1 ఆ - 101 ప)

అని తిమ్మకవి మఱియొకవిధముగా రచించెను. మూలమునలేనియంద మిందు చోటు చేసికొన్నది.

సత్యభామ నిష్కారణముగా కోపించినట్లు 65వ యధ్యాయములోని 55వ శ్లోకము చెప్పుచుండగా ఆమె సకారణముగానే కోపించిన దని తిమ్మనగారు చేసినమార్పు సముచితముగా నున్నది. ఆమె గోళ్ళచేత తనముఖమును బాధింపజేసికొన్న దని మూలములో నున్నది. తన్ను తానే బాధించుకొనుట నిస్సహాయస్థితిలో నున్నయబలల లక్షణము. సత్యభామ కాకర్మ మేమి పట్టినది? ఆమె సవతియైన రుక్మిణిపై మచ్చరించి మగనిని లొంగదీసికొని తనకార్యమును సాధించుకొన్నసబలగా తిమ్మనగారు సత్యభామను తీర్చిదిద్దిరి. కనుక మూలములోనిసత్యభామకన్న జాణగా తెలుగుసత్యభామ చూపట్టునట్లు తిమ్మనగారు చేసినఅన్యథాప్రకల్పనము మనోహరముగా నున్నది.

సంస్కృతహరివంశమునందలి 66వ యధ్యాయములో (కృష్ణుడు చూచిన) సపత్నీమాత్సర్యగ్రస్త యగుసత్యభామస్థితి యీక్రిందివిధముగా వర్ణింపబడినది –

'సదదర్శ ప్రియాం దూరాత్ క్రోధాగారగతాం తదా
ప్రేక్ష్యామివ స్థితాం కోపా న్నిశ్శ్వసన్తీం ముహుర్ముహుః' (66 అ - 6 శ్లో)
'కరజాగ్రావలీఢంతు .... పునఃపునః' (66 అ - 7 శ్లో)
'కించితాకులితాగ్రేణ .... పునఃపునః' (66 అ - 8 శ్లో)
'కరపద్మే పునస్సవ్యే .... కమలేక్షణాం' (66 అ - 9 శ్లో)
'సరసం చందనం .... నిర్దయం పునః' (66 అ - 10 శ్లో)
'పునరుత్థాయ .... దదృశేహరిః' (66 అ - 11 శ్లో)
'అవగుంఠ్య యదావక్త్రం .... జనార్దనః' (66 అ - 12 శ్లో)

తిమ్మకవి మూలములోనిపై శ్లోకములలోని 'విహాసన్తీంపునః పునః' అనువిషయమును మాత్రము గ్రహించి 'నగు' నని యనువదించి 11వ శ్లోకభావమునుమాత్రము గ్రహించి 'పాన్పుపైఁ బడు నుసు

రంచు లేచు ' నని యనువదించి తక్కినవిషయము నంతటిని తాను కల్పించి యీక్రిందిపద్యములను రచించినాడు -

' వెడవెడ కన్నుమూయుఁ గను విచ్చు నగుం దలయూచుఁ బాన్పుపైఁ
బడు నుసురంచు లేచుఁ దడఁబాటును దత్తఱమ్ముం జలంబు లో
నడరఁగఁ గోపవేగమున నగ్గలమైనమనోజబాధలం
బడి మదహస్తిహస్తగతపద్మినియుంబలె సొంపు పెంపఱన్ '
(1 ఆశ్వా - 101 ప)

' బిసరుహపత్రలోచనకుఁ బెల్లగుమోహము సంఘటిల్లె వె
క్కసమగు నెవ్వగల్ వొడమెఁ గంపము పుట్టెఁ జెమర్చె మేను మా
నసమున విన్నఁబా టొదవె నాటెఁ గడుం బరితాపవేదనల్
మసకపుఁబాముకాటుగతి మచ్చరమ న్విస మగ్గలింపఁగన్ '
(1 ఆ - 100 ప)

మూలములోనిపై 10వ శ్లోకము అసహజముగా కూడ నున్నది. ఖండిత నాయిక యైనసత్యభామస్థితిని వర్ణించుచు తిమ్మకవి చేసినయీకల్పనము మూలముకన్న రమ్యముగా నున్న దనక తప్పదు.

కృష్ణుడు వచ్చి చూచినప్పటిసత్యభామస్థితి అది యని మూలశ్లోకములలో నుండగా - కృష్ణుడు సత్యాసౌధమునకు రాక పూర్వము సత్యభామస్థితి యిది యని తిమ్మకవి పై రెండుపద్యములలో వర్ణించినాడు.

' ప్రేష్యాజనం .... సతామ్ ' (66 అ - 13 శ్లో)

అని మాత్రమే మూలములో నుండగా -

' కొందఱ మంతనంబులను గొందఱ జంకెనవాఁడిచూపులం
గొందఱఁ జేతిసన్నలఁ దగుల్పడఁ జేయుచుఁ జేరఁ బోయి మ
ధ్యందినభానుమండలకరావళిహావళి వాడియున్నతీఁ
గం దలపించునమ్మగువఁ గన్గొని యెంతయు విస్మితాత్మఁ డై '
(1 ఆ - 108 ప)

అని తిమ్మనగారికల్పనములో మధ్యందినభానుమండలకరావళిహేవళి వాడియున్నతీవతో సంతప్తహృదయ యైలతాంగి యగు సత్యభామను పోల్చుట సముచితముగా నున్నది. ఈయందము మూలమున లేనిది.

'గ్రహాయవ్యజనంచైవ .... శనకైరివ' (66 అ - 14 శ్లో)

అని యుండగా పారిజాతాపహరణమున తిమ్మనగారు -

'ఈలలితాంగిచంద మొకయించుక చూచెద నంచు ధూర్తగో
పాలుడు తాళవృంత మొకభామిని సత్య పిఱుందనుండి మం
దాలసలీలమై విసర నాదటగైకొని వీచె దద్వపుః
కీలితపంచసాయకశిఖిం దరికొల్పుచునున్నకైవడిన్'
(1 ఆ - 109 ప)

అని రచించిరి.

కృష్ణుడు చిరునవ్వులు నవ్వినట్లు (జహాస) మూలమున నున్నది. అట్లు కృష్ణుడు నవ్వుట-అసలే గాయపడియున్నసత్యమనసును మఱింత గాయపఱచుచు వెలికిగా నవ్వుట - కృష్ణునివంటి నాయకునికి తగ దని కాబోలు తిమ్మనగారు మూలములో చెప్పబడినఆనవ్వును పరిత్యజించి రచించిరి. కృష్ణుడు వింజామరతో విసరుట 'తద్వపుఃకీలిత పంచసాయకశిఖిం దరికొల్పుచు నున్న ట్లున్న దనుచున్నాడు తిమ్మకవి. ఈకల్పన శృంగారరసప్రధానమైనయీకావ్యమున కెంతయో తగి యున్నది.

'స పారిజాతపుష్పస్య .... దుర్లభం' (66 అ - 15 శ్లో)
'అత్యద్భుతం .... చాబ్రవీత్' (66 అ - 16 శ్లో)
'సోత్థితా .... ప్రథవే తదా' (66 అ - 17 శ్లో)
'తాః పృష్టాస్య .... పురాస్తదా' (66 అ - 18 శ్లో)
'తదపూర్వ .... తత్థలు' (66 అ - 19 శ్లో)
'కిం త్విదం .... లోకభావనం' (66 అ - 20 శ్లో)

అని మూలమున నుండగా -

'అంతటఁ బారిజాతకుసుమాగతనూతనదివ్యవాసనల్
వింతలుసేయఁ దావి యిది విస్మయ మంచు ముసుంగుఁ ద్రోచి యే
కాంతగృహంబునల్గడలు నారసి సంభృతతాలవృంతునిం
గాంతునిఁ జూచి బాష్పకణికాతరళీకృతలోచనాంత యై'
(1 అ - 110 ప)

అని తిమ్మనగారు రచించిరి.

'ఆపరిమళ మేమి?' యని సత్యభామ యడుగగా దాసీ జనులు మారుపలుకక అధోముఖు లై నేలమీఁద కూర్చుండి రని మూలములో నున్నది. (66 అ - 18 శ్లో). పై మూలశ్లోకములకన్న నెన్నోరెట్లు బాగున్న దీతెలుగుపద్యము. సత్యభామాకృష్ణు లున్న యే కాంతగృహమున చెలిక త్తె లుండుట రసభంగకారణ మనియో - వారియేకాంతమునకు భంగ మనియో - తిమ్మనగారు దాసీజనమున కచ్చట తావు లేకుండ చేసి యౌచిత్యమును పోషించి రనవలయును.

'తస్యాః సుస్రావ నేత్రాభ్యాం
వారిప్రణయకోపజం

మవశ్యాయ జలం యథా'
(66 అ - 24 శ్లో)

తామరరేకులనుండి నీరు జారినట్లు సత్యభామనేత్రములనుండి ప్రణయ కోపజము లైనబాష్పములు స్రవించిన వని పైశ్లోకభావము. కన్నుల నుండి జాఱునీరు కన్నులలోనే పుట్టును. తామరరేకులలో అట్లు నీరు పుట్టుట కవకాశము లేదు. కనుక దానిని పూర్తిగా మార్చివేసి తిమ్మనగారు -

'తల వాంచి మగుడ ముసుఁ గిడె
గొలుకుల డిగజాఱి జాఱుకొనుబాష్పంబుల్
పలుచనిచెక్కుల లవలీ
దళపతితమరందబిందుతతిఁ బురుడింపన్'
(1 అ - 111 ప)

అనుపద్యమును రచించిరి. సత్యభామకపోలములు లవలీదళములవలె పలుచనివి. ఆమెకొలుకులనుండి చెక్కులమీఁదికి దిగజాఱుబాష్పములు లవలీదళపతన్మరందబిందువులవలె మధురమైనవి. (చూడ ముచ్చటమైనవి.) ఆమెశోకముకూడ మధురమైనదే. యని - ఆమె యేడుపు కలకంఠవధూకలకాకలీధ్వని యని కవి ముందు ముందు చెప్పబోవుచున్నాడు. సీతాదేవివిరహ మొక్కటి తక్క - ఆమెదైనసమస్తమును శ్రీరామునిదృష్టిలో మధుర మైనట్లు [1] - సత్యభామయెడబాటు తక్క ఆమెదైనప్రేమ, యేడుపు, సమస్తమును కృష్ణునిదృష్టిలో మధురమైనదే! అట్టిభావ మీచిన్నిపద్యములో బీజప్రాయముగా నిక్షిప్తమై యున్నది.

'పూర్ణచంద్రసపత్నేన స్మేరేణా బహుభాషిణా
కిమనో భాషసేమాఽద్యముఖే నోత్పలగంధినా'
(66 అ - 36 శ్లో)

అని మూలమున నుండగా -

'పలుకులఁ దేనె లుట్టిపడఁ బల్కవు నేఁ డిది యేల ?'

అనియు -

'అర్ధాక్షిఽపి హి తావన్మాం కిమర్థం న నిరీక్షసే ?'
(66 అ - 37 శ్లో)

అనుమూలశ్లోకభాగమునకు -

'నాలుఁగన్నుల మనుసిగ్గు మాల్కొనఁ గనుంగొన వేల ?'

అనియు తిమ్మనగారి తెలుఁగుసేఁత.

'ఉరస్థలంబుఁ జన్నుల నెదురొత్తి మక్కువ నమన్ బిగికౌఁగిటఁ
జేర్ప వేఁటికే చిలుకలకొల్కి ! యెవ్వ రెడసేసిరి ? నీ కిటు లేల చింతిలన్ ?'

అని తిమ్మనగారు తనస్వతంత్రభావములతో పద్యమును పూరించి, కృష్ణుడు సత్యభామను విడిచి క్షణమైన నుండలేనితనమును, ఆమె

1. భవభూతి - ఉత్తరరామచరితము

దుఃఖమునకు కారణము తానై యుండి - ఏమియు నెఱుంగనివానివలె 'ఎవ్వారెడసేసిరి ? అని ఆ జగన్నాటకసూత్రధారి యమాయికత్వము నటించుటయు రమ్యముగా నున్నది

'కి మకార మహందేవి ! .... సుందరి'

అ - 40 శ్లో]

పై శ్లోకములో నున్నట్లు - 'భామినీ ! నేను నీ కేమి యనిష్టము చేసితిని ? న న్నెందులకు నిట్లు బాధించుచున్నావు ?' అని దబాయించుట కన్న

'మన మరయం దలంచి యొకమార్గము పన్నితొ ? నవ్వులాలకో ?
నను వెఱపించెదో ? యకట ! నాయెడ నిక్కపుఁదప్పు గల్గెనో !
వనజదళాయతాక్షి ! పగవాఁడనె ! న న్నిటు లేల చూడ ? వా
క్కనిముసమైన నీవు దయఁ గన్గొనకుండిన నిల్వనేర్తునే ?'

[1 ఆ - 116 ప]

అనుట సరసముగా - తప్పు నొప్పుకొనియు నొప్పుకొననట్లుగా - ప్రౌఢముగా - సుకుమారముగా నున్నది.

'యదిత్వహ మనుగ్రాహ్యా మా మనుజ్ఞాతు మర్హసి
తపస్యేఽ హం పరం కృత్వా నిశ్చయం పురుషోత్తమ'

[66 అ - 53 శ్లో]

అని హరివంశమునందలిసత్యభామ తపస్సు చేసికొనుటకై భర్త యనుజ్ఞ వేడి యేడ్చుచు కృష్ణునివస్త్రాంచలముతో తనమోమును కప్పుకొనిన ట్లున్నది. (66వ అధ్యాయము - 55వ శ్లోకము). కాని - తిమ్మనగారు తీర్చిదిద్దినసత్యభామ భర్తను నిష్ఠురోక్తు లాడి చనిపోవుదు నని బెదరించినది (1 ఆ - 131వ ప). మూలములోనిసత్య బేల కాఁగా తిమ్మనగారి సత్యభామ తెంపరి యై మగని నడుములో నిడికొనుకీ లెఱింగినప్రౌఢగా చిత్రింపబడినది.

'నీ విచ్చినవచనవుచే సర్వసీమంతినీమధ్యమున స్పృహణీయురాల నైననేను - (నీ వీనాఁడు నాసవతిని గౌరవించి నన్ను తక్కువ చేయుటచే) సపత్నులయవమానమునకు పాత్ర మైతి నని చెలికత్తెలచే వింటిని - అని సంస్కృతహరివంశములోని 67వ యధ్యాయమునందలి 6, 7 శ్లోకములలో నున్నది. సవతులకు తాను లోకువ యైతి నన్న బాధ మనసులో నున్నసత్యభామ -

'ఇన్నిదినంబులున్ సవతులిందఱలోఁ గడుగారవంబునన్
కన్నియ ! నన్ను వల్లభుఁడు కన్నులఁ గప్పుకొనంగ నుండి యా
వన్నెయు వాసియుం దొలఁగి వారు ననుం దల యెత్తి చూడఁగా
నన్నలఁ జాయలం బలుక నైఁతునె ? ప్రాణము లెంత తీపొకో !'
(1 ఆ - 88 ప)

అని తనచెలికత్తెతో చెప్పుకొని కృష్ణునిపరోక్షమున వాపోయినది. తనమనసులో ఆబాధ యున్నట్లు కృష్ణునికి తెలిసినచో సవతులు తన్ను లోకువచేయుటమాట య టుంచి - కృష్ణునికే తాను మఱింతగా చులకన యగుదు నన్నభయము సత్యభామ కున్నది. ఆమె మిక్కిలిగడుసరి. ఏవిషయమునందైనను పంత మూనుచో నంతు చూచులక్షణము కలది. కనుకనే సవతులప్రసక్తి లేకుండ భర్తతో -

'తనదుకోడండ్రలోనఁ బెద్దయుగ నన్ను
దేవకీదేవి మన్నించు నీవు నాకుఁ
జనవు లిచ్చుటఁజేసి, ఆసాధ్వి సేవ
సేయఁ బోవంగ నా కింక సిగ్గు కాదె ?'
[1 ఆ - 130 ప]

అని యవమానజనితమైన సిగ్గు నడ్డముపెట్టుకొని అత్తగారిసేవ కెగనామము పెట్టుటకై యెత్తుగడ వేసినది.

"నారదుడు నీకు పారిజాతపుష్పము నొసంగగా నీవు నన్ను కాదని - నీ కిష్టమైనయామె కిచ్చి ఆమెయందు నీ కున్నయిష్టమును

స్నేహమును ప్రకటించితివి. నీసమక్షమున నారదు డామెను పొగడగా నీవు సంతోషముగా వింటివి. నీ వాపొగడ్తలు వినుట యుక్తము.'' అని సత్యభామ పలికిన దని హరివంశమున 67వయధ్యాయములో 8, 9, 10, 14 శ్లోకములలో నుండగా తిమ్మకవి దానిని మార్పుచేసి -

'మునిపతి వచ్చి పూ వొసఁగి మోదముతోడ భవత్ప్రియాంగనన్
వినుతి యొనర్పఁగా వినినవీనుల మాచవిగానిమాటలన్
వినవలసెం గదా యిపుడు నీ విట వచ్చుట పారిజాతవా
సనఁ బ్రకటించి మమ్ము నెకసక్కెము సేయన కాదె చెప్పుమా'

(1 ఆ - 128 ప)

అని సత్యభామచే ననిపించినాడు. వగచినట్లును, వాఁతలువెట్టినట్లును నున్న వీమాటలు. కృష్ణుడు తనదగ్గఱకు వచ్చుటలోకూడ దురుద్దేశమే యున్న దని తప్పు పట్టుచున్నయీసత్యభామపలుకులు కృష్ణునిచెవులకు ములుకులే కదా. సత్యభామయీర్ష్య సంస్కృతములోకన్న తిమ్మన గారియీకావ్యములోనే యెక్కువగా వ్యక్తమైనది.

'నారదుఁ డామెను నీయెదుటఁ బొగడినఁ బొగడుఁగాక - నా ప్రస్తావన యేల రావలెను ?' అని మూలమున నీక్రిందివిధముగా -

'స్తోతవ్యా యది తావత్స నారదేన తవాగ్రతః
దుర్భగోఽయం జనస్తత్ర కిమర్థ మనుశబ్దితః'

(67 అ - 11 శ్లో)

అని కృష్ణుని నిలదీసి సత్యభామ యడిగిన ట్లుండగా - తిమ్మనగారు పైశ్లోకవిషయమును మార్చి -

'అతులమహానుభావ మని యవ్విరి తా నొక పెద్ద సేసి య
చ్యుతునకు నిచ్చకం బొదవ నూడిద యిచ్చిన నిచ్చెఁగాక తా
నతఁడు ప్రియంబుగల్గునెడ కర్పణ సేసినఁ జేసెఁగాక యా
మతకరివేలుపుందపసి మమ్ముఁ దలంపగ నేల యచ్చటన్ ;'

(1 ఆ - 84 ప)

అని సత్యభామ తనచెలికత్తెతో రుక్మిణీసౌధవృత్తాంతమును వినగానే కోపోద్రిక్త యై పలికినట్లు రచించుట సహజముగా నున్నది. 'అవ్విరిం దా నొకపెద్ద సేసి' అనుటనుబట్టి ఆపారిజాతపుష్ప మంత గొప్పది కాకపోయినను – గోరంతలు కొండంతలు చేసి నారదుడు వర్ణించినా డని యీర్ష్యాళు వైనసత్యభామహృదయము. 'ఆమతకరి వేలుపుంద సని' అనుటచే నారదునియందు సత్యభామ కున్న చులకనభావము తేట పడుచున్నది. 'నన్ను' అనుటకుబదులు 'మమ్ము' అనుట సత్యభామ స్వాభిమానమును ప్రకటించుచున్నది. మూలములో ఈసొగసు లేదు కదా! గత్యంతరము లేక పారిజాతపుష్పము తాను రుక్మిణి కిచ్చితి ననియు, తనయపరాధమును మన్నింపు మనియు కృష్ణుడు సత్యభామను వేడుకొన్నట్లు మూలములో నున్నది. ('తత్పారిజాత....కృత్' -67అ- 29 శ్లో; 'దాక్షిణ్యా....శుచిస్మితే' - 67 అ - 30 శ్లో.) అట్టిమాట లేమియును జెప్పకయే కృష్ణుడు సత్యభామ ననునయించుమార్గము గానక యామెపాదములకడ తనశిరసు నుంచి మ్రొక్కినట్లు తిమ్మనగా రీక్రిందిపద్యమును కల్పించి వ్రాసిరి –

'పాటలగంధిచిత్తమునఁ బాటిలుకోపభరంబుఁ దీర్ప నె
ప్పాటను బాటు గామి మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియ వెట్ట నాజగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్'
(1 ఆ - 120 ప)

ద్వారకనుండి స్వర్గలోకమునకు పోనున్న నారదునితో 'నారదా! నిత్యధర్మపరాయణ లగుస్త్రీలచే ధర్మార్థముగా పారిజాతము దాన మీయబడిన దని విని నాభార్య లావృక్షమును దానమీయఁ గోరుచున్నారు. పుణ్యార్థము, దానధర్మార్థము, మత్ప్రీత్యర్థము దానిని ద్వారకకు పంపి, దానముగా నిచ్చినపిమ్మట నీవు దానిని స్వర్గమునకు తీసికొనిపొమ్ము – అని నామాటగా నీ వింద్రునికి చెప్పు' మన్నాడు కృష్ణుడు.

అంతట నారదుడు 'కృష్ణా! ఆయింద్రు డాపారిజాతము నిచ్చుట కంగీకరింపడు. ఆవృక్షము శచీదేవియుద్యానవనమున నుండున ట్లింద్రుడు వరము పొందినాడు. సర్వకామప్రద మైనయాతరువు శచీదేవికిని నింద్రునికిని నభీష్టము లొసంగుచుండును. కనుక సహస్రాక్షుడు దానిని నీ కీయడు. నేను సత్యమునే చెప్పుచున్నాను.' అనగా కృష్ణుడు-

'నే నావృక్షమును తెచ్చి యిచ్చెద నని సత్యభామకు ప్రతిన చేసితిని. ఈనాప్రతిజ్ఞ నెవ్వరును భంగింపజాలరు. సోదరప్రేమతో నింద్రుడు నామాట మన్నింపనిచో నేను స్వర్గమునకు వచ్చి యాతని యురస్సున నాగద విసరెదను. ఎట్లయినను నీవుకూడ కార్యనిశ్చయము చేయుము' అనినట్లుగా హరివంశమునందలి 68వ యధ్యాయములో నుండగా తిమ్మకవి యావిషయమును పూర్తిగా మార్చివేసి -

'అదితి మొఱంగి కుండలము లానరకుండు హరించె, వాని నేఁ
గదనములోనఁ ద్రుంచి యవి కైకొని దాఁచితి నాఁటనుండియున్
బదిలము గాఁగ, న న్నడుగఁ బంపనికారణ మేమి? లాఁతినే?
యిదె చను దెంచి యిత్తు ననుమీ శతమన్యునితోడ సంయమీ!'

(2 ఆ - 28 ప)

అని గోపవధూజనవంచకుడు కలహాశనునిచే నింద్రునికి కబురు పంపినట్లుగా తిమ్మనగారు కల్పించిరి.

ఆయింద్రుఁ డెట్లును ఆపారిజాతమును కృష్ణు డడిగినను నొసంగ డని త్రికాలవేదియు, పరేంగితజ్ఞుడును నైనదేవర్షి చెప్పుచున్నను వినక యావృక్షమునకై నారదముఖమున నింద్రుని కృష్ణుడు యాచించుట తిమ్మనగారికి నచ్చలేదు. ఆహరివంశమునందలికృష్ణుని కన్న తిమ్మనగారు చిత్రించినయీకృష్ణుడు లౌక్యమునం దారితేరినవాడు. ఇంద్రుడు పారిజాతమును వదలుకొనుట కంగీకరింప డని నారదుడు చెప్పిననేకాని తెలిసికొనలేనియవివేకి కాఁ డాభగవంతుడు

కృష్ణుఁడు. కనుకనే దేవమాతకు నరకాపహృతకుండలముల నిచ్చునెప మున స్వర్గమున ప్రవేశించి, ఆపారిజాతము నపహరించుటకును, అవసర మైనచో నింద్రునితో యుద్ధముచేసియైన సత్యభామ కావృక్షము నిచ్చి తీరవలె ననియును కృష్ణుడు సంకల్పించుకొనియే యున్నాఁడు. కనుకనే సత్యభామ కట్టివాగ్దానమును చేసినాఁడు.

కావున తిమ్మనగారు చేసినయీమార్పు సముచితముగా నున్నది.

సాత్యకి నొకరథముపై నుంచి, ప్రద్యుమ్ను ననుసరింపు మని పలికి, మృగయావ్యపదేశమున విష్ణువు (కృష్ణుడు) రైవతకాద్రికి వెడలి తనకొఱకై ప్రతీక్షించుచుండు మని రథసారథికి చెప్పి (ద్వారక కేఁగి) సాత్యకితో హరి గరుడని నధిరోహింపగా నాకాశగామిని యగుమఱి యొకరథమును అధిష్ఠించి, ప్రద్యుమ్నుడు కృష్ణు ననుసరింపగా, కృష్ణుడు నందనవనమున కేఁగి, నానాయుధధారు లైనయచటి దేవయోధులు చూచుచుండగానే పారిజాతమును పెకలించి, గరుడనిపై నుంచి, విగ్ర హించిన పారిజాతమును భయపడవల దని చెప్పి యుపశమింపజేసి, (కృష్ణుడు) అమరావతికి ప్రదక్షిణము చేయగా – నందనవనపాలకు లింద్రునిపాలి కరిగి పారిజాతము హరింపబడిన దని చెప్పి రని హరివంశ మునందలి 73 వ యధ్యాయములోని మొదటిపదమూఁడు శ్లోకములలోని సారాంశము.

కృష్ణుడు పురోహితవృద్ధామాత్యసహితంబుగా నాస్థానమంట పమున కరిగి, యుగ్రసేన వసుదేవ బలభద్రాదిగురుజనంబులకు నమ స్కరించి, సోదరుల నాదరించి, కుమారవర్గంబు మ్రొక్కులు గైకొని, బంధుసందోహంబుల సంభావించి, 'పేరోలగంబుండి ' (2 ఆ – 71 వ వచనము) తాను తలంచినంతనే గరుత్మంతుడు రాఁగా నారదాగమన మును, పారిజాతప్రదానమును, సత్యభామమానరోషమును, తనప్రతి జ్ఞయు గరుడనికి సాదరముగా చెప్పి, దేవేంద్రునిపై ప్రాఁతపగ తీర్చు

కొనుట కవకాశము లభించినందులకు సంతసించుచున్న గరుడనిపై సత్యాకృష్ణు లధిరోహించి, స్వర్గమునకు పయన మైనా రనియు, మార్గ మధ్యమున శ్రీకృష్ణుకు సత్యభామకు మేరువుసోయగమును, కిన్నరులను, వెండికొండ కేఁగుసిద్ధపాంథులను, విద్యాధరులను, గంధర్వులను, యక్ష, గుహ్యక, గరుడ, చారణులను, సురగంగను, దివ్యర్షి నికేతనములను, వేలుపుటావును, నింద్రపురీవైభవమును, వర్ణించి చూపుచు స్వర్గపురమును జేరినట్లు పారిజాతాపహరణకావ్యమున ద్వితీయాశ్వాసములో చెప్పబడినది.

ఇంద్రు డష్టదిక్పాలకులతో, జయంతునితో, మేనకాదులతో నెదురేఁగి స్వాగత మిచ్చినట్లును, అప్సరోఽంగనలు హార్మ్యము లెక్కి జగన్మోహను డైన శ్రీకృష్ణుని దర్శించినట్లును, సత్యభామాయుతు డైన కృష్ణుడు దేవమాత యైనయదితిని చూచి నమస్కరించి, నరకహృత కుండలము లిచ్చినట్లును, దేవమాత శ్రీకృష్ణుని దీవించి, ఆశ్రీహరి యవతారములను నుతించి, శ్రీకృష్ణావతారవిభూతిని గణసమకదండకములో స్తుతించినట్లును, రమణీయ మైనవైజయంతమున కృష్ణుడు సత్యభామా సమేతుడై విడిది చేసినట్లును, ఆముద్దుగుమ్మతో నిరంతర వసంతవైభవవిలసిత మైననందనోద్యానసౌందర్యము నరయుచు సంచరించినట్లును తిమ్మకవి తృతీయాశ్వాసములో కల్పించెను.

కృష్ణుడు ప్రద్యుమ్నాదులతో స్వర్గముపై దాడిచేసి పారిజాతాపహరణ మొనరించినట్లు మూలములో నుండగా సత్యభామా సమేతుడై చుట్టపుచూపుగా నరకాపహృతకుండలముల నదితి కర్పించు నెపముతో నాశ్రీహరి స్వర్గమున ప్రవేశించి, పారిజాతాపహరణమునకు కడంగినట్లు తిమ్మనగారు మార్చిరి. కథ మఱింతగా రక్తికట్టుట కీమార్పు తోడ్పడినది.

పారిజాతమునందు కోరిక గలసత్యభామను తోడ్కొని హరి అసహాయశూరుడై యమరపురి కరిగె ననుట సరసముగా నుండుటయే

కాక – అసమానజగదేకధన్వి యైన శ్రీకృష్ణు డమరులతోడి సమరము నకై మఱియిద్దఱిని తనకు సాయముగా తీసికొనివెళ్లె ననుట శ్రీహరి కుత్కర్షాపాదకము కాదనునుద్దేశముతోనే తిమ్మకవి మూలకథాంశము నీవిధముగా మార్చి యుండును.

'తేషాం సంపశ్యతామేవ పారిజాతం మహాబలః
ఉత్పట్యారోపయామాస పారిజాతం సతాం గతిః'
(73 అ - 9 శ్లో)

స్వర్గమును చేరినవెంటనే శ్రీకృష్ణు డాయుధధారులైనవీరులు చూచు చుండగా – పారిజాతము నుత్పాటించినట్లు పైశ్లోకములో నున్నది. కృష్ణుం డిట్లు (కేవల మొక బందిపోటు వలె) వర్తించుట తిమ్మనగారికి రుచింపలేదు. దేవకార్యార్థమై (అదితికి కుండలము లిచ్చునెపమున) చుట్టపుచూపుగా సభార్యుడై స్వర్లోకమున కరిగిన శ్రీహరి సావకాశ ముగా పారిజాతహరణమునకు పూనినట్లును, అవసరమైనప్పు డవసరమై నంతవఱకే పరాక్రమించినట్లును తిమ్మకవి చెప్పుట సముచితముగా నున్నది.

"గరుడం పక్షిరాజాన మయత్నేనైవ (భారత !) .... సకేశవమ్"
(73 అ - 10 శ్లో)

శ్రీకృష్ణుడు పారిజాతమును పెకలింపగా నాతరువు విగ్రహించిన దని పైశ్లోకభావము.

"సాన్త్వితో వాసుదేవేన పారిజాతశ్చ (భారత !)
ఉక్తశ్చ వృక్షమాభైస్త్వం కేశవేన మహాత్మనా"
(73 అ - 11 శ్లో)

'ఓవృక్షమా! భయపడకుము' అని పలికి వాసుదేవు డాపారిజాత తరువు నుపశమింపజేసెను – అని పైశ్లోకమునందలిభావము. కాని – తిమ్మనగారి రచనలో నీభావము పూర్తిగా తారుమారైనది.

'సకలసురైకవంద్యుఁ డగుచక్రధరుం డిదె నేఁడు దన్ను ను
ర్వికిఁ గొనిపోవ వచ్చె నని వెక్కసమైనమనఃప్రభూతకౌ
తుకమునఁబోలె సంభ్రమముతో నటియించె నభీష్టవస్తుదా
యక తరుచక్రవర్తి యపు డాతతవాతవిధూతశాఖమై'

(4 ఆ - 51 ప)

అని తిమ్మనగారికావ్యము చెప్పుచున్నది. సురలోకమున నుండుటకన్న సకలసురైకవంద్యుఁ డైనశౌరికడ నుండుట ఆతరువునకు మఱింతకౌతుక కారణ మైన దఁట! ఇట్లు మూలమును మార్చుటలోనియౌచిత్యమును సహృదయు లెఱుంగకపోరు. తిమ్మనగా రంతటితో నూరకొనలేదు. మఱొక్కయడుగు ముందునకు వేసినారు. శ్రీహరిసాన్నిధ్య మనునదృష్టము తమ కబ్బలే దని తక్కినసురతరువులు నెవ్వఁగచే మధురసాశ్రుపూరమునించినట్లు (4 ఆ - 56 ప) కల్పించిరి. ఈయన్యథాప్రకల్పనము చక్కగా సరసముగా నున్నదికదా. పారిజాత సౌభాగ్యమున కితరసురతరువులు ఈర్ష్య వహించినట్లు చెప్పి, అవి నిస్సహాయస్థితిలో నెవ్వగ చెందినట్లు కూడ రచించినచో సత్యభామయీర్ష్య కీతరువుల యీర్ష్య యొకవిధమైనప్రతీకగా నుండి యింకను హృదయంగమముగా నుండెడిదేమో!

'తేతు నందనగోప్తారః పారిజాతో ద్రుమోత్తమః
హ్రియ తీతి మహేంద్రాయ గత్వా నృప శశంసిరే'

(73 అ - 13 శ్లో)

అనుశ్లోకములో నందనవనపాలకు లింద్రునిచెంత కేఁగి "పారిజాతము హరింపబడిన" దని చెప్పినట్లుమాత్రమే యుండగా - తిమ్మనగారు- సత్యభామ పలికినగర్వోక్తులకు మోములు వ్రేలవైచికొని పోయి యింద్రునికి వా రావిషయమును శచీసమక్షమున తెల్పినట్లు మార్చినారు. తిమ్మనగారి సత్యభామ యీసన్నివేశములో శృంగారవీరమూర్తిగా సాక్షాత్కరించుటలో మూలమునలేనియుత్కర్ష ఆపాత్రమున

కాపాదింపబడినది. ఈయన్యథాప్రకల్పనమున తిమ్మకవి సాధించిన ప్రయోజన మిది. అంతేకాదు - ఇంద్రుడు శచీసమేతుడై యుండగా నందనపాలకులు సత్యాగర్వోక్తులను విన్నవించినట్లు తిమ్మనగారు కల్పించిరి. భార్యాసమక్షమున తా నుండగా - పరాయియాఁడుది యొకతె తన్ను తక్కువచేసి మాట్లాడి కవ్వించినట్లు వినుటచే తన భార్యముందు తనపరాక్రమమును నిరూపించుకొనవలసినస్థితిలో పడి యింద్రు డుపేంద్రునితో తలపడుట తప్పనిసరి యైనది. ఈకల్పనము వలన నీప్రయోజనముకూడ సిద్ధించినది. ఇంద్రుడు గర్వోక్తులు పలికి యుద్ధమునకు తరలివచ్చినట్లు తిమ్మనగారు చేసినమనోహరకల్పనము మూలములో లేదు. ఇంద్రుడు వచ్చి "యిది యేఁ ?" మని యడుగ గానే -

'ప్రణమ్య గరుడస్థోఽథ కేశవః శక్ర మబ్రవీత్
వధ్వాస్తే పుణ్యకార్యాయ నీయతేఽయం వరద్రుమః'
(73 అ - 16 శ్లో)

అనగా - గరుడస్థుఁడైనహరి యింద్రునికి నమస్కరించి "స్త్రీలపుణ్యకార్యముకొఱకీవృక్షరాజము తీసికొనిపోబడుచున్నది." యనినాఁడని భావము.

ఇంద్రునిదివ్యాస్త్రము లన్నియును శ్రీహరియందు డిందగా - తా నపరాధి నని దేవేంద్రుడు కృష్ణునికి పాదాక్రాంతు డైనప్పుడు మాత్రమే కృపార్ద్రచిత్తు డైనహరి -

ఉ. "లెమ్ము సురేంద్ర ! నీవలన లే దొకతప్పును నీమఱంద లీ
కొమ్మ వదాన్యభూరుహముఁ గోరినఁ దెచ్చితిఁగాని, కొమ్ము నీ
సొమ్మని వజ్ర మిచ్చి మధుసూదనుఁ డాతరు వీఁ దలంచినం
గ్రమ్మఱ మ్రొక్కి వాసవుఁడు కందళితప్రమదాంతరంగుఁడై"
(5 ఆ - 39 ప)

ఉ. "సొమ్మన నెద్ది ? యే ననఁగ సొమ్మున కెవ్వఁడఁ ? గర్త నీవు నీ
సొమ్మఖిలప్రపంచమును శూరకులంబు నలంకరించి నీ
వమ్మహి నుండునంతకు ననన్యదురాపము పారిజాతభూ
జమ్మును నుండు నన్న వికసన్ముఖుఁడై హరి వీడుకొల్పెచున్"
(5 ఆ - 40 ప)

అని తిమ్మనగారు ప్రకల్పించిరి. మూలములోవలె దొరకిపోయిన దొంగగా కాక - శ్రీకృష్ణుని ధీరోదాత్తుడుగా తిమ్మనగారు చిత్రించుట కీయన్యథాప్రకల్పనము తోడ్పడినది.

ఇంద్రునివాహన మైన ఐరావతమునకును, నుపేంద్రుని వాహనమైనగరుత్మంతునకును ఘోరముగా పోరు జరిగినట్లును, అం దింద్రునివెల్లయేనుగు తీవ్రముగా దెబ్బతిని పతనమైనట్లును మూలము లోని 73వ యధ్యాయమునందలి 85వ శ్లోకమునుండి 92వ శ్లోకమువఱ కును వర్ణింపబడియుండగా - దానిని మార్చి తిమ్మకవి -

సీ. హరి బాణలూనంబు లై వచ్చునమరాస్త్ర
ఖండము ల్దూల్చుఁ బక్షముల జడిసి
యమృతగంధాసక్త మగుచంచుపుటమున
వడి సింధురంబులఁ బొడిచి యెత్తు
నధిపుఁ దేసినఁ బాఱునాళుగంబులకంటె
మునుమున్న చని లక్ష్యముల దళించు
భటులపై హరులపై బహురథాగ్రములపై
నొక్కఁడయ్యును దోఁచుఁ బెక్కుగతుల

నఖముఖంబుల నిఱికి గంద్రలుగఁ జేయు
దివిజబిరుదధ్వజంబు బుద్రేకవృత్తి
నిఖిలలోకాద్భుతావహానిర్నిరోధ
విక్రమస్ఫూర్తి ఖగరాజచక్రవర్తి"

అని యెటు చూచిన తానయై పరాక్రమించినయాఖగరాజువిక్రమ మంతయు కన్నుల గట్టునట్లొక్కపద్యములో రచించి కథ నెంతో రక్తికట్టించినాడు.

'ఉపేంద్రం న మహేంద్రోఽథ
నైవ విష్ణుః సురేశ్వరం
తాడయామాస తు రీవ్రా
శస్త్రైః శక్తావపి ప్రభో'
(75 అ - 6 శ్లో)

"శక్తిసంపన్నులైనను నింద్రుడు కృష్ణుని, కృష్ణుడింద్రుని శస్త్రము లచే కొట్టుకొనకుండిరి" అన్నమూలవిషయమును అనుచిత మను దృష్టితో తిమ్మనగారు మార్చి తనకావ్యమున నౌచిత్యమును పరి పోషించిరి. ఇంద్రోపేంద్రులకు జరిగినయుద్ధము తీవ్రమైనదే - పైగా కృష్ణునిపై దేవేంద్రుడు క్రోధమున వజ్రాయుధమును ప్రయోగించి నాడు. కనుక పై చెప్పిన యన్యథాప్రకల్పనము అర్థవంత మైనది.

'మునిం తదా సంస్మృతవాన్ స నారదం
జనార్దనః సర్వగుణోచితం వశీ
ప్రతిగ్రహార్థం వ్రతకస్య సత్యయా
యథోపదిష్టస్య పురన్దరానుజః'
(75 అ - 69 శ్లో)

సత్యభామయొక్కవ్రతదానపరిగ్రహార్థము కృష్ణుడు నారదుని స్మరించి నట్లు పైశ్లోకమున నున్నది. కాని - కలహాశనముని తాను ఘటించిన సవతులకయ్యమునకు ఫలితముగా సత్యభామకు పారిజాతము దక్కినది కనుక - ఆమెలో నింకను మిగిలియున్నయహంకారమమకారములను నశింపజేసి, భగవంతుడైనకృష్ణుడామెకొక్కతెకుమాత్రమే కాక తన వంటిభక్తజనులకుకూడ దాసుడే యనువిషయమును నిరూపించి సత్య భామకన్నులు తెరిపించునుద్దేశముతో పిలవనిపేరంటముగా ద్వారకకు వచ్చి సత్యచే పుణ్యకవ్రతమును చేయింపనెంచినాడు. కనుక కృష్ణుడు స్మరింపగా నారదుడు వచ్చినట్లు మూలములో నున్నవిధముగా చెప్పుట కన్న తిమ్మనగారు చేసినయీయన్యథాప్రకల్పనము మూలముకన్న వేయిరెట్లు మిన్నగా నున్న దనక తప్పదు.

" అథ కృష్ణస్య కౌరవ్య ధ్యాతమాత్ర స్తపోధనః
అజగామ మునిశ్రేష్ఠో నారదో వదతాంవరః "

(76 అ - 1 శ్లో)

కృష్ణుడు ధ్యానింపగా ద్వారకకు నారదమహర్షి వచ్చినా డని పై శ్లోక మునందలిభావము. భగవత్సంకల్పము నెఱింగి కథారంభమున తనంత తానుగా వచ్చిననారదుడు - కథాంతమునకూడ తనకు తానుగానే ద్వారకకు వచ్చి పరమేశ్వరసంకల్పము తన ద్వారా ఫలింపజేయుటకై సత్యభామచే పుణ్యకవ్రతాచరణ మొనరించె నని తిమ్మనగారు చెప్పుట సమంజసముగా నున్నది. తిమ్మనగారు తీర్చిదిద్దినప్రకారమే నారద పాత్రకు గలస్థానము సముచితముగా నుండును. కనుక నీయన్యథాప్రక ల్పనము సమంజసమే.

నరకాసురవధ మైనవెంటనే పక్షిశ్రేష్ఠుం డైనగరుత్మంతుడు మణిపర్వతమును భార్యాసహితు డైనకృష్ణునికూడ లీలగా వహించి మేరుపర్వతముమీఁదుగా ననేకలోకము లతిక్రమించి దేవలోకమునకు తీసికొనిపోగా జనార్దనుడు శక్రభవనమును ప్రవేశించినట్లును, నింద్రుడు శ్రీకృష్ణు నభినందించినట్లును, వానికి కుండలముల నిచ్చి నరశ్రేష్ఠు డయిన జనార్దనుడు భార్యాసమేతు డై విబుధశ్రేష్ఠునికి నమస్కరించినట్లును, ఇంద్రుడు రత్నములచే నాతనిని ప్రతిపూజింపగా శచీదేవి సత్యభామ నభినందించినట్లును, నాతరువాతనే వాసవుడును, వాసుదేవుడును గలసి దేవమాత యగునదితిభవనమున కేగినట్లును సంస్కృతహరివంశమున నున్నది. [1]

1. " మణిపర్వతశృంగంచ సభార్యంచ జనార్దనం — 64వ అధ్యాయము
ఉవాహ లీలయా పక్షీ గరుడః పతతాం వరః — 44వ శ్లోకము

సమేరుగిరి మాసాద్య దేవగంధర్వసేవితమ్
దేవసద్మాని సర్వాణి దదర్శ మధుసూదనః — 48

విశ్వేషాం మరుతాంచైవ సాధ్యానాంచ నరాధిప 64వ అధ్యాయము
భ్రాజమానా న్యతిక్రామ న్నశ్వినోశ్చ పరంతప 49వ శ్లోకము
ప్రాప్య పుణ్యతమాం లోకాన్ దేవలోక మరిందమ
శక్రపద్మ సమాసాద్య ప్రవివేశ జనార్దనః 50
అవతీర్య సతార్క్ష్యాత్తు దదర్శ విబుధాధిపం
ప్రీతశ్చైవాభ్య నన్దత్తం దేవరాజః శతక్రతుః 51
ప్రాదాయ కుండలే దివ్యే వవన్దేతం తదాఽచ్యుతః
సభార్యో విబుధశ్రేష్ఠం నరశ్రేష్ఠో జనార్దనః 52
అర్చితో దేవరాజేన రత్నైశ్చ ప్రతిపూజితః
సత్యభామాచ పౌలోమ్యా యథావ దభినందితా 53
వాసవో వాసుదేవశ్చ జగ్మతుః సహితా తదా
అదిత్యా భవనం దివ్యం దేవమాతు ర్మహర్థిమత్ " 54

సంస్కృతహరివంశమున నీవిధముగా నుండగా తిమ్మన పారిజాతాపహరణమున నారదు డిచ్చినసురలోకపారిజాతసుమమును కృష్ణుడు రుక్మిణి కిచ్చుటచే కుపితయైనసత్యభామను ప్రసన్నురాలి నొనర్చుకొనుటకై శ్రీకృష్ణుడు సత్యభామాసమేతుడై గరుడవాహనముపై సురలోకమున కేగిన ట్లున్నది. అంతే కాదు – శ్రీకృష్ణుడు నరకాపహృత కుండలముల నింద్రుని కిచ్చినట్లు సంస్కృతమున నుండగా సత్యభామాసమేతుడై నకృష్ణుడే స్వయముగా నదితికి కుండలముల నిచ్చినట్లు తిమ్మనగారు రచించిరి. సంస్కృతమూలముతో పోల్చి చూచినచో తిమ్మకవి చేసినయీమార్పు ఔచితీశోభితముగా నున్నది.

## (e) మూలత్యాగము

పారిజాతప్రసూనప్రశస్తిని వర్ణించుచు రుక్మిణితో నారదుడు

" ఏతదేవ భగాధానమ్
ధర్మిష్ఠే పుత్త్రిదమ్ తథా
మతించ నాశుచే ధత్తే
ధార్యమాణమ్ సదా శుభే.
(65 అ - 25 శ్లో)

యద్య దిచ్ఛసి వర్ణంచ తత్సర్వమ్ ధారయిష్యతి
స్వల్పమ్ వా యది వా స్థూలమ్ ఛన్దత స్తే భవిష్యతి.
(65 అ - 26 శ్లో)

అనిష్టగంధహారణం
తత్సమమ్ గంధవర్ధనమ్
ప్రదీపకర్మ రాత్రౌ చ
కరోతి కమలేక్షణే.
(65 అ - 27 శ్లో)

సంతానక స్రజోమాలామ్ పుష్పవస్త్రాదివాఽచ్యుతమ్
పుష్పమండపముఖ్యాని చింతితేన ప్రదాస్యతి.
(65 అ - 28 శ్లో)

అని పలికినట్లు హరివంశమున నుండగా తిమ్మకవి యిట్టికొన్ని శ్లోక భావములను పూర్తిగా విడిచిపెట్టినాడు. ఈవిడుచుటవలన కావ్యము నకు కలిగిననష్టము లేదు. కనుక నీమార్పు సముచిత మైనదే.

"యాని యాని చ పుష్పాణి
త్వమ్ దే వ్యభిలషిష్యసి
కుసుమం వృక్షరాజస్య
తాని తాని ప్రదాస్యతి"
(65 అ - 24 శ్లో)

పారిజాతపుష్పమే తన కుండగా రుక్మిణి యాపూవు నడిగి యితరపుష్ప ములను బడయుట యనవసర మనియు, ననుచిత మనియు తలంచి కాబోలు - తిమ్మకవి పై శ్లోకభావమును తనరచనలోనికి జొరకుండ పూర్తిగా పరిత్యజించినాడు. ఇది తిమ్మకవిగారియౌచిత్యదృష్టికి నిదర్శ నముగా పేర్కొనవచ్చును.

ఈవిధముగా నందందు మూలభావపరిత్యాగమాత్రముచేతనే యనౌచిత్యమును బరిహరించి తెలుగుకవులు కొందఱు సంస్కృత కవులను తల దన్నుట గమనింప దగినవిశేషము.

"యద్య దిచ్ఛసి వర్ణంచ -
తత్సర్వం ధారయిష్యతి
స్వల్పం వా యది వా స్థూలం
ఛన్దత స్తే భవిష్యతి"
(65 అ - 26 శ్లో)

ఆపూవు రంగులు మార్చుటవలనను, చిన్నదియు, పెద్దదియు నైనందు వలనను రుక్మిణి కొరగునది లేదనును ద్దేశముతో కాబోలు తిమ్మకవి యీశ్లోకభావమును స్పృశింపక విడిచినాడు.

" అనుగీతాని గీతాని
దాస్యత్యపిచ చింతితే
సువా ది్రాన్ సుమధురాం
స్త థైవ తవ సమ్మతాన్ "
(65 అ - 30 శ్లో)

పై శ్లోకమువలెనే యీశ్లోకమును తెలుగున పరిత్యజింపబడినది. ఎడం దలలో ప్రేమగీతము నినదించుచుండగా నితరగీతములతో పని యేమి? మని కాబోలును - తిమ్మకవి దీని నుపేక్షించినాడు.

# పూలత్యాగము

సంస్కృతహరివంశమునందలియరువదినాలుగవయధ్యాయ ప్రారంభ మి ట్లున్నది :-

" నిహత్య నరకం భౌమం
వాసవోపమవిక్రమం
వాసవావరజో విష్ణుః
దదర్శ నరకాలయం "
(64 అ - 1 శ్లో)

పై శ్లోకమునందలి " నిహత్య నరకం విష్ణుః " అనువిషయమును మాత్రమే గ్రహించి నందితిమ్మనగారు " హరి నరకాసురున్ గెలిచి " అని యాంధ్రీకరించి

" అథార్థగృహ మాసాద్య
నరకస్య జనార్దనః
దదర్శ ధన మక్షయ్యం
రత్నాని వివిధాని చ "

అన్నయరువదినాలుగవయధ్యాయమునందలి రెండవశ్లోకమునుండి

" త్రివిష్టపసమే దేశే
తిష్ఠ న్తీరపరాజితాః
నిర్విశాన్త్యే మథా దేవ్యః
సుఖిన్యః కామవర్జితాః "

అన్న యిరువదియారవశ్లోకమువఱకును నున్న విషయమునంతటిని విడిచి పెట్టినాడు. పారిజాతాపహరణకథ కేమాత్రమును సంబంధము లేని యీశ్లోకభావములను పూర్తిగా త్యజించుట తిమ్మకవిగారియౌచిత్య దృష్టికి నిదర్శనము.

" సముత్సృజన్తీ వసనమ్ సకుంకుమమ్
శుచిస్మితా శుక్లతమైక మంశుకమ్
జగ్రాహ రోషాకులితేన చేతసా
వహ్నేస్తదా శ్రీరివ వర్ధితేంధనా "
(65 అ - 51 శ్లోకము)

" దందహ్యమానా జ్వలనేన వర్ధతా
ఈర్ష్యాసముత్థేన గతప్రభేవ
క్రోధాన్వితా క్రోధగృహమ్ వివిక్త
వివేశ తారేవ ఘనమ్ సతోయమ్ "
(65 అ - 52 శ్లో)

" బద్ధ్వా లలాటే హిమచంద్రశుక్లమ్
దుకూలపట్టమ్ ప్రియరోషచిహ్నమ్
పర్యన్తదేశమ్ సరసేన దేవీ
విలిప్య సా లోహితచందనేన "
అ - 53 శ్లో)

" సంస్మృత్య సంస్మృత్య శిరః సరోషం
ప్రకంపమానా సముపోపవిష్టా
దీర్ఘోపధానే శయనేఽపనీయ
విభూషణా న్యేవ నిబద్ధవేణీ " (65 అ - 54 శ్లో)

అని సత్యభామరోషచిహ్నములను వర్ణించినహరివంశము

" అకారణార్ధేన వికృష్యమాణా
ప్రేష్యాజనస్యాభిజనాన్వితాఽపి
విచూర్ణయామాస కుశేశయమ్ సా
నిఃశ్వస్య నిఃశ్వస్య నఖై ర్నతభ్రూః "
(65 అ - 55 శ్లో)

అను శ్లోకములో నకారణముగా సత్యభామ కోపించిన దని చెప్పబడి నది. సవతి యైనరుక్మిణిసమక్షమున నారదుడు సత్యభామపై రెత్తి యామెను కించపరచినట్లు చెప్పిన హరివంశమే సకారణ మైనసత్యభామరోష మకారణ మనుట యసంగతముగా ననుచితముగా నున్నది. తిమ్మకవి యీయనౌచిత్యమును విసర్జించి సత్యభామకోపము సకారణమే యనియు, నామెకు మనస్తాపము కలిగించి కృష్ణుడు నేరము చేసిననాథుఁ డైనాఁడనియు, " నాథుల్ నేరముల్ సేయఁ బేరలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారముల్ నేర్తురే ? " (పారిజాతాపహరణము - 1 ఆ - 121వ పద్యము) అనియు సత్యభామకోపమును సమర్ధించి, మూలములోనియనౌచిత్యమును తనరచనలో పరిహరించినాడు.

" విచూర్ణయామాస కుశేశయం సా
నిఃశ్వస్య నిఃశ్వస్య నఖై ర్నతభ్రూః "
(65 అ - 55 శ్లో)

అనుశ్లోకభాగమున సత్యభామ తనగోళ్ళచే తనముఖపద్మమును బాధింపజేసికొన్న దని యున్నది.

" వాసెనకట్టు కట్టి నిడువాలికఁ గస్తురిపట్టు వెట్టి లో
గాసిలి చీఁకటింటికడకంకటిపై జలదాంతచంద్రరే
ఖాసదృశాంగి యై పొరలె గాఢమనోజవిషాదవేదనన్ "

అని వర్ణించి తిమ్మనగారు పైశ్లోకభావమును త్యజించిరి. ఈమూలత్యాగమువలన కావ్యమునకు వచ్చినలోటు లేదు కనుక నీమార్పు సమర్థనీయమే.

" ఉపవిష్టం మునిం జ్ఞాత్వా
రుక్మిణ్యా సహ కేశవః
నిశ్చక్రామం ప్రమేయాత్మా
వ్యపదేశేన సర్వవిత్ "
(66 అ - 1 శ్లో)

రుక్మిణితో నారదుడు కూర్చుండి యుండగా నెదో మిషతో కృష్ణు డచటినుండి (సత్యభామాసౌధమునకు) బయలుదేరినా డని పై శ్లోక భావము. ఇంటికి వచ్చినయతిథి నట్లు విడిచివెళ్ళుట గృహస్థుమర్యాద కాదు. కనుక తిమ్మనగా రీశ్లోకభావమును పూర్తిగా విడిచిపెట్టినారు.

ఈయరువదియారవయధ్యాయమునందే యున్నమూడవ, నాలుగవశ్లోకములలో సత్యభామమందిరమును శ్రీకృష్ణుడు ప్రవేశించి నట్లు చెప్పి, మరల నైదవశ్లోకములో - నారదోపచారార్థము ప్రద్యుమ్నుని కృష్ణుడు నియమించినట్లు హరివంశములో నున్నది. మూలము లోనియీప్రక్రమభంగదోషమును పరిహరించి తిమ్మనగారు

" నారదస్యోపచారార్థం
ప్రద్యుమ్నం వినియుజ్యసః "
(66 అ - 5 శ్లో)

అన్నశ్లోకభాగమునుమాత్రము గ్రహించి

" ........సాత్రాజితిబోటి నావలనఁ దా నేమేమి కల్పించెనో
యని ప్రద్యుమ్నుని మౌనిదండ నిడి చింతాయత్తచిత్తంబునన్ "
(పారిజాతాపహరణము - 1 ఆ - 103 ప)

అరదము నెక్కి కృష్ణుడు బయలుదేరినా డని తిమ్మనగారు రచించిరి.

" నిబధ్య భ్రుకుటిం వామాం
సమ్యగ్వీక్షిప్యలోచనే
నివేశ్య వదనం హస్తే
శోభసీ త్యబ్రవీ ద్ధరిమ్ "
(66 అ - 23 శ్లో)

కోపముచే కనుబొమముడి వైచి, మోమును చేత నుంచుకొని " శోభించుచున్నావు " అన్న దట హరివంశమునందలిసత్యభామ. కుపిత యైన యాభామ నల్లనివాని న ట్లనుటలో హేళన యున్నది. అందముగా నున్నను నీమూలభావము తెలుగున తిమ్మనగారిచే విడిచిపెట్టబడినది. ఇట్లు తిమ్మనగారు చేసినమూలత్యాగ మొకదృష్టితో చూచినచో సమర్థనీయము కాకున్నను - మఱియొకదృష్టితో చూచినచో సమర్థనీయమే యగుచున్నది. అది యెట్లనగా - తిమ్మనగారిసత్యభామ అంత తేలికగా బయటపడునది కాదు. కనుకనే యేమియు మాటాడక

" తల వాంచి మగుడ ముసుఁగిడి "
(1 ఆ - 111 ప)

నట్లు తెలుగుకావ్యములో చెప్పబడినది.

" తస్యాః సుస్రావ నేత్రాభ్యాం
వారి ప్రణయకోపజం

మవశ్యాయ జలం యథా "
(66 అ - 24 శ్లో)

తామరరేకులనుండి నీరు జారినట్లు సత్యభామనేత్రములనుండి ప్రణయకోపజ మైనబాష్పములు స్రవించె నని చెప్పినపై శ్లోకభావము బాగున్నను - "సత్యభామవదనాంబుజమునుండి పడినసీటిని పతి తనకరములచే

ప్రతిగ్రహించి తనవక్షమున నలందికొన్నా "[1] డని మూలములో నున్న భావ మింపుగా లేదు. కనుక తెనుగున నాభావములను (24 వ శ్లోకభావముతో బాటు) తిమ్మనగారు పరిత్యజించిరి. కనుక నీమూలత్యాగము సమర్థనీయమే.

కృష్ణుడు సత్యభామశోక కారణ మెఱుంగగోరి యామెను ప్రశ్నించిన ట్లీక్రిందిశ్లోకము లున్నవి :-

" స్రవ త్యసితపత్రాక్షి !
కిమర్థం తవ భామిని !
తోయం సుందరి ! నేత్రాభ్యాం
పుష్కరాభ్యా మివోదకం "
[66 అ - 27 శ్లో]

" ప్రభాతే పూర్ణచంద్రస్య
మధ్యాహ్నే పంకజస్యచ
బిభర్తి తవకిం వక్త్రం
వపు స్తవ మనోహరే "
[66 అ - 28 శ్లో]

" పుష్కరములనుండివలె నీనేత్రములనుండి నీ రేల స్రవించుచున్నది? నీ ముఖము ప్రభాతచంద్రునివలె - మధ్యాహ్నపద్మమువలె నేల

---

1. " సముత్పత్య జలం తత్ర
పతితం వదనాంబుజాత్
ప్రతిజగ్రాహ పద్మాక్షః — 66వ అధ్యాయము
కరాభ్యా మతిసత్వరః " — 25వ శ్లోకము

అథోరసి పతత్తోయం శ్రీవత్సాంకో౽మ్బుజేక్షణః
ప్రియానయనజం దేవః పరిమృజ్యేద మబ్రవీత్. 26

యున్నది ? " అన్నపై శ్లోకభావములు మనోహరములుగా లేకపోవుటచే వానిని తిమ్మనగారు పరిత్యజించుట సముచితముగా నున్నది.

" శ్వేతేన తవపాదేన
వాసస్సా ప్రియదర్శనే
లలాటం సేవ్యతే కస్మాత్
చందనేన సుగంధినా ? "
(66 అ - 32 శ్లో)

" సరసే నాయతాపాంగి !
కాంతేన హృదయప్రియే !
ప్రఖోపమర్దం కేనాపి
కారణేనాననస్య చ
కరోషి మమవాఽత్యర్థం
మనోగ్లాపయసి ప్రియే ! "
అ శ్లో)

పేలవముగా నున్నపై రెండుశ్లోకభావములను పరిత్యజించి, తిమ్మకవి తనపాఠకులకు విసుగు కలుగకుండ జేసినాడు.

" కింవానాభరణం గాత్రం
సుగాత్రి ! తవ కథ్యతాం
చిత్రకస్థాన మాక్రాంతం
కస్మాదవరవర్ణిని "
అ - 31

అనుశ్లోకములోనిభావమును తిమ్మనగారు " ఇందునిభాస్య ! మైత్రొడవులేల ధరింపవు " అని తెనుగుచేసి

" రత్నై శ్చాభరణై ర్ముక్తా
తవగ్రీవా న శోభతే

గ్రహనక్షత్రరహితా
ద్యౌ రివావ్యక్తశారదీ ”
(66 అ - 35 శ్లో)

అనుశ్లోకములోకూడ పై 31వశ్లోకభావమే భంగ్యంతరముగా చెప్ప బడుటచే పై 35వశ్లోకమును తిమ్మనగారు పరిత్యజించిరి.

“ అల మిందీవరశ్యామే
రుదితేన మనస్విని ;
జలమంజనకల్మాషం
మామోక్షీ రాననద్విషం ”

అ -

“ త్వదీయోఽహం యదా దేవి
ఖ్యాతో జగతి కింకరః
న జ్ఞాపయసి కిం మాం త్వం
పురేవ వరవర్ణిని ”

అ -

“ నైవతాం మదనో జహ్యాన్
మృతేఽపి మయి మామకః
ఇతి మే నిశ్చితం విద్ధి
చేతః సురసుతోపమే ”

(66 అ - 43 శ్లో)

“ క్షమాదయశ్చ మేదిన్యాం
శబ్దాద్యా శ్చాంబరే గుణాః
ధ్రువం పంకజగర్భాభే
త్వయి స్నేహ స్తథా మమ ”

(66 అ - 44 శ్లో)

" రుచి రగ్నౌ యథా దివ్యా
ప్రభాచైవ దివాకరే
కాంతిశ్చ శాశ్వతీ చంద్రే
స్నేహ స్త్వయి తథా మమ "
(66 అ - 45 శ్లో)

పేలవముగా నున్నపై శ్లోకవిషయమును రససిద్ధు డయినతిమ్మకవిగారు తనరచనలోని కనుమతింపకపోవుట సముచితమే.

కృష్ణుడు సత్యభామకోపమునకు కారణ మడుగగా సత్యభామ యీ క్రిందివిధముగా పలికిన దని మూలములో నున్నది :-

" నీవు నావాడ వని నామనస్సు నిత్యమును దలంచును. కాని యిప్పుడు నీవలన సాధారణస్నేహమును మాత్రమే పొందితిని. (66 అ - 47 శ్లో)

" పూర్వము అనిత్యమును కాలవైపరీత్యమును దెలియనైతిని - ఇప్పుడు లోకగతిని తెలిసికొనుచున్నాను." (66 అ - 48 శ్లో)

" నీవుతక్క నితర మెఱుంగనినేను నీవును నావలెనే ప్రేమింతు వనుకొంటిని. పెక్కుమాట లేల ? (66 అ - 49 శ్లో)

" నేను ఋజుస్వభావురాల నని, భక్తురాల ననియు తెలిసి కూడ నీవు కైతవవృత్తియం దుండుటచే తెలియకున్నావు. " (66 అ - 51 శ్లో)

" ఇంతవఱకును జూడదగినదానినే చూచితిని. వినవలసినది వింటిని. స్నేహఫలోదయమును జూచితిని ".

పైనైదుశ్లోకములభావములును రసహీనములై సత్యభామలో బేలతనమును, వేదాంతధోరణిని చూపునవిగా నుండుటచే తిమ్మనగారు వానిని విడిచిపెట్టినట్లు స్పష్టమగును.

" శోకమలలోచనా ! నాయంగములు దహింపబడుచున్నవి వలె నున్నవి. నీదుఃఖకారణ మేమి ? " (67 అ - 2వ శ్లోక భావము)

" భర్తృదైనయీభర్త వినదగినది యైనచో చెప్పుము " (67 అ - 3 శ్లో)

అని కృష్ణుడు సత్యభామ నడిగిన ట్లున్న రెండుశ్లోకములవిష యమును పసలేనిది కావున పరిత్యజింపబడినది.

కృష్ణుడు కోరగా సత్యభామ తనదుఃఖకారణము నాయనకు చెప్పుచు - " నీ విచ్చినగౌరవముచే గర్వితురాల నైన నేను సపత్ను లచే ప్రశంసింపబడితిని." అని చెప్పినట్లు మూలములో నున్నది. [1]

తాను గర్వము గలదాన నని తనతప్పు నొప్పుకొనులక్షణము ప్రౌఢ యైన తెలుగుసత్యభామకు లేదు. పాదాక్రాంతు డైనమగనిశిర సును వామపాదమున తన్నినది చాలక పై పెచ్చు నిష్ఠురోక్తు లాడిన (తన) సత్యభామస్వభావమునకు విరుద్ధ మని తిమ్మనగారీవిషయమును విడిచిపెట్టినారు.

" మమాభవద్యతో రక్షా
భయ మద్య తతో మమ
సర్గతో రక్షతే యో మాం
సమాం నాద్యాభిరక్షతి " (67 అ - 16 శ్లో)

1. " త్వయైవ స్థాపితం పూర్వం
సౌభాగ్యం మమ మానద ।
జగ త్యమలపత్రాక్ష ।
యత్ఖ్యాతం కేశినాశన " — 67వ అధ్యాయము 5వ శ్లోకము

" శిరోవహామి చేష్టత్వాత్
తవాహం దేవ గర్వితా
సర్వసీమంతినీమధ్యే
స్పృహణీయాఽస్మి సర్వథా "

" హాగతిం కాం గమిష్యామి
త్యక్త్వా దేవ త్వయా విభో
కుముద్వతీ గతాం నూనం
గతిం యాస్యా మ్యసంగతా "

(67 అ - 17 శ్లోకము)

" కిమకార్ష మహం మోహా
దీశ్వరాణా ప్రియా ప్రియం
ప్రియాభూత్వాఽప్రియాభూత్వా
యద్యహం తవ మానద "

(67 అ - 18 శ్లో)

" పరపుష్టస్వనోన్మిశ్రం
పుష్పగంధవహం శుచిం
కథం నామానిలం ద్వేష్యా
సేవేయం దుర్భగా సతీ "

(67 అ - 20 శ్లో)

" సాత్రాజితి ప్రియా నాన్యా
త్వత్తో మేఽస్తీతి విద్ధి మాం
యదవోచః క్వతద్యాత
మథవా కః స్మరిష్యతి "

(67 అ - 22 శ్లో)

కృష్ణునితో సత్యభామ పలికినట్లు మూలములో నున్నపై నైదుశ్లోకములును నీరసముగా నుండుటచే తెలుగున నవి పరిత్యజింప బడినవి.

" తత్పారిజాతకుసుమం
తస్యా దేవి మమాగ్రతః
నారదో మత్ప్రియం కుర్వన్
ముని రక్లిష్టకర్మకృత్ "
(67 అ - 29 శ్లో)

" దాక్షిణ్యా దానురోధాచ్చ
దత్త్వా న్యాత్ర సంశయః
ప్రసీ దైకాపరాధం మే
మర్షయస్వ శుచిస్మితే "
(67 అ - 30 శ్లో)

పై శ్లోకములలో కృష్ణుడు గత్యంతరము లేక తాను పారిజాతపుష్పమును రుక్మిణి కిచ్చిన ట్లొప్పుకొని - అయినను తనయపరాధమును మన్నింపు మని సత్యభామను వేడుకొన్నట్లుగా చెప్పబడినది. లీలామానుషవిగ్రహుడుగా తాను తీర్చి దిద్దినకృష్ణునిచే నిట్టిమాట లనిపించుట యిష్టము లేక కాబోలును తిమ్మకవి పై రెండు శ్లోకములను తనరచనలోని కనుమతింపలేదు. పారిజాతాపహరణమునందలికృష్ణుడు ఏమియు నెఱుంగని వాడువలె సత్యభామ నోదార్పబూనుటచే నీమూలశ్లోకపరిత్యాగము సమర్థనీయ మగుచున్నది.

కృష్ణుడు పారిజాతవృక్షమును దెచ్చి యిత్తు ననగానే సత్యభామ - అది శక్య మైనచో తన కధికసుఖమును, సీమంతినులలో నాధిక్యమును గలుగు నన్నట్లుగా మూలములోనియీక్రిందిశ్లోకములో నున్నది :-

" ఏవ ముక్తా తు హరిణా
ప్రోవాచ హరివల్లభా

యద్యేవం స ద్రుమః శక్య
స్త్విహానయితు మచ్యుత "
(67 అ - 33 శ్లో)

" మన్యే రేష పరిమృష్టో హి
భవే ద్వృహుగుణం మమ
సీమంతినీనాం సర్వాసా
మధికా స్యామధోక్షజ "
(67 అ - 34 శ్లో)

మానవతి యైనసత్యభామరాజసప్రవృత్తి కీమాటలు భంగకరములు కనుక తిమ్మకవి ఈశ్లోకములను తనరచనలోనికి స్వీకరింపలేదు.

కృష్ణుడు సత్కరించి యిచ్చినదానిని నారదుడు శ్రద్ధగా భుజించి, సంతృప్తుడై యిచ్చినయాశీస్సులను కృష్ణుడు మనసుచేతనే స్వీకరించినాడని మూలమున నున్నదానిని [1] తిమ్మకవి పరిత్యజించెను.

" అన్నదాతా సుఖీ భవ " యని యాశీర్వదించుట భోక్త యైననారదునివిధి యైనను భగవంతుని నారదు డాశీర్వదించుట విడ్డూరముగా తోచినదికాబోలు - తిమ్మకవి మూలత్యాగ మొనరించినాడు.

కృష్ణుడు నారదునియనుజ్ఞ పొంది దేవబ్రాహ్మణశేషమును భుజించినాడు. సత్యభామ పతియనుజ్ఞచే నంతర్గృహమును బ్రవేశించెను. అట్లు నిర్గమించినసత్యభామ కృష్ణుననుజ్ఞచేతనే యామహాత్ము

1. తల్లోకకర్త్రా సత్కృత్య దత్తం ముని రుదారధీః — 67వ అధ్యాయము
బుభుజే వదతాం శ్రేష్ఠః శ్రద్ధయా పరయాయుతః — 42వ శ్లోకము

ఉపస్పృశ్య తత స్తృప్తః ప్రదదౌ చాశిషః ప్రభో
తాశ్చ ప్రీతేన మనసా ప్రతిజగ్రాహ కేశవః — 43

నికి నమస్కరించి కృష్ణునిపార్శ్వమున కూర్చుండెను [1] "- అని హరి వంశమున నున్నవిషయము తనకావ్యమున కుపకరింపదు కనుక తిమ్మకవి దానిని వదలిపెట్టినాడు.

నారదుడు శక్రలోకమునకు పోవుటకుముందు అధోక్షజునికి స్వర్గలోకమున ప్రతిమాసమును జరుగుశివపూజామహోత్సవమును గూర్చియు, శచీదేవి కిష్టమై, దేవోపభోగ్య మైనపారిజాతము సౌభాగ్య ప్రద మనియు, పుణ్యకవ్రతముకొఱకై కశ్యపుడు సృష్టించినా డనియు, పూర్వ మదితిచే సంతుష్టు డైనకశ్యపు డదితికొఱకై సర్వకామ ప్రదమును, నిత్యగంధపుష్పముల నిచ్చునదియు నైనపారిజాత మును సృష్టించినా డనియు, నావృక్షమునందు సర్వభూతమనో హార మైనత్రిశాఖమును, సమస్తపుష్పములును జూడబడె ననియు, ఒకటి యట్టిపుష్పములను ధరించు ననియు, మఱియొకటి యనేకరూప ములను ధరించు ననియు, మఱియొకటి పద్మములను ధరించుననియు, కశ్యపుడు మందారవృక్షసారమును గ్రహించి పారిజాతమును సృష్టించె

1. "స కృష్ణోఽప్యభ్యనుజ్ఞాంతు
లబ్ధ్వా మునివరా త్తదా
బుభుజే విఘసం ధీమా
నప్రమేయపరాక్రమః — 67వ అధ్యాయము 47వ శ్లోకము

తతస్త్వావశ్యకం కృత్వా
సత్యభామాఽపి భారత!
అనుజ్ఞయా తదా భర్తు
ర్వివేశా స్వగృహం ముదా — 48

తతో వినిర్గతా దేవీ
కృష్ణ స్త్యైవాభ్యనుజ్ఞయా
స్థితా పార్శ్వేచ కృష్ణస్య
సమస్కృత్వా మహాత్మనే" — 49

ననియు, నందుచే నన్నితరువులకన్న నది గొప్పదనియు, పుణ్యముకొఱ కును, సౌభాగ్యముకొఱకును నదితి తనభర్తయైనకశ్యపుని తనకు (నారదునికి) దానము చేసి, నిష్క్రియముచే మరల మగనిని పొందె ననియు, అట్లే సౌభాగ్యార్థమై యింద్రాణి యింద్రుని తనకు (నారదు నికి) దానము చేసి మరల పొందె ననియు, విష్ణుపదమునకు ఉపరిజాత మైనది కనుక పారిజాత మని చెప్పబడిన దనియు, మందారపుష్పము లచే కూడి యుండుటచే మందార మని చెప్పబడిన దనియు, జనులు దానిని తెలియజాలక దారు వని చెప్పి రనియు, కనుక కోవిదార మను పేరుతో కూడ నావృక్షము ప్రసిద్ధమైన దనియు, మందార, కోవిదార, పారిజాత నామములతో నావృక్షము తెలియబడుచున్న దనియు నార దుడు చెప్పిన దంతయును – అనగా –

"తతా్ౕరిద్యం దేవ మీశానం
నమస్కృత్య మహేశ్వరం
గాస్యన్తి దేవగంధర్వా
స్తథై వాప్సరసాం గణాః"

అని యున్న 67వ యధ్యాయమునందలి 51వ శ్లోకమునుండి

"మందారః కోవిదారశ్చ
పారిజాతశ్చ నామభిః
స వృక్షో జ్ఞాయతే దివ్యో .
యస్యై తత్కుసుమోత్తమమ్"

అనియున్న 67వ యధ్యాయమునందలి డెబ్బదిరెండవశ్లోకమువఱకును గల విషయమును తనకావ్యకళాదృష్టితో (ననవసర మని) తిమ్మకవి పరిత్య జించినాడు.

సీ. "జలజాక్షి ! యిది పారిజాతప్రసూనంబు
నరులకు ధరియింప నరిది సూవె"
(పారిజాతాపహరణము - 1 ఆ - 58 ప)

అనుపద్యముతో ప్రారంభించి పారిజాతవృత్తాంతమును నారదుడు రుక్మిణికి చెప్పినట్లు రచించుటయు, నీమూలవిషయపరిత్యాగమునకు కారణము కానోపును.

సురతరువు సత్యభామకు పెరటిచెట్టుగా లభించినతరువాతనే నారదుడు ద్వారకకు మరల వచ్చి సత్యభామకు పుణ్యకవ్రతమహిమను దెలిపి, తద్వ్రతాచరణమునకై యామెను ప్రేరేపించినట్లు పారిజాతాపహరణములో పంచమాశ్వాసమున చెప్పుటకూడ నీమూలపరిత్యాగమునకు కారణమై యుండవచ్చును. అంతే కాక పారిజాతమహిమమును జెప్పి తద్ద్వారా పారిజాతాపహరణమునకు పురికొల్పుట తిమ్మనగారినారదుని యాంతర్యము. కనుక నాతరుమహిమనుగూర్చియే చెప్పించి, దాని పుట్టుకవిషయమును తిమ్మకవి వదలిపెట్టి యుండును. జనులకు ఫలముపైనాసక్తియే కాని - ఆఫలముల నిచ్చుచెట్టునుగూర్చి తెలిసికొనవలెననునాసక్తి లేకపోవుట సహజముగదా! ఈమూలవిషయత్యాగము వలన తిమ్మనగారికావ్యమునకుగాని, కావ్యత్వమునకుగాని వచ్చినలోపమేమియును లేకపోవుటచే నీమూలత్యాగము సమర్థనీయమే యగుచున్నది.

ద్వారకనుండి స్వర్గమునకు మరలిపో నున్ననారదునితో నింద్రునికి కృష్ణుడు తనమాటగా నీక్రిందిమాటలు చెప్పు మనినట్లు హరివంశములో నున్నది :-

"అదితిసుఖార్థము కశ్యపుడు పారిజాతవృక్షమును సృష్టించెను. పుణ్యమును, అతిసౌభాగ్యమును నిచ్చునావృక్షము నారదునిచే నీకు దానముగా నీయబడినది. నిత్యధర్మపరాయణ లగుస్త్రీలచే ధర్మార్థముగా దాన మీయబడిన దని విని, నాభార్య లావృక్షమును దానము చేయగోరుచున్నారు.

పుణ్యార్థమును, దానధర్మార్థమును, మత్ప్రీత్యర్థమును పారిజాతవృక్షమును ద్వారకాపురమునకు పంపుము. దానముగా నిచ్చిన పిమ్మట నాసురలోకతరువును నీవు స్వర్గమునకు తీసికొని[1] పొమ్ము"- అని చెప్పు మనియు, కార్యము నెట్లయిన సాధింపు మనియు నారదుని కృష్ణుడు వేడగా నారదు డి ట్లన్నాడు :-

" జగన్నాథా ! నేను నీవు చెప్పు మన్నట్లే చెప్పెదను. కాని- దేవేంద్రుడు పారిజాతము నిచ్చుట కంగీకరింపడు. పూర్వము మందర పర్వతము దేవదానవులచే సముద్రమునం దుంచబడి పారిజాతము పొందబడినది. మందరపర్వతమునుండి పారిజాతమును తెచ్చుటకై యీశ్వరు డింద్రుని పంపగా నింద్రు డావృక్షము శచీదేవియుద్యానవనమున నుండునట్లు ఈశ్వరుని వేడి, యావరము పొందెను. చిత్రకందర మగుమందరమునుగూర్చి పారిజాతము తీసికొనిపోబడలేదు. అది శచీదేవివిది యనువ్యపదేశముచే నింద్రునిచే విడువబడినది. ఉమాదేవిప్రీత్యర్థము శంకరుడు స్వయముగా మందరకందరమున కేగెను. ఆపర్వతరాజ

.....................................

1. " దేవీభి ర్ధర్మనిత్యాభి
ర్ధర్మార్థ మమరోత్తమ ।
దత్తం శ్రుత్వాఽభికాంక్షన్తి
దాతుం పత్న్యో మమప్రభో ।"

68వ అధ్యాయము
6వ శ్లోకము

" పుణ్యార్థం దానధర్మార్థం
మమ ప్రీత్యర్థ మేవచ
ఆనాయయ ద్వారవతీం
పారిజాతం మహాద్రుమమ్ "

" దత్తే దానే పునః స్వర్గం
తరుం త్వం నేతు మర్హసి
స వాచ్య ఏవం భగవాన్
బలభిద్భగవం స్త్వయా "

మున సూర్యచంద్రకాంతులు ప్రవేశింపవు. మహాదేవుని తేజస్సుచే నా వనము స్వయంప్రభ మై యుండును. సగణు లగు దేవదేవుడును, నేనును తక్క తక్కినవా రావనమునకు పోజాలరు. కోరబడినరత్నముల నా పారిజాతములు నిరంతరమును స్రవించును. దేవదేవునియాజ్ఞచే ప్రవర గణములు వానిని ఉపభుజింతురు. మూర్తిమంతము లైనయావృక్షములు ఉమాసహితు డైనవృషభధ్వజుని (దేవదేవుని) నిరంతరము ప్రవరులతో కలసి పూజించుచున్నవి.

అధికతేజస్సు కలిగి, సుఖాన్వితము లైనయావృక్షములు మందరమునందు శైలకన్యకకు ప్రియము లైనట్టివి. పరాక్రమవంతు డై, వరగర్వితు డైనయంధకాసురు డందు ప్రవేశించెను. సర్వభూతములకు నవధ్యుడును, వృత్రాసురునికన్న పదిరెట్లు బలము కలవాడును నైనయారాక్షసుని దేవదేవు డైనహరుడు సంహరించెను. కనుక సహస్రాక్షుడు పారిజాతము నీయడు. నేను సత్యమునే చెప్పుచున్నాను. ఆవృక్షము సర్వకామప్రద మై, శచీదేవికిని, నింద్రునికిని నభీష్టము లొసంగుచుండును. ”

అని పైవిధముగా నారదుడు పలుకగా భగవాను డైన కృష్ణు డిట్లన్నాడు :-

“ మహాదేవుడు చేసినపని తగినదే. శచీదేవి కారణముగా పూర్వ మావృక్షము తీసికొనిపోబడలేదు. సర్వభూతములకు జ్యేష్ఠుడును లోకకర్తయు, నవ్యయుడును నైనయాతడు లోకమర్యాదను పాటించె నని నాయుద్దేశము. నే నింద్రునికి సోదరుడను. జయంతునివలె లాలనీయుడను. నీవు బహూపాయములచే ప్రయత్నము చేయుము. స్వర్గము నుండి పారిజాతమును దెచ్చెద నని సత్యభామకు ప్రతిన చేసితిని. నే నాప్రతిజ్ఞ నసత్యము చేయు టెట్లు ? నే నింతకుపూర్వ మనృతమును పలికియుండలేదు. నేనే భగ్నప్రతిజ్ఞుడ నైనచో లోకులందఱు నసత్య

వాఁడు లగుదురు. దేవగంధర్వగణములును, రాక్షసులును, యక్షులును, నాగులును నాప్రతిజ్ఞను భంగింపజాలరు. నీవు యాచించినను నింద్రుడు పారిజాతము నీయకపోయినచో శచీవ్యామృదితానులేపన మగువురం దరోరస్సునందు గదను విసరెదను. సామపూర్వకముగా యాచించినను నింద్రుడు పారిజాతమును నొసంగనిచో నేను స్వర్గమునకు వచ్చుట నిశ్చయము. నీవుకూడ కార్యనిశ్చయము చేయుము.''

అని కృష్ణు డన్నా డని హరివంశమునందలి 68వయధ్యాయ ములో నున్నది. తిమ్మనగారికావ్యములోనికృష్ణుడు పారిజాతమునకై నారదునిముఖమున నింద్రుని యాచించువాడు కాడు. కనుక మూలము లోనిశ్రీకృష్ణనారదులయీసంభాషణము నంతటిని తిమ్మకవి పరిత్య జించి, మూలములో యాచకమాత్రుడుగా నుండినకృష్ణునిలోపమును తనకావ్యమున సరిదిద్ది, కృష్ణునిహుందాతనమును కాపాడినాడు.

ద్వారకనుండి యింద్రసదనమును జేరిననారదుఁ డచ్చట చూచినమహాదేవపూజామహోత్సవము సవిస్తరముగా హరివంశము నందలి 69వయధ్యాయములో వర్ణింపబడినది. తనకావ్యమున కాయు త్సవముతో పని లేదు కనుక తిమ్మకవి యాయుత్సవప్రసక్తిని పూర్తిగా విడిచిపెట్టినాడు.

పారిజాతమును తనభార్యలపుణ్యకవ్రతార్థమై భూమికి పంపు మని కృష్ణుడు పంపినసందేశమును నారదు డింద్రునికి చెప్పుటయు, పారి జాతము నిచ్చుట కంగీకరింపనియింద్రుడు నడుమనడుమ కృష్ణుని నిందిం చుటయు, పారిజాతముతక్క రత్నాదివిభూషణములను కృష్ణుని కిత్తు నని చెప్పు మనుటయు, నారదుడు కృష్ణమహిమను వర్ణించి చెప్పి పారిజాతమును కృష్ణుని కిమ్మని యెంతగా చెప్పినను వినక యింద్రుడు తాను పారిజాతమును దక్కించుకొనుటకై కృష్ణునితో యుద్ధమునకు సిద్ధపడుదు నని కంఠోక్తిగా నారదునికి చెప్పుటయు, నారదుడు ద్వార

కకు వచ్చి యింద్రునినిశ్చయమును కృష్ణునికి తెల్పుటయు, పారిజాత మును బలిమిమై హరింతు నని కృష్ణు డన్నమాటలను నారదుడు పోయి యింద్రునికిని, ఆతరువాత బృహస్పతికిని చెప్పుటయు, కృష్ణు నెదిరింపు మని యింద్రునికి బృహస్పతి సలహా యిచ్చి కశ్యపునిదగ్గరకు పోయి విషయమును వివరించుటయు, దేవశర్మ యనుమహర్షి భార్యను కోరిన యింద్రుని కపధ్యానకృతదోషము ప్రాప్తించిన దనియు, నాదోషశాం తికై తాను (కశ్యపుడు) ఉదవాస మారంభించినట్లు బృహస్పతికి చెప్పి పంపి, కశ్యపుడు రుద్రుని శరణు వేడి స్తుతింపగా నాభగవంతుడు "ఇంద్రోపేంద్రు లిద్దరును స్వాస్థ్యము నందెద రనియు, జనార్దనుడు పారిజాతమును గొంపోవు ననియు, కశ్యపపుత్త్రిలకు శ్రేయస్సు కలుగు ననియు చెప్పగా కశ్యపుడు హరునికి నమస్కరించి దేవలోకమునకు పోవుటయు ననుకథ యంతయు సంస్కృతహరివంశములోని 69వయధ్యా యమునందలి

"నారదోఽథ మహాతేజా
మహేంద్ర మిద మబ్రవీత్
దూతోఽహ మమరశ్రేష్ఠ ।
విష్ణో రతులతేజసః"

అను (20వసంఖ్యకల) శ్లోకమునుండి – డెబ్బదిరెండవయధ్యాయము నందు చిట్టచివర నున్న

"ఇతి హరవచనం నిశమ్య విద్వాన్
కమలభవాత్మజసూను రప్రమేయః
త్రిదశగణగురుం ప్రణమ్య రుద్రం
ముదితమనాః సుమనౌకసం జగామ"

అనునరువదియారవసంఖ్య కలశ్లోకమువఱకును కలమొత్తము విషయ మును తిమ్మకవి పరిత్యజించినాడు. తిమ్మకవికావ్యమున కీవిషయముతో నేవిధమైన సంబంధమును లేదు. హరివంశకథను యథాతథముగా కాక,

యథోచితముగామాత్రమే గ్రహించి, ఔచిత్యమును గ్రహించి, యనౌచిత్యమును బరిహరించి తిమ్మకవి తనతరువాతి తెలుగుకవులకు రసోచిత ప్రబంధరచనామార్గదర్శకు డైనా డనుట మూలవిషయపరిత్యాగ మొకనిదర్శనము.

సాత్యకియు, ప్రద్యుమ్నుడును శ్రీకృష్ణుని కింద్రునితోడి యుద్ధమున తోడుగా వచ్చినట్లు హరివంశమునందలి 73వ యధ్యాయమున నుండగా తిమ్మకవి ఆవిషయమును పూర్తిగా పరిత్యజించెను. జయంతుడు పారిజాతము నపహరింప బూనుటయు, ఆజయంతుని వారింపు మని శ్రీకృష్ణుడు ప్రద్యుమ్ను నాదేశించుటయు, రౌక్మిణేయుడు జయంతుని వారించుటయు, జయంత ప్రద్యుమ్నులయుద్ధమును, ప్రవరు డను దేవదూత పారిజాతమును హరింపజూచుటయు, సాత్యకి యతనిని వారించి బ్రాహ్మణుడు కనుక చంపక తా నాతనిని విడుతు ననగా నాబ్రాహ్మణుడు నవ్వుటయు వారిరువురికిని ఘోరసంగ్రామ మగుటయు, నాపిదప శచీపుత్రప్రద్యుమ్నులఘోరయుద్ధమును, వారివీరాలాపములును, సాత్యకిప్రవరులఘోరయుద్ధమును, సురలపై సాత్యకియు, ప్రద్యుమ్నుడును పరాక్రమించుటయు హరివంశమున 73వ యధ్యాయములో-

"తయోర్వ్రర్తతి సంగ్రామే గరుడస్థో మహాబలః
పారిజాతం జయంతోఽథ హర్తు మభ్యుద్యతో బలీ"

అను 23వ శ్లోకమునుండి -

'ఏవ ముక్తౌ స్థితౌ వీరౌ తతః శక్రస్య పార్శ్వయోః
దదృశాతే యుద్ధ్యమానౌ దేవరాజ జనార్దనౌ'

అని యున్న 83వ శ్లోకమువఱకును కలపై విషయ మంతయును తెలుగున పరిత్యజింపబడినది. అసలు తిమ్మనగారిరచనప్రకారము కృష్ణుడును, గరుత్మంతుడును మాత్రమే యింద్రాదులతో యుద్ధము చేసిరికాని ప్రద్యుమ్నసాత్యకుల కిందు స్థానము లేదు. కనుక నీమూలపరిత్యాగము సముచితముగా నున్నది.

'సతాన్ బాణా నగణయన్ వైనతేయః ప్రతాపవాన్
స సారాభిముఖో వీరః శక్రనాగ మరిందమః'
(73 అ - 85 శ్లో)

నుండి -

'స తస్థౌ పర్వతశ్రేష్ఠే పారియాత్రే తు వృత్రహా
ఐరావతే సమాశ్వస్తే సంగ్రామో వవృధేపునః'
(73 అ - 94శ్లో)

అనువఱకును గలశ్లోకములలో నైరావతగరుత్మంతులయుద్ధమును, నింద్ర గజము తీవ్రముగా దెబ్బతిని పడిపోవుటయు, దాని నింద్రు డూరడించు టయు వర్ణింపబడినది. ఈవిషయ మంతయు తనకావ్యమున కప్రధాన మనుదృష్టితో కాబోలును తిమ్మకవి పరిత్యజించినాడు.

గరుత్మంతునిచే నైరావతము తీవ్రముగా గాయపడి పడి పోయినపిమ్మట నింద్రోపేంద్రులకు యుద్ధము జరిగినట్లు మూలమున నుండగా తిమ్మకవి అప్రసక్తి తేలేదు. దేవేంద్రుడు గరుత్మంతునిపై వజ్రాయుధమును ప్రయోగింపగా గరుడడు దానిని సహించి, ఆవజ్ర మును గౌరవించి యొక్కొక్కపక్షమునే విడిచె ననియు 73వ యధ్యా యములో -

'తతో వజ్రాయుధో వజ్ర మశనిం చ పునఃపునః
ముమోచ గరుడే రాజ న్నైరావతరివౌ నృప'
(73 అ - 96 శ్లో)

నుండి -

'ముమోచ పక్షమేకైకం మానయ న్నశనిం సదా
వజ్రంచ దేవరాజ్ఞోఽథ భ్రాతుః కశ్యపసంభవః'
(73 అ - 98 శ్లో)

అనుశ్లోకమువఱకు నున్న విషయమును తిమ్మకవి పరిత్యజించెను. పక్షిపై నింద్రుడు వజ్ర మేయుట దేవేంద్రుని కేమంత యుత్కర్ష నాపాదింప

దని కాబోలు - శ్రీకృష్ణునిపైనే వజ్రి వజ్రమును ప్రయోగించె నని యును - నైనప్పటికిని నది నిష్ఫల మయ్యె ననియును తిమ్మకవి రచించెను. శ్రీకృష్ణునా దేశముప్రకారము ప్రద్యుమ్నుడు ద్వారకకు వెడలి క్షణమాత్రములో దారుకసహిత మైనరథమును యుద్ధభూమిలో నున్న కృష్ణునిదగ్గఱకు తెచ్చినట్లు 7శవ యధ్యాయమున 101వ శ్లోకమునుండి 105వ శ్లోకమువఱకు నున్నమూలవిషయము తిమ్మనగారిచే పరిత్యజింప బడినది. ఈమూలపరిత్యాగము ఉచితజ్ఞు డైనతిమ్మకవిగారికావ్యమున కనుగుణముగానే యున్నది.

ప్రద్యుమ్నుడు తెచ్చినరథము నధిరోహించి కృష్ణుడు (తన మైరావతముతో దేవేంద్రుడు నిలిచియున్న) పారియాత్రగిరికి వెళ్లె ననియును, కృష్ణునిరాకను జూచి ఆపారియాత్రపర్వతము శాణపాద సమమై భూమిని బ్రవేశించె ననియును, వాసుదేవునిరథగతికి అప్రతి బంధనార్థము ఆపర్వతము భూమిని బ్రవేశింపగా హృషీకేశుడు సంప్రీతు డయ్యె ననియును, ప్రద్యుమ్నసాత్యకు లిద్దఱును గరుడనిపై కృష్ణు ననుసరించి పారిజాతరక్షణార్థము వెడలి రనియును, అంతలో సూర్యాస్తమయ మగుటచే నింద్రోపేంద్రు లారాత్రికి యుద్ధమును నిలిపివేసి రనియును, వజ్రమును గిరిమయము చేసి యింద్రుడు పుష్కరాభ్యాస మున వసించె ననియును, నచటికి బ్రహ్మ, కశ్యపుడు, అదితి, సకలదేవ తలు, మునులు, సాధ్యులు అశ్వినీదేవతలు, ఆదిత్యులు, రుద్రులు వెళ్లిరనియు, అందమైనయాకొండపై శ్రీకృష్ణుడు సాత్యకితో, ప్రద్యుమ్నునితో కలసి యుండె ననియు, కృష్ణుడు తనయందు భక్తిగలయా పర్వతమునకు వరము లిచ్చె ననియు, నప్పుడు శ్రీకృష్ణుడు వృషభ ధ్వజునికి నమస్కరించి గంగానదిని ధ్యానింపగా, నాగంగానది రాగా కృష్ణు డందు స్నానముచేసి, రుద్రు నావాహనము చేసె ననియు, నంతట నుమాసమేతు డై వచ్చి బిల్వపత్రముయొక్కయు, గంగోదకము యొక్కయునుపరిభాగమున నున్నహరుని కేశవుడు పారిజాతప్రసూనము

లచే పూజించి స్తుతింపగా శివుడు కృష్ణునికోరికలు సిద్ధించు ననియు, తనవరములచే శ్రీకృష్ణు డవధ్యు డగు నని చెప్పె ననియు, కృష్ణునిచే స్థాపింపబడినయాశివుడు బిల్వోదకేశ్వరనామము నందు ననియు, నచ్చట మూడురాత్రులు నివసించి శివుని కొలిచినభక్తుడు యాప్సితలోకము లందు ననియు, "అవింధ్య" యనునాప్రదేశమునందు గంగకూడ ప్రభవించు ననియు, శివుడు శ్రీకృష్ణునికి చెప్పినట్లును, దురాత్ములును దేవకంటకులును నైనదైత్యులు బ్రహ్మవరములచే నవధ్యులై యాగిరి సానువుల నివసించుచున్నా రనియు, వారిని కృష్ణుడు వధింపవలె ననియు కోరి కృష్ణుని కౌగిలించుకొని శివు డంతర్ధానమందె ననియు, ఆపర్వతశిలలచే శ్రీకృష్ణునిప్రతిమను చేయించి నిత్యమును సేవించువారు తనగతిని చెందెద రని యాకృష్ణుడు పర్వతు ననుగ్రహించి, యప్పటి నుండి యచ్యుతు డచ్చట నివసించుచుండె ననియు - ఈవిషయమం తయు (74వ యధ్యాయములోనిది) తనకావ్యమున కనవసర మను నుద్దేశముతో నుచితజ్ఞుడై నతిమ్మకవి పరిత్యజించెను.

కేశవునికన్న శివుడే యధికుడై కేశవునికి (కృష్ణునికి) వరము లిచ్చుట కేశవునికి న్యూనత నాపాదించుట యనులోపము (పరిత్యక్తమైన) యీమూలములో నున్నది - కాఁగా -

> " పాకదమనముక్తపాశుపతాస్త్రంబు
> హరినిజార్థతనువునందు డిందె
> నేమి చేయవచ్చు ? నీశ్వరుం డఖిలాత్మ౹ "

డని పారిజాతాపహరణమునందలిపంచమాశ్వాసములోనిముప్పదవపద్యమున కంఠోక్తిగా చెప్పి, తిమ్మకవి శివకేశవు లభిన్నులని చెప్పి, మూలములోనియాలోపమును చక్కగా తొలగించుట కీమూలపరిత్యాగము తోడ్పడినది. ఇది తిమ్మకవిగారికళాకౌశలమున కొకమచ్చుతునక.

" తీక్ష్ణబాణములచే మహేంద్రుడునియొక్కకగుల్మము నే కృష్ణుడు కొట్టెను. ఇంద్రుడు ఘోరములు, సభిమంత్రితములు నగునస్త్ర

ములచే శైబ్యాది కృష్ణాశ్వములను గొట్టెను. కృష్ణుడును దేవేంద్రుడును భూయిష్ఠములగులతలచే యుద్ధము చేసిరి. జలస్థమైననావవలె భూమి కంపించెను. గిరిశ్రేష్ఠములు చలించెను. వందలకొలది చెట్లు పడిపోయెను. ధర్మగుణాన్వితు లగుమర్త్యులు ధరణీపృష్ఠమునందు పడిరి. అనేకము లైనపిడుగులు పడెను. నదు లన్నియు ప్రతిస్రోతములైనవి. అంతట వాయువులు వీచినవి. నిష్ప్రభ లగునుల్కలు పడినవి. మాటిమాటికి భూతసంఘములు రథనాదముచే మోహితములైనవి. నీటియందగ్ని ప్రజ్వలించెను. ఆకాశమునందు గ్రహములు గ్రహములతో డీకొనెను. స్వర్గమునుండి ధరణీతలమున కనేకజ్యోతులు పడెను. దిక్కులయందు గజములు ప్రకోపించెను. ధరణీతలమున నాగులు విజృంభించినవి. గర్దభారుణసంస్థానము లైనట్టియు, నధికముగా శబ్దించుచున్నట్టియు మేఘములచే నాకాశ మావరింపబడెను. యుద్ధగతు లైనట్టిసురవీరులను జూచి భూమ్యాకాశస్వర్గము లస్వస్థము లైనవి. మునులును, మహాత్ములగుబ్రాహ్మణులును సత్వరు లై యుండిరి. అంతట బ్రహ్మ కశ్యపుని జూచి యదితితో కలసివెళ్లి పుత్రులను వారింపు మని చెప్పగా 'నట్లే' యని కశ్యపుడు రథముపై నదితితోగూడి భూమిపైకి దిగగా సర్వభూతహితరతులును, న్యస్తశస్త్రులును ధర్మతత్వజ్ఞు లైనయింద్రోపేంద్రులిద్దరును తలిదండ్రులకు నమస్కరించిరి. అంతట నదితి వారితో "అ సోదరులవలె నేల యిట్లు అన్యోన్యము సంహరించుకొనగోరుచున్నారు? స్వల్పవిషయమున కింత దారుణము ప్రవృత్తమైనది. నాపుత్రు లైన మీ కిది తగ దని భావించుచున్నాను. తలిదండ్రులమాట వినదగినదైనచో శస్త్రములను విడిచి నామాట మన్నింపుడు." అనగా నింద్రోపేంద్రు లిరువురును పరస్పరము మాట్లాడుకొనుచు స్నానార్థమై గంగానదికి వెడలిరి. అంతట కృష్ణునితో నింద్రుడు "నీవు ప్రభువవు. నేను నీచే రాజ్యమునందు స్థాపింపబడితిని. స్థాపించి మరల నన్ను నీ వేల యవమానించుచున్నావు? భాతృత్వమును పొంది, జ్యేష్ఠత్వమును విస్మరించి, యేల సంహరింపగోరుచున్నావు?" అని యడిగెను. జాహ్న

వీతోయముల స్నాన మాచరించి యదితికశ్యపు లున్నచోటికి - వారు తిరిగి వచ్చి సంగతులైరి. ఆప్రదేశమును మునులు 'ప్రియసంగమన' మని వ్యవహరించిరి. దేవగణముల సమక్షమున కృష్ణుఁ డింద్రుని కభయ మొసంగెను. అంతట దేవతలు విమానములపై స్వర్గమున కరిగిరి. అదితికశ్యపు లింద్రోపేంద్రులతో నొకేరథము నధిష్ఠించి స్వర్గమున కేగిరి.' వారు రమ్యమై సర్వగుణాన్విత మైనశక్రభవనమున సంతోషముగా నుండిరి. శచీదేవి కశ్యపుని అదితిని సేవించెను.

కృష్ణుని జూచి యదితి "ఉపేంద్రా! ద్వారకకు వెళ్లుము. పారిజాతమును నీతో గొనిపొమ్ము. సత్యభామ హృదయమునం దలంచినపుణ్యకవ్రతము జరిగినపిమ్మట పారిజాతవృక్షము యథాస్థానమున స్థాపింపబడవలె" ననగా అదితితో "అట్లే యగుగాక!" యని కృష్ణుడు తలిదండ్రులకు నమస్కరించి ద్వారకకు బయలుదేరెను. శచీదేవి కృష్ణునిషోడశసహస్రస్త్రీలకు నాభరణము లొసంగగా నాకానుకలతో ప్రద్యుమ్నసాత్యకులతో కృష్ణుడు రైవతకాద్రిని చేరి తనవిజయయాత్రను ముందుగా ద్వారకకు పోయి చెప్పుమనియును ద్వారక నలంకరింపవలె ననియును సాత్యకిచే కబురంపగా సాత్యకి వెళ్ళి సాంబుడు మొదలైనకుమారులతో కృష్ణు డున్నచోటికి తిరిగివచ్చెను. ప్రద్యుమ్నుడు గరుడనిపై పారిజాతము నుంచి ద్వారకను ప్రవేశించెను. శైబ్యాదిహయయుక్త మైనరథముతో కృష్ణుడు ఆప్రద్యుమ్ను ననుసరించి పోగా వాని ననుసరించి సాత్యకియును సాంబుడును వెడలిరి. వారి వెంట రథాదివాహనములపై వారి నభినందించుయాదవు లరిగిరి. శ్రీకృష్ణుని చేష్టను సాత్యకివలన వివరముగా విన్నయాదవు లందఱును విస్మయము నందిరి.' - అని సంస్కృతహరివంశమున 75వ యధ్యాయములో 10వ శ్లోకమునుండి 58వ శ్లోకమువఱకును గలవిషయ మంతయును రసప్రధాన మైనతనపారిజాతాపహరణకావ్యమున కవసరము లేనిదనునుద్దేశముతో తిమ్మకవి విడిచిపెట్టి కృష్ణునియసహాయశూరత్వ

మును సముచితముగా నిలబెట్టి తనకావ్యమునకు వన్నె తెచ్చినాడు. పైకథ యంతయు నున్నచో తిమ్మనగారి కావ్యమున కొఱగినదియు లేదు- లేనిచో వచ్చిననష్టమును లేదు. ఈమూలకథాపరిత్యాగము తిమ్మన గారియౌచిత్యపరిపాలనమును వేనోళ్ళ చాటుచున్నది.

" లప న్తః కోకిలాం శ్వేతాన్
శృత్వా నర్త నివాసినః
బభూవు ర్హృష్టమనసో
వవన్దుశ్చ జనార్దనమ్ "
(75 అ - 57 శ్లో)

ఈకోకిలలకలకూజితమునకు ప్రధానకథతో నెంతమాత్రమును సంబం ధము లేదు. కనుక తిమ్మనగారు ఈశ్లోకవిషయమును తెలుగున పరిత్య జించిరి.

" సార్వకామిక మన్నాద్యం సర్వభూతకృదన్వయః
సత్యయా ప్రియయా సార్ధం ప్రహృష్టేనా న్తరాత్మనా "
(76 అ - 4 శ్లో)

పైశ్లోకభావము తిమ్మనగారు వదలిపెట్టిరి. ఇందువలన వచ్చిననష్టము కావ్యత్వదృష్టిలో నేమియు లేదు. కనుక నీమూలత్యాగము సము చితమే.

" హిరణ్యరూప్యమిశ్రం చ మణిరత్నప్రభస్యచ
తిలమిశ్రస్య చ తథా ధాన్యై రన్యైర్యుతస్యచ "
(76 అ - 7 శ్లో)

రసదృష్టితో రచింపబడిన తెలుగుకావ్యమున పైశ్లోకము విడువబడుట తప్పు కాదు.

కృష్ణుడు వరము కోరు మని నారదు నడుగగా - నారదుడు నిత్యమును శ్రీకృష్ణుడు తన కిష్టుడు కావలె ననియును, తాను కృష్ణుని కరయోనిజుడ నయ్యెద ననియును జాత్యంతరములయందు బ్రాహ్మణు

డనుకూడ నర్మ్యేద ననియును కోరినట్లు 76వ అధ్యాయమునందలి 15వ శ్లోకమునుండి 18వ శ్లోకమువఱకును కలదు. ఈవిషయము తనకథాసంవిధానమున కనవసర మనుదృష్టితో తిమ్మకవి పరిత్యజించెను.

" సంవత్సరే తతో యాతే కేశి హాఽమరసత్తమః
పారిజాతం పునః స్వర్గ మానయత్సర్వభావనః "
(76 అ - 26 శ్లో)

" తత్రాదితిం కశ్యపంచ దృష్ట్వా స్వజననీం ప్రభుః
శక్రేణ సహితో ధీమానప్రమేయపరాక్రమః "
(76 అ - 27 శ్లో)

ఇత్యాదిగా 76వ అధ్యాయమున చిట్టచివరిదైన 35వ శ్లోకమువఱకును గలకథాసారాంశ మీక్రింద నీయబడినది - ఈమూలకథ తెలుగున పరిత్యక్తము.

" సంవత్సరకాలము గడవగనే కృష్ణుడు పారిజాతమును స్వర్గమునకు గొంపోయి స్వజననియైనయదితిని కశ్యపుని జూచి నమస్కరింపగా నామె యింద్రోపేంద్రులసౌభ్రాత్రము నిత్యము నుండుగాక యని కోరినది. అంతర్యామితలమునందలియసురులను మహాదేవునభీష్టముప్రకారము కృష్ణుడు సంహరింతు నని యింద్రునికి చెప్పగా - కృష్ణునికోరికచే నింద్రుడు ప్రవరుని, జయంతుని కృష్ణునితో పంపుట కంగీకరించెను. "

అన్నదే ఆపరిత్యక్త విషయము. తిమ్మనగారిపారిజాతాపహరణకావ్యము పుణ్యకవ్రతాచరణముతో సత్యభామాహంకారము పూర్తిగా నశించి కృష్ణుడు పదాఱువేలయెనమండ్రుభార్యలతో సౌఖ్యాంబునిధి నోలలాడినట్లు చెప్పుటతో పరిసమాప్తమైనది. రసవత్తరముగా నడచిన తెలుగుప్రబంధమున కీయసురసంహారముతో పనిలేదు. కనుక పైమూలవిషయమును తిమ్మనగారు పరిత్యజించుట సమంజసమే యనదగును.

## (f) అమూలకత

" పరిగృహ్యాతు తత్పుష్పం
రామామణి రనిన్దితా
శిరస్యమలపత్రాక్షీ
దదౌ కృష్ణేంగితాసుగా "
(65 అ - 16 శ్లో)

హరివంశములోనిపై శ్లోకమునుబట్టి నారదుడు తెచ్చినపారిజాతపుష్ప మును రుక్మిణి తలఁ దాల్చి యూరకొన్న దని స్పష్టమగును. కాని - తిమ్మనగారు చిత్రించినరుక్మిణి

" మానికి మ్రొక్కి యవ్విరిం దనసెజికొప్పునం జెరివికొన్నది.
ఇది యామెసభ్యత. హరివంశములోనిరుక్మిణివంటిది కాక - తిమ్మనగారి కావ్యములోనిరుక్మిణి పెద్దలయందు గౌరవమును, వినయవిధేయతలును, సభ్యతయును గలది. ఈఅమూలకవిషయమును కల్పించి తిమ్మనగారు సూక్ష్మదృష్టితో తనపాత్రపోషణానిపుణతను ప్రకటించినాడు.

" శీతోష్ణేచేచ్ఛితే దేవి - పుష్ప మేతత్ ప్రయచ్ఛతి
స్రవత్యపి రసాన్ దేవి - మనసా కాంక్షితాన్ వరాన్ "
(65 అ - 22 శ్లో)

అనుమూలశ్లోకభావమును పెంచి తెలుగున

కం. " నెలకొని వేసవిఁ జలువయుఁ
జలివేళల నుష్ణగుణము సముచితభంగిన్
గలిగించు నీలకాంతము
కోలఁదులు సెప్పంగ నిచ్చుక్రొత్తలుసుమ్మీ !"
(1 ఆ - 63 ప)

అని రచించి, " దేవి ! ", " దేవి ! " యని మూలములో నున్నపున రుక్తిదోషమును దొలగించుటయే కాక, " ఈలతాంతముకోలఁదులు

సెప్పంగ నిచ్చ క్రొత్తలు పుమ్మీ" యని యమూలక మైనభావమును జేర్చి తిమ్మకవి మూలమునకు మెఱుఁగులు దిద్దినాఁడు.

మ. "తనశృంగారవనంబులోన గిరిపొంతం జక్కఁగా దిద్ది తీ
ర్చినపూఁదేనియయేటికాలువదరిం జెంగల్వపుప్పొళ్ళు నిం
చినచంద్రోపలవేదిపై సరసగోష్ఠిన్ బోఁటియుం దాను న
వ్వనజాతాయతనేత్ర శౌరిగుణముల్ వాక్రుచ్చి వర్ణించుచున్"
(1 ఆ - 71 ప)

చం. "అలికులరావముల్ కిసలయాశులకోకిలకాకుకాకలీ
కలకలనాదముల్ పెలఁగఁ గమ్మనితమ్మికొలంకుఁదెమ్మెరల్
పొలయఁగఁ బొంటిచందమున బుద్ధికి నేమియు నింపు గామికిన్
గలఁగుచు సత్యభామ చెలిఁ గన్గొని యించుక సంశయించుచున్"
(1 ఆ - 72 ప)

చం. "అకట! య దేమియో యెఱుఁగనయ్యెదఁ దొయ్యలి! దక్షిణాంసహూ
చుకనయనప్రకంపగుణసూచన లేమియు వల్లగావు సా
రెకు మది జాలి పొంది యొకరీతిఁ దలంకెదుఁ బ్రాణనాథుఁ డొం
డొకచపలాక్షిఁ గూడి నను నొల్లనిచెయ్దము లేమి సేసెనో"
(1 ఆ - 73 ప)

కం. "అని సత్యభామ తనవిధ
మనుఁగుందొయ్యలికిఁ జెప్పునవసరమునఁ జ
య్యన వచ్చి యొక్కచెచ్చెలి
కనుఁగవ నెఱవంజ పొడమఁగా ని ట్లనియెన్"
(1 ఆ - 74 ప)

పై పద్యములలోనివిషయ మంతయు నమూలక మైనదే. సత్యభామ యుద్యానవనవైభవము, నామెయశుభసూచనలు, నామెనమ్మకములు, భర్త యన్యకాంతాసక్తుఁడై తన కనిష్టము లైనపనులు చేయునేమో యని యామెకు గలయనుమానము - ఈసర్వలక్షణములతో సత్యభామ

స్వభావమును మొట్టమొదటనే పాఠకుని కీముూఁడుపద్యములలో పరిచయ మొనర్చినాడు తిమ్మకవి. మూాల మైనహరివంశమున కేవలము కథాకథనదృష్టియే ప్రధానోద్దేశము కాగా నీప్రబంధము వర్ణనాత్మకమై, పాత్రోన్మీలనసమర్థ మై, ప్రతిపదరసస్యందిగా నున్నది.

" తచ్ఛ శ్రుత్వా సు నిఖిలం
ప్రేష్యాభిః స్త్రీస్వభావతః
ప్రకాశీకృత మే వాసీ
ద్విష్ణో రంతఃపురే తదా "
(65 అ - 46 శ్లో)

అనిమాత్రమే మూాలములో నున్నది. చెలికత్తె వచ్చి రుక్మిణీసౌధము నందలి విశేషములను సత్యభామకు చెప్పుఘట్టము తిమ్మనగా రెంతో మెలఁకువతో రచించిరి.

తనయజమానురా లైనసత్యభామకు జరిగినయవమానమున కాచెలికత్తెకన్నుగవలో నెఱసంజ వొడమిన దట! వచ్చుచునే కొంప మునిఁగినట్లు - " అమ్మా! యేమని చెప్పుదు ? " నని యరిష్టమును సూచించి సత్యభామలో నాత్రమును పెంచి, తనసంభాషణ మారంభించినది.

" నెమ్మిన్ నీవిభుఁడు రుక్మిణీసతిమణిసౌ
ధమ్మున నుండఁగ సురముని
క్రమ్మర నాకస్మికమ్ముగా నచ్చటికిన్ "
[1 ఆ - 75 ప]

అతడు నీవిభుడు - కాని - రుక్మిణీమణిసౌధమున నున్నాడు. అచ్చటి కాకస్మికముగా వచ్చినాడు సురముని. మౌనముగా నుండుట మునిలక్షణము. కాని నారదుడు సురముని యగుటచే (సురను సేవించిన ముని యని యాచెలికత్తె సాభిప్రాయముగా నారదుని సురముని యని యుండవచ్చును.) నోటికివచ్చినట్లు ఎదో యెదో అన్నాడట ! ఏమని ?

కం. "చనుదెంచి యమ్మురారికి
నసఘ మ్మమరైకయోగ్య మతిసౌఖ్యకరం
బనితరసులభ మ్మిది యని
కొనియాడుచు నొక్కదివ్యకుసుమ మ్మొసఁగెన్."
[1 ఆ - 72 ప]

ఆసురముని వచ్చి తెగమెచ్చి యిచ్చిన దేమి? ఒక్కదివ్యసుమమును - కాదు - కుసుమమును. ఈశబ్దము నిట్లు వాడుటలోని యందము సహృదయహృదయైకవేద్యము.

కం. "మి న్నంది వేగ గయికొని
కన్నుల నొత్తికొని మ్రొక్కి గారవ మెసఁగన్
వెన్నుఁడు రుక్మిణి కొసఁగెను
అన్నెలఁతయుఁ గొప్పులోన నవ్విరిఁ దాల్చెన్
[1 ఆ - 77 ప]

తే. గీ. అంతలోనన యద్భుతం బావహిల్లఁ
గొలఁది యిడరానియొకవింతచెలువు గలిగి
రాజబింబాస్య రుక్మిణి తేజరిల్లె
సానఁ బట్టినమకరాంకుశస్త్ర మనఁగ
[1 ఆ - 78 ప]

ఉ. "ఆకుసుమంబుఁ దాల్చినమహామహిమంబునఁ దోడికామినీ
లోకము మచ్చరంబు మదిలోనఁ దొరంగి భజించుచుండ న
స్తోకవిజప్రభావములు సూపెడు గద్దియమీఁద నెక్కి ము
ల్లోకముఁ దాన యేలుగతి లోలవిలోచన యేమి సెప్పుదున్?"
[1 ఆ - 79 ప]

అని సత్యభామసఖి రుక్మిణి కబ్బిననడమంత్రపుసిరిని వర్ణించినది.

ఉ. "ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు? శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁ బలికెం బతిఁ గూర్చుదాన నా

యంతటివారు లే రని యహంకృతి నెప్పుడు విజృంభించుచున్
వంతుకు వచ్చుసత్యగరువం బిఁకఁ జెల్ల దఁటంచు మానినీ ।'
[1 ఆ - 80 ప]

"ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు ?" – అనుటలో నెంత సొగసున్నదో ! (నిజమే. అక్కడ సత్యభామ నంతలేసి మాట లన్న వాఁడు "తగుదునమ్మా !" యని సత్యభామసౌధమునకు రానున్నాఁడు).

"శౌరి వినంగ – రుక్మిణీకాంత వినంగ – నేను వినఁగాఁ బలికెన్" –

ఇం దుత్తరోత్తరము బలీయములు. "నీమగడు చెవు లప్పగించి వినుచుండగా – నీసవతి చెవులు రిక్కించుకొని వినుచుండగా – నాయెదుట – నీయిష్టసఖిని నే నట నున్నా నని యైన మోమోడక నిన్ననరానిమాట లన్నాఁ డానారదుఁడు." అని యాబోఁటియాంతర్యము. మానవతి వైన నీ కీయవమానము సహింపరానిది. ఈదుస్సహావమానమునకు వెంటనే నీవు ప్రతిక్రియ చేయవలెనుసుమా !" యనునుద్దేశముతో (సాభిప్రాయముగా) "మానినీ !" యని సంబోధించి యాబోఁటి సత్యభామలో మానరోషమును రెచ్చగొట్టినది.

ఇంతటితో కలహభోజను డాశించినప్రయోజనము నెరవేరినది. అయినను నాచెలికత్తె యంతటితో నాగక

కం. "ఆరణభోజనుమతకము
లారుక్మిణినటన లామురాంతకుచెయ్వుల్
చేరి కనుంగొనుచో నె
వ్వారికిఁ గోపంబు రాదు వారిజనేత్రా ।
[1 ఆ - 81 ప]

అని యా చెలికత్తె సత్యభామమానరోషాగ్నికి మఱొక్కసమిధ వేసినది.

అమూలక మైనఈ చెలికత్తెసంభాషణము తిమ్మనగారి మన స్తత్వపరిజ్ఞానమునకును, కళాకౌశలమునకును నికషోపలముగా నున్నది.

రుక్మిణీసౌధమున జరిగిన దంతయు సఖీముఖమున విన్న సత్యభామ వ్రేటు వడ్డయురగాంగనవలె, నేయి వోయ భగ్గన దరి కొన్న భీషణహుతాశనకీల యనునట్లు లేచి

"ఏమేమీ? కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా?" అను (1 ఆ - 88) పద్యమునుండి - "ధన మిచ్చి పుచ్చుకొన్నను మనమున నోర్వంగవచ్చు" అను (1ఆ - 97) పద్యమువఱకును (చెలికత్తెతో) వాక్రుచ్చినమాటలు అమూలకములై, సత్యభామలోకజ్ఞతను, రాజసమును, ఆత్మాభిమానమును, స్వాధీనపతికాత్వమును, మానసికక్షోభను, ఆత్మశ్లాఘాపరాయణత్వమును, సపత్నీనిరాసమును, పరమపాతివ్రత్యమును వ్యక్తము చేయుచు సజీవశిల్పసుందరముగా సత్యభామస్వరూపస్వభావములను పఠితలమనఃఫలకముపై చిత్రించి తిమ్మకవి తనకళాకౌశలమును నిరూపించుకొన్నాడు.

"స దదర్శ ప్రియాం దూరాత్
క్రోధాగారగతాం తదా"

అ - 6 శ్లో)

అని సత్యభామగృహమును ప్రవేశించినవెంటనే కృష్ణు డామెను క్రోధాగారమున జూచినట్లు మూలమున నున్నది.

తే. గీ. "కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి
యలబలము లేనినగ రెల్ల నరసి చూచి

[1 ఆ - 105 ప]

సీ. కనకపంజరశారికలకుఁ జక్కెర వెట్టి
చదివింప రేలొకో సకియ లిపుడు
కరతాళగతుల మందిరమయూరంబుల
నాడింప రేలొకో యతివ లిపుడు

క్రొవ్వాఁడిగోళ్ళ దంత్రులు మీటి వీణియల్
పలికింప రేలొకో భామ లిపుడు
కలికిరాయంచబోదల నెల్ల నెలయించి
నడిపింప రేలొకో పడఁతు లిపుడు

తే. గీ. ఇన్నిదినములవలె నుండ దేమి నేఁడు ?
చిన్నవోయిన దీమేడ చెన్ను తఱఁగి
పద్మముఖితోడ నెవ్వరేఁ బారిజాత
పుష్పవృత్తాంత మెఱిగింపఁ బోలునొక్కొ ?"

[1 ఆ - 106 ప]

అని యనుమానించుచు నొయ్యనఁ గోపగృహంబు సేరినట్లు తిమ్మనగా రమూలకవిషయమును జొప్పించినారు.

ఎల్లవేళలను శారికామయూరరాజహంసలసందడితో వీణాని క్వాణములతో మనోహరముగా నుండుసత్యాసౌధ మానాడు చెన్ను తఱిగి చిన్నవోవుటకు కారణము కృష్ణుడు రుక్మిణికి పారిజాత మిచ్చి సత్యభామను చిన్నబుచ్చుట. కనుకనే యామెమేడ చిన్నవోయినందుల కపరాధ మొనరించినకృష్ణునినోటనే యామాటల ననిపించుట కవినేర్పు. ఒకవంక సత్యభామవైభవమును బ్రకటించుట - వేఱొకవంక సత్యాగ్రహమునకు తాళలేనిసత్యభామావిధేయునికలవరపాటును ఆయన మాటలవలననే సూచించుట యనురెండుప్రయోజనము లీయమూలక విషయగ్రహణముచే తిమ్మకవి సాధించినాడు.

ఉ. " ఓ ర్పొకయింత లేనివికచోత్పలలోచనచిత్తవీథిఁ జ
ల్లార్పఁగ నీలనీరదశుభాంగుఁడు వే చనుదెంచె నంచుఁ గం
దర్పహుతాశనున్ వెలికిఁ దార్చుసఖుండునుబోలె వేఁడిని
ట్టూర్పు దళంబుగా నిగిడె నున్నమితావరణాంశుకాంత మై "

(1 ఆ - 112 ప)

ఇది మూలమునకు వన్నె పెట్టునమూలక మైనభావము గలపద్యము. ఇందలి "నీలనీరదశుభాంగుఁడు" అనువిశేషణము సార్థకముగా సాభిప్రాయముగా ప్రయోగింపబడినది.

సపత్నీమాత్సర్యగ్రస్తురా లైనసత్యభామ మానరోషాగ్నిచే మండిపడిపోవుచున్నది. అగ్నిని చల్లార్చుటకు జల మవసరము. సంతప్త మగుచున్నసత్యభామచిత్తమును చల్లార్చుటకు వచ్చినశ్రీకృష్ణుడు నీల నీరదశుభాంగుడు. అనగా వర్షాకాలపుసజలమేఘునివంటివాడు. రసమయ మైనహృదయము కలవాడు.

మేఘసాక్షాత్కారమునకుపూర్వము ప్రత్యణువునను నిండియుండునది తాపమే. ఆతాపమే లేనిచో జగతికి మేఘునియవసరమే లే దనిపించునేమో! అట్లే - భగవత్సాక్షాత్కారము కాకపూర్వము భక్తులయెడందల నిండియుండునదికూడ తాపమే. ఇట్టితాప మానీల నీరదశుభాంగునిగూర్చి తపించినసత్యభామ కనుభవసిద్ధమే.

ఈయుపమానములో మఱొక్కవిశేషముకూడ గోచరించుచున్నది. అది యే మనగా:-

నీలనీరదశుభాంగు డైనకృష్ణునిహృదయమున తటిల్లత యై వర్తించులావణ్యవతి సత్యభామ. ఈనీలనీరదశ్యాము డాతటిల్లతతో నాకాశపుటంచుల కెగిరి యమరలోకమున కేగి మొట్టమొదటచల్లనివాడుగా గోచరించి పారిజాతపరీమళము లు పుడమిని గుబాళించునట్లు చేయుయత్నమున నుండగా తనకడ్డువచ్చినవజ్రధారిని తనశరవర్షమున ముంచివేసి సకలాశాంతముల నాక్రమింపబోవుకథ యంతయు నీయొక్కయుపమానములో స్ఫురించుచున్నది.

మహాకవులపదప్రయోగము పోలీసువానిలాఠీదెబ్బవంటిది. ఆదెబ్బయెంతగాఢ మైనదో పైకి కనిపింపదు. అనుభవించినవానికి

మాత్రమే అది తెలియును. అట్లే మహాకవులశిల్పరహస్యము లెన్ని జన్మలతపమో ఫలించినయదృష్టవంతు లైనసహృదయులకేకాని - సామాన్యుల కందుబాటులో నుండునవి కావు. ఇది యొకమహారత్నాకరము. ఎవడుమాత్ర మున్నలోతు లన్నింటిని చూడగలడు? ఎవని శక్తిమేరకు వాడు తనకు దొరికినరత్నములతో సంతృప్తి పడవలసినదే. తిమ్మనగారిరచనలో అక్షరరమ్యతయే కాక అర్థగాంభీర్యముతో కూడినలాలిత్యముకూడ నున్నది. కనుకనే ముక్కు-తిమ్మనగారిమాటలు ముద్దులమూటలు.

చ. "వనితకుచద్వయంబుపయి వ్రాసినకుంకుమపత్రభంగముల్
జనితనితాంతఘర్మకణజాలముచేతఁ గరంగి మెల్లమె
ల్లన వెలిపట్టుపయ్యెదకెలంకుల జాఱుట యొప్పె మానసం
బున నెలకొన్నక్రోధరసమున్ వడవెట్టుచు నున్నకైవడిన్."

(1 ఆ - 113 ప)

అమూలక మైనయీతిమ్మనగారిపద్యమునందలియందచందములు రసహృదయులడెందములకు విందు చేయుచు కవియుపజ్ఞకు నికషోపలములుగా నున్నవి.

చ. "మన మరయం దలంచి యొకమార్గము వన్నితొ? నవ్వటాలకో?
నను వెఱపించెదో అకట! నాయెదనిక్కపుఁదప్పుకల్గెనో
వనజదళాయతాక్షి! పగవాఁడనె? న న్నిటు లేల చూడ? వొ
క్కనిముసమైన నీవు దయఁ గన్గొనకుండిన నిల్వ నేర్తునే?"

(1 ఆ - 116 ప)

మ. "పడఁతీ! నీమధురాధరామృతము నీబాహాపరీరంభమున్
బడయన్ ధన్యుఁడఁ గాక యుండిన ననున్ బాటించి యొక్కింత నీ
నిడువాలుంగడకంటఁ జూడు మనుచున్ ని ల్పోపమిం బైచెఱం
గొడియం జేవిరిదమ్మి వ్రేయుటకునై యుంకించి జంకించినన్"

(1 ఆ - 119 ప)

సత్యభామను కోపగృహమున చూచి కృష్ణు డేమియు నెఱుంగనివాఁడువలె నామెకోపకారణ మెఱుంగగోరి పలికిన ట్లున్నపై పద్యములమూలకములై కృష్ణుని గడుసుఁదనమును జాటుచున్నవి.

సత్యాపాదతాడనఘట్టము మూలములో లేనిపెద్దమార్పు.

"ఈసునఁ బుట్టి డెందమున హెచ్చినశోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖ మైనమోముపయిఁ జేలచెఱం గిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్"

(1 అ - 133 ప)

'ఈర్ష్య' ప్రకృతి. స్త్రీప్రకృతి! 'ఈసు' శబ్దము వికృతి. వికృత మైనయీశబ్దము వికృత మై యున్నసత్యభామడెందమును పట్టి యిచ్చుచున్నది. వికృతి యైనను 'ఈసు' శబ్దము ముద్దుగానే యున్నది. ఏడ్చినను ఆముద్దియయేడుపు ముద్దుగానే యున్నది. ఆయేడు పామెప్రాణవిభునికే కాదు - తిమ్మకవిపలుకులలోనికులుకుల నెఱిగిన తెలుగురసికు లందఱికిని ముద్దుగానే యున్నది. ఇక డెందమున హెచ్చిన శోకదవానలమువిషయము -

చెట్టును జెట్టును రాపాడుకొనగా పుట్టునది దవానలము. ఇరువురు సవతులయీర్ష్యాపరిపూర్ణమానసములు ఘర్షించుకొనగా పుట్టిన దీశోకదవానలము. సత్యభామలోనియీయీర్ష్య కోటరాగ్నివలె నామెడెందమును గాసిలజేయుచున్నది. ఓ రొప్పికయింత లేనివికచోత్పల లోచనచిత్తవీధియందలియీదవానలమును చల్లార్చుటకే నీలనీరద శుభాంగుడు వారి యీమె దరికి వచ్చినది.

ఆమె లలితాంగి. కనుకనే ఆమెయేడుపుకూడ లలితలలితము గానే యున్నది.

కలకంఠవధూకలకాకలీధ్వని యెంతవీనులవిందుగా నున్నను కన్ను లెఱుపెక్కి కొమ్మెక్కినకలకంఠవధువుమాత్రము కన్నులపండువు చేయదు. ఇప్పటియీస్థితిలోనిసత్యభామ కొమ్మలమాటున నున్నయా కలకంఠవధువువలె తనమోమును జూపనోల్లక చేలచెఱంగున చాటు చేసికొన్నది.

ఆమెచిత్త మీర్ష్యాపంకమగ్నము కాగా నామెమోము పంకజ శ్రీసఖ మైనది. ఆపంకజ మిప్పుడు ముకుళించుకొని యున్నది. ఆముఖ మును తనకట్టెదుటనే యున్నయపరాధి యైనయాప్రాణవిభునికి చూప నొల్లక చేలచెఱంగిడి యేడ్చినది. ఆయేడ్పుట బాలపల్లవగ్రాసకషాయ కంఠకలకంఠవధూకలకాకలీధ్వనితో నేడ్చినది. అర్థము ముద్దుగా నుండుట య టుంచి, యీ శబ్దగుంఫన మెంతో ముద్దుగా నున్నది.

తిమ్మనగారిసత్యభామ పలికినను, కులికినను, నవ్వులొలికినను, సీసుచే నేడ్చినను ముద్దుముద్దుగనే యుండును. కనుకనే ' ముక్కుతిమ్మ నార్యు ముద్దుపలుకు ' సాహితీలోకమున స్మరణీయ మైనది. ఇంతగా నందము లొలుకబోయుచున్నయమూలక మైనయీపద్యము తిమ్మకవి మధురభావమునకు మణిదర్పణముగా నున్నది.

రుక్మిణి వీడుకొల్పగా సత్యభామసౌధమునకు కలహాభోజనుడు రాగా

చ. " అతనికి సత్యభామయు మురాసురవైరియు నాతిథేయన
త్కృతు లొనరించి యుండఁగ సఖీమణు లిద్దఱు పళ్ళెరంబు వె
ట్టితి మని విన్నవించినఁ దటిల్లతయున్ జలదంబు యామినీ
పతి వెనుకొన్నకై వడిఁ దపస్వియుఁ దానును భుక్తిశాలకున్ "
(2 ఆ - 17 ప)

చనినా రట.

ఇది మూలములో లేనిది. తెల్లనివాఁ డైననారదుని చంద్రునితోను, నల్లనిస్వామిని జలదముతోను, ఆయనహృదయమున

సంచరించులావణ్యవతి యైనసత్యభామను దట్టెల్లతలోను బోల్చుట రమణీయముగా నున్నది. నారదునితరువాత స్వర్గలోకయాత్రకై సత్యా కృష్ణులు కలసి వెళ్ళ నుండుటచే నీయుపమానము మఱి మఱి సార్థకమై భవిష్యత్కథావిషయ మిందు సూచింపబడినది.

'భుజ్' ధాతువునకు భుజించుట – లేదా – అనుభవించుట యని యర్థము. 'భుక్తిశాలకున్' అనుటచే భోగముల ననుభవింపదగిన స్వర్గమునకు – అను (భవిష్యత్కాలమునకు సంబంధించిన) అర్థము స్ఫురించుచున్నది.

ఈకావ్యమునిండ కావ్యార్థసూచనలు కలవు. డాక్టర్ కేతవరపు రామకోటిశాస్త్రిగా రన్నట్లు "కావ్యముయొక్కసంపూర్ణ స్వరూపము ముందుగా కవిమనస్సులో రూపు గట్టుకొని యున్న, శిల్పాభిరామముగా రచన చేయవలయు నన్నయభినివేశ మున్నకవికి గాని కావ్యార్థసూచనవిషయమున వెసులుబాటు చిక్కదు.[1]" ఈ విషయమున నంది తిమ్మనగారి దండె వేసినచేయి.

సీ. "శాకపాకంబులచవులు వక్కాణించు
గతిఁ గంకణంబులు గల్లుమనఁగ
నతివేగ మిడుదు మీ రమమాడ్కి మేఖలా
కీలితరత్నకింకిణులు మొరయఁ
గలమాన్నరుచితోఁద గలహించుజాడ దు
వ్వలువపింజలు ఫెళఫెళ యనంగ
నారగింపుఁడు మీర లవి ప్రియం బాడెడు
పొలుపున మెట్టియల్ గిలుకరింప

1. భారతి జూలై 1971 – పుట 76

తే. గీ. నలరుఁబోడులు వడ్డింప నచటఁ గలహ
భోజియును దాను బహుభక్ష్యభోజ్యలేహ్య
చోష్యపానీయముల మధుసూదనుండు
సారెఁ గొనియాడుచును వేడ్క నారగించె.
(2 ఆ - 19 ప)

తే. గీ. వామనేత్రాకరాంచలావర్జ్యమాన
కనకభృంగారకర్కరికాముఖాగ్ర
గళితగంధోదకంబులఁ గంసవైరి
చేతులను వార్చె బాంధవశ్రేణితోడ.

కం. అప్పుడు తాంబూలంబులు
కప్పురమును జాలవల్లికలఁ బడఁతులచే
నిప్పించె బంధుకోటికి
నప్పద్మదళాయతాక్షుఁ డంతట నతియున్"
(2 ఆ - 21 ప)

పై పద్యభావము లమూలకము లై యానాటిధనవంతులభోగమయజీవన మును స్పష్టము చేయుచున్నవి.

సత్యభామ వచ్చి నారదునికి నమస్కరింపగా "నాముని తన దక్షిణహస్తమును జాచి నాతపోబలమున పతివ్రతవును, భర్త కిష్టురాలవును నగుదువు" అని యామె నాశీర్వదించినట్లు హరివంశమున కలదు.[1] కాని - తిమ్మనగారినారదుడు సత్యభామ కిచ్చినయాశీర్వాద మి ట్లున్నది :-

1. తతస్సాత్రాజితీం దేవీం ప్రణతాం నారదోఽబ్రవీత్     67వ అధ్యాయము
ప్రసార్య దక్షిణం హస్తం సజలం జలజేక్షణాం.     44వ శ్లోకము
యథేదానీం తథైవ త్వం భవ దేవి। పతివ్రతా
సవిశేషం చ సుభగా భవ మ తపసోబలాత్.     45

మ. " పతి నీపై విహరింపఁగా జనము సంభావింపగా బంధుసం
తతి నిన్నుం గొనియాడఁగా సవతికాంతల్ సూచి లజ్జింపఁగా
నతులప్రాభవవైభవోన్నతులప్రోవై యిట్లు వర్తించునీ
కితరస్త్రీజనబుద్ధి దీవనలు నే నే మిచ్చెదన్ మానినీ ! "

[2 ఆ - 24 ప]

మ. " అనికైనం బతి నిన్నుఁ బాసి చనునో ! ప్రాణంబు ప్రాణంబుగా
నిను మన్నింపఁడొ ! నీమనోరథములన్ నెయ్యంబుతోఁ జేయఁడో !
చనవుల్ నీవలె నెవ్వరేఁ గొనిరొ ! నీసౌభాగ్య మింతంతయే ?
నినుఁ బోలంగల రబ్జగంధు లన వింపే యెందు సాత్రాజితీ !

[2 ఆ - 25 ప]

కం. " అటులైనను గాని మ్మో
కుటిలాలక ! నీకు మగఁడు కోరినకోర్కుల్
ఘటియించుఁగాక తా నెం
తటికార్యంబైన డించి నాదీవనలన్ "

[2 ఆ - 26 ప]

" పతి నీపై విహరింపఁగా " – అనగా సత్యభామకును, పతికిని భేదము లే దని వాచ్యార్థము. సత్యభామయే పతిగా చెలాయించుచున్న దని వ్యంగ్యము.

" అనికైనం బతి నిన్నుఁ బాసి చనునో " – అనగా – గతములో నరకాసురవధకై కృష్ణుడు సత్యభామను వెంట బెట్టుకొని వెళ్ళుట యిక్కడ ప్రసక్త మయిన ట్లున్నను– నింద్రునిపై యుద్ధమునకు కృష్ణునితో సత్యభామకూడ వెళ్ళు ననిసూచ్యార్థసూచన.

సత్యభామ తనకు పాదాక్రాంతుడైనమగనిశిరసును మానరోషముచే తొలగద్రోసినవిషయము త్రికాలవేది యైననారదు డెఱింగినా డన్నమాట ! కనుకనే " మానినీ ! " యని యామెను సంబోధించి " చనవుల్ నీవలె నెవ్వరేఁ గొనిరొ ? " అన్నాడు. ఆచన వామె

పుచ్చుకొన్నదే కాని విభు డిచ్చినది కాదు. కనుక నీపదప్రయోగము సరసముగా నున్నది.

సత్యాపాదతాడనానుభవమయినతరువాత కృష్ణుడు సహించి "అల్క మానవుగదా యిఁకనైన" నని ప్రాధేయపడి, సత్యాభామను "అరాళకుంతలా!" యని సంబోధింపగా - ఆపిమ్మట సత్యాసౌధము నకు వచ్చిననారదుడు "కుటిలాలకా!" యని యామెను సంబోధించుట నారదునిదివ్యదృష్టిని, తిమ్మనగారిరచనాప్రౌఢిమను చాటును.

"పైన ప్రయోగింపబడిన "అరాళకుంతలా, కుటిలాలకా" యనుసంబోధనములు జగదీశ్వరు డైనప్రాణేశ్వరునిశిరమును వామపాద ముతో తాడించినసత్యభామవక్రబుద్ధిని సూచించుచు, తిమ్మనగారిపద ప్రయోగౌచిత్యమును వేనోళ్ళఁ జాటుచున్నవి.

"నీకు మగఁడు కోరినకోర్కుల్ ఘటియించుఁగాక తా నెంతటికార్యంబైన డించి నాదీవనలన్"- అనుటచే - కృష్ణుడు సత్య భామప్రీతికై యింద్రునితో యుద్ధము చేసి సురలోకపారిజాతమును నర లోకమునకు తెచ్చుటకు సూచనగా నారదుడు పైమాట లన్నట్లు స్పష్టము. అందుకు తనదీవన లున్నట్లు చెప్పుట నారదునికలహాశనత్వ మునకు నిదర్శనము. ఈసొగసులు మూలమైనహరివంశములో లేవు. హరివంశములోనినారదుడు నందితిమ్మనగారు చిత్రించిననారదునివలె గడుసువాడు కాడు. ఈనారదు డమోఘవచస్కు డని తిమ్మనగారి కావ్యమును బఠించినవారికి స్పష్ట మగును.

పారిజాతాపహరణకావ్యమునందలిద్వితీయాశ్వాసములోని సాయంసంధ్యావర్ణనము, నంధకారవర్ణనము, నక్షత్రవర్ణనము, చంద్రాభ్యుదయవర్ణనము. చకోరములబువ్వపుబంతివర్ణనము, వలరాజు దండయాత్రవర్ణనము, చంద్రికావర్ణనము, జారిణీవర్ణనము, వేగు చుక్కవర్ణనము, వైతాళికులు శ్రీకృష్ణుని మేలుకొలుపుట, ప్రభాత

శోభావర్ణనము – ఈయమూలకవర్ణనములు హృదయంగమము లై పాఠకుని కానందమును సమకూర్చి, తిమ్మకవిప్రతిభావిశేషమునకు నికషోపలము లై, వర్ణనాత్మకత ప్రబంధమున కుండవలసినలక్షణములలో నొకటి కనుక పారిజాతాపహరణమునకు ప్రబంధత్వము నాపాదించి పెట్టినవి.

నరకాపహృతకుండలముల నదితి కిచ్చుమిషతో చుట్టపు చూపుగా సత్యభామాసమేతు డై కృష్ణుడు స్వర్గమున కేగినట్లు మూలమున లేదు. దానిని తిమ్మకవి కల్పించి, మార్గమధ్యదృశ్యములను వర్ణించుటకును, నందనవిహార, జలకేళీవర్ణనము లొనర్చి, ప్రబంధత్వమును పోషించుటకును వెసులుబాటు కల్పించుకొన్నాడు. తిమ్మనగారు తనకావ్యమున గావించినచంద్రోదయసూర్యోదయవర్ణనాదు లేవియు మూలములో లేవు.

కృష్ణునిపారిజాతాపహరణప్రయత్నమున కడ్డు తగిలినవన పాలకులతో నేమో చెప్పబోవుకృష్ణుని వారించి, సత్యభామ

సీ. "వినుఁడు సురేశ్వరువనపాలకులు ! వార్ధిఁ
బొడమినయీదివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె ? యింద్రుండు నెవ్వఁడు ?
తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపు డై ధరియించె నతఁడె చేకొనుఁగాక
తెకతేర యిది యేమి యొకరిసొమ్మె ?
యిదె నాదువిభునిచే వీవదాన్యనగంబు
నొడియించుకొని యేఁగుచున్నదానఁ

తే. గీ. బలుకు లేటికిఁ ? దా వీరపత్ని యేని
మీఁచీదేవి తనదుప్రాణేశుఁ డైన
మఘవు నిటఁ బంపి సత్యభామావిధేయు
వలన మరలంగఁ గొనుఁ జెపో వాసితనము."

[4 ఆ - 59 ప]

అని గర్వోక్తులు పలుకుట సంస్కృతహరివంశమున లేనిది. ఈవిషయములో తిమ్మనకవి విష్ణుపురాణములోని 30వయధ్యాయమునందలి 45వ శ్లోకమునుండి 51వశ్లోకమువఱకును ననుసరించినాఁడు.

ఉ. 'ఇంకిటు విన్న నమ్మ నను నేమిటికిం గెరలించె? దెంతయుం
బొంకముగాని యీవలని బొంకులు మాచవి గావు రుక్మిణీ
పంకజపత్రలోచనకుఁ బ్రాణపదంబులు గాని వల్లవీ
కింకర! చాలుఁ జాలు నుడికింపకు నింపకు లేనికూరుముల్'

[1 ఆ - 126 ప]

అన్నది కృష్ణునితో సత్యభామ. "ఏకక్రియా ద్వ్యర్థికరీ బభూవ" అన్నట్లు ఒక్కవాక్యముతో రుక్మిణీకృష్ణుల నిద్దరిని తక్కువచేసి పలికినది సత్యభామ. ఇది మూలములో లేనిమార్పు.

స్వర్గమునుండి పారిజాతవృక్షమును దెచ్చి సత్యభామ పెరటిలో నాటింతు నని కృష్ణుడు వాగ్దానము చేయగా సత్యభామ యలంకరించుకొని పతిసన్నిధికి వచ్చిన ట్లీక్రిందిపద్యమును తిమ్మనగారు రచించిరి—

"మాత్సర్యఘనమేఘమాలికాపగమప్ర
కాశితహిమధామకళ యనంగ
విరహనిశీథినీవిరమసంప్రాపితో
న్మీలనామోదపద్మిని యనంగఁ
గ్రోధదంతావళక్షోభవిభ్రమపున
స్సంజాతనైర్మల్యసరసి యనఁగ
సంతాపనైదాఘసమయనిర్గమకోర
కితనవమాలతీలతిక యనఁగ

శాంతిఁ జెన్నారి వికసితస్వాంత యగుచుఁ
గలఁక యెంతయు దిగఁద్రోచి చెలువ మెసఁగఁ
జేరవచ్చినప్రియభామ గారవించి
యున్నయత్తఱి మురవైరిసన్నిధికిని" [2 ఆ - 15 ప]

అమూలకమై, అందముగా నున్నయీసత్యావర్ణనము తిమ్మనగారి కల్పనయే.

ఉ. 'పాటలగంధిచిత్తమునఁ బాటిలుకోపభరంబు మాన్ప నె
ప్పాటునఁ బాటు గామి మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియ వెట్ట నాజగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్'

మ. 'జలజాతాసనవాసవాదిసురపూజాభాజనంబై తన
ర్చులతాంతాయుధుఁ గన్నతండ్రిశిర మచ్చో వామపాదంబునం
దొలఁగం ద్రోచె లతాంగి - యట్ల యగు - నాథుల్ నేరముల్ సేయఁ బే
రలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారముల్ నేర్తురే ?'

కం. 'కోపనపదహతిఁ గుహనా
గోపాలుఁడు గాంచి మెయి గగుర్పొడువఁగ ను
ద్దీపితమన్మథరాజ్య
ప్రాపితుఁడై పలికెఁ గూర్మి బయలుపడంగన్'

చ. 'నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తాఁ
చిన యది నాకు మన్ననయ చెల్వగుపీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానము దాఁకిన నొచ్చు నంచు నే
ననియెద నల్క మానవుగదా ! యిఁకనైన వరాళకుంతలా !'

చ. 'అన విని మానినీతిలక మప్పుడు మై యల దోఁప నిక్కి వీ
డినకచపంక్తిఁ బల్మఱు ముడిన్ వెసఁ ద్రోపుచుఁ బైచెఱంగు గ్ర
క్కునఁ జనుదోయిఁ జేర్చుచు మొగంబున లేఁజెమ రంకురింప జం
కెననెఱిచూపు చూచి పలికెం జలితాధరపల్లవాగ్రయై'

(1 ఆ - 120-124 పద్య)

సంస్కృతహరివంశమున లేనిసత్యాపాదతాడనఘట్టమును, భార్యాపాదతాడన మందియు కినుక వహింపక యామెపాద మెంతగా నొచ్చుకొన్నదో యని భార్యను ప్రసన్నురాలి నొనరించుకొనుటకై

రసికశేఖరుడైన శ్రీకృష్ణుడు చేసినయీప్రసంగమును, సత్యభామ యొక్క ఖండితనాయికాస్వభావమును, అవధులు దాటినయామెమాన రోషమును చిత్రించుపైపద్యములు శ్రీకృష్ణరాయలయంతఃపురమున నాప్రభువు తిరుమలాపాదస్పర్శమాత్రముచే కినిసి, యిల్లాలి కెడ మైన విషయమును స్ఫురింపజేయుచు, ఆరాయలను సరియైనదారికి తెచ్చి, విడిపోయినకృతిభర్తృదంపతులను మరల కలుపుపనుద్దేశముతోనే ఆప ద్ధర్మముగా తిమ్మకవి గంటము పట్టినాడనుచిరకాలమునుండి తెనుగు నాట ప్రచారములోనున్నకథ నిజమేమో యనుసందేహమును సహృ దయపాఠకులకు కలిగించుచు - అమూలకమైనయీరచనము మనోహర ముగా దాంపత్యానుబంధరహస్యవేది యైనశ్రీకృష్ణభగవానునిపరమ రాసిక్యమునకు ప్రతీకగా నున్నది.

'వినుఁడు సురేశ్వరవనపాలకులు ! ........ వాసితనము'

(4 ఆ - 59 ప)

అని సత్యభామ నందనవనపాలకులముందు గర్వోక్తులు పచరించుట సంస్కృతహరివంశమున లేనిది. సత్యభామగర్వమును, స్వాధీనపతికాత్వ మును ప్రకటించుటకే తిమ్మకవి యీభాగము నిట్లు రచించెను. నరకవధ కాలమున వీరశృంగారమూర్తి యై, అటు విరోధిని - ఇటు విభు డైన కృష్ణుని ఆమె చూచినట్లు, భాగవతమును, నాచనసోమునియుత్తర హరివంశమును బేర్కొనుచున్నవి. దాని కనుగుణముగానే తిమ్మకవి -

'నా విని సత్యభామ వదనంబున లేనగ వంకురింప నే
మే వచియింపఁబూనుహృదయేశ్వరునిం గనుసన్న మాన్పిచెన్
గ్రేవల జాఱుకొాంగు సవరించుచు వీడినకొప్పుఁ బల్మఱుం
జే వెడఁబోఁపుచుం బలికెఁ జెందొవచూపుల క్రేవఁదాటఁగన్'

(4 ఆ - 59 ప)

అని అటు విష్ణుపురాణములో కాని - ఇటు హరివంశములో కాని - లేని విషయమును జెప్పి, ప్రౌఢయైనసత్యభామమూర్తిని సహజసుందరముగా

చిత్రించి అటు నాచనసోమునితోను, ఇటు పోతనగారితోను పోటీపడి నట్లు పై పద్యమును తిమ్మకవి రచించినాడు.

కృష్ణుడు పారిజాతమును పెకలించుటయు సత్యభామ పలికిన గర్వోక్తులును వనపాలకులవలన పులోమజాన్వితు డైనదేవేంద్రుడు విన్నాడు.

'ఆమాటల్ విని పాకశాసనుఁడు రౌద్రాకారుఁడై పేర్చి యే
మేమీ కృష్ణుఁడు మందలో బలెనె తా నింద్రద్రు మోత్పాటనం
బీమై నిచ్చటఁ జూప వచ్చె నిది మేలే ; తార్క్ష్యుఁడైన న్మదీ
యామోఘాశనిపాత మిట్టి దని యాహా! తెల్పఁడాయెం జుమీ!'

(4 ఆ - 61 ప)

అనినట్లు తిమ్మనగారు రచించినపద్య మమూలక మైనది. ఇంద్రద్రుమ మనగా మద్దిచెట్టు అనియు, కల్పవృక్ష మనియు నర్థములు. ఆలమందలోవలె నమరలోకమున నింద్రద్రుమోత్పాటనము చేసి చూపవచ్చి నాఁ డిది మేలా? యని శ్రీకృష్ణునిశైశవక్రీడను స్ఫురింపఁ జేయుట సరసముగా నున్నది. ఆ కృష్ణుడు గోపాలకమాత్రుఁ డనియు, తా నమరలోకాధీశుడ ననియు నింద్రునియహంభావము. పూర్వ మమృతహరణమునకై కడంగినగరుత్మంతునిపై నింద్రుడు వజ్రాయుధమును ప్రయోగింపగా నాతఁ డొక్కయీఁకనుమాత్ర మర్పించి, ఆవజ్రముతో "నాయందు నీశక్తి యింతియు" అన్నాఁ డని యాంధ్రమహాభారతము[1] చెప్పుచున్నది. కనుకనే గరుత్మంతుడు "వజ్రంబునకు నీఁక వైచినబలశాలి యని (2 ఆ - 72 ప) తిమ్మనగారు వర్ణించిరి. యథార్థమున కింద్రునివజ్రాయుధము పక్షిరాజుయొక్క వెండ్రుకనైన కదలింపలేకపోయినది. అయినను మహర్షిశరీరసంభూత మైనయావజ్రమునందు తన కున్న గౌరవముచే గరుడఁ డొకయీఁక నర్పించి, దేవేంద్రు డశక్తుడై

1. ఆంధ్రమహాభారతము - నన్నయ

చూచుచుండగా నమృతభాండమును హరించుకొనిపోయినాడు. ఈ యథార్థమును తారుమారు చేసి కృష్ణునిచేత నోడిపోనున్నయమరేంద్రుడు 'కృష్ణునికి తనయమోఘమైనయశనిపాత మిట్టి దని శాస్త్రులైనను చెప్పకపోయెనే' యని తనభార్యయైనశచీదేవిముందు మాట్లాడి, తనలో లేనిగొప్పదనమును ప్రకటించుట నవ్వు పుట్టించును.

మ. " అని పౌలోమిమొగంబుఁ జూచి విను మోయబ్జాస్య ! నీ కింతమా
త్రన విన్నంబడ నేల ? పోదు నిదె సత్యాగర్వభారంబు ది
వ్యనగంబున్ విడిపించి తెత్తు నని సాహంకారు డై లేచి చ
య్యన శుద్ధాంతగృహంబు వెల్వడి సుధర్మాస్థానమధ్యస్థు డై"

(4 ఆ - 62 ప)

నాఁ డఁట ! సాహంకారు డైనయింద్రుడు శచీదేవి నూరడించుచు "పోదు నిదె" యనుట యింద్రునికి జరుగబోవుపరాజయ మనెడి యమంగళమును సూచించుచున్నది. ఇదియు మూలములో లేనిదే. "సత్యాగర్వభారంబు దివ్యనగంబును విడిపించి తెత్తు" నని యాఁడుదానిముందు బీరములు పలికినయింద్రుడు విరాటపర్వమునందలియుత్తరుని తలపించుచున్నాడు శుద్ధాంతమునుండి సుధర్మాస్థానమునకు చేరినదేవేంద్రుడు -

" తా నఁటె ? పారిజాతసుధారుహముం గొనిపోవువాఁడు క
న్గానఁడు యాదవుం" డనుచుఁ గన్నులు వేయును జేవుఱింప పై
శ్వానరధర్మదైత్యవర వారిధిపానిల యక్షనాయ కే
శానఁబూలదిక్కు చూచి కులిశంబు కరంబునఁ జాఁచి పట్టెనన్"

(4 ఆ - 63 ప)

ఇదియు నమూలకమైనదే. కృష్ణుని కేవల మొకవెఱ్ఱిగొల్లవాడుగా పరిగణించి "కన్గానఁడు యాదవుం" డని పద్మాక్షునిపై కోపముతో సహస్రాక్షునికన్నులు వేయును జేవుఱించినట్లు తిమ్మకవి యమూలకమైనదానిని రచించుట చమత్కారముగా నున్నది.

కులిశ మింద్రునికరమున పూచిన దఁట ! అనఁగా - నింద్రుని కరము లతవంటి దనియు, ఆవజ్రాయుధము పూవువంటి దనియు - కనుక నది శ్రీకృష్ణునికి పూజాపుష్పమువంటిదే కాని కృష్ణునిపై నాయుధముగా నుపయోగించుటకు పనికిమాలిన దనియు, మహావిష్ణువు ముందు నిస్సార మైన దనియు నిందలి స్వారస్యము.

" కోణపరంపరాహతులఁ గూరినవేదననో సమస్తని
ర్మాణభృతిప్రణాశకరు మాధవునిం జెనకంగబోవుగీ
ర్వాణులఁ బోకుఁ డంచు మొఱపైచెనొకో ! యన "

నిస్సాణము కదనాభిశంసియై పాకశాసనుహజారమున మ్రోసిన దఁట ! (4 ఆ - 64 ప) ఇంద్రాదులు కృష్ణు నెదిరించి, యపచార మొనర్చి యపజయముపా లగుదు రనుభవిష్యత్కథ యీాయమూలక మైన పద్యమున చక్కఁగా సూచింపబడినది.

మ. " అపు డాబద్ధఖలీనకాశ్వచయ మై యందూపరిభ్రంశిత
ద్విప మై దివ్యరథాగ్రకేతుపటసంధిత్సామిశత్నూత మై
యపరాభూతభుజావలేపభటవీరాలాపమై జంభవై
రిపురం బంతయు మందరక్షుభితవార్థింబోలె ఘూర్ణిల్లుచున్ "

(4 ఆ - 65 ప)

ఇది మూలములో లేనియందమైనభావము. పూర్వము మందరపర్వతముచే కలత నొందింపబడినవార్థినుండియే కల్పవృక్షము, నైరావతము, నుచ్చైశ్శ్రవము నుద్భవించినవి. ఇంద్రోపేంద్రులసమరకాలమున జంభవైరిపుర మంతయు, నశ్వములతో, ద్విపములతో మందరక్షుభితవార్థివలె ఘూర్ణిల్లుచున్న దఁట. అప్పుడును, నిప్పుడును - అక్కడను నిక్కడను గజాశ్వము లున్నవి. అపరాభూత భుజావలేపభటవీరాలాపము లందును, నిందును నున్నవి. కనుక నీవర్ణనము మనోహరముగానున్నది. ఆనాఁడు ఆవార్థి తనలోనికల్పవృక్షమును గోల్పోయినది. ఈనాఁడీయింద్రపురియు నాసముద్రమువలెనే తనలోనిపారిజాత తరువును

గోల్పోవుచున్నది. అందుచే నీవర్ణనము లోకోత్తరముగా నుండి పారిజాతము హరింపబడు నన్నసూచన యిందు కలదు. అమూలక మైన యీపద్యములో నింతయందము చోటు చేసికొన్నది.

" నీయనుజన్ముడన్ సఖుఁడ నీ కని యింటికి వచ్చి .... చేసె న
న్యాయము పారిజాతహరణంబునఁ గృష్ణుఁడు మంచిచుట్ట మౌరా !"
(4 ఆ - 66 ప)

యనగా నందఱును విని రఁట! అమూలకమైనయీపద్యములోని సొగసు సహృదయు లెఱుంగనిది కాదు.

" అత్తఱిం దత్తరంబునం దత్తడుల బల్లింపకయ నెప్పరంబున నెక్కంబోవువారును", "కృష్ణుండు కృష్ణుం డని పౌనఃపున్యంబుగాఁ బలుకుచు, నేమేమి ? యెక్క డెక్కడ ? నని యడుగువారికిఁ దెలివిపడ నుడువం దడవు లేక – "పారిజాతంబు పారిజాతం" బని పలుకుచు రణ సంభ్రమంబునం బరిభ్రమించువారును ........" ఈవిధముగా కృష్ణుని యసమానవీరమును, సురలోకవీరులతొట్రుపాటును వర్ణించుచు సాగిన యమూలక మైనయీ (4ఆ – 27) వచనము సహజత్వమునకు ప్రాణము పోయుచు సహృదయరంజకముగా సాగిపోయినది.

తే. " గళితశృంఖల లయ్యె నకాలనిద్ర
కనుఁగవలఁ గ్రాలఁ దమయంతఁ గదలవయ్యె
దారుణాధోరణప్రయత్నమునఁ గాని
నముచిమథనునిపీట కుండాలఘటలు "
(4 ఆ - 68 ప)

" హొరిఁబొరి నెగయుచు మ్రొగ్గుచు
ధరణీస్థలిఁ బొరలఁబడుచుఁ దలకొని శిఖం
బొరసినవయ్యె హయంబులు
భరియింపవు కొంతతడవు పల్యాణంబుల్ "
(4 ఆ - 69 ప)

" డాసి పురోహరిన్మణి విటంకమునం దనమేనినీడ ను
ల్కాసమదృష్టిఁ జూచి కినుకం బ్రతివీరుఁ డటంచు వ్రేసి బా
హాసి విభిన్నమై పడఁ దదర్థముఁ జేకొని వచ్చెఁ గల్పవృ
క్షాసవపానమత్తుఁ డమృతాంధసుఁ డొక్కఁడు జన్యకేలికిన్ "

(4 ఆ - 70 ప)

కారణము లేక యొకవేల్పుజోదు నారి యూరకే తెగుటయు, గొన యంబు నెంతద్రోచిన గనయంబున కెక్కకుండుట, రణాభిలాషి యైన సుపర్వుని ఆతనిసతి వెన్నంటి పట్టుట, సురవీరుఁ డొకఁడు తనసతి పరిరంభమును గాంచి యనికి వెడలుట - అనునమూలకము లైనవిషయము లతో కూడినపద్యములు తిమ్మకవినాఁటిసమాజములోనినమ్మకములను (అవియమంగళసూచన లని) చాటుచున్నవి.

అంతే కాక యీయమంగళసూచన లన్నియు నుపేంద్రుని చేత నింద్రుడు పొందబోవుపరాజయమును సూచించుచు, తిమ్మకవిగారి కళాకుశలతను చాటుచున్నవి.

పారిజాతాపహరణకావ్యమునందలినాలుగవయాశ్వాసములోని

ఉ. " మానసవేగరథ్యమును మాతలిసారథికంబు నగ్రసం
ధానితనీలనీరదపతాకము నైనరథంబుపై శచీ
జాని పులోమవృత్రబలజంభశరప్రవిఘాతకారణం
బైనతమత్రముం దొడిగె నాహవదోహలమానసంబునన్ "

[4 ఆ - 76 ప]

అనుపద్యమునుండి -

ఉ. " దారుణభంగి నొందొకటిఁ దాఁకెడునస్త్రముఖంబులన్ ఘణా
త్కారము లుల్లసిల్ల...... దైవతసింధురంబులో యనన్ "

అనుపద్యమువఱకును నున్నయమూలకవిషయములు తిమ్మనగారివర్ణనా వైయాత్యమునకు నిదర్శనముగా నున్నవి.

తిమ్మకవి ప్రతిభాసమగ్రుడు కావునను, ప్రతిభయొక్క స్వభావజీవలక్షణము నవ్యత్వసిసృక్షు కనుకను, మూలాతిశాయి యైన సౌందర్యలీలను తనరచనలో ప్రదర్శించినాడు. కనుకనే అన్యథాప్రక ల్పన మావశ్యక మైనది.

" కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరి బుట్టురత్నము లవారితసత్కవికల్పనావిశే
షావహపూర్వవృత్తములు సానలఁ దీఱినజాతిరత్నముల్ "

అని యానాఁటివారియభిప్రాయము. మఱి తిమ్మకవి అంతటిప్రతిభా సమగ్రుఁ డైనచో ఆపాటిమేర కైన నొకక్రొంగ్రొత్తకథనే గైకొని స్వతంత్రసృష్టి యేల చేయలే? దనుప్రశ్నకు రెండు సమాధానము లున్నవి.

1. సాహిత్యరంగములో సంబంధము గలపూర్వులు కేవల కల్పనాకథలను కృత్రిమరత్నములుగానే పరిగణించువారు. ఇది రామ రాజభూషణుని సొంతయభిప్రాయముమాత్రమే కాదు. ఇది యానాఁటి సాహిత్యప్రపంచమున ప్రచలిత మైనయభిప్రాయము. దీనికి విరుద్ధముగా పోవుటచేతనే పింగళిసూరనగారికళాపూర్ణోదయమునకును, మాదయ గారిమల్లనరాజశేఖరచరిత్రకును ఆకవులకాలమున తగినంతప్రశస్తి రాలేదు.

2. ఈసర్వభాషాకవులును మనభారతదేశములో బహుభాష లున్నను, భారతజాతిసంస్కృతియొక్క యేకసూత్రతను యీనిరవధిక కాలగమనములో అనుస్యూతముగా నిలుపుకొని వచ్చుచున్నారు. ఆసంస్కృతభాషలో ననేకసారస్వతమహాస్రష్టలయు, ద్రష్టలయు నుపజ్ఞా ఫలితముగా నెంతో యమూల్య మైనసాహిత్యము వెలసినది. ఆసార స్వతనిధులను, నిక్షేపములను తమమాతృభాషలలోనికి తరలించుకొను టయే తమమాతృభాషకు తాము చేయగలిగినమహోపకారముగా నానాఁటిసర్వభారతభాషాకవులును భావించిరి.

కథనుకూడ కవియే సృష్టించవలసివచ్చినదానికన్న సిద్ధ ముగా నున్నకథను స్వీకరించినకవికి కొంతశ్రమ తప్పుటయే కాక, తానే తనకథకు పాఠకుడై, ఆకథ నెట్లు చెప్పినచో హృదయావర్జక మగునో భావించి, ఆవిధముగా కథాసృష్టిమీఁద కాక - కేవలము కథమీఁదనే - అనగా - ఇతివృత్తనిర్వహణశిల్పముమీఁదనే తనదృష్టిని కేంద్రీకరించి

"స్వయం తీర్ణః పరాం స్తారయతి"

అన్నట్లు తాను కృతార్థుడై, తనపాఠకులకు రసానందయోగము కలిగింపగలడు.

ఆ. వె. "కథ జగత్ప్రసిద్ధ కావునఁ బూర్వప
ర్వార్థయుక్తి సేయునట్టిమెఱల
యత్న మించుకంతయైనను వలవదు
వలసినట్లు చెప్పవచ్చియుండు" [1]

అని తిక్కనగా రన్నది యిదే.

వక్రోక్తిజీవితకారుడు కుంతకుడు -

"నిరంతర రసోద్గారగర్భాః సౌందర్యనిర్భరాః
గిరః కవీనాం జీవంతి కథామాత్రమాశ్రితః" [2]

అన్నట్లుగా నిరంతరరసగర్భితములును, సౌందర్యనిర్భరములును నైన కవులవాక్కులే జీవించును కాని, కథాశ్రితమాత్రములు జీవింపవు. అనగా - కావ్యమునందు కథకన్న రసమే ప్రధాన మగుట స్పష్టము. కనుకనే తిమ్మనగారు పూర్వకథను గైకొని దానిని రసోచితప్రబంధ ముగా తీర్చిదిద్దినాడు.

1. తిక్కనమహాకవి -
2. కుంతకుడు -

# 7. ఇతివృత్తి నిర్వహణ శిల్పము

శ్రావ్య మైనశబ్దముద్వారా రమ్య మైనయర్థమును హృద్య మైనయనుభూతిగా పరిణమింపజేయునది కవిత్వ మని ప్రాచీప్రతీచీ ప్రాచీననవీనసర్వనిర్వచనములసారభూత మైనసత్యము. [1]

వివిధకావ్యాంగతంత్రీగతౌచిత్యవిద్యుత్ప్రవాహము "శిల్ప" మని ఆచార్య యస్వీజోగారావుగారియాభాషణము. [2]

శిల్ప మనగా కావ్యమును కళాత్మకముగా రచించుట. (రసోచితముగా విరచించుట యనియు కొందఱిమతము.) "Art Lies in Concealing Art" అని యొకయాంగ్లపండితు డన్నట్లు కళను గుప్తముగా నుంచుట. ధ్వనిమయముగా, సూచ్యార్థసూచనాసురుచిరముగా, చమత్కారచారువుగా, హృదయాహ్లాదిగా, పఠితలకు పారవశ్యమును గూర్చునదిగా రచించుట.

కావ్య మనగా సముచిత మైన – రసవంత మైనశబ్దార్థసృష్టి కనుక శబ్దశిల్ప మనియు, నర్థశిల్ప మనియు శిల్పము రెండు విధములు. శబ్దము నాశ్రయించి శిల్ప ముండుట శబ్దశిల్పము కాగా – అర్థము నాశ్రయించి శిల్పము మెఱయుట యర్థశిల్పము. "ముఖే ముఖే సరస్వతి!" ఒక కవి చేయగలసొగసులు మఱియొకకవి చేయలేడు. ఎవనిప్రజ్ఞ వానిదే. పదిమంది నడుచుత్రోవను గడ్డిపరకకూడ మొలవదుకదా! భావనలో, రీతిలో పదిమందికవులు పోవుదారిని పోవువాడు గడ్డిపోచకును కొఱగాఁడు. అట్టివాఁ డనుక ర్తగానే మిగిలిపోవును కాని-కవిశబ్దవాచ్యుడు కానేరడు. తన దైనయొకశైలిని సృష్టించుకొన్నవాడే నిజ మైనకవిగా పదికాలములు నిలువగలుగును. కనుక వర్ణనలో,

1. కవ్యపీఠ్రుతులు - ఆచార్యజోగారావుగారిపీఠిక
2. పాతికేండ్లక్రితము " సంస్కృతి " పత్రికలోనివ్యాసము.

రసపోషణములో, రచనావైచిత్రిలో, నితివృత్త నిర్వాహణశిల్పములో నెవనిదారి వానిదే. కనుకనే పరమస్వాతంత్రు డైనకవి సమకాలీనకవుల ప్రభావము తనపై ప్రసరింపనీయక తనప్రభావ మితరకవులపై బడునట్లు చేయగలుగును. ఈదృష్టితో నంది తిమ్మనగారియితివృత్తనిర్వాహణ శిల్పమును పరిశీలింతము. రససిద్ధు డైనకవి చేయురచనలో సామాన్య పదముకూడ సార్థక మై, మహార్థక మగును.

## ౧. ఎత్తుగడ

పురవర్ణనముతో కావ్యమును ప్రారంభించుట తిమ్మకవికాలమునాఁటి ప్రబంధకవులపరిపాటి. తిమ్మనగా రామార్గమున చనక

చం. " హరి నరకాసురున్ గెలిచి యద్దనుజేంద్రునియింట నున్నయ
చ్చరలకొలంబువారి నెఱజవ్వనముం బొలి వోనివారి దన్‌ఁ
వరునిగఁ గోరువారి లలనామణులం బదియాఱువేవురం
బరిణయ మయ్యె నారదునిపంపున సౌఖ్యరసైకలోలుఁ డై "
[1 ఆ - 37 ప]

అని సూటిగా కథాప్రారంభ మొనర్చెను. వర్ణనాత్మక మైనప్రబంధ ములో పురవర్ణనాదులు చేయక సూటిగా నిట్లు కథ నారంభించుట కూడ తిమ్మనగారిరచన కుత్కర్ష నాపాదించుట విచిత్రము.

ఈకథానాయకుడు హరి - అనగా - హరించువాడు. నరకుని ప్రాణములు హరించి, నరకు డపహరించినయదితికుండలముల నతని నుండి హరించినవాడు. సపత్నీమాత్సర్యగ్రస్త యైనసత్యభామమనస్తాప మును హరించుటకై సురలోకతరువును హరింపబోవువాడు. పదాఱు వేలయెనమండుగురుపడతులమనోధనములను హరించినవాడు. ఇన్ని లక్షణముల నిముడ్చుకొన్న " హరి " శబ్దముతో కథాప్రారంభ మొన రించి చక్కనియర్థశిల్పమును పాటించినా డీమహాకవి !

హరి నరకాసురుని గెల్వనిచో నదితికుండలము లామె కిచ్చు మిషతో నతడు స్వర్గమునకు వెళ్లుట తటస్థించెడిదే కాదు. హరి నరకాసురుని గెలిచెను. ఆనరకు డింద్రుని గెలిచినవాడు.

తన్ను వరునిగా కోరుటచేతనే పదారువేలమందియువతులను బరిణయ మాడినాడు కాని బలిమిమై వారిని హరి హరింపలేదు. ఆపరిణయ మాడుటయైనను "నారదునిపంపున" జరిగినది. అనగా ఈహరి ఆనారదుఁ డెట్లు పంచిన నట్లు చేయువాఁ డన్నమాట దీనినిబట్టి యీకావ్యమున నారదపాత్రప్రాముఖ్యము ఈతొలిపద్యములోనే సూచింపబడినది. నారదుఁడు వచ్చి పారిజాతప్రసూనము హరికి కానుక పెట్టనిచో పారిజాతాపహరణమే జరిగెడిది కాదు. కనుక నీకథలో హరి యెంత ముఖ్యుడో నారదుడును నంతే ముఖ్యుడు. పుణ్యకవ్రతముతో సహా సమస్తకథయును నారదునిపన్నాగముప్రకారమే జరిగినది. కనుక నారదకృష్ణపాత్రములు రెండును నీకథలో నాద్యంతమును ప్రాముఖ్యము వహించినవి. "సౌఖ్యరసైకలోలుఁ డై" హరి వర్తించెను – "సౌఖ్యాంబునిధి నోలలాడుచుండె గృష్ణుఁ డఖిలావనైకవర్తిష్ణుఁ డగుచు" (5 ఆ – 107 ప) అని కావ్యములోనిముగింపుమాటలు. కనుక కథాప్రారంభమునుండి తుదివఱకును ఆహరి సౌఖ్యరసైకలోలుడే. దీనినిబట్టి కావ్యములోనిశృంగారరసప్రాచుర్యము స్పష్ట మగుటయే కాక ఆహరి రసస్వరూపు డని చెప్పిన ట్లయినది.

"శ్లిష్యతి కామపి చుంబతి కామపి రమయతి కామపి రామాం" [1]

అని జయదేవుడు రచించినట్లుగా కృష్ణుడు "ఏయేవేళల నేసరోజముఖి యేయేలీలలం గోరుఁ దా నాయావేళల నాసరోజముఖి నాయాలీలలం దేల్చి యేచాయం జూచినఁ దాన యై మెలఁగుచున్ సౌఖ్యాబ్ధి నోలాడు భోగాయత్తుండయి పెక్కురూపముల మాయాకల్పనా చాతురిన్."

1. జయదేవునిగీతగోవిందము – చందనచర్చితనీలకళేబర యనుఅష్టపదిలోనిది.

" భోజజనపాలసుతన్ దరుణీమణి సా[త్రాజితి నిరువుర మన్నించి మిగుల నిచ్చుం జనవుల్." ఇట్టికృష్ణుడు రుక్మిణీకాంతగృహ ములో నుండి (ద్యూత కేళిలో) వినోదించుచుండగా కథ మొద లై నది. (1 ఆ - 43 ప) కథాంతమున " భోజకన్యాసరి[ద్రాజహంసము, ఆసత్యా భామాశుకీకేళిపంజరము సౌఖ్యాంబునిధి నోలలాడుచుండె " నని ముగింపు. దీనినిబట్టి తిమ్మకవి యెందును పరాకు వహింపక కథా [ప్రారంభమునకును, కథాంతమునకును చక్కనిపొంతన కూర్చినాడు. ఈదృష్టితో చూచినచో పొల్లుమాట యొక్కటియు తిమ్మకవిగారి రచనలో దొరలలే దని స్పష్టమగును. పదాంతరాసహిష్ణుత మహాకావ్య లక్షణము. అన్వర్థ మైనపద[ప్రయోగముతో నిట్లు కావ్యరచన చేయుట శిల్పవేత్త లైనమహాకవులకే సాధ్యము. " పూవు పుట్టగానే పరిమళించు నన్నట్లు తిమ్మనగారిమహాకావ్యశిల్ప మీతొలిపద్యముననే సహృదయ రంజక మై సాక్షాత్కరించుచున్నది.

ఆయావేళల నాయాసరోజముఖులు కోరినలీలలచే యదూద్వ హుడు మాయాకల్పనాచాతురిచే పెక్కురూపములతో నేచాయం జూచినం దాన యై సౌఖ్యాబ్ధి నోలాడుచున్నాఁ డఁట ! (1ఆ - 40ప).

కృష్ణునియీమాయాకల్పనాచాతురి భవిష్యత్కథాసౌధము నకు పునాది.

నారదుడు తెచ్చి కృష్ణార్పణము చేయనున్నపారిజాతంపుం [గొన్నన " ఉచితోపయోగజనితానందబాష్పసందోహశంకావహా మకరందబిందుతుందిల " మని వర్ణించినతిమ్మకవి " నీవు దాల్చినకతన నీపూవు నేఁడు భాగ్యము వహించె నుచితోపయోగ్యవృత్తి " నని నారదునిచే రుక్మిణితో ననిపించుట గమనింపదగినది. ఈకవి యొకసారి చేసినవర్ణనము సార్థక మై చాలదూరము దానివ్యాప్తి యుండు ననుట కిది యొకచిన్నియుదాహరణము.

ఇఁక రుక్మిణిచెంత పారిజాతపుష్పమహిమను వర్ణించుచు నారదుడు చేసినప్రసంగమంతయు సత్యభామను రెచ్చగొట్టుటకే యుద్దేశింపబడినది. అరివేరంపుఁదపసి, (1 ఆ - 44 ప) జలజాసనుపట్టి, కలహసంభ్రమపరుఁడై పలికినట్లు (1 ఆ - 57 ప) కవి ముందుగానే ఆనారద పాత్రలక్షణమును చెప్పి దానికి లక్ష్యముగా నారదసంభాషణమును నడిపించినాడు. రుక్మిణీసౌధమున పారిజాతసుమప్రదానఘట్టము జరుగుచుండగా సత్యభామ కృష్ణునికొఱకెదురు చూచుచు, తన శృంగారవనములో గిరిపొంత పూఁదేనియయేటికాలువదరిని చెంగల్వ పుష్పాళ్లు నించినచంద్రోపలవేదిపై నున్నది. అచ్చట నలికులరావములు, కిసలయాశులకోకిలకాకుకాకలీనాదములు చెలంగగా, కమ్మని తమ్మికొలంకుతెమ్మెరలు పొలయుచున్నవి. ఈసన్నివేశ మంతయు మదవతియైనసత్యభామలో మదనావేశమును రెచ్చగొట్టునదియే కదా! దానికి తోడు దక్షిణాంసచూచుకనయనప్రకంపము లామెమనస్సును పాడు చేసినవి. ఈస్థితిలో కలతపడియున్నసత్యకడకు "అమ్మా! యేమని చెప్పుదు?" నని యాక్రోశించుచు నామెచెలికత్తె వచ్చినది. ఏమియును చెప్పకపోయినను - అంతయును చెప్పినట్లే యైనది. ఆవచ్చిన చెలికత్తె మిక్కిలిజాణ. నారదు డెన్నోపద్యములలో వర్ణించినదివ్యసుమమహిమను ఈచెలికత్తె "అనఘ మ్మమరైకయోగ్య మతిసౌఖ్యకరం బనితరసులభ మ్మిది" యని నారదు డన్నాడని నాలుగుమాటలలో చెప్పివైచినది. ఆచెప్పినవి నాలుగుమాటలే యైనను ముఖ్యవిషయములను పూస గ్రుచ్చినట్లాపాత్రచే చెప్పించుట కవినేర్పు.

కం. "మి న్నంది వేగఁ గైకొని
కన్నుల నొత్తికొని మ్రొక్కి గారవ మెసఁగన్
వెన్నుఁడు రుక్మిణి కొసఁగెను
అన్నెలఁతయుఁ గొప్పులోన నవ్విరిఁ దాల్చెన్"

[1 ఆ - 77 ప]

అన్న దాసఖి. ఇ ట్లామె చెప్పుటలో నెంతో విశేష మున్నది. అది మింటిదెస (స్వర్గమున) నుండుపూవు. అందుచే వెన్నుఁడు మి న్నంది (ఆనందముతో నెగిరి - అని మఱియొకయర్థము) గై కొన్నాడు! కృష్ణుడు మి న్నంది ఆపూలచెట్టునే పెకలించి తెచ్చునంతవఱకును చల్లారనిపంతమును సత్యభామలో రెచ్చగొట్టినవి యీచెలికత్తె మాటలు.

ఆపూవు ధరింపగానే "అసలే రాజబింబాస్య యైనరుక్మిణి వింతచెలువు గలిగి సానఁ బట్టినమకరాంకుశస్త్ర మనఁగఁ దేజరిల్లిన" దన్నది సత్యాసఖి. చంద్రుడు మనఃకారకు డని జ్యోతిశ్శాస్త్రము చెప్పుచున్నది. కనుక రాజబింబాస్య రుక్మిణి కృష్ణునిమనసు నాకర్షించుశక్తి కలది. ఈపారిజాతమహిమచే నామె సానఁ బట్టినమకరాంకుశస్త్ర మై తనలోనిసమ్మోహనత్వమును వేయిరెట్లు పెంచుకొన్నది. ఇఁక కృష్ణుడు సత్యభామదగ్గరకు రానేరాఁ డనునంతయుధైర్యము కలిగించుమాట లివి. అంతే కాదు - ఆకుసుమము ధరించి గద్దె నెక్కి ముల్లోకముఁ దాన యేలుగతి నున్నయాలోలవిలోచన రుక్మిణిని తోడికామినీలోకము అంతవఱకును మదిలో నుండినమచ్చరము దొలఁగి భజించుచున్న దఁట. "ఓసత్యభామా! ఇఁక నీ బ్రతుకుకూడ అంతేసుమా!" యను హెచ్చరిక యీమాటలలో ధ్వనించుచున్నది.

"ఆకుసుమంబుఁ దాల్చినమహామహిమంబున" రుక్మిణి కంతటివైభవ మబ్బినది. కనుక ఆసురలోకసుమ మెంతగొప్ప దైనను సత్యభామసకియ దానిని "కుసుమము" అనుచున్నది. అనగా - "దుష్ట మైనసుమము" అని యామెయాంతర్యము. ఆమె య ట్లనుట సహజమే. తనయజమానురాలియవమానమునకు కారణ మైనయాపూ వెంతగొప్ప దైనను - ఆమెదృష్టిలో నది చెడ్డదే యగుట లోకసహజము. ఈకకారమును ప్రాసస్థానమున నుంచి తిమ్మకవి తనశబ్దచమత్కృతిని చాటుకొన్నాడు.

ఆసఖి " ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు !" అమ్మో ! అని గుండె బాదుకొనుచు "అహంకృతి నెప్పుడు విజ్ఞపీఁగుచున్ వంతుకు వచ్చుసత్యగరువం బిఁకఁ జెల్ల" దన్నాడు. ఆయనుట చాటు మాటుగానైన కాదు. శౌరి వినంగ (నీసవతియైన) రుక్మిణీకాంత వినంగ (నీయాయిష్టసఖిని - నేనచ్చట నున్నా ననుమెమోాటమి యైనను లేక) నేను వినఁగాఁ బలికినమాట లివి" అని చెప్పిచెప్పి, చిట్టచివర - "మానినీ !" అని యిష్టసఖి సత్యభామను సంబోధించి ఆమెలోనిమాన రోషమును రెచ్చగొట్టినది. అంతతో నూరకొన్నదా ? ఈమాటలు చెవుల బడగానే యెంతటి మానవతియైనను సవతియున్నతిని, తననిస్స హాయస్థితిని తలంచుకొన్నంతనే సత్యభామకన్నుల నీరు గ్రమ్మినది. కాదు - కాదు - ఆమెకన్నులు నీటిలోనుండియే పుట్టినట్లున్నవి. అనగా ఆమె వారిజనేత్ర యైనది. ఆదీనస్థితి నరసినసకియ

" ఆరణభోజనుమతకము
లారుక్మిణినటన లామురాంతకుచెయ్వుల్
చేరి కనుంగొనుచో నె
వ్వారికిఁ గోపంబు రాదు ? వారిజనేత్రా ! "

[1 ఆ - 81 ప]

అన్నది. " ఓవారిజనేత్రా ! ఇది కన్నుల నీరు నిండించవలసినతరుణము కాదు - కోపింపవలసినతరుణముసుమా ! " యని కింకర్తవ్యతామూఢ యైనయజమానురాలికి కర్తవ్యము నుపదేశించినది. కనుకనే సత్యభామ భామయై కోపగృహము ప్రవేశించినది. ఈసన్నివేశమును తిమ్మకవి యింతచక్కగా నిర్వహించినాడు !

" పలుతెఱఁగుముళ్ళమాటలు
కలహమె కల్యాణ మని జగంబులవెంటన్
మెలఁగెడుమౌనికి సహజము "

[1 ఆ - 85 ప]

ఈమాటలు సత్యభామ యొకందుల కన్నది. కాని - యింకొకవిధముగా నామాటలు నిజ మైనవి! ఎట్లనగా - నారదుడు పెట్టినకలహము తుదకు సత్యభామకు పారిజాతప్రాప్తిచే శుభప్రద మగుటయే కాక, ద్వారకలోనివికలాంగులకును, వృద్ధులకును, రోగులకును శుభప్రద మైనది. అందఱును బాగుగనే యున్నారు - కాని - ద్వారకలో కలహాశనుడు రేకెత్తించినయీకలహ మెక్కడనో యున్నయింద్రుని కెసరు పెట్టిన ట్లగుట వింతలలో వింత!

సత్యభామయందు భీతియు, ప్రీతియు కలకృష్ణుడు "సాత్రాజితిబోఁటి నావలనఁ దా నేమేమి కల్పించెనో" యనుచింతతో ప్రద్యుమ్నుని నారదునికడ నుంచి సత్యభామసౌధమునకు వచ్చినాడు. సత్యతో నామెచెలికత్తె తనపై కొండెములు చెప్పెనేమో యని కృష్ణునిబెదరు. "చెలులు నాతో నేమి చెప్పుదురో యని లంచంబు లిచ్చు నోచంచలాక్షి!" అన్నసత్యవచనముల కనుగుణముగానే యున్నది కృష్ణునియీబెదరు.

అల్లన కోపగృహమున చేరి కృష్ణుడు సత్యకు తానే చెలికత్తెకు బదులుగా తాలవృంతముతో వీచి, ఆమెయనుగ్రహముకొఱకై తపించినాడు. (1 ఆ - 109 ప)

"పాయనియనురక్తి నీయెడన యగ్గలమై కనుపట్టు నాకు నీపనిచినపంపు సేయుటయ ప్రాభవ మా టది నీ వెఱుంగవే?" అని సత్యభామను సముదాయించుటకు కృష్ణు డాడినమాటలలో నామె ప్రీతికై పారిజాతమును తెచ్చి యిత్తు నన్నసూచన యున్నది. "ఎట్టి కామినులకు గారవంబు మెఱమెచ్చులకై పచరింతు" ననుటలో తాను రుక్మిణీసౌధమున నుండుటచే గత్యంతరము లేక పారిజాతపుష్పము నామె కిచ్చితి నని యొకవిధముగా తప్పు నొప్పికొనుట యున్నది.

## ౨. సత్యాపాదతాడనఘట్టము

కృష్ణు డెంతగా ప్రాథేయపడినను కోపగృహమున నుండినసత్యభామ మానరోషముచే నెంతకును ప్రసన్నురాలు కాకపోగా ఆజగన్నాటక సూత్రధారి మృదుపల్లవకోమలతత్పదద్వయీపాటలకాంతి తనమౌళి మణిపంక్తికి వన్నియ వెట్టునట్లుగా మనసార మ్రొక్కినాడు. మానరోషముచే సత్యభామమొగము జేవురించినది. మృదుపల్లవములవంటి యామెపాదములును నెఱ్ఱనివే! ఆపాటలకాంతి ఈయనమౌళిమణులకు వన్నె వెట్టిన దఁట! ఆపాదము లెంత మెఱుపో! ఆమెపై నీయన కెంతవలపో!!

ఆమె యో ర్పొకయింత లేనిది. ఈయన యామెయధరామృతమును, బాహోపరీరంభమును - కనీసము - ఆమెకడకంటిచూపును లేనిచో నిలువఁబనివాఁడు! పైగా జగన్నాటకసూత్రధారి! కనుకనే "దాసునితప్పులు దండముతో సరి" యన్నట్లు ఆమెక్షమాభిక్ష నర్థించి యర్మిలితో మ్రొక్కినాడు! అంతట

" జలజాతాసనవాసవాదిసురపూజాభాజనం బై తన
ర్చులతాంతాయుధుఁ గన్నతండ్రిశిర మచ్చో వామపాదంబునం
దొలఁగం ద్రోసె లతాంగి - అట్ల యగు - నాథుల్ నేరముల్ సేయఁ బే
రలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారముల్ నేర్తురే ?"

[1 ఆ - 121 ప]

ఈపద్యము పారిజాతాపహరణకావ్యమునకు మకుటాయమానముగా నున్నది.

సత్యభామ తిమ్మకవిదృష్టిలో లతాంగి. కృష్ణునిదృష్టిలో లలితాంగి (చూ. 1 ఆ - 109 ప). ఆమెపాదములు మృదుపల్లవకోమలములు (చూ. 1 ఆ - 120 ప). కనుకనే యామె కృష్ణునిశిరమును తన పాదమున తొలంగద్రోచినను శ్రీకృష్ణుఁడు నొచ్చికొనలేదు - సరికదా

" నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తాఁ
చిన నది నాకు మన్ననయ - చెల్వగునీపదపంకజమ్ము మ
త్తనుపులకాగ్రకంటకవితానము దాఁకిన నొచ్చు నంచు నే
ననియెద - నల్క మానవుకదా యిఁకనైన నరాళకుంతలా !
(1 ఆ - 123 ప)

అని ప్రాథేయపడినాడు.

ఆకోపనపదహతికి ఆకుహనాగోపాలునియొడ లెల్ల గగుర్పొడిచి ఆయన యుద్దీపితమన్మథరాజ్యప్రాపితుఁడైనాడు ! ఆమహానుభావు డెంతటిరసికుఁడో మఱి ! ఆఖండితనాయిక నిట్లు ప్రాథేయపడుటలో కృష్ణునిలో నొకవంక దీనత్వము - నొకవంక పరమరాసిక్యము - నొకవంక పులకలు - నింకొకవంక యలుక కానియలుక - దానిని స్పష్టాస్పష్టముగా సూచించి వదలుచున్న " అరాళకుంతలా ! " యను సంబోధనము - నన్నియు నిండుగా నున్నవి. అరాళకుంతలాత్వ మొక దృష్టితో చూచినచో సౌందర్యలక్షణము - మఱియొకదృష్టితో చూచినచో వక్రస్వభావసూచనము !

" అరాళకుంతలా ! " యని కోపగృహమున నాప్రేమస్వరూపుఁ డనగా - " కుటిలాలకా ! " యని కలహభోజనుఁడైననారదుఁడు బాహాటముగానే సత్యభామను సాభిప్రాయముగా సంబోధించినట్లు (2 ఆ - 26 ప) రచించుట తిమ్మనగారియనల్పశిల్పమునకు మచ్చుతునకలు.

ఇక శ్రీకృష్ణుడు సత్యభామకు ప్రణమిల్లుట యెంతవఱకుచిత ? మన్నది ప్రశ్న. ఇట్టిసన్నివేశమును తిమ్మకవిమాత్రమే కల్పింపలేదు. కోపన యైనకైకేయి ననునయించుటకై దశరథమహారాజామెపాదములకు ప్రణమిల్లినాఁ డని వాల్మీకిమహర్షి రామాయణమున రచించినయీక్రిందిశ్లోకములు సాక్ష్య మిచ్చుచున్నవి :-

"న జీవితం మేఽస్తి కుతః పున స్సుఖం
వినాత్మజే నాత్మవతః కుతో రతిః
మమాహితం దేవి న కర్తు మర్హసి
స్పృశామి పాదావపి తే ప్రసీద మే "

"స భూమిపాలో విలప న్ననాథవత్
స్త్రియాగృహీతో హృదయేతిమాత్రయా
పపాత దేవ్యా శ్చరణౌ ప్రసారితా
వుభావసంస్పృశ్య యథా తుర స్తథా "

(రామాయణము. అయోధ్యకాండము - 12 సర్గము)

" ఏవ ముక్త్వా తతో రాజా కైకేయీం సంయతాంజలిః
ప్రసాదయామాస పునః కైకేయీం చేద మబ్రవీత్ "

(అయోధ్యకాండము - 13 సర్గము)

" దహ్యమాన స్సశోకాభ్యాం కౌసల్యా మాహ భూపతిః
వేపమానోఽంజలిం కృత్వా ప్రసాదార్థ మవాజ్ముఖః
ప్రసాదయే త్వాం కౌసల్యే రచితోయం మయాంజలిః
వత్సలా చా నృశంసా చ త్వం హి నిత్యం పరేష్వపి ".

(అయోధ్యకాండము - 62 సర్గము)

ప్రేయసికోపము నపనయించుటకై ముదుసలి యైనదశరథుడే భార్యపాదములకు నమస్కరింపగా - మఱి - రసికలోకచక్రవర్తియు, లీలామానుషవిగ్రహుడును నైనకుహనాగోపాలుఁడే కాంతమందిరమున ఖండితనాయిక యైనప్రేయసిని ప్రసన్నురాలి నొనరించుకొనుటకై యామెపదములకు ప్రణమిల్లి, యామెచే పాదతాడనము నందినట్లు తిమ్మకవి రచించుట యనౌచిత్య మెట్లగును ?

కవికులగురు వైనకాళిదాసమహాకవి రచించినయభిజ్ఞాన శాకుంతలమున నాయకుఁడైనదుష్యంతమహారాజు ప్రియవల్లభ యైన

శకుంతలకు పాదసంవాహనము చేయుట కుదుర్చుకున్నట్లు రచింపబడినది :-

“ కిం శీతలైః క్లమవినోదిభి రార్ద్రవాతాన్
సంచారయామి నళినీదళతాళవృంతైః
అంకే నిధాయ కరభోరు యథా సుఖం తే
సంవాహయామి చరణా వుత పద్మతామ్రౌ ”

అనినాఁ డంట దుష్యంతుడు. [1]

“ సాలక్తకేన నవపల్లవకోమలేన పాదేన నూపురవతా మదలాలసేన
య స్తాడ్యతే దయితయా ప్రణయాపరాధాత్
సోఽంగీకృతో భగవతా మకరధ్వజేన ”

అని అమరుకమహాకవి (అమరుకము - 101 వ శ్లోకమున) ప్రవచించినాడు.

కనుక రసికశిఖామణి యైనశ్రీకృష్ణుడు సత్యభామపాదముల ప్రణమిల్లి ప్రేయసీపాదతాడన మందినట్లు తిమ్మకవి రచించుట ఆయన శాస్త్రపరిజ్ఞానమును, రసవత్కవితాకళాసృష్టిచణత్వమును, చాటుచున్నది.

శ్రీనాథమహాకవి తనకాశీఖండములో చంద్రుని వర్ణించుచు నీక్రింది పద్యమును రచించినాడు :-

“ ఏటికి తానకంబయినయిక్షుశరాసనవైరిజూటికా
కోటికి మల్లికాకుసుమగుచ్ఛము తేవ వహించుఁ గైకొనున్
బాటలిమంబు మానపరిపాకవినోదనవేళఁ బార్వతీ
పాటలగంధిచారుపదపద్మనఖంబులఁ గ్రొత్తలత్తుకన్ ”
(కాశీఖండము)

1. (రాజా) శకుంతలాయాః పాదయోః ప్రణిపత్య - సుతను హృదయాత్ప్రత్యాదేశవ్యళీకమపైతు తే, .... క్షిప్తాంధనోత్యహి శంకయా. (శకుంతలా) ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ త్వార్యపుత్ర - శాకుంతలము - 7 అంకము

పార్వతీపరమేశ్వరులరహఃక్రీడావిశేషములలో పార్వతీదేవిపాదనఖముల కంటినపచ్చిపారాణిలత్తుక శివశిరోభూషణమైనచంద్రుని కంటుకొన్నదఁట! అందుచే ఆచంద్రుఁడు పాటలవర్ణము నందినాఁడఁట! అరహఃక్రీడలెట్టివో! పార్వతిపారాణి శివునిశిరమున నున్న "చంద్రునిఁ గెందామరపువ్వుగాఁ జేయఁగలయాబంధవిశేషములో - ప్రణయకోప పాదప్రణామములో యెట్టివో!" [1]

శ్రీనాథునియీపద్యము ఆదిమదంపతులకామకళావ్యాపార పారీణతకు విజయపతాక నెత్తుచు, శ్రీకృష్ణుడు సత్యభామపాదముల ప్రణమిల్లినట్లు రచింపబడినతిమ్మనగారిపద్యమును, ఆమె శ్రీకృష్ణుని శిరమును దలంగంద్రోచినట్లు రచింపబడినపద్యమును సమర్థించుట కుపకరించుచున్నది.

"వర్ధమానప్రణయాహినాయికా .... శయన మారోహయేత్" అన్న వాత్స్యాయనమహర్షి కామసూత్రమునకు [2]

క్రోధవశాత్తస్య శిరసి పాదతాడనమపి న దోషాయ సౌభాగ్యచిహ్నం తదపి నాగరకవృద్ధాః" అని యశోధరుడు తనజయమంగళవ్యాఖ్యానములో చేసినవ్యాఖ్యానముకూడ ఈసత్యాపాదతాడన ఘట్టమును సమర్థించునదిగా నున్నది. [3]

"కామశాస్త్రపద్ధతిని, నలంకారశాస్త్రసరణిని నాయకుని దగునీకృత్యము మిగుల రసమును బోషించునదే యగుటం జేసియు నిది

1. శ్రీనాథునికవితాసామ్రాజ్యము - పుట 104 - గడియారము వేంకటశేషశాస్త్రిగారు
2. వాత్స్యాయనకామసూత్రము.
3. యశోధరువిజయమంగళవ్యాఖ్య.

యనింద్యమే యనవలయును ” అని ఈసందర్భమును దూసి రామమూర్తిశాస్త్రిగారు వ్యాఖ్యానించి యున్నారు. [1]

“ మనుచరిత్రలో వరూధినీప్రవరులఘట్టం, పారిజాతాపహరణంలో సత్యభామఅలుక, పాండురంగమహాత్మ్యంలో నిగమశర్మకథ ప్రబంధారణ్యాల్లో పూచినపచ్చనిపొదరిళ్లు ” అని డాక్టరు సి. నారాయణరెడ్డిగారు చెప్పినది సమంజసముగానే యున్నది. [2]

“ డాక్టర్ యస్వీ జోగారావుగారన్నట్లు అతనికి నుదురు చొప్పి కట్టవలె నని సంకల్పించి యామె తన్నలేదు. అంచు కట్టినతన కోపము నమాంతముగా ప్రదర్శించుటకే శిర మచ్చోఁ దొలఁగంద్రోచినది. అది అతని కుపకారమే అయినది. అతనికి పులకలు లభించినవి. “తాచినతాపును మన్ననగా సరిపెట్టుకొన్నాఁ డామహాను భావుఁడు.” [3]

“ కోపనపదహతిఁ గుహనా
గోపాలుఁడు గాంచి ”

నని కావ్యమును రచించిన తిమ్మనకవి కంఠోక్తిగా చెప్పుచుండగా - నాపాదతాడనమును సమర్థించుచు నింద జేట్లు వ్యాఖ్యానించుచుండగా - సత్యభామ కృష్ణుని తన్నలే దన్నతాపీవారివాదములో [4] పస లేదు.

నాయకుఁ డొనర్చినయపరాధముచే కుపిత యైననాయికలో రగిలినమనఃక్షోభ యే మానము. పతి యన్యకాంతను సంగమించుటచే నాయికలో చెలరేగుకోప మీర్ష్యామానము.

1. పారిజాతాపహరణమునకు దూశిరామమూర్తిశాస్త్రిగారిసురభివ్యాఖ్య.
2. యువభారతివారు ప్రచురించిన “ కావ్యలహరి ” లో “ పారసౌరభము ” అను నారాయణరెడ్డిగారివ్యాసము.
3. సారస్వతవీరాజనము - ఆచార్య యస్వీ జోగారావుగారు. పుట 69
4. పారిజాతాపహరణమునకు తాపీధర్మారావుగారిపీఠిక.

"వ్రీడా మీర్ష్యాకృతః కోపో నోఽ న్యాసంగిని ప్రియే"

అని దశరూపకము చెప్పుచున్నది.[1]

ప్రియురాలికి ప్రియుడు పాదప్రణామాదు లొనర్చునట్లు చేయునది మాన మని సరస్వతీకంఠాభరణము చెప్పుచున్నది.[2] అట్టిమానము కలది కనుకనే సత్యభామకు "మానవతి" యనుపర్యాయపదమును తిమ్మకవి యీక్రిందిపద్యమున ప్రయోగించినాడు :-

"మానవతి యిట్లు మానని
మానక్రోధములచేఁ గుమారిలి చింతా
ధీనగతి నుండ మదిలో
నూనినప్రేమమున నంబుజోదరుఁ డనియెన్"

(1 ఆ - 114 ప)

ఈ "మానవతీ" శబ్దప్రయోగముచే కృష్ణునికి ప్రాప్తింపనున్నప్రేయసీపాదతాడనగౌరవమును తిమ్మకవి ముందుగానే సూచించి తనశిల్పకళానైపుణ్యమును మెఱయించినాడు.

"సతర్జ్యం నిష్ఠురం రోషా దధీరా తాడయే ద్దృఢం"

అనుచున్నది రసార్ణవసుధాకరము.[3] తిమ్మకవిసత్యభామను ధీరాధీరాప్రగల్భగా చిత్రించుటచే నామె చేసినపాదతాడనకృత్యము రసపోషకమే యని సహృదయు లంగీకరింపకపోరు.

1. దశరూపకము.
2. సరస్వతీకంఠాభరణము
"మానపూజాయాం ఇతి ధాతోః స్వార్థికణిజంతత్వాత్ ణిచ్ ఘఙిచ మాన ఇతి రూపం స హి ప్రేయాం సమస్యాః పాదపతనాదిపూజాయాం ప్రయోజయతి."
3. రసార్ణవసుధాకరము.

తాపు తిన్నకృష్ణునికి లేనిబాధ ఇతరుల కనవసరము కనుక నీచర్చ నింతటితో ముగించి - ఇట్లు హరివంశమున లేనిపాదతాడన ఘట్టమును కావ్యములో చొప్పించినతిమ్మనగారియాంతర్యము నరయ వలసి యున్నది. కవిసమ్రాట్ కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణగా రన్నట్లు - "భార్యయొక్క-పాదము భర్తశిరమునకు తగులుటలో తప్పు లే దని నిరూపించుటకుగాను తిమ్మన్న యీకావ్యమును వ్రాసె నని యొకపెద్దకథ. ఆకథ పాతుకొనిపోయినది." [1]

నిప్పు లేనిదే పొగ పుట్టదు - కనుక - ఆకథలో కొంత సత్యముండియే యుండును. కనుకనే రాణితిరుమలదేవిపదస్పర్శకు రసికుడైనరాయలు పులకింపవలెనే కాని కలహింపరాదు - ఆగ్రహింపను రాదు - అని తిమ్మకవి రాయలవారికి కాంతాసమ్మితోపదేశము చేయుటకే యీసన్నివేశమును కల్పించి ఆసత్యభామపాదతాడనమును సమర్థించినా డని మనము విశ్వసించుట తప్పు కాదు.

సత్యభామ చేసినయీపని యనుచిత మని తిమ్మకవి యొకవంక నంగీకరించుచునే -

> "నాథుల్ నేరముల్ పేయఁ బేరలుకం జెందినయట్టికాంత
> యుచితవ్యాపారముల్ నేర్తురే?"

అని యీమెయనుచితచర్యకు కృష్ణునే తిమ్మకవి తప్పు పట్టుట ముచ్చటగా నున్నది. ఈఘట్టమున నీవిధముగా కవి సత్యభామపక్షమును వహించుటనుబట్టి కృతిభర్తయైనకృష్ణరాయలయంతఃపురమున జరిగినట్లు చెప్పబడుచున్నయుద్దేశరహితమైనతిరుమలాపాదతాడనమును కూడ సమర్థించినా డని సందేహించుట కవకాశ మున్నది.

"కృష్ణావతారమున భార్య యుద్దేశపూర్వకముగా తన్నినను భరించిన నీ పీయవతారమున నిద్దురమైకమునసున్నయర్ధాంగిపాదస్పర్శ

1. పారిజాతాపహరణము - ఎమెస్కో ప్రచురణము - విశ్వనాథవారిపీఠిక - పుట 12

మాత్రమునే భరింపలేవా ? " యనియు, " అపూర్వజన్మమునందలి లోపములను తొలగించుకొనవలసిననీవు అప్పటికంటె నిప్పుడు దిగజాఱిపోయి అరసికతను ప్రకటించుకొనుట తగునా ? " యనియు [1] కవి రాయలవారికి వ్యంగ్యధోరణిలో చెప్పుచున్నాడు. అసలు - తిమ్మన పారిజాతాపహరణకావ్యమును రచించి రాయల కంకితము చేయుట లోనియాంతర్యమే యిది యని కొందఱియభిప్రాయము. కనుక నీకావ్యమున " జలజాతాసనవాసవాది - ...." యనుపద్యములో చెప్పబడిన యమూలకపాదతాడనవిషయమును కావలె ననియే తిమ్మకవి చెప్పినట్లు (యింతకుముందే రచింపబడిన) కావ్యావతరణపూర్వరంగము స్పష్టము చేయగలదు. అంతే కాదు - సత్యభామాపాదతాడనఘట్టము వర్ణింపబడినప్రథమాశ్వాసము పూర్తి కాగానే ఆశ్వాసాంతపద్యములో

" ప్రతివర్షవసంతోత్సవ
కుతుకాగతసుకవినికరగుంభితకావ్య

ఆ
చతురాంతఃపురవధూప్రసాదనరసికా ! "
(1 ఆ - 139 ప)

అని శ్రీకృష్ణరాయలను సంబోధించినపద్యములో తిమ్మకవి రాయలవారి యంతఃపురకలహప్రసక్తి తెచ్చుటనుబట్టి తిమ్మకవి యొకపథకము ప్రకార మీకావ్యమును రచించినాఁ డనియు, తిరుమలాపాదస్పర్శకు కినిసినకృష్ణరాయలను సముదాయించి, ఆమెకాపురము నిలబెట్టుటకే తిమ్మన గంటము పట్టినాఁ డనియు నూహింపక తప్పుట లేదు.

అపరాధిని యైనసత్యభామయందు కృష్ణుడు దయ చూపినట్లు చెప్పి ఆశ్వాసమును ముగించుచు ఆవెంటనే తిమ్మకవి శ్రీకృష్ణరాయలను

1. కృష్ణుడే కృష్ణరాయలుగా నవతరించె నని " యాదవత్వమున ...." యనుపద్యమును (1 ఆ - 17 ప) తిమ్మకవి రచించుటలోనియాంతర్యమే యిది.

"దయమానాక్షీ విలోక" అని సంబోధించుట సాభిప్రాయమే. అంతఃపురకలహము పారిజాతాపహరణకావ్యావిర్భావమునకు కారణమైనది కనుక రాయలవారికోపముకూడ శుభపర్యవసాయియే యైనది! కనుకనే "లోకహితకృత్యారంభ" అని ప్రభువును తిమ్మనగారు సంబోధించినాడు. "శాంతహృదయారజ్యన్నయాచార!" అని యీ పద్యములోనే కృతిభర్తనుగూర్చి మఱియొకవిశేషణ మున్నది. (1 ఆ-138 ప) "ప్రశాంతముగా నాలోచించి, పతిదేవత యైనయర్ధాంగినిర్దోషిత్వమును, నీదుడుకుతనమును గుర్తింపు" మని కవి చేసినహెచ్చరికగా దీనిని భావింపవచ్చును.

"ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే"

యనికదా పెద్దలయాభాషణము! ఉచితజ్ఞుడును, లోకజ్ఞుడును నైనకవి యెడపడినరాజదంపతులను మరల కలుపవలె నన్నకోరికతోనే యీపాదతాడనసన్నివేశమును కల్పించి, రాణికి శివేతరక్షతిని కలిగించి, పాఠకులకు సద్యఃపరనిర్వృతిని చేకూర్చి, తనకు శాశ్వతయశస్సును సంపాదించుకొని, తనకావ్య ముత్తమకావ్యముగా కలకాలము నిలుచునట్లు చేసి -

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మితత యోపదేశయుజే"

అనునాలంకారికనిర్వచనమున కలంకారముగా తీర్చి దిద్దినాడు.

"సలజ్జా గణికా నష్టా నిర్లజ్జా ఇవ గేహినీ" 1

అన్నట్లు -

"సిగ్గు విడిచెనేని చెడిపోవు నిల్లాలు - సిగ్గు కలదయేని చెడును వేశ్య" 2

అన్నట్లు - ఒకేలక్షణ మొకరియందు దోషముగా - మఱియొకరియందు గుణముగా - భాసించుట లోకమున సహజమైనట్లే - మఱియొకయల్ప

1. నారాయణపండితుని "హితోపదేశము"

2. మణిమాల - రచన :- శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావు.

కవి చేసినచో దోషముగా పరిగణింపబడునీపాదతాడనసన్నివేశకల్పనము పరసువేది యైనతిమ్మకవిగారిలేఖిని తాకుటచే సువర్ణ మై, సుందర మై, శివ మై, రసోచిత మై, యౌచితీపరిపోషక మై, సహృదయహృదయ రంజక మైనది !

## ౩. పారిజాత సంపాదనము

రుక్మిణి వీడుకొల్పగా కలహభోజనముని సత్యభామసౌధము నకు వచ్చెను. అప్పటికే యలుకదీరినసత్య కృష్ణునితో నామునిని పూజించి భోజనము పెట్టి మానియదుగుల కెఱిగినది. నారదునివలె కయ్యములు పెట్టువారు లోకములో కొంద అందురు. "కలహమె కల్యాణ మని జగంబులవెంట మెలంగుదు" రని అట్టివారిని సత్యభామ వంటివారు నిరసించినను, తనయింటికే పిలవని పేరంటముగా వచ్చినచో- ఆకలహాశనుని పొమ్మనలేరు సరికదా - మీఁదుమిక్కిలి గౌరవింతురు. రుక్మిణీమందిరమున తన్ను చులకన చేసి మాటాడిననారదుడు తనయింటికి రాగా సత్యభామ సరిగా అదే చేసినది.

సత్యభామ వచ్చి తనకు నమస్కరింపగా నారదు డామెతో

" పతి నీ పై విహరింపగా జనము సంభావింపఁగా బంధుసం
తతి నిన్నుం గొనియాడఁగా సవతికాంతల్ చూచి లజ్జింపఁగా
సతులప్రాభవవైభవోన్నతులకున్ పై యిట్లు వర్తింపనీ
కితరస్త్రీజనబుద్ధి దీవనలు నే నే మిచ్చెదన్ మానినీ ! "

(2 ఆ - 24 ప)

అని పొగడి

" అనికై నం బతి నిన్నుఁ బాసి చనెనో ? ప్రాణంబు ప్రాణంబుగా
నిన్ను మన్నింపఁడొ ? "

అని నరకాసురవధకై కృష్ణుఁ డామెను వెంట బెట్టుకొని వెళ్లినసందర్భము నెత్తినట్లెత్తి దేవేంద్రునితో జరగబోవుయుద్ధమునకై స్వర్గమునకుకూడ

కృష్ణునితో వెళ్ళవలె ననుకోరికను సత్యభామమనసున రేకెత్తించినాడు. యథార్థమునకు కృష్ణుడు పారిజాతవృక్షమును ఆమె పెరటిచెట్టుగా నాటింతు ననిమాత్రమే యన్నాడు కాని, ఆమెను వెంటఁ బెట్టుకొని యింద్రునితో యుద్ధమునకు పోవుదు నని చెప్పలేదు. అసలు పారిజాతమును భూమికి దింపవలసినయవసరము కృష్ణునికి కలిగించినవాడును, ఆయనతో స్వర్గమునకు వెళ్ళునట్లు సత్యభామను ప్రేరేచినవాడును, నింద్రోపేంద్రులదారుణరణమును జూచి యానందించినవాడును నీకలహాశనుడే.

"నీకు మగఁడు కోరినకోర్కుల్
ఘటియించుఁగాక తా నెం
తటికార్యంబైన డించి నాదీవనలన్"

ఇది సత్యభామ కామహానుభావుఁ డిచ్చినదీవన.

నారదుడు సత్యభామను "కుటిలాలక!" అని సంబోధించెను. ఆమె వక్రబుద్ధి కలది యని ఆసంబోధనమునందలివ్యంగ్యము. సత్యభామయలుకను, నామెపాదతాడనచర్యను దివ్యదృష్టిచే గ్రహించియే ఆదివ్యర్షి యి ట్లనుట స్పష్టము. అక్కడ రుక్మిణిని పొగడి సత్యభామను తెగడినాడు - ఇక్కడ సత్యయింటికి వచ్చి యీామెను ఉబ్బవేసినాడు. అస లీపారిజాతహరణకథా వ్యవహారమునకు సూత్రధారుడీనారదుడే.

"నరకుని చంపి యదితికుండలములను తెచ్చి యింతకాలము దాచితిని. ఇంద్రుడు న న్నడుగుటకు పంపలేదు. ఇదే నేను వచ్చి యిత్తు నని శతమన్యునితో చెప్పుము." - ఇది యింద్రునికి ఆగోపవధూవంచకుడు (కృష్ణుడు) నారదముఖమున పంపినవార్త. ఈమిషతో వెళ్ళి పారిజాతమును హరింపవలె నని నల్లనిస్వామియుల్లములో పల్లవించిన యుపాయము. ఇంద్రుని వంచించుటకై కృష్ణు డీయెత్తుగడను పన్నెను కనుక "గోపవధూవంచక" శబ్దము కృష్ణునిలోనియమరేంద్రవంచనోద్దేశమును స్ఫురింపజేయుచున్నది.

సాయంసంధ్యావర్ణనసందర్భమున జక్కవలవియోగమునకు జలదేవత కన్నుమోడ్చెనో యనునట్లు వనరుహములు ముడింగె నని చెప్పుచు "సహవాసులదుఃఖము నెయ్యు రోర్తురే?" అనునర్థాంతర న్యాసముచే తిమ్మకవి సత్యభామాదుఃఖము నపనయించుటకై కృష్ణుడు చేయబోవుపారిజాతహరణమును సమర్థించినాడు.

సత్యాకృష్ణు లూర్ధ్వలోకమున కరుగువేళ నంబుధరజాలము క్రింబు లయినజలకణములు సాత్రాజితీకై శికమున పొలిచి, గగనతల లక్ష్మి పోరచిగాగ నిడినమౌక్తికస్తబక మన నున్న వంట! సత్యభామ కూర్ధ్వలోకపారిజాతము కానుకగా లభించుట నీవర్ణనము సూచించు చున్నది.

... ... ...నార్థమై యమరలోకమున సపత్ను లొకరి నొకరు త్రోపాడి మచ్చరించుకొనినా రంట! సత్యభామ యడుగు పెట్టినస్వర్గమునకూడ సపత్నీమాత్సర్యమే కొట్టవచ్చిన ట్లగుపించుట విచిత్రమే మఱి!

నందనవిహారసందర్భమున కృష్ణు డొకమగతేంటి మఱియొక తేంటిబోంటిపొత్తున నుండుట కోర్వక సంపంగితావివెల్లిలో నాడుతేంటి కనలున కూలంబోవుటయు, మావిని ఖండితనాయికగా వర్ణించి సత్య భామకు చూపుటయు (3 ఆ – 48 ప) సత్యభామప్రవృత్తినే అన్యాప దేశముగా కృష్ణుడామెకు చెప్పుటయు చమత్కారముగా నున్నది.

పండుటాకులు రాల్చినతీవలు బాలచాపలకృష్ణాపహృతతీర వస్త్రలైనగోపికలుగా కృష్ణుని కనిపించిన వట! చిన్ననాంట తనచాప లముచే పరాకుపడినగోపికలవస్త్రముల నపహరించినకొంటెకృష్ణుం డిం మీంద తనయర్ధాంగిచాపలమును తృప్తిపరచుటకై పరాకుగా నున్న యింద్రునిపారిజాతము నపహరించుటను సూచించుచున్నది యీ వర్ణనము.

కుహూళీవిగళళన్నవకోరకావళులు వనరమావసంతులపెండ్లి వేళ తలఁబ్రాలుగా నున్నవఁట ! అంతేకాక చిలుకలు చించినలవళీదళముల నంటినఫలరసరేఖలు లతాలలనలగండతలముల చైత్రుడు వ్రాసినమకరి కాపత్రములవలె నున్న వనుట, తలిరాకుమెఱుఁగువాతెఱ కలకంఠ విభుఁడు గమియగా చూతలతాలలన యలికంకణముఖరవిటపహస్తము లతో విదిర్చిన ట్లున్న దనుట — ఈవిధముగా కృష్ణుడు సత్యభామ ముందు చేసిన వర్ణన లీవాక్యమునందలిశృంగారరసప్రాధాన్యమును వ్యక్తమొనర్చుచున్నవి.

అమరారాతివిఘాతి సత్యఁ గని " కాంతా ! చూచితే పారిజా
తము భూమీరుహచక్రవర్తి " (4 ఆ - 8 ప)

ననుటనుబట్టి ఆసురతరువు భూమికి దింపబడి భూమీరుహములలో శ్రేష్ఠమైనదిగా విలసిల్లనున్న దన్నభవిష్యత్కథావిషయము వ్యజ్యమాన మైనది. అది పరమేశ్వరవాక్కు కనుక నవితథ మగుట గమనింప దగినవిశేషము.

" తనపాదుజలములోనం గనుపట్టెడునీడ నీనగము విలసిల్లన్
మనకన్నమున్న తా మేదినికిన్ డిగి యేఁగుచున్నతెఱఁగునఁ దరుణీ ! "
(4 ఆ - 7 ప)

అని కృష్ణు డనుటకూడ భూమికి పారిజాతావతరణ మగుటను సూచించుటయే. ఇట్లు సూచ్యార్థసూచన చేయుట శిల్పములో నొకయంశము.

మరుత్పద్మాకరాంతమున సలిలక్రీడ యొనర్చి సత్యభామతో వెలుపలికి వచ్చినమదస్తంబేరమువలె కృష్ణు డున్నా డని (4 ఆ - 89 ప) చతుర్థాశ్వాసములో వర్ణించినకవి ఆకృష్ణుడు షోడశసహస్రకామినీస్తోమభేనుశారితంసామదోత్కటవారణేంద్ర మనఁగ సౌఖ్యాంబునిధి నోలలాడుచుండె నని కావ్యాంతమున (5 ఆ - 107 ప) వర్ణించి, ఆ

వర్ణనమునకును, నీవర్ణనమునకును పొంతన చేకూర్చి, యింతచిన్నవిష యములలోకూడ నేమఱక, యెంతో మెలంకువను బ్రదర్శించినాడు.

సాంధ్యరాగవినతాతనయగరుత్తులచే రవిమండలము ధర బ్రాలినగగనఫణామణి యన నున్న దఁట! (4 ఆ - 45 ప) ఈవర్ణనము పారిజాతము గగనవీథిం బడి, ధరకు వచ్చుటను సూచించుచున్నది.

ఇంద్రునిశుండాలము లకాలనిద్రకు చిక్కి ముందడుగు వేయ కుండుట, సమరమున కరుగబోవువీరునిబాహాసి విభిన్న మగుట, అకార ణముగా వింటినారి తెగుట, గొనయము నెంతగా బ్రోసినను గనయ మున కెక్కకుండుట, యుద్ధమునకు పోవుసురవీరు నొకనిని వెళ్ళవలదని భార్య యడ్డుపడుట - ఇత్యాదిసూచనలచే కవి యింద్రునికి కలుగబోవు పరాజయపరాభవమును సూచించినాడు.

ఇంద్రు డింద్రుడుగా కాక, భార్యాప్రీతికై పారిజాతతరు వును దక్కించుకొనుటకై యుపేంద్రునితో యుద్ధమున కుద్యమించె ననుటకై కవిప్రయుక్తమైన "శచీజాని" శబ్దము సాభిప్రాయమై, మనోహరముగా నున్నది.

"వినుఁడు సురేశ్వరవనపాలకులు ! వార్ధిఁ
బొడమినయీదివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె? ఇంద్రుండు నెవ్వండు?"
(4 ఆ - 59 ప)

అన్నది వనపాలకులతో సత్యభామ! ఆపారిజాతము భూరుహము. అనగా- భూమియందు పుట్టినది. అది దివ్యమైనది. అనగా- ప్రకా శించునది. భూరుహము కనుక భూలోకమున నివసించువారు మాత్రమే దాని ననుభవించుహక్కు కలవారు. కనుక భూలోకవాసులైనసత్యా కృష్ణులకు దానిపై హక్కు కల దని సత్యభామయాంతర్యము.

ఈయాంతర్యమును సత్యభామచే పలికించినమాటలలో తిమ్మకవి చమత్కారముగా నిక్షేపించినాడు !

తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁ గాక
తెకతేర నిది యేమి యొకరిసొమ్మె ?
(4 ఆ - 59 ప)

అనియు నన్నది సత్యభామ. వార్థినుండి పుట్టినయిందిరపైనను, కౌస్తుభరత్నముపైనను హక్కు కల శ్రీకృష్ణునికే వార్థిజనితమైనపారిజాతముపై కూడ హక్కు కల దనుటనుబట్టి సత్యభామ ఆరితేరినన్యాయవాదివలె వాదించి తమహక్కును స్థాపించుకొన్నది. యథార్థమునకు సత్యభామ చేసినఈవాదమును తా దనుశక్తియుక్తులు దేవేంద్రునికికూడ లేవు. కనుకనే యుద్ధమున నోడినసురేంద్రుడు

"సొమ్మన నెద్ది ? యే వనఁగ సొమ్మున కెవ్వఁడఁ ? గర్త వీవు ; నీ
సొ మ్మఖిలప్రపంచమును ...."
(5 ఆ - 40 ప)

అని పారిజాతమును కృష్ణుని కర్పించినాడు.

" ఇదె నాదువిభునిచే నీవదాన్యనగంబు
నొడియించుకొని యేఁగుచున్నదాన "
(4 ఆ - 59 ప)

అన్నది సత్యభామ. అది వదాన్యనగము కనుక తనవదాన్యతను నిరూపించుకొని సత్యభామకోరికను దీర్చినది. అది నగము (కదలనిది) కనుకనే పెకలించుకొని సత్యాకృష్ణులు గరుడనిమూపుపై నుంచి కొంపోయినారు.

" నియతధ్యానపరులైనమునులుం
గాననివిమఁ గంటి మంటి గతకల్మషనై "
(8 ఆ - 26 ప)

అన్నది కృష్ణుని గన్న దేవమాత. అట్టికృష్ణుని గాంచినను దేవేంద్రుడు గతకల్మషుడు కాకపోవుట విచిత్రము. ఆవిష్ణునితో తలపడి తనవజ్రా యుధ మాయన నేమియు చేయలేకపోగా - అప్పుడు జ్ఞానోదయ మై పాదాక్రాంతు డై గతకల్మషు డయినా డింద్రుడు.

"సర్గ మొనర్తు బ్రహ్మ యన - సత్కృపఁ బెంతు జనార్దనుండు నా
భర్గుఁ డనంగఁ గ్రమ్మఱఁగఁ బారణ సేయుదు విజ్జగంబు"
(3 ఆ - 27 ప)

అన్నది కృష్ణునితో దేవమాత. ఆసృష్టిస్థితిలయకారకుడే యింద్రుని సుస్థితికిని, (దుస్థితికినికూడ) కారణము కదా! ఇది యీయదితివర్ణ నలో స్ఫురించువిచిత్రము.

"వాలముతాఁకునన్ గిరులు వజ్రనిపాతము సంస్మరింపఁ బెన్
వాలుగ పై ...." (3 ఆ - 22 ప)

అని నిగమాలిఁ దెచ్చి తమ్మిపూచూలి కిచ్చినవిష్ణునిమత్స్యావతారము నదితి ప్రశంసించినది. తద్వాలమే వజ్రమును తలపించినచో - ఆయన యెంతటిబలవంతుడో కదా! అట్టివానిపై ప్రయోగింపబడువజ్రాయు ధము నిరుపయోగ మగు నని తిమ్మకవి యీవర్ణనములో సూచించి నాడు.

పారిజాతాపహరణ మొనర్చుకృష్ణునిపై నింద్రుడు వజ్రా యుధమును ప్రయోగింపగా "శతకోటిఁ గేల శతపత్రక్రీడఁ బట్టె" నని (5 ఆ -36 ప) ఆతరువాత తిమ్మకవి చేయనున్నవర్ణన కిది సూచ నగా నున్నది.

కృష్ణునిజగన్మోహిన్యవతారమును ప్రశంసించు దేవమాత "కపటపద్మముఖీత్వవిమోహితాసురా!" అని (3 ఆ - 29 ప) సంబో ధించినది. చుట్టపుచూపుగా వెళ్ళినట్లు వెళ్ళి కృష్ణు డింద్రునిపారిజాత మును హరింపబోవుచున్నాడుకదా! తన్ను నమ్మినియసురులనే

మోహింపజేయగలిగినవిష్ణువు తన్నుఁ దమ్ముఁడని నమ్మినయింద్రుని, తక్కినయమరులను సులభముగా మోహింపజేయగలడు కనుక "బాంధవరూపవిమోహితామరా!" అనుట కీయదితి చేసినసంబోధన మూతము నిచ్చుచున్నది!

"మత్తనయవ్యాజముఁ దాల్చి వామనునిచందానన్ బలిన్
మట్టవే?" [3 ఆ - 33 ప]

అన్నది కృష్ణునితో దేవమాత. ఈనాడును తత్తనయవ్యాజముననే కృష్ణుడు సురపురికి చుట్టపుచూపుగావలె వెళ్ళి పారిజాతహరణమున తన కడ్డు వచ్చినయింద్రు నధఃకరింప నున్నాడు. ఆనాడు బలిచక్రవర్తి నుండి రాజ్యము నపహరించి యింద్రుని కిచ్చినశ్రీమహావిష్ణు వీనాఁ డింద్రునినుండి పారిజాతతరువును హరించి సత్యభామ కీయ నున్నాడు. అప్పుడు సురలోకరాజ్యము - ఇప్పుడు సురలోకతరువు! ఇంతే తేడా. అప్పుడు నిప్పుడును నల్లనయ్య(విష్ణుని) స్వభావముమాత్ర మొక్కటే!

కొండలఱెక్కలను ఛేదించుటకు దేవేంద్రుడు వజ్రాయుధము నాశ్రయింపవలసివచ్చినది. కాని - కృష్ణుడు పరశురామావతారమున తననారాచముచేతనే క్రౌంచపర్వతమును భేదించి, యందు రాజహంసలకు మార్గము కాఁదగురంధ్రము నేర్పఱచినాడు. (3 ఆ - 34 ప) దీనిని బట్టి విష్ణునిశరము సురేంద్రునివజ్రముకన్న బలవత్తర మనియు, నింద్రునికి కృష్ణునిచేతిలో నోటమి తప్ప దనియు దేవమాత చేసినకృష్ణస్తుతి వ్యంజ్యమాన మొనర్చుచున్నది.

అరవిందానన(సీతను)గోలుపోయినయవజ్ఞావాప్తిచే జలధిబంధన మొనర్చి, లంకేశుని జంపి, ఆరావణునిచే పూర్వము పెకలింపబడినకైలాసమున కంటినలజ్జాపంకమును తనకీర్తిగంగచే కడిగివేసిన మహావీరుడు శ్రీరాముడు. అన్నికష్టములు భరించి మఱల పొందిన భార్యను లోకాపవాదభీతిచే రామావతారమున పరిత్యజించినవిష్ణువు

కృష్ణావతారమున నర్ధాంగిప్రీతికై యింద్రునితో తలపడ వచ్చినాడు! రామావతారమున తన కుండినయొకేయొకభార్య కోరినబంగారులేడిని తెచ్చి యీాలేకపోయినవిష్ణు వీకృష్ణావతారమున భార్యను సంతోష పెట్టుటకై సురలోకతరువును హరింప ప్రతిన చేసి వచ్చినాడు. ఈరెం డవతారములకును నింతటిభేద ముండుట విచిత్రమే మఱి! రామావ తారమున రాజనీతిని పాటింపగా — కృష్ణావతారమున శ్రీహరి రాజనీతినిపాటించుట గమనింపదగినవిశేషము!

"లక్ష్మీసతీపాదపీఠాకృతిప్రస్ఫురత్కౌస్తుభాంకూరితాళీకబా లాతపద్యోత" అని దండకములో దేవమాత కృష్ణుని స్తుతించినది. విష్ణువక్షమునందలికౌస్తుభరత్నము లక్ష్మీదేవికి పాదపీఠమువలె నున్న దఁట! విష్ణువక్షస్థలగతయైనయర్ధాంగి (లక్ష్మి) పాదములు హరియుర మున నుండగా, శిరమును తాఁకినను తప్పు లే దనుటకో యనునట్లు తిమ్మకవి దేవమాతచే నీవర్ణన చేయించుట ఆయనగడుసుదనమునకు నిదర్శనము.

"వెన్న వేమాఱు గొల్లాడఁగా గొల్లయిల్లాండ్రు సందార విందాస్యతో అట్టు గావించి" రఁట; (3 ఆ - 38 వచనము)

అదితి ప్రస్తావించినకృష్ణునియీానవనీతచౌర్యము — దొంగతన మాయనకు చిన్ననాఁటినుండియు నలవాటే యని చెప్పుచు — ఆయన చేయబోవుపారిజాతాపహరణమును సూచించుచున్నది.

దేవమాత శ్రీకృష్ణప్రశంస చేయుచు నింద్రోపేంద్రులఘర్ష ణలో నుపేంద్రుడు గోవర్ధన మెత్తి యింద్రునిపై సాధించినవిజయ మును తడవినది. (3 ఆ - 38 వచనము.) దీనినిబట్టి ముందుముందు పారిజాతహరణవేళకూడ నింద్రునిపై నుపేంద్రుడే విజయమును సాధింపగలఁ డని సూచ్యార్థసూచన జరిగినది!

కృష్ణుడు వేణువు నూదగా –" తత్పంచమూరావమున్ వించు నయ్యెంచువిలాస్కానికిం జిక్కి రాధాదిగోపావరోధాంగనల్ డాసినన్ రాససంక్రీడ మూయాసముల్లాసి వై సౌఖ్యవారాశి నోలార్పవే? " (3 ఆ – 38 దరడకము) – అని కృష్ణుడు గోపికలతో నెఱపినరాసక్రీడల నదితి వర్ణించినది.

కోకిల పంచమస్వరమును, నెమిలి షడ్జమమును నాలాపించు నని సంగీతశాస్త్రము చెప్పుచున్నది. [1]

" రాసోత్సవస్సంప్రవృత్తో గోపీమండలమండితః
యోగీశ్వరేణ కృష్ణేన తాసాం మధ్యే ర్ద్వయో ర్ద్వయోః
ప్రవిషేన గృహీతానాం కంఠే స్వని కటం ప్రియః " [2]

అనిభాగవతము చెప్పగా –

" అంగనామంగనా మంతరే మాధవో
మాధవం మాధవం చాంతరేణాంగనాః
ఇత్థ మాకల్పితే మండలే మధ్యగ స్సంజగౌ....
....వేణునా దేవకీనందనః " [3]

అని కృష్ణకర్ణామృతము చెప్పుచున్నది.

" ఏయేవేళల నేసరోజముఖి యేయేలీలలం గోరుఁ దా
నాయావేళల నాసరోజముఖి నాయాలీలలం దేల్చి యే
చాయం జూచినఁ దాన యై మెలఁగుచున్ సౌఖ్యాబ్ధి నోలాడు భో
గాయత్తుం డయి పెక్కురూపముల మాయాకల్పనాచాతురిన్. "

అని పారిజాతాపహరణములో తిమ్మకవి తొలుతనే చెప్పినదాని కీరాస క్రీడావర్ణనము మఱొకముందడుగు.

-----

1. కోకిలో రౌతి పంచమమ్ - అని నారదునిసంగీతశాస్త్రము.
2. సంస్కృతభాగవతము - దశమస్కందము. (11 పూ. భా. 33)
3. కృష్ణకర్ణామృతము.

# ౪. పుణ్యకవ్రతప్రాముఖ్యము

తిమ్మనగారికావ్యముపేరే పారిజాతాపహరణము. సురలోక పారిజాతమును కృష్ణు డపహరించి భూలోకమున నాటుట యీ కావ్యము నందలి ప్రధానఘట్టము. దానితో కావ్యమునందలికథ పైపోయినది. మఱి - ఆపారిజాతాపహరణము పూర్తి కాగానే కావ్యమును పరిస మాప్తి మొనరింపక - అపైన - కవి పుణ్యకవ్రతవర్ణన మేల చేయవలసి వచ్చినది? కేవలము తనకావ్యము నేదోవిధముగా పెంచుటకే తిమ్మ కవి ప్రధానకథతో సంబంధము లేని ఈ పుణ్యకవ్రతవిషయమును కావ్య మునకు చివర చేర్చినాఁ డని తలంచువారు కొందఱు కలరు. మహాకవి యైనతిమ్మనగారిరచనలో పొల్లుమాటకాని, యనవసరవిషయముకాని కల దనుట యవిచారితరమణీయము. పుణ్యకవ్రతమునకు పారిజాతమే ముఖ్యావసరము. అది ప్రాప్తించినది కనుకనే నారదుడు సత్యభామ నా వ్రతము చేయు మని ప్రోత్సహించినాడు. సత్యభామచే నావ్రతము చేయించుటలో నారదునియుద్దేశ మేమో యిచ్చట గ్రహింపవలసి యున్నది.

"చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ బే
రెక్కినదాన నంచుఁ బతి యెంతయు నా కనురక్తుఁ డంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య"

(1 ఆ - 66 ప)

అని రుక్మిణీమందిరమున కృష్ణునిసమక్షమున కంఠోక్తిగా చెప్పినాడు దేవర్షి యైననారదుడు. ఆ మెలోనియాగర్వమును రూపుమాపవలె నని నారదునిసంకల్పము. కృష్ణునియం దామెకు ప్రణయభావమే కాని సాత్త్వికభక్తి యున్నది మచ్చునకైన లేదు. సత్యభామతోబాటు లోకుల నందఱిని కృష్ణభక్తులుగా చేయవలయుననియే నారదుడు సత్య భామచే సర్వజనసమక్షమున పుణ్యకవ్రతమును చేయించినాడు.

"అత్తమామలకును నాత్మభర్తకు నమస్కృతి సేసి తదీయ సమ్మతిన్" పుణ్యకవ్రతమును సంకల్పింపవలె నని నారదుడు సత్యభామకు చెప్పి యొప్పించినాడు. అంతే కాదు –

"కువలయనేత్ర ! తొంటితనకోపము గర్వము మచ్చరంబు మా
ని వినయముం బ్రమోదమును నిండి తొలంకెడునెమ్మనంబునన్
సవతులయిండ్ల కెల్ల దొలునాడు క్రమంబున నేగి తద్వ్రతో
త్సవమున కామతించి యతిసంభ్రమలీలల దోడి తేc దగున్"
(5 ఆ - 57 ప)

అని దేవముని చెప్పగా నందులకు సత్యభామ యంగీకరించినది.

"జలజాతాసనవాసవాదసురపూజాభాజనం బైనశ్రీకృష్ణుని శిరస్సును తనవామపాదమున తొలంగంద్రోసినసత్యభామ తొంటితనయహంకారమును విడిచి యత్తమామలకును నాత్మభర్తకును నమస్కరించినది ! "చక్కనిదాన నంచుc బతి యెంతయు నా కనురక్తుc డంచు నిక్కుచు విఱ్ఱవీగుచు కాంతల గణింపనిసత్య" నారదునానతిని శిరసావహించి, సవతులయిండ్ల కెల్ల స్వయముగా వెళ్ళి పుణ్యకవ్రతోత్సవమునకు వారినందఱను దోడి తెచ్చినది. ఆమెస్వభావములో నంతవఱకును రాజ్యము చేసినయహంకారమునకును, సపత్నీమాత్సర్యమునకును, నింతకన్న శృంగభంగ మేమి కావలయును ?

అహంకారమమకారములు జీవుల నధఃపాతాళమున కణగ ద్రొక్కునవలక్షణములు. అవి యింతవఱకును సత్యభామలో పుష్కలముగా నున్నవి. కృష్ణునియం దామెకు తనపతి యనెడిభావమేకాని భగవద్భావము లేదు. ఆయనయం దామెలో నంతవఱకును రజోగుణదూషిత మైనప్రణయమే కాని, సాత్త్విక మైనభక్తి లేదు. అహంకారమున్నచోట సాత్త్వికభక్తికి స్థానము లేదు.

సత్యభామ భూదేవియవతారము. భూదేవి సహనమునకు పేరొందినది. ఈమెయో? అసహనమునకు - అందుచే నీయవతారమున నంకురించినయహంత నంత మొందించి స్వస్వభావానుసంధాన మొనరించుట నారదునియుద్దేశము. అందులకే నారదుడు సత్యభామచే నెన్నో నియమములతో కూడినయీపుణ్యకవ్రతమును చేయించినాడు. సత్యభామలోనియహంకార మీవిధముగా నశించినను - ఆమెలోని మమకారము మిగిలియే యున్నది. దానిని తొలగించుటకే సత్యభామచే నామెనాథుని ధారాదకపూర్వకముగా దాన మిప్పింపవలయు నని నారదుడు సంకల్పించి

'వికచాబ్జనేత్ర! యీపు
ణ్యకవ్రతవిధానమునకు నాథుని ధారో
దకపూర్వ మీవలయు ని
య్యకొలుపుమా యిపుడు యాదవాన్వయతిలకున్."

(5 ఆ - 76 ప)

అన్నాడు.

సత్యభామ నారదునికి కృష్ణుని దానము చేయవలయును. అందులకై యామె కృష్ణు నొప్పింపవలయును. సకలలోకాతీతుండైన యాకృష్ణుడు భగవంతుండైనమహావిష్ణువు. ఆయన యేయొక్కరిసొత్తును కాడు. కేవలము లౌకికదృష్టితో చూచినను ఆయన సత్యభామ కొక్కతెకే మగడు కాడు. అట్టిపరతత్త్వమును దానము చేయుహక్కు సత్యభామకు లేదు. పతియైనయాయనను దాన మిచ్చిననేకాని సత్యభామ ప్రారంభించినపుణ్యకవ్రతము సఫలము కాదు. ఇది యిందలిరహస్యము. కనుకనే "ఇయ్యకొలుపుమా యిపుడు యాదవాన్వయతిలకున్" అని సత్యభామతో నారదు డన్నాడు.

భక్తపరాధీనుడైనయాభగవంతుడు తనకు విధేయు డని యింతకాలమును ఆసత్యభామ భ్రాంతిపడుచున్నది. ఆయనయందామెకు

ప్రేమ యున్నది. ఆయన యొండొకచపలాక్షిని గూడక తనతోనే యుండవలె నన్న ప్రగాఢ మైనస్వార్థ మున్నది. "ఆయన నామగండు-నావాఁడు" అనుమమకార మున్నది. "తనకే కాక - తనవంటివా రెందఱికో ఆయన ప్రభువు" అన్నవివేక మింతవఱకు నామెలో తల యెత్తలేదు. దాని కామెమమకారమే కారణము. ఆమమకారమే పుణ్యకవ్రతమున కామెను ప్రేరేచినది.

"కలకాల మొక్కగతిఁ బా
సలలో దారంబుమాడ్కి సతిమదిలోనన్
మెలఁగెడుపురుషులు గలుగుట
తొలుజన్మమునోముఫలము తోయజనేత్రా!"

[1 ఆ - 93 ప]

అని సత్యభామ తనచెలికత్తెతో చెప్పికొన్నది. అనుకూలదాంపత్య మునుగూర్చి యామెయభిప్రాయ మిది. ఆయాశయము సిద్ధింపవలె నన్నచో నాఁడుదానికి తొలుజన్మలనోములు ఫలింపవలయును. తాను కొఱనోములు నోచుటచేతనే తనమగ డన్యకాంతాసక్తుడై తనకు మనస్తాపము కలిగించుచున్నాఁ డని యామెబాధ. ఆబాధ తొలగుటకు చక్కనియుపాయమును తాను కోరకుండగనే నారదుడు తన కుపదేశించినాడు. ఏ మని? పుణ్యకవ్రతాచరణముచే

"ధనకనకవస్తుసమితియుఁ
దనయసమృద్ధియును గలిగి తానుం బతియున్
మనమున నఱగొఱ లెఱుఁగక
యనితరసులభైకసుఖము లందుదు" రనుచున్

(5 ఆ - 62 ప)

నారదుడు చెప్పగా పతి తనవాడు కావలె నన్నకోరిక లిగురొత్తుటచే ఆయనను దాన మిచ్చుటకైనను సిద్ధపడినది. అట్టియదృష్టము తనకు

కలుగబోవుచున్నదని సమ్మోదమును, మగనిని పెరవానికి దానమీయ వలసివచ్చినందులకు లజ్జయు హృదయమున పెనగొనగా - ప్రాణవల్లభ ప్రేమరసాలసవీక్షణములతో కనుగొని మోము వాంచి డోలాందోళితచిత్తయై " చిత్తగించితే మునిపతిమాట? " అన్నది. ఆమాటలలో నామెమనోవేదన మున్నది. ప్రేమ యున్నది. లజ్జ యున్నది.

కృష్ణుడు మోవిపై చిరునవ్వు గుల్కగా

" నవచంద్రాలిక ! నీకు నేల యనుమానం ? బాగమో క్షంబు గాన విచారింపక ధారవోయు " మన్నాడు.

(కృష్ణుడు ప్రయోగించిన " నవచంద్రాలిక " యన్నది సాభిప్రాయవిశేషణము.)

నవచంద్రాలికయైనసత్యభామముందు లజ్జాభరాక్రాంతయైన యామెసవతులవక్త్రపంకరుహములు వాడిపోయినవి. ప్రాణనాథుని దానమీయవలసివచ్చినయాప్రణయిని చకితముగ్ధమృగీతరళాక్షియైనది. కల్పనగముతో బాటు ప్రాణనాథునికి క్రొవ్విరులదండ తగులొ్కనునట్లు చుట్టినది.

" పరమమునిమానసాలానబంధనమునఁ
గుదురువడకుండుయాదవకుంజరమ్ము
వికచరాజీవనేత్రచే వేల్పుమ్రానఁ
గమ్మఁబూవులదండచేఁ గట్టువడియె "

(5 ఆ - 80 ప)

బలిదనుజేంద్రునిఁ గట్టినభగవంతుఁ డొకభామ కూర్చినపుష్పదామకముచే కట్టువడినాడు. దీనికి కారణ మేమి ? సత్యభామ ప్రణయిని. ప్రేమకూడ భక్తియొక్కరూపాంతరము. ఆప్రేమ కాభగవంతుడు కట్టువడినాడు.

గర్గమహాముని సంకల్పము చెప్పగా, కల్పమహీజమును సదక్షిణాకముగా నిజప్రాణేశునితోకూడ సుపర్వముని శ్రేష్ఠునికి సత్యభామ

" తుభ్య మహం సంప్రదదే నమో నమ "

యనుచు ధారాపూర్వకముగా దాన మిచ్చినది. ఇంతకుముం దామె లోనియహంకారము పటాపంచ లైనది. " నమమ " యని ప్రాణేశ్వరుని దాన మొసగుటతో నిప్పు డామెమనసులోనిమమకారము మఱుగు పడినది. అయినను నారదు డాశించిన ప్రయోజన మింకను నెరవేరవలసియేయున్నది. ఆచివ్వాలయోగిరపుందపసి కేళిపరు డై యచటివారెల్లరును చూచుచుండగా సకలామ్నాయస్తుత్యుడును, నిగమాంతప్రతిపాద్యుడును, నభవుడును, నిత్యుడును, గుణాతీతుడును, పరముడును నైన శ్రీకృష్ణునికి తనమహతిని, మణికమండలువును, పద్మాక్షవలయమును, శార్దూలచర్మమును మోయనిచ్చి, యిటు ర మ్మనుచు, నటు పొ మ్మనుచు, కపటనటనాపరు డై నకంసవైరిచే సత్యభామ చూచుచుండగనే నవ్వులాలకై పనులు గొనినాడు.

కృష్ణుడు కేవలము తనవాడుమాత్రమే యని యింతకాలము ననుకొని యహంకరించినది సత్యభామ. ఆయన అందఱివాఁడును సుమా యని ప్రత్యక్షముగా తెలియజెప్పి, యామెకు కనువిప్పు కలిగించుటకే ఆసత్యభామావిధేయుని ఈపుణ్యకవ్రతమహిమతో తనకు దాసుడుగా సత్యభామకు చూపినాడు పోరోగిరపుతిండిపోతు. ఈఘట్టములో కృష్ణుడు నారదునితో " సరీ " కైనాడు. ఈవిధముగా నహంకారమమకారాతీతురా లైనసత్యభామభూషణములను నిష్క్రియముగా గొని " నీమనోహరుని జేకొను మిచ్చెద " నని జగన్నాథు నామెకు తిరిగి సమర్పించినాడు నారదుడు. అంత వియచ్చరులు పూలవాన కురిసినారు. అంతట సత్యభామ యాగమోక్తముగా పుణ్యకవ్రతమును పూర్తి చేసి, వినయమున నందఱ నామతించి, కల్పనగముక్రొవ్విరులను

కనకపాత్రములం దగ నిచ్చి రుక్మిణిమున్నగుపదారువేలమందిసవతుల కును వాయనము లిచ్చినది.

ఇట్లమానుషగోచరమహిమాఢ్యు డైనసత్యాచంద్రముఖీ వరుని సురవాచంయమి చతురవాచాప్రౌఢిమై చిత్రగతుల గొనియాడి యరుగగా కృష్ణుడు నిజపురి కేగి యుత్సవాగతులకు కల్పద్రుమ సంజాతము లైనభూషణాంబరాదులను కానుక లిచ్చి పంపి యందఱు భార్యలతోను సౌఖ్యాంబునిధి నోలలాడినాడు.

నారదు డన్నట్లుగా సత్యభామ జిష్ణుభూజమును తనపెట్టు చెట్టుగా చేసికొని, పుణ్యకవ్రతాచరణపునీత యై, సవతులనే కాక, త్రిభువనేశ్వరి యనంగ వెలుగుపౌలోమినే గెలువగలిగి మున్నావ్ర తము నొనరించినయరుంధతిని, గౌరిని పోలినది.

ఎఱ్ఱనగారియాంధ్రమహాభారతమునుబట్టి చూడగా – పంచ భర్తృక యైనపాంచాలి భర్తలందఱిప్రేమగౌరవములను చూఱగొన్న కారణ మరయ గోరినది సత్యభామ.

"వ్రతముపెంపొ ? మంత్రౌషధవైభవమ్మొ ?
సరసనైపథ్యకర్మకౌశలమొ ? చతుర
విభ్రమోల్లాసరేఖయో ? వెలది ! నీవి
శేషసౌభాగ్యహేతువు సెపుమ నాకు" 1

అని ద్రౌపది నడిగినసత్యభామ పుణ్యకవ్రత మొనర్చి యఱగొఱ లెఱుంగనిప్రేమను భర్తవలన పొందగలిగినది. ప్రప్రథమమున నారదుని మాటలచే సత్యభామకు తాత్కాలికముగా మనఃక్లేశము కలిగినను, ఆమెకు పారిజాతతరువు పెరటిచె ట్టగుటకును, ఆమె పుణ్యకవ్రతఫలము నందుటకును నారదుడే కారకుడైనాడు ! (నారదు డనంగా నజ్ఞాన

---

1. ఎఱ్ఱనగారియాంధ్రమహాభారతము - అరణ్యపర్వము.

మును బోఁగొట్టువాఁ డనియు, బరమాత్మవిషయికజ్ఞానమును ముము క్షువుల కిచ్చువాఁ డనియు నర్థము. అతడు దేవర్షులలో (శ్రేష్ఠుఁడు) [1] సత్యభామలో తొలుత విజృంభించినయహంకారమమకారములు నశించి ఆమె సాత్త్వికభక్తిసంపన్నురాలై కృష్ణుని భగవంతునిగా గుర్తించు నట్లు చేసినవాఁడు నారదుఁడే. ఈవిధముగా కావ్యనాయిక యైనసత్య భామలో పరివర్తనము దెచ్చినపుణ్యకవ్రతము భగవత్సంకల్పిత మై, నారదప్రోక్త మై పారిజాతాపహరణకావ్యమున ప్రముఖస్థానము వహించుచున్నది !

భూలోకమున నుండుసత్యాకృష్ణు లూర్ధ్వలోకమునకు వెళ్ళి యట నున్నయమరుల నధఃకరించుట విలోమసంబంధము కాఁగా - నూర్ధ్వలోకపారిజాతము భూలోకమునకు దిగుట యనులోమసంబంధము. ఆత్మేశ్వరు డైనకృష్ణభగవానునిపాదములను సేవింపవలసినసత్యభామ ఆభగవంతునిశిరమును తనవామపాదమున తొలగఁద్రోయుట విలో మము. ఈయనులోమవిలోమక్రియలను సూచించుచున్నట్లు ననులోమ విలోమకందమున నందముగా నారదుడు కృష్ణుని స్తుతించుట సముచిత ముగా నున్నది. నారదునిస్తుతిలోనిబంధకవిత్వము సత్యాకృష్ణులప్రణయ బంధము మఱింతగా బిగిసినదానికి సూచనగా నుండుట యొకచమ త్కారము.

" ఏయేవేళల నేసరోజముఖి యేయేలీలలం గోరుఁ దా
నాయావేళల నాసరోజముఖి నాయాలీలలం దేల్చి యే
చాయం జూచినఁ దాన యై మెలఁగుచున్ సౌఖ్యాబ్ధి నోలాడు భో
గాయత్తుం డయి పెక్కురూపముల మాయాకల్పనాచాతురిన్ "

అని ముందే చెప్పినతిమ్మకవి

1. పారిజాతాపహరణము - పరిమళోల్లాసవ్యాఖ్య - పుట 329 - నాగపూడి కుప్పు స్వామయ్యగారు.

సీ. " భోజకన్యాసరిద్రాజహంసము సత్యభామాశుకీకేళిపంజరంబు
జాంబవతీవిశాచంద్రోదయంబు కాళిందీసరోజినీందిందిరంబు
భద్రాకలాపినీప్రావృడంబుదము సుదంతారసాలలతాపికంబు
మిత్రవిందావనీచైత్రాగమము లక్షణాహారయష్టికానాయకంబు

తే. గీ. షోడశసహస్రకామినీస్తోమధేను
కారిరంసామదోత్కటవారణేంద్ర
మనఁగ సౌభాగ్యాంబునిధి నోలలాడుచుండె
గృష్ణుఁ డఖిలావనైకవర్తిష్ణుఁ డగుచు."

అని యఖిలావనైకవర్తిష్ణుఁడు కనుక నేచాయం జూచినఁ దాన యై యెవతెతో నెట్లు క్రీడించినాడో యిక్కడ వివరించి, కథాప్రారంభము నకును, ముగింపునకును చక్కనిసమన్వయమును సాధించినాడు. అట్టి భోగాయత్తత కాయనమాయాకల్పనాచాతురి సహాయకారి యైనది. ఆమాయ బ్రహ్మరుద్రాద్యభేద్యము. అట్టిచో కాముకు డైనదేవేంద్రు డామాయ నెట్లధిగమింపగలడు ?

"శచినంకపీఠముం జేరిచి, సోగవెంద్రుకలఁ జిక్కులు వాపి, పారిజాతలతాంతములు సరులుగా రచించి, యామెమెఱుంగుక్రొవ్వెదను నించుకాముకు డైనయింద్రు డాశచీప్రీత్యర్థమై పారిజాతమును దక్కిం చుకొనుకోరికతో - బలివంటిదనుజేంద్రులబారినుండి తన్ను రక్షించిన శ్రీహరిపై క్రోధము వహించి, తాను వజ్రి నన్నయహంకారముతో యుద్ధమునకు దిగినాడు !

" కామఏష క్రోధఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ "
(భగవద్గీత)

అని గీతాకారునిప్రవచనము. తనకామమున కడ్డు తగిలినకృష్ణునియం దలిక్రోధముతో తనరక్షకు డని యైన తలంపక శ్రీహరి నంత మొం

డింప సమకట్టి కృతఘ్నుఁడై యింద్రుఁడు పాప మొనర్చినాఁడు. కామ క్రోధములకు దాసుఁడైనయింద్రునికి గుణపాఠము నేర్పించుటకే దివ్యర్షియైననారదుఁడు కలహాశనుఁడై పారిజాతసుమమును తెచ్చి రుక్మిణి యింట నుండఁగా కృష్ణుని కిచ్చుట జరిగినది. ఇంద్రునిగర్వము నడంచుటే కృష్ణునియభిమతము. భార్యావిధేయుఁడైనయింద్రుని తనమాయా కల్పనాచాతురితో వంచించుటకే జగన్నాటకసూత్రధారి యైనకృష్ణుఁడు తానును భార్యావిధేయుఁడట్లు నటించి ఆనాటకమునకు నాందీప్రవర్తకుఁడుగా తనతత్త్వము నెఱింగిననారదుని [1] వినియోగించుకొన్నాఁడు. కనుకనే సురలోకసుమముతో నారదుఁడు తన్నుఁ సందర్శింప రాఁగా కృష్ణుఁడు

> " సురసంయమివర ! మీ రిట
> కరుదేరఁగ నిప్పు డేఁ గృతార్థుఁడ నైతిన్ "

అన్నాఁడు. నారదునిరాకతో భగవత్సంకల్ప మీవిధముగా ప్రవర్తిల్లినది.

తిమ్మకవి యింతప్రౌఢముగా – నింతముద్దుగా – నింతశిల్ప సుందరముగా కావ్యేతివృత్తమును నిర్వహించి, ప్రబంధకవిపారిజాతమై యశస్సౌరభములు గుబాళింపఁజేయుచుండుట తెలుగు జాతియదృష్టము.

1. అశ్వత్థో వృక్షజాతీనాం
   బ్రహ్మలోకగురుర్భవాన్
   మేరు స్త్వమ్ పర్వతేంద్రాణామ్
   దేవర్షీణాంచ నారదః – అని హరివంశములో కృష్ణునిగూర్చి మహేశ్వరుఁ డన్నాఁడు. కనుక కృష్ణతత్త్వమే నారదుఁ డని స్పష్టమగును.

# ౫. కావ్యనామసార్థకత

నాపాలిపారిజాతమ ! " అని యొకభక్తుడు మహావిష్ణువైన కృష్ణుని సంబోధించిన ట్లుత్తరహరివంశమున నున్నది.

భక్తపారిజాత మైనభగవంతుఁడే యొక్కరిసొమ్ము కాఁడు. అందఱివాఁడును నైనఆయనను తా నొక్కతయే సొంతముగా చేసికొనుటకై - అనగా - ఆయనను స్వార్థబుద్ధితో నపహరించుటకై సత్యభామ యత్నించినది. కనుక (భక్త) పారిజాతాపహరణము అనుపేరీకావ్యమునకు నీయర్థమునుబట్టికూడ సరిపోవుచున్నది.

> " భోజకన్యాసరిద్రాజహంసము సత్య
> భామా శుకీకేళిపంజరంబు "
> (5 ఆ - 107 ప)

ఇత్యాదిగా కృష్ణుడు కావ్యాంతమున వర్ణింపబడినాడు. ఈవర్ణనము సవతు లైన రుక్మిణీసత్యభామలమనస్తత్వమున కద్దము పట్టుచున్నది.

భోజకన్య యైనరుక్మిణి లక్ష్మ్యంశసంభూతురాలు. ఆమె యొకసరిత్తు. అందు విహరించురాజహంసము శ్రీకృష్ణుడు. అనగా భగవంతునికన్న నామెమనస్సు విశాల మై, ఆయనకు విహారస్థానమై యొప్పినది. మఱి - సత్యభామయో ? పంజరములోచిలుకవలె కృష్ణునిలో తాను నిండియుండి, ఆచిలుకలకొలికి తనక్రీడల కాయన నాటపట్టుగా చేసికొన్నది. సత్యభామ యనుచిలుకము త్తైదువకు విహారస్థానమైనపంజరముగా తన్ను తాను సర్వసమర్పణ మొనర్చుకొన్నాఁడా భగవంతుడు !

రాజహంసము లేనిసరిత్తు కనుపండువు చేయజాలదు. అట్లే కృష్ణునికి విహారస్థానము కానిచో రుక్మిణికి నిండుదనము లేదు.

చిలుక లేనిపంజరము శోభిల్లదు. సత్యభామ తనలో నిండ నిచో కృష్ణుడు చిలుక యుండనిపంజర మై యుండెడివాడు. కాని - డెందమున సత్యభామయే నిండియున్న కృష్ణుడు చిలుక యున్న పంజరము వలె శోభిల్లినాడు. తనబాహుపంజరమున నామెను బంధించినాడు. పంజరోపరిభాగమును సోకినవలె కృష్ణునిశిరమును తనవామ (అందమైన) పాదస్పర్శచే పులకింపజేసినది సత్యభామ. అది తనకు గౌరవముగానే భావించినాఁ డారసికాగ్రేసరుడు !

కృష్ణునికి రుక్మిణి విహారభూమి కాఁగా - ఆకృష్ణునే తనకు విహారస్థానముగా చేసికొని ఆభగవంతునియెదయంతయు నిండినది సత్య భామ ! తిమ్మనగారు చేసినఈకృష్ణవర్ణనమున నింత యందము చోటు చేసికొన్నది !

పారిజాతాపహరణమునకు నాయకుఁ డవతారపురుషుఁ డైన శ్రీకృష్ణుడు. అంతటివాఁడు పారిజాతము నపహరించుట ఆయన కుత్కర్షాపాదకము కానేరదు. మఱి - తిమ్మనగారు తనకావ్యమునకు "పారిజాతాపహరణము" అను పేరు పెట్టుట కావ్యనాయకుని కపకర్షా పాదక మని తెలియనంతటియవివేకి యనుట సాహసము. మఱి - తన కావ్యమున కాతిమ్మకవి యట్లేల నామకరణము నొనర్చె నన్నప్రశ్న యుదయింపక తప్పదు.

శ్రీకృష్ణుడు భక్తపారిజాతము. సత్యభామ శృంగారపారిజా తము. రుక్మిణికి పారిజాతపుష్పము దక్కిన దని విన్నప్పటినుండి సత్య భామమన స్సంతయు ఆపారిజాతమునందే లగ్న మైనది. కనుక పారి జాతము నపహరించినపిమ్మటనే కృష్ణుడు సత్యాహృదయపారిజాత మును సమగ్రముగా నపహరింపగలిగినాడు. కనుక నీకావ్యములో నిది ప్రధానసన్నివేశము కనుక తిమ్మనగారు తనకావ్యమునకు పారిజాతా పహరణ మని పేరు పెట్టుట సముచితమే.

కృష్ణుడు చిన్ననాట వెన్నముద్దలును, ఆతరువాత వెన్న వంటిహృదయములను దోచినమహానుభావుడు. కనుక చౌర్య మాయవ తారమున కలంకారముగానే పరిణమించుట ము ద్దైనవిషయము.

# రసపాత్రపోషణము

పాత్రచిత్రణము :-

అప్పకవి చెప్పినట్లు కవులలో నొక డార్థికుడు. ఒకడు రాచి కుడు. ఒకడు యమక, ముక్తపదగ్రస్తాలంకారముల నేర్పు చూపువాడు. కవు లిట్లు పెక్కు తెఱంగులవారు. కాని - కవు లందఱును స్రష్టలు కారు. జగత్కావ్యస్రష్ట యైనపరబ్రహ్మకు వాచకముగా వేదములలో ప్రయుక్త మైనకవిశబ్దమును గైకొని భారతీయకవులును, నాలంకారికులును లౌకికార్థములో సాహిత్యజగత్తున ప్రవేశపెట్టిరి. కనుక నా " స్రష్ట " శబ్ద మెప్పుడు కవిపట్ల సార్థక మగు ననగా - చిరస్మరణీయ మైనట్టి - లేదా - స్మరణమాత్రమున మనశ్చక్షువుముందు సద్యఃసాక్షాత్కారము నందునొక్కసజీవ మైనపాత్రనైనను పరికల్పించు సామర్థ్యమును కవి ప్రదర్శించిననాడు సార్థక మగును.

తిక్కనగారిశక్తిని గుర్తించినయెఱ్ఱన తిక్కనగారిని కవి బ్రహ్మ యన్నాడు. తన కాపే రున్నట్లు తిక్కనగారికి తెలియదు. వ్యాసభారతమును, నన్నయతిక్కనల తెనుగుభారతమును నామూలా చూడముగా-ననువాదభేదసాదృశ్యపూర్వకముగా - పరికించి వారియను వాదసామర్థ్యమునకు తల పంకించి, యందు తిక్కనగారిపాత్రచిత్రణ పద్ధతిని తిలకించి పులకించినయెఱ్ఱనగారు తిక్కనగారి కిచ్చినకితాబు కవి బ్రహ్మబిరుదము. అనగా- తిక్కనగారి నొకమహాస్రష్టగా నెఱ్ఱన గారు గుర్తించిరి. తిక్కనగారు " తు. చ. " తప్పక ఆచి తూచి మూలము ననువదించినచో నొకగొప్పయనువక్తయే యగును. కాని కవి

మై యుండువాడే కాడు. ఐనచో నాతడనుకొన్న ట్లాతని దెట్లు మహా కవిత్వదీక్షావిధి యగును? ఎట్టిన యన్నట్లు కవిబ్రహ్మ యె ట్లగును? శ్రీనాథుడు సంభావించినట్లు ఆతడు కాంచనగర్భతుల్యు డె ట్లగును? అన్నచో వ్యాసభారతమును ననేకపాత్రలందు తత్ర తత్ర నిక్షిప్తము లై నత త్తత్స్వభావజీవలక్షణము లెన్నింటినో మార్చి తిక్కనగా రాయా పాత్రలలో ప్రాణకళను ప్రతిష్ఠించి వానిని తనవానిగా చేసికొనెను. అట్లే పెద్దనగారు సర్వభారతదేశమునకును నుమ్మడియాస్తి యైన మార్కండేయపురాణమునందలికథను గ్రహించి ఆంధ్రేతరరాష్ట్రి ములవా రెఱుంగనివరూథినీప్రవరపాత్రలను జీవకళాపునీతములుగా చైతన్యచకచ్చకితములుగా చేసిరి. అట్లే శ్రీకృష్ణుడు భగవంతు డైనను- ఆకృష్ణపాత్రకును, సత్యభామపాత్రకును నంతటిపేరు వచ్చుటకు కారణము తిమ్మనగా రాపాత్రలను చైతన్యచకచ్చకితములుగా చేయుటయే. ఇతరగ్రంథములలో నారదపాత్రకు లేనివ్యక్తిత్వము తిమ్మనగారికావ్యములో కల్పింపబడినది.

బ్రహ్మపదార్థ మైనరసమును బ్రహ్మపదార్థముగా, బ్రహ్మానందవాచకముగా- వేదములలో పరిగణింపబడినరసశబ్దమును కావ్యజగత్తులోనికి తెచ్చిరి. కావ్యములో ప్రధాన మైన దని భరతుడు రసమునుగూర్చి ప్రప్రథమముగా చెప్పియున్నాడు. [1] "రస ఏవ వస్తుతః ఆత్మా" అని యానందవర్ధను డన్నాడు.

"న హి కావ్యం రసశూన్యం కించి దస్తి" అనియు,
"రసేనైవ సర్వం జీవతి కావ్యం" అనియు,
"వస్త్వలంకారాదయః సర్వదా రసంప్రతి పర్యవస్యేతే"

అనియు నాలంకారికులు రసప్రాధాన్యము నుగ్గడించిరి.

1. ధ్వన్యాలోకము - ఆనందవర్ధనుడు.

లోకోత్తర మైనయనుభూతివిశేషముచే గుండె ద్రవించిన దండుము. రసశబ్దమునకు ద్రవ మని యర్థ మున్నది. కనుకనే

"బ్రహ్మానందసబ్రహ్మచారీ రసః"

అని కొంద అనగా– "బ్రహ్మానందసహోదరమే రస" మని కొంద అనిరి.

రస మాధేయము. పాత్ర యాధారము. రసము ద్రవవాచకము కదా! మఱి – దాని కాధారభూత మైనది పాత్రము. కనుక రసపాత్రములు రెండింటికిని నాధారాధేయసంబంధ మున్నది. అది లేనిదే యిది లేదు. ఇది లేనిదే అది లేదు.

పాత్రములలో నెన్నో రకము లున్నవి. అవి ప్రధానముగా స్వతంత్రములు (Individual characters) అనియు, సామయికములు (Conventional characters) అనియు రెండు విధములు. ప్రవరునిది స్వతంత్రపాత్ర. ఔపధసిద్ధునిది స్వతంత్రపాత్ర కాదు. చలనచిత్రములలో వాడు "Character actor" అనగా కొన్నివిధములైనపాత్రముల నానటుడు బాగుగా నటించువా డని యర్థము.

# పాత్రచిత్రణపద్ధతులు

కవి స్వతంత్రముగా నొకపాత్రను సృష్టించి దానిస్వభావములో జీవలక్షణమును నిర్దేశించుట యన్నది పాత్రచిత్రణము.

శకునిపాత్ర యున్నది. శకుని యనగానే మేధావి, మాయావి, దురోదరప్రియుడు– నీమొదలైనవి యిదివఱకే నిర్దిష్ట మైనయాపాత్రలక్షణములు. ఈవిధముగా నిదివఱకే యేర్పడియున్న జీవలక్షణములనే సమయానుకూలముగా పాటించుట పాత్రపోషణము.

ప్రత్యక్షపద్ధతి యనియు, పరోక్షపద్ధతి యనియు పాత్రచిత్రణ పద్ధతులు రెండువిధములు.

కవి తానై తనమాటగా పాత్రస్వభావమును వాచ్యము చేయుట ప్రత్యక్షపద్ధతి.

ఒకపాత్రయొక్క-స్వభావ మాపాత్రయొక్క-సంభాషణల ద్వారా కాని- లేదా- ఆపాత్ర యితరపాత్రలతో సంభాషించుటవలన కాని, ఆపాత్ర కితరపాత్రలతో నున్నసంబంధమువలన కాని, లేదా- ఆపాత్రనుగూర్చి యితరపాత్రలే యనుకొనుమాటలవలనకాని- లేదా- యితరపాత్రలు ఆపాత్రవలన పొందినప్రతిస్పందనమువలనకాని- తెలిసినచో అది పరోక్షపాత్రపోషణపద్ధతి.

పరోక్షపద్ధతిలో పాత్రచిత్రణముకాని, లేదా- పాత్రపోషణము కాని చేయుట యున్నతమైనపద్ధతి. అది నాటకఫక్కి-.

# 8. రసపోషణవిధానము

" రసో వై సః రసగ్గ్ హ్యే వాయం లబ్ధ్వా నందీభవతి "

అన్నది తైత్తరీయోపనిషత్తు.[1] ఆపరమాత్మ రసస్వరూపము. ఆరసమును పొంది జీవుఁ డానందరూపు డగుచున్నాఁడు.

ఇది శ్రుతిప్రమాణము కాఁగా రెండవది సహృదయుల ప్రత్యక్షానుభవము.

" నహి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే "

అని భరతుని నాట్యశాస్త్రము [2] చెప్పుచున్నది. దీనినిబట్టి రసమునకు భరతుఁ డిచ్చిన ప్రాధాన్యము వ్యక్త మగుచున్నది.

" భరతునితరువాత రససిద్ధాంతము చాలకాలము మరుగున పడిపోయినది. దీనిని పునరుద్ధరించినయాలంకారికప్రకాండు డానందవర్ధనుడు. " [3]

" రసేనైవ సర్వంజీవతి కావ్యమ్ - న హి రసశూన్యం కించి దస్తి
రసఏవ వస్తుతః ఆత్మా వస్త్వలంకారధ్వనీతు సర్వథా రసం ప్రతిపర్యవస్యేతే "

అన్నాడు అభినవగుప్తుడు. [4]

" లోకోత్తరచమత్కారప్రాణైః కైశ్చిత్ప్రమాతృభిః
స్వాకారవదభిన్నత్వే నాయమాస్వాద్యతే రసః "

అనుచున్నది రసగంగాధరము. [5]

1. తైత్తరీయోపనిషత్తు.
2. భరతునినాట్యశాస్త్రము.
3. ఆనందవర్ధనుడు - ధ్వన్యాలోకము.
4. అభినవగుప్తుడు.
5. రసగంగాధరము.

లోకోత్తరచమత్కారప్రాణు (Extra Ordinarely Beautiful Souls) లైనకొంతమందిపప్రిమాతలచేతనే ఆత్మసాక్షాత్కారముకంటె భిన్నము కానివిధముగా రస మాస్వాదింపఁబడుచున్నది.

పారిజాతాపహరణకావ్యమున నాయకుడు శ్రీకృష్ణుడు. రుక్మిణి, సత్యభామ, జాంబవతి, మిత్రవింద, భద్ర, సుదంత, కాళింది, లక్షణ యను "సమతాభిమానవతు"[1] లైనయష్టమహిషులతో, వారు కాక యచ్చరకొలమువా రైనపదారువేలమందిలలనామణులతో వారువారు కోరినవేళల వారు కోరినలీలలఁ దేల్చి భోగాయత్తుఁడై పెక్కురూపముల మాయాకల్పనాచాతురిచే సౌఖ్యాబ్ధి నోలలాడు దక్షిణనాయకుఁ డాయన. ఆహరి యిట్లు సతుల నందఱను సరిగాఁ జూచియును భోజజనపాలసుతను, దరుణీమణి యైనసాత్రాజితిని మిగుల మన్నించి చనవు లిచ్చువాఁడు.

తిమ్మనగారికావ్యమునకు సంబంధించినంతవఱకు సత్యాకృష్ణులయనురాగమే ప్రధానముగా చిత్రింపబడినది. రుక్మిణీసౌధమున నున్నను కృష్ణునిదృష్టి సత్యభామమీఁదనే యుండుట యీకావ్యమున కానవచ్చువిశేషము. "చక్కనిదాన నంచు, నెలజవ్వని నంచు, పతి యెంతయు నా కనురక్తుడంచు, నిక్కుచు, విఱ్ఱవీగుచు సత్య" సపత్నులను గణించెడిది కాదు. కులరూపవాల్లభ్యములచే తనకు సాటి యైన రుక్మిణితో నామె నిరంతరము మచ్చరించి ఖండితనాయికగా ప్రవర్తించెడిది. శృంగారనాయకుఁ డైనసత్యభామావిధేయుఁడు కృష్ణుఁడు సత్యభామమానరోషము నుపశమింపజేయుటకై వేఱుమార్గము కానక పాదాక్రాంతు డై తద్వామపాదతాడనభాగ్యము వడసి, యామెప్రీతికై సురలోకపారిజాతము నపహరించి, యడ్డువచ్చినయింద్రాదిదేవతల

1. ఈపాదమున "స్వమతాభిమానవతు" లని యున్నచో మిక్కిలియుచితముగను, సర్థవంతముగను నుండెడిది.

నోడించి వీరమును ప్రదర్శించినాడు. కావున పారిజాతాపహరణకావ్యమున శృంగార మంగిరసము కాఁగా వీర మంగరస మైనది. యథార్థమునకు కావ్యమునందు అంగిరస మతిశయించునంతగా వీరము భాసించినను దానిని శృంగారమున కంగముగా మాత్రమే చేయగలుగుట తిమ్మనగారియసాధారణప్రతిభాపాటవమునకు గీటుఱాయి. ఆహవదోహలులైనసురవీరులసమరప్రయత్నములును, "నేనే-నేనే" యని యహంకరించువారిసమరోత్సాహమును ఆరభటీవృత్తిలో చిత్రించినతిమ్మకవి తన్ను తాను సత్త్వముచే నిగ్రహించుకొని శృంగారముకన్న వీరమునకు ప్రాధాన్యము కలుగకుండ జాగ్రత్త వహించినాడు.

"వేల్పుప్రమానియందు వేడుకపడుకూర్మి
సతులకోర్కెఁ దీర్పజాలి యపుడు
హరియు హరియుఁ బోరి రన్యోన్యజయకాంక్ష
నసురజీవితాపహారిగముల" [5 ఆ - 23 ప]

అనుపద్యమునుబట్టి చూడగా తమతమభార్యలకోరికలను తీర్చుటకే యింద్రోపేంద్రు లొండొరులతో యుద్ధమునకు సిద్ధపడినారు కనుక శృంగారవీరములనిష్పత్తి ఈపద్యమున స్పష్ట మగుచున్నది. నాయికానాయకులశృంగారమునుమాత్రమే కాక తదితరసన్నివేశచిత్రణములందు కూడ తిమ్మకవి తనకావ్యమున శృంగారరసప్రాధాన్యమును ప్రకటించినాడు. సత్యాకృష్ణులు స్వర్గమున కేఁగఁగా నాకలోకవిలాసినులు సకలజగన్మోహను డైనకృష్ణుని సందర్శించుటకై తహతహ లాడినట్లు తిమ్మనగారు రచించినపద్యములను పరిశీలించినచో స్పష్ట మగును.

"అప్పుడు శౌరిఁ జూచుప్రమదాతిశయంబు హృదంతరంబులన్
జిప్పిల సంభ్రమించి కయిసేయుతెఱం గయథాతథంబుగా
గుప్పనఁగూరి యొండొరులఁ గూడగనీక కడంగి వేలుపుం
గప్పురగంధు లెక్కిరి ధగద్ధగితోన్నతహర్మ్యరేఖలన్."

(3 ఆ - 11 ప)

కృష్ణుని గాంచుతత్తరమున నిమ్మలు తప్పురీతిని సొమ్ములు గై సేసికొను టచే నిందు విభ్రమ మనుశృంగారచేష్ట యున్నది.

"అలఁదినచందనంబు వృథ యౌఁ జెమరింపఁగ సమ్మదాశ్రులన్
దొలచినయట్లు పోయెడుఁ గనుంగవకాటుక పేటు లెత్తుఁ జె
క్కుల మకరీవిలాసము గగుర్పొడువన్ హరిఁ జూచువేళ నో
చెలి ! కయిసేయకమ్మ ! యని చేడియ యొక్కతె పిల్చె నెచ్చెలిన్."

(3 ఆ - 12 ప)

స్వేదరోమాంచానందాశ్రువు లనెడిసాత్వికభావము లిందు సుకుమార ముగా స్మరింపబడినవి.

"వనిత యొకర్తు మున్నొకని గవాక్షతలంబున వింతు లుండుటం
గనుఁగొనఁ జోటు లేమి నొకకార్యముపేరిట బాలనొర్తు వం
చనఁ దొలఁగంగఁ బిల్చి రభసంబునఁ దత్ప్రతి జాలకంబు చే
కొని హరిఁ జూచెఁ గేకినలు గొట్టుచు బోఁటులు దాని నవ్వఁగన్"

(3 ఆ - 13 ప)

కృష్ణుని దర్శింపవలె నని యొకవనితలో చెలరేగినకోరిక- ఆమె యొక బాలను వంచించునంతగా విజృంభించినది. కుతూహల మనుశృంగార చేష్ట యీపద్యమున గోచరించుచున్నది.

"కాళియభేదిఁ జూచుతమకంబున మజ్జన మాడియాడి నీ
లాలక యొర్తు గంధసలిలార్ద్రకచంబులు చన్నుదోయిపై
వ్రాలిచి సందిటం బొదివి రాజపథంబున కేఁగుదెంచె గో
పాలకమూర్తిఁ గాన శిఖిబర్హము కానుకఁ దెచ్చెనో యనన్"

(3 ఆ - 14 ప)

ఒకనీలాలక తన స్తనములపై పడుచున్నతడియారనికురులను సందిటఁ బట్టి యున్నపాటున శ్రీకృష్ణుని చూడవచ్చిన దఁట ! ఇందును ఆమె లోనికుతూహల మనెడిశృంగారచేష్ట వర్ణింపబడినది.

" ఉన్నతసౌధ మెక్కి యన్నతోదరి యొక్కతె పద్మనాభుఁ జూ
డ న్నిజదేహవల్లికఁ గదల్కొనుసాత్త్వికలీలఁ జూచునా
సన్న సఖీజనంబుఁ గని సౌధశిలాగమనశ్రమంబునం
గన్నియలార ! మేన్ బడలెఁ గంటిరె నా కని బొంకె నేర్పునన్ "
( 3 ఆ - 15 ప)

శ్రీకృష్ణుఁడు కారణముగా తనలో కలిగినసాత్త్వికలీలలను సౌధశిఖాగమనముచే కలిగినశ్రమ యని ఆయన్నతోదరి యన్నత మాటుట సరసముగా నున్నది. ఆయువతి సాత్త్వికలీలాగోపనమునకై యత్నించినది కనుక నిచ్చట " అవహిత్థ " యనుసంచారిభావ మున్నది. [1]

" వేడుక నీకె కాని మఱి వేఱొకయింతికినైన లేదె ? త్రో
పావెద వేల ? మచ్చర మొకప్పుడు మానకపోయి తీవు: పెన్
ద్రోదవు గాన నిన్నె కనుఁ బో ! యతఁ డెవ్వరిఁ జూడఁ డంచు నో
నాడె సపత్ని యొక్కతె మురారిఁ గనుంగొనువేళ నీసునన్ "
(3 ఆ - 16 ప)

అసూయ యనుసంచారిభావ మిం దున్నది. " వేడుక నీకే కాని వేఱొకయింతికి లేదా ? " యనుటనుబట్టి జగన్మోహనుఁడైనశ్రీకృష్ణుని జూడవలె ననుప్రగాఢవాంఛ సమస్తతరుణీజనములకును గల దనుటయే. ఈపద్యములో ప్రకటింపబడినస్త్రీయీర్ష్య సత్యభామలోనిసపత్నీమాత్సర్యమునకు చెల్లెలువలె నున్నది.

" అలికులవేణి యొక్కతె మురారిఁ గనుంగొని మ్రానుపాటు పై
నెలకొని యున్నచో సడలునీవిక లేఁజెమ రంటి నిల్చె నం
జలిపరిపూర్ణలాజలను సాధ్వసకంపము దాన చల్లె న
చ్చెలువకు సాత్త్వికోదయము చేసినమేలిక నేమి చెప్పుదున్ "
(3 ఆ - 17 ప)

వేపథు వనుసాత్త్వికభావ మిందు కలదు. నీవి జాఱినను చెమ్మట నంటుటచే చెలువయొడలినుండి చీర జాఱిపోలే దఁట ! కంప మనుసాత్త్విక

1. అవహిత్థాతు లజ్జాదేర్హర్షాద్యాకారగోపనం.

భావమ్ము కలుగుటనే అప్రయత్నముగానే ఆయలికులవేణీచేలాలు శ్రీకృష్ణునితలపై చల్లబడినట్లే పడినవట! ఈపద్యమునందలియీ సాత్త్వికభావములు మనోహరముగా చిత్రింపబడినవి.

" మదవతి యొకతె పరాకున
బదాంగదము కంకణముగఁ బాణిఁ దొడిగె న
య్యదువల్లభుఁ గనుఁగొనుచోఁ
దుది నదియును మేను పొంగి తుత్తుము రయ్యెన్ "
(3 ఆ - 18 ప)

ఇందలి " మదవతీ " శబ్దము సార్థకమును, సాభిప్రాయమును నైనది. కృష్ణదర్శనలాలస యైనమదవతిమోహపారవశ్యమును, తద్దర్శన జనిత హర్షాతిరేకమును చక్కగా వర్ణింపబడినవి. విభ్రమ మనుశృంగార చేష్టను [1] కవి యీపద్యమున నిక్షేపించినాడు.

" దనుజవిరోధిమీఁద నొకతవ్వి కరంబున లాజ లెత్తి చ
ల్లిన నెఱివేణి యూసునబలెన్ విరిపూవులఁ జల్లెఁ జల్లె లో
చనములు సమ్మదాశ్రువులఁ జల్లె లలాటము ఘర్మబిందువుల్
చనుఁగవ చల్లె సంభ్రమవశత్రుటితామలమౌక్తికాదులన్ "
(3 ఆ - 19 ప)

తన్వీగతపారవశ్య, బాష్పోదయ, స్వేదోద్గమ, సంభ్రమము లీపద్యమున చమత్కారముగా పరమరమణీయముగా వర్ణింపబడినవి.

1. " ప్రియాగమనవేళాయాం మదనావేశసంభ్రమాత్
విభ్రమో గంధహారాదిభూషాస్థానవిపర్యయః "
రసార్ణవసుధాకరము.

2. " త్వరయా హర్షరాగాదేర్దయితాగమనాదిషు
అస్థానే భూషణాదీనాం విన్యాసో విభ్రమో మతః "
సాహిత్యదర్పణము.

" జలరుహనేత్రుఁ గాంచి సరసత్వము మీఱఁగ నొక్క వేలుపుం
జిలుకలకొల్కి రాచిలుకచే బిలిపించిన, సత్యభామ కా
కలికితెఱంగు శౌరి కడకన్నులసన్నలఁ జూపెఁ గోపకం
దళకులషాయితాక్షివలనంబుల నాసతి దన్నదల్పఁగన్ "

(3 ఆ - 20 ప)

కృష్ణుడు తనయందచందముల ప్రభావమును సత్యభామకు చూపి తనయం దామె కున్నయనురాగ మిబ్బడిముబ్బడి యగుటకే సురమదవతీచేష్టను సత్యభామకు చూపినాడు. "స్వర్గమున కేఁగినను సవతిపోరు తప్పలే దని సామెత. భూలోకమున సవతియైనరుక్మిణియందలిమచ్చరముచేతనే సత్యభామ ప్రాణేశ్వరునితో స్వర్గమునకు వచ్చినది. అక్కడకూడ సత్యభామ చూచుచుండగనే యామెపతిని (తనకు కాకుండ) కోరెడి కామిను లున్నారు ! ఇది విచిత్రము ! ఈపద్యమున నున్మాద మనుసం చారిభావ మున్నది.

" అనిమిషపురజాలకములు
వనితాజనతామయములు - వనితలహృదయం
బనురాగరసమయం - బ
య్యనురాగము శౌరిమయము నయ్యెడ నయ్యెన్ "

(3 ఆ - 21 ప)

అది యనిమిషపురము. అనగా - ఱెప్పపాటు లేనివారిపురము. ఱెప్ప పాటు లేకుండగనే వారు కృష్ణు నభిలాషతో చూచుటచే " అనిమిష " శబ్ద మిచ్చట సార్థక మైనది. వనిత లనఁగా మిగుల ననురాగనిలయ లైనమగువలు. సురలోకవనితాజనతాహృదయము లన్నియు నేకత్ర రాశీభూత మై కృష్ణునియం దనురాగమును పెంచుకొనుటలో నొక్కటే యైన వన్నట్లు - తిమ్మకవి " వనితలహృదయంబు " అని యేకవచన మును ప్రయోగించుట సరసముగా నున్నది. కృష్ణుడు ప్రేమస్వరూపుడు. అట్టివాడు సమస్తసురలోకవనితానురాగరసపాత్ర మగుట సముచితమే.

కనుకనే కవి " అయ్యనురాగము శౌరిమయము నయ్యెడ నయ్యెన్ " అనుచున్నాడు.

రసనిర్ణయవిషయమున తిమ్మనగారు స్వాతంత్ర్యము వహించిన ట్లున్నయీపద్య మీకావ్యమునకు మకుటాయమానముగా నున్నది. రసము లెనిమిదా? తొమ్మిదా? యనువిషయమున పూర్వాలాక్షణికులలో వివాద మున్నది.

నాట్యశాస్త్రమును రచించినభరతునిమతమున రసము లెనిమిదియే. [1]

" మునినా భరతేన యః ప్రయోగో భవతీష్వష్టరసాశ్రయో నియుక్తః " [2] అని కాళిదాసమహాకవియు, " షట్ స్థానాని, గతిద్వయమ్, అష్టౌరసాః " (ఉభ. సా.) [3] అని వరరుచియు రసాష్టకమునే చెప్పిరి. దండిమొదలైనప్రాచీనాలంకారికు లెనిమిదిరసములనే గుర్తించిరి. ధనంజయు డీవాదమునే బలపఱచెను. ఆయన శాంతమునకు రసత్వము నంగీకరింపలేదు. వాసుకి, ఉద్భటుడు, కోలహాలుడు, మమ్మటుడు, ఆనందవర్ధనుడు, అభినవగుప్తుడు, విద్యానాథుడు, జగన్నాథుడు మొదలైనవారు శృంగారాదులైనయెనిమిదిరసములకును శాంతమును చేర్చి రసములు తొమ్మిది యని భావించిరి.

రుద్రటుడు "ప్రేయస్సు" అనుపదియవరసమును చెప్పినాడు. భక్తి, వాత్సల్యము, ప్రీతి, స్నేహము, శ్రద్ధాదులైనరసము లెన్నియో క్రమముగా చెప్పబడినవి. " అనంతా వై రసాః " అన్నట్లయినది.

1. శృంగారహాస్యకరుణాః రౌద్రవీరభయానకాః
బీభత్సాద్భుతసంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యే రసాః స్మృతాః
(నాట్యశాస్త్రము 6-16, 17)

2. [విక్ర - 2 - 18] కాళిదాసు. 3. వరరుచి

ఈయనంతరసవాదము లిట్లు సాగుచుండగా, శృంగార మొక్కటే రస మనువాద మొకవంకను, కరుణమే రస మనువాద మొకప్రక్కను, అద్భుతముమాత్రమే రస మనువాదము వేఱొక్కయెడను తల యెత్తినవి. †

ఈవాదము లిట్లుండగా – తిమ్మకవి అనురాగరస మనురస విశేషము నిందధికముగా పేర్కొని, అది శౌరిమయ మని వక్కాణించి, ఆయమరవనితలయనురాగరసమున కుత్తమస్థాన మొసంగినాడు. తిమ్మకవి యీపద్యమును చెప్పినతీరు వాల్మీకిమహర్షి సుందరకాండ ములో రచించిన

" మహీకృతా పర్వతరాజిపూర్ణాః
శైలాః కృతా వృక్షవితానపూర్ణాః
వృక్షాః కృతాః పుష్పవితానపూర్ణాః
పుష్పం కృతం కేసరపత్రపూర్ణమ్ " 1

అనుశ్లోకమును పోలియున్నది.

కృష్ణుడు సత్యభామసౌధమునమ్యాతకేళినుండగా సాయం కాలమైనది. చంద్రుఁడుదయించినాఁడు.

తే. గీ. " తారకాధీశుకిరణకదంబకంబు
చిలికెఁ బలుచనివలివంపుజిలుఁగుమంచుఁ
గైరవశ్రీవధూకరగ్రహణవేళ
వెలికిఁ గ్రమ్మినసాత్త్వికస్వేద మనఁగ "
[2 ఆ - 48 ప]

అని తిమ్మనగారు వర్ణించిరి.

† " THE NUMBER OF RASAAS " అను గ్రంథమునందు ఈరససంఖ్యా పరిణామమును డాక్టర్ వి. రాఘవన్‌గారు విపులముగా చర్చించి యున్నారు.

1. వాల్మీకిరామాయణము - సుందరకాండము.

చంద్రకిరణములు చిలికినపలుచనిజిలుఁగుమంచు చందమామ కలువకిన్నియకరము పట్టినపుడు వెలికి గ్రమ్మినసాత్త్వికస్వేదముగా నుత్ప్రేక్షింపబడినది. మధురాతిమధుర మైనయీపద్యమున నాయక స్పర్శచే నాయికకు కలిగినసాత్త్వికస్వేదమును ధ్వనింపజేసి, కవి యిందలిశృంగారమును ప్రకటించినాడు. ప్రకృతివర్ణనలో ప్రధానకథా వృత్తము ధ్వనింపజేయుట మహాకవిలక్షణము.

సీ. " సహసానఖంపచస్తనదత్తపరిరంభ
మామూలపరిచుంబితాధరోష్ఠ
మతిశయప్రేమకల్పితదంతసంబాధ
మగణితగ్లానిశయ్యానిపాత
మతివేలమణితయాచ్నార్ధగల్లచపేట
మతిదీనవాక్ప్రాచితాత్మవిరహ
మంకురత్పులకజాలావిద్ధసర్వాంగ
మానందకృతహారవాననాబ్జ

తే. గీ. మ్మాక్రమక్షీణనుతివర్ణ మానిమీలి
తాక్ష మాస్విన్నగండ మాయత్తచేష్ట
మాస్తిమితభూషణారవ మావధూటి
ప్రథమసురతంబు గంధర్వపతి గరంచె "

[మనుచరిత్రము - 3 ఆ - 116 ప]

అని విస్పష్టముగా శృంగారమును వర్ణించుకాలములో తా నుండియు నందటుకవులవలె నంగప్రత్యంగవర్ణనలజోలికి పోక, శృంగారము నింత సుకుమారముగా ధ్వనింపజేయుట తిమ్మకవిప్రత్యేకత.

సీ. " కామినీమానమేఘశ్రేణి విరియంగఁ
దొగతెల్లగుంపులు దొంగలింప.......
....... విరహిజనములపై దండు వెడలె నపుడు "

(2 ఆ - 50 ప)

చంద్రోదయధర్మములు శరత్కాలధర్మములతో నుపమింపబడినయీవద్య మున నుద్దీపనవిభావము లన్నియు వర్ణింపబడుట గమనింపదగినవిశేషము.

కం. "తలిరాకుగుత్తిఁ దమిఁ గో
యిల చంచునఁజించి కోర్సె నీరీతి వియో
గులగుండియ లవియింపుదు
బలువిడి నని మరునియెదుటఁ బచరించె ననన్"
[3 ఆ - 49 ప]

కోకిల చిగుళ్ళను జీల్చుచు, విరహులగుండియల నిట్లే చీల్తు నని మన్మ థునికి చెప్పుచున్న ట్లున్న దఁట! పికకూజిత ముద్దీపనవిభావము గదా.

"ప్రియచుంబితాంగనాబింబాధరంబులు
మడురాజు నపరాగయుక్తిఁ దోచెఁ"
(2 ఆ - ప)

ప్రియచుంబిత లైనయంగనల (దొండపండువంటి) వాతెరలు రక్తిమను గోల్పోయిన వఁట! చంద్రుడు (అపర+అగయుక్తితో) పశ్చిమాద్రి శిఖరమును చేరినాఁ డట! ఈప్రాతర్వర్ణనసందర్భమునకూడ శృంగార రసాంగముల నిట్లు ప్రకటించినాడు తిమ్మకవి!

కం. "తలిరాకుమెఱుఁగువాతెఱ
కలకంఠవిటుండు గమువఁగాఁ జూతలతా
లలన విదిర్చెను గంటివె
యలికంకణముఖరవిటపహస్తముల సతీ!"
(3 ఆ - 56 ప)

చూతలత యనునాయికయొక్క చిగురాకుపెదవిని కలకంఠవిటుడు కొఱు కగా నళికంకణములు రవళింపగా కొమ్మచేతులతో నాముగ్ధ విదిర్చిన దఁట! సంభోగశృంగారభరిత మైనయీదృశ్యమును నందనోద్యాన మున నాయకుఁ డైనశ్రీకృష్ణుడు నాయిక యైనసత్యభామకు చూపుట

ముచ్చట గొల్పుచున్నది. నాయికానాయకగతమైనశృంగార మీ పద్యమున భంగ్యంతరముగా చెప్పబడినది.

కం. "సురవీరుఁ డొకఁడు సతిచే
దురమునకు ననుజ్ఞ వేడి తొల్లిటియలుకం
జిరకాలదుర్లభం బగు
పరిరంభముఁ గాంచి వెడలెఁ బ్రమదం బెసఁగన్"

(4 ఆ - 74 ప)

దేవేంద్రునిసైన్యములోనివీరభటునిచేష్టను వర్ణించుపద్య మిది. తరువాత తాను చూపదలచినవీరముకన్న శృంగారమునకే యాతడు ప్రథమస్థాన మిచ్చినాడు. ఈకావ్యములో శృంగారమే ప్రధానరస మనియు వీర మంగరస మనియు నీ పద్యమున నీవీరభటునిచర్యద్వారా సూచించుట కవినేర్పు.

"చుక్కలరాణివాసముల జోయగపుంజనుదోయిత్రెక్కునం
జిక్కనయైనయక్కు యదుసింహుఁడు బాణపరంపరాహతిన్
వ్రక్కలు సేయఁ గాఱురుధిరంబునఁ దోఁగుచు రేపెలుంగు గెం
పెక్కినచాయ నభ్యుదయ మేదియుఁ దాల్చె రణాంగణంబునన్"

[5 ఆ - 10 ప]

చంద్రుడు కామునిమేనమామ. కామసామ్రాజ్యములో మనఃకారకుఁడైనచంద్రునిప్రభావ మింతం తెనరానిది. అట్టిచంద్రుడు కామప్రభావితుఁడై చుక్కలరాణులచనుదోయిత్రెక్కున చిక్కనయైనయక్కు కలవాడు. అట్టివాఁ డింద్రునిపక్షము వహించి కృష్ణునిపై యుద్ధమునకు వచ్చినాడు. ఇంతకు పూర్వము కామబాణపరంపరాహతమైనయా రేరాజువక్షమిపుడ యీయుద్ధమున కృష్ణబాణాహతిచే గాయపడి (యభ్యుదయ మేదినను) ఎఱు పెక్కినదఁట! యుద్ధవర్ణనసందర్భమునందు కూడ నీవిధముగా శృంగారమునకు రంగులు తీర్చుట తిమ్మనగారికే చెల్లినది. కాలుసేతులు చల్లబడి ఖరకరుఁడు లేనివేళమాత్రమే

మి న్నంది శృంగారపురుషునుగా చక్కనిచుక్కలబిగికౌఁగిళ్ళలోమా త్రమే యుండదగినయాశీతకరుఁడు మహావీరుడువలె " తగుదు నమ్మా!" యని జగదేకధన్వి యైనశ్రీకృష్ణునితో యుద్ధమునకు వచ్చినాఁడు ! ఱోటిలో తల నుంచినవానికి ఱోకటిపోటు తప్పదుగదా ! ఆరేవెలుంగు నల్లనిచీకటిలో రాణివాసపుకౌఁగిలింతలలో రాణించవలసినవాడే కాని-నల్లనివాని కెదురు నిలచి, యాయుధపాణి యై రాణింపగలవాడు కాఁడని కవిహృదయము. అందులకే చంద్రునిపరముగా వీరమును వర్ణింప వలసినపట్టున తిమ్మనగారు రాజశృంగారవిషయమును స్పృశించినారు ! తిమ్మనగారు తనకావ్యమున వీరముకన్న శృంగారమునకే ప్రాధాన్య మిచ్చినా రన్నవిషయ మీవర్ణనలనుబట్టియే స్పష్ట మగుచున్నది.

అమరలోకమునందలికాంతలజలక్రీడావిశేషములను వర్ణించు పట్టున తిమ్మనగారు పద్యమును రచించిరి :-

" వదలిననీవిబంధముల వాడినమోముల జాఱుకొప్పులం
జెదరినపత్రభంగములఁ జిక్కులు గొన్నమణీసరంబులం
బొదలినయూర్పుఁదెమ్మెరలఁ బుప్పొడిఁ గెంపగువాఱుఁగన్నులన్
ద్రిదశమృగాయతాక్షులు రతిశ్రమఖిన్నలఁ బోలి రందఱున్. "

(4 ఆ - 18 ప)

పోఁకముడులు వీడుటయు, మోములు వాడుటయు, మకరికాపత్రములు చెదరుటయు, మణిహారములు చిక్కులువడుటయు, నిట్టూర్పులు నిగుడుటయు, జాగరణముచే కన్ను లెఱ్ఱవడుటయు ననునవి రతిశ్రమచే కలుగు లక్షణములు. జలక్రీడాసంప్రాప్తము లైనయీలక్షణములను రతిక్రీడాశ్రమచే సంభవించినలక్షణములుగా చెప్పుట తిమ్మనగారియతిలోకమైనప్రతిభకు నిదర్శనముమాత్రమే కాక యీకావ్యమున సుకుమారమైనశృంగారము సర్వాతిశాయిగా భాసించుటను సూచించుచున్నది.

సత్యాకృష్ణు లారేయి యింద్రునివైజయంతమున విడిదిచేసి నట్లు తిమ్మకవి తనకావ్యమున తృతీయాశ్వాసములో (మూలములో లేనిదానిని) కల్పించి చెప్పెను. ప్రబంధయుగమునకు చెందినమఱియొక కవి యైనచో ఆసందర్భమును పురస్కరించుకొని సత్యాకృష్ణులశృంగార లీలల నతివేలముగా వర్ణించెడివాడే. కాని తిమ్మకవి యట్టివర్ణనకు పాల్పడక

" ఆరాత్రి సత్యఁ గూడి ము
రారి ముదం బెసఁగ వైజయంతమున మనో
భూరాజ్యసౌఖ్యనిద్రా
పారీణత నుండుచోఁ బ్రభాతం బయ్యెన్ "

[4 ఆ - 48 ప]

అని మాత్రమే చెప్పి శృంగారమును సుకుమారముగా స్పృశించి వదలినాడు. నందనోద్యానమునందలిసుందరదృశ్యములను సత్యభామకు చూపుచు కృష్ణుడు చేసినవర్ణనలలో వారిసుకుమార మైనశృంగారమును

" తనుఁ గనుఁ బ్రామి యొండొకలతం బతి వేఱొకతేఁటిబోఁటిపై
త్తున విరిదేనెఁ గ్రోలఁ గని తూలుచు సంపఁగితావివెల్లిలోఁ
గనలునఁ గూలఁ బోవునలికామినిసాహస మేమి సెప్ప ! న
య్యనుఁగుఁబ్రియుండు నెచ్చెలులు నాఁగిన మాన దరాళకుంతళా ! "

[3 ఆ - 57 ప]

ఇత్యాదిపద్యములలో సత్యభామసపత్నీమాత్సర్యమును కృష్ణునిమాటల లోనే ధ్వనింపజేయుట తిమ్మనగారిసుకుమారభావుకతకు నిదర్శనము.

" చిలుకలు వాఁడిచంచువులఁ జించినచో లవలీదళంబులన్
ఫలరసరేఖ లంటి కనుపట్టెడుఁ జూడుము చైత్రుఁ డీలతా
లలనలగండదర్పణతలంబులఁ గుంకుమపత్రభంగముల్
చెలువుగ వ్రాసెనో యన నళిప్రకరాద్వయవాదికైశికా ! "

(3 ఆ - 54 ప)

కృష్ణుడు సత్యభామతో నిట్లు చెప్పుట యన్యాపదేశముగా సత్యాకృష్ణులమనోగత మైనసుకుమారశృంగారభావమునకు ప్రతిబింబము.

"అళిప్రకరాద్వయవాదికైశికా, అదృష్టసింహోదరసన్నివేశ (3-55), అరాళకుంతలా (1-123), లలితేంద్రనీలశకలోపమకైశిక" (1 ఆ - 135) - ఇత్యాదిగా కృష్ణుడు చేసినసంబోధనవాచకము లన్నియు సత్యభామయం దాయన కున్నమక్కువనే సూచించుచు కావ్యమునందలిశృంగారరసప్రాధాన్యమును చాటుచున్నవి.

నందనోద్యానవిహారవేళ కృష్ణుడు సత్యభామ కాయాదృశ్యములను జూపుచు "మదోన్మాదితరాజకీరవదనత్రుటితోరుఫలచ్యుతము లైనదాడిమబీజములను" జూపి వర్ణించినాడు. ఆరాజకీరము మతెవ్వరో కాదు - కృష్ణుడే! నాయికానఖక్షతవిషయమున తనలో పొడసూపినవాంఛ నన్యాపదేశముగా కృష్ణు డిట్లు వెలువరించినాడు.

పారిజాతాపహరణకావ్యమునందలిద్వితీయాశ్వాసములో నేఁబదిమూఁడవసంఖ్య కలసుదీర్ఘవచనములో -

" .... .... .... సరసమధురసంబులు నించి యించినవేడ్కల నొండొరులకెంజిగురాకుమోవి నంజలం జవిగొనుచుఁ గ్రోలి సోలి పూఁజవికలఁ బొంపిరివోవుకామినీకాముకులును, వలరాచకేళి సలుపు నెడల నంగంబులచకచకలు వెలివోవకుండ నిండారులేపంబులు సేయు సొంపునఁ గర్పూరకస్తూరికాసంకుమదమిళితచందనపంకంబు లొకళ్లొకళ్లమేనులం గలయ నలందుకొని చలువచప్పరంబులం దీర్చిన పుప్పొడి తిన్నెల విశ్రమించుసతీపతులును....బేరుకొనుకోరికలు దారుకొన డాయు నెడం బొంగినయంగంబులం బరస్పరబాహుపాశంబుల బిగియారం గౌఁగిలించుకొని కరంగినడెందంబుల రెంటి నొక్కటిగా హత్తించుపోలిక నత్తమిల్లి పగలు తమపాసినయెడలం బొడముమనోజవికారంబుల నవిరళతరక

పోలంబుగాఁ జెప్పికొనుచు హంసతూలికాతల్పంబుల నల్పేతరానందంబు లం బొరలు తరుణీతరుణులును .... రతిశాస్త్రరహస్యతత్త్వానుభవంబున వెలి మఱచినవలరాచతపసులపోలికం దెలితాఁకట్టునెలవులం బవ్వళించి యున్ననాయికానాయకులును .... నెడపడనివేడుకపనుల నలసి జడియు నవయవంబులనై సొలయునెమ్మనంబులతో నొయ్యనొయ్యనం గదలు తూఁగుటుయ్యెలలలం గన్ను మొగిచి యున్నవిలాసినీవిలాసులునుం గలిగి యన్నగరంబు శంబరాంతకుసామ్రాజ్యంబు ననుకరించె" నని ద్వారకావాసులైనదంపతులశృంగారమును వర్ణించుచున్నట్లే చెప్పుచు- " అయ్యెడ నయ్యదువల్లభుండు సత్యయుం దాను ననర్ఘమణిదీపితంబును .... మంజుగుంజత్పారావతపతంగగళరవభరితంబును, మాణిక్యసమున్నతాదర్శదర్శనీయంబును నగుశయనాగారంబున వినోదకేలిం దేలి నిద్రాముద్రితనేత్రుఁడై శయనించె" నని మాత్రమే సత్యాకృష్ణుల శృంగారమును సుకుమారముగా వాచ్యము చేసి తిమ్మకవి తనగడుసుదనమును ప్రదర్శించినాడు.

" ఏయేవేళల నేసరోజముఖి యేయేలీలలం గోరుఁ దా
నాయావేళల నాసరోజముఖి నాయాలీలలం దేల్చి యే
చాయం జూచినఁ దానయై మెలఁగుచున్ సౌఖ్యాబ్ధి నోలాడు భో
గాయత్తుం డయి పెక్కురూపముల మాయాకల్పనాచాతురిన్ "

[1 ఆ - 40 ప]

అని కావ్యనాయకుఁడైనశ్రీకృష్ణునిశృంగారలీలలను సభ్యతాపరిధులు దాఁటకుండ కావ్యారంభముననే చెప్పినతిమ్మకవి

" భోజకన్యాసరిద్రాజహంసము సత్య
భామాశుకీకేళిపంజరంబు
జాంబవతీనిశాచంద్రోదయంబు కా
ళిందీసరోజినీందిందిరంబు

భద్రాకలాపినీప్రావృడంబుదము సు
దంతారసాలలతాపికంబు
మిత్రవిందావనీ చైత్రాగమము లక్ష
ణాహారయష్టికానాయకంబు

షోడశసహస్రకామినీస్తోమధేను
కారిరంసామదోత్కటవారణేంద్ర
మనఁగ సౌఖ్యాంబునిధి నోలలాడుచుండె
గృష్ణుఁ డఖిలావనైకవ ర్తిష్ణుఁ డగుచు ”

[5 ఆ - 107 ప]

అని కావ్యాంతమున శ్రీకృష్ణునిశృంగారలీల లేయేసరోజముఖతో నెట్లు సాగినవో విస్పష్టముగా చెప్పుట గమనింపదగినది :-

భోజకన్య యనెడిసరిత్తున రాజహంస మై, సత్యభామ యనెడిశుకాంగనకు కేళిపంజర మై, జాంబవతి యనెడునిశను దీపింప జేయుచంద్రోదయ మై, కాళిందీసరోజిని కిందిందిర మై భద్రాకలాపి నికి ప్రావృడంబుద మై, సుదంతారసాలమునకు పిక మై, మిత్రవింద యనెడువనికి చైత్రాగమ మై, లక్షణ యనుహారయష్టికి నాయకమణి యై పదాఱు వేలమందికామినులనెడికరిణీసమూహమునకు మదోత్కట వారణేంద్ర మై, యఖిలావనైకవర్తిష్ణు డై శ్రీకృష్ణుడు సౌఖ్యాంబు నిధి నోలలాడినాఁ డని కృష్ణునిదక్షిణనాయకత్వమును తిమ్మకవి చక్కఁగా పోషించినాడు.

కృష్ణుడు రుక్మిణీహృదయమున తాను మసలుచు, తనలో సత్యభామకు చోటిచ్చినాఁ డనియు, జాంబవతిజీవితమునకు తాను వెలుంగైనాఁ డనియు, కాళిందీహృత్పద్మమరందము లాస్వాదించు నిందిందిరమైనాఁ డనియు, ఆనల్లనిస్వామి కనిపించినమాత్రముననే భద్ర యానందించెడి దనియు, సుదంతను దంతక్షతాదిక్రియలచే పరవ శింపజేయువాఁ డనియు, మిత్రవింద యాప్రభువును చూడగానే వలపు

లెగజిమ్మోడి దనియు, లక్షణదృష్టిలో మిక్కిలి ఘనుఁ డై యామెకు శోభ కూర్చినాఁ డనియు, మత్తకరి కరేణువులతోవలె షోడశసహస్ర కామినులతో నేకకాలమున నాభగవంతుడు క్రీడించినా డనియు చెప్పి, యేయేసరోజముఖి యాకృష్ణునితో నేయేలీలల విహరింపగోరినదియు నీపద్యమున తిమ్మకవి వివరించినాఁడు.

తాను భగవంతుడుగా గుర్తించినకృష్ణునిసమక్షమున నాయన యిల్లా లైనరుక్మిణితో పారిజాతప్రసూనమహిమను నిర్మముఁ డై చెప్పక తప్పనిసరి యైనపరిస్థితిలో జితేంద్రియుఁడును, దేవర్షియును నైన బ్రహ్మమానసపుత్త్రుడు (నారదుడు) రతిక్రీడాప్రసక్తి తెచ్చినట్లు రచించినతిమ్మకవి తనకు తా నై యాజగజ్జనకునిశృంగారలీలలను కావ్యమున వాచ్యము చేసి వర్ణింపకపోవుటయు - ఐనను - కావ్యమునందలి యంగిరస మైనశృంగారమునకు భంగము వాటిల్లనిరీతిలో తనరచనమును కడ ముట్టజేయుటయు, నామహాకవిమహోదాత్తశృంగారరస నిర్వాహణచణత్వమునకు తిరుగు లేనితార్కాణము. ఇంతలలితముగా - ఇంతవిలక్షణముగా - ఇంతసభ్యతాపరమావధిగా-సహృదయ హృదయ రంజకముగా రసపోషణ మొనరించినకవి యాంధ్రకవులలో మఱి లేఁడు !

## వీరరసము

పారిజాతాపహరణమున శృంగార మంగిరసము కాఁగా వీరము దాని కంగ మైనది.

ఇంద్రుఁ డమరాధిపతి యై యమరావతి నుండగా నతని తమ్ముడై నయుపేంద్రుడు కృష్ణుడుగా నవతరించి ద్వారకలో పదాఱు వేలయెనమండుగురుపడఁతులతో భోగరసైకలోలుఁ డై యున్నాడు. పూలు శృంగారమున కుద్దీపనములు కదా. ఎంతోకాలమునుండి తన యన్నగారిభార్య యైనశచీదేవి యనుభవించుచున్నపారిజాతము నిప్పుడు

తనముద్దులభార్య యైనసత్యభామకూడ ననుభవింపవలె నని యీ తిమ్మనియాశయము. ఇంద్రోపేంద్రులశృంగారపరత్వమే వారియుద్ధము నకు కారణ మైనది. మృదు వైనపూలచెట్టునకై సాగినపోరుకూడ మృదువుగానే తిమ్మకవి వర్ణించెను. ఇంతకాలమును పారిజాతము శచిసొమ్మైనది. ఇప్పు డది తోడికోడలివంతు. ఇది తిమ్మకవిగారిపరిష్కారము.

" వేల్పుఁ బ్రమానియందు వేడుకపడుకూర్మి
సతులకోర్కిఁ దీర్పఁజాలి యపుడు
హరియు హరియుఁ బోరి రన్యోన్యజయకాంక్ష
నసురజీవితాపహారఖగము ''

(5 ఆ - 23 వ)

అని తిమ్మకవి యింద్రోపేంద్రులయుద్ధకారణమును చెప్పియున్నాడు.

పారిజాతము నపహరించుకృష్ణునిసరస నిలిచి సత్యభామ " తా పీరపత్ని యేని యీశచీదేవి తనదుప్రాణేశుఁ డైనమఘువు నిటఁ బంపి సత్యభామావిధేయువలన మరలంగఁ గొనుఁగాక వాసితనము " అని సవాలు చేసినది. " వినుఁడు సురేశ్వరువనపాలకులు ! " అని సేవకమాత్రులుగా నందనవనపాలకులను నిర్లక్ష్యముగా సంబోధించినది. " వార్ధిఁ బొడమినయీదివ్యభూరుహమున కింద్రాణి యెవ్వతె ? యింద్రుండు నెవ్వఁడు ? " అని దేవేంద్రదంపతులకు పారిజాతము ననుభవించుటకు కల హక్కును ప్రశ్నించినది. " తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ డధిపుఁ డై ధరియించె నతఁడె చేకొనుఁ గాక తెకతేర యిది యేమి యొకరిసొమ్మె ? " అని తనమగనికిమాత్రమే పారిజాతతరువు ననుభవించు హక్కు కల దని తార్కికముగా వాదించి యారితేరిననాయ్యయవాదివలె తనవాదమును సమర్థించుకొన్నది. " ఇదె నాదువిభునిచే నీవదాన్యనగంబు నొడియించుకొని యేఁగుచున్నదాన " అని తెగబడి వీరమును ప్రదర్శించినది. శచీదేవివీరపత్నీత్వమును పై విధముగా సవాలు చేయుచు సత్యభామపలికినగర్వోక్తులు విన్నవనపాలకులు

నివ్వెఱవోయి వెళ్లి దేవేంద్రుని కావిషయమును వివరించిరి. ఆయింద్రుఁ డొక్కఁడు నుండగా చెప్పిరా? లేదు. శచీసమక్షమున చెప్పిరి. ఎంతబలహీనుఁ డైనను భార్యముందు తనమగతనమును నిరూపించుకొనవలె నని తాపత్రయపడునే- వజ్రియంతటివా డట్టిపరిస్థితిలో విక్రమించుటకు వెనుకాడునా? పాకశాసనుఁడు రౌద్రాకారుఁ డైనాఁడు. "సత్యాగర్వభారంబు దివ్యనగంబున్ విడిపించి వత్తు నని బీరములు వలికి, "నీ కింతమాత్రన విన్నంబడ నేల?" యని శచీదేవికి ధైర్యము చెప్పి యింద్రుడు సమరోన్ముఖుఁ డైనాఁడు. ఆ వెడలునపుడు "పోదు నిదె" యనుట యింద్రునికి కలుగనున్నయపజయమును సూచించుచున్నది.

"తా నఁటె పారిజాతవసుధారుహముం గొనిపోవువాఁడు? క న్గానఁడు యాదవుం" డనుచుఁ గన్నులు వేయును జేవురింప తక్కిన వైశ్వానరాదిదిక్పాలకులదిక్కుఁ జూచి కులిశమ్ము కరమ్మునఁ బూచి పట్టినాఁడు. ఆబద్ధఖలీనకాశ్వచయ మై, యందూపరిభ్రంశితద్విప మై, యపరాభూతభుజావలేపభటవీరాలాప మై జంభవైరిపురము మంథర క్షుభితవార్ధింబోలె ఘూర్ణిల్లిన" దఁట! ఇందు వీరులయుత్సాహము చక్కగా వర్ణింపబడినది.

"అత్తఱిం దత్తరంబునం దత్తడుల బల్లింపకయ నెప్పరంబున నెక్కంబోవువారును, "గృష్ణుండు కృష్ణుం" డని పౌనఃపున్యంబుగాఁ బలుకుచు, "నెక్క డెక్కడ?" నని యడుగువారికిఁ దెలివిపడ నుడువం దడవు లేక - "పారిజాతంబు పారిజాతం" బని పలుకుచు రణసంభ్రమంబునం బరిభ్రమించువారును" నై యమరు లున్నా రఁట! అనుకొననియాపద వచ్చి నెత్తిపై బడినప్పటియారణసంభ్రమ మింతచక్కగా సహజముగా చిత్రించినది తిమ్మనగారిలేఖిని.

అకాలనిద్రకు చిక్కి యింద్రునివీట ఘంటాలఘుటలు కదల కుండుటయు, హయములు కొంతతడవు పల్యాణములు ధరింపకుండు

టయు, ఆసవమత్తు డై నయమృతాంధసుఁ డొకఁడు మణివిటంకమున తననీడనే పరవీరు డని భ్రమించి వ్రేసి బాహాసిని విభిన్న మొనర్చు కొనుటయు, నొకయమరవీరునివింటినారి యకారణముగా తెగుటయు— నిత్యాద్యమంగళసూచన లెన్నో యింద్రుని సేనలో సంభవించి ముందు ముం దింద్రునికి కలుగనున్న ఘోరపరాజయమునే సూచించినవి.

ఇంద్రుడు భార్యదగ్గర బీరములు పలికినట్లే యింద్రభటు డొక్కడు "ఖగకులనాథునిసోగపసిండిఱెక్క లుక్కునఁ గొని కర్ణపూర మునకున్ రభసంబునఁ దెత్తు" నని తన కడ్డు నిలిచినభార్యతో బీర ములు పలికి, యలనాఁటియుత్తరకుమారుని దలపించినాడు.

"చండస్థూలరదద్వయద్వయమహాస్తంభంబులం బూని యు
ద్దండస్ఫారపతాకికాసహిత మై దానచ్ఛటాచిత్రవ
ద్గండాభోగవిశాలకుడ్యములచేఁ గన్పట్టునద్దేవతా
శుండాలం బరుదెంచె సంగరరమాశుద్ధాంతసౌధం బనన్"

(4 ఆ - 78 ప)

ఈపద్యములో ఆమత్తగజముఠీవియు, చండత్వమును నచ్చు వడినవి. సాధారణముగా మత్తేభము మత్తేభముగానే నడచుట సహజము. కాని – ఈయుద్ధఘట్టములో మత్తేభము గమనమున శార్దూల మైనది!

"ఏడుకరంబులన్ వరుస నెత్తినతోమరశక్తి" చూపాదు లచే నాభ్రమేడిత మైనకాంతితో నుదగ్రమూర్తి యై హుతవాహు డరు దెంచినాఁడట.

"బాహాసంభృతకాలదండజనితస్ఫారస్ఫులింగాళికిన్
సాహాయ్యంబు ఘటించి కోపరసఘూర్ణన్నేత్రదీప్తుల్ పయో
వాహాంతర్గతవై ద్యుతప్రభలతేవం జూప వాహద్విష
ద్వాహోత్తంసము నెక్కి పోరి కడరెన్ వైవస్వతుం డుద్ధతిన్"

(4 ఆ - 80 ప)

మహోద్ధతముగా సాగినయీశార్దూలము అంతకునిరుద్ధతిని కన్నులకు గట్టించుచు వీరరసస్ఫోరక మై నిప్పులు చెఱగుచున్నది.

" భీమాకారులు కామరూపధరు లాభీలక్రియాపాదనో
ద్దాముల్ పుణ్యజనుల్ భజింప గుమద స్తంబేరమం బగ్రతో
భూమిం బల్లనఁ గట్టి రా నసిరుచిస్ఫూర్తుల్ విజృంభింప సం
గ్రామేచ్ఛం బలలాశి యేఁగె మనుజస్కంధాంతరారూఢుఁ డై "
(4 ఆ - 81 ప)

ఇట్లు నిర్ఋతియుద్ధాటోప మెంతో భీకరముగా చిత్రింపబడినది.

" ఆననసీమఁ గ్రోధజనితారుణదీధితిఫాలభాగనే
త్రానలకీలలం బెనుప...."

రణకౌతుకంబున నీశానుడు వచ్చెను. సహజముగానే ఫాలాక్షుడు చండ ప్రచండుడు. ఇకనాయనయంశ కలయీశానుడు రణకౌతుకముతో రణ రంగమునకు వచ్చిన – మఱి చెప్పవలెనా ?

" అర్వారోహణచాతురీవిలసనాహంకారదుర్వారతన్
సర్వాంగీణము లైనమైమఱువులన్ వల్గత్కృపాణంబులన్
గర్వాలాపవిడంబముల్ మెఱయ జోకం జిత్రసేనాదిగం
ధర్వుల్ వజ్రికిఁ దోడు సూపిరి పురద్వారప్రదేశంబునన్ "
(4 ఆ - :8 ప)

ఇందు వీరులయుత్సాహము సముచితముగా వర్ణింపబడినది.

అంగుళిత్రగోధాకలనంబుతో యదువతంసుడు (5 ఆ – 4 ప) శార్ఙనిబద్ధశేషనిర్మోకనిచోళముం దిగిచి రోషనటద్భ్రుకుటీవిలాసు డై తూపు లొక్కట నిగిడింపదొడంగినాడు. తనతో తలపడినశత్రువీరులపై నొకయపహాసరేఖను విసరినాడు. అది మహావీరులకే చెల్లినది.

విక్రమస్ఫూర్తి మైనఖగరాజచక్రవర్తి యమరాస్త్రఖండము లను పక్షములతో తూల్చి, చంచుపుటమున సింధురములను పొడిచి

మెత్తి, కృష్ణునిశరములకన్న ముందే వెళ్ళి లక్ష్యములను దళించి, ఒక్కఁడె యయ్యెను పెక్కుగతుల తోఁచి హరిభటరథాగ్రములపై తోఁచి దివిజవిరుదధ్వజములను నఖముఖములచే గండ్రలుగా చేసెను. శార్ఙ్గి బాణవర్ష సమ్మర్దదుర్దినవ్యాప్తిచే కృష్ణు నెదిరించుచున్నద్ద అహిమకరులును కానబడలేక తేజోవిహీను లైరి.

చుక్కలరాణి వాసముల పోయగపుంజనుదోయిత్రెక్కన చిక్కన యైనయక్కును బాణపరంపరాహతిచే వ్రక్కలు చేయగా కాఱురుధిరమున దోఁగినరేవెలుంగు అభ్యుదయ మేదియు రణరంగమున కెం పెక్కినచాయతో తోచెను.

భవరోగవైద్యుఁ డైనయంబుజోదరుని డాసినంతనే యక్షభర్త యపగతాసాధ్యగదుఁ డై, రుద్రులు నిర్ముక్తశూలు లైనారు.

కృష్ణుని సవ్యాపసవ్యముక్తనిష్ఠురాస్త్రములు నిగుడగా వైవస్వతునికిని, ఆయనవాహనమునకును శృంగభంగ మై వారు లఘుత్వము నందిరి. నిర్ఋతి దళితశాతకృపాణుఁ డయ్యెను. అగ్ని నిలువు నీ అయ్యెను. భయపలాయనవేళ పవమానుని శాత్మజవసత్త్వములకల్మి సఫల మయ్యెను. డాఁగికొనుటకు నుదధి కలదు కనుక వరుణున కుదధినాయకభావ ముపకరించెను.

కృష్ణునిపరాక్రమమునకు నిలువలేక పాఱిపోవు-మరు లింద్రుని ప్రోత్సాహమున వెనుదిరిగి రాఁగా నున్మదమాతంగఘటాతమశ్చయనిశమ్మన్య మైనయాసైన్యమును కంసారి తనగదచే శార్ఙ్గముచే రథాంగకముచే హింసించి తూలించెను. మధుసూదనుఁ డమ్మరి బోసి యింద్రునిభుజాక్రోడము గాడ నేసెను. సురరాజు కృష్ణు నీరేడుశరములచే, ఖగరాజును ముప్పదిరెంటిచే నేసెను. అంతట తక్కినదిక్పాలకులును ప్రయోగించినశరములను త్రుంచివేసి, కృష్ణుడు శార్ఙ్గసంజనిత మహోగ్రభల్లములచే నమరుల సందఱను జర్జరితాంగులను జేసివైచెను.

మురహరబలహరు లొండొరులతూపుల నిట్లు కప్పబడగా గరుడోరగ ముఖ్యులు వారినిద్దఱిని కాంచజాల రైరి. కృష్ణుడును జిష్ణుడును పోరుచో నలుగుల పొడమునగ్నికణముల సోకి పైగఱులు వాలిసియు, తొంటివేగ ముడివోక శరసంఘము లక్ష్యము తాకుట చూచి సురసిద్ధసాధ్యులు విస్మితు లైరి. అయిరువురియంపగములును మింటికి పందిరి కట్టి పరస్పర ఘర్షణచే మండి చూర్ణము కాఁగా చూపఱకు ముదమైనది.

"అలనాఁటినన్ను మఱచితివా ? నీ కిదే తగినయాజ్ఞ నిలు" మని సురేంద్రుడు పులుంగులఁజేని నలుగులపెనుగూట చిక్కనట్లు చేయగా నలుకతో కంసవిభేది నందకముచే నాయస్త్రములు త్రుంచి దృఢముష్టిఁ గూర్చి బలుతూపులు విడిచి బలభిద్భద్రేభకుంభమును వ్రక్కలుగా నేసెను." ఇతని కితడే సాటి - ఈతని కీతడే సాటి" యని చారణసిద్ధసాధ్యులు ప్రశంసించుచుండగా రణాశనమాని కుతుకరసాతిరేకమున కుంచియ వీచి నటించినాడు.

కినిసి బిడౌజుఁ డేసినయాగ్నేయాస్త్రము కృష్ణునియూర్పునను, సౌరాస్త్రము శౌరివలచూడ్కియందును, బ్రహ్మాస్త్రము మురాంతకుని నాభియందును, పాశుపతాస్త్రము హరినిజార్ధతనువునను డిందిపోయినవి. అఖిలాత్ముఁ డైనయీశుని గెల్వఁబూనినయింద్రునియత్నము లిట్లు విఫలము లైనవి.

ఇంద్రునిశింజినిని, భల్లమును శ్రీహరి తనతూపులతో నఱికి, ఱెక్కమును పడగొట్టెను.

"భుగ్నభ్రూకుటిదుర్ముఖుం డగుచు నాస్ఫోటించుచున్ లోనిరో
షాగ్నిజ్వాలలు బాహ్యనిర్గతము లైన ట్లుత్కటారణ్యని
ర్మగ్నుం డై కనుపట్టులోచనసహస్రం బొప్ప మౌర్వీలతా
భగ్నుం డై నశరాసమున్ విడిచి జంభద్వేషి యత్యుగ్రతన్"

(5 ఆ - 32 ప)

క్రోధారుణిత నేత్రసహస్రు డై నయాఖండలునిభయంకరాటోపము నీప ద్యమున నచ్చుపడునట్లు రచించినాడు తిమ్మకవి.

"ఏటుఁడ వాదు దీనిబలుఁ వ్రేటున కోరిచి నిల్చితేని" అని దేవేంద్రుఁడు కులపర్వతములకు కుంటితన మొదవించినవజ్రాయుధ మును శ్రీకృష్ణునివక్షమును గుఱి చేసి వదలగా నది

"శతధారాజాయమానజ్వలనముఖశిఖాచ్ఛాదితాభ్రస్థలం బై
వితతాభీలధ్వనిశ్రీ విలసవబధిరోద్విగ్నదిగ్వారణం బై
కృతలోకాలోకముఖ్యాఖిలగిరిచలనక్షి ప్తభూమండలం బై
పతయాఖద్వాదశాత్మప్రకరఖరకరౌపమ్య మై యేఁగుదేరన్"
(5 ఆ-35 ప)

దీర్ఘసంస్కృతసమాసములతో నోజోగుణప్రధాన మైనయీమహాస్రగ్ధర వజ్రాడంబరమును కన్నుల గట్టించుచున్నది.

కంసారి తార్క్ష్యుని నడ్డముగా త్రిప్పి రవితేజోదుస్సహస్ఫూ ర్తి మై తన్ను డాసినశతకోటిని కేల శతపత్రక్రీడఁ బట్టగా - విద్యాధర, గంధర్వ, ఖచర, గరుడ, కిన్నర, పన్నగ, సిద్ధ, దిగధీశులు దిక్కు తోచక పరువెత్తిరి.

ముందల పట్టినట్లు తనముఖ్యతరాస్త్రమును గొన్నయుపేం ద్రుని కింద్రుడు మోకరిల్లి, తనతప్పు క్షమింపు మని వేడుకొన్నాడు.

"లెమ్ము సురేంద్ర! నీవలన లే దొకతప్పును; నీమఱంద లీ కొమ్మ వదాన్యభూరుహముఁ గోరినఁ దెచ్చితిఁ గాని; కొమ్ము నీ సా" మ్మని వజ్రమిచ్చి, పారిజాతమునుసైత మీయఁదలంపగా నహంకార మంతయు నంతరించి వివేకోదయ మందినయింద్రుడు

"సొమ్మనవెద్ది ? యే ననఁగ సొమ్మన కెవ్వఁడఁ ? గర్త వీవు నీ
సొ మ్మఖిలప్రపంచమును ; భూరకులమ్మ నలంకరించునీ
వమ్మహి నుండునంతకు ననన్యదురాపము పారిజాతభూ
జమ్మను మందు"

నని సురతరువును శ్రీకృష్ణుని కర్పించి చనినాఁ డింద్రుఁడు !

వేల్పుమ్రానియందు వేడుకపడుకూర్మిసతులకోర్కెఁ దీర్చుటకై యన్నదమ్ము లయినయింద్రోపేంద్రు లొనర్చినయుద్ధ మీవిధముగా ముగిసినది !

వీరవిజృంభణము తొడ చఱచి ముం దడుగు వేయునట్లు రచించినయీపట్టున ముద్దుపలుకులకు పే రొందినతిమ్మనగారి లేఖిని చేవ దేరుట గమనింపదగినవిశేషము. అందందు గాఢబంధమును, సమాస గుంభనాటోపమును లేకుండగనే వీరరసస్ఫోరకముగా రచింపగలిగినదిట్ట తిమ్మకవి. నాయకపరముగా వీరమును, "వినుఁడు సురేశ్వరవనపాలకులు" ఇత్యాదిసంభాషణ మొనరించుపట్టున నాయిక యైనసత్యభామ పరముగా రౌద్రభయానకాదులును స్ఫూర్తిమంతముగా నున్నవి. వీర మెంతగా విజృంభించినను అది శృంగారమున కంగముగా మాత్రమే యొదిగి యుండునట్లును, వీరాంగముల రౌద్రభయానకము లిమిడిపోవునటును రచించినసాటి లేనిమేటి తిమ్మనార్యుఁడు.

శృంగార మంగిరసము లైనకావ్యములలో వీర మెచ్చట నైన గోచరించినచో దాని నంగముగాఁ గైకొనవలసివచ్చును. పురుషార్థసాధనాత్మక మైనయుత్కటోత్సాహముమాత్రమే అందు వీరముగాఁ బరిగణింపఁబడును.

ప్రబంధయుగము శృంగారరసప్రధాన మగుప్రబంధములు పెక్కులు వెలసినకాలము. ఈయుగమునం దుండిన "పారిజాతాప

హారణ" మనుప్రబంధమును రచించిననందితిమ్మయ్య తనకావ్యమున శ్రీకృష్ణుడు పారిజాతవృక్షమును హరించి, యింద్రునితో చేసినయుద్ధ ఘట్టమున యుద్ధవీరమును చక్కగాఁ బోషించినాఁడు. "వినుఁడు సురేశ్వరవనపాలకులు! ...." (పారిజాతాపహరణము - 4 ఆ - 59 ప) అను పద్యము దీని కొకయుదాహరణముగా గ్రహింపవచ్చును.

శ్రీకృష్ణునివీరమునకు హేతువు సత్యభామకోపనివృత్తికై యతఁ డొనర్చినప్రతిజ్ఞయే. ఈ యుద్ధమువలన సాధింపఁబడినది సత్యభామామనఃప్రీతి. అందువలన నాతనియుద్ధవీరము కామపురుషార్థ సాధక మై, ధర్మబద్ధ మై వరలుచున్నది. అట్లే రామరాజభూషణవిరచితవసుచరిత్రమున శృంగారమున కంగ మగుబలవీరము - వసురాజు కోలాహలుని గోట మిాటుటయందు వర్ణింపబడినది. - అని డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యంగారు [1]

"అంత ననంతవేగభుజగాంతకుఁ డమ్మహికాంతుఁ డాశ్రిత
స్వాంతము సంతసిల్ల ........ మహాద్రి నఖంబున
మీఁటె నభ్రవిభ్రాంతము గాఁగ దుందుభికబంధము మీటిన
రాముకె వడిన్"

అనుపద్యము నుదాహరించుట గమనింపదగినది.

1. వీరరసము - అనుగ్రంథము. పుటలు 365, !
కర్త :- డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యంగారు.

# 9. పాత్రపోషణము

## (అ) సత్యభామా పాత్రచిత్రణము

అతిలోకరూపయౌవనలావణ్యసీమయు, నరివీరభీకరశౌర్యోద్దామయు నైనసత్యభామ శృంగారరసస్వరూపుఁ డగుశ్రీకృష్ణునిప్రేమసామ్రాజ్యమున కధిదేవత యైనయదృష్టవంతురాలు. నంది తిమ్మనగారిహృదయనందనమున విరబూచి తరతరముల తెలుగురసికులతలపులలో వాడనివలపులు విరజిమ్ముపారిజాతప్రసూన మామేమ.

శ్రీకృష్ణుడు చేపట్టినపదారువేలయెనమండుగురుతరుణులలో కులరూపభర్తృవాల్లభ్యములచే లక్ష్మ్యంశసంభూతురా లైనరుక్మిణితో పోటీకి నిలువగలిగినది సత్యభామ యొక్కతెయే.

" చక్కనిదాన నంచు, నెలజవ్వని నంచు జగంబులోనఁ జేరెక్కినదాన నంచుఁ బతి యెంతయు నా కనురక్తుఁ డంచుఁ దానిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య "- యని యామె పరోక్షమున - సవతి యైనరుక్మిణిసమక్షమున తెగడినకలహాశనుడే " పతి నీ వై విహరింపఁగా జనము సంభావింపఁగా బంధుసంతతి నిన్నుం గొనియాడఁగా సవతికాంతల్ సూచి లజ్జింపఁగా నితరస్త్రీజనబుద్ధి దీవనలు నీ కే మిచ్చెదన్ మానినీ! " అనియు, " అని కైనం బతి నిన్నుఁ బాసి చనెనో? ప్రాణంబు ప్రాణంబుగా నిను మన్నింపఁడొ? నీమనోరథములన్ నెయ్యంబుతోఁ జేయఁడో? చనవుల్ నీవలె నెవ్వరేఁ గొనిరొ? నీసౌభాగ్య మింతంతయే? నిను బోలంగల రబ్జగంధు లన వింటే యొందు సాత్రాజితీ! " - యని ప్రశంసించుటనుబట్టి సత్యభామ సౌభాగ్యవైభవము స్పష్టము కాగలదు. రుక్మిణీమందిరమున నున్న శ్రీకృష్ణుని సందర్శించి నారదుడు స్వర్గమునుండి తెచ్చినపారిజాతప్రసూనమును కానుక పెట్టగా రుక్మిణి యెట్టయెదుట నున్నను మాధవుని

తలపున నిలిచినది సత్యభామయే. చెంతనే యుండి కంటిచే చూడబడిన రుక్మిణికన్న దూరముగా నున్నను కృష్ణునితలపుచే చూడబడిన సత్యభామయే కృష్ణుని కత్యంత మాప్తురా లని వేఱుగా చెప్ప నవసరము లేదుగదా.

"ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నే మంచు నూహించునో మది సాత్రాజితి" యని మనసులో జంకుచునే తా నాసమయమున రుక్మిణీసౌధమున నుండుటచే గత్యంతరము లేక నారదునికనుసన్నచే నాపూవును వెన్నుఁడు రుక్మిణికే యిచ్చినాడు. దీనినిబట్టి సత్యభామ కృష్ణునిమనసు నెంతగా నాకట్టుకొన్నదో స్పష్ట మగును.

మహామహిమాన్విత మైనపారిజాతప్రసూనమును రుక్మిణి ధరించుటచే "సవతులు వచ్చి యామెచరణసారసయుగ్మము నాశ్రయింతు" రనియు, ధవుఁ డటు లేనికూర్మి జవదాఁటక యామెపలు కాదరించు ననియు సత్యభామ కప్రియము లైనమాట లాడి, నారదుడు "ఇన్నిదినంబులున్ సవతు లిందఱలో నల సత్యభామకన్సన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదు డై యన విందు" ననుటనుబట్టి సపత్నీసహస్రములో సత్యభామయాధిక్యము స్పష్ట మగును.

"తనశృంగారవనములోన గిరిపొంత చక్కఁగా దిద్ది తీర్చిన పూఁదేనియయేటికాలువదరిని చెంగల్వపుప్పొళ్ళు నించినచంద్రోపల వేదిపై బోఁటితో సరసగోష్ఠి సలుపుచు శౌరిగుణములు వాక్రుచ్చి వర్ణించుచు, వనజాతాయతనేత్ర యైనసత్యభామ పాఠకలోకమునకు ప్రప్రథమముగా దర్శన మిచ్చుచున్నది.

సత్యభామ కృష్ణునిభార్యలందఱిలోను సౌందర్యవతి. మానవతి. మహోన్నియసౌభాగ్యవతి. అలికులరావములు, కోకిలలకలకలనాదములు, కమ్మనితమ్మికొలంకుతెమ్మెరలు పొలయుచుండగా ఆశృంగారరసాధిదేవత తనచెలికాడు దరి లేడని తపించినది. ఆమె పతిని విడిచి

యొక్క క్షణమైన నుండలేనిది. దక్షిణాంసచూచుకనయనప్రకంపగుణములు తన కమంగళసూచన లని విశ్వసించి "ప్రాణనాథుఁ డొండొక చపలాక్షిఁ గూడి నను నొల్లనిచెద్దయము లేమి చేసెనో" యని యనుమానించినది. తా ననుమానించినంతయు నైన దని తనచెలికత్తె వచ్చి రుక్మిణీసౌధవృత్తాంతమును వివరింపగా సత్యభామ వ్రేటు వడ్డయురగాంగనవలె నేయి వోయ భగ్గన దరికొన్నభీషణహుతాశనకీలయో యనునట్లు మండిపడినది. కోపముచే నామెకన్ను లెఱ్ఱవడి యామె కంఠము గద్గద మైనది.

కలహాశనుఁ డాడినమాటలను చెవి యొగ్గి విన్నకృష్ణుని గోపికావల్లభు డని యామె నిరసించినది. మానవతీలలామయు, నుత్తమ క్షత్రియాంగనయు నైనతనవల్లభుడుగా కాక - గొల్లభామలవెంట బడు నొకయవివేకిగా, నరసికుడుగామాత్రమే హరి ప్రవర్తించినాఁ డన్న యావేదన యీమాటలలో నున్నది.

"అతులమహానుభావ మని యాకలహాశను డవ్విరిఁ దానొకపెద్ద సేసి యచ్యుతునకు నిచ్చకం బాదవ నూడిద యిచ్చిన నిచ్చెఁ గాక - తా నతడు ప్రియంబు కల్గునెడ కర్పణ సేసినఁ జేసెఁగాక - ఆమతకరివేలుపుందపసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్ ?" అన్న దామె. దీనినిబట్టి - సవతిపై రెత్తుటకైన నిచ్చగింపనిసపత్నీమాత్సర్యమును, "మమ్ము" అని తన్నుగూర్చి తానే చెప్పికొనుటలో ఆత్మాభిమానబంధుర మైనయామెరాజసమును తెల్ల మగును.

"కలహామె కల్యాణ మని జగంబులవెంట మెలఁగెడు మానిముల్లమాటల కాలోకజ్ఞురా లంతగా బాధపడలేదు. వల్లభుఁ డతనిని వారింపనందుల కే యామానవతివిచారము. మనబంగారము మంచి దైన గదా కమసాలిని నిందించుట ? పసులకాపరి యైనకృష్ణునిలో వనాగరకతయు, నరసికతయునుమాత్రమే కాదు - ధూర్తత్వమును

పుష్కలముగా నున్న దనుకొన్న దామె. కనుకనే "ముని యేమి సేయు ? రుక్మిణిం గొనం గారణ మేమి ? ధూర్తగోపాలుండు చేసిన చెయిద మేమి చెప్పుదు ?" నని ముక్కున వ్రేలు వైచుకొన్నది. ప్రాణ మైనమగం డట్లయినాం డని యామెమన మెరియుటతో - గాలి యెటు వీచిన నటు పోవుమగజాతి నంతటిని నొక్కసారిగా దుయ్యబట్టినది. శరదంబుదచలచిత్తులై తా ముండియు - తరుణులతగులములు నమ్మం దగ దనుపురుషులను నమ్మరా దనునిశ్చయమునకు వచ్చినది. ఇన్నిదినములును వల్లభుడు కన్నులం గప్పుకొనగా గౌరవముగా బ్రతికినతా నీనాడు వన్నెయు వాసియును గోల్పోయి - తనముం దిన్నాళ్లును తలలు వంచినయాసవతులు తల లెత్తి తన్ను జూడగా - సన్నల జాయలం బలుకంగా - సైచు టె ట్లని యామె యారాటపడినది. ఇంతయవమానము జరిగినను చావక బ్రతికి యుంటినే యని వ్యథ చెందినది. "మానమె ప్రాణాధికంబు" గా భావించినమాననీయ కనుకనే "ప్రాణము లెంతతీపోకో !" యని యబ్బురపడిన దామె !

ఆమెదృష్టిలో రుక్మిణి యొకకామిని. - చపలాక్షి - మఱి తానో ? కామకళంకితము కానిస్వచ్ఛ మైనప్రేమకు పరమావధి ! ఆ "రుక్మిణీకామినిమీఁదటం గలుగగారవముం గృపయుం బ్రియంబుం దా నేమియుం గానసీక - యిన్నాళ్లును తనకన్ను గప్పి నాటక మాడిన మురదానవభేదికృత్యములు మెచ్చవలదా ?" యనుకొన్నది. ఆనాం డాకృష్ణుడు మురిదానవభేది - యీనాఁడో ? తనమగవాం డనుకొన్నవాఁడు పగవాఁడువలె ప్రేమరసపూర్ణ మైనతనహృదయమునే భేదించుచున్నాడు ! భేదించుట కలవాటుపడినవాఁడు స్వపరభేదములను జూడఁ డని యామెనిర్ణయము. కనుకనే ఆకృష్ణుఁ డామెకు తనప్రాణప్రియుడుగా కాక - మురదానవభేదిగామాత్రమే కనిపించినాడు !

ఈశరదంబుదచలచిత్తుడు - ఆచపలాక్షి రుక్మిణికి - నారదుడు తెచ్చినలతాంతము నిచ్చినాడు - ఈజరిగినయవమానము సరే -

“ ఇంక నెట్టివి కనుంగొన నెమ్మోయి నున్నదాననో ?” అని యామె మనసు విలవిలలాడినది.

“ నరకాసురసంహారవేళ ప్రాణములకు తెగించి, పతితో రణరంగమునకు తరలిపోయి, ఆయనకష్టములలో పాలు పంచుకొన్నది తాను - కుడిచి కూర్చుండి సుఖములలో పాలు పంచుకొనుచున్నది యా రుక్మిణి ! ఈవిషయమును “ ఆనరకాసురదమనుఁడు తా నెఱుఁగఁడా ? భోజకన్య తా నెఱుఁగదా ? పూనుకొని మేలుగీళ్ళకు లో నయి విహరించువారిని లోక మెఱుఁగదా ? ” యని సత్యభామ తనయౌన్నత్యము నొక్కసారి వెనుదిరిగి చూచుకొని కృష్ణునికృతఘ్నతకు కుంది పోయినది. అప్పటి కారుక్మిణియింట నుండుటచే తనమగ డొక్క లతాంతము నామె కిచ్చినాఁడే యనుకొందము - అంతమాత్రముననే సవతు లందఱును తమవైభవమునకు తిలోదకము లిచ్చి, వివేకమునకు వీడ్కోలు చెప్పి ఆరుక్మిణిని భజించుటకై పోవలెనా ? యని యామె యాశ్చర్యపడినది. అది యొకగొఱ్ఱెలమంద - తా నట్టిది కాదు - “ వాసియు వన్నెయుం దగవు వైభవముం జలమున్ వివేకమును ” గలది. కనుకనే ఆసవతు లందఱివలె తాను రుక్మిణియింటికి పోవక ఆమెనే తా నున్నచోటికి రప్పించుకొని ఆమెపై తనదే పైచేయిగా నుండవలె నని సత్యభామ పంతగించినది !

“ కలకాల మొక్కగతిఁ బూసలలో దారంబుమాడ్కి సతి మదిలోనన్ మెలఁగెడుపురుషుఁడు గలుగుట తొలిజన్మమునోము ఫలము ” అనియు, తాను కొఱనోములు నోచుటచేతనే యి ట్లయిన దనియు నామె పరితపించినది.

తనప్రాణవిభుడు కలలోననైన నవ్వులకైన తనమాట జవ దాఁట వెఱచువాఁడు. ఏపదార్థమును తనయెదుట బెట్టకమున్న యెవ్వారికిని నొసంగనివాడు. చెలులు తనతో నేమి చెప్పుదురో యని వారికి

లంచము లిచ్చువాఁడు. తోడిచేడియలు తనతోడివంతులకు వచ్చుట సహింపనివాఁడు. అరమరలు లేనికూరిమి ననఁగిపెనఁగి, కొదలు తీఱని కోర్కులఁ గూడిమాడి, కపట మెఱుఁగనిమమతలఁ గలసి మెలసి యున్న వాఁడు. అట్టివాఁ డానాఁడు తద్భిన్నముగా ప్రవర్తించినందుల కామె నివ్వెఱవోయి నెవ్వగఁ జెందినది. కృతకాద్రికందరాకేళీనిగూహన వేళాపరస్పరాన్వేషణములును, పోషితమాధవీపున్నాగపరిణయోత్సవ కల్పితానేకసంభ్రమములును, చాతురీనిర్జితద్యూతపణాదానకలితచేలాంచలాకర్షణములును, సాయంసమారంభచక్రవాకద్వంద్వవిరహావలోకనవిభ్రమములును, సాంద్రతరచంద్రికాకేళిచంక్రమములును, విధుశిలామయవేదికావిశ్రమములును, ఫలకచిత్రికనిజరూపభావనములును– తనప్రాణవల్లభుఁ డారుక్మిణిమాయలో పడి మఱచినాఁడో యేమో !" అని యనుమానించి సత్యభామ తనపూర్వవైభవమును దలచితలచి అది యీనాడు కొఱవడిన దని క్రుంగిపోయినది.

"పతిని ప్రాణసదృశబంధువుగా, దైవముగా, నేఁడుగడగా నమ్ముకొన్నయాయిల్లాలు – ఆపతియే కడు మేర తప్పినచో నింక కుల కాంతలకు గతి యే మున్న ?" దని ఖేదించినది. ధన మిచ్చి పుచ్చుకొన్నను నోర్చుకొనవచ్చును కాని – మగఁ డింతులకు చన విచ్చి పుచ్చుకొన్నచో మగువ యిఁక మనరా దని యామానవతి మనసులో మలమల మఱఁగిపోయినది.

ఈవిధముగా వగలఁ బొగులునామానిని దెబ్బతిని హరిచందన కోటరమున కేఁగు నాగతరుణివలె కోపసదనమునకు పోయినది. మగనిపై కినుకఁ బూనినయమ్మానిని తన కిష్టమైనకావివన్నెచీర విడిచి మాసిన తెల్లనిచీర కట్టుకొన్నది. (తెల్లనిచీరపై మాపు స్ఫుటముగా కనిపించును కదా!) మౌనము వహించి, భూషణములు దిగద్రావి, వాసెనకట్టు కట్టి, నిడువాలిక కస్తురిపట్టు పెట్టి, జలదాంతచంద్రరేఖాసదృశాంగి యై, గాఢమనోజవిషాదవేదనచే దివ్వెయు, సవ్వడియు లేనిచీఁకటింటికడ

కంకటిపై పొరలినని. అసమశరవేదన కగ్గ మై కంకటిపై ప్రాలిన యాతీవబోఁడి ప్రచండభానుకిరణప్రసారమునకు వాడి పోడిమి తఱఁగి పుడమి ప్రాలినతీఁగవలె నున్నది.

మనకపుపాముకాటువలె సపత్నీమాత్సర్య మనువిస మగ్గలింపగా - నాబిసరుహపత్రలోచనకు పెల్లగు మోహమును, కంపమును స్వేదమును, విన్నబాటును, పరితాపవేదనలును కలిగినవి. విషాదము రూపు దాల్చిన ట్లున్నయా మెమన సంతయు చీకాకువడి వెడవెడ కన్ను మూయుచు, కను విచ్చుచు, నగుచు, తల యూచుచు, పాన్పుపై పడుచు, నుస్సు రని లేచుచు, తడబాటుతో దానిని మించినపంతముతో కోపవేగముచే నగ్గల మైనమనోజబాధలకు గుఱి యై, మదపుటేనుగు తొండమున చిక్కినపద్మినియో యనునట్లు పద్మిని యైనసత్యాభామ సౌకుమార్యము వసివాడి, చెన్ను తఱిగినది. ఈవిధముగా కోపాగారమున నున్నసాత్రాజితి యితరవ్యాపారము విడిచి దుర్భరసంతాపదోదూయమానమానస యైనది.

రుక్మిణీసౌధవృత్తాంతమును ఆచెంతనే పొంచి వీక్షించివచ్చిన సత్యభామచెలికత్తె తనపై లేనిపోనినేరము లేమేమి కల్పించి చెప్పెనో యని యనుమానించుచు, కృష్ణుడు నారదమహర్షి చెంత ప్రద్యుమ్నునుంచి (సత్యభామావిధేయుడు కనుక) నరదము నెక్కి కేతనపటాంచల చంచల మైనతాల్మితో తురగజవమును గడచి ముందునకు దూసికొని పోవుతత్తరముతో, తిరుగుచున్నబండికండ్లవలె పరిభ్రమించు మనస్సుతో సత్యసముదంచితకాంచనసౌధవీథికి చనుదెంచి, యలబలము లేనినగ రెల్ల నరసి చూచినాడు. కృష్ణుడు వచ్చునప్పటికి సత్యాసౌధమున ననునిత్యము సహజముగా నుండుకోలాహలవైభవ మానాఁడు లేకుండుట సత్యాగ్రహపరాకోటిని సూచించును.

సత్య కేవరైన పారిజాతపుష్పవృత్తాంత మెఱిగించి రేమో యని యనుమానించుచు, కోపగృహమును జేరి, ముసుంగిడి యున్న

స్త్రాజిత్తనయను జూచి, మాధవుడు మాయ యచ్చ్వడగా మంత నములతో జంకెనవాడిచూపులతో, చేసన్నలతో, సత్యాసఖులను దగుల్పడఁజేసి, తరుణిదరిఁ జేరినాడు. మధ్యందినభానుమండలకరా వళిచే వసివాడినతీవవలె నున్నయాతీవబోణిని జూచి కృష్ణుడు విస్మితు డై సత్యపిఱుందనుండి మందాలసలీలమై విసరుభామినినుండి తాళ వృంతము నాదటఁ గైకొని – ఆమెయందలిపంచసాయకశిఖని దరికొల్పు రీతిగా తాను విసరినాడు. తాను సత్యభామాదాసుడ నని నిరూపించు టకు కృష్ణు డీపని చేయగా – ఆయనతో వచ్చినపారిజాతకుసుమాగత నూతనదివ్యపరిమళము లాగదియం దంతటను ప్రసరింపగా – "తావి యిది విస్మయ" మని ముసుంగు తొలగించుకొని యాకాంత యాయే కాంతగృహము నల్గడలు నారసి, తాళవృంతముతో తనకు వీచుచున్న కాంతుని జూచి, బాష్పకళికాతరళీకృతలోచనాంత యైనది.

తనపతి కద్భుతమహిమాన్విత మైనసురలోకసుమ మిచ్చిన చేతితో తాళవృంతమునుమాత్రము ధరించి తనకంట బడిననాథుని చూడగానే యామెలోనిమానరోషము, నవమానజనితదుఃఖమును వేయిరెట్లయినవి. లవలీదళములవంటియామెకపోలములనుండి మరంద బిందువులవంటికన్నీటికణములు జాలువాఱినవి. తనదర్శనస్పర్శనాదు లకై తహతహలాడుచు వచ్చినమగని కాయవకాశము లేకుండ చేయు టకై మఱింతబింకముతో నామె తల వాంచి మరల ముసుఁగిడుకొన్నది.

దక్షిణనాయకు డైనమగనిని లోబఱచుకొనుటకై సత్య భామ స్వాభిమానవతిగా, ధీరగా, గడుసరిగా నీసందర్భమున ప్రవ ర్తించినది.

సత్యభామ యో ర్పికయింత లేనిది. ఆమెచిత్తవీథిని చల్లా ర్చుటకు నీలనీరదశుభాంగుడు కృష్ణుడు రాఁగా – ఆమెలోనిమన్మ థాగ్నితో వెలువడువాయువువలె వేడినిట్టూర్పు లామెపైటచెఱంగును

కంకటిపై పొరలినది. అసమశరవేదన కగ్గ మై కంకటిపై వ్రాలిన యాతీవబోఁడి ప్రచండభానుకిరణప్రసారమునకు వాడి పోఁడిమి తఱఁగి పుడమి వ్రాలినతీఁగవలె నున్నది.

మసకపుపాముకాటువలె సపత్నీమాత్సర్య మనువిస మగ్గలింపగా - నాబిసరుహపత్రలోచనకు పెల్లగు మోహమును, కంపమును స్వేదమును, విన్నబాటును, పరితాపవేదనలును కలిగినవి. విషాదము రూపు దాల్చిన ట్లున్నయామెమన సంతయు చీకాకువడి వెడవెడ కన్ను మూయుచు, కను విచ్చుచు, నగుచు, తల యూచుచు, పాన్పుపై పడుచు, నుస్సు రని లేచుచు, తడబాటుతో దానిని మించినపంతముతో కోపవేగముచే నగ్గల మైనమనోజబాధలకు గుఱి యై, మదపుటేనుగు తొండమున చిక్కినపద్మిని యో యనునట్లు పద్మిని యైనసత్యభామ సౌకుమార్యము వసివాడి, చెన్ను తఱిగినది. ఈవిధముగా కోపాగారమున నున్నసాత్రాజితి యితరవ్యాపారము విడిచి దుర్భరసంతాపదోదూయమానమానస యైనది.

రుక్మిణీసౌధవృత్తాంతమును ఆచెంతనే పొంచి వీక్షించివచ్చిన సత్యభామచెలికత్తె తనపై లేనిపోనినేరము లేమేమి కల్పించి చెప్పునో యని యనుమానించుచు, కృష్ణుడు నారదమహర్షి చెంత ప్రద్యుమ్ను నుంచి (సత్యభామా విధేయుడు కనుక) నరదము నెక్కి కేతనపటాంచల చంచల మైనతాల్మితో తురగజవమును గడచి ముందునకు దూసికొని పోవుతత్తరముతో, తిరుగుచున్నబండికండ్లవలె పరిభ్రమించు మనస్సుతో సత్యసముదంచితకాంచనసౌధవీథికి చనుదెంచి, యలబలము లేనినగ రెల్ల నరసి చూచినాడు. కృష్ణుడు వచ్చునప్పటికి సత్యాసౌధమున ననునిత్యము సహజముగా నుండుకోలాహలవైభవ మానాఁడు లేకుండుట సత్యాగ్రహాపరాకోటిని సూచించును.

సత్య కెవరైన పారిజాతపుష్పవృత్తాంత మెఱిగించిరేమో యని యనుమానించుచు, కోపగృహమును జేరి, ముసుంగిడి యున్న

సత్రాజిత్తనయను జూచి, మాధవుడు మాయ యచ్చువడగా మంత నములతో జంకెనవాడిచూపులతో, చేసన్నలతో, సత్యాసఖులను దగుల్పడఁజేసి, తరుణిదరిఁ జేరినాడు. మధ్యందినభానుమండలకరావళిచే వసివాడినతీవవలె నున్నయాతీవబోణిని జూచి కృష్ణుడు విస్మితుడై సత్యపిఱుందనుండి మందాలసలీలమై విసరుభామినినుండి తాళవృంతము నాదటఁ గైకొని – ఆమెయందలిపంచసాయకశిఖిని దరికొల్పు రీతిగా తాను విసరినాడు. తాను సత్యభామాదాసుడ నని నిరూపించుటకు కృష్ణు డీపని చేయగా – ఆయనతో వచ్చినపారిజాతకుసుమాగత నూతనదివ్యపరిమళము లాగదియం దంతటను ప్రసరింపగా – "తావి యిది విస్మయ" మని ముసుంగు తొలగించుకొని యాకాంత యాయేకాంతగృహము నల్గడలు నారసి, తాళవృంతముతో తనకు వీచుచున్న కాంతుని జూచి, బాష్పకలికాతరళీకృతలోచనాంత యైనది.

తనసవతి కద్భుతమహిమాన్వితమైనసురలోకసుమ మిచ్చిన చేతితో తాళవృంతమునుమాత్రము ధరించి తనకంట బడిననాథుని చూడగానే యామెలోనిమానరోషము, నవమానజనితదుఃఖమును వేయిరెట్లయినవి. లవలీదళములవంటియామెకపోలములనుండి మరందబిందువులవంటికన్నీటికణములు జాలువాఱినవి. తనదర్శనస్పర్శనాదులకై తహతహలాడుచు వచ్చినమగని కాయవకాశము లేకుండ చేయుటకై మఱింతబింకముతో నామె తల వాంచి మరల ముసుఁగిడుకొన్నది.

దక్షిణనాయకుడైనమగనిని లోబఱచుకొనుటకై సత్యభామ స్వాభిమానవతిగా, ధీరగా, గడుసరిగా నీసందర్భమున ప్రవర్తించినది.

సత్యభామ యోర్పోకయింత లేనిది. ఆమెచిత్తవీథిని చల్లార్చుటకు నీలనీరదశుభాంగుడు కృష్ణుడు రాఁగా – ఆమెలోనిమన్మథాగ్నితో వెలువడువాయువువలె వేడినిట్టూర్పు లామెపైటచెఱంగును

రెపరెప లాడించుచు దళముగా నిగిడినవి. మానసమున నెలకొన్న క్రోధ రసమును వడ వెట్టుచున్నట్లు ఆమెకుచద్వయముపై రచింపబడినకుంకుమ పత్రభంగములు ఘర్మకణజాలముచే కరగి - వెలిపట్టుపయ్యెద కెలంకుల నుండి జాఱసాగినవి. శోకక్రోధవివశ యైనయామెయవస్థాచిత్రణ మిం డతిమాత్రమనోజ్ఞముగా గావింపబడినది.

" మనమున మాటలం గ్రియుల మన్నన లీ నొకనాఁడు నెట్టి కామినులకు " అన్నకృష్ణునిమాటలనుబట్టి ఆదక్షిణనాయకుని తనకు వశవర్తిగా చేసికొన్న సత్యభామదక్షత యెంతటిదో స్పష్ట మగును.

" పాటలగంధిచిత్తమునఁ బాటిలుకోపభరంబు దీర్ప నె
ప్పాటను బాటు గామి మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియ వెట్ట నాజగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె ...."

ఇది ఆమెక్రోధవైభవమునకును, ఆమెకుఁ గలపతిప్రణయప్రాభవమున కును, దాసానుదాసోఽహమితిప్రతిష్ఠామహితవైష్ణవసంప్రదాయమున కును శ్రీకృష్ణసాక్షిగా నిరూపింపబడినసందర్భము.

త న్నెకసక్కెము చేయుటకో యనునట్లు పారిజాతపరిమళము లతో తన చెంత నిలిచినగోపికావల్లభుని చూచుటకే యిచ్చగింపక ముసిగిడుకొన్నయాలతాంగి - యాయనస్పర్శను సహింపక, తనపదము లను స్పృశించినయాయనశిరసును వామపాదమున తొలగద్రోసినది. (అమూలక మైనతిమ్మనగారియీకల్పనకు ఛాందసులు ముక్కున వ్రే ళులుంచుకొనగా - రసహృదయచక్రవర్తి యైనకృష్ణరాయ లుక్కిరి బిక్కిరి యై యుండును. తిరుమలాపాదస్పర్శకు కినిసినరాయలను సము దాయించి ప్రసన్నుని చేయుటకే యీకల్పనమును తిమ్మకవి చేసి, తత్పూర్వమే కృష్ణునికిని కృష్ణరాయలకును నభేదము చెప్పినాఁ డని విశ్వసించువారును గలరు).

అప్పుడు సత్యభామలో మానరోషమే రాజ్యము చేయుటచే నామె యాచిత్యానౌచిత్యదృష్టిని గోల్పోయినది. తాను పాదమున తొలఁగద్రోసినది జలజాతాసనవాసవాదిసురపూజాభాజన మైన దని కాని, అది లతాంతాయుధుఁ గన్నతండ్రిశిర మని కాని యాలోచింప గలస్థితిలో లే దప్పటియామెమనసు. తాను తప్పుచేసితి నన్నదృష్టియే యామెకు లేదు. ఆమె చేష్టితమును నెయ్యపుఁగిన్కగానే తనకు మన్ననగానే భావించి, ఆభావమునకు వాగ్రూపమునుసైత మిచ్చి, తనరాసికత్వమును చాటుకొన్నాఁ డామహానుభావుడు, ఆమెపదస్పర్శ కాకుహానాగోపాలుఁ డుద్దీపితమన్మథరాజ్యప్రాపితుడు కాఁగా - ఆరసికునిమేనఁ బులకించినదికూడ.

“నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తాఁచిన నది నాకు మన్ననయ” అని సరిపెట్టుకొనుటయేకాక, ‘చెల్వగు నీపదపంకజమ్ము మత్తనుపులకాగ్రకంటకవితానము తాఁకిన నొచ్చు నంచు నే ననియెద” నని యాప్రేమికుఁ డామెయందు తనకుఁ గల మక్కువను ప్రకటించి, “అల్క మానవుకదా యికనైన నరాళకుంతలా!” యని ప్రాథేయపడినాడు. ఆప్రణయిని కోపమును, ఆమానిని మెడబాటును ఆమగని కెంత దుస్సహమైనవో పాపము!

ఆమె కోపమును వెల్లగక్కఁగా - ఈయన కూరిమి బయల్పడ మాటాడినాడు. ఇది యొకరసవత్తర మైనసన్నివేశము.

సత్రాజిత్తనూజాతయు, వృష్ణివంశసంజాతయు నైనసత్యభామకథ సంస్కృతమున మహాభారతభాగవతములలో, హరివంశములో, నాచనసోమునిఉత్తరహరివంశములో, పోతనగారి యాంధ్రమహాభాగవతములో, నందితిమ్మనగారిపారిజాతాపహరణప్రబంధములో, లింగనమఖి కామేశ్వరకవివిరచితసత్యభామాసాంత్వనములో, కాళకవి రచించినరాజగోపాలవిలాసములో, తాళ్ళపాక చిన్నన్నగారి అష్టమహిషీకల్యాణములో గోచరించుచున్నది.

స్యమంతకరత్నమునకై తనతమ్ముఁడైన ప్రసేనుని జంపి, యా రత్నము, నన్యాయ్యముగా నపహరించినాఁ డని కృష్ణునిపై నీలాపనింద వేసి, అంతవాని నంతమాట యన్నందులకు భయపడి, పశ్చాత్తప్తుడై పాదాక్రాంతుడై స్యమంతకరత్నముతోబాటు తనకన్యారత్నమైనసత్య భామను సత్రాజిత్తు కృష్ణునికి సమర్పింపగా – ఆసత్రాజిత్తుకూఁతురైన సత్యభామ యువధు లెఱుగనియనురాగముచే నంతటికృష్ణునే పాదాక్రాంతునిగా చేసికొని తనకనుసన్నలలో కట్టివైచినది.

అది చాల దన్నట్లు – శ్రీకృష్ణునితో పాండవులను జూడ నేగినసత్యభామ పంచపాండవులచే ప్రాణములో ప్రాణముగా ప్రేమింప బడుచున్న ద్రౌపదిని చూచి యచ్చెరు వంది –

"ఒక్కరొక్కనికంటె నువిద ! నీ కేవురు
　నను రక్తు లగుట యత్యద్భుతంబు
వ్రతముపెంపొ ? మంత్రౌషధవైభవంబొ ?
సరసనైపథ్యకర్మకౌశలమొ ? చతుర
విభ్రమోల్లాసరేఖయొ ? వెలఁది ! నీవి
శేషసౌభాగ్యహేతువు సెపుమ నాకు"

"ఏనును నీవలన నిజము
గా నిది యంతయును నెఱిఁగి కమలదళాక్షుం
బూని వశగతునిఁ జేసి య
నూనస్నేహానుభోగయుక్తిఁ దలిర్తున్" 1

అని కృష్ణవల్లభయైనసత్యభామ యేకతంబ యొక్కయెడఁ బ్రియసల్లాపసంయుక్తయై యుండినపాంచాలి నడిగినది. బహుభార్యలు గలపతిని వశంవదునిగా చేసికొనవలె నన్నసత్యభామమనసులోనితహతహ యీ మాటలలో వ్యక్తమగుచున్నది.

........................................................................

1. ఎఱ్ఱన - ఆంధ్రమహాభారతము - అరణ్యపర్వము - పంచమాశ్వాసము, పద్యసంఖ్య 291 నుండి 295 వఱకు. (ఆం. ప్ర. సాహిత్య అకాడమీ ప్రచురణ)

అంతట సత్యభామకు సమాధానముగా పాంచాలి -

" నను నిట్లు దుష్టవనితా
జనమునటులుగాఁ దలంపఁ జమనే నీకున్ ?
మన సొప్పదుః పురుషోత్తము
వనితవు గాఁ దగవు నీవు వనరుహనయనా ! "

అని మేలంపుఁజందంబున దానివివేకహీనత యెఱుకపడ నాడి సత్యభామను మెత్తమెత్తగా చీవాట్లు పెట్టినది.

నిజమే. ద్రౌపది యన్నట్లు సత్యభామ పురుషోత్తమువనిత గాఁదగినదియై ప్రవర్తింపకపోవుటకు పారిజాతాపహరణమునందలిపాద తాడనఘట్ట మొకనిదర్శనము. ఈసన్నివేశమున శ్రీకృష్ణుడుమాత్రము క్షమాగుణసంపన్నుడై ప్రేమమూర్తియై తనపురుషోత్తమత్వమును నిరూపించుకొన్నాడు.

మగనిముందు మూఁగనోము పట్టి అంతవఱకును కంకటిపై పడి యున్నయామానినీతిలక మప్పు డందమైనతనశరీర మఱచోఁచునట్లు నిక్కినది. వీడినకచపంక్తిని పల్మఱు ముడిలో వెడద్రోపుచు, తనయావేశములో జాఱిపోయినపైఁటచెఱఁగును వెంటనే చనుదోయిని జేర్చుచు ముద్దుమోమున లేఁజెమ రంకురింపగా వీరావేశముతో వాగ్యుద్ధమున కుద్యమించి పలుకుములుకులను చెలువునిపై ప్రయోగింపసాగినది:-

" ఈనయగారవుఁబ్రియములు-ఈపస - లీమొగమిచ్చుమాట లేల ? నిన్ను నమ్మినందులకు వెంటనే ఫల మనుభవించితిని - నీయాన ! నన్ను చెనకి యారడిపెట్టిన - నవ్వులవారలను గానవు - పసులకాపరి భావజమర్మకర్మము లెఱుంగునా ? " అని భావజుని కన్నతండ్రి నీసడించిన దాయీర్ష్యాపరురాలు !

పసులకాఁపరి యరసికుఁడై నగ్రామ్యజనుఁ డనును ద్దేశ్యముతో మాత్రమే కాక - మఱియొకందులకుకూడ నామె యి ట్లన్నది !

ఇంతక్రితము తా నాయనశిరమును వామపాదమున దొలగఁ ద్రోయగా నతఁ డవమానముగా భావింపక - యది తనకు మన్ననయే యన్నాఁడు ! ఆత్మాభిమాన మెఱుంగనిపసులకాఁపరి ఆలియభిమానమును మాత్రము కాపాడునా ? యన్న దెప్పిపొడు పామెమాటలలో గర్భితముగా నున్నది.

అవధు లెఱుంగనియావేశములో నామె యీజగన్నాథుని వల్లవీకింకరుఁ డన్నది ! మాయాకల్పనాచాతురిచే నందఱుభార్యలతో నేకకాలమున కృష్ణుడు సౌఖ్యాబ్ధి నోలాడె నని తిమ్మకవి ముందే చెప్పినాడు ! అదేవిషయమును సత్యభామ మఱొకవిధముగా నన్నది :-

"పలుపోకలమాయలు (నీకు) వెన్నతోఁ బెట్టిన వో యెఱింగియును బేలతనంబున" నమ్మి, మగనిదగ్గర గుట్టును, ఆమగడు రుక్మిణియందు ప్రకటించినకూరిమిచే సవతులలో తేజమును గోల్పోయితి నని సత్యభామ వాపోయినది. గుట్టును, తేజమును గాపాడుకొనుట కామె యిచ్చినప్రాధాన్యమే ఆమె మానవతీలలామ యని స్పష్టము చేయగలదు.

"మునిపతి వచ్చి పూ వొసఁగి భవత్ప్రియాంగనను వినుతి యొనర్పగా వినినవీనుల మాచవిగానిమాటలను వినవలసెంగదా !" కృష్ణుని కిది మఱియొకదెప్పిపొడుపు !

"నీ విట వచ్చుట పారిజాతవాసనఁ బ్రకటించి మమ్ము నెక సక్కెము సేయన కాదె ? చెప్పుమా" అన్నది సత్యభామ. ఇది యొక దారుణమైనయభియోగము. ఇది కృష్ణుడు కావలె నని చేసినపనికాదు- ఆయన కోరగా పారిజాతపరిమళము లాయనతో వచ్చినవి కావు. ఆ దక్షిణనాయకు డామె నోదార్చుటకు వచ్చి, ఆమెకు సంతృప్తికర మైనసమాధానము నీయలేనిపరిస్థితిలో పడినాడు ! సత్యభామవైపునుండి చూచినచో - తన్నుఁ గా దని - కృష్ణుడు రుక్మిణిని పెద్ద చేసి పారిజాత

మిచ్చుట నేరమే. అతఁ డానేర మొనర్చినట్లు అతనితో వచ్చినపారి జాతపరీమళములే సాక్ష్య మిచ్చుచున్నవి. కనుక సత్యభామలోనిమాన రోషజనితదుఃఖము మఱింత యెక్కువైనది. కనుకనే – సతులకు మానమే తోడ వనియు, మానమే ప్రాణాధిక మనియు, మాన మఖిల సన్మానములకును మూల మనియు, అట్టిమానము చెడినబ్రతుకు మానిని కెందుల ? కనియు – తాను మానవతి నను విషయమును మఱలమఱల గుర్తుచేసి బ్రతుకుపై విరక్తి ప్రకటించిన దామె. మన సిచ్చి పుచ్చు కొన్నమగఁడు చన విచ్చి పుచ్చుకొన్నా డని యామె క్రుంగిపోయినది. "నన్ను నాతోడిసవతులు నగకమున్న పంత మలరంగ నిన్ను మెప్పింతు" నని ఆసత్యభామ స్త్రీసహజ మైనస్వభావముతో తాను చత్తు నని మగనిని బెదరించినది. తనస్థానమున వచ్చుదానితో కృష్ణుడు హాయిగా కులుకవచ్చు నని ఆయనహృదయము దుస్సిపోవునట్లు వాగ్బాణము లను ప్రయోగించినది. "నను నెవ్వతెగాఁ జూచితి ?" వని నిలదీసి యడిగినది. ఈయొక్కప్రశ్నలో "నీవు నాపాదదాసుఁడవు – నేను నీవల్లభనుసుమా" అని గుర్తు చేయుట యున్నది. "నీమాయమాటల కిఁకమోఁదట మోసపోవునంతటియమాయికురాలను కానుసుమా" అన్న హెచ్చరిక యున్నది. "తక్కినసవతులవంటిదానను కాక – నేను మానవతీలలామనుసుమా" అని తెలియజెప్పుట యున్నది. కులరూ పయౌవనగర్వ మున్నది. మానరోష మున్నది. మగనిని బెదరించుట యున్నది. అట్లని యామె వలవల యేడ్చినది లేదు. కంఠగతమైన దుఃఖము కన్నులవఱకును పొంగి రాఁగా – దానిని కన్నీరుగా కారనీ యక అంతలో గాంభీర్యము వహించి యంతర్బాష్ప మైనది. ఆత్మాభి మానము దెబ్బతినుటచే అవనతముఖియై, ఘనతరగద్గదికచే మాటాడ లేక – యీర్ష్యాసంజనితశోక మాపుకొనలేక తనమోమును భర్తకు చూపుట కిష్టము లేక పంకజశ్రీసఖ మైనమోముపయి చేలచెఱఁ గిడి యామె లలితాంగి కనుక లలితలలితముగా నేడుపుమిషతో బాలపల్లవ గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిని పచరించినది. ఇది

యేడుపు కాదు - ఒకమనోహర మైనకాకలీధ్వని. అంతవఱకును బహిర్గతము కాక ఆమెయెదలో నణగియున్నభావపరంపరలమూఱురూపము. పాదముతో తాడించినను దారికి రానిమగనిని లోబఱచుకొనుటకై యామానిని ప్రయోగించినచిట్టచివరిబ్రహ్మాస్త్ర మిది. కాదు - ముద్దుగుమ్మయేడుపుకూడ ముద్దుగానే యుండు ననిపించుధ్వనిమయ మైన సమ్మోహనాస్త్రము. ఆయేడ్పు కానియేడ్పుతో నామెహృదయభారము కొంత తగ్గినది. అయినను తనమది నందినకోపభరమును తీర్చుకొననేరక నెవ్వగం బొగులునారమణీలలామను నీరజనాభుడు నిండుగా కౌఁగిలించికొని బుజ్జగించి నునుఁజెక్కుల జాఱుకన్నీరు కరమునఁ దుడిచి నెయ్యమును, దియ్యమును దోఁప నామెతో మాటాడినాడు.

ఇంతకుముందు "ఉరస్స్థలంబుఁ జన్నుల నెదురొత్తి ననుం బిగికౌఁగిటఁ జేర్పు" మని సత్యభామను కృష్ణుడు ప్రాధేయపడినాడు. అప్పు డడ్డుచెప్పినమానిని నిప్పుడు బుజ్జగించునెపమున కౌఁగిలించుకొని కృష్ణుడు తనకోరికను దీర్చుకొన్నాడు. ఆనీలనీరదశుభాంగునినిండు కౌఁగిట నుండుటచే ఆఖండితనాయికలోనిమన్మథతాపము కొంతకు కొంత యుపశమించినది. ఇంక సత్యభామలో మిగిలి యున్నది సపత్నీమాత్సర్యము.

రసజగత్సమ్రా ట్టయినశ్రీకృష్ణునిశృంగారభావసర్వస్వమునకును కేంద్ర మైనది సత్యభామ. ఆమె నెవ్వగం బొగులుట చూచి సహింపనేరనియారసికశేఖరుడు "నే నుండగా లతాంతమాత్రమునకై యింతవంతనీ కేల?" అని యామెలో నాశలు మోసు లెత్తించినాడు. ఇంతకుముందు "అరాళకుంతలా!" అన్నవాఁ డిప్పుడు "లలితేంద్రనీలశకలోపమకైశిక!" యని ముద్దు చేసినాడు! "దేవతాకేళివనంబు సొచ్చి యనికిన్ బలసూదనుఁ డెత్తి వచ్చినన్ దీలుపడంగఁ దోలి యిటఁ దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్" అన్నాడు. ఈమాటలనుబట్టి కృష్ణుడు దేవలోకమునుండి తెత్తు నన్నది కేవల మొక్కపారిజాతపుఁ

బూవునుమాత్రమే యనునర్థ మున్నది. ఆపూవు నింతకుమును పే రుక్మిణి కిచ్చి యున్నాడు. అట్టిమఱియొకపూవునే తెచ్చి సత్యభామ కిచ్చినను- ఈసత్యభామ నారుక్మిణితో సమానముగా మాత్రమే చూచినట్లు సత్య భామ భావింపవచ్చును. కనుక రుక్మిణికన్న సత్యభామయే తన కత్యంతా ప్తురా లని ప్రకటింపవలచినకృష్ణుడు

"వామలోచన ! నీకేళివనములోనఁ
జిలువ వెదచల్లుచెంగల్వకొలనితెలన
సరసకర్పూరకదళికాతరులనడుమఁ
బెరటిచెట్టుగ నాఁటింతుఁ బెంపుఁ గనుము."

అని రుక్మిణికి లతాంతమాత్రమునే యిచ్చినకృష్ణుడు తనశృంగార సామ్రాజ్యాధీశ్వరి యైనసత్యకు ఆపారిజాతవృక్షమునే తెచ్చి పెరటి చెట్టుగా చేయుదు నని ప్రతిజ్ఞ చేసినాడు. మేఘగర్జనమునకు నిలు వెల్ల పులకించునీపలతికవలె లతాంగి యైనసత్యభామ ఆయంబుదశ్యాముని గర్జా మధురవాక్యములకు పులకించిపోగా- అంతవఱకును విన్నబోయినయా మెసఖీజనములు మయూరిక లై చెలరేగినారు.

మగనిసరసాలాపములతో వినోదకథలతో నలరినయామాన వతి మాత్సర్య మేఘమాలికలనుండి వెలువడినహిమధామకళవలె ప్రసన్న యై, విరహనిశీథినీవిరామమున నున్మీలితామోదపద్మినివలె వికసితస్వాంత యై, క్రోధదంతావళక్షోభమునుండి తేరుకొన్నవినిర్మల సరసివలె, కలంక దిగఁద్రోచి, సంతాపవై దాఘసమయనిర్గతకోరకిత యైననవమాలతీలతికవలె చెలువ మెసగినది. చేరవచ్చినయాభామను గౌరవించి యున్నమురవై రిసన్నిధికి (రుక్మిణిపిడుకోలందిన) కలహ భోజనుడు చనుదెంచినాడు.

"పలు తెఱఁగుముళ్ళమాటలు కలహమె కల్యాణ మని జగ మ్ముల నెంటన్ మెలఁగెడుమౌనికి సహజము" అనియు, స్వభావో దుర తిక్రమః" అనియు తెలిసినలోకజ్ఞురా లై నసత్యభామ ఆకలహాశనుని

వారింపనివల్లభునిపై నే కాని, కలహాభోజనునిపై నంతగా కినుక వహింపలేదు. పైగా – ఆకలహాశనునిముఖ్యమాటలచలువచేతనే సురలోకతరువు తనపెరటిచెట్టు గా నున్నది. కనుక – మాఱినయీపరిస్థితిలో అతనికి సత్యభామ తనమగనితో కలసి యాతిథేయసత్కృతు లొనరించి, మృష్టాన్నభోజనము పెట్టి, చంద్రశాలాస్థితు డై నశౌరిచెంత నున్నయీసంయమీంద్రునడుగులకు మ్రొక్కినది.

అంతకుముందు సత్యభామలోనిగర్వమునే యెలుఁగెత్తి చాటినకలహాశనుఁ డిప్పుడు "పతి నీ వై విహారింపఁగా జనము సంభావింపఁగా బంధుసంతతి నిన్నుం గొనియాడఁగా సవతికాంతల్ సూచి లజ్జింపఁగా, నతులప్రాభవవైభవోన్నతులప్రో వై యిట్లు వర్తించునీకితరస్త్రీజనబుద్ధి దీవనలు నే నే మిచ్చెదన్ మానినీ!" అని యాభామప్రాభవవైభవోన్నతుల నగ్గించినాడు.

"పతి నీ వై విహారింపఁగా" అనుటలో – సత్యభామయే పతిగా నున్న దని యొకయర్థమును, సత్యభామకును, నామెపతికిని భేదము లే దని మఱియొకయర్థమును స్ఫురించుచున్నవి.

అక్కడ రుక్మిణిసౌభాగ్యమును పొగడి, సత్యభామను తక్కువ చేసి మాటాడినకలహాశనుడు పిలవనిపేరంటముగా వచ్చి "సవతికాంతలు చూచి లజ్జించునతులప్రాభవవైభవోన్నత్తులప్రోవవు నీవు" అని పొగడుటలో సత్యభామమనసున నాటుకొన్నపరితాపము సమూలముగా తొలగిపోయినది. నారదుఁ డంతటితో నాగలేదు. "అని కైనం బతి నిన్నుఁ బాసి చనునో?" యని నరకాసురవధఘట్టమునుగూర్చి మాట్లాడుచున్నట్లు పైకి కనిపించి, పారిజాతహరణార్థ మింద్రునితో పోరు సల్ప నేఁగుకృష్ణునితో నమరావతికి పోవలె నన్నకోరికను సత్యభామకును, ఆమెను తోడ్కొనిపోవకతప్పనిసరిపరిస్థితిని శ్రీకృష్ణునికిని కల్పించినాడు!

" చనవుల్ నీవలె నెవ్వరేఁ గనిరో ? " అనుటలో - త్రికాల వేది యైనయా దేవర్షి " అంతటిభగవంతునికడ నెంతటిచనవు గైకొం టివి తల్లీ ! " అని కోపగృహమునందలిపాదతాడనవిషయమును స్ఫు రింపజేసినాఁడు !! ఈయుద్దేశము లేనిచో నారదుడు సత్యభామను " కుటిలాలకా ! " యని సంబోధించెడివాఁడే కాఁడు.

కృష్ణుడు సత్యభామ కిచ్చినవాగ్దానము దివ్యదృష్టి గల నారదుఁ డెఱుఁగఁడా ? అనల్లనిస్వామిసంకల్పము నే యీ తెల్లనిమాని తనయాశీర్వాదరూపమున ప్రకటించుచు - " నీకు మగఁడు కోరిన కోర్కుల్ ఘటియించుఁగాక తా నెంతటికార్యం బైన డించి నాదీవన లన్ " అని తనయాగతానాగతవేత్తృతకు వ్యాఖ్యాప మిచ్చినాడు !

సత్యభామ వినుచుండగానే కృష్ణుడు తనసురలోకప్రయాణ విషయమును నారదముఖమున నింద్రునికి కబురంపి, యారాత్రి సత్యతో వినోదకేళిం దేలి, యామఱునాఁ డామెతో వైనతేయునిపై సురపురి కరుగుచు మార్గమధ్యమున మేరుపర్వతవిశేషములును, సిద్ధపాంథులను, విద్యాధర, గంధర్వ, యక్ష, గుహ్యక, గరుడ చారణులను, సురగం గను, నాకపురీవిశేషములను జూపి యామెను సంతోషపెట్టినాడు.

సురపురరాజమార్గమున తా మేఁగుచుండగా - కృష్ణుడు తన్ను రాచిలుకచే పిలిపించినవేలుపుంజిలుకలకొలికిచేష్టను సత్యభామకు చూపి యామెహృదయమునకు మఱింత చేరువ యైనాడు.

కృష్ణుడు నరకాసురవధలో తనకు సహకరించినసత్యభామతో కలసియే అసరకాపహృతకుండలముల నదితి కిచ్చి, అవిధముగాకూడ సత్యభామను గౌరవించి యౌచిత్యమును పాటించినాడు. సత్యభామ కృష్ణుని హృదయము నెంతగా చూఱగొన్నదో తెలుపుట కిది యొక చిన్నియుదాహరణముమాత్రమే.

దేవమాతకోరికపై సత్యాసమేతుఁ డైనహరి వైజయంత మున విడిది చేసి, యామెతో సుఖముండి, నందనారామసౌందర్యము నామెకు చూపి యానందడోలల తేలించి, తనమనసునందలిశృంగార భావముల నచటిప్రకృతివర్ణనమిషమున బ్రకటించి ప్రియాంసపీఠి నిజ హస్తతలంబున నూఁది నందనవనమున విహరించి, యామెయందు తనకుఁ గలయపారప్రేమను చాటినాఁడు.

నందనవనమున విహరించువేళ కృష్ణుడు సత్యభామకు పారి జాతతరువును జూపి దానిమహిమను వర్ణించి చెప్పి, దేవేంద్రుడు శచీ దేవిని తనయంకపీఠమున చేర్చి, సోగవెండ్రుకలచిక్కులు వాపి, వియన్నదీనవాంభోరుహనాళసూత్రములతో పారిజాతలతాంతములను సరులుగా రచించి కుతుకమున నామెమెఱుంగుక్రొవ్వెదను నించు నని చెప్పి, సత్యభామమనసును శృంగారభావభరిత మొనర్చినాడు.

అంతట సత్యభామ " ఏల తామసము ? ఈవిబుధాధినాయ కమహీరుహమును బెకలించి లోకసంభావితలీల నీపలుకుఁ బంతము సెల్ల మదీయగేహకేళీవనవాటి వేడుక తలిర్పఁగ నిల్పుము జీవితేశ్వరా ! " అన్నది. దీనినిబట్టి సత్యభామ కాతరువునం దున్నప్రగాఢవాంఛయు, నామెతోందరపాటును, మగనియం దామె కున్నకూరిమియు తెల్ల మగుచున్నవి. అంతట కృష్ణుడు " నిర్జరీజనములు గొల్వఁగా నీవనమునఁ గ్రీడ సల్పి భవదిష్టం బేను గావింతు " నని యాపారిజాతతరురత్నగుచ్ఛ మును సత్యకు కర్ణావతంసముగా నిడినాడు. రుక్మిణికి తాత్కాలికముగా మాత్రమే ఒక్కపూవుమాత్రమే దక్కగా నాపూగుత్తినే వడసి సత్య భామ తనపంతమును నెగ్గించుకొనినది.

" ఎలదేఁటులు తమవాలుకన్గవలపై నిందీవరభ్రాంతిచే మెలఁ గఁగాఁ జేరలఁ గప్పుకో నలవి గాక చీదఱ జెందిననిర్నిమేషజలజాక్షులు అలిభీతిచే ముకుళీకృతాక్షి యగుసత్యాకాంత నీక్షించి మానుషత్వమును గాంక్షించినా " రఁట ! సురాంగనలకుసైతము లేనిసౌలభ్యసౌభాగ్య

ములు సత్యభామకు కల వనియు, నామెకన్ను లిందీవరములను బోలిన వనియు దీనినిబట్టి తెలియుచున్నది.

"చనుఁగవ వ్రేఁక మున్ జఘనచక్రభరంబును మోవలేక యొయ్యన పదపంకజము లలసాలసవైఖరి మార్చుచు జనార్దనుభుజ మూఁతగాఁ గొని పరస్పరాంసపీడనమున రోమహర్షముకుళ్ళవజ మొండొరులమేన నిండఁగా సత్యభామ నందనవనకుసుమలతాతపత్ర ములుపూని వేలుపుందరుణులు కొల్వఁగా పతియును దాను నొండొరుల కేలుఁదమ్ముల నూఁత గొని యరిగి సురగంగలో జలకేళి సల్పినది. ఇది యాదంపతులయన్యోన్యప్రణయభావమునకు నిదర్శనము. ఆరాత్రి వైజయంతమున మురారి సత్యతో మనోభూరాజ్యసౌఖ్యనిద్రాపారీణత నుండి, యామమునాఁ డామెప్రీతికై పారిజాతతరువును పెకలించి గరుత్మంతుని మూఁపున నిల్పినాడు.

అంతట నందనవనపాలకు లడ్డగింపఁగా - సత్యభామ వదనంబున లేనగ వంకురింపఁగా నేమో వచియింపబోవుహృదయేశ్వరుని కనుసన్నచే మాన్పినది. ఇది యామెస్వాధీనపతికాత్వమునకు పరమోదాహరణమై, "అల సత్యభామకన్ సన్నలఁ ద్రిమ్మఁజున్ హరి వశంవదుఁడై యన వింద" నన్ననారదునిమాటలు సత్యములే యని నిరూపించుచున్నది.

ఆమె చన్దోవల జాఱుకొంగు సవరించుచు పీడినకొప్పు పల్మఱు చే వెడదోఁపుచు చెందొవచూపులు క్రేళ్లు దాఁటగా నిట్లన్నది :-

"వినుఁడు సురేశ్వరవనపాలకులు ! వార్ధిఁ
  బొడమినయీదివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె ? యింద్రుండు నెవ్వండు ?
  తోడియిందిరను గౌస్తుభము నెవ్వ
దధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁగాక
  తెకతేర యిది యేమి యొకరిసొమ్మె ?"

అని గద్దించి, తనవాదపటిమను చాటుకొన్నది. ఈప్రశ్నముల కేమి బదులు చెప్పవలెనో తెలియక వనపాలకులు గ్రుడ్లప్పగించిరి. నిరుత్తరులయి యున్నయింద్రునిసేవకులను చూచి సత్యభామ యింకను విజృంభించి

> "ఇదె నాదువిభునిచే నీవదాన్యనగంబు
> నొడియించుకొని యేఁగుచున్నదానఁ
> బలుకు లేఁటికిఁ ; దా వీరపత్నియేని
> మీఁచిదేవి తనదుప్రాణేశుఁడైన
> మఘవు నిటఁ బంపి సత్యభామావిధేయు
> వలన మరలంగఁ గొనుమెపో వాసితనము"

అన్నది. ఆచార్య యస్వీ జోగారావుగా రన్నట్లు "ఆనిర్లక్ష్యమైన సంబోధనము, పృచ్ఛ, వాదము, ప్రతిజ్ఞ అన్నియు ఆమెకు మీసము లేనిలోటును దీర్చుచున్నవి." (సారస్వతనీరాజనము – పుట – 65) పతి పరాక్రమమునందామెకు గలప్రత్యయమును, అంతటివాఁడు తనకు విధేయుఁ డన్నగర్వమును ఈమాటలలో తెల్లమైనది. కృష్ణుడు మాటలతో తీర్పదలచినవ్యవహారము సత్యభామగర్వోక్తులచే కయ్యముగా మారినది ! ఆమె పలికినములుకులవంటిపలుకులను వనపాలకులవలన పులోమజాస్వాతుఁ డైనయింద్రుడు విని, యుద్ధసన్నద్ధుఁ డై యష్ట దిక్పాలకులతో సకలసురసేనతో వచ్చి కృష్ణు నెదిరించి పరాజితుఁ డై పాదాక్రాంతుఁ డై పారిజాతమును సత్యభామావిధేయునికి సమర్పించుకొన్నాఁడు. సత్యకు తిరుగుప్రయాణములో యుద్ధవార్తలు చెప్పుచు ద్వారకను బ్రవేశించినహరి పారిజాతము నామె కిచ్చి తనప్రతిన నెరవేర్చుకొని యామెప్రశంస లందుకొన్నాడు. తనపంతమును నెరవేర్చుకొనువఱకును నిద్రపోవనిసత్యభామస్వాభావము దీనినిబట్టి స్పష్ట మగును.

నిజమందిరారామవాటికామధ్యసీమ నాతరువును ప్రతిష్ఠించి యనుదిన మామె యర్ఘ్యపూజ లొనరించినది. ఇది యామెభక్తికి

తారాకాణము. దాంపత్య మనగా సత్యాకృష్ణులదే యని సవతులు పదారువేవురును ప్రశంసించిరి. ఇట్లు నిరంతరసౌఖ్యవర్షిష్ణు లైనసత్యా కృష్ణులను జూచువేడుకతో వచ్చిననారదుడు వారిచే నర్ఘ్యపూజ లంది-

"హేమనిభగాత్రి ! నీభాగ్య మేమి చెప్ప ?
జిష్ణుభూజంబు నీపెట్టుచెట్టుc జేసి
సవతులన కాదు - త్రిభువనేశ్వరి యనంగc
బొలుచుపౌలోమి గెలిచితి వలఘుమహిమ"

నని సత్యభామవైభవమును నుతించి, "అతులితతావకీనమహిమానుశ యోచిత మైనపుణ్యకవ్రత మొనరింపగా వలయు" నని ప్రేరేచెను. అరుంధతియు, గౌరియు, శచియు పూర్వ మావ్రత మొనర్చి రనియు, ఆవ్రతము చేసినచో -

"ధనకనకవస్తుసమితియుc
దనయసమృద్ధియును గలిగి తానుం బతియున్
మనమున నలిగొఱ లెఱుcగక
యనితరసులభై కసుఖము లందుదు"

రని వ్రతవిధానము నుపదేశింపగా సత్యభామ పతియనుమతి నంది యావ్రతాచరణమునకు పూనుకొన్నది. అంతవఱకు నిక్కుచు విఱ్ఱవీcగుచు సవతులను గణింపనిసత్యభామ తొంటితనకోపమును గర్వమును మత్సరమును మాని వినయము వహించి తొలినాcడే సవతులయిండ్ల కేcగి వ్రతోత్సవమున కామతించినది. ఈవిధముగా నారదుc డామె లోనిగర్వమును మచ్చరమును పోcగొట్టగలిగినాడు. శ్రీకృష్ణునానతి శిరసా వహించి రైవతకాద్రిపొంత విశ్వకర్మ తననిర్మాణచాతురి కవధిగా మణిమయోజ్జ్వలముగా దానమండపము నిర్మించెను. పాండవకౌరవాదిరాజబంధువులు, సురలు, మునులు మున్నగువా రెందఱో వ్రతోత్సవము చూడవచ్చిరి. పతితో మంగళస్నాన మొనర్చి, అత్తమామలకును, ఆత్మభర్తకును సత్యభామ నమస్కృతి చేసినది. ధౌమ్యాదిఋషులు ఋత్విజులుగా నారదుడు దానగ్రహీతగా నుండిరి.

ద్రౌపదీసుభద్రలు వెంట రాఁగా, అన్యపృథ్వీవరకామినీ మణులు భజింపగా ముత్తైదువలు ముందు నడవగా ముత్యాలపల్లకిపై సత్యభామ మహావైభవముగా వచ్చి, దానమంటపమున పారిజాతమునకు ప్రదక్షిణనమస్కారము చేసి నారదుని యథోచితముగా నర్చించినది.

ఆవ్రతమున సత్యభామ నాథుని ధారోదకపూర్వకముగా దాన మీయవలె నన్నాఁడు నారదుడు. పతిని దాన మీయవలసివచ్చినందులకు లజ్జతో, ఆవ్రతము చేసినచో నిఁక నఱగొఱలు లేక పతితో సుఖింపవచ్చు ననుసమ్మోదముతో ప్రాణవల్లభుని ప్రేమరసాలసవీక్షణములఁ గనుగొని "చిత్తగించితే మునిపతిమాట?" యన్నది. "దీని కనుమాన మేల? ఆగమోక్తము గాన విచారింపక ధారవోయు" మన్నాఁడు కృష్ణుడు. సత్యభామసవతు లందఱును లజ్జాభరాక్రాంతలై మోములు వంచుకొనిరి. సంబంధిభూపాలకులు నర్మగర్భితవచనములు పచరించిరి.

చకితముగ్ధమృగీతరలాక్షి యైనసత్యభామ మునిపతియానతితో ప్రాణనాథుని కనకాంబరాంచలముతో క్రొవ్విరులదండ తగులొత్తునట్లు కల్పనగమునకు కట్టి ధారోదకపూర్వకముగా నారదునికి దాన మిచ్చి మణిసువర్ణధాన్యములును, గోసహస్రవాజికుంజరములును తద్వ్రతాంగముగా దాన మిచ్చినది.

పరమమునిమానసాలానబంధనమునఁ గుదురువడకుండు యాదవకుంజరుండు వికచరాజీవనేత్రచే వేల్పుమ్రానఁ గమ్మఁబూవుల దండచేఁ గట్టువడుట కృష్ణుని ప్రాణములో ప్రాణముగా ప్రేమించిన యామె ప్రేమకు ప్రతిఫలము.

బలిదనుజేంద్రుని కట్టినశ్రీహరి సత్యభామచే పుష్పదామకమున కట్టువడి యామెయందు తన కున్నయనురక్తిని చాటినాడు.

అంతట చివ్వలరోగిరవుఁదపసి వేల్పుచెట్టునకు కట్టబడిన కృష్ణుని విడిపించి "సత్యముగ నిన్ను నిప్పుడు సత్యాసతి మాకు నిచ్చినది - ఇఁక మాయభీప్సితకృత్యములు సలుపు" మని కేళిపరుఁడైన నారదుడు సత్యభామ చూచుచుండగా కృష్ణునిచే తనమహతిని మోయించి, మిన్నేటిజలము నింపినమణికమండలువును పద్మాక్షవలయమును నిచ్చి, తనశార్దూలచర్మమును శ్రీకృష్ణునిచంకఁ జొనిపి, 'హా' మ్మని - 'ర' మ్మని - కపటనటనాపరుండైనకంసవైరిచే పరమముని నవ్వులాటలకు పనులుగొన్నాడు.

నారదునిదృష్టిలో సత్యభామ జనార్దనునినెయ్యపువాలుఁగంటి. "నీ మనోహరుని తిరిగి యిచ్చెద" నన్ననారదునికి ఆత్మభూషణవితానము లన్నియు నిష్క్రియముగా నిచ్చి ప్రాణవిభుని క్రమ్మఱఁగైకొని ప్రమోద మందినది యామె. వియచ్చరు లచ్చెరువుగా విరులవాన కురిసిరి.

"కలశాల మొక్కఁగతిఁ బూసలలో దారంబుమాడ్కి సతి మదిలోనన్ మెలఁగెడుపురుషుఁడు కలుగుటతొలుజన్మమునోముఫలము" అని నమ్మినసత్యభామ నారదుడు చెప్పగానే యాగమోక్తముగా పుణ్యకవ్రతమును పూర్తిచేసి సురమునికి మ్రొక్కి కల్పనగముక్రొవ్విరులు కనకపాత్రముల నించి రుక్మిణీప్రభృతులైనసవతులు పదాఱువేలమందికిని వాయనము లిచ్చినది. అమానుషగోచరమహిమాఢ్యుఁడైన సత్యాచంద్రముఖీవరుని సురవాచంయమి చతురవాక్ప్రౌఢిమై స్తుతించి వెడలిపోగా ద్వారకకు మఱలివచ్చినకృష్ణుడు సత్యభామాశుకీకేళిపంజరమై సౌఖ్యాంబునిధి నోలలాడినాడు.

డాక్టర్ యస్వీజోగారావుగా రన్నట్లు రసజగత్సమ్రాట్టయిన శ్రీకృష్ణుడు సత్యభామావిధేయగౌరవబిరుదవిభ్రాజితుడు కాఁగా మానవతీలలామ యైనసత్యభామ ఖండితనాయికాప్రపంచమున కెత్తినయేకైకధ్వజమై స్వాధీనపతికాప్రతిష్ఠామహితసార్థకనామ యైనది.

ఆంధ్రసాహితీనందనమున విరబూచి వలపులు విరజిమ్ము పారిజాతప్రసూనము సత్యభామ. పదాఱువేలయెనమండుగురు భార్యలకు పతియై, రసలోకచక్రవర్తి యైనజగన్నాథుని తనబాహుబంధమున బంధించి, తనకనుసన్నలలో నిలుపుకొన్నయదృష్టవతి యామె. సరసమునకే కాక సమరమునకుకూడ నాత్మేశ్వరుని వెన్నంటి నరకునిపై పరాక్రమించినసాహసోద్దామసత్యభామ. ఆత్మవిభుని నిముసమైన విడిచియుండ లేనియవ్యాజానురాగము, విమతులవీరత్వమును సరకుసేయని నిర్లక్ష్యము, పతి తనగీచినగీటు దాఁటఁడనుగర్వము, కులరూపయౌవనవతి నన్నయహంభావము, ఒయ్యారము లొలుకపోయుగయ్యాళితనముతో పూవిల్తుని నండగా నిడుకొని వానియబ్బనైన తలదన్నునిబ్బరము, అవధు లెఱుంగనిమానరోషము, స్వప్నముననైన విడువనిసపత్నీమాత్సర్యము ననులక్షణములు హరివిల్లులోనిరంగులవలె విలక్షణ మైనసత్యభామపాత్రకు వింతశోభను చేకూర్చినవి. ఆమెవీరము వీరాలోకదుర్లోక మైనది కనుకనే "శార్ఙ్గ మింద నీవు సమరంబె కోరుదు" వని హరి యవసరము వచ్చి నరకసంహారవేళ విల్లందీయగా వీరశృంగారమూర్తి యైనయావిరిబోణి యరిపై శరాసారమును, హరిపై దరహాసామృతపూరమును గురియుచు –

" వీరం బాఁడుదనంబు నొందె ననఁగా విక్రాంతిసౌందర్యల
క్ష్మీరేఖం బచరించె నాఁగ ధృతి యక్షీణాకృతిం జెందె నా
ధీరోదాత్తపతిప్రియాచరణభక్తిప్రౌఢ యాతన్వి తాఁ
బ్రారంభించె మహారణక్రియకు నాప్రత్యర్థితో నుక్కునన్ "

– ఎఱ్ఱన హరివంశము – 4 ఆ 162 ప.

సత్య "పతిప్రియాచరణభక్తిప్రౌఢ" యఁట ! ఆమె పతిదేవత యని యెలుంగెత్తి చాటినాఁ డెఱ్ఱన. ఆమె పతిప్రియాచరణభక్తిప్రౌఢ యైనట్లే – ఆమెమనోహరుడు సతీప్రియాచరణరక్తిప్రౌఢుఁ డని తిమ్మనగారు నిరూపించినారు.

అన్నివేలమంది భార్య లున్నకృష్ణునికి తా నొక్కతెనే భార్యననుకొనునంతభ్రాంతి, అంతలోనే యాతఁ డన్యాసక్తుఁ డై నాఁ డన్నయనుమానము, ఆతడు తనకన్నుసన్నలనే మెలంగవలె నన్న యాకాంక్ష, అతడు తన కనిష్టము చేసినట్లు విని అతని తల దన్నుసాహసము – ఇ ట్లామె యొకవిచిత్రమైనవ్యక్తి. పతితలమనో నేత్రముల మిఱుమిట్లు గొల్పుచు, ఖండితనాయికాస్వరూపస్వభావము లను విస్పష్టరేఖలతో సాక్షాత్కరింపజేయునిట్టిమహోజ్జ్వలవ్యక్తిత్వము గలస్త్రీపాత్రను సృష్టించి చమత్కారము చేసినాడు తిమ్మకవి.

" రూపయౌవనసంపన్నా స్వసౌభాగ్యేన గర్వితా "

అనిమాత్రమే సంస్కృతహరివంశమున వర్ణింపబడినయాభామ చైతన్య సీమగా, ప్రేమాభిరామగా, విచిత్రగుణస్తోమగా సశరీరవిఖ్యాతనందనా రామగా, స్వాభిమానసీమగా, పుణ్యకవ్రతాచరణపునీత మై పురుషో త్తమునెద కెక్కినపుణ్యవతీలలామగా పారిజాతాపహరణకావ్యమున సాక్షాత్కరించుచున్నది. ఈసత్యభామాపాత్రచిత్రణము తిమ్మనగారి కీర్తికిరీటమున నొకకలికితురాయి !

## (ఆ) శ్రీకృష్ణపాత్రచిత్రణము

లతాంతాయుధునికన్నతండ్రియు, రసజగత్స్రష్టును నైనశ్రీమహావిష్ణువు ద్వారకలో శ్రీకృష్ణుడుగా నవతరించి, నరకా సురుని గెలిచి, యాతనియింట నున్నయచ్చరలకులమువా రైనపదాఱు వేవురు లలనామణులు తన్ను వరింపగా నారదునిపంపున సౌఖ్యరసైక లోలుడై వారిని పరిణయమైనాడు. దీనినిబట్టి కృష్ణుడు మహావీరుఁ డనియు, జగన్మోహనాకారుఁ డనియు, ఋషిజనవిధేయుఁ డనియు, భక్తిపరాధీనుఁ డనియు, మహాభోగి యనియు స్పష్టమగుచున్నది.

పై పదాఱువేలమందికన్న ముందే రుక్మిణి, సత్య, జాంబవతి, మిత్రవింద, భద్ర, సుదంత, కాళింది, లక్షణ, యనునభిమానవతు లైన యష్టమహిషులును ఆయనకు కలరు. ఆరమణు లందఱితో యదూద్వహుడు ద్వారవతీపురోపవనవాటికలో, కృతకాద్రిసీమల, వారిధితీరకుంజ సదనంబుల, కేళితరంగిణీతటీచంద్రకాంతమణిసౌధముల వసించుచు, నేయేవేళల నేసరోజముఖి యేయేలీలలం గోరునో ఆయావేళల నాసరోజముఖి నాయాలీలలం దేల్చి, యేచాయం జూచినను దాన యై మాయాకల్పనాచాతురిచే పెక్కురూపముల భోగాయత్తుడై మెలంగువాడు. దీనినిబట్టి కృష్ణుడు దక్షిణనాయకు డనియు, లీలామానుష విగ్రహు డనియు, నాయనది కానిరూపమును - ఆయన లేనిచోటును లే వనియు తెలియుచున్నది.

సతుల నందఱను సరిగా జూచియును భోజజనపాలసుతను, తరుణీమణి సాత్రాజితిని మన్నించి ఆయన మిగుల చన విచ్చువాడు. రుక్మిణీసత్యభామలతో ద్యూతకేళి సలుపువాడు.

ఒక్కనాఁ డాయన రుక్మిణీకాంతగృహమున ద్యూతకేళి నుండగా వచ్చినసురముని కెదురువెళ్ళి నమస్కరించి, యాతిథ్య మిచ్చుటయు 'మీరాకచే నేను కృతార్థుడ నైతి' ననుటయు మానవ రూపు డైనయాభగవంతునియార్యధర్మానురక్తికి నిదర్శనము.

"యద్య దాచరతి శ్రేష్ఠః త త్తదే వేతరో జనాః
స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువ ర్తతే"

అని యాగీతాకారుడు భగవద్గీత (౩వ యధ్యాయము) లో ప్రవచించి నట్లుగా తాను తననడవడి యితరుల కొరవడిగా నుండుటకై యిట్లు వర్తించినాఁ డని స్పష్టమగును. రుక్మిణికి తాను పారిజాతము నీయగా - ఆ చెంతనే పొంచి వీక్షించిపోయినసాత్రాజితిబోటి తనవలన నేమేమి కల్పించి చెప్పునో యని యనుమానించుచు నతిథియైననారదునికడ

ప్రద్యుమ్ను నుంచి, తత్తరముతో, చంచలమైనతాల్మితో శ్రీకృష్ణుడు సత్యాసౌధమునకు చనుదెంచుటనుబట్టి సత్యభామావిషయుడైనకృష్ణుని కామెయం దున్నప్రేమాభిమానములును, అమానవతిప్రణయకోపము నకు తట్టుకొనలేనిఆయనరాసిక్యసౌకుమార్యములును వ్యక్తమగు చున్నవి.

చిన్నవోయినచిన్నారిమగువమేడను గాంచి, కృష్ణు డొయ్యన నామెకోపగృహమున జేరి ముసుంగిడియున్నసత్రాజిత్తనయను జూచి మాయ యచ్చునడగా సత్యచెలికత్తెలను మంతనములతో, వాడి చూపులతో, చేసన్నలచే తగుల్పడజేయుచు, చేరబోయి, మధ్యందిన భానుమండలకిరణములచే వాడినతీవను దలపించుసత్యభామను జూచి విస్మితుడైనాడు.

"ఈలలితాంగిచంద మొకయించుక చూచెద" నని యాధూర్తగోపాలుడొకసకియచేతితాలవృంతమును గైకొని ఆమెలోని పంచసాయకశిఖిని దరికొల్పుచున్నట్లు విసరసాగినాడు. ప్రేయసి కోపమును బోనాడునుద్దేశముతో కృష్ణు డామెకు విసరగా–ఆమెకోపము తగ్గుటకుమారు రెట్టింపైనది. ఒక్కసారి తాకినంతనే ఆపారిజాత పరీమళములు కృష్ణునితో సత్యాకోపగృహమునకుకూడ వచ్చినవి. "తావి యిది విస్మయ" మని సత్యభామ తనముసుంగు ద్రోసి సంభృత తాలవృంతుని కాంతుని జూచి బాష్పకళికాతరళీకృతలోచనాంత యై తల వాంచి మరల ముసుంగిడుకొని దళముగా నిట్టూర్పు విడిచి మానక్రోధముచే కుమారిలగా నంబుజోదరునిమదిలో ప్రేమ పొంగి పొరలినది.

ఏమియు నెఱుంగనివాఁడువలె కృష్ణు డామె యట్లుండుటకు కారణ మడిగి "మన మరయందలంచి యొకమార్గమువన్నితో ? నవ్వు టాలకో ? నను వెఱపించెదో ? అకట ! నాయెడ నిక్కముతప్పు కల్గెనో ? పగవాడనో ? న న్నేల చూడవు ? ఒక్కనిముసమైన నీవు దయం

గన్గొనకున్న నిల్వఁగలనా? నాతోఁ దేనె లుట్టిపడం బలుకవేమి? నన్ను బిగికౌఁగిటఁ జేర్పవేమి? ఎవ్వ రెడసేసిరి? నీ కిటు చింతిలనేల? ఎట్టి కామినులకు గారవంబు మెఱమెచ్చులకై పచరింతుఁ గాని, మనమున మాటలం గ్రియల మన్నన లీ నొకనాఁడు – పాయనిఅనురక్తి నీయెడన యగ్గలమై కనుపట్టునాకు నీపనిచినపన్పు సేయుటయ ప్రాభవ మౌటది నీ వెఱుంగవా?" యని యామెను నమ్మింప యత్నించినాడు. ఆమె కోప మెంతకును తీరకపోగా ఆపాటలగంధిపదపల్లవములపాటలకాంతి తనమౌళిమణిపంక్తికి వన్నియవెట్టున ట్లాప్రేమస్వరూపు డర్మిలితో మ్రొక్కి తనరాసిక్యమును చాటుకొన్నాడు.

జలజాతాసనవాసవాదిసురపూజాభాజన మైనయాలతాంతాయుధుకన్నతండ్రిశిర మాలతాంగి వామపాదమున తొలంగద్రోసినది. ఆకోపనపదహాతికి మెయి గగుర్పొడువగా నుద్దీపితమన్మథరాజ్యప్రాపితుడై యాకుహనాగోపాలుడు "నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తాఁచిన నది నాకు మన్ననయ" అని సరిపెట్టుకొన్నాడు. ఆమెపాదము తాఁకినను నిలువెల్ల పులకించినయారసికాగ్రేసరుడు "మత్తనుపులకాగ్రకంటకవితానము తాఁకిన చెల్వగునీపదపంకజ మెంతగా నొచ్చినదో" యని నొచ్చుకొన్నాడు. "అల్కఁ మానవుగదా యిఁకనైన నరాళకుంతలా!" యని ప్రాథేయపడినాడాసత్యభామావిధేయుడు! రాసిక్యచాకచక్యమున కిది పరాకాష్ఠ.

"నే నుండగా నొక్కలతాంతమాత్రమునకే యింతవంత నీకేల? ఆతరువునే పెకలించి తెచ్చి నీపెరటిచెట్టుగా నాటింతు" నని ప్రతినచేసి సత్యభామను ప్రసన్నురాలి నొనరించుకొన్నకృష్ణుడు నారదునిచే ముందుగా నింద్రునికి కబురంపి యామరునాడు గరుడవాహనముపై సత్యాసమేతుడై నరకాపహృతకుండలముల దేవమాత కర్పించుమిషతో చుట్టపుచూపుగా నేఁగినట్లు సురపురిని జేరి యింద్రాదులచే స్వాగతసత్కారము లంది సురపురవీథుల నేఁగుచుండగా – ఆయనను జూచు

సంభ్రమమున హార్మ్యము లెక్కినసురలోకసుందరీమణులమేనులు చెమరించినవి. వారిలో నెన్నో సాత్త్వికభావములు పొడసూపినవి. "వేడుక నీకె కాని మఱిసేజోకయింతికి నైన లేదె? త్రోపాడెద వేల? పెన్ ప్రోడవు గాన నిన్నె కనుఁబో యతఁ డెవ్వరిఁ జూడఁ" డని యామురారిని గనుంగొనువేళ సురనారులు పరస్పరము మచ్చరించుకొనిరి. తన్ను చూచుసురలోకసుందరుల కైన నింతటియాకర్షణము కలిగించిన శ్రీకృష్ణుడు జగదేకమోహనాంగుఁ డని స్పష్టమగుచున్నది. అలికుల వేణి యొక్కతె మురారిని గనుంగొని మ్రానుపాటు నై నెలకొని యున్నచో సడలునీవిక లేఁజెమ రంటి నిలిచినది. ఆద్రౌపదీమానసం రక్షకుడు తన్నుఁ జూచువేడుక నున్నదేవకాంతకును మానసంరక్షకు డైనాడు. కృష్ణునిపై నొకతన్వి కరమున లాజ లెత్తి చల్లగా నామె నెఱివేణి యీసునవలె విరిపూవులను జల్లిన దఁట! లలాటము ఘర్మ బిందువులను చల్లె నఁట! ఆమెచనుంగవ సంభ్రమవశత్రుటితామల మౌక్తికాదులను జల్లె నఁట! పరమేశ్వరార్చనాపరురాలైనయాతన్వి సమర్పింపవలసినపూజాపుష్పాదులను కేవల మామెభక్తికి మెచ్చి కృష్ణుడు తనకు తానే జరిపించుకొన్నాడు! కృష్ణుని జూచి యొకచిలుకలకొలికి సరసత్వము మీఱునట్లు "కృష్ణా!" యని రాచిలుకచే పిలిపింపగా సత్యభామ కాకలికి తెఱంగు శౌరికడకన్నులసన్నల జూపినాఁడఁట! ఇది యాకృష్ణుని కొంటెతనమును చాటును. అంతే కాక — సురలోకసుందరులు వలచుతనయందచందములను, గొప్పతనమును సత్యభామకు ప్రకటించుటకును — తా నంతటియందగాఁ డయ్యును సత్యభామకే తాను మన సిచ్చితి ననియు సత్యకు నమ్మిక పుట్టించు నుద్దేశముతోకూడ కృష్ణు డీపని చేసియుండవచ్చును.

అనిమిషపురజాలకములు వనితాజనతామయములు కాఁగా వనితలహృదయ మనురాగసమయ మై, ఆయనురాగము శౌరిమయ మైన దఁట! అనిమిషకామిను లీరీతిగా సకలజగన్మోహనుఁడైనయా

ప్రేమరసస్వరూపుని కన్నులార గాంచి తమయనిమిషత్వమును సార్థక మొనరించుకొన్నారు.

సత్యభామాసమేతుడై తనసువర్ణచేలాంచలమున కట్టి తెచ్చిన (నరకాపహృత) కుండలముల నదితి కిడగా నాదేవమాత కృష్ణునిమేను నిమిరి, శిరసు మూర్కొని, నియతధ్యానపరులైనమునులుకూడ కన రానికృష్ణభగవానుని గాంచి గతకల్మష నైతి నని తనధన్యతను ప్రశం సించుకొన్నది. ఆదేవమాతయభిప్రాయములో కృష్ణుడు త్రిమూర్త్యాత్మ కుడు. బ్రహ్మయై సృష్టిని, జనార్దనుడై జగద్రక్షణమును, భర్గుడై హరణ మును జేయువాడు.

ద్వారక వైకుంఠపురం బీరుక్మిణి లక్ష్మి - మీర లిచ్చట నునికిన్ సారెకుఁ గొల్వఁగ వత్తును గోరికతోఁ గంసహర ! ముకుంద ! మురారీ !" అనియును "హేవిశ్వజనీనచరిత ! యెఱుఁగనె నిన్నున్ ?" అనియును త్రికాలవేదియు, త్రిలోకసంచారియు, దేవర్షియు నైననార దుఁడు డగ్గించుటచే కృష్ణు డవతారపురుషుడైనశ్రీమహావిష్ణు వనియు, ఆవైకుంఠుఁ డెట నున్న నదే వైకుంఠ మనియు స్పష్టమగును.

'ప్రామినుకులదొంగ పాతాళకుహరంబుఁ
జొరఁ బాఱి చీఱినచోఱ వీవ ।'

ఇత్యాదిగా నారదుడును,

"వాలముతాఁకునన్ గిరులు వజ్రనిపాతము సంస్మరింపఁ బెన్
వాలుగ వై .... .... నిగమాళిఁ దమ్మిపూ
చూలికిఁ దెచ్చి యీవె త్రిదశుల్ గొనియాడ మురాసురాంతకా ।"
[3 ఆ - 28 ప]

ఇత్యాదిగా దేవమాతయైనయదితి చేసినప్రశంసలనుబట్టి శ్రీకృష్ణుడు దుష్టశిక్షణార్థమును, శిష్టరక్షణార్థమును దశావతారములను దాల్చు పరాత్పరుడే యని స్పష్టమగును.

"పరిత్రాణాయ సాధూనాం
వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే"

అని గీతాకారు డైనయాశ్రీకృష్ణభగవానుడే యర్జునునికి స్వాయముగా చెప్పియున్నాడుకదా!

"సర్గ మొనర్తు బ్రహ్మ - యన సత్కృపఁ బెంతు జనార్దనుండ నా -
భర్గుఁ డనంగఁ గ్రమ్మఱఁగఁ బారణ సేయుదు విశ్వగంబు"
(3 ఆ - 27 ప)

అన్నయదితిమాటలనుబట్టి శ్రీకృష్ణుడు సృష్టిస్థితిలయకారకుడై, త్రిమూర్త్యాత్మకుడై సమహానుభావు డగుట స్పష్టము.

దేవర్షియు, దేవమాతయు శ్రీకృష్ణు డవతారపురుషుడని గుర్తించినట్లే -

'శరధిక్రోడనివేశ: చక్రధర: కంసద్వేషి:'

ఇత్యాదిస్తుతిలో ఆయనపై తాళికులుకూడ ఆయనను భగవంతుడుగానే గుర్తించిరి.

కోపగృహమున నున్నఖండితనాయిక యైనసత్యభామను దేర్చుటకై "మాయ యచ్చువడంగ (1 ఆ - 107 ప) నామెదరిఁ" జేసినా డని తిమ్మకవి చెప్పుటయు కృష్ణునిలీలామానుషవిగ్రహత్వమునే చాటుచున్నది.

సత్యాసమేతుడై సురలోకయాత్ర సలిపినయాశ్రీకృష్ణుడు భగవంతు డని గుర్తించుటచేతనే అంబరచారిపంకజపళాక్షులు ఆపీతాంబరు పాదపంకజము లంటిన తావులు త్రొక్కనోడి తత్పార్శ్వముల సంచరించినారు. (4 ఆ - 15 ప)

" చోద్య మప్పుడు భవరోగవైద్యుఁ డైన
యంబుజోదరు డాసినయంతమాత్ర
నపగతాసాధ్యగదుఁ డయ్యె యక్షభర్త ;
సొరిది రుద్రులు నిర్ముక్తశూలు లైరి ; "

[5 ఆ - 11 ప]

అనుపద్యము శ్రీకృష్ణునిసర్వేశ్వరత్వమును స్పష్టము చేయుచున్నది.

" కినిసి బిడౌజుఁ డాగ్నేయాస్త్ర మడరింప
నది శార్ఙ్గితేజంబునందు డిందెఁ
గనలి వృద్ధశ్రవుం డనిలాస్త్ర మేసిన
నది యదూద్వహునూర్పునందు డిందె
నలిగి బలారి సౌరాస్త్రంబు నిగిడింప
నది శౌరివలచూడ్కియందు డిందె
నదరి యింద్రుండు బ్రహ్మాస్త్రంబు పయికొల్ప
నది మురాంతకునాభియందు డిందెఁ

బాకదమనముక్తపాశుపతాస్త్రమ్ము
హరినిజార్ధతనువునందు డిందె
నేమి చేయవచ్చు ? నీశ్వరుం డఖిలాత్ముఁ
డతని గెల్వఁ దనకు నలవి యగునె ? "

[5 ఆ - 31 ప]

శ్రీకృష్ణుడు సర్వదేవాత్మకు డనియు, హరిహరస్వరూపు డనియు నందు చేతనే యమరేంద్రు డాయనపై ప్రయోగించినయస్త్రము లన్నియును వ్యర్థము లైన వనియును నీపద్యము స్పష్టము చేయుచున్నది.

సత్యభామ కృష్ణుని పుణ్యకవ్రతసందర్భమున దానమిచ్చుటకై పారిజాతతరువునకు కమ్మపూదండచే కట్టగా -

" బలిదమజేంద్రుఁగట్టి తని పల్కఁగ విందుము గాని, నేఁడు మా
చెలి యిదె పుష్పదామకముచే నినుఁ గట్టఁగఁ గంటి "

(5 ఆ - 81 ప)

మని సత్యచెలికత్తెలు మేలమాడిరంట! దీనినిబట్టి సత్యభామసకియలు కూడ కృష్ణుని భగవంతునిగానే గుర్తించిరని తెలియుచున్నది.

పరమముని నారదుడు కపటనటనాపటుండైన కంసవైరిచే నవ్వులాటలకై పనులు గొన్నాడని చెప్పుసందర్భమున తిమ్మకవి రచించిన–

“ నిగమాంతప్రతిపాద్యు నాద్యు నభవు న్నిత్యు న్గుణాతీతు వి
శ్వగురున్ జిన్మయు నవ్యయుం బరము విశ్వంకరం బను ల్గాంచు మా
నిగరిష్ఠుండు కృతార్థుఁ డయ్యె ....’ (౫ ఆ - 87 ప)

అనుపద్యము శ్రీకృష్ణుడు శ్రీమహావిష్ణువే యని వేనోళ్ళ చాటుట గమనింపదగినది.

స్థూలదృష్టికి కృష్ణుడు సత్యభామావిధేయుఁడైన శృంగార నాయకుడుగా, తత్పదస్పర్శమాత్రపులకితుడైన రసికశిఖామణిగా తన ముద్దుగుమ్మ ముద్దు చెల్లించుటకై పారిజాతపాటచ్చరుడై తన కడ్డు నిలిచిన యమరేంద్రు నోడించి సురలోకపారిజాతమును ధరణికి తెచ్చిన మహావీరుడుగా గోచరించినను – సూక్ష్మదృష్టికి త్రిమూర్త్యాత్మకుడైన పరాత్పరుడుగా సాక్షాత్కరించుచున్నాడు.

కృష్ణుడు ప్రియాంగనతో నిజహస్తతలమున నూఁది వనవిహారము చేయుట, సత్యాకృష్ణు లొండొరుల కేలుదమ్ముల నూఁతగొనుచు వేలుపుఁగోలను దరియుట, వల్లభునిభుజాస్తంభ మూఁది సత్యభామ నవరాజహంసి యనునట్లు సలిలవిహరణ మొనరించుట, వైజయంతమున గడపిన రేయి మనోభూరాజ్యసౌఖ్యనిద్రాపారీణత నుండుట సత్యాకృష్ణుల యన్యోన్యతకు నిదర్శనము.

నందనపారిజాతమును సత్యభామకు చూపి – “సురవల్లభుఁ డాశచి సంకపీఠముం జేరిచి సోగవెంట్రుకలచిక్కులు వాపి, వియన్నదీన వాంభోరుహనాళసూత్రములతో పారిజాతలతాంతములను సరులుగా

రచించి యామెమెఱుంగుక్రొవ్వేదను నించు" నని చెప్పి, ఆవెంటనే సత్యభామ కట్టియదృష్టమునే కల్గింపగోరి యామెకు కర్ణావతంసముగా పారిజాతతరుగుచ్ఛ మిడి సురలోకసుమధారణానుభవమును తొలిసారిగా మచ్చుచూపి యామెను తృప్తిపరచుట శ్రీకృష్ణునిశృంగారపరతను చాటును. మదోన్మాదితరాజకీరవదనత్రుటితము లైనదాడిమీబీజములను వర్ణించి చూపుచు సత్యభామకు తనదంతక్షతకార్యము స్ఫురించునట్లు చేసినాఁడారసికుడు. నందనారామమున సత్యతో కృష్ణుడు చేసినసల్లాప మాయనవాక్చాతుర్యమును ప్రకటించుచున్నది.

సత్యాసమేతుడై నందనమున విహరించుచుండగా – మలయ సమీరణమునకు పండుటాకులు రాలిపోగా నందనవనమునందలిపొదు లనునుపోగతీగలను చూడగానే యదుప్రభునికి బాలచాపలవ్యాతతీర వస్త్రులై పంకరుహాకరమధ్యసీమల నిలిచినముగ్ధగోపరమణీరమణీయ విలాసములు తలపునకు వచ్చినవి! ఇది బాలకృష్ణునిలీలాశృంగారమున కొకమచ్చుతునక. ఆమదనజనకుడు నందనమునందలికుహాళీవిగళన్నవ కోరకావళులను సత్యభామకు చూపి, పాణిపీడనవేళ వసంతుడును, వన వాటికారమాతరుణియు నొండొరులపై చల్లుకొనుసేసప్రాలవలె నున్న వని చెప్పి తమపాణిగ్రహణమునాటిమధురస్మృతు లామెమనసున మెదలునట్లు చేసినాడు.

సకలసురైకవంద్యుడు చక్రధరుడు. అంతటిభగవంతుడే స్వయముగా వచ్చి తన్ను నుర్వికిఁ గొనిపోవవచ్చె నన్నకౌతుకముతో వలె నభీష్టవస్తుదాయకతరుచక్రవర్తి యైనపారిజాతము ఆతతవాతవిధూ తశాఖమై సంభ్రమముతో నటింపగా – నట్టియదృష్టము తమ కబ్బలే దని వగచుతక్కినసురభూరుహాములు మధురసాశ్రుపూరము నించిన వఁట! సురలోకాభిమతప్రదానమునకు తా నుండగా తాను చేయుపని నాచెట్టు చేయుచున్నదే యన్నయీర్ష్య వహించినాడో యనునట్లు శ్రీకృష్ణుడు గోవర్ధనోద్ధరణప్రస్తుత మైనతనహస్తముతో పారిజాత

తరువు నుత్పాటించినా డని కవి గడుసుగా చెప్పుట గమనింపదగినది. గరుడనితెక్కలగాడ్పునకు తక్కినవేల్పుతరువులు పెల్లగిలి హరి వెంట పోవుచుండగా వనపాలకు లడ్డగించుటచేతను, వానిని తోడ్కొనిపోవుట కృష్ణభగవానునిసంకల్పము కాకపోవుటచేతను నవి నందనమున నే యుండి పోవలసి వచ్చినది. అడ్డువచ్చినవనపాలకులతో హరి యేమో వచి యింపబోవుచుండగా ఆయనను సత్యభామ కనుసన్నచే మాటాడకుండ చేసి శ్రీకృష్ణభగవానుడు సత్యభామావిధేయు డని నిరూపించినది. " తా వీరపత్ని యేని మీ శచీదేవి తనదు ప్రాణేశుఁ డైనమఘవు నిటఁ బంపి సత్యభామావిధేయువలన మరలంగఁ గొనుడిపో వాసితనము " అని సత్యభామ తనమగడు సత్యభామావిధేయు డని సగర్వముగా వన పాలకులతో వాచ్యముగానే చెప్పివైచినది. " అల సత్యభామకన్నన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁ డై యనపించు" నని నారదుఁ డెన్నఁడో రుక్మిణితో నన్నపలుకులు సత్యములే యని యిక్కడ మరల నిరూ పింపబడినవి.

ముందల వట్టినట్లు తనముఖ్యతరాస్త్రముఁ గొన్న దేవకీనంద నునికి జాగిలి మ్రొక్కి దేవేంద్రుడు తనయపరాధమును మన్నింపు మని వేడికొన్నాడు.

నీవలన తప్పులేదు – నీమఱందలు కోరగా నీవదాన్యభూరుహ మును దెచ్చితిని – నీసొమ్మునను నీవె కొ " మ్మని హరి వజ్రి మిచ్చి పారి జాతమునుకూడ నీయజూపినాడు. విజేత యయ్యును నింతమంచితనము చూపుట శ్రీకృష్ణునియౌదార్యమునకు నిదర్శనము.

" సొమ్మన నెద్ది ? యే ననఁగ సొమ్మన కెవ్వఁడ ? కర్త వీవు – నీసొ మ్మఖిలప్రపంచమును " – అని యింద్రుడు పెట్టకేలకు శ్రీకృష్ణునిపరమేశ్వరత్వమును గుర్తించినాడు.

భవరోగవైద్యు డైనయా శ్రీహరి పారిజాతముతో ద్వార కలో నడుగుపెట్టగానే వృద్ధులు నవయౌవన మందుట, రోగు లారోగ్య

మందుట, యంగవికలుర కంగనై కల్యము తోలంగుట, జరిగినవి. ఈవిధముగా సత్యామానరోషము వోనాడుటకై కృష్ణు డొనర్చినయత్నము సురలోకతరువును పుడమికి దించి, లోకకల్యాణము నాపాదించినది.

విష్ణువవలెనే విస్మయాపాది యైనయాపారిజాతముకూడ వామనత్వము నందుచు, మరల పెరుగుచు, నభిలషించినరూపము నభినయించుచు, నుల్లమునఁ గోరుగోరిక లొసంగుచు సత్యభామాగృహారామనిత్య మైనది.

"సతులఁట ప్రాణనాథు లఁట ! సారెకు నైక్యము లైనమోహసంగతులఁట ! యేమి సెప్ప ! బలఘస్మరుఁ బోర జయించి కల్పకక్షితిరుహమును"

నిజేశ్వరికి కృష్ణుడు తా నిటఁ దెచ్చె నని సతులు పదారువేవురును సత్యాకృష్ణులప్రణయమును సంస్తుతించిరి.

పరమమునిమానసాలానబంధనమునఁ గు దు రు వ డ కుం డు యాదవకుంజరుండు పుణ్యకవ్రతవేళ దానార్థమై వికచరాజీవనేత్రచే వేల్పుమ్రానఁ గమ్మపూవులదండచేఁ గట్టువడుట సత్యభామయందాయన కున్నయవ్యాజానురాగమునకు నిదర్శనము.

సత్యభామ శ్రీకృష్ణుని నారదునికి ధారవోయగా "సత్యాసతి నిన్ను మాకు నిచ్చినది. మాయభీప్సితకృత్యములు సలుపు" మనుచు నారదుడు కేళిపరుడై కృష్ణునిమాంసలాంసమున తనమహతి నుంచి, డాచేతికి మణికమండలు విచ్చి, వలకేల తనపద్మాక్షవలయము నుంచి, తనశార్దూలచర్మమును భగవానునిచంకను జొనిపి, "షా" మ్మనుచు, మరల "ర" మ్మనుచు, కపటనటనాపరు డైనకంసవైరిచే పరమముని నవ్వులాటలకు పనులు గొన్నాడు. ఈవిధముగా కృష్ణుడు తాను భక్తపరాధీనుడ నని నిరూపించుకొన్నాడు.

కలహాసనుకు పారిజాతసుమము నొసంగగా మాధవుఁడా గ్రొన్ననఁ గైకొని ఎదురుగా నున్న తిమ్మకనందనను కన్నులతోను, ఎటనో యున్న సత్యభామను మనసుతోను చూచినాడు ! ఆయనతలంపులలో నిండినది సత్యయే.

" ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నే మంచు నూహించునో
మది పాత్రాజితి, దాని కే నిపుడు ప్రేమం బంపినన్ దీని నె
ల్లిదముం జేసినజాడ దోఁచునొకొ ? "

అనుకొన్నాడు. ఆపూవును సత్యభామకే ప్రేమతో పంపవలె నని ఆయనసంకల్పము. కృష్ణుడు భగవంతుడు. చివర కాభగవత్సంకల్పమే నెరవేరి – ఆసత్యభామ కొక్క-పారిజాతసుమముమాత్రమే కాక పారిజాత వృక్షమే యామె పెరటిచె ట్టైనది !

సరసమునకే కాదు – సమరమునకై నను సత్యభామను విడిచి యుండలేనితనము కృష్ణునిలో నిండుగా నుండుటచే ఆమె యాడిన దాటగా పాడినది పాటగా సాగినది.

ఆకృష్ణుడు లీలామానుష విగ్రహుడు. " ఏచాయుం జూచినఁ దాన యై మెలఁగుచున్ సౌఖ్యాబ్ధి నోలాడు భోగాయత్తుం డయి పెక్కు-రూపముల మాయాకల్పనాచాతురిన్ " (1 ఆ – 40 ప) అని తిమ్మకవి ముందుగానే చెప్పియున్నాడు. " సౌఖ్యాబ్ధి నోలాడు భోగాయత్తుం డయి – భోగమయ శరీరమునం దున్న యాస్వామికి భోగమే ప్రధానము. అందుకోసమై ఆయన మాయ చేయును. ఇంతవఱకును స్వభార్యలందుమాత్రమే ప్రయోగింపబడినకృష్ణునియీమాయాకల్పనా చాతురి యింద్రుఁ డంతటివానిని లోఁగొని – ' యీయుపేంద్రుఁడు నాయింటికి వచ్చినచుట్టమేకదా ' యని నమ్మి మాయలో పడినరీతిగా దేవేంద్రుడు తనపారిజాతమును గోలోప్రపుస్థితికి తెచ్చినది.

అక్కడ రుక్మిణితో కృష్ణుడు జూదమాడుట సత్యభామ చెలికత్తె చూచినది. కనుక నిక్కడ సత్యభామతో కూడ నాయన జూద మాడి యామెకు సంతృప్తి కలిగించినాడు. ఆరుక్మిణికి పారిజాతపుఁబూ విచ్చినాడు. కనుక నీసత్యకు పారిజాతవృక్షము నే తెచ్చి కానుక పెట్టినాడు.

"మానినీ! అంగన! అదృష్టసింహోదరసన్నివేశ! ఏణీశాబవిశాలనేత్ర!, సకలేందుబింబముఖ! అళిప్రకరాద్వయవాదికైశికా! హాయనమాత్రకురంగలోచనా! నవచంద్రాలిక! అరాళకుంతలా! అంభోరుహాక్షీ! సతి! గంభీరవేదిగమన! కువలయపత్రనేత్ర! లలితేంద్రనీలశకలోపమకైశిక!' – అని సత్యభామను సంబోధించుటను బట్టి కృష్ణుని కాసుందరియందు గలయనురక్తి స్పష్టమగును.

"భోజకన్యాసరిద్రాజహంసమై, సత్యభామాశుకీకేళీ పంజరమై, జాంబవతీనిశాచంద్రోదయమై, కాళిందీసరోజినీందిందిరమై, భద్రాకలాపినీప్రావృడంబుదమై, సుదంతారసాలలతాపికమై, మిత్రవిందావనీచైత్రాగమమై, లక్షణాహారయష్టికానాయకమై, షోడశసహస్రకామినీస్తోమధేనుకారిరంసామదోత్కటవారణేంద్ర మనునట్లఖిలావనైక వర్తిష్ణుడై శ్రీహరి సౌఖ్యాంబునిధి నోలలాడినాడు.

ఈవిధముగా శిష్టరక్షణార్థమును దుష్టశిక్షణార్థమును మత్స్యకూర్మాద్యవతారములు దాల్చినశ్రీకృష్ణుడు దేవమాతమన్నన లందిన త్రిమూర్త్యాత్మకుడుగా, జగత్పతిగా నిటు నారదునికిని, రసికశేఖరుడైన పతిగా నటు సత్యభామకును విధేయుడుగా, పూసలలో దారమువలె నేకకాలమున ననేకభార్యలతో విహరించుసర్వాంతర్యామిగా, భోగాయత్తుడై నజగదేకదక్షిణనాయకుడుగా, సకలజగదేకమోహనుఁడుగా అసురులనేకాక యమరులనుకూడ జయించుజగదేకధన్విగా, బ్రహ్మాస్త్రవాయువ్యాద్యస్త్రముల కతీతుఁడైనయఖిలాత్ముడుగా, నెదిరించిన యింద్రునిక్షమించినయుదారుడుగా, సకలాగమకోవిదుడుగా, గురుజన

విధేయుడుగా, చతురవచోవిలాసుడుగా, అమోఘసంకల్పుఁ డైన జగన్నాటకసూత్రధారిగా, అనురాగరసస్వరూపుడుగా, నీకావ్యమున గోచరించుచున్నాడు.

తిమ్మకవి తనకావ్యము శృంగారరసప్రధానము కనుకను - నాయికానాయకులు రసజగద్రహస్యవేత్తలు కనుకను - కృష్ణునిమాటలను, చేతలను చరిత్రను చిత్రించునపు డెల్ల సుకుమారశృంగారస్ఫూర్తిమంతముగా కల్పన పన్నుట ఆయనకావ్యశిల్పాభిజ్ఞతకు సిడ మెత్తుచున్నది.

## (ఇ) నారదపాత్రచిత్రణము

పారిజాతాపహరణనాటకమునకు జగన్నాటకసూత్రధారియైనశ్రీకృష్ణుడు సూత్రధారి కాఁగా నారదుడు నాంది ప్రవర్తకు డైనాడు. వారిద్దరును పరస్పరము సహకరించుకొనియే యీకావ్యమునందలికథ ముందునకు సాగుటకు దోహదము చేసిరి.

నారదుడు బ్రహ్మమానసపుత్రుడు.

"అశ్వత్థో వృక్షజాతీనాంబ్రహ్మలోకగురుర్భవాన్
మేరు స్త్వం పర్వతేంద్రాణాం దేవర్షీణాంచ నారదః"

అని హరివంశమునందు కృష్ణునిగూర్చి మహేశ్వరు డన్నాడు. కనుక కృష్ణత్వమునకును నారదత్వమునకును నభేదప్రతిపత్తి.

"సాధులహృదయము నాయది
సాధులహృదయంబు నేను - జగముల నెల్లన్
సాధుల నేన యెఱుంగుదు
సాధు లెఱుంగుదురు నాదుచరితము విప్రా!

అని శ్రీమహావిష్ణువు దుర్వాసునితో నన్నట్లు భాగవతమున [1] నున్నది.

1. ఆంధ్రమహాభాగవతము (అంబరీషోపాఖ్యానము) - బమ్మెరపోతన

హరి నరకాసురుని గెల్చి యాదవుజేంద్రునియింట నున్న యచ్చరలకోలమువారై, తన్ను వరునిగా గోరుపదాఱువేవురు లలనామణులను నారదునిపంపున పరిణయమైనట్లు తిమ్మనగారు రచించిరి. దీనినిబట్టి శ్రీకృష్ణుడు నారదవిధేయుడని స్పష్టమగుచున్నది. ఆదేవర్షి మీటకుండగనే ఆయన వీణ (మహతి) నభోవాయునిహతిచే మొరయుచుండగా – ప్రణవమంత్రమును జపించుచు – 'సమరనృత్యోచితచమరవాలంబును భుజాగ్రమున నిడికొని ఆయారివేరంపుఁదపసి కావలె నని కయ్యము పెట్టుటకే ద్వారకలో నుండిసత్యాదేవికడకు వచ్చినాడు. బ్రహ్మమానసపుత్రుడు, దేవర్షి మొదలైనయితరవిశేషణములు ప్రయోగింపక 'ఆరివేరంపుఁదపసి' యనుసాభిప్రాయవిశేషణముచే తిమ్మకవి రాబోవుకథను సూచించినాడు. సమరనృత్యోచితచమరవాలమును తనతో తెచ్చుకొనుటకన్న నారదునికలహప్రియత్వమునకు మఱియొక తార్కాణ మేమి కావలయును ?

'కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా, విద్ధేన మిహ వైరిణమ్'

అని శ్రీకృష్ణభగవానునిగీతాప్రవచనము. రజోగుణకార్య మగుకామమును, అది విఫల మగునపుడు జనించుక్రోధమును పాపాచరణమునకు ముఖ్యహేతువులు. ఈకామ మెప్పటికిని చల్లారునది కాదు. మహాపాపి. ఇదియే జీవునకు పరమశత్రువు – అని పైశ్లోకమున కర్థము. ఇట్టికామక్రోధములకు నెలవై, యహంకరించి, యసురులబారినుండి తన్ననేక పర్యాయములు పరిరక్షించి స్వర్లోకసామ్రాజ్యపట్టభద్రునిగా నిలిపిన శ్రీహరినే యెదిరించుస్థితిలో నున్నాడు దేవేంద్రుడు. కనుక ఆయింద్రునికన్నులు తెరిపించునుద్దేశముతో నారదుడు శ్రీకృష్ణుని స్వర్లోకపారిజాతహరణమునకై పురికొల్పుటకు పుడమికి దిగివచ్చినాడు.

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
త దహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః"

అని భగవద్గీతావాక్యము. కనుక భక్తితో సురలోకపారిజాతసుమమును దెచ్చి నారదు డాభగవంతుని కర్పించినాడు. అర్పించి యూరకొన్నాడా? 'ఈపూవును సత్యభామ కిచ్చుటా? చెంతనే యున్నరుక్మిణి కిచ్చుటయా?' యని సంశయించుచున్నకృష్ణునియాంతర్యమును గ్రహించినమునినాథుడు కన్నుసన్న చేసి కృష్ణు డాపుష్పమును రుక్మిణికే యిచ్చునట్లు చేసినాడు. చేసి యూరకొన్నది లేదు. ఆజలజాసనుపట్టి రుక్మిణితో –

" జలజాక్షి ! యిది పారిజాతప్రసూనంబు
నరులకు ధరియింప నరిదిసూవె !
పౌలోమి పార్వతి పద్మ పద్మజురాణి
యును శిరమ్మునఁ దాల్తు రనుదినంబు
హరిబహిఃప్రాణంబ వగుట నేఁ డెఱుఁగంగ
వచ్చె నీ కిపు డిది యిచ్చెఁ గాన
వెలఁదులు పదియాఱువేవురలో నెన్న
సరి లేరు సౌభాగ్యగరిమ నీకు "

(1 ఆ - 58 ప)

అనియు, పరిమళము చెడనిది, వాడనిది, పరువము తప్పనిది – యని యాపుష్పమహిమ నగ్గించియు, తన్మహిమచే సవతులు వచ్చి రుక్మిణీ చరణసారసయుగ్మము నాశ్రయింతు రనియు నెలుఁగెత్తి చాటినాడు.

" అలినీలాలక ! నీవు నీపతి రహస్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధసంగరంబునకు మల్లాసంబుఁ గల్పించును
జ్జ్వలదీపాంకురమై రతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబుల్ తొలఁగింపఁగా సురటి యై రంజిల్లు నిచ్ఛాగతిన్ "

అని వాక్రుచ్చెను. జగజ్జనకు లైనట్టియు, లక్ష్మీనారాయణులే యని తా నెఱింగినట్టియురుక్మిణీకృష్ణులయెదుట నారదుఁ డిట్లనుట యనుచిత మని వాదించువారు కలరు. ఇం దనౌచిత్యము లే దని యాచిత్య విచార మనెడిప్రకరణమున వివరింపబడినది.

'నారదుఁడు జితేంద్రియుఁడును, బ్రహ్మచారియు నైనంత మాత్రమున నట్టిమహర్షులకు లోకప్రవృత్తి తెలియకూడ దనునియమము లేదు. పారిజాతప్రసూనప్రభావ మట్టిది. కాఁగా నాపుష్పప్రభావమును వర్ణించునట్టిమహానుభావుఁడు నిష్కపటియు, యాథార్థ్యవక్తయు నై యుండగా నిఁక నున్నవిషయమును నివేదింపఁజేసినతిమ్మనార్యుని లోప మెచ్చటను గానవచ్చుటలేదు. నారదమహర్షి యంతటివాఁడు కావుననే పారిజాతమున కున్నతదితరగుణముల వర్ణించినట్లే యీగుణవిశేషమునుగూడ నేకరువు పెట్టినాఁడు. ఆచెప్పినసందర్భమును జూడ సర్వలోకముల కాదిదంపతు లనఁదగుసాక్షాత్తులక్ష్మీనారాయణుల యపరావతారము లైనరుక్మిణీశ్రీకృష్ణులు గూడి యున్నప్పుడే. కావున నిం దేమేని దోసం గుండిన నాస్వామి యిన్నకుండునా ? రుక్మిణీదేవి సహించునా ? వారలమాట య టుండ బ్రహ్మజ్ఞాని యైననారదుఁ డట్లు పలుకునా ? మహానుభావ మైనయొకప్రధానపాత్రకే పొచ్చెము నాపాదించునంతటియనౌచిత్యమును వర్ణించి తనకావ్యమునందు రసభంగమును గలిగించుటకు నందితిమ్మనార్యుఁడు పాలుపడునా ? కావున నీసందర్భమునం దున్నపైపద్యము పారిజాతప్రసూనమున కున్నప్రధానగుణములలో నొకదానిని వర్ణించుచున్నమూలశ్లోకమున కనువాదమే కాని మఱి వేఱొక్కతలంపుతోఁ గవి కల్పించి నారదునిచేతఁ బలికించినదిమాత్రము కాదు ' అనియు, అది దోషమే కా దనియు — అది దోష మనుకున్నచో దానికి తిమ్మనగారు బాధ్యుఁడు కానేకాఁడనియు డాక్టర్ పి. యశోదారెడ్డిగారు సమర్థించిరి. అంతేకాక ప్రబంధయుగపుసాధారణధర్మములనుబట్టి చూచినను నిది యంతటియసభ్యతాదోషదుష్టము కా దనియు, కనుక నీపద్యమువలన నారదపాత్ర కెట్టిలాఘవమును జేకూర దనియు, నామెనిశ్చయము.

ఇఁక మఱొక్కరియభిప్రాయమును బరిశీలింతము — "ఆయన భగవంతుఁడు. ఆమె భగవతి. నారదుఁ డిట్లనవచ్చునా ? యని కొందఱిసందేహము. నారదుఁడు తాతగారివంటివాఁడు. వీరు పసి

పిల్లలు. కొందఱువృద్ధులు యౌవనములో నున్నపడుచువాండ్రతో దగ్గఱబంధుత్వ మున్నచో - ముఖ్యముగా ప్రేమయు చనవు నధిక ముగా నున్నచో - నింతస్వాతంత్ర్యమును తీసికొందురు. ఇది లోక సహజము. నిజమునకు స్త్రీపురుషసంగమము సృష్టిహేతువు. అది ధర్మ బద్ధ మైనపుడు దోషములేదు. అది సృష్టిహేతు వని ధర్మబద్ధ మై యుండవలయు నని లోకము తుచ్ఛకామప్రవృద్ధబుద్ధి నై దానియం దసభ్యబుద్ధి కల్పించుకొనెను. తల్లిదండ్రులసంగమము లేక పుత్రో త్పత్తి లేదు. చెల్లెలి నెవరికో యిచ్చి పెళ్ళి చేయుట సంతానము కొఱకే" యని కవిసమ్రాట్ శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారియభి ప్రాయము. (కావ్యపరీమళము - పు 61) పై యిద్దఱియభిప్రాయము లును సమంజసముగానే కన్పట్టుచున్నవి.

"సురసంయమివర ! మీ రిట కరుదేరఁగ నిప్డు డేఁ గృతార్థుఁడ నైతిన్" అని శ్రీకృష్ణభగవానుడే పలుకుటనుబట్టి నారదుఁ డాడినప్రతిమాటయు సంయమముతోనే యన్నట్లును, కలహా శనునిరాకచేతనే కృష్ణుడు పారిజాతమును భువికి దించి కృతార్థుఁ డగుట తటస్థించె ననియు స్పష్టమగును.

శ్రీకృష్ణుని కార్త్మియుఁడును, భక్తుఁడును నైన దేవర్షి నారదుఁ డాయనయంతఃపురమునకును ననుమతి ముందుగా నొందకయే ప్రవేశించుస్వేచ్ఛ కలవాఁడు కనుకనే శ్రీకృష్ణుడు రుక్మిణీసౌధమున నుండఁగా నాకస్మికముగా నచటికిఁ బోయి, యీమరునాఁడు సత్య భామాసౌధమున నుండఁగా నక్కడికిని బ్రవేశించినాడు.

మత్స్యకూర్మవరాహాద్యవతారములు ధరించినమహావిష్ణువే కృష్ణుఁడుగా నవతరించె నన్నయెఱుక కలవాఁ డీదేవర్షి. "తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పులఁ గూటిచవిఁ దేల్చినట్టికచ్ఛపము వీవ" అని- ఓకృష్ణా! నీయనుగ్రహము లేనిచో దేవతల కమృతాన్న మెక్కడిది ?

దేవేంద్రునికి స్వర్గాధిపత్య మెక్కడిది ? కనుక నీకు ఋణపడి యున్న ఇంద్రుడు నీ వేమి కోరినను నీయవలసినదే యనియు, నీవు సంకల్పించి నచో నాదితిజులను మెట్టినట్లే యదితిజుఁ డైనయింద్రునికూడ మెట్ట గలవుసుమా ’ యని నారదుడు శ్రీకృష్ణు నాపనికిఁ బ్రోత్సహించుట యున్నది. ఇది నారదుఁడు చేసినదశావతారస్తుతిలో గర్భితమై యున్న రహస్యము.

ద్వారక వైకుంఠపురం బీరుక్మిణి లక్ష్మి. ” అనుటనుబట్టి సురభూజ మైనపారిజాత ముండుటకు భూలోకవైకుంఠపుర మైనద్వారక యర్హ మైనదే యని నారదునియాంతర్యము కానోపును.

“ మీరలిచ్చుట నునికిన్ సారెకుఁ గొల్వఁగ వత్తును గోరిక తోఁ గంసహర ! ” అనుటనుబట్టి నారదుడు పుణ్యకవ్రతసందర్భముగాఁ దాను మరల పుడమికి వచ్చుటను సూచించియున్నాఁడు.

కృష్ణునిసమక్షమున కలహాశనుఁడు పారిజాతప్రభావమును రుక్మిణికి వర్ణించి చెప్పుటలోనే కలహబీజములు నాటినాఁడు.

“ పెలఁదులు పదియాఱువేవురలో నెన్న సరి లేరు సౌభాగ్య గరిమ నీకు ” అని రుక్మిణితో నాతఁ డనుట సర్వసాధారణముగా సవతు లందఱికిని గోపము తెప్పించుట.

“ నెఱిగొప్పున నీకుసుమంబుఁ దాల్చుటన్ సవతులు వచ్చి నీచరణసారసయుగ్మము నాశ్రయింతు ” రనుటలో సత్యభామాదు లైనసవతులందఱికిని మన మెఱియించుట యున్నది.

“ ఇన్నిదినంబులున్ సవతులిందఱలో వలసత్యభామకన్
సన్నలఁ ద్రిమ్మఱున్ హరి వశంవదుఁ డై యన విందుఁ గాని
....లేకున్న నవర్ఘదివ్యకుసుమోత్తమ మేరికినైన నిచ్చెనే ? ”

" చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ బే
రెక్కినదాన నంచుఁ బతి యెంతయు నా కమరక్తుఁ డంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య యింతకున్
వ్రుక్కకయున్నె నీవలపు సూచిన బోఁటులు విన్నవించినన్ ? "

ప్రత్యేకముగా సత్యభామపై రెత్తి కలహాశనుఁ డాడినయీపలుకులు మానవతియు, మహనీయసౌభాగ్యగర్వితయు నైనసత్యభామమనస్సును మండింపజేసి కలహము పెట్టుట కుద్దేశించినవే యని వేఱుగా చెప్ప నక్కఱలేదు. తిమ్మకవి దీనికి ప్రాతిపదికముగా 'సమరన్మృత్యోచితచమర వాలంబును' గైకొని ఆయారివేరంపుఁదపసి ద్వైత్యారికడకు వచ్చినట్లు ముందే చెప్పి, ఆయన పుణ్యకవ్రతసందర్భమున వచ్చినప్పుడుమాత్రము ఆసమరన్మృత్యోచితచమరవాలమును తెచ్చుకొన్నట్లు చెప్పలేదు.

" ఇన్నిదినంబులున్ సవతు లిందఱిలోఁ గడు గారవంబునన్
గన్నియ ! నన్ను వల్లభుఁడు కన్నులఁ గప్పుకొనంగ మండి యా
వన్నెయు వాసియుం దొఱఁగి వారు వనుం దల లెత్తి చూడఁగా
నన్నలఁ జాయలం బలుక నైతునె ? "

అని సత్యభామ తనలోడు తనచెలికత్తెతో చెప్పుకొన్నది.

" ఇన్నిదినంబులున్ సవతు లిందఱిలో నలసత్యభామకన్
సన్నలఁ ద్రిమ్మఱున్ హరి వశంవదుఁ డై యన విందు "

నని రుక్మిణితో నారదుఁ డనినాఁడు.

పై రెండుపద్యములయెత్తుగడయు నొకేవిధముగా నుండుటను బట్టి సత్యభామమనసులోనికి దూరి నారదుఁడు మాటాడినట్లు స్పష్ట మగును. సత్యభామను దుయ్యబట్టుమాటలను - అనురాగమయుఁ డైన కృష్ణుడు తనంత తానుగా ననలేనిమాటలను - ఆకృష్ణునియాంతర్య మెఱిగిననారదుఁడు వాక్రుచ్చెను. అవన్నియు నున్నమాటలే. సత్య లోకమునుండి వచ్చినమహర్షి యసత్యము చెప్పఁడు. " వెలఁదులు పదియాఱువేవురలో నెన్న సరిలేరు సౌభాగ్యగరిమ నీకు " అని రుక్మి

ణితో ఆయన అన్నమాటలు సత్యములే. "నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపను కాంతల సత్య" అన్నమాటకూడ యథార్థమే. ఆయనకు సత్యభామపై కోపము లేదు. కనుకనే 'పతి నీవై విహరింపఁగా .... సవతికాంతల్ సూచి లజ్జింపఁగా నితరస్త్రీజనబుద్ధి దీవనలు నీ కే మిచ్చె దన్ మానినీ! అటులైనం గాని మో్కుటిలాలక! నీకు మగఁడు కోరినకోర్కుల్ ఘటియించుఁగాక తా నెంతటికార్యంబైన డించి నా దీవనలన్?' అని సత్యతో నాముని పలికెను. దీని కాయనదీవన లేల? పారిజాతము నామె పెరటిచెట్టుగా చేయుదు నని అంతకుముందే కృష్ణుఁడామెకు వాగ్దానము చేసినాడు. ఈయన జ్ఞాని. భూతభవిష్యద్వర్త మానవృత్తాంతము లెఱింగి మాట్లాడుచున్నాడు. కనుకనే-(శ్రీహరి శిరసును పాదముతో నామె తాడింపగా) ఆమెమగఁడు "అరాళకుంతలా" అని యామె ననఁగా - "కుటిలాలకా!" యని యారహస్య మెఱింగినయీ దేవర్షి యామెను సంబోధించి యామెవక్రస్వభావ యని ధ్వనింపజేసినాడు.

లోకమున నేకార్యమైనను ముందుగానే పరమేశ్వరసంకల్పమురూపమున జరిగిపోయి, ఆతరువాతనే లౌకికకార్యముగా రూపొందుట జ్ఞానులయనుభవములో నున్నసత్యము. కనుకనే జ్ఞానులైనవారు భవిష్యత్తును చూడగలరు. కృష్ణుడు బ్రహ్మస్వరూపుడు. నారదుడు బ్రహ్మమానసపుత్రుడు. ఆయనలోనిదంతయు తెలిసినవాఁడు. కనుకనే ఆభగవత్సంకల్ప మెఱిగి తదనుకూలముగా తాను గగనమునుండి పారిజాతపుష్పముతో కృష్ణు డున్నరుక్మిణీసౌధమునకు వచ్చెను. ఇది రహస్యము. ఈరహస్యము నింతగా నెఱుంగకపోయినను సత్యభామ నారదుని దుర్మార్గుఁ డని నిందింపకపోవుట గమనింపదగినది. 'పలు తెఱఁగుముళ్ళమాటలు కలహామె కల్యాణ మని జగంబులవెంటన్ మెలగెడుమానికి సహజము!' అని సత్యభామ తనలోకజ్ఞతను ప్రకటించి ఆకలహాశనుని వారింపనందులకే తనమగనిని తప్పుపట్టినది.

"ముని యేమి సేయు ?" – అనగా – ఆయన మౌని యని తనకు గౌరవ మున్నది. అయినను – మగఁడు కొట్టినచో మాధుకరమువాఁడును కొట్టు నన్నా మెత్రప్రకారము – ఆముని – మౌనముగా పడియుండ వలసినవాడు తనపరోక్షమున తనమన మెచ్చియించుమాట లనునంతటి లోకువ యిచ్చినకృష్ణునిదే తప్పు – అని యామె వాపోయెను. ఇప్పుడు తనయింటికి నారదుఁడు రాగా – సత్యే ఆయన నెంతో గౌరవించినది. కారణ మే మనఁగా – ఆకలహాశనుడు వచ్చి యాకలహాము పెట్టనిచో తన కాపారిజాతతరువు దక్కెడిదే కాదుకదా !

"అనికై నం బణి నిన్నుఁ బాసి చనెనా ?" అని సత్యతో నామె నరకవధకు మగనితో వెళ్లినవిషయమును స్మరించుచున్నట్లే మాటాడి – దేవేంద్రునితో పోరు సల్పుటకు పోవునప్పుడుకూడ సత్యభామను కృష్ణుఁడు (దేవలోకమునకు) తనతో వెంటబెట్టుకొనిపోవక తప్పనిపరిస్థితిని కల్పించెను. అదికూడ సత్యభామకు సంతోషకారణమైనది.

"అక్కడ స్వర్గమున భోగమత్తుఁ డైనయింద్రుడు భార్యావిధేయుడై భగవంతు నెదిరించుస్థితికి వచ్చినాడు. ఆయనయహంకారమును, ఆయనలో మితిమీరినకామక్రోధలోభ (పారిజాతము తనకే దక్కవలె నని లోభము) మదముల నడచుటకే భార్యావిధేయుడుగా నటించి శ్రీకృష్ణు డాసురతరువును హరించెను. సత్యభామను సంతోష పెట్టుటకై ఆరణలీల చూపి దేవేంద్రునిలో వినయమును జ్ఞానమును కృష్ణుడు వికసింపజేసెను. తాను లేనిచో – తా నధికార మిచ్చి రాక్షసుల నడంచి సహాకరింపనిచో నింద్రుఁ డక్కడ క్షణమైన నిలువ లేఁడు. మఱి– అంతటివాఁ డైనతాను స్వయముగా వెళ్ళి, చుట్టఱికము నెఱపి, రాక్షసాపహృతదేవమాతృకుండలముల నిచ్చినవాఁడు – ఒక్కతరుమాత్రము నాశింపగా – దాని కింద్రుఁ డడ్డుచెప్పుట తప్పుకదా ? ఆచెట్టుపూలనే యింద్రాణి యనుదినము మోజుపడి తలఁదాల్చుచున్నది. ఇక్కడ

గొకేవస్తువును తమతమభార్యలప్రీతికై యిరువు రాసించిరి. (కృష్ణు డాతరువు నాశింపవలసినయవసరము తెచ్చిపెట్టినది నారదుడే) బలమైన వానిది రాజ్యము. ఇంద్రుఁడు బలారియే. కాని - ఈయుపేంద్రుఁ డాయింద్రునికన్న బలవత్తరుఁడు. కనుకనే యింద్రునితిరుగులేనివజ్రా యుధము కృష్ణునిపై ప్రయుక్త మయ్యును వ్యర్థమైనది. వారిరణ లీలను నారదుఁ డాకాశముననుండి యానందముగా తిలకించి పులకించి తనకలహాప్రియత్వమును చాటుకొన్నాడు. ఒకవిధముగా చూచినచో- పడతులప్రీతికై కల్పింపబడినయాయుద్ధమున - తనమధురభక్తిమహి మచే భగవంతుని తనదాసునిగా చేసికొన్నసత్యభామ జయించినట్లు లెక్క.

తాను కల్పించినకలహమునకు పర్యవసానముగా పారిజాతము సత్యభామకు దక్కఁగానే నారదుడు ద్వారకకు వచ్చి యామెను పుణ్యక వ్రతాచరణమునకు ప్రేరేచెను.

" తానుం బతియున్ మనమున నఱగొఱ లెఱుఁగక యనిత రసులభైకసుఖము లందు " నుద్దేశముతో సత్యభామ యావ్రతాచరణ మునకు పూనుకొని నారదాదేశము ననుసరించి, " తొంటితనకోపము, గర్వము, మత్సరంబు మాని, వినయముం బ్రమోదమును నిండి తొలం కెడునెమ్మనంబునన్ " తా నంతకుపూర్వ మెవరితో మచ్చరించినదో యాసవతులయిండ్లకెల్లఁ దొలునాఁడె క్రమంబున నేఁగి, తద్వ్రతోత్స వమున కామతించినది ! (4 ఆ - 57 ప). అంతే కాదు - తాను ప్రాణ ములో ప్రాణముగా ప్రేమించినపతిని నారదునికి ధారోదకపూర్వక ముగా పుణ్యకవ్రతసందర్భమున ధారవోసినది.

" వంతుకు వచ్చుసత్యగరువం బిఁకఁ జెల్లదు " అని రుక్మిణీ సౌధమున నారదుఁ డనినాఁ డని కదా సత్యభామ కామెచెలికత్తె చెప్పినది ! ఆమాట లిప్పుడు యథార్థము లైనవి. ఈవిధముగా నామె

లోనియహంకారమమకారములను నారదుడు నశింపజేసెను. 'నారదుఁ డనఁగా నజ్ఞానమును బోఁగొట్టువాఁ డనియు, పరమాత్మవిషయిక జ్ఞానమును ముముక్షువుల కిచ్చువాఁ డనియు నర్థములు పెద్దలు చెప్పి యున్నారు (నాగపూడి కుప్పుస్వామయ్యగారిపరిమళోల్లాసవ్యాఖ్య - పు. 329) నారదునిలోనియీలక్షణము సత్యభామపట్ల నిట్లు నిరూపింప బడినది. సత్యభామచే శ్రీకృష్ణుని దానముగా గొన్నయీమహాని -

" మేళవించినవిసుమ్మీ దీనిమె ట్లని మాంసలాంసంబున మహతిఁ
జేర్చి .... పరమముని నవ్వుటాలకుఁ బనుల గొనిమె "

ఈవిధముగా పుణ్యకవ్రతసందర్భమున కృష్ణుడు నారదునికి దాసుడు కాఁగా సత్యభామ చేయునదిలేక గ్రు ఝప్పగించి చూచెను.

"ఓసత్యభామా! భగవంతుఁడు నీకొక్కతెకే కాదు-నాకును దాసుఁడే సుమా" అని నారదుడు నోటితో చెప్పకయే క్రియలో చూపి సత్యభామలోనియహంభావమును హరించెను. పారిజాతాప హరణకావ్యముద్వారా తిమ్మకవి లోకమున కందింపదలచినసందేశ మిది. అందులకు ప్రధానముగా నిమిత్తభూతుఁడైనవాఁడు నారదుఁడు. నారదునిచలువచేతనే సత్యభామ తనసర్వస్వమైనపతిదేవునే దాన మిచ్చునంతటిమానసికపరిణతికి చేరుకొన్నది. భగవంతుడు భక్తవ శంకరుఁ డని నిరూపింపబడినయీరసవత్తర సన్నివేశ మింత చమత్కార ముగా నున్నది.

శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారిమాటలలో చెప్పవలె నన్నచో - "ఇతడు దేవర్షి. శ్రీకృష్ణభక్తుడు. ఆయన శ్రీకృష్ణుడు. సాక్షాత్పరమేశ్వరుడు. నిత్యము భగవంతునికి పరిచర్యలు చేసెడి భక్తునకు భగవంతునిచేత పరిచర్య చేయించుకొనెడియొకహేల కుదిరినచో నతని కెంత యానందముగా నుండును! అనుభవించుట యెట్టిదో- అనుభవింపఁబడుట యట్టిది. ఇది మహారహస్యము. సృష్టిరహస్యము."

కపటనటనాపరుడు. కపటము వ్యాజము. మిష. మోసము. వ్యాజముగా నటించుటయం దిష్టము కలవాఁడు. లేనిచో నిర్గుణపరబ్రహ్మమూర్తి యైనశ్రీమన్నారాయణుడు యాదవుఁడు కాడు. ఆయనకు పదునాఱువేలమంది గోపికలు లేరు. అష్టభార్యలు లేరు. అర్జున సారథ్యము చేయలేదు. ఏమియును లేదు. కాని యివ్వి యన్నియు నున్నట్లుగా నటించినాడు.

"నీ విన్ని నటించుచున్నావు కదా! ఓయి స్వామీ! ఈనటనలో భాగముగా నీవు నాకు దాన మీయబడినావు. నాకు సేవకుడుగా పనిచేయుము" అని యర్థము. అంతయు లీలయే. ఇదియు లీలయే. ఇది యొకసంతోషము. భగవంతుడు - మనుష్యాకారముతో నెదురుగా వచ్చి మిత్రునివలె దాసునివలె-"ఓహో! ఏ మీసౌందర్యము! ఏమి దేశము!! ఏమినాగరకత!!!" అని సాహిత్యసురభి యనుగ్రంథములో (పు॥లు 152-53) విశ్వనాథవారు చెప్పిన మాటలలో నౌచిత్యము తొణకిసలాడుచున్నది.

నారదుని దేహకాంతు లకాలచంద్రికల నీనుచుండగా గగనమునుండి యాకస్మికముగా ఆయన వచ్చినా డని ప్రథమాశ్వాసమున (44వ పద్యములో) వర్ణించినకవి ద్వితీయాశ్వాసమున (17 ప.) నారదునివెంట భుక్తిశాల కేఁగుసత్యాకృష్ణులను వర్ణించుచు "తటిల్లతయున్ జలదంబు యామినీపతి వెనుకొన్నకైవడి" నున్న దనుట సముచితముగా నున్నది. నారదుడు త్రిలోకసంచారి కనుక ఆచంద్రునివలె భూమిచుట్టును తిరుగుచుండువాడు. ఈమునిచంద్రునిరాక మొట్టమొదట రుక్మిణి బ్రతుకునను, ఆతరువాత సత్యభామ జీవితమునను వెలుగులు విరజిమ్మినది. అంతే కాదు - ఆచంద్రునికి మచ్చవలె నీమునిచంద్రునికి కలహాశనుఁ డనుకళంక మున్నది. నారదుఁడు చంద్రునివలెనే తెల్లనివాడు. తిమ్మనగారు వాడినయీయుపమాన మిన్నివిధములుగా సార్థకమును,

మహార్థకమును నగుట గమనింపదగినవిశేషము. ఆచంద్రునివలెనే యీమునిచంద్రుఁడును దంపతులైనసత్యాకృష్ణుల నానందపరచినాఁడు.

ఇంద్రాదిదేవతలును, నారదాదిదేవర్షులును వియచ్చరులు. కృష్ణుఁడు వియచ్చరరిపుభేది. కనుక వారు పరస్పర మాత్మీయులు. ఆవియచ్చరరిపుభేది శ్రీహరి హెచ్చైము లేనిభక్తితో వనితయుఁ దానును నారదునికి నమస్కృతి యొనర్చుటనుబట్టి నారదునిమహానుభావము వ్యక్తమగును.

"హేవిశ్వజననీచరిత ! యెఱుఁగనె నిన్నున్ !" అని నారదుఁడనుటనుబట్టి ఆదేవర్షి కృష్ణతత్త్వమును కూలంకషముగా నెఱింగినవాఁడగుట స్పష్టము.

సత్యభామ మనఃకూలంకషముగా కృష్ణభగవానుని ప్రేమించినది. కాని - యీకృష్ణప్రేమ స్వార్థకలుషితమును, అహంప్రత్యయప్రతారితమును నైనది. అట్టి మహేంద్రుఁ డుపేంద్రశబ్దవ్యపదిష్టుఁ డైన కృష్ణుఁడు తనకన్న తక్కువవాఁ డని భ్రాంతిపడినయనాత్మజ్ఞుఁడు. నారదుఁడు తాను అహరహ మవ్యాజభక్తిసుందరుఁ డైనమహత్తర వ్యక్తి. ఆయిరువురికి శృంగభంగము చేసి కనువిప్పు కలిగించి జగదారాధ్యుఁ డైనభగవంతుఁడు తనవంటిసర్వభక్తులకును సదాకరబదర మని నారదుఁడు నిరూపించినాఁడు.

నారదునిజడలు మోక్షద్రుపల్లవశంకఁ జేయుచున్న వని తిమ్మకవి ముందే చెప్పియున్నాఁడు. ఆమునియెఱ్ఱనిజడ లెఱ్ఱనిపల్లవములను పోలియున్న వఁట ! మోక్షద్రుపల్లవశంకఁ జేయునాయనజడలు గగనముననుండి క్రిందికి దిగివచ్చినట్లు వర్ణించుటలోనే సురలోకపారిజాతావతరణము సూచింపబడినది.

శ్రీకృష్ణతత్త్వరహస్యము నెఱింగినవాఁడు కనుకనే నారదుఁడాభగవంతుని విచిత్రస్వరూపస్వభావాదులను చిత్రగతులతో స్తుతించి

కావ్యమును మంగళాంత మొనర్చినాడు. నారదుడు కలహాంకురములు నాటుటతో ప్రారంభమైనయీకావ్యేతివృత్త మానారదునిమంగళాచరణముతోనే సుఖాంత మైనట్లు కవి రచించుటనుబట్టి యీకావ్యమున నారదపాత్ర మెంత ప్రముఖమైనదో స్పష్టము కాగలదు.

నారదుడు పారిజాతపుష్పమును ద్వారకకు తేనిచో - కనుసన్న చేసి కృష్ణునిచే దానిని రుక్మిణి కిప్పింపనిచో - సత్యభామ కలుక తెప్పించనిచో పారిజాతాపహరణకథయే లేదు. శ్రీకృష్ణుడు సంకల్పించినయర్థ మీవిధముగా నారదునిరాకతో సఫల మైనది. కనుకనే "మీరిట కరుదేరఁగ నిప్పు డేఁ గృతార్థుడ నైతిన్" అని శ్రీహరి సురమునితో పలికినాడు.

"పలు తెఱఁగుముళ్ళమాటలు కలహామె కల్యాణ మని జగంబుల వెంటన్ మెలఁగెడువానికి సహజము" అనుటలో సత్యభామ యుద్దేశము వే అయినను - సత్యాకృష్ణులమనసులు మఱింత సన్నిహితమగునట్లు ముడివేయుమాట లగుటచే నారదునివి ముళ్ళమాటలే. ఆయన పెట్టినకలహము కల్యాణముగానే పర్యవసించుటయు సత్యమే. కనుకనే యింద్రోపేంద్రుల కాయన కల్పించినకలహము పారిజాతావతరణముచే భూలోకకల్యాణమునే సంఘటించినది. సత్యభామ యన్న మాట లీవిధముగా యథార్థము లగుట విచిత్రము.

పదాఱువేలయెనమండ్రుగురుపడఁతులపొత్తు గూడిన ట్లగుపించినను అది యంతయు శ్రీకృష్ణునిలీలావిశేషమే యనియు, ఆభగవంతుఁడు స్త్రీలోలుఁడు కాఁ డనియు, రూపాభిమాని యసలే కాఁడనియు, వల్లవీకింకరుఁడుగా గోచరించునాప్రభువు భక్తజనవిధేయుఁడై శ్రితజనప్రియుఁ డై నసకలలోకైకగురుఁ డనియు కాంతాసమ్మితముగా నుపదేశ మొనర్చుట కీనారదపాత్రను కవి యుపయోగించుకొనినట్లు స్పష్టమగును. పైపైచూపునకు కలహాశనుడుగా నగుపించు

చున్ననారదుని ధ్యేయము లోకకల్యాణమే యని తిమ్మకవి యీకావ్య మున విచిత్రముగా స్ఫురింపఁ జేసినాఁడు. పారిజాతాపహరణము శ్రవ్య కావ్యమైనను అందలిపాత్రలు దృశ్యకావ్యములోవలె సజీవము లై, సన్ని వేశములు సహజములై యుండుట తిమ్మనగారిరచనలోనివిశిష్టత. కవి తనకు తానుగా పాత్రలస్వరూపస్వభావాదులను వర్ణించుట యొక పద్ధతి. తిమ్మనగా రీమార్గము నంతగా నవలంబింపక కథాసందర్భమున కనుకూలముగా ఆయాపాత్రలస్వరూపస్వభావములను వారివారిసంభాష ణాదులచే పాఠకు లూహింపగలుగునట్లు రచించుట ఆయనకవితాకళ లోని ప్రధానలక్షణము.

బమ్మెరపోతనగారిభాగవతమువలన శ్రీకృష్ణపాత్రమును, సిద్ధేంద్రయోగి రచించినభామాకలాపమువలన సత్యభామాపాత్రమును, యావదాంధ్రజగత్ప్రసిద్ధము లైనవి. తిమ్మనగారిపారిజాతాపహరణ కావ్యమువలన నారదపాత్ర కాయోగము పట్టినది. తిమ్మన కర్వాచీన ములైనయనేకాంధ్రకావ్యనాటకములందు నారదపాత్రము ఆయన పెట్టినయొరవడిని బడి బహుధాప్రజాదరపాత్ర మైనది!

తిమ్మకవి తనకావ్యమునందలిపాత్రలలో ప్రాణకళను ప్రతి ష్ఠించి, నేలపై స్వభావసిద్ధముగ నడయాడుచు మనకు సుపరిచితవ్యక్తు లుగా నుండునట్లు, రసాశ్రయములై కావ్యమును చదువుట ముగించి నను మనమనస్సులలో తారాడుచునే యుండునట్లును తనపాత్రలను సృష్టించినాడు. 'ప్రతిభాశాలియైనకవి యపూర్వవస్తునిర్మాణక్షమ మైనతనప్రజ్ఞతో మాంత్రికుడు తనమంత్రదండముతో కలకలలాడు మొక్కలను కటిక నేలపై మొలిపించునట్లు సజీవపాత్రలను సృష్టించును. అతఁ డెంతసమగ్రసుందరవర్ణనానిపుణుఁ డైనచో నతనిపాత్రనిర్మాణ మంతపటిష్ఠముగా నుండును.'[1] తిమ్మకవి యీకోవకు చెందినవాడు.

1. మహాకవిమార్గము - ఆచార్య యస్వీజోగారావుగారు.

# 10. వర్ణనలు

" లోకోత్తరవర్ణనానిపుణః కవిః " అన్నాడు మమ్మటుడు.[1] " కవనీయం కావ్యం " (వర్ణింపదగినది కావ్యము) అని లోచనాకారుని యాభాషణము.[2]

" కవయ తీతి కవిః తస్య కర్మ కావ్యం " అని విద్యాధరుడు నిర్వచించినాడు.[3]

" కౌతి శబ్దాయతే విమృశతి రసభావాన్ ఇతి కవిః తస్య కర్మ కావ్యం " (రసభావములను విమర్శించువాడు కవి. వానికర్మ కావ్యము. (అన్నాడు భట్టగోపాలుడు)[4]

" వర్ణయ తీతి కవిః " (వర్ణించువాడు కవి)

పై నిర్వచనములనుబట్టి వర్ణించువాడే – వర్ణించునేర్పు కలవాడే – కవి యని కవిశబ్దమున కర్థము.

వర్ణన మన్నది కథాసౌధమునకు ప్రాంగణరంగవల్లిక. రసోత్పత్తికి ప్రధానకారణ మైనది విభావము. ఆలంబనవిభావము (Human factors in emotion), ఉద్దీపనవిభావము (Auxiliary environmental factors of emotion) నని విభావము రెండువిధములు. వర్ణనము రసోత్పత్తి కుద్దీప్తిని కలిగించును. కవి లోకోత్తర మైనతనయూహాశాలితను, అసాధారణ మైనతనప్రతిభాపాండిత్యములను ప్రదర్శించుటకును గరిడీసాలగా నుండునది వర్ణనమే. సూర్యోదయ, సూర్యాస్తమాన,

1. మమ్మటుడు – కావ్యప్రకాశిక
2. లోచనాకారుడు
3. విద్యాధరుడు
4. భట్టగోపాలుడు

చంద్రోదయ, చంద్రాస్తమానోద్యానాద్యష్టాదశవర్ణనావిలసిత మై యొప్పునది ప్రబంధప్రక్రియ.

స్వరూపచిత్రణము, స్వభావచిత్రణము, అవస్థాచిత్రణము నన్నవి వ్యక్తిచిత్రణములోనివిభాగములే. ప్రకృతిచిత్రణముకూడ అవస్థాచిత్రణములోనిభాగమే. చలదవస్థాచిత్రణము, నిశ్చలావస్థాచిత్రణము నని యవస్థాచిత్రణము రెండువిధములుగా నుండును. స్వరూప, స్వభావావస్థాచిత్రణములచే పాఠకులహృదయములయందు బీజభూతముగా నున్నవాసనలను తట్టి లేపి వారిని రసానందడోలికల నుయ్యాల లూచు నైపుణ్యము తిమ్మనగారికవితలో పుష్కలముగా నున్నది.

"నానృషిః కవి రిత్యుక్తం ఋషిశ్చ కిల దర్శనాత్
విచిత్రభావధర్మాంశతత్త్వప్రఖ్యాచదర్శనమ్
స తత్వదర్శనాదేవ శాస్త్రేషు పఠితః కవిః
దర్శనా ద్వర్ణనాచ్చాథ రూఢాలోకే కవి శ్రుతిః
తథాహి దర్శనే స్వచ్ఛే నిత్యేప్యాదికవే ర్మునేః
నోదితా కవితాలోకే యావజ్జాతా న వర్ణనా" [1]

ఋషి కానివాఁడు కవి కాఁడు. కేవలముఋషి కావ్యమును రచింప జాలడు. ఋషి యనగా ద్రష్ట. దర్శన మైనవిచిత్రమైనవస్తువుల యొక్కధర్మాంశముల నెఱుంగుట. దీనికే ప్రతిభ యని పేరు. అట్టితత్త్వదర్శనము కలిగినవానినే కవి యని శాస్త్రములు పేర్కొనుచున్నవి. కాన లోకదర్శనము, వర్ణనము, ననునీ రెంటివలనను కవి యని ప్రసిద్ధి కలుగును. వాల్మీకి మొదట ద్రష్ట యైనను రామాయణరచనము చేయు వఱకును కవిగా గణింపబడ డయ్యెను. దీనివలన ద్రష్ట యై కవి వర్ణనా

1. రామరాజభూషణునికావ్యాలంకారసంగ్రహము - సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారివివరణముతో - పుట 90.

నిపుణుడు కావలయును. ఈయభిప్రాయమునే భామహుఁ డనునాలంకారికుఁ డిట్లు చెప్పెను :-

" ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా
తదనుప్రాణనా జీవే ద్వర్ణనానిపుణః కవిః " [1]

అది భామహునియభిప్రాయము కాఁగా-

" అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీ చే త్కవిః కావ్యేజాతం రసమయం జగత్
స ఏవ వీతరాగ శ్చేత్ నీరసంజాత మేవ తత్
భావా నచేతనానపి చేతనవ చ్చేతనానప్యచేతనవత్
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా "

అన్నాఁ డానందవర్ధనుడు. [2]

పై నిర్వచనము లన్నియు తిమ్మకవికావ్యమునకు వర్తించును. " స్వభావోక్తి రసౌ చారు యథావద్వస్తువర్ణనమ్ " అని [3] ప్రతాపరుద్రీయకారుఁ డన్నట్లు - తిమ్మకవి కొన్నిపట్టుల నున్నవిషయమునే మనోహరముగా వర్ణించి దాని కలంకారత్వమును చేకూర్చుటయు కలదు. ఆయనవర్ణనలు సందర్భోచితములును, కల్పనామధురములును, రసప్రసన్నములును నైనవి.

" వర్ణ్యశ్చ రాజా దేవీ చ దేశోగ్రామఃపురీ సరిత్
సరోఽబ్ధిరణ్యోద్యానాద్రి ప్రయాణ రణవాజినః
హ స్త్యర్క చంద్రావతవో వివాహోఽథ స్వయంవరః
సురాపుష్పాంబుసంభోగః విశ్లేషమృగయాశ్రమాః
కలా ఋతువయస్పంధీ ధాతువృష్టాభిసారికాః "

1. భామహుడు. 2. ఆనందవర్ధనుడు. 3. ప్రతాపరుద్రీయము.

అని అలంకారశేఖరకారుడు [1] కావ్యమున వర్ణనీయములైనవానిని తెలిపినాడు.

సీ. " పురమును ఋతుషట్కమును బ్రయాణంబును,
శైలంబు, వేఁటయు, సాగరంబు
మౌనీంద్రపుణ్యాశ్రమంబును, మంత్రంబు,
ద్యూతంబు, పిదప నద్భుతరణంబు,
విజయంబు, మద్యపానజవికారంబును,
వనవిహారంబును, వారికేళి,
కన్యాంగసౌందర్యకథనంబు, హిమకరా
భ్యుదయంబు, విప్రలంభోచితంబు,

తే. గీ. పద్మమిత్త్రోదయంబును, బరిణయంబు,
సురతమును, దౌహృదంబును, సుతజననము
ననఁగ నిరువదిరెండువర్ణనలు గూర్చి
చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస ! " [2]

అని యప్పకవి చెప్పినాడు.

తే. గీ. " ఇంకఁ గావ్యప్రభేదంబు లేర్పఱింతు
వరున నష్టాదశవిశిష్టవర్ణనములు
గలుగవలయు మహాకావ్యతిలకమునకు
నెలమిఁ దన్నామధేయంబు లెట్లి వనిన :- 165

కం. పుర, సింధు, నగ, ర్త్విన, శశి
సరసీ, వనమధు, రతిప్రసంగ, విరహముల్,
పరిణయ, తనయోదయ, నయ
విరచన, యా, త్రాజి, దౌత్య, విభువర్ణనముల్ " 166

అని పుర, సముద్ర, శైల, ఋతు, సూర్యోదయ, చంద్రోదయ, సరః క్రీడా, వనక్రీడా, వసంత, రతిప్రసంగ, విరహ, పరిణయ, పుత్త్రోదయ,

1. అలంకారశేఖరము. 2. అప్పకవీయము.

నయవిరచన (సంధి విగ్రహాదులు) దండయాత్రా, యుద్ధ, దౌత్య, ప్రభు వర్ణనములు - అనునష్టాదశవర్ణవర్ణనములు గలది మహాకావ్యము. - అని రామరాజభూషణునికావ్యాలంకారసంగ్రహ మష్టాదశవర్ణనలనే చెప్పినది. [1]

పైన చెప్పబడినవర్ణనలలో నెన్నింటిని తిమ్మకవి చేసినాడు? అందు చెప్పబడనివర్ణనల నేమేమి చేసినాడు? అన్నవిషయమును బరిశీలింతము :

సుదీర్ఘమైనపురవర్ణనతో కావ్యమునందు కథా ప్రారంభ మొనరించుట తిమ్మకవినాఁటిప్రబంధకవులపరిపాటి. తిమ్మన యామార్గమున పోక తన దైనయొకప్రత్యేకమార్గమున పయనించి,

"హరి నరకాసురున్ గెలిచి" అని సూటిగా కథను ప్రారంభించినాడు.

"ద్వారక వైకుంఠపురంబు" (1 ఆ - 51ప) అని కావ్యము నడుమ నొక్కసారి యనిపించుటయు, రెండవయాశ్వాసమున (97 నుండి 100వ పద్యమువఱకును) నింద్రపురీవైభవమును నాలుగుపద్యములలో కృష్ణునిముఖమున సత్యభామకు చెప్పించుటయు మాత్రమే తిమ్మకవి చేసినాడు కాని - ఆద్వారకావర్ణనమును సమగ్రముగా చేయ లేదు. సురపురీవర్ణనము రెండవయాశ్వాసములో నాలుగు (97-100) పద్యములలోఁ గలదు.

2. అష్టాదశవర్ణనములలో రెండవ దైనసముద్రవర్ణనమును తిమ్మకవి తనకావ్యమున నతుకదు కనుక విడిచిపెట్టినాడు.

1. శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారివివరణముతోడి రామరాజభూషణవిరచితకావ్యాలంకారసంగ్రహము పుట : 233 - ద్వితీయాశ్వాసము.

3. ఇంక మూఁడవది శైలవర్ణనము. సత్యాకృష్ణులు స్వర్గమునకు గరుత్మంతునిపై నేఁగుచున్నసందర్భమున శ్రీకృష్ణుడు సత్యభామకు చూపినట్లు తిమ్మకవి పసిండికొండను వర్ణించినాడు.

" కువలయపత్రనేత్ర! కనుగొంటివె! కన్నులపండు వయ్యె రెం
డవవినతాతనూభవునియందమునం గమనీయకాంచన
చ్ఛవికవచీకృతంబు కులిశక్షతపక్షము నైనరత్నసా
నువు నిజయామికీకృతవినోదపరాయణచంద్రబానువున్ "
(2 ఆ - 85 ప)

ఈవినతాతనూభవునివలెనే ఆ బంగారుకొండయు రంగులో సమానమగుటమాత్రమే కాక వజ్రపుదెబ్బ తిన్నది. అంతే కాదు – సర్వదేవతానివాసమైనమేరువును దేవదేవుఁడైనశ్రీమహావిష్ణు వధివసించిన వినతాసుతునితో పోల్చుట మనోహరముగా సముచితముగా నున్నది.

## పర్వతవర్ణనము

సీ. " జీర్ణవర్ణద్రుసంకీర్ణాహిమణివిభా
మాయాకిసలవంచ్యమానపికము
శశికాంతరుచిమృషానలిలసంప్లావన
శ్లథనిషాణోద్విగ్నసైరిభంబు
గోమేధికప్రభాంకూరమిథ్యామధు
ద్రవలిలిజామిళద్భల్లుకంబు
నీలగండప్రస్తరాశికగజభేద
శీర్యన్నఖక్షుబ్ధసింహకులము

తే. గీ. గారుడాశ్మచ్ఛవిచ్ఛటాకపటయవస
పూలికాచర్వణవ్యగ్రబాలమృగవి
లంఘ్యమానాబ్జరాగశిలావితాన
కూటదావాగ్ని యామరుత్కుథర మబల!
(2 ఆ - 86 ప)

మేరుపర్వతమును వర్ణించునీపద్య మాద్యంతమును సంస్కృతపదసమాసమయ మై తిమ్మనగారలతియలతిపదములతో మాత్రమే కాక రెండు విధముల పద్యములను నడుపగలసవ్యసాచి యని స్పష్టము చేయును.

“ వెండియు నప్పసిండికొండ గండశిలామండలంబున నుద్దండ వేదండంబు లొండొండ గండతలంబు లొరసికొన నిండినమదజలాంజన మషిం గొని ......... వైణవారావాసితం బయ్యు నవైణవారావాసితం బై మెఱయు నిది మఱియును ” అని రచించినసుదీర్ఘ వచనము (2 ఆ-88 వ) తిమ్మనార్యునిభావనాపటిమను, లలితలలిత ప్రౌఢశైలీవిన్యాసమును, లోకజ్ఞతను, పాండితీవైభవమును, ప్రబంధశక్తిని పట్టి యిచ్చుచున్నది.

# సూర్యాస్తమయము

ఆయతతేజములు తఱిగి యంబుజబాంధవుఁ డస్తసీమకు పోగా -వేచినతమోవిభుఁ డంపగా దినాంతయోధు డీచాయను (తదీయ పత్నిని) పడ సీడిచికొంచుపోయెడిని కో యనుమాడ్కి శకుంతరవములు చెలంగినవఁట ! (2 ఆ - 30) ఇది తిమ్మనగారు చేసినసాయంకాలవర్ణనము. తూర్పున నభ్యుదయ మందువానిపత్నికి (శచీదేవికి) జరుగనున్న పరాభవము (అనగా నామె పారిజాతమును గోల్పోవుట) ఇందు సూచింపబడినది.

అస్తమించుచున్న సూర్యునిప్రతిబింబమును నీటిలోఁ జూచి జక్కవలు దుఃఖముతో మూర్ఛ నొందగా జలదేవత కన్ను మోడ్చెనో యనునట్లు వనరుహములు ముకుళించిన వఁట! (2 ఆ - 31 ప). ఈ కల్పన మద్భుతముగా నున్నది. ఈసందర్భమును వర్ణించుచు కవి “ సహవాసులదుఃఖము నెయ్యు రోర్తురే ? ” అని యర్థాంతరన్యాసమును ప్రయోగించినాడు. సత్యభామదుఃఖమును కృష్ణుఁ డోర్వకపోవుట

యిందు సూచింపబడినది. జలదేవత యబలయు, నిస్సహాయురాలును కనుక కన్ను మోడ్చినది. కృష్ణుడు సర్వసమర్థుడు కనుక సత్యభామ కన్నులకాంతులు విరియించుటకై పురుషకారము నెఱపి, యింద్రునితో తలపడ నెంచినాడు. ఇది యీవర్ణనలోనివిశేషము.

తనువున సంధకారపుమదము క్రమ్మగా మిన్నను భద్రదంతి చిందరేగి తపనుఁ డనుమావటివానిని కుంకుమెట్టలోయలో నురలిపోవునట్లు పడద్రోయగా ఆతపనుడు క్రక్కికొన్నరక్తమో యనునట్లు సాంధ్యరాగము పొడకట్టె నఁట! (2 ఆ - 32 ప) రసమ్యాపయు లందఱును "ఓహో!" యనుకల్పన మిది.

తూర్పున నభ్యుదయ మందునినుడు స్థానభ్రష్టుడై రక్తము క్రక్కికొన్నాఁడఁట. తూర్పుదెస నభ్యుదయ మందునింద్రుడు యదుకుంజరునిచే పొందనున్నపరాభవ మిందు సూచింపబడిన దనవచ్చును.

అంధకారము బురదవలె, పొగవలె, నింగివలె, మషీలేపము వలె, నపలితంకరణౌషధమువలె, నదృశ్యాంజనమువలె నున్న దఁట! ఈవర్ణనము తిమ్మకవియూహాశాలితకును, లోకజ్ఞతకును నొకమచ్చుతునక. వర్ణసామ్యముతో కూడినయీయుత్ప్రేక్ష మనోజ్ఞముగా నున్నది. (2 ఆ - 34 ప)

తమతమనాయకులదగ్గరకు పోవుట కింకను వేళ కాలేదని యభిసారికలు విడుచునిట్టూర్పుగాలులచే కంపించుదీపములకు చీఁకటి యభయహస్త మిచ్చుచున్నదో యనునట్లుగా ఆదీపములపై తోచు ధూమమాలిక లున్న వఁట! ఈయుత్ప్రేక్ష అందముగా నున్నది. (2 ఆ - 36 ప).

"దినరాజ తతిఁ బంకజ
వనములఁ జరియించుకాంతివరచుఁ దామన్

వనధి జలకేళి సలుపఁగఁ
జనియె ననన్ వారుణీదిశాతటిఁ బొల్చెన్ "
(4 ఆ - 42 ప)

కాంతాసహితుఁ డై జలకేళి సలుపుకృష్ణుని చూడగానే తనకును గోరిక పుట్టి తనకాంతికాంతలతో జలకేళి సలుపుటకై పడమటిసముద్రమునకు పోయినాఁ డఁట దినరాజు! ప్రకృతివర్ణనల నిట్లు కథతో జోడించుట చేయి తిరిగినకవులరచనాచణత్వమునకు నిదర్శనము.

" ఘనసాంధ్యరాగవినతా
తనయగరుత్పమితికడిఁదితాఁకున ధర వ్రా
లినగగనఫణిఫణామణి
యన రవిమండలము పశ్చిమాంబుధిఁ గ్రుంకెన్ "
(4 ఆ - 45 ప)

సంజకెంజాయ యనుగరుత్మంతుని (వెట్టుని) అెక్కలతాఁకిడిచే నాకాశ మనెడిపాముపడగమీఁదిమణియో యనునట్లు నభోమణి నేలపైఁ బడి పశ్చిమాబ్ధిలో క్రుంగె నఁట! నభోమణి భూపతన మైనట్లే (పక్షిరాట్స హితుఁడైన) కృష్ణునిశౌర్యముచే నూర్ధ్వలోకపారిజాతము పుడమికి దిగుట సూచింపబడినది.

# అంధకారవర్ణనము

" తనమణి పడిపోవ ధరణీతలంబున నెమకంగ వచ్చిననింగి యనఁగ " నంధకార మున్న దని తిమ్మనగారు (2 ఆ - 34 ప) వర్ణించిరి. ఊర్ధ్వలోకపారిజాతము భూలోకగత మగుటకు సూచనగా నున్న దీవర్ణనము.

" అల చుక్కలనిమెడువలరాజుజు గెలుపువ్రాల్ తెలియఁ బూసినమషీలేప మనఁగ " నున్న దఁట యాచీఁకటి!

పూర్వకాలపుశిలాశాసనములందలియక్షరములు స్పష్టముగా గోచరించుటకై మసి పూసి చదువుపద్ధతి నీవర్ణనము చాటుచున్నది.

“ అభిరతిఁ గృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియించి తాళస న్నిభముగఁ బొట్టునూరికడ నిల్పినకంబము సింహాభూధరప్రభు తిరునాళ్ళకుం దిగుసురప్రకరంబు కళింగమేదినీవిభునపకీర్తికజ్జలము వేమఱు పెట్టి పఠించు నిచ్చలున్ ” అనుపెద్దనగారిమనుచరిత్రములోని పద్యమున కొజ్జబంతులుగా నున్నవి యీతిమ్మన్నగారిపద్యపంక్తులు !

పై తిమ్మనగారిపద్యములో “ వలరాజుగెలుపువ్రా ” లనుటచే పారిజాతతరువును బడయనున్న సత్యభామ సవతియైనరుక్మిణిపై సాధించిన గెలుపు సూచింపబడినది.

అంధకారము “ వృద్ధవారవిలాసినీవిసరమునకు నపలితంకర ణౌషధ మనఁగ ” నున్న దనుట తిమ్మనగారినాఁటివేశ్యలపూఁత మెఱుఁగుటందపుబండారమును బయలు పఱచుచున్నది.

## నక్షత్రవర్ణనము

చుక్కలను వడగండ్లగుంపుగా, పటికపుటుండలుగా, వెన్నెల కుప్పలుగా, కమ్మచ్చుబెజ్జములుగా, మన్మథునిపై లీలగా రతీదేవి చల్లుదీవనఁబ్రాలుగా, వేఁడిమి సోకుటచే మింటిమేనుపై నెక్కొన్న చెమటబొట్లుగా నుత్ప్రేక్షించుట మనోహరముగా నున్నది.

ఆచుక్కలు జగము గెల్వంగ దండెత్తుమగనిమీఁద లీలగా రతి చల్లుదీవనఁబ్రా లనంగ నున్న వఁట ! (2 ఆ - 37 ప) శృంగార రసప్రధాన మైనయీకావ్యమున వాచ్యము చేయబడని సత్యాకృష్ణుల శృంగారకేళి యీపంక్తులలో సూచింపబడుట విశేషము.

నక్షత్రములు తెలివివెన్నెలవెండితీవలు నిగిడించుచదలు కమ్మచ్చుబెజ్జము లనంగ నున్న వని తిమ్మనగారు వర్ణింపగా –

" ఆకాశ - రంధ్రహై పూరిత - సే
యహ సృష్టి గహన్ - సీహోతీ హై
ఆలోక సభీ మూర్ఛిత సోతే,
యహ ఆంఖ థకీ - సీరోతీ హై "

అని కామాయని యనుకావ్యమున (కామ్ – సర్గ – 16వపద్యములో) రచయిత శ్రీజయశంకరప్రసాద్ అనుహిందీభాషాకవి చెప్పి యున్నాడు. దానికి తెనుగుఅనువాద మీ క్రింద నీయబడినది :–

" పూడుకొన్న వాకాశరంధ్రములు
సఘన గహన వంగుచున్నది సంసృతి
వెలుగు లెల్ల మూర్ఛిల్ల నయనములు
అలసి సొలసి విలపించుచున్నవట ! " 2

పై యనువాద మెట్లున్నను – స్పష్టతకై హిందీపద్యభావ మిది :–

ఆకాశ మొకనీలి తెరవలె నున్నది. ఆనీలి తెర వెనుక అనంత జ్యోతి యున్నది. ఆకాశ మనునీలి తెరకు రంధ్రములు పడగా – ఆరంధ్రములనుండి తెర వెనుక నున్న ప్రకాశము ఈవలకు (బయటకు) వచ్చుచున్నది. ఈరంధ్రములు కాంతితో నిండి యున్నట్లు కనిపించుచున్నవి. ఇట్లు కాంతితో నిండినబెజ్జములే అసంఖ్యాకనక్షత్రములు. రాత్రిసమయమున సర్వత్ర ప్రశాంతత వ్యాపించి యుండుటచే సమస్తసృష్టియు గంభీరముగా నున్నది. ఈసమయమున గ్రహనక్షత్రాదిసమస్తప్రకాశమయ పదార్థములును మూర్ఛ చెంది నిదురించుచున్నట్లగుపించుచున్నవి. "

1. కామాయని - హిందీకావ్యము - జయశంకరప్రసాద్‌రచన.

2. కామాయనికి ననువాదము - 'అనురాగం' సర్గ - పుట. 52
పద్యసంఖ్య 16 - రచన :- డాక్టర్ ఇలపావులూరి పాండురంగారావు.

తిమ్మనగారు నక్షత్రములను వెన్నెలవెండితీగలు నిగిడించు చదలుకమ్మచ్చుబెజ్జము లనగా - ఈహిందీభాషాకవియు నక్షత్రములను వెలుగు నిండినయాకాశరంధ్రము లనుటలోనిపోలిక గమనింపదగిన విశేషము. కాలమును, కవులు నివసించుప్రదేశమును నొక్కటి కాకున్నను - భాషలు వే ఱయినను - మహాకవులభావములు సన్నిహితముగా నుండు ననుట కిది యొకయుదాహరణమాత్రమే.

## చంద్రవర్ణనము

" అమరులబోనపుట్టిక సహస్రమయూఖునిజోడుకోడె సం
తమసమువేరుని త్తు కుముదంబులచక్కిలిగింత పుంశ్చలీ
సమితికిఁ జుక్కవాలు నవసారసలక్ష్మి తొలంగుదావ కో
కములకు గుండెతల్లడము కైరవమిత్రుఁడు తోఁచెఁ దూర్పునన్ "

(2 ఆ - 41 ప)

ఇది తిమ్మనగారు చేసినచంద్రోదయవర్ణనము. తనకృతిపతి యైనకృష్ణరాయలవంశమునకు మూలపురుషుఁ డైనవాఁ డీచంద్రుఁడు. అమరుల కాహారమై యాత్మార్పణ మొనర్చుత్యాగధనుఁ డాయన. తనకాంతి విశేషముచే వేవెలుంగులదొరకు జో డైనవాఁడు. చీఁకటి నడంచువాఁడు. కుముదములను గిలిగింత లిడి నవ్వించురసికావతంసుఁడు. వ్యభిచారిణుల కరిష్టమును గూర్చువాఁడు. నవసారసలక్ష్మి మన్ననలందు బావగారు. జక్కవజంటలకు వియోగకారకుఁడు. కైరవమిత్రుఁడు.

ఈపద్యమునందు చంద్రునిస్వభావచిత్రణ మున్నది. తిమ్మనగారు రచించినయీపద్యమునకును, " వలిమలయల్లువాఁడు.... " అను పద్యమునకును పెద్దనగారు తనమనుచరిత్రావతారికలో రచించిన

" కలశపాథోరాశిగర్భవీచిమతల్లి
కడుపార నెవ్వానిఁ గన్నతల్లి "

అన్నసీసపద్యము మానసపుత్త్రిక యనవచ్చును.

"తొలుమలజాతితో నొరయుతూరుపుఁదొయ్యలిము త్తియంపుఁగుం
డలమున మానికంబు పడినం గనుపట్టెడులక్కఁగూడు నాఁ
జలువలఱేనియప్పొడుపుఁజాయఁ దొఅంగినకందు తోఁచె రే
చెలువ కనుంగవం గమియఁజెందినకాటుకకప్పుకై వడిన్"

( 2 ఆ - 46 ప)

ఈపద్యములో చంద్రునికళంకము వర్ణింపబడినతీరు మనోహర మై తిమ్మనగారిభావనాపటిమకును, లోకజ్ఞతకును గీటురాయిగా నున్నది.

"అమృతం బాసవ మంగరాగ ముదయోద్యత్కాంతి చేలంబు చి
హ్నాముముంగా శశిరేవతీరమణుఁ డున్మాదంబు మీఱం దమో
యమునన్ భంగము నొంది పాఱఁ గరసీరాలోడితం జేయ వ
చ్చె మరుద్వాహిని దానిఁ దేర్ప నన మించెం జంద్రికాపూరముల్"

(2 ఆ - 47 ప)

ఈపద్యములో చంద్రుడు బలరామునితో నుపమింపబడినతీరు సహృదయ రంజకముగా నున్నది. బలరాముడు తెల్లనివాఁ డని [1] కవికల్పలతయు మదిరాపానాసక్తు డని [2] మాఘుడును వర్ణించుట విద్వజ్జనవిదితము.

"కామినీమానమేఘశ్రేణి విరియంగఁ దొగరెల్లుగుంపులు తొంగలింప
సాంధ్యరాగావిలచంద్రికాంబులు దేఱ నిరులమొత్తపుటన లివురఁబాఱ
యువజనరాగపయోరాసు లుప్పొంగ వెలిదమ్మిజాజిపువ్వులు ముడుంగ
మదచకోరమరాళమండలి చెలరేఁగఁ బఱచుచేడియ లనుమెఱపు లడఁగ
నభినవశరత్సమాగమం బనఁగ మించునట్టిరాకానిశావేళ నలరువింట
గొనయ మెక్కించి వలరాజు కినుక మీఱ విరహిజనములపై దండువెడలె
నపుడు."

(2 ఆ - 50 ప)

1. 'సూర్యేందుకాంతకర్పూర రంభారజతం హలీ
నిర్మోకభస్మహిండీరచందనంకరకాహిమం' - కవికల్పలత.

2. 'ఘూర్ణయన్ మదిరాస్వాదమదపాటలితద్యుతీ
రేవతీవదనోచ్ఛిష్టపరిపూతపుటేదృశా" - మాఘము.

పై పద్యములోని ప్రథమపాదమునుబట్టి సత్యభామమానరోషము శాంతించిన దనియు, రెండవపాదమునుబట్టి సత్యాకృష్ణులు రాగాంబుధిలో తేలియాడి రనియు సూచన.

రాకానిశావేళ "అభినవశరత్సమాగమం బనఁగ మించె" ననుటచే శృంగారరసమున కుద్దీపనము లైన వెన్నెలలు విరివిగా విరిసిన వనియును, ఆపున్నమ రేయిని శరత్తుతో పోల్చుటచే (శరద్రాత్రులందు సేనల నడపునాచారము పూర్వ మున్నది కనుక) నింద్రునిపై నుపేంద్రుడు దాడి వెడలు ననియు సూచింపబడినది.

వర్ణనము రసపోషక మైనను కావలయును - లేదా భావికథా సూచకమైనను కావలయును. మఱియొకవిధముగా చెప్పవలె నన్నచో - కవి వర్ణనము చేయుట కథాంశమున కొక దేవతావస్త్రమును గట్టబెట్టుట. ప్రధానకథతో మేళవింపబడినవర్ణన మిది !

అస్తమించుచున్న చంద్రబింబము కాలినపేడముద్దవలె, తేనె లేని తేనెపెరవలె, వృద్ధురాలి కేశబంధమువలె, పిడిచివేయబడినసున్నపు గుడ్డవలె నున్న దఁట! (2 ఆ - 59 ప) ఈవర్ణనములోనిసామంజస్యము సహృదయులకే యెఱుక.

జలరుహమిత్రుఁ డాత్మరుచిసంపదఁ జీకటిబందెకానికిం
గలఁగుచు వీనిలోన నిడి కైకొన నమ్మికకాఁపు లంచుఁ జొ
క్కులదార యెందడాడి విని గ్రక్కునఁ దామను గాంతి వీనిలో
పల నెలకొల్పెనాఁ బఱుకఁబాఱె నిశాంతనికాంతదీపముల్ "

(2 ఆ - ప)

" అగ్నిం వా వాదిత్య స్సాయం ప్రవిశతి
తస్మా దగ్ని ర్దూరా న్నక్తం దదృశే
ఉభేహి తేజసీ సంపద్యేతే

'ఉద్యంతం వా వాదిత్య మగ్ని రనుసమారోహతి
తస్మా ద్ధూమ ఏవాగ్నే ర్దివా దదృశే"

"ఆదిత్యో వా_స్తమయ న్నగ్ని మనుప్రవిశతి" అనుకృష్ణయజుర్వేద పంక్తి యాధారముగా తిమ్మన యీపద్యమును రచించినాడు. సూర్యు డస్తమించునప్పుడు తన తేజము నగ్నియందుంచి మరునాఁ డుదయమున మరల గ్రహించు నని పై వేదపంక్తి కర్థము. ఈపద్యము తిమ్మకవి వేద పాండిత్యమున కొకమచ్చుతునక.

"సమయాభీరకుమారుఁ డేపునఁ దమిస్రారూపన_క్తంచరిం
గమలారి_స్తనమండలాంకవిషసంక్రాంతప్రభాదుగ్ధపూ
రముతో రూపఱఁ జేయ శోషిలుచుఁ దారల్ సోల నిట్టూర్పు సాం
ద్రముగా నూర్చె ననంగఁ బెల్లెసఁగెఁ బ్రాతఃకాలవాతూలముల్"
(2 ఆ - 62 ప)

కళంకసహితు డైనచంద్రుఁడు గరళాంకితమైనపూతన_స్తనమువలె నున్నాఁడట! ఆచంద్రకాంతిపూర మా_స్తనదుగ్ధపూరమట్లున్న దఁట! కాల మనెడిగోపబాలుఁడు (బాలకృష్ణుఁడు) ఆవిషదుగ్ధప్రవాహముతో నారాత్రిస్త్రిప్రాణములను పీల్చివేయగా - తారలు (ఆమెకను గ్రుడ్లు) సోలి, యామె విడిచినతుదిశ్వాసవలె నున్న వఁట ప్రభాత వాతములు!

ఈవర్ణన మపూర్వ మై తిమ్మనగారిప్రతిభ కద్దము పట్టుచున్నది. శ్రీకృష్ణుడు నాయకుడుగా నున్న ఈ కావ్యమున ప్రభాతవర్ణనమునసైత మాయనబాల్యచేష్టలను రూపించుట సముచితముగా నున్నది. కాలము పరమేశ్వరస్వరూప మని పెద్దలు చెప్పుదురు. కనుక భగవంతు డైనకృష్ణునికిని, కాలమునకును నభేదము చెప్పుటకూడ సమంజసముగానే యున్నది.

# ప్రభాతవర్ణనము

"వినవయ్యెం గృకవాకుకూజితము లుద్వేలంబు లై సూరసూ
తనవోద్యత్కరకుంచికావిఘటితధ్వాంతాగరక్రక్రియా
స్వనముల్ వైరవిజిత్ప్రసూనపృథుకస్వాపక్రియాలోలికల్
దినకృన్మార్గనివారణత్వరితమందేహోగ్రసింహధ్వనుల్"

(2 ఆ - 65 ప)

పై పద్యమునందలి ప్రభాతవర్ణన ము టుంచి, తలుపులకును, పెట్టెలకును తాళము వేయుపద్ధతి తిమ్మకవినాఁటి కుండె ననుట కీపద్యము సాక్ష్య మిచ్చుచున్నది.

"రాజు వీడెత్తి చనినఁ దారకభటాలి
యంబరాభోగనిజశిబిరాంగణమునఁ
గీలుకొల్పినపావకజ్వాల లనఁగఁ
బ్రాచిఁ గనుపట్టె నవసాంధ్యరాగరుచులు"

తిమ్మనగారి కాలమున రాజు శిబిర మెత్తిపోగా నాయనభటులు తమ విడిదలప్రదేశములం దగ్నిని రగుల్కొలుపువా రని యీపద్యమువలన తెలియుచున్నది.

"కమలినీజృంభికలకు దిక్కాంత లెల్ల
హస్తతాళంబు లొనరించి రనఁగఁ జెలఁగె
లలితకాసారకూలకులాయచలిత
శకునపక్షజపటపటస్వనము (లధిప)"

(2 ఆ - 67 ప)

ఆవులింత కలిగినపుడు చిటికెలు వేయునాచారము తిమ్మకవినాఁడుకూడ నుండె నని ఈపద్యము చెప్పుచున్నది.

ప్రాతఃకాలమున యామిని నశించుటయు, దిక్కులు కాంతిమంతము లగుటయు జరుగును. నశించుట, కాంతిమంతములగుట –

యనుపరస్పరవిరుద్ధధర్మములను (ప్రసన్నత్వమునందుటగా శ్లేషించి) యొకేబాటపై నడచుజోడుగుఱ్ఱాలబండివలె పద్యమును కవి నడిపించిన తీరు ప్రశంసాపాత్రము.

రాత్రి గతింపగానే ప్రియచుంబితాంగనలయధరములు రక్తిమను గోల్పోవుటయు, చంద్రుఁ డస్తమించుటయు సంభవించును. ఆరక్తము లగుట, అస్తమించుట యనువిరుద్ధధర్మముల నొకేత్రాట నిలిపి, (ఆయధరములును, నీయుడురాజును) అపరాగయుక్తిఁ దోఁచె నని యీరెండర్థములను నొకేమాటలో పొదిగి తిమ్మకవి మాటల గారడిలో మేటి ననిపించుకొన్నాడు.

" యామినీసమయంబు నాశాతటప్రదే
శంబుఁ బ్రసన్నభావంబు నందె"
(2 ఆ - 68 ప)

అనునీసపద్య మాద్యంత మిట్లే శ్లేషానుప్రాణిత మై విరుద్ధధర్మములకు తుల్యయోగము కూర్చుట యబ్బురము గొల్పును.

రాజవల్లభలు పరపురుషులను కన్నెత్తి చూడరు. ఎండ కన్నెఱుఁగక నిరంతరరాజభోగములందుసుమకోమలాంగులు వారు. ఈభావ మీక్రిందిపద్యమున (కలువపూవులను వర్ణించుమిషతో) కవి యెంత చమత్కారముగా నిక్షేపించినాడో చూడుఁడు :-

" కమలాప్తోన్నమదంశుజాలములు దిగ్భాగంబులం గ్రమ్మినన్
గుముదాంతఃస్థితలక్ష్మి యెండవడనోఁకుల్ సైపఁగాలేక ప
త్రములన్ మాటుగఁ జేసి కప్పుకొనియెం దత్కాలసంకోచన
క్రమదంభంబున - రాజవల్లభ లసూర్యంపశ్య లౌదుర్గదా ! "
(2 ఆ - 69 ప)

సూర్యకిరణప్రసరణమున ముకుళితము లైనకలువలస్థితిని వర్ణించునీ పద్యమున శ్లేషచమత్కృతితో చెప్పబడినయర్థాంతరన్యాసముచే నానాఁటిరాజులభార్యలు పరదాలలో నుండువా రని కవి చెప్పుచున్నాడు.

" మొగుడుఁదమ్ములఁ జిక్కుమగతేఁటియలుఁగులు
సదలిపోఁ జేయువిశల్యకరణి
కాలవశంబునఁ గడచన్నవాసర
శ్రీ గ్రమ్మఱించుసంజీవకరణి
రేయనువాలునఁ బాయ నైనరథాంగ
తతుల హత్తించుసంధానకరణి
తిమిరంబుచే సొంపు సమసినదిశలకు
వన్నియ నొసఁగుసావర్ణకరణి

మించుబీఁటెండయగ్నిఁ బుట్టించునరణి
కలుషఘోరపయోరాశిఁ గడపుతరణి
తోఁచెఁ బ్రాచీమహీధరోత్తుంగసరణిఁ
బ్రాజదుపమానికంబులబరణి తరణి. "

(4 ఆ - 49 ప)

ఇఁకమీఁద నింద్రోపేంద్రులకు యుద్ధము జరుగనుండుటయు, నందు సురవీరులు గాయపడుటయు, నాగాయములనుండి బాణములను వెలికి లాగుటకై విశల్యకరణియవసర ముండుటయు, అట్లే తెగినశరీరభాగముల నతుకునట్లుచేయుటకు సంధానకరణియవసర ముండుటయు నీసూర్యోదయ వర్ణనమున సూచింపబడినది. ఇంద్రోపేంద్రులయుద్ధాదికర్మలకు సాక్షిగా నున్నవాఁడీకర్మసాక్షి. కనుక నీవర్ణనము సముచితముగా నుండి, యిందలిశబ్దాలంకారము శ్రవణసుభగముగా నున్నది.

సర్వసాధారణముగా నంత్యానుప్రాసలకు మొగ్గనితిమ్మకవి గారు ఈపద్యములోనియనురూపశబ్దపునఃపునరావృత్తిచే ప్రకృతార్థము స్ఫూర్తిమంతమును, భావియుద్ధోదంతమును సూచితమునుగా చేసియుండుట గమనార్హము.

# శ్రీకృష్ణసందర్శనలాలస లైనసురలోక సుందరీజనులవర్ణనము.

మజ్జన మాడినసీలాలక యొక్తు జగదేకమోహను డైనకృష్ణుని చూచుతమకముచే సలిలార్ద్రకచంబులు కుచద్వయముపై వ్రాలిచి సందిటను బొదివి రాజపథమునకు వచ్చిన దఁట. ఆనీలాలకకచములు గోపాలకమూర్తి కిష్ట మైనశిఖిబర్హము నామె కానుకగా తెచ్చినదా యనున ట్లున్న దఁట! (3 ఆ – 14 ప) ఎంతమధుర మైనభావన! మజ్జన మాడినయాసురలోకసుందరి తనచూపుల కందకుండ కృష్ణుడు దాఁటిపోవునేమో యన్నతహతహతో నగ్నముగా నున్నతనవక్షోజములను కప్పుకొనుటకై ఆనీలికురులను తనకుచములపై వ్రాల్చిన దఁట! అవి తడి యారనికురులు. పరిమళించుచున్నకురులు. కనుక జలకణములను రాల్చుచు నామెహృదయావేగమును, నల్లనిస్వామికై యామె పొందునారాటమును చాటుచున్నవి. పురి విప్పిననెమలిపింఛమువలె నున్నవిరియబోసిననీలాలనెఱికురుల నామె తనయున్నతవక్షోజముల వ్రాల్చికొనుట ఆస్నాతసుందరిసౌందర్యము నినుమడింపజేయుచు నామె యెదలో పొంగులువారుశృంగారభావనను సూచించుచున్నది. చేయి తిరిగినయెంతటిచిత్రకారునికుం చెకును అందనియీసుందరదృశ్యము సౌందర్యతపస్వి యైనకవిగంటమునకును, తద్వారా మహాభావుకు లైన పఠితలహృదయములకునుమాత్రమే అందుబాటులో నుండునది.

పద్మనాభుని జూడగా తనదేహవల్లికను గడలుకొనుసాత్త్వికలీలలను సఖీజనము కనిపెట్టెద రన్నభయముచే సౌధశిఖాగమనశ్రమముచే తనమేనునకు కలిగినబడలిక యని యొకయన్నృతోదరి నేర్పుగా బొంకిన దఁట! (3 ఆ – 15 ప) అనృత మాడినయాయువతి యన్నృతోదరి యఁట! సాభిప్రాయ మైనయిట్టిశబ్దప్రయోగకుశలత ఆగర్భకవి

యైనతిమ్మనగారిసొమ్ము. పరఁదైనపురుషోత్తముని దర్శించుటచే నాయతివలో సాత్త్వికభావోదయ మగుటయు, అలజ్జావతి దానిని గోప్యముగా నుంపగోరుటయు సహజమేకదా. అవహిత్థ యనుసంచారీభావ [1] మిందు కలదు.

శౌరిని చూచుటకై ప్రమదాతిశయము హృదంతరముల చిప్పిలగా – కయి సేయుతెఱంగయథాతథముగా, కుప్పనగూరి, యొండొరులఁ గూడఁగనీక కడంగి, వేలుపుంగప్పురగందులు ధగద్ధగితోన్నత హర్మ్యరేఖల నెక్కి రఁట! (3 ఆ – 11 ప) దీనినిబట్టి కృష్ణు డెంతో యందగాఁ డని స్పష్ట మగును.

మేను చెమర్చి, చందనాదిలేపనము జారిపోవుట, సమ్మదాశ్రువులచే కన్నులకాటుక కరగుట, యొడలు గగుర్పొడిచి మకరికాపత్రములు పేటులెత్తుట – [2] అన్నవి రతిక్రీడాపరవశలైనయువతుల యందు కానవగులక్షణములు. ఈలక్షణములు కృష్ణుని చూచినంతనే దర్శనరతిచేతనే తనకు కలుగు నని నెచ్చెలికి చెప్పుచున్న దొకచేడియ. ఇది యీకావ్యమునందలిశృంగారరసప్రాధాన్యమును చెప్పక చెప్పుచున్నది. ఎట్లును జారిపోవునలంకరణము నిష్ప్రయోజనము కనుక నసలే యలంకరింపవ ద్దనుచున్న దాముద్దియ. శాశ్వతుడై, సకల జగదలంకారుడైనమోహనాకారుడు కన్నులముం దుండగా జారిపోవు నలంకరణముతో పనియేమి? యనిచమత్కారము.

> " వేడుక నీకె కాని మఱివేతొకయింతికినైన లేదె? త్రో
> పాడెద వేలె? మచ్చర మొకప్పుడు మానకపోయి తీవు పెన్

1. అవహిత్థాతు లజ్జాదేర్హర్షాద్యాకారగోపనమ్
2. స్తంభః ప్రళయరోమాంచౌ స్వేదో వైవర్ణ్యవేపథూ
   అశ్రువైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః

గ్రోడవు గాన నిన్నె కనుఁబో ! యతఁ డెవ్వరిఁ జూడఁ డంచు నో
నాడె సపత్ని నొక్క_తె మురారిఁ గనుంగొనువేళ నీసునన్ "

(3 ఆ - 16 ప)

"వేడుక నీకె కాని వేఱొకయింతికినైన లేదె ?" - అనగా - కృష్ణుని చూడవలె ననుకుతూహల మింతు లందఱకును గల దనుట.

అతిలోకసుందరు డైనజయంతుని నిరంతరము చూచుసుర లోకసుందరులు కృష్ణుని గాంచుట కింతగా తహతహ లాడుటనుబట్టి - ఆమన్మథజనకుడు సమ్మోహనాకారు డగుట స్పష్టము. ఆయనను దర్శించుటకే అన్యలైనవేలుపుంబువ్వుఁబోండ్లు ఇంతగా మచ్చరించుకొను చుండగా - మఱి - ఆయనభార్య లొకరితో నొకరు మచ్చరించుకొనుట వింత కాదు.

"నిన్నె కనుఁబో - అతఁ డెవ్వరిఁ జూడఁడు" - అని యొకతె మఱియొకతె నీసుతో నెగతాళి చేయుట కన్నది. అనగా - "నిన్నే కాదు - అందఱి నాకృష్ణుడు చూచునుసుమా" అని యామె యాంతర్యము. సర్వాంతర్యామి యైనయాభగవానుఁ డందఱిని కనిపెట్టి చూచుచునే యుండునుకదా ! అట్టివానిని సందర్శించువేళ - మాత్స ర్యాదిగుణములు తొలంగుటకుమాఱు వారిలో ప్రకోపించుట వింతలలో వింత. వారిలోని శ్రీకృష్ణసందర్శనలాలసత కీమాత్సర్యము మాఱు రూపము. ఈయీర్ష్య సత్యభామాదులలోనిసపత్నీమాత్సర్యమునకు ప్రతిబింబము.

"అలికులవేణి యొక్క_తె మురారిఁ గనుంగొని భ్రమసిపాటు మై
నెలకొని యున్నచో సడలునీవిక లేఁజెమ రంటి నిల్చిన దట ;"

(3 ఆ - 17 ప)

ఆస్వేదోద్గమ మెంతటిదో ! ఆమెలో పొంగినయావల పెంతటిదో ! ఆమె యంజలిపుటమున నిండినలాజల నామె యదువల్లభునిపై చల్ల

లేదు - ఆమెసాధ్వసకంపమే చల్లిన దఁట! స్వేదప్రకంపాదిసాత్త్విక భావము లామెకు చేసినమేలు చెప్ప నలవి కానిదికదా! ఎదనిండ భగవానుడు కృష్ణు డుండగా తద్గత మైనమనసునందలికోరిక లప్రయత్నముగా - సంకల్పమాత్రముచేతనే ఫలించు ననుట కీవర్ణన మొక్కటి చక్కనియుదాహరణము.

మదవతి యొకతె పరాకున - (అనగా పరధ్యానములో అనగా - పరుఁ డైనకృష్ణపరమాత్మయందలిధ్యానములో) పదాంగణము కంకణముగా పాణిం దొడిగిన దఁట! ఆయదువల్లభుని గనుంగొనుచో మేను పొంగి తుది నదియును తుత్తుము రైన దఁట! (3 ఆ - 18 ప) ఇక్కడ "మదవతి" శబ్దము సాభిప్రాయము. ఆమే నంతగా పొంగుటకు కారణ మైనయామదవతిమెదపొం గెంతటిదో మఱి! విభ్రమమనుశృంగారచేష్ట యిందు వర్ణింపబడినది. [1]

"దనుజవిరోధిమీఁద నొకతన్వి కరంబున లాజ లెత్తి చ
ల్లిన - నెఱివేణి యూసునఁబలెన్ విరిపూవుల జల్లెఁ జల్లె లో
చనములు సమ్మదాశ్రువులఁ జల్లె లలాటము ఘర్మబిందువుల్
దనుఁగవ చల్లె సంభ్రమవశత్రుటితామలమౌక్తికాదులన్"

(3 ఆ - 19 ప)

ఆమెకరములు లాజలు కృష్ణునిపై చల్లగా - నీసునసో యనున ట్లామె వేణి పూలు చల్లిన దట! - ఆయనకు కానిపూలు తన కేల నన్నట్లు!-

1. (అ) "త్వరయాహర్షరాగాదే ర్దయితాగమనాదిషు
అస్థానే భూషణాదీనాం విన్యాసో విభ్రమో మతః
- సాహిత్యదర్పణము.

1. (ఆ) "ప్రియాగమనవేళాయాం మదనావేశసంభ్రమాత్
విభ్రమో గంధహారాదిభూషాస్థానవిపర్యయః"
- రసార్ణవసుధాకరము.

ఆమెనల్లనిజడ కలంకారముగా నుండుపూలు నల్లనిస్వామిశిరమున పూజాపుష్పము లైనవి. ఆమెలోచనములు సమ్మదాశ్రువులు చల్లగా లలాటము ఘర్మబిందువులను చల్లిన దఁట! మఱి - ఆగురుకుచవలు దగుబ్బ లెంతగా పొంగినవో! ఆపొంగునకు తట్టుకొనలేక ఆమెయెద కలంకార మైనముత్యాలపేరులు తెగి ఆముత్తెములు కృష్ణునిశీర్షమున సేసముత్తెము లైన వఁట! ఇది యొకమనోహర మైనవర్ణనము. (ఇచ్చట 'సమ్మద' శబ్దము - సమ్యక్ మదము, సత్ మదము - యౌవన మదము, ఆనందము - అనురెం డర్థములలో ప్రయోగింపబడినది!) ఇందు స్వాత్త్వికోదయాదులు ప్రదర్శింపబడినతీరు చమత్కారముగా నున్నది. ఒకేయంగనయంగములోనివిభిన్నాంగకము లొండొంటితో శ్రీకృష్ణుని పూజించి చరితార్థములు కాఁగోరి యింతగా పోటీ పడగా - ఆయనవిషయమున సపత్నీజనము పరస్పరము మచ్చరించు కొనుటలో వింత యే మున్నది?

"జలరుహనేత్రుఁ గాంచి సరసత్వము మీఱఁగ నొక్కవేలుపుం
జిలుకలకొల్కి రాచిలుకచేఁ బిలిపించిన సత్యభామ కా
కలికితెఱంగు శౌరి కడకన్నులసన్నలఁ జూపినాఁ" డఁట!
(3 ఆ 20 ప)

కేవలము కొంటెతనముచేతనే కృష్ణు డీపని చేయలేదు - సురలోక సుందరాంగులుసైతము తనకై యెంతగా మోజుపడుచున్నారో సత్య భామకు ప్రత్యక్షముగా చూపి - అయినను తానుమాత్రము తన్ను వల చినయానిర్జరాంగనలనుకూడ కా దని - సత్యభామకే మన సిచ్చితి నని యామెకు నమ్మిక కలిగించి యానందింపజేయుటకే కృష్ణు డావేలు పుంజిలుకలకొల్కిచేష్టను సత్యభామకు కడకన్నులఁ జూపినాడు. కృష్ణుడు తనగుట్టును బట్టబయలు చేయగా పాప మాదేవసుందరి యెంతగా ఖేదించినదో - యెంతగా లజ్జించినదో - అయినను నిస్సహా

యురాలై యేమియు చేయలేక కోపకందళకలుషాయితాక్షీవలనము లచే కృష్ణు నదలించి నిట్టూర్చిన దఁట! ఎంతదయనీయ మైనఘట్ట మిది! ఎంత మనోహరకల్పన మిది!!

ఆకృష్ణుడు సురలోకరాజమార్గమున నేఁగుచుండగా ననిమిషపురజాలకములు వనితాజనతామయము లైనవి! ఆవనితలహృదయ మనురాగరసమయ మైనది! ఆయనురాగమంతయు శౌరిమయ మైనది! (తైఆ - 21 ప) " రసో వై సః " భగవంతుడు రసస్వరూపుడు. అందును కృష్ణుడు భోగమయశరీరమున నున్నవాఁడు. నిర్జరాంగనలయనురాగ మంతయు రాశీభూత మై తన్మయ మైనది. అనురాగమున కింతకన్న పరమావధి లేదు. ఆయనురాగమును చిత్రించినతిమ్మకవికవిత కింతకన్న చారితార్థ్యము లేదు.

" కనుఁగొన వేడ్క-లం బొడముకాయ్యల నచ్చర లీసడించుటలు వినుచునే వెన్నుఁడు దరస్మితముతో[1] రాజపథము దాఁటి యయ్యనిమిషనాథుగేహబహిరంగణభూస్థలి వైనతేయునినుండి డిగ్గినాఁడు. (3 ఆ - 22 ప)

అమరలోకమదవతులే కాక, యింద్రుఁడును రెప్ప వాల్పక కృష్ణునియందమును కన్నులతోఁ గ్రోలినా డనుటకే " అనిమిషనాథ " శబ్దమును తిమ్మకవి యిందు సార్థకముగా సాభిప్రాయముగా ప్రయోగించుట గమనింపదగినది.

1. " స్మితమును హసితము ననువిద్వితయము మత్తమము నాఁగ దీపించుఁ దగన్‌: స్మితము వికాసకపోలము, మితదర్శితరదన మైన మెఱయు హసిత మై " - కావ్యాలంకారచూడామణి.

# సత్యాకృష్ణుల నందనోద్యానవన విహారము

దైవతాధీశుని నందనోద్యానసీమ రంభామహారోజకుంభపరి రంభకుసుమితప్రత్యగ్రకురవక మట! మంజుఘోషావక్త్రికంజాతచకచక స్తబకితచంపకశాఖోరుహ మఁట! ఈవిధముగా తిమ్మకవి వర్ణించిన యాయారామసీమలో నొకచోట ఘనఘనాఘనరంగవిద్యున్నటీనాట్యవిలసనములును, హంసవ్రజమును సామిసంఫుల్లమల్లిపాటలీచంపకోత్పల ప్రౌఢిమములును నుండి, అందు నొకేసారి యాఱుఋతువులును సాక్షాత్కరించినట్లు చెప్పి, యావెంటనే మఱొక్క మనోహర మైనపద్యము నీక్రిందివిధముగా వర్ణించుట గమనింపదగినది :-

" మలయానిలసంగతిఁ జూ
తలతిక లంకూరజాలదౌహృదవతు లై
యలయిక సడలించినసొ
మ్ములకై వడిఁ బాండుపత్రములు వెస జాఱెన్ "
(3 ఆ - 47 ప)

గర్భభారాలస లైనలతాంగులుగా లత లుత్ప్రేక్షింపబడినయీవర్ణన మెంతమనోజ్ఞముగా నున్నదో! మలయానిలసంగతిచే చూతలతిక లంకూరజాలదౌహృదవతు లై యలయికచే సడలించినసొమ్ములవలె నున్నవట జాఱినపండుటాకులు! లతికాశబ్దము స్త్రీలింగము కనుక నందు దౌహృదలక్షణములు వర్ణించుట సరసముగా నున్నది. వసంతప్రాదుర్భావమున చెట్లు పండుటాకులను రాల్చి చిగురు తొడుగుట ప్రకృతిసహజము. ఈచిన్నివిషయము నాధారముగా చేసికొని యెంతరసవంత మైన కల్పన మొనర్చినాడో తిమ్మకవి!

రాలినపండుటాకుల నిక్కడ నీవిధముగా వర్ణించినకవి మఱొక్కయడుగు ముందునకు వేసి పండుటాకులను రాల్చనతీవల నెట్లు వర్ణించుచున్నాడో చూడుడు :-

" మలయసమీరణచ్యుతసమంచితపాండుపలాశ లైనపా
దులమనుసోగతీఁగలు యదుప్రభునిం దలపించె బాలచా
పలహృతచీరవస్త్ర లయి పంకరుహాకరమధ్యసీమలన్
నిలచినముగ్ధగోపరమణీరమణీయవిలాసరేఖలన్ "
(3 ఆ - 50 ప)

ప్రకృతిని వర్ణించుచు తిమ్మకవి చెప్పినపద్యములలో మకుటాయమాన మన దగినపద్య మిది! ఆచార్య యస్వీజోగారావుగా రన్నట్లు – "ఒక మధురసన్నివేశమును తిలకించినంత రసికులకు స్మృతిసిద్ధ మైనమఱియొక తాదృశమధురానుభవము స్ఫురణకు వచ్చుట పరిపాటి. పాదుల రాలిన పండుటాకులమధ్య నున్నపరువపుతీఁగ లఁట – నాఁడు గట్టుపై చీరలు పెట్టుకొని జలకేళి సల్పినగోపికలవిలాసములకు జ్ఞాపకము లైన వఁట! ఆహా! తాతగారిసుకుమార మైనభావన! అనుభవసిద్ధుఁ డగునో కాదో గాని – మనశ్శాణోపలరేఖామయూఖ మాతనిరసికత్వము. ఇక్కడ ఒకపాత్ర పొందినయనుభూతిద్వారా సన్నివేశగతసౌందర్య మును వ్యక్తము చేయుట యనుమఱియొకశిల్పపరమార్థమును గ్రహింప బడినది." 1

అనుసుసోగతీఁగలను తిలకింపగనే ముగ్ధ లైనగోపరమణులు కృష్ణునితలపున నిలిచినారనుటచే వారు లతాంగు లని చెప్పకయే చెప్పిన ట్లయినది. ఆకులు లేనితీవలు బాలచాపలహృతచీరవస్త్రు లని పించి, ఆ కొంటెగోపాలునికి తనచిన్ననాటియల్లరిచేష్ట గుర్తువచ్చిన దఁట! ఆగోపికలు మఱచిపోయినను – తా నెంతపెద్దవా డైనను – తనబాలచాపలమును తాను మఱువజాలఁడుకదా! ఈకొంటెపని నంద గోకులమున జరిగినది కనుక " యదువల్లభుఁ " డనుపద మిక్కడ సాభి ప్రాయముగా ప్రయోగింపబడినది. ఆగోపికలు చెఱువులో కుత్తుకబంటి నీట మునిఁగి యుండఁగా వారిముఖములే పద్మము లై కనిపించుటచే –

1. సారస్వతనీరాజనము - డాక్టర్. యస్వీ. జోగారావుగారు పుటలు 56, 57.

ఆపంకరుహాముల కాకర మైనది కనుక ఆసరస్సు పంకరుహాకర మైన దని చమత్కారము !

కృష్ణుడు మాయ చేయు నని యెఱుంగక అపహృతవస్త్ర లై నయమాయికలు కనుక కవి వారిని ముగ్ధగోపరమణు లనుచున్నాడు! తిమ్మనగా రెంతటిరససిద్ధుడో తెలుపుట కీపద్య మొక్కటి చాలును.

'రమణీరమణీయ'- అనుచో యమకాలంకారము రమణీయ ముగా నున్నది. ఈశబ్దాలంకారముకన్న నిందలిస్మృత్యలంకార మింకను మనోహరముగా నున్నది !

తిమ్మకవి యలతియలతిపలుకులతో తేటతెనుగుమాటలు కూర్చి పద్యము నె ట్లల్లినాఁడో యీక్రిందిపద్యము సాక్ష్య మిచ్చు చున్నది :-

సీ. పరువంబుగాక చొప్పడనిమామిడితేనె లాన నాసాన నట్టాడునవియుఁ
దమకించి చిగురాకు గమిచి నోరొగరైనఁ గడఁగి గొజ్జగనీటఁ గడుగునవియు
సంపెంగపొదరింటిచక్కి గోరటఁ గాంచి యుసురంచు మగిడి నోరూరునవియు
గలిగొట్టుపసరుమొగ్గలఁ గోర్కి పాలివోయి మునుపటిమొల్లల మూఁగునవియు

తే. వె. నగుచుఁ దేఁటికదుపు లామనిఁ దలసూపెఁ
జూపుదనుక నెల్లచోటఁ దోఁట
యందుఁ దామ యగుచు నమ్మరునెలగోలు
పౌఁజు లనఁగఁ జూడ్కిపండు వగుచు" (3 ఆ - 51 ప)

పై పద్యమునందలిస్వభావోక్తి ముచ్చట గొలుపుచున్నదికదా !

"సరసిజనేత్ర ! చూచితె ? వసంతుఁడు నీవనవాటికారమా
తరుణియుఁ బాణిపల్లవవిధానమయంబున గేలుదోయి నొం
డొరుపయి సమ్మదంబు లిగురొత్తఁగ మాటికిఁ జల్లుసేసఁబ్రాల్
నెరసె ననంగ వ్రాలెఁ గుహళీవిగళన్నవకోరకావళుల్"
(3 ఆ - 53 ప)

పోఁకపొత్తులనుండి జారిననవకోరకములవరుసలు నందనవనరమావసంతులవివాహమంగళవేళ వధూవరు లొండొరులపై చల్లుకొన్న సేసఁబ్రాలో యనున ట్లున్న వని కృష్ణుడు సత్యభామకు తమపెండ్లినాటి ముచ్చట నామెకు స్ఫురింపజేయుట సరసముగా నున్నది.

" అనుచుఁ బ్రియాంసపీఠి నిజహస్తతలంబున నూఁది కల్పకా
వనిజదుకూలమార్జనల వంజులపుష్పమరందసేచనన్
దనదువిహారవైఖరికి నందనదేవత యాయితంబు సే
సినగతి నొప్పుదివ్యవనసీమ ముదంబున సంచరించుచున్ "

(2 ఆ - 58 ప)

ఈపద్యము సత్యాకృష్ణులవనవిహారవిషయమున వారియన్యోన్యతను సభ్యతాపరిధులలో మనోహరముగా చిత్రించినది.

## జలక్రీడావర్ణనము

" వదలిననీవిబంధముల వాడినమోముల జాఱుకొప్పులం
జెదరినపత్రభంగములఁ జిక్కులు గొన్నమణీసరంబులన్
బొదలినయూర్పుఁదెమ్మెరలఁ బుప్పొడిఁ గెం పగువాలుఁగన్నులం
ద్రిదశమృగాయతాక్షులు రతిశ్రమఖిన్నలఁ బోలి రందఱున్ "

(4 ఆ - 18 ప)

మధ్యాహ్నపుటెండలో వనవిహారముచే డస్సినదేవకాంతలలో పొడమిన పైలక్షణములు రతిశ్రమఖిన్నలకుకూడ వర్తించును కనుక ఆదేవకాంతలు రతిశ్రమఖిన్నలవలె నుండి రనుట రసవంతముగా నున్నది. ఈపద్యము తిమ్మనగారియూహావైభవమును పట్టి యిచ్చుచున్నది. శృంగారరసప్రధానమైనయీకావ్యములో జలక్రీడావర్ణనముకూడ శృంగారవిషయికముగానే స్ఫురించుట తిమ్మనగారికవితలోని ప్రత్యేకత ! సౌందర్యదిదృక్షువు లైనకవులదృష్టిలో నీవిశ్వమున నణువణువును శృంగార

మయముగనే భాసించును. కనుకనే "శృంగారీ చే త్కవిః సర్వం రస మయం జగత్" అని పెద్దలాభాషించిరి !

"మరుదంభోరుహనేత్ర లంబరధునీమధ్యంబునన్ విల్వ ని
ష్ఠురతత్పీనపయోధరాహతి జలస్తోమంబు నల్వంకలం
దెరలన్ నాభిచయంబు లోఁగొనియె దానిం జాల గాంభీర్యశీ
లురు సంక్షోభము నొందువారి నెచటన్ లోఁగొంచు వర్తింపరే ?"

(4 ఆ - 29 ప)

ఓహో ! కుచకాఠిన్యమును, నాభిగాంభీర్యమును నింతచక్కగా వర్ణింపఁగలకవి తిమ్మకవి యొక్కఁడే యనునట్లున్న దీపద్యము !

ఈవర్ణనమునే అల్లసానివారు చేసినచో -

"కనియెన్ విద్యుల్లతావిగ్రహన్ శతపత్రేక్షణఁ జంచరీకచికురం జంద్రాస్యఁ
జక్రస్తనిన్ నతనాభిన్ నవలా నొకానొకమరున్నారీశిరోరత్నమున్"

అను ఛాణీలో పద్యము సాగి యుండెడిది.

పైపద్యముచివర నున్న "గాంభీర్యశీలురు సంక్షోభము నొందువారి నెచటన్ లోఁగొంచు వర్తింపరే ?" యనునర్థాంతర న్యాసము

"దివాకరా ద్రక్షతి యో గుహాసు
లీనం దివాభీతమివాంధకారమ్
క్షుద్రేఽపి నూనం శరణం ప్రపన్నే
మమత్వ ముచ్చై శ్శిరసాం సతీవ"

అనుకాళిదాసుశ్లోకమును [1] గుర్తుచేయుచున్నది.

"కాంచి చేరంగఁ జని మధుకైటభారి
రత్నసోపానకలితమార్గముల డిగ్గి

1. కాళిదాసమహాకవికృతకుమారసంభవము - ప్రథమసర్గ. 12 వ శ్లోకము.

కులసతియుఁ దాను వేలుపుఁగొలను దటిసి
రొండొరులకేలుఁదమ్ములఁ సూఁతఁ గొనుచు "
(4 ఆ - 27 ప)

వేలుపుఁగొలనునకు రత్నసోపానకలితమార్గము లుండుట దేవేంద్రుని వైభవమును జాటును. మహానది యైనసురగంగ సతాలకు క్రీడాసర స్సైన దఁట ! ఇది యానదియదృష్టము.

ఘనకుచకుంభముల్ బయలుగా విబుధాలయవారభామినీ
జనకరిణీసమూహములు సల్లె యదూద్వహకుంజరంబుపై
వనజవనీపరాగపరివాసిత మైననభ స్తరంగిణీ
ఘనతరభంగతోయకణికాచయముల్ కరపుష్కరంబులన్ "

(4 ఆ - 30 ప)

దేవవేశ్యాతతి యనునాఁడేనుఁగులగుంపులు కృష్ణుఁ డనుమగయేన్గుపై కరపుష్కరములచే నీరు చల్లిన వఁట ! ఇం దొకయంద మైనదృశ్యము వర్ణింపబడినది. "పుష్కర" శబ్దమునకు నేనుఁగుతొండ మనియు, పద్మ మనియు నర్థములు కనుక – కరిణీపరముగా తొండ మనియు, వారవనితలపరముగా కరపద్మ మనియు నర్థములు సమన్వయించుకొన వలయును. యదుకుంజరుఁ డనఁగా – యదుశ్రేష్ఠుఁ డనియు, శ్రీకృష్ణుఁ డనుమగయేనుఁ గనియు చెప్పవచ్చును. కుచములను గజకుంభములతో పోల్చుట కవిసంప్రదాయము. [1]

వారణయాన లైనదేవవేశ్యలు పద్మహస్తములతో నీటి నడచినప్పుడు పుట్టినసవ్వడి మద్దెలమ్రోఁత కాఁగా తుమ్మెదలఝుంకారములు కంకణరవముగా పద్మిను లాడి రఁట ! (4 ఆ – 31 ప)

1. (అ) " ఘనకుచకుంభముల్ దొరసి కార్కొని యొప్పునకై యసూయమై "
- ఎఱ్ఱాప్రగడ నృసింహపురాణము

1. (ఆ) " తత్కుంభహస్తద్యుతుల్ నగజాచారుకుచోరువై ఖరులఁ దెల్పన్ "
- వసుచరిత్ర.

పద్మినీశబ్దమునకు పద్మినీజాతిస్త్రీ యనియు, తామరతీఁగ యనియుఁ గలయర్థద్వయ మాధారముగా తిమ్మకవి యీపద్యములో పద్మినీనాట్యమును వర్ణించినాడు. తుమ్మెదలను కంకణములతోను, వాని రొదను కంకణముల మ్రోఁతతోను పోల్చుటచే నాకంకణములు నల్లనివై, యింద్రనీలమాణిక్యములు పొదిగిన వనుకొనుట లెస్స.

మగువలు మిన్నేటినీటిపై వెల్లకిలబడి యీదుచుండగా - వారిముఖపద్మములును, కరపద్మములును, పదపద్మములును ప్రకాశించుటచే నాకాశగంగలోనిపద్మములు రెట్టింపయిన ట్లున్న దాదృశ్యము. ఈవిషయమునే వర్ణించుచు

" ఆమ్రేడితజలజాత మయ్యె మిన్నే ఱెల్లన్ "

(4 ఆ - 32 ప)

అని వ్యాకరణపరిభాషలో [1] చమత్కారముగా చెప్పుచున్నాడు తిమ్మకవి. స్వతస్సిద్ధముగా గంగలో పుట్టినపద్మములు పద్మములే. ఇఁక నీస్త్రీలముఖపద్మములు, కరపద్మములు, పదపద్మములు నున్నవే - అవి యామ్రేడితము లైనజలజాతము లన్నమాట ! సహజ మైనపూర్వరూపము కాక - పరరూపము కదా ఆమ్రేడితము !

" దానవవైరి దివ్యవనితానికురుంబముతోడ జహ్నుకన్యానవపంకజాతనివహంబులఁ గందుకకేళి సల్పుచున్
మేనఁ దదబ్జపత్రములు నిండఁగ నంటిన నొప్పు నెంతయున్
దాను నుపేంద్రు డౌటఁ నయనమ్ములు పెక్కులు దాల్చెనో యనన్"

(4 ఆ - 34 ప)

1. ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడిత మనంబడును.
- చిన్నయసూరిబాలవ్యాకరణము - సంధిపరిచ్ఛేదము.

తిమ్మకవియూహావైభవమునకు మణిదర్పణముగా నిలువగలమనోహర మైనకల్పన మిది.

కన్నులను తామరరేకులతో పోల్చుట సంప్రదాయము. జలకేళిలో నొడలెల్ల నంటినతామరరేకులతో నున్నకృష్ణుడు తానునుపేంద్రుడు గాటచే ననేకనేత్రములను కోరి ధరించిన ట్లొప్పినాఁ డఁట! అన్నగారైనయింద్రునివలెనే యుపేంద్రుడును గోచరించుట యిందు వర్ణింపబడినది. ఇంతకాలము నాయింద్రుఁ డనుభవించినపారిజాతముపై నిటుపై నుపేంద్రుడు స్వామ్యమును సంపాదించుట యిందు సూచింపబడిన దనవచ్చును.

" తనమనోవల్లభునిభుజాస్తంభ మూఁది
సలిలవిహరణమొనరించు సత్యభామ

తరంగడోలికలపై తనజంటతో విహరించు రాజహంసి యనున ట్లొప్పిన దఁట! (4 ఆ – 35 ప) సత్యాకృష్ణులయనోన్యతను కన్నుల గట్టునంద మైనవర్ణన మిది.

" ఆవతంసితశైవల యై
వివలద్వేణి యయి కోకవిస్ఫుటకుచ యై
దివిషన్నది నాకపురీ
ధవళాక్షులలోన నన్యతమ యనఁ బొల్చెన్ "

(4 ఆ - 36 ప)

గంగలో జలకములాడు దేవతాస్త్రీలకు నదియందలినాచు శిరోఽలంకార మైనది. ఇది నదికికూడ వర్తించును. ఆమగువలు వీడినకొప్పు కలవారు. అట్లే ఆగంగానదికూడ వివలద్వేణి. అనగా – పాఱుచున్నప్రవాహము కలది. సురవనితలు కోకవిస్ఫుటకుచలు. అనగా – చక్రవాకములవంటి ప్రస్ఫుటమైనకుచములు కలవారు. గంగానదికూడ కోకవిస్ఫుటకుచయే! అనగా చక్రవాకము లనెడికుచములు కలది. కనుక గంగానదికూడ

సురాంగనలలో నొకతె యనుచ ట్లొప్పినది. ఈనదియొక్క-యవస్థాచిత్ర ణమును, నీవర్ణనమును తిమ్మనగారియూహావైభవమును, శ్లేషవైచిత్రిని చాటుచున్నవి.

## నదీవర్ణనము

" పెరిఁగినహారరత్నముల పెల్లున నొక్కెడఁ దామ్రపర్ణి యై
నెరసినసోగపెన్నెఱులనిగ్గున నొక్కెడ భానుకన్య యై
గురుకుచలిప్తమైనవకుంకుమ నొక్కెడ శోణ యై నభ
శ్చరనది యొప్పె దివ్యజలజాతముఖుల్ జలకేళి సల్పఁగన్ "
(4 ఆ - 37 ప)

జలకేళి సల్పుదివ్యకాంతలహారములు పెరిగి (తెగి) ఆముత్యములచే (ముత్యములయుత్పత్తిస్థాన మైన) తామ్రపర్ణీనదిగా గంగానది యొప్పిన దఁట! ఆసురాంగనలనల్లనిశిరోజములకాంతి నదియందంతటను వ్యాపించి యమునానదిగా కన్పట్టిన దఁట! ఆకాంతలకుచకుంకుమము కరగి తననీట కలియగా దేవగంగానది శోణనదియై యొప్పె నఁట! (గండవన మనుచోట పుట్టి, పాటలీపుత్రముదగ్గర గంగలో కలియునెఱ్ఱనియేరు శోణనది). అంగనలపొందుచే రసరూపిణి యైన నదియే యిట్లు రంగులు మార్చగా - రసాకారుఁడైన శ్రీకృష్ణుఁ డసురారి యయ్యును సత్యభామమెప్పునకై యమరారిగా రంగుమార్చుట వింత కాదు.

## ఋతువర్ణనలు

" అంబుధరజాలముక్తంబు లయినజలక
ణములు సాత్త్రాజితీకైశికమునఁ బొలిచె
గగనతలలక్ష్మి పోరచి గాఁగ విడినఁ
జాల నొప్పారుమౌక్తికస్తబక మనఁగ "
(2 ఆ - 79 ప)

ఊర్ధ్వలోకమున సత్యభామకు సంప్రాప్తింపబోవుపారిజాతలాభము మొదలైన గౌరవముల నీపద్యము సూచించుచున్నది. పారిజాతవృక్షప్రాప్తికిమున్నే నందనమున కృష్ణుడు సత్యభామకు పారిజాతస్తబకమును కానుక పెట్టనున్నాడు. పైపద్యములోని "స్తబక" శబ్దము ఆస్తబకమునకు సూచనగా నుండునట్లు కవి ప్రయోగించినాడనవచ్చును.

"తళతళని మెఱుఁగుఁదీఁగలు
గలుగుఘనాఘనచయంబు గనుఁగొనఁగా నిం
పొలయించెఁ బసిఁడికామల
నలరెడునీలములగొడుగు లనఁగా హరికిన్"

(2 ఆ - 80 ప)

ఈవర్ణనము మనోహరముగా నుండుటయే కాక - తిమ్మనగారి కాలమున నల్లనిగుడ్డగొడుగు లుపయోగములో నుండెడి వని యూహించుట కవకాశ మిచ్చుచున్నది.

## వసంతర్తువర్ణనము

"చిలుకలు వాఁడిచంచువులఁ జించినచో లవలీదళంబులన్ [1]
ఫలరసరేఖ లంటి కనుపట్టెడుఁ జూడుము చైత్రుఁ డీలతా
లలనలగండదర్పణతలంబులఁ గుంకుమపత్రభంగముల్
చెలువుగ వ్రాసెనో యన నలిప్రకరాద్వయవాదికైశికా!"

(3 ఆ - 54 ప)

లవలీదళము లనగా తములపుటాకులు. సుందరులైనయువతులచెక్కుటద్దములను తెల్లగా నుండుపండుతములపాకులతో పోల్చుట కవిసంప్ర

---

1. "లవలీపల్లవపాండురంబు లగుగల్లక్షోణులన్"
- పాండురంగమాహాత్మ్యము - తెనాలిరామకృష్ణుడు.

దాయము. చిలుకలవాఁడి చంచువులచే లవలీదళముల నంటియున్న ఫలరసరేఖలు లతాలలనలచెక్కిళ్ళపై వసంతుఁడు వ్రాసినకుంకుమ పత్రరచనవలె నున్నవఁట! తనశృంగారభావమునే యన్యాపదేశముగా నిట్లు కృష్ణుడు సత్యభామకు తెలుపుట సుకుమారముగా సరసముగా నున్నది. కృష్ణుడు "అలిప్రకరాద్వయవాదికైశిక" యనుటను బట్టి సత్యభామ సౌందర్యరాశి యని స్పష్ట మగుచున్నది.

## గ్రీష్మర్తువర్ణనము

బెడిద మగు నెండ సోఁకుటచే లతలనుండి జాఱినపూలు వనదేవతమేన పొడమినలేఁగమ్మఁజెమటబొట్టు లనున ట్లున్నవఁట! చెంగట మాధవుడు విహరించుటచే వనలక్ష్మికి సాత్త్వికస్వేదోద్గమమైనట్లు చెప్పుట రమణీయముగా నున్నది. (4 ఆ – 19 ప) ఆస్వేద బిందువులు పరిమళయుక్తములు. కనుక వనదేవత పద్మినీజాతిమగువ యని చెప్పకయే చెప్పిన ట్లయినది.

> "కనుఁగవ మ్రూన్పడంగ నెఱకల్ విరియంబడ బోరమోవ నెం
> డినవదనంబులం దెఱచి నిక్కినయఱ్ఱులు తల్లడించుటల్
> గనఁబడ నూరుపుల్ దళముగా నిగుడన్ వడఁ గుంది యూరెలుం
> గునఁ దమవానిఁ బిల్చుచు శకుంతము లయ్యెడ నిల్చె మ్రాఁకులన్"
>
> (4 ఆ – 21 ప)

ఈవర్ణనము స్వభావోక్తిరమణీయముగా నున్నది.

> "ఒకయెడ జక్రవాకము పయోరుహమిత్రునివేఁడియెండచేఁ
> దెకతెకఁ గ్రాఁగుతమ్మివిరితేనియఁతెక్కలఁ జల్ల నార్చి కాం
> తకుఁ దనివార నిచ్చె బరితాపము వాయ మృణాళవల్లరీ
> శకలము మాటికిం గమిచి చంచుపుటంబున నంది యిచ్చుచున్"
>
> (4 ఆ – 22 ప)

" అతపగ్లాని బడలినయభ్రముపును
నిజకరాగ్రజలంబుల నెఱయఁ జల్లి
శ్రవణయుగతాలవృంతసంజాతశీత
వాతములఁ దేర్చె గీర్వాణవారణంబు "
(4 ఆ - 23 ప)

మనుష్యేతరము లయినజంతువులపట్ల రసభావాదులు వర్ణించుట రసాభాస [1] మని యాలంకారికు లందురు. ఐనను - తిమ్మనగారు చేసిన యీవర్ణనమును మన మాదృష్టితో చూడరాదు. ప్రకృతి యంతయు ప్రణయమధురముగా నున్న దని వర్ణించి, తద్ద్వారా సత్యాకృష్ణుల పవిత్రప్రణయమును ధ్వనింపజేయుటకే తిమ్మనగా రీరెండుపద్యములను రచించి రనుకొన్నచో నిక్కడ రసాభాసప్రసక్తి రాదు.

గంగాతరంగచాలనమున నొడ్డునకు చేరిననాచు - ఇనకర తాపవేదన సహింపలేక సురగంగ యనుకాంత తననీట తానే మునింగి (తడి) యారఁబోసికొన్నకుంతలసమూహమో యనున ట్లున్న దఁట ! (4 ఆ - 26 ప)

చక్కనియవస్థాచిత్రణ మిది. నీరుకూడ నీరమాడవలసివచ్చి నంతటి యెండ కాసిన దఁట ! ఈయుక్తివైచిత్రి మనోహరము కదా !

" వనజశ్రీధనపశ్యతోహరుఁడు జీవంజీవజీవంబు ప
చ్చనివిల్కానికి మామ చల్వగని పశ్యత్పాలజూటాగ్రమో
హనరత్నంబు సుధాకరుం డపుడు ప్రాగద్రిస్థలీవీథి నా
య్యనఁ దోఁతెంచె వియత్తటీకషణలీలానీతశంఖాకృతిన్ "
(4 ఆ - 47 ప)

1. " ఏకత్రైవానురాగశ్చేత్ తిర్యఙ్ మ్లేచ్ఛగతోపివా
యోషితో బహుసక్తిశ్చేద్రసాభాస స్త్రిధా మతః "
- ప్రతాపరుద్రీయము.

" ఆరాత్రి సత్యఁ గూడి మురారాతి మనోభూరాజ్యసౌఖ్యనిద్రాపారీణత " నుండినట్లు కవి తరువాతి (4 ఆ - 48 ప) పద్యమున చెప్పబోవుచున్నాడు. ఆసత్యాకృష్ణులశృంగారవిహారమునకు పూర్వరంగముగా నీచంద్రవర్ణనము చేయబడినది. ఈచంద్రుడు పచ్చనివిల్కానికి మామ కనుక కామకేళి కుద్దీపన మైనవాఁడు. ఫాలమున నగ్నిజ్వాలలు వెలువరించి మన్మథుని భస్మము చేసినశివుడుకూడ మఱల శృంగారి యై, యీచంద్రుని తనజూటాగ్రమోహనరత్నముగా సింగారించుకొన్నాఁడు ! " మోహన " శబ్దసార్థకత యిదియే. చంద్రుడు వనజశ్రీధనపశ్యతోహరుడు కాఁగా - ఆయనబావగా రైనవిష్ణువు " వనజేక్షణామనోధనపశ్యతోహరుడు !

" ఆరాత్రి సత్యఁ గూడి ము
రారి ముదం బెసఁగ వైజయంతమున మనో
భూరాజ్యసౌఖ్యనిద్రా
పారీణత నుండుచోఁ బ్రభాతం బయ్యెన్ "
(4 ఆ - 48 ప)

పశ్చిశృంగారమును విచ్చలవిడిగా రచించుకవులకాలమున నుండియు నసభ్యత కేమాత్రమును దా వీయక అవకాశ మున్నను రతివర్ణనము నకు పాల్పడక శృంగారము నింతసుకుమారముగా సూచించి విడిచిన కవి నందితిమ్మనగా రొక్కఁడే యేమో !

## యుద్ధవర్ణనలు

ముద్దుపలుకులకు పేరొందినముక్కుతిమ్మనార్యునిగంటము యుద్ధవర్ణనలలో నెంతయుద్ధతముగా పరాక్రమించినదో యించుక పరామర్శింతము :—

సురలోకపారిజాతమును ధరణికిఁ గొంపోవనున్నయుపేంద్రు నిమీఁది కింద్రుడు తక్కినదిక్పాలకులతోఁ గూడి దండెత్తి వచ్చినాడు.

" మానసవేగరథ్యమును మాతలిసారథికంబు నగ్రసం
దానితనీలనీరదపతాకము నైనరథంబుపై శచీ
జాని పులోమవృత్రబలజంభశరప్రవిఘాతకారణం
బైనతనుత్రముం దొడిగె నాహవదోహలమానసంబునన్. "

(4 ఆ - 76 ప)

ఇంతజాగ్రత్తపడి వచ్చియు నింద్రుడు ఓడిపోవుట యుపేంద్రునిముం దాతనియసమర్థతనే సూచించును.

" ఏడుకరంబులన్ వరుస నెత్తినతోమరశక్తిచాపశ
స్త్రీడమరుస్రువవ్యజనదివ్యమహాత్రసాధనంబు లా
మ్రేడితకాంతితో నిజశరీరరుచిం బచరింప వచ్చె న
య్యేడికరాచతత్తడిపయిన్ హుతవాహుఁ డుదగ్రమూర్తియై "

(4 ఆ - 78 ప)

ఏడికరాచతత్తడి [1] యనఁగా శ్రేష్ఠమైనపొట్టేలనువాహనము. అగ్నికి వాహనము మేఁక. అగ్నిధ్యానశ్లోకములందు హుతవహునియాయుధాదులవివరము లున్నవి. [2] ఈపద్యము తిమ్మకవిగారి శాస్త్రపాండిత్యమును జాటును.

" బాహాసంభృతకాలదండజనితస్ఫారస్ఫులింగాలికిన్
సాహాయ్యంబు ఘటించి కోపరసఘూర్ణన్నేత్రదీప్తుల్ పయో
వాహాంతర్గతవైద్యుతప్రభలతేవం జోప వాహద్విష
ద్వాహోత్తంసము నెక్కి పోరి కడరెన్ వైవస్వతుం డుద్ధతిన్. "

(4 ఆ - 79 ప)

1. తగరేడిక పొట్టేలన - ఆంధ్రనామసంగ్రహము.

2. అగ్నిధ్యానశ్లోకములు - నాగపూడి కుప్పుస్వామయ్యగారిపరిమళోల్లాసవ్యాఖ్య - పుట 272.

సకలప్రాణిప్రాణాంతకుఁ డై, నిఖిలలోకభయంకరుఁ డై నయంతకుని వర్ణించునీపద్యమున నీయారభటీవృత్తియు, నీగౌడీరీతియు రౌద్రరసోల్బణము లై యీపద్యపునడక యమమహిషగమనము ననుకరించుచున్నది!

" భీమాకారులు కామరూపధరు లాభీలక్రియాపారగో
ద్దాముల్ పుణ్యజనుల్ భజింపఁ గుముద స్తంబేరమం బగ్రతో
భూమిం బల్లన గట్టిరా నసిరుచిస్ఫూర్తుల్ విజృంభింప సం
గ్రామేచ్ఛం బలలాశి యేఁగె మనుజస్కంధాంతరారూఢుఁడై "

(4 ఆ - 80 ప)

ఈనిర్భతి పలలాశి. నరవాహనుఁడు. శ్రీకృష్ణుఁడు తనపలలాశిత్వమున కగ్గ మగుసాధారణమానవుఁ డని పొరబాటుపడి కుముదముతో వచ్చి నాఁడు కాఁబోలును ! దానికి తగినట్లే ఆయనవాహనముపేరే కుముద మగుట తగి యున్నది.

" మకరకుళీరకచ్ఛపసమానము లైనముఖంబులన్ భయా
నకరస ముప్పతిల్లఁ గెలనన్ నిజకింకరదైత్యదానవ
ప్రకరము గొల్వ బాహుశిఖరంబునఁ బాశము పూని వార్ధినా
యకుఁ డని కేఁగుదెంచెఁ గలహంసతురంగరథాధిరూఢుఁ డై "

(4 ఆ - 81 ప)

ఇంద్రునికి తోడువచ్చినవరుణునికి సంబంధించినవర్ణన స్వభావోక్తి సుభగముగా నున్నది.

" అంగసుగంధముల్ నిజభటాలిపథశ్రమమున్ హరింప ను
త్తుంగగదాపరిభ్రమవిభూతము లై ఘనముల్ దిగంతమా
తంగవిశాలకర్ణములఁ దార్కొని చామరలీలఁ జూప సా
రంగహయమ్ము నెక్కి సమరంబున కేఁగె సమీరుఁ డుద్ధతిన్.

(4 ఆ - 83 ప)

వాయువు గంధవహుఁడు కనుక ఆయనయంగములు సుగంధములీనుట సహజము. ఆసుగంధము లాయనభటులమార్గాయాసము నపనయించుట

వారియదృష్టము. మానవచక్షువుల కగుపించనియావాయుగదాఘాత ములకు చెదరినమబ్బులు దిగ్గజములకర్ణములకు తగిలి వింజామరల విలాసమును జూపుచున్న వఁట! ఈవర్ణనము జాత్యలంకారసురభిళ ముగా నున్నది.

"ఆననసీమఁ గ్రోధజనితారుణదీధితిఫాలభాగనే
త్రానలకీలలం బెనుప హస్తమునన్ నిశితత్రిశూలముం
బూని మదించి అంకె లిడుపోఁటరిగిబ్బలతేని నెక్కి యీ
శానుఁడు వచ్చెఁ బారిషదసైన్యముతో రణకౌతుకంబునన్"

(4 ఆ - 85 ప)

ఈశాన్యదిక్పాలకు డైనయీయాశానుఁడు శివకళావిష్ణుఁడు కనుక నాకారవిశేషాదులన్నిటిలో నీయనయు, నాశివుఁడును సమానులు. అట్టివాఁ డిప్పుడు క్రోధముతో యుద్ధమునకై తరలి వచ్చుచున్నాడు. క్రోధ మెఱ్ఱగా నుండు ననుట కవిసమయము. క్రోధారుణ మైన యీశానునిముఖకాంతి ఆయనఫాలనేత్రానలకీలలను మఱింతగా పెంచి నది. దానికితో డాయనచేత నున్నది యమునికికూడ భయంకర మైన త్రిశూలము. ఆయనవాహన మైనపోఁటరిగిబ్బలతేఁడు అంకె లిడు చుండగా ప్రమథగణములు సేవించుచుండగా యుద్ధోత్సాహముతో భయంకరుఁడై వచ్చుచున్నయీయాశానుని మనకన్నులఁ గట్టుచున్న దీవర్ణనము!

"దారుణభంగి నొండొకటిఁ దాఁకెడున స్త్రముఖంబులన్ ఘణా
త్కారము లుల్లసిల్ల బెడిదంబుగఁ బుట్టినసందడిం బుర
ద్వారము నిర్గమించె సురవల్లభుసేనలు భర్గజూటకాం
తారముఖంబునన్ వెడలుదైవతసింధుఝురంబులో యనన్"

(4 ఆ - 90 ప)

భర్గుడు వ్యోమకేశుఁడు. ఆయనజటాజూటమున (నూర్ధ్వలోకమున నుండి) దైవతసింధుఝురములు పొంగారినవి. అట్లే యింద్రునిసేనలు ఊర్ధ్వలోకమున నాటోపించినవి. హరజటాజూటవినిర్గతగంగతో పోల్చు

టచే ఆగంగకువలెనే యుప్పొంగినయీాసురసేనలకుకూడ తలవం పై పతనము తప్ప దని యీాయుపమానము ధ్వనించుచున్నది. ఆకాశగంగా తరంగము లొండొంటితో ఘర్షించి ధ్వని చేయునట్లు – ఆసేనలయస్త్ర ముఖము లొండొంటిని తాఁకి ఘణిల్లు మనుటచే నీపోలిక యెంతో బాగున్నది.

" గిరితటముఁ దాఁకి తిరిగెడు
తరంగిణియుఁబోలె దేవతాపతియాజ్ఞన్
మరలి వియచ్చరవాహిని
మురహరునిం బొదివి ఘోరముగఁ బోరునెడన్ "

(5 ఆ - 15 ప)

పర్వతముచే తాడిత మైననదివలె కృష్ణునిచే దెబ్బతిన్నసురసేన మహా వేగముతో వెనుదిరిగి ఘోరముగా మురహరుని పొదివిన దఁట ! వియ చ్చరవాహిని యనగా – ఆకాశమున చరించునది యనియు, దైవత సేనయనియు రెండర్థములు. వియచ్చరవాహిని విష్ణునిపాదము నాశ్ర యించియే వర్థిల్లునది. ఇంద్రునిసేనకూడ వియచ్చర వాహినియే కనుక కృష్ణుడుగా నున్నవిష్ణుపాదములాశ్రయింపక తప దని ధ్వని. ఎంత యున్నతస్థితి నున్నను వియచ్చరవాహినికి పతనము తప్పలేదు. అట్లే యీావియచ్చరవాహినికూడ ఎంతగా నుప్పొంగినను దానికి పతనము తప్ప దని కవి సూచించుచున్నాడు !

" వేల్పుమ్రానియందు వేడుకపడుకూర్మి
సతులకోర్కిఁ దీర్పఁజాలి యపుడు
హరియు హరియుఁ బోరి రన్యోన్యజయకాంక్ష
నసురజీవితాపహాశుగముల "

(5 ఆ - 23 ప)

మగవాఁ డెంతటివాఁ డైనను – ఇంద్రుఁ డైనను – నుపేంద్రుఁ డైనను మగువకోరికను మన్నింపక యుండ లేఁడు ! ఇద్దఱుమగువ లాకే

వస్తువు నాశించినప్పుడు వారిభర్త లెంతటియాత్మీయు లైనను పరస్పరము ఘర్షింపకతప్పదు. అట్టిమగవా రిరువురును తలపడినచో స్వపక్షీయులకు కీడు తప్పదు. ఈసందర్భమున యుద్ధమునకు సంసిద్ధులైనవీరు లిరువురు నొకేపేరివారు ! – ఇరువురు నొకేరక మైనకోరిక కలవారు !! కనుక వారిశృంగారము వీరమునకు దారి తీయుట విధివిలాసము. పారిజాతాపహరణమున అంగిరసము శృంగారము కాఁగా – అంగరసము వీరము. దీని నింతచిత్రముఁగా వ్యాఖ్యానించినాఁడు తిమ్మకవి !

"అలనాఁటినమ్ము మఱచితె ?
నిలు నిలుమీ తగినయాజ్ఞ నీ కిదె యనుచుం
బలుఁగులలేని మహేంద్రుం
డలుఁగులపెనుగూటఁ జిక్కునట్టుగ సేసెన్"
(5 ఆ - 27 ప)

"ఇదివరలో అమృతహరణమునకై వచ్చి నావజ్రపుదెబ్బను జవి చూచితివే – ఈనాఁడు పారిజాతహరణమున హరికి తోడు వచ్చితివా ? ఇంతలోనే నాదెబ్బ మఱచితివా ?" అని దేవేంద్రుడు పుంఖానుపుంఖములుగా బాణములు వదలి గూడుగా చేసి, ఆగూటిలో పక్షీంద్రుడు చిక్కునట్లు చేసినాఁడఁట ! పక్షికి గూడు రక్షణము నిచ్చునదే కనుక నం దుండుట యొకపెద్దశిక్షగా పక్షి భావింపదు కనుక నింద్రుడు శిక్షించు నుద్దేశముతో నలుఁగులగూటిలో గరుడడు చిక్కునట్లు చేసినను స్వేచ్ఛాభంగ మైనదే కాని – అది గరుత్మంతు నంతగా బాధింపలేదని కవిహృదయము. పక్షిని గూటిలో చిక్కునట్లు చేసె ననుట యుక్తి వైచిత్రి ! సాధారణముగా నల్పమైనచిదుకులను తనముక్కుతో కఱచికొని తెచ్చి పక్షి తనగూటిని తానే కట్టుకొనును. ఈయింద్రుని బాణములతో ఆపక్షికి గూ డేర్పడినది కనుక పక్షిరాజున కాబాణము లల్పము లైనపుల్లముక్కలవంటి వని చమత్కారము.

"అలుకం గంసవిభేది నందకముచే నయ్యస్త్రముల్ ద్రుంచి వే
బలుదూపుల్ దృఢముష్టిఁ గూర్చి బలభిద్భద్రేభకుంభంబు వ్ర

క్కఱుగా నేసిన తోరణం దొరఁగె ముక్తాశ్రేణి పై పై హిమా
చలశృంగావతరన్నభశ్చరధునీచంచత్ప్రవాహాకృతిన్ "

(5 ఆ - 28 ప)

ఏనుగులకుంభస్థలములయందు ముత్యము లుండు నని చెప్పుదురు.

"మదకలకుంభికుంభనవమౌక్తికముల్ కనుపట్టు" అని పెద్దనగారు మత్తగజములకుంభస్థలములలో మౌక్తికము లుండు నని తనమనుచరిత్రలో కృతిపతి కృష్ణరాయలపరాక్రమాదులను వర్ణించుపట్టున చెప్పియుండుట యిక్కడమనము గుర్తుంచుకొనవలసి యున్నది. ఇంద్రునియేనుగుకుంభమును కంసవిరోధి తనఖడ్గముచే బ్రద్దలుకొట్టగా నందుండి ముత్యాలజల్లు కురిసినది. తెల్లనియాయేనుగు తెల్లనిమంచుకొండకొమ్మువలె నున్నతముగా నున్నది. ఆకుంభములనుండి జాఱుముత్తెములవరుస హిమవచ్ఛిఖరమునుండి జాఱునాకాశగంగాప్రవాహమువలె నవిచ్ఛిన్నముగా రాలుచున్నవి. ఇంద్రునిభద్రేభము కుంభములు పగిలినను నచలమై, యున్నచోటుననే నిబ్బరముగా నిలచి యున్నదని భావము! కనుక నీపద్యమునందలియుపమానము సర్వాంగసుందరముగా నున్నది.

"భుగ్నభ్రూకుటిదుర్ముఖుం డగుచు నాస్ఫోటించుచున్ లోనిరో
షాగ్నిజ్వాలలు బాహ్యనిర్గతము లైన ట్లుత్కటారుణ్యని
ర్మగ్నం బై కనుపట్టులోచనసహస్రం బొప్ప మౌర్వీలతా
భగ్నం బైనశరాసమున్ విడిచి జంభద్వేషి యత్యుగ్రతన్ "

(5 ఆ - 32 ప)

క్లిష్టప్రాసముతో కూడినయీపద్యము దేవేంద్రుడు సంకల్పించినక్లిష్టకార్యమునకు సంకేతముగా నున్నది. భ్రుకుటి ముడి వడుట, దుర్ముఖత్వము, ఆస్ఫోటించుట మొదలైనలక్షణములు రౌద్రరసనిర్భరముగా చెప్పబడినవి. కోప మెక్కుగా నుండు ననుట కవిసమయము కదా. లోనిరోషాగ్నిజ్వాల లువ్వెత్తున బహిర్గతము లగుటచే నింద్రునివేయికన్నులు నెఱుపెక్కెన ననుట రసోచితముగా నున్నది.

క్లిష్టప్రాసముతో, మహాప్రాణాక్షర, సంయుక్తాక్షరసంఘటనముతో, సమాసభూయిష్టతతో నిండలిబంధసౌందర్యము యుద్ధౌద్ధత్యమునకు నుద్దీపకముగా నున్నది.

"కులవసుధాధరావలికిఁ గుంటితనం బొదవించె నెద్ది యా
బలితపుఁగైదువుం గొని సుపర్వకులాగ్రణి వేయుఁగన్నులం
దలకొని కౌస్తుభ స్తబకితం బగుశౌరియురంబు సూచినన్
జలజదళోదరోదకముచాడ్పున నల్లల నాడె లోకముల్."

(5 ఆ - 33 ప)

పూర్వము పర్వతముల కుండినఱెక్కలను వజ్రాయుధముచే నఱకియమరేంద్రుఁ డాఖండలుఁ డైనాఁడు. ఱెక్కలు తెగినకొండ లెగురలేక కూలబడినవి. అందుచే నింద్రునివజ్రాయుధము కులపర్వతములను కుంటివిగా చేసె నని కవి చమత్కరించినాడు! అట్టికఠోర మైనవజ్రాయుధమును దేవేంద్రుడు తనచేతఁ బట్టి వేయికన్నులతో శ్రీహరియురమున నెఱు పెక్కనతనదృష్టులను సారించినాడు. శ్రీహరియురమున కౌస్తుభ మనుపూలగుత్తి పూచినట్లుగా నింద్రుడు భావించినాడు. అనగా - కృష్ణునివక్షము పూవువలె మెత్తని దనియు, దాని నవలీలగా కఠోర మైనతనవజ్రాయుధముచే భేదింపవచ్చు ననియు నింద్రుఁ డాసపడినాఁడు! ఇంద్రునిచూపులలో వ్యక్తమగుచున్నయీదుస్సంకల్పము నెఱింగి లోకములన్నియు ను తామరపువ్రేకులోనిజలకణమువలె చలించిపోయినవి. "నళినీదళగతజల మతితరళం"[1] అనికదా యార్యోక్తి! జలరుహమునకు బహిరంతరములలో జల మున్నట్లు - పరమేశ్వరునిబహిరంతరములందు లోకము లున్నవి. పద్మమునకు చిరుగాలి తాఁకిడి తగిలినను - అందలిజలకణములు కంపించుట సహజము. అట్లే విష్ణుని హింసింప నెంచువజ్రిసంకల్పము నెఱిఁగి లోకములు కంపించినవి!

1. భజగోవిందశ్లోకములు.

"శతధారాజాయమానజ్వలనముఖశిఖాచ్ఛాదితాభ్రస్థలం బై
వితతాఖిలధ్వనిశ్రీవిలసనబధిరోద్విగ్నదిగ్వారణం బై
కృతలోకాలోకాముఖ్యాఖిలగిరిచలనక్షిప్తభూమండలం బై
పతయాశుద్వాదశాత్మప్రకరఖరకరౌపమ్యమై యేఁగుదేరన్"
(5 ఆ - 35 ప)

ఆయాఖండలుని నూఱంచులకత్తి కున్నవాడి యంతయు నిక్కడ తిమ్మనగారిపద్యములో చోటు చేసికొన్నది. ముద్దుపలుకులకు పేరందిన తిమ్మనగారిలలితలలితమైన శైలి యుద్ధవర్ణనసందర్భములయందు చేవదేఱిన దనుట కీపద్య మొక్కటి చాలును. (ఈవర్ణనమునకు సంబంధించినవిశేషములు వేఱొక్కప్రకరణములో వివరింపఁబడినవి.)

# అష్టాదశవర్ణనలలో చేరని వర్ణనలు

తిమ్మనగారికృత్యాదిపద్యము లష్టాదశవర్ణనలలో చేరకున్నను వానియందు రాబోవుకథను సూచించుట ఆయనప్రత్యేకత.

"శ్రీమదికిం బ్రియం బెసఁగఁ జేర్చినయయ్యొలలీల ...."
"పొలఁతుల్ కౌఁగిటఁ గ్రుచ్చి యెత్తి తలఁబ్రాల్ ........"
"సరసపుటల్కఁ దీర్చుతరి ...." (1 ఆ - 4 ప)
"అలఫణిభోగరత్నములు ...." (1 ఆ - 20 ప)

అనుపై నాలుగుపద్యములలోను తిమ్మకవి కావ్యార్థసూచన లెట్లు చేసినాడో "పారిజాతాపహరణకృత్యాది" యనుప్రకరణమున వివరింపబడినది.

"తామసవృత్తి లేదు ...." (1 ఆ - 9 ప) అనుపద్యమును "మునుకొని కొండవీటికడ మూఢత రుద్రుఁడు" (1-21) అనుపద్యమును తిమ్మనగారిరచనాచమత్కారమును వేనోళ్ళ చాటుచున్నవి.

"చక్రవర్తిమహాప్రశస్తి నాఁడును నేఁడు" అను (1 - 19) పద్యమునందలిశ్లేషచమత్కృతి సహృదయహృదయైకవేద్యము.

శ్రీకృష్ణరాయలకౌక్షేయకమును వర్ణించు "బాహుసౌధ క్రీడఁ బరఁగుపంటవలంతి" యను (1 ఆ - 24) సీసపద్యములోని కస్తూరిబొట్టు, చదువుపలక, మొదలైనయుపమానము లన్నియు రాయలవారిఖడ్గమువలెనే యసితవర్ణము కలవి. రాయలతెల్లనికీర్తి శివునివలె, అరికుంభికుంభముక్తాక్షురాదులవలె నున్న దఁట! ఒకేవస్తువును బహుముఖములుగా చిత్రించు నేర్పు తిమ్మనగారిలో పుష్కలముగా నున్న దనుట కీపద్య మొక్కటి చాలును.

నారదుఁడు తెచ్చినపారిజాతపుష్పమున ముసరి రొద చేయుచున్నతుమ్మెదలు ఆపుష్పవాసనాబిరుదగాథలను స్తుతించువందిజన మఁట! ఆపువునందలిమకరందబిందువులు కృష్ణార్పణము కానున్నయాపూవున పొడమినయానందబాష్పసందోహశంకను గలిగించుచున్న వఁట! ఆ పూవుయొక్క తెల్లందనము నిఖిలమనోరథప్రదానముచే నాపూవునకు కలిగినకీర్తి యనుశంకను గలిగించుచున్న దఁట! ఈవర్ణన లోకోత్తరముగా నున్నది, ఆపుష్ప మంతయపురూప మైనది కనుకనే మాధవుఁడు "వినయంబు విస్మయంబును మనమునఁ బెనఁగొనఁగ దానిని గైకొన్నాఁడు.

సీ. " మగమీల నగఁజాలుతెగఁ గీలుకొనువాలుఁ
గనుఁగవ కొకవింతకాంతి యొదవె
వలిజక్కవల పెక్కువలు తక్కువగ నిక్కు
చనుదోయి కొకవింతచాయ దోఁచె
నెలతుమ్మెదలదిమ్ము వెలి జిమ్ముచెలువమ్ము
గలవేణి కొకవింతనలుపు మీఱె
నలచెందొవలవిందు చెలు వెందు వెదచిందు
మొగమున కొకవింతజిగి తొలంకెఁ

తే. గీ. జక్కఁదనమున కొకవింతచక్కఁదనము
జవ్వనంబున కొకవింతజవ్వనంబు
విభ్రమంబున కొకవింతవిభ్రమంబుఁ
గలిగె నద్దివ్యకుసుమంబుకతన సతికి "
(1 ఆ - 56 ప)

రుక్మిణిచక్కదనమునకే చక్కదనము కలిగిన దఁట ! జవ్వనమునకు జవ్వనము కలిగె నఁట ! ఈచెప్పుట క్రొత్తగా నున్నది. చమత్కారముగా నున్నది. ఇది యీనాటినవభావుకులయూహకే అందునట్టి చమత్కారము. ఇట్టిచమత్కారముల నానాడే తిమ్మకవిచేసి యుండుటనుబట్టి ఆయనపలుకే కాక - ఆపలుకువెనుక కులుకునాయనతలపు కూడ సుకుమార మైన దని స్పష్టమగును.

రుక్మిణి తననెఱిగొప్పున కలంకారముగా సురలోకసుమమును తుఱిమికొనుటతో నామెకు కలిగినయలంకారవైభవమును తనయను ప్రాసాలంకారవైభవమును జోడించి ఆయందమున కందము తెచ్చినాడు తిమ్మకవి.

" పరికింపరు తమజాడలు
తరుణులతగులములు నమ్మఁదగ దంద్రు మదిన్
శరదంబుదచలచిత్తులు
పురుషులెవో - వారి నమ్మఁబోలునె చెలియా ! "

ఇందు పురుషులు శరదంబుదచలచిత్తులుగా వర్ణింపబడినారు. ఇది పురుషజాతిపై సత్యభామ తెచ్చినయభియోగము. లోపల సారము లేని శరన్మేఘము తేలిక కనుక నిలకడ లేక గాలివాలునుబట్టి కదలిపోవును. అస్థిరచిత్తు లయినపురుషుల నట్టిమేఘములతో పోల్చుట బాగున్నది. అంతే కాదు - ఆమేఘము పేరున కంబుదమే కాని - అంబువుల నీయదు. ఈచపలచిత్తుఁ డైనమగవాఁడు పేరునకు మగవాఁడే కాని - ఆమగంటిమి నమ్ముకొన్న తరుణి కుపయోగింపనిది. ఇన్నివిధములుగా నీవర్ణనమున చక్కనిస్వభావచిత్రణము చోటుచేసికొన్నది.

మసకపుఁబాముకాటుగతి మచ్చర మన్విస మగ్గలింపగా సత్యభామకు మోహము, నెవ్వగ, కంపము, విన్నబాటు, పరితాపవేద నలును గలిగిన వని (1 ఆ – 100 ప) కవి వర్ణించెను. సర్పదష్టులకును మాత్సర్యగ్రస్తులకునుకూడ వర్తించున ట్లీవర్ణన యున్నది కనుక మత్సరమును విషముగా రూపించుట యీవర్ణనలోనిప్రత్యేకత.

మనోజబాధలం బడినసత్యభామ మదహాస్తిహస్తగతపద్మిని వలె సొంపుచెం పఱిన దఁట. (1 ఆ – 101 ప) పద్మినీశబ్దమునకు పద్మలత యనియు, పద్మినీజాతిస్త్రీ యనియు నర్థము లుండుటచే నీవర్ణనము బాగున్నది. " జనితామర్షమునఁ గోపసదనంబునకుం జనియెను లతాంగి హరిచందనకోటరమునకు నాగతరుణియుఁ బోలెన్. "

కోపగృహ మొకచీకటియిల్లు. (1 ఆ –99 ప) తరుకోటరమును చీకటితో నిండి యుండును. సత్యభామమదినిండ చీకటి. గదినిండ చీఁకటి. ఇట్టిచీఁకటింటిని తరుకోటరముతో పోల్చుట సముచితమే. మగపాముకన్న కోపించినయాఁడుపామున కౌద్ధత్యము హెచ్చు. కనుక సత్య నాగతరుణిగా వర్ణింపబడుట సమంజసమే. హరిచందన మనగా కల్పవృక్ష మనికూడ నర్థ మున్నది కనుక సత్యభామ కల్పవృక్షముచెంతకు ముందుముందు పోవుట యిందు సూచింపబడుట విశేషము.

చీఁకటింటికడకంకటిపై పడియున్నసత్యభామ జలదాంతచంద్రరేఖగా వర్ణింపబడినది.

" అరదము నెక్కి కేతనపటాంచలచంచల మైనతాల్మితోఁ
దురగజవంబు మున్ గడవఁద్రోసి కడంగెడుతత్తరంబుతోఁ
దిరిగెడుబండికండ్లపగిదిన్ భ్రమియించుమనంబుతోడ నా
హరి చనుదెంచె సత్యసముదంచితకాంచనసౌధవీథికిన్ "

(1 ఆ - 104 ప)

పాపము ! భార్యావిధేయు డై సాపరాధి యైనకృష్ణునితత్తరము నద్దములో చూపిన ట్లున్న దీవర్ణనము. ఇందు కృష్ణునియవస్థ చక్కగా చిత్రింపబడినది.

అప్పు డాసత్యభామ "మధ్యందినభానుమండలకరావళిహోవళి వాడి యున్నతీఁగం దలపించు" చున్నదఁట ! ఆమె లతాంగి కనుక తీవతో పోల్చుట బాగున్నది.

" ఓ ర్పొకయింత లేనివికచోత్పలలోచనచిత్తవీథిఁ జ
ల్లార్పఁగ నీలనీరదశుభాంగుఁడు వే చను దెంచె నంచుఁ గం
దర్పహుతాశనున్ వెలికిఁ దార్చుసఖుండునుబోలె వేఁడిని
ట్టూర్పు దళంబుగా నిగిడె నున్నమితావరణాంశుకాంత మై "
(1 ఆ - 112 ప)

సత్యభామచిత్తవీథిని రగులుకొన్నమన్మథాగ్నిని చల్లార్చుట కై నీలనీరదశుభాంగు డైనకృష్ణుడు రాఁగా ఆయగ్నికి మిత్రు డయినవాయువు తనమిత్రు డైనయగ్నిని నీవలకు తార్చుచున్నాడో యనునట్లు గానున్న (సత్యభామయొక్క) వెచ్చనినిట్టూర్పులచే నామెవస్త్రాంచలము పై కెగురుచున్నది. ఇది యొకమధుర మైనభావన.

అగ్నిని చల్లార్చుటకు జల మవసరము. సంతప్త మగుచున్న సత్యభామచిత్తమును చల్లార్ప వచ్చినకృష్ణుడు నీలనీరదశుభాంగుడు. అనగా – వర్షాకాలపుసజలమేఘమువంటివాడు. ఆమేఘునివలెనే ఈయనయు రసమయ మైనహృదయము కలవాడు. కనుక తాపమును చల్లార్చులక్షణము కలవాడు. సత్యభామయెదలో చీఁకటి – గదిలో చీఁకటి. ఆచీఁకట్లను పారద్రోలి యర్ధాంగిబ్రతుకున వెలుగులు మెఱయించుట కే నీలనీరదశుభాంగుఁ డచ్చటికి వచ్చినాడు. ఆయన యశుభముల నడంచు శుభాంగుడు.

ఇక్కడ సత్యభామచెంత ప్రేమామృతమును వర్షించు ననుకొన్నకృష్ణమేఘ మక్కడ రుక్మిణికడ నారదుని ప్రేరణమనెడిగాలి పాటున ననుకొనకుండగనే వర్షించినది.

సురముని తెచ్చినపారిజాతసుమమున నతిలోక మైనవల పున్నది. ఆవల పంతయు రుక్మిణిపాలైనది. సత్యభామ యో ర్పిక యింత లేనిది. అది యామెజీవలక్షణము. మఱి – రుక్మిణియో ? క్షమా గుణసంపన్నురాలు. నీలనీరదశుభాంగుడు ప్రేమవర్షమును వర్షింపగా నచట వలపు మనోఘ్రాణతర్పణమైనది.

ఇక్కడ మఱియొకరహస్య మున్నది. ఒకప్పు డొకచోట వర్షించినమేఘుం డింకొకచోట వర్షింపరా దనునియమము లేదు. కను కనే అప్పు డక్కడ రుక్మిణి కానందకారకుం డైననీలనీరదశుభాంగుం డిప్పు డిక్కడ సత్యభామతాపము నపనయింప వచ్చినాఁడు.

"మగం డింతులకుం జన విచ్చి పుచ్చుకొన్నను మనవచ్చునే?" (1 ఆ – 97 ప) అని తపించుచున్నది సత్యభామ. తన్నుగూర్చి తపించు వారలనేకాని భగవంతు డనుగ్రహింపడు. కనుక ఆసంతప్తచిత్త నను గ్రహించుటకే జీవనదాత యైనయానీలనీరదశుభాంగుడు విచ్చేసినాఁడు. ఆరుక్మిణిపై నాకస్మికసంఘటనముగా కురిసినదానికన్న వేయిరెట్లెక్కు వగా సత్యభామపై వలపువాన కురియుటకే ఆమహాత్ము డిటు వచ్చి నాడు.

మేఘము నిరాకార మయ్యును సాకార మనెడిభ్రాంతిని కలిగించును. ఈకృష్ణు డట్లే నిరాకారుడును, నిర్వికారుడును నైనవాఁడు.

మేఘసాక్షాత్కారమునకుం బూర్వము ప్రత్యణువునను నిండి యుండునది తాపమే. ఆతాపమే లేనిచో జగతికి మేఘునియవ సరమే లే దనిపించునేమో! అట్లే భగవత్సాక్షాత్కారమునకుపూర్వము భక్తులయెడందల నిండి యుండునదికూడ తాపమే. ఇట్టితాప మానీల నీరదశుభాంగునిగూర్చి తపించిన సత్యభామ కనుభవసిద్ధమే.

కృష్ణుని వల్లవీకింకరుడుగా, పవిత్రప్రణయిని మైనతనగుట్టును దోచుకొన్నమాయలవాఁడుగా సత్యభామ వర్ణించినది. ఆమె పలికిన ప్రతిమాటయు, చేసినప్రతిచేఁతయు ఖండితనాయికాలక్షణమునకు రూప కల్పనమే. తా నెంత చేసినను కృష్ణునికి కోపము రాలేదు కనుక నతడు మొండివాఁ డనుకొన్నది. చేసిన దంతయును చేసి యీసు తగ్గకపోగా తనచేతిచిట్టచివరిబ్రహ్మాస్త్రముగా నామె తనమోముపై చేలచెఱం గిడి యేడ్చినది. అది యేడుపు కాదు – "బాలపల్లవగ్రాసకషాయకంఠ కలకంఠవధూకలకాకలీధ్వని" యనుచున్నాడు తిమ్మకవి ! ఆఁడుదాని యేడుపు నింతముద్దుగా వర్ణించిన తెనుగుకవి యొక్క తిమ్మనయే ! కను కనే "ముక్కు తిమ్మనగారు ముద్దుముద్దుగా నేడ్చెరి" అన్ననానుడి యేర్పడినది.

కోపము శోక మై కన్నీరు కార్చుసత్యభామపై ప్రేమ, జాలి, సానుభూతి కలుగగా నీరజనాభుఁ డాసంతప్తహృదయను నిండుగా కౌఁగిలించినాడు. ఇంతటితో నామెకోపము కొంతయు ఆయనకోరిక కొంతయు తీరినవి ! కన్నీరు తుడిచి, "నే నుండగా లతాంతమాత్ర మున కింతవంత నీ కేల ? పారిజాతమును తెచ్చి నీకేళివనములో పెరటి చెట్టుగా నాఁటింతు" నని కృష్ణుడు ప్రతిన చేయగా నీరదశ్యాముని గర్జితమధురవాక్యముల కాలతాంగి నీపలతికవలె నిలు వెల్ల పులకించి నది. సఖీజనులు మయూరికలై చెలరేగిరి. (1 ఆ – 137 ప) ఈసన్ని వేశమునకు ప్రాతిపదికముగా కృష్ణుని నీలనీరదశుభాంగుడుగా ముందు గనే (1 ఆ – 112 ప) తిమ్మకవి వర్ణించినాడు.

"ప్రామినుకులపూబోఁడుల
సీమంతపుఁజెందిరంబుచేబలె నరుణ
శ్రీ మించునతనిపదముల
భామామణి యొత్తు పయిఁడిపావలు తొడిగెన్"

(2 ఆ - 7 ప)

శ్రీకృష్ణుఁడు వేదాంతవేద్యుఁడు. ఆయనపాదములు అరుణశ్రీరంజితములు. ఇట్లనుటకుబదులుగా - ఆయనపాదముల నాశ్రయించినయుపనిషద్బాలపాపటలయందలిసెందూరపుబొట్టుచే కృష్ణునిపాదము లెఱ్ఱని కాంతితో ప్రకాశించిన వనుచున్నాఁడు కవి. ఈభావసౌకుమార్యమును, సీయుక్తివైచిత్రియు ముద్దులు మూట గట్టుచున్నవి.

" కంపనలీలమై నసదుఁగౌ నసియాడఁ గుచద్వయంబు న
ర్తింప లలాటరేఖ చెమరింపఁగ హారలతాగుళుచ్ఛముల్
తుంపెసలాడఁ గంకణమృదుధ్వని తాళగతిం జెలంగఁగా
సంపెఁగనూనె యంటె నొకచంద్రనిభానన కంసవైరికిన్ "

(2 ఆ - 9 ప)

కౌ నసియాడుట, కుచద్వయము నర్తించుట, లలాటము చెమరించుట, హారములు తుంపెసలాడుట, కంకణములు సవ్వడి చేయుట యనునీలక్షణములు పురుషాయితక్రీడానిమగ్నమైనయంగనయంగభంగిమలను గుర్తునకు తెచ్చుచు, శృంగారరసప్రధానమైనఈకావ్యమునకు నొక వింతశోభను చేకూర్చుచున్నవి.

" చెలువల్ కొందఱు హేమకుంభములతోఁ జేసే నొసంగన్ విని
ర్మలదోర్మూలరుచుల్ వెలిం బొలియఁ దోరం బైనచన్దోయిసం
దొలయన్ వేనలి జాఱ నిక్కి యరమే నొయ్యారమై వ్రాలఁగా
జలకం బార్చె లతాంగి యొర్తు యదువంశస్వామికిన్ వేడుకన్ "

(2 ఆ - 11 ప)

ఆనాటిప్రభువులస్నానవైభవమును జాటునీపద్యమున అందమునకు స్పందించుకవిసౌందర్యదిదృక్షు ప్రస్ఫుట మగుచున్నది.

సత్యామందిరమున భుక్తిశాల కేఁగునారదునివెంట సత్యాకృష్ణులు వెళ్ళుట " తటిల్లతయున్ జలదంబు యామినీపతి వెనుకొన్నకైవడి (2-17) నున్న దఁట. తెల్లనివాఁడైననారదుని చంద్రుడుగా-

నల్లనిస్వామిని జలదముగా - ఆయనహృదయమున వర్తించుసత్యభామను మేఘములో నర్తించుమెఱపుతీవగా - వర్ణించుట సముచితముగా నున్నది. అదితికుండలము లిచ్చుటకై హరి స్వర్గమునకు రానున్నాడని యింద్రునికి చెప్పుటకై ముందుగా నారదుఁ డేగుటయు, ఆవెనుక సత్యాకృష్ణు లాకాశమార్గమున నమరపురి కరుగుటయు సూచింపబడుట యీవర్ణనములోని విశేషము.

అంభోజేక్షణలు వీవనలు వీచుచుండగా, నలరుఁబోఁడులు వడ్డింపగా నానాఁటిసంపన్నులు గారుత్మతరత్నపాత్రములలో బంధుసంతతిని పంక్తి నిడుకొని బహుభక్ష్యభోజ్యలేహ్యచోష్యపానీయములతో కలమాన్నమును భుజించి, వామనేత్రాకరాంచలావర్జ్యమానకనకభృంగారుకర్పూరికాముఖాగ్రగళితగంధోదకములతో చేతులను వార్చి, కర్పూరతాంబూలములు సేవించువారు. (2 ఆ - 19, 20, 21 పద్యములు).

పారిజాతవృక్షమును దెచ్చి పెరటిచెట్టుగా నాటింతు నని కృష్ణుడు వాగ్దానము చేయగానే యలుక వీడినసత్యభామ మాత్సర్య మేఘములు తొలంగుటచే ప్రకాశించుహిమధామకళ యనునట్లు చల్లని కాంతితో చెన్నారిన దఁట. విరహ మనెడిరాత్రి గడచుటచే విప్పారి పరిమళించుపద్మమువలె వికసితస్వాంత యైన దఁట. దంతావళముచే క్షుబ్ధమై మరల కలఁక దిగద్రోచిన సరసివలె నున్నదఁట. గ్రీష్మము గడవగా మొగ్గతొడిగినమాలతీలతవలె చెలువొందిన దఁట. (2 ఆ - 15 ప)

ఈవిధముగా నొకేవ్యక్తిని బహువిధములుగా వర్ణించిన తిమ్మనగారు స్త్రీ యైనసత్యభామకు వర్తించు కళ, పద్మిని, సరసి, లతిక యనుస్త్రీలింగములనే యుపమానములుగా గ్రహించుట సముచితముగా నున్నది.

" మంచునఁ దోఁగినపల్లవ
సంచయము భవద్వియోగసంతాపరుద

చ్చంచలనయనాబాష్పక
ణాంచితదింబోష్ఠలీల నలరె నుపేంద్రా ! ''
(2 ఆ - 63 ప)

మంచున తడిసినచిగురుటాకులు కృష్ణవియోగసంతాపముచే రోదించుచున్న చంచలనయనల బాష్పకణాంచితబింబోష్ఠములవలె నున్న వఁట. శ్రీకృష్ణునివిరహ మెంతదుస్సహ మైనదో యిందు వర్ణించి ప్రథమాశ్వాసమున సత్యభామ యనుభవించినవిరహాతిశయ మింతటిదిసుమా యని కవి వైతాళికులముఖమున కృష్ణునికి చెప్పించుట సరసముగా నున్నది.

గరుత్మంతుని వర్ణించుచు తిమ్మకవి "వజ్రంబునకు నీఁక వైచినబలశాలి '' యనుచున్నాఁడు !

"వాఁడు నా వెంట్రుకకు పోలఁడు '' అని యెదుటివానినితక్కువ చేసి మాటాడునపు డనుటకొందఱికి పరిపాటి. అదేవిధముగా "ఆగరుడుడు ఇంద్రునివజ్రాయుధమును తనయీఁకతో సమానముగా చూచిన వాఁడు '' అని తిమ్మకవి ఆపక్షిరాజుబలాధిక్యమును చెప్పుటలో తెనుగుదన ముట్టిపడుచున్నది. ఇంద్రు నెదిరించి, ఆయనయధీనములో నున్న పారిజాతతరువును బలాత్కారముగా భూమికి తెచ్చుటకై వెళ్ళుకృష్ణునికి వాహన మైనపక్షియే అంతటియాధిక్యము కలిగి యుండగా – నిక కృష్ణునిబలపరాక్రమములను వేఱే చెప్ప నక్కఱ లేదుకదా! అంతే కాదు–ఆయింద్రునిదగ్గర వజ్రాయుధమును మించినయాయుధము లేదు. అది యేనాఁడో గరుత్మంతునిచే తృణీకరింపబడినది. కనుక కృష్ణునిచే దేవేంద్రు డోడుట తథ్య మని కవి సూచించినాడు.

గరుత్మంతుడు "జననిదాస్యంబు నీఁగినకులశ్రేష్ఠుండు '' అనగా–మాతృదాస్యమును పోనాడినపుత్త్రరత్న మనియు, స్వాతంత్ర్యప్రియు డనియు, స్వకులాలంకారు డనియు నర్థము. కన్నతల్లి యైనవినత తను సవతి యైనకద్రువకు దానిసవు క మ్మని గరుడనియన్న యనూ

రుఁడు శపింపగా – ఆశాపవశమున ప్రాప్తించినదానిసతనమును పోనాడిన మహానుభావు డని యర్థము. ఈవర్ణనములో జననిక్లేశము నీఁగఁబోవు కృష్ణునిపరాక్రమమును, మాతృభక్తియు నిందు వ్యజ్యమానములగు చున్నవి.

అంతేకాదు – గరుత్మంతుడు "దుర్లభామృతపక్ష్యాత్తో హారుండు." తన కడ్డు వచ్చిన దేవతల నోడించి యమృతమును హరించిన పరాక్రమశాలి. ఈపక్ష్యతో హారత్వము పారిజాతపాటచ్చరు డైన కృష్ణునికిని వర్తించును.

ఆపక్షిరాజు "కమలాపుత్రసారథిగారాబుతమ్ముండు" ఆయన్న నుమించినవాఁ డీతమ్ముడు ! ఈతమ్ముని (పక్షిరాజును) వాహనముగా గొన్నయుపేంద్రుఁడు తనయన్న యైన యింద్రుని మించినవాఁడుకదా !

"కమలాపుత్రసారథిగారాబుతమ్ముఁ" డనగా – నున్నత స్థితిలో నున్నవానికి తమ్ము డనియు నర్థము చెప్పుకొనవచ్చునుకదా. ఈయర్థమిటు గరుత్మంతునికిని, అటు కృష్ణునికికూడ వర్తించును.

ఆగరుడుడు "కశ్యపకృతపుణ్యాకర్మఫలము", ఆ రాజు తనతండ్రిపుణ్యాకర్మఫలముగా పుట్టినపుణ్యాత్ముఁ డని భావము. కనుకనే శ్రీమహావిష్ణునికి వాహన మగుభాగ్య మాయన కబ్బినది.

ఇంద్రుడు కశ్యపునికి కర్మఫలము కాఁగా – ఆయనపుణ్యకృత కర్మఫల మీయుపేంద్రుఁడు !

త్రిపురసంహారవేళ శివునికి మాధవు డమ్ముగా నుపయోగ పడినాఁడు. ఆబాణమునకు రెక్కలైు, యాబాణమును విరోధుల మీఁదికి పురోగమింపజేసినది యీగరుత్మండే. అట్టిగరుడనిసహాకారము తోనే కృష్ణు డిప్పుడును ముందడుగు వేసి, యింద్రుని జయింపబోవు చున్నాడు. కనుక

" మింటిపాకెంబు లేర్చుముక్కంటితూపుగణి "

యని గరుత్మంతునిగొప్పదనమును కవి చెప్పుచున్నాడు !

ఆగరుడడు "మానసాతీతవేగసంపద్ఘనుండు" కనుకనే యనతికాలముననే సత్యాకృష్ణులను భూలోకమునుండి సురలోకమున చేర్పగలిగినాడు.

ఈవిధముగా తిమ్మకవి చేసినపక్షిరాజవర్ణనము సార్థకమై శ్రీకృష్ణునివిజయమును సూచించుచున్నది. (2 ఆ - 72 ప)

మిన్ననుండి ధరణిమీఁదికి వచ్చి నిలిచినయాపక్షిరాజు వేగభరముచే భూమిని మోయుపన్నగపతితలలు చదియబడినవఁట ! ఈయన ఖగరాజు - గాలిలో నెగురగలవాఁడు. ఆ శేషుడో ? పన్నగము అనగా - పత్ న గమ్ - పాదములతో నడువలేనివాడు. నడుచుటకే కాళ్ళు లేనిశేషుఁ డిఁక యెగిరి వచ్చి పై బడుపక్షిబరువు నెట్లును తప్పించుకొనలేఁడు. అందులకే ఆపన్నగపతితలలు చదియబడినవి - పాపము ! " పన్నగపతి " యనుశబ్దప్రయోగములోనిచమత్కార మింత యున్నది. తనకును గరుడనికిని నడుమ భూమి యడ్డుగా నున్నది. కనుక ఆసన్నమైనయాపద యనుభవమునకు వచ్చువఱకును పన్నగపతి తెలిసికొనలేకపోయినాఁడు ! కనుకనే ఆపన్నగపతితలలు చదియబడినది. ఇది యిందలిచమత్కారము.

## గంగావర్ణనము : లయగ్రాహిపద్యము

" అంగన ! కనుంగొను మనంగహరమౌళితటరంగనటి జహ్నుమునిపుంగవవిశాలో
త్తుంగశిఖవుం గపిలునింగలపుఁజూపుసెకలం గలయునాసగరువంగడము మోక్షో
త్తుంగమణిసౌధమునకుంగడపుచాఁప గగనాంగణమహీతలభుజంగనిలయంబున్
జంగగొనునేర్పరిఁ బతంగజయనుంగుజెలియం గనఖిలాచలయుగంగ సురగంగన్ "

(2 ఆ - 94 ప)

ఈలయగ్రాహిపద్యపునడక మృదువై నదీగమనము ననుకరించుచుండగా - పునఃపునరావృత్త మైనపూర్ణబిందుపూర్వకగకారము గంగాతరంగములపొంగునుం గన్నులం గట్టించుచున్నది.

స్వర్గమునకు వచ్చినశ్రీకృష్ణునియడుగులమీఁద నింద్రుడు భక్తితో వ్రాలగా మౌళికుసుమాగతషట్పదిపంక్తి తత్కుశల మడుగుచున్నరీతిని మ్రోసిన దఁట ! అప్పుడు శ్రీకృష్ణుడు దేవేంద్రుని తన కౌగిట చేర్పగా నంభోదము సానుమచ్ఛిఖరమును రభసంబున కప్పిన ట్లున్న దఁట ! (3 ఆ - 6 ప) ఈయుపమానమునుబట్టి యింద్రునికన్న కృష్ణుడే పరాక్రమాదులలో నన్నివిధముల పైవా డగుటయు, నీయింద్ర పర్వతము నాకృష్ణమేఘము శరవర్షముచే కప్పుటయు సూచింపబడినది.

తొడలపై జాచినయడుగు కెందామర లొయ్యనఁ బౌలోమి యొత్తుచుండగా, పార్శ్వభాగంబునఁ బంకేరుహాసనుకామినీరత్నంబు కతలు సెప్పగా, పని బూని యంతంత వినయావనతవృత్తి సప్తర్షి కాంతలు సంచరింపగా, వీజనచామరవీటీకరండాదికములు దిక్పతిసతీగణము దాల్పగా, విమలచింతామణీమయవేదిమీఁద కల్పకలతాంత కల్పితతల్పసీమ నధివసించినసకలలోకైకవంద్యయనియు,నమరమౌక్తిక శుక్తి యనియు నదితిని కవి వర్ణించినాడు. (3 ఆ - 24 ప) ఈయవస్థా చిత్రణము దేవమాతవైభవమును బ్రకటించుచున్నది.

" మే నిమిరి శిరము మూర్కొని
దానవపరిపంథి ! యెంతధన్యనొ ! నియత
ధ్యానపరులైనమునులుం
గానని నినుఁ గంటి మంటి గతకల్మష నై "

(3 ఆ - 26 ప)

అని యదితి కృష్ణునిమే నిమురుట, శిరము మూర్కొనుట, యామె పుత్త్రవాత్సల్యమును సూచింపగా, నామె యాడినమాటలు కృష్ణుని మహిమాతిశయమును, దైవత్వమును, వక్కాణించుచున్నవి.

" సర్గ మొనర్తు బ్రహ్మయన సత్కృపఁ బెంతు జనార్దనుండునా
భర్గుఁ డనంగఁ గ్రమ్మఱఁగఁ బారణ సేయుదు విజ్జగంబులన్ "

(3 ఆ - 27 ప)

అనుటనుబట్టి కృష్ణుడు పరమేశ్వరుడే యనియు, ఆయనయే మూడు మూర్తుల సృష్టిస్థితిలయములు చేయుచున్నా డనియు భావము. సకల జగములస్థితికే కాక, యింద్రునిసుస్థికిని కృష్ణుడే (విష్ణువే) కారకుఁ డని దీనినిబట్టి స్పష్టమగును.

" తిసృభిః స్త్వమవస్థాభి ర్మహిమానముదీయన్,
ప్రళయస్థితిసర్గాణా మేకః కారణతాం గతః " 1

అని కాళిదాసుకూడ నీవిషయమునే చెప్పి యున్నాడు.

" నైసర్గికలీల నొక్కమఱి సౌఖ్యము నొందుదు " వని దేవ మాతచే తిమ్మకవి యనిపించుట కృష్ణునిగూర్చి " సౌఖ్యాబ్ధి నోలాడు భోగాయత్తుం డయి " యని (1 ఆ - 40 ప) ఆదిలోనే చెప్పినదానికి ప్రోద్బలకముగా నున్నది.

" దోరర్గళభూషణీకృతరథాంగ ! " యని యదితి చేసిన సంబోధనము విష్ణుచక్రప్రశస్తి నుగ్గడించుచున్నది.

" వాలముతాఁకునన్ గిరులు వజ్రనిపాతము సంస్మరింపఁ బెన్
వాలుగ వై ........ మురాసురాంతకా ! "

(3 ఆ - 28 ప)

కృష్ణుడు మత్స్యముగా నవతరించినప్పుడు తద్వాలము తాఁకగా గిరులు వజ్రనిపాతమును సంస్మరించిన వఁట ! అనగా - ఆవాలము వజ్రసమ మని కదా ! అట్టిమహాత్ము నింద్రునివజ్రాయుధ మేమి చేయగలదు ? ఈజ్ఞాన మింద్రునికి లేక పారిజాతాపహారణ మొనర్చుకృష్ణునిపై తన

1. కుమారసంభవము - కాళిదాసమహాకవి.

వజ్రాయుధమును ప్రయోగింపగా కృష్ణుం డా "శతకోటిఁ గేల శతపత్ర క్రీడఁ బట్టినాఁడు! (5 ఆ - 36 ప)

మూడవయాశ్వాసములో నదితి చేసినకృష్ణ స్తవములోని యీ (28వ) పద్యమును పంచమాశ్వాసములోని ఆ(36వ) పద్యముతో సమన్వయించుకొన్నచో నీవర్ణనలోనిసార్థకతయు, తిమ్మకవిగారి ముందుచూపును పాఠకులకు తెలియగలదు.

విష్ణువు వరాహావతారమున తనకొమ్ముకొనతో భూమి నెత్తుట కేతకముకుళాగ్రమున మదభ్రమరిని ధరించుటతో సమానముగా నున్న దఁట! (3 ఆ - 31 ప) వరాహదంతము కేతకాగ్రమువలె వాడిమియు, తెల్లందనమును గలిగి యుండుటచేతను, భూదేవి భ్రమించునది కనుక భ్రమరివలె నల్లగా నుండుటచేతను నీవర్ణనము మనోహరముగా నున్నది!

"సట లిట మాను రోరి! హరి సర్వమయుం డ౯టె యంచుఁ బట్టితో
జిటచిటలాడి యిందుఁ గనఁజేయుము నీ వని దైత్యుఁ డాడినం
బటపట జాతికంబ మిరువాయలుగా నరసింహమూర్తి వై
కుటిలనఖాగ్రకుంచికలఁ గ్రువ్వవె వానియురఃకవాటమున్"

(3 ఆ - 36 ప)

శృంగారరసానుకూల మైనచంపకమాలావృత్తములో శార్దూలమత్తేభాదిచ్ఛందమున కుచితమైనరౌద్రరసము వర్ణింపబడుట విశేషము. మఱియొకకవి యైనచో నిట్టిపట్టుల నేమహాప్రాణాక్షరమునో ప్రాసస్థానమున నుంచి, సుదీర్ఘసంస్కృతసమాసభూయిష్టముగా, నారభటీవృత్తిలో పద్యమును నడిపించి యుండెడివాఁడు. కాని తిమ్మకవి "సటలిట, చిటచిట, పటపట, కుటిలనఖాగ్రకుంచికల గ్రువ్వవె?" యనుపురుషాక్షరముల తోనే యుత్సాహమును బరిపోషించి రౌద్రమును భద్రముగా సాధించి నాఁడు. ముద్దుపలుకులకు పేరొందినతిమ్మనగారు చుంబనమున దంశనము సాధించినట్లున్నది యిట్లుసులభశైలిలో పరుషార్థసాధనము గావించుట!

" క్రువ్వవె వానియురఃకవాటమున్ ?" – క్రువ్వవె ? యను టలో – క్రు అనుపరుష మైనసంయుక్తాక్షరముతో కూడినద్విత్వవ కారము రాక్షసునియురస్సును గ్రుచ్చుచున్నట్లే యనిపించుచు. " ఉరః కవాటమున్ " అనునక్షరములోనిబరు వంతయు " రః " లో తూక ముగా పడి, ఆవెంటనే యున్న " కవాటము " అనుమాట దానిని వాటముగా నరసింహుడు (చీల్చి) పాటనము చేయుటను రసహృద యులకన్నుల కట్టునట్లు రచించినతిమ్మకవి శబ్దశిల్పములో దిట్ట యని యీపద్యము చాటుచున్నది.

" ఓశబ్దంబునకుం బురుష, నీచస్త్రీపురుషామంత్రణంబుల – యి, సి, రి వర్ణంబులు విభాష నంతాగమంబు లగు " ననుచున్నది బాలవ్యాకరణము. [1]

" ఓరి, యోసి మైత్రియందునుం గలవు " అనుసూరిసూత్ర మీపద్యసందర్భమునకు వర్తింపదు. " ఇంతటివాఁడ నై ననాకడుపున– నావిరోధి యైనదానవారాతిని ప్రశంసించునీచుడవునీవుపుట్టితివేమిరా ? " అన్న హిరణ్యకశిపునిమానసికక్షోభ, ప్రతీకారేచ్ఛ, " నీవా ? నేనా ? " యనుపట్టుదలయు నీ " ఓరి ! " యనుసంబుద్ధియందు గూడు కట్టు కొన్నవి ! తిమ్మకవిగారిపదప్రయోగము సార్థకమును మహార్థకమును ననుట కీచిన్నియుదాహరణము చాలునేమో !

సంస్కృతము దేవతలభాష యనియు, తెలుగు మానవ మాత్రులబాసయనియు, వీరరౌద్రభయానకాదిరసములను సుదీర్ఘ సంస్కృతసమాసములతో మాత్రమే ప్రకాశింపజేయగల మనియు నెంచుఛాందసుల కెక్కువ తెనుఁగుమాటలతో సాగినయీపద్యము కను విప్పు కలిగింపగలదు. రసభంగము కాకుండ రౌద్రమునుకూడ నింత ముద్దుపలుకులతో నిర్వహించినకవి తెలుగున మఱియొకడు లేడు !

---

1. బాలవ్యాకరణము - తత్సమపరిచ్ఛేదము - చిన్నయసూరి.

"నను నాకశ్యపకామినీమణులలోనన్ ధన్యగాఁ జేయ మ
త్తనయవ్యాజముఁ దాల్చి వామనునిచందానన్ బలిన్ మట్టవే!
ఘనమార్గోన్నమితాంఘ్రిపద్మమునకున్ గంజాప్తుఁ డంశువ్రజం
బనుకింజల్కపరంపరల్ మెఱయ నుద్యత్కర్ణికం బోలఁగన్!"

(3 ఆ - 33 ప)

ఉపేంద్రుని కనుటచే తనసవతి యైనరాక్షసమాత దితికన్న తానే ధన్య నైతి నన్నది యదితి. వామనునివలె కనిపించుచునే త్రివిక్రమత్వ్వమును వహించి, సవతితల్లికొడు కైనబలిచక్రవర్తిని పాతాళమున కణగ ద్రొక్కినాడు విష్ణువు. అట్లే యీనాఁడు కృష్ణుఁడింద్రునికి తమ్ముడుగా చుట్టఱికము నెఱపుచునే పారిజాతతరుహరణోద్యోగమున తన కడ్డు వచ్చినయింద్రునిగర్వ మణపనున్నాడు! బలిని జయింప సమర్థులయిన యింద్రాదులకన్న సమర్థుడైన వామనుని కనుటచేతనే తనకు ధన్యత ప్రాప్తించిన దని యదితియాంతర్యము కానోపును.

ఘనమార్గమున కెత్తబడినవిష్ణుపదము పద్మము కాఁగా కంజాప్తుడాపద్మమున కర్ణికయై, ఆకంజాప్తాంశువ్రజము కింజల్కము లై భాసించిన వఁట! పద్మస్వరూపమును సమగ్రముగా చూపుచున్న యీవర్ణన మెంత చక్కగా నున్నదో!

పద్మాక్షుడైనవిష్ణుని కోకక న్నైనవాఁడు సూర్యుడు. మఱి- ఆవిష్ణునిపదముకూడ పద్మమే యైనప్పు డాపదపద్మమున నీసూర్యుని నడి బొడ్డుగావర్ణించుట సముచితమే.

విష్ణుపాదోద్భవ గంగ. ఆనీట పుట్టినది కనుకనే పద్మము కంజ మైనది. ఆకంజమున కాప్తుడు సూర్యుడు. పుడమియం దున్న యీకంజము విష్ణుపద మై తన కాప్తుడైనసూర్యుని చేరగా ఈపద్మమున ఆసూర్యుడు కర్ణికయై యొదిగినాడఁట! ఈదృష్టితో చూచినను నీవర్ణ నము మనోహరముగా నున్నది!

" ఘనదోర్దండనటత్కుఠారమున రాజహంసాళిని తుత్తునియలు సేసియు, క్రౌంచరంధ్రమున తోడ్తో రాజహంసాలిని మేదినికి తెచ్చితి " వని యదితి కృష్ణునిపరశురామావతారమును ప్రశంసించినది. రాజహంసశబ్దప్రయోగముచే నీవర్ణనలో కవి సాధించినచమత్కారము విరోధాభాస మై, హృదయంగమముగా నున్నది. క్రౌంచధారణు డైనకుమారస్వామియందలియీర్ష్యచే ప డె ధనుర్విద్య నభ్యసించుచుండినపరశురాముడు తనవాడినారసముచే క్రౌంచపర్వతము నవలీలగా భేదించినట్లును, ఆక్రౌంచరంధ్రమార్గమున హంసలు మానస సరస్సునుండి రాకపోకలు చేయుచుండు ననియు పురాణగాథ. ఈగాథను కాళిదాసుకూడ నీక్రిందివిధముగా స్మరించినాడు :-

" ప్రాలేయాద్రే రుపతట మతిక్రమ్యతాం స్తాన్ విశేషాన్
హంసద్వారం భృగుపతి యశోవర్త్మ యత్క్రౌంచరంధ్రం "
(కుమారసంభవము : కాళిదాసకృతము)

పరశురాముడు సముద్రజలమును నమ్ముచే చెవరగొట్టి తన కిమ్ము గావించుకొన్నాఁ డనుగాథ భారతమునం దున్నదే తిమ్మకవి యిందును సంధించినాడు.

శ్రీరాము డరవిందాననను గోల్పోయినయవమానముచే జలధిని బంధించి రావణుని వధించి (రాముడు వెకలించుటచే) పూర్వము వెండికొండ కంటినలజ్జాపంకమును తనకీర్తినిర్ఝరపూరంబులచే కడిగి వేసినాఁ డఁట! నీతికొఱకై నిలిచినరామావతారముననే యిన్ని దుష్కరకార్యములు సాధించినవిష్ణువు రాజనీతిని ప్రదర్శింపబూనిన కృష్ణావతారమున నెంతెంతలేసియద్భుతములనైన సాధింపగలుగుట యబ్బురము కా దని యీవర్ణనము ధ్వనించుచున్నది.

దుర్యోధనునికూఁతురై నలక్షణను పరిగ్రహించి పారిపోవుచున్న సాంబుని కౌరవులు చెఱ బట్టగా - వానిని విడిపించుటకై బలరాముడు యత్నించి విఫలుఁడై, కౌరవులపై క్రోధముచే హస్తినాపురమును

గంగలో కలిపివేయ నుద్యమించి నాగటికొనచే పెల్లగించి, ఆనగర మును తల్లక్రిందు చేసినట్లు భాగవతము (దశమస్కంధము) చెప్పు చున్నది.[1]

ప్రలంబాసురవధ, యమునానదీప్రవాహమును నాగటితో మళ్ళించుట యనుఘనకార్యములను విష్ణువు బలరామావతారమున నే కావించినాడు. అదితి చేసినయీస్తుతి విష్ణునికసాధ్యము లేదని చాటు చున్నది. (8 ఆ - 86 ప)

బ్రహ్మవరములచే నవధ్యులైనతారకాక్షుడు, కమలాక్షుడు విద్యున్మాలి యనుత్రిపురాసురులు ధర్మానుష్ఠాన మొనరించుదేవతలను బాధించుచుండగా విష్ణువు బుద్ధసన్యాసిగా వచ్చి పతివ్రతలైనయీ రక్కసులభార్యలకు పుంశ్చలీవర్తన ముపదేశించి ధర్మము గొఱవడినయీ రాక్షసులను ముక్కంటికంటిమంటలచే భస్మము చేయించినా డని భాగవతములోను, విష్ణుపురాణములోను నున్నది. విరోధులు తమ వ్రేలితో తమకంటినే పొడుచుకొనునట్లు చేసినవిష్ణునియుపాయజ్ఞత యీవర్ణనలో వ్యక్తమగును. (8 ఆ - 87 ప) అదితి వర్ణించినయీ బుద్ధుడు విష్ణునవతారమే కాని, కపిలవస్తునగరమువాడైనశుద్ధోదన సుతుడు కాడు.

"మత్స్యః కూర్మో వరాహశ్చ
నరసింహోఽథ వామనః
రామో రామశ్చ కృష్ణశ్చ
బుద్ధః కల్కిశ్చ తేదశ
ఏతేతు విభవావస్థా
బ్రహ్మణః పరమాత్మనః"[2]

1. భాగవతము - దశమస్కంధము.
2. పద్మపురాణోత్తరఖండము.

అని చెప్పబడుటచే ఈపద్యమున (దేవమాతచే) చెప్పబడినబుద్ధుడు విష్ణునవతారమే యగుట నిస్సందేహము. కేవలస్తుతి కాక, యదితి చేసిన కృష్ణస్తుతి పై చెప్పబడిన శ్లోకాన్ని విధములుగా చమత్కారముగా నున్నది.

" చందనహారిచందనమక
రందసరిద్బిందుశీకరప్రమదవనేం
దిందిరపక్షస్పందన
కందళితమరుత్కిశోరకంబులు వొలయన్ "

ఈపద్యములో నందనమునందలిపిల్లగాలులు వర్ణింపబడినవి. అవి చందన తరువులనుండి వచ్చుటచే సురభిళములును, మకరందసరిత్తులపైనుండి వచ్చినవి కనుక శీతలములును ఇందిందిరపక్షస్పందనమున పుట్టుటచే మందములునై యున్నవని భావము. కాళిదాసాదిపూర్వకవు లంద అను శైత్య, సౌరభ్య, మాంద్యము లనెడుమూఁడులక్షణము లున్నవిగా గాలులను వర్ణించిరి. అట్లున్ననే వాయు వాస్వాద్య మగును. తెలుగున నిట్లు వర్ణించుట ప్రబంధకవిసంప్రదాయము.

సీ. " రంభామహోరోజకుంభపరీరంభకుసుమితప్రత్యగ్రకురవకంబు
మంజుఘోషావక్త్రకంజాతచకచక స్తబకితచంపకక్ష్మారుహంబు
హరిణీముఖప్రసూనాసవార్పణకోరకితలతావేల్లితకేసరంబు
నుర్వశీనవయావకోజ్జ్వలాంఘ్రిని వేశపుష్పితకంకేళిభూరుహంబు

తే. గీ. మేనకామోదనిశ్వాసమృదునమీర
కుట్మలితసిందువారంబు కుధరధరుఁడు
ప్రేయసియుఁ దాను నల్లన డాయఁ జనియె
దైవతాధీశనందనోద్యానసీమ "

(3 ఆ - 44 ప)

వనిత యాశ్లేషించినచో కోరకము పుష్పించునఁట! మఱి పురుషుఁ డెంతగా పులకించునో! మగువముఖకాంతిప్రసరణము చంపకమునకు దోహదక్రియ యందురు. ప్రమద యుమిసినచో పొగడచెట్టు పూలు

పూచు నఁట! అంఘ్రిద పాదముతో తన్నినచో నశోకము పుష్పించు నఁట! మదవతీముఖమారుతప్రసారమున సింధువారము పుష్పించు నఁట! ఆయాతరువుల కివి దోహదక్రియలు. అట్లొకపట్టిక నిచ్చునో నది శాస్త్రము కావచ్చును కాని- కవిత్వము కా నేరదు. రంభాదులు నిరంతర మానందనమున విహరింతు రని చెప్పుట కవియుద్దేశము. ఆయచ్చరలయాలింగనాదులచే పులకించినయాచెట్లు సకల ర్తువులందును పూలు పూచు నని కవి ధ్వనింపజేసినాడు. అట్టిశృంగారస్థాన మెన నందనమునకు సత్యభామతో శ్రీహరి విహరింప వచ్చినాడు. ఈసీస పద్యము "రచనలో - భావనలో నొకవైలక్షణ్యమున్నది. ఏపాదమున కాపాద మేకసమాసనిబద్ధముగా నచటిచెట్టుచేమలును, వాని కచ్చర లొనర్చుదోహదక్రియలును నారామ మంతటి నొక్కసారి కలయజూచు వారికి కనుపట్టువిధముగా చెప్పబడినవి.

సీ. "కనుపట్టె నొకచోట ఘనఘనాఘనరంగవిద్యున్నటీనాట్యవిలసనములు
చూపట్టె నొకచాయ వాపికాజలజాతజాలవాచాలహంసవ్రజంబు
తలచూపె నొకవంక దరదళత్సేవంతికాగంధినీహారకణభరములు
పొడ సూపె నొకచక్కిఁ బుష్పితఫలినీలవంగవాసితశైత్యవైభవములు
తే. గీ. నెఱపె నొకయెడఁ దామ్రపర్ణీజలార్ద్రి
చందనాచలపవమానకందళములు
మొనపె నొకకడ సామిసంఫుల్లమల్లి
పాటలీచంపకోత్పలప్రౌఢిమములు
(3 ఆ - 46 ప)

ఈసీసపద్యము మొదటిభాగములో వర్ష ర్తువును, రెండవభాగములో శరదృతువును, మూడవభాగమున హేమంతమును, నాలుగవభాగమున శిశిరమును, తేటగీతములోని మొదటిరెండుపాదములలో వసంత ర్తుధర్మ ములును చిట్టచివరి రెండుపాదములలో గ్రీష్మ ర్తుధర్మములును పొందు పఱుపబడుటచే నొకేకాలమున షడృతువులును నందనమున సాక్షాత్క రించినట్లు కవి వాచ్యముగా చెప్పక ధ్వనింపజేసినాడు.

" మహీభృద్వేది వనాంతసీమమునఁ బద్మాజాని సత్యావధూ
సహితుం డై యనిమేషవారవనితాసందోహముల్ గొల్వఁగా
విహరింపం జనుదెంచినాఁ డనుచు సేవింపంగ వర్షాశర
న్మిహికాశీతవసంతఘర్మఋతువుల్ "

(3 ఆ - 45 ప)

తదుద్యానమున నిండిన వఁట! ఆరుఋతువులునొకేసారి యిచ్చట నుండుటకు కారణ మది యఁట! షడృతువులు నొకేసారి సాక్షాత్కరించినట్లు తిమ్మనకు పూర్వమే మాఘుఁడు శిశుపాలవధలో వర్ణించి యున్నాడు. [1]

ఇందు నందనారామసౌందర్యసర్వస్వమును పఠితలకన్నుల గట్టునట్లొక్కొక్కపద్యపాదమున నొక్కొక్కసన్నివేశము దేనికదే ప్రత్యేకముగా శృంగారసురభిళముగా - ఇది యీఋతు వని వాచ్యము కాకుండ ధ్వనిమార్గమున వర్ణింపబడినది. ఆయారామరామణీయకము వలెనే యీవర్ణనమును సర్వాంగీణసుందరముగా సాగిపోయినది.

శ్రీహరిని కొల్వవచ్చినది రంభాదు లని చెప్పక - అనిమేష వారవనితాసందోహ - మనుచున్నాడు కవి! కృష్ణునియందము వారి ననిమేషలుగా నొనరించిన దని యిందలిచమత్కారము! ఇంతకు పూర్వము వారు యక్షుతనయేందుజయంతవసంతకంతుల నెఱుంగుదురు. ఈకృష్ణునిలోనియందము వారెవ్వరిలోను లే దని కవిహృదయము!

1. తపేన వర్షాః శరదా హిమాగమో
వసంతలక్ష్మ్యా శిశిరః సమేత్య చ
ప్రసూనక్లృప్తిం దధ....తదర్తవః
పురేస్య వాస్తవ్యకుటుంబితాం యయుః "

- మాఘము. సర్గ 1 - 66 శ్లో.

ఆయందమును కన్నులతో త్రావుటకే వా రనిమేష లై రని ఫలితార్థము. వారు వారవనితలు కనుక పరుని చూచుట వారికి తప్పు కాదని సిద్ధాంతము. ఇచ్చటియీకల్పనము మనోజ్ఞముగా నున్నది.

కం. "గురివెందఁ జైత్రుఁ డొందఁగఁ
గర మలుక న్మావి యోడు కలచిన దన వా
తెరమీఁదఁ గాననగుపలు
వరుస యన న్ననలు పల్లవముపై మొనసెన్"
(3 ఆ - 48 ప)

చైత్రుడు – పుంలింగము. మావి, గురివెంద – యనునవి స్త్రీసమములు. తనపతి యైనవసంతుడు మాధవిని పొందినాఁ డని మావి యలుకతో నోడు గఱచికొన్న దఁట! అందుచేతనే – యెఱ్ఱనిచిగురుటాకుపెదవిపై నన లనుదంతపంక్తి యేర్పడిన దఁట! ఖండితనాయిక యైనసత్యభామతో గూడి కృష్ణుడు నందనవిహార మొనర్చుచుండగా వారి కందు ఖండితనాయిక యైనమావి కన్పట్టిన దఁట!

ఖండితనాయిక [1] యైనసత్యను శాంతింపజేసి యామెకోరిక తీర్చుటకే యామెను కృష్ణుడు నందనమునకు తెచ్చినాడు. ఆయన యదృష్టమేమో కాని – ఈస్వర్గమునకూడ ఆయన మఱియొకఖండిత నాయికను దర్శింపక తప్పినది కాదు.

ప్రకృతివర్ణనలో నిట్లు పాత్రలమన స్తత్వమును చిత్రించుట తిమ్మనగారికళాకౌశలమునకు నికషదృషత్సదృశము.

మదోన్మాదితరాజకీరవదనత్రుటితోరుఫలచ్యుతము లైన దాడిమిబీజములనుగూర్చి కృష్ణుడు సత్యభామతో చేసినవర్ణనము

---

1. "విభుఁ డన్యసతిఁ జెంది వేకువ రాఁ గుందునదిల ఖండిత"
- కావ్యాలంకారసంగ్రహము.

(3ఆ - 55 ప) నాయకగతనఖక్షత వాంఛాసూచక మైన శృంగారరసము నకు పుష్టి నిచ్చుచున్నది.

" తలిరాకుమెఱుఁగువాతెర
కలకంఠవిటుండు గమువఁగాఁ జూతలతా
లలన విదిర్చెను గంటివె
యలికంకణముఖరవిటపహస్తముల సతీ ! "
(3 ఆ - 56 ప)

ముగ్ధానాయికాసంభోగశృంగారమున కిది పరాకాష్ఠ. సత్యభామతోఁ గృష్ణుఁ డీశృంగారప్రసక్తి తెచ్చుట సరస మైన సాభిప్రాయ మైన యొప్పు చున్నది. నాయకు డైనకృష్ణుడు చేయునీశృంగారప్రసంగమునకు నాయిక యైన సత్యభామ మాఱు పలుకక వినుట మఱింతరసవంతముగా నున్నది.

" తనుఁ గనుఁద్రామి యొండొకలతం బతి వేఁడొకతేఁటిబోఁటిపై
త్తున విరిదేనెఁ గ్రోలఁ గని తూఱుచు సంపఁగితావివెల్లిలోఁ
గనలునఁ గూలఁబోవునలికామివిసాహస మేమి చెప్ప ? న
య్యనుఁగుఁబ్రియుండు నెచ్చెలులు నాఁగిన మాన దరాళకుంతలా ! "
(3 ఆ - 57 ప)

ఇది సత్యభామకు నందనోద్యానమున కృష్ణుడు చూపినదృశ్యము.

అంతకు పూర్వము ద్వారకలో కృష్ణుడు రుక్మిణికి పారిజాత మిచ్చినందులకు కనలి సత్యభామ యే మన్నది ?

సీ. ఉవిద యెవ్వతె నోచి యున్నదో యీశమం
తకరత్న మింక నొఁదల ధరింప ?
నీరైవతకశైలచారుకూటవిటంక
కేలి కిం కెవ్వతె పాలుపడునొ ?
యెవ్వతె కబ్బునో, యీవసంతారామ
కర్పూరకదళికాగారవసతి ?

లీల నీమణిసౌధజాలకంబుల నిన్నుఁ
గూడి యెవ్వతె వార్ధిఁ జూడఁ గలదొ ?

తే. గీ. యకట ! నేఁ బెంపఁ బెరిగినశుకమయూర
శారికాబృంద మెవ్వతెఁ జేరునొక్కొ ?
నన్ను నాతోడిసవతుల నగకమున్న
పంత మలరంగ నిన్ను మెప్పింతుఁ గాన "

(1 ఆ - 131 ప)

మానరోషముతో సత్యభామ పలికినయీపలుకుల కర్థ మేమి ? తాను చత్తు ననియే కదా ! ఆకోపమును బోనాడుటకే కదా - భూలోకము నుండి కృష్ణుఁ డామెతో స్వర్లోకమునకు రావలసివచ్చినది ? నందనోద్యానమున మరణోద్యుక్తఖండితనాయిక యైనయలికామినిసాహసమును సత్యభామకు ప్రత్యేకముగా వ్రేలెత్తి చూపుటలో కృష్ణుని యాంతర్యము పరోక్షముగా సత్యభామమానరోషము నామెకు గుర్తు చేసి, యామె బుంగమూతి పెట్టినచో చూచి యానందింపవలె ననియే. పారిజాతతరువును చేజిక్కించుకొని సపత్నులందఱికన్న మిన్నగా నుండు నవకాశము కట్టెదుట నుండుటచే సత్యభామ యిప్పుడు మచ్చునకైన నలుక బూనుమనస్థితిలో లేదు. మఱి - ఇదివఱలో ద్వారకలో సత్యాగ్రహమును చవిచూచినప్పు డన్నట్లే యిప్పుడును మరల కృష్ణుడు సత్యభామను "అరాళకుంతలా !" అని సంబోధించినాఁ డేమి ? ద్వారకలోనిఆసంబోధనము (ఆమెకాలితాపు తిన్న వేడిలో) "వక్రబుద్ధి కలదానా !" యనునుద్దేశముతో కృష్ణు డన్నను - నందనములోని ఈసంబోధనము - ఆమెయందమును బొగడి, యామె నానందింపజేసి, తద్ద్వారా తా నానందించుటకే కృష్ణుడు చేసి యుండవచ్చును.

" అప్పుడును - ఇప్పుడును - ఎప్పుడును - నీ వందగత్తెవే - ఆయుద్దేశముతోనే నిన్ను "అరాళకుంతలా !" యనుచున్నా నని

సత్యభామ నుబ్బవేయును ద్దేశముకూడ శృంగారచతురుఁ డైన శ్రీకృష్ణుని కుండవచ్చును.

" అనుఁగుఁ బ్రియుండును, నెచ్చెలులును నాఁగినను " మరణ ప్రయత్నమును మానని ఆయళి కామినికన్న నీ వెన్నో రెట్లు మంచిదానవు సుమా !" అని యొకవిధముగా సత్యభామను కృష్ణుడు ప్రశంసించుటగా కూడ నిక్కడ నర్థము చెప్పికొనవచ్చును. ఇది హృదయైకవేద్యమే కాని - వాచ్యము కాకూడనియాప్రేయసీప్రియులసుకుమారశృంగార విషయము !

నాయికానాయకులపారస్పర్యములను సుకుమారముగా పరిష్కరించి పుణ్యము కట్టుకొనుటలో తిమ్మకవి కున్ననైపుణ్యా మీపద్యములో దోబూచు లాడుచున్నది !

" పారిజాతము భూమీరుహచక్రవర్తి ! త్రిజగత్సంపూజ్య సౌరభ్యకీర్తి ! మరుల్లోకమలంకరించు నిది గౌరీనాథుజూటస్థలంబు మృగాంకుండు, రమామనోరమునురంబుం గౌస్తుభంబుంబలె " నని కృష్ణుడు వర్ణించినాడు. (4 ఆ - 8 ప)

స్వర్గలోకమం దున్నయాపారిజాతము భూమీరుహచక్రవర్తి యఁట ! అనగా చెట్లన్నింటికిని చక్రవర్తి - యని సామాన్యార్థము. భూమియందు పుట్టినవస్తువులలో శ్రేష్ఠమైనది - యని విశేషార్థము ! పారిజాతతరువు భూలోకగత మై అందలిభూరుహములన్నిటికన్న మిన్నగానుండు నని యీభూమీరుహశబ్దము సూచించుచున్నది. కోరిన కోరికలను తీర్చగలుగుటచే పారిజాతమున కాచక్రవర్తిత్వము సార్థక మగుచున్నది.

గౌరీనాథుజూటస్థలమున నున్నమృగాంకుని వెన్నెల భూలోక వాసులకందుబాటులో నున్నట్లే యూర్ధ్వలోకమున నున్నయీపారి

జాతముకూడ ద్వారకావాసుల కందుబాటులోనికి రా నున్నట్లు ఈయుపమానము ధ్వనించుచున్నది !

కం. " తనపాదుజలములోనం గనుపట్టెడునీడ నీనగము విలసిల్లున్
మనకన్నమున్న తా మేదినికిం డిగి యేఁగుచున్నతెఱఁగునఁ దరుణీ ! "

(4 ఆ - 7 ప)

ఇవి సత్యభామకు సంతోషము కలిగించుటకుమాత్రమే కృష్ణుడు చెప్పిన మాటలు కావు – అవి పరమేశ్వరవాక్కులు కనుక నవశ్యము జరిగితీరు నని తిమ్మకవి యిందు సూచించినాడు !

" వారణరాజయాన ! సురవల్లభుఁ డాశచి నంకపీఠముం
జేరిచి సోఁగవెంట్రుకలఁ జిక్కులు వాపి వియన్నదీనవాం
భోరుహనాళసూత్రములఁ బొందుగ దీనిలతాంతముల్ సరుల్
గా రచియించి నించుఁ గుతుకంబున నీఁగుమెఱుంగుఁగ్రొవ్వెదన్ "

(4 ఆ - 8 ప)

పారిజాతసుమములందు శచీదేవి కున్నమోజును, శచియందు దేవేంద్రుని కున్నప్రేమయు నిండుగా నిందు వ్యక్తమైనవి. శచీదేవికి నింతగా ప్రీతి పాత్ర మైనపారిజాతమును హరించుటచేతనే శ్రీహరితో నింద్రుడు ఘర్షించినాడు.

" విను మింతుల్ తిలకంబుఁ జంపకముఁ గ్రోవిన్ సిందువారంబుఁ బ్రేం
కణమున్ మామిడి గోఁగుఁ బొన్నఁ బొగడం గంకేళి నూహించి క
న్గొన మోమెత్తఁగఁ గౌఁగిలించుకొన మూర్కొఁ బాడఁ జే నంటఁ బ
ల్కఁ నగం గ ల్గిమియంగఁ దన్న ననుచుం గల్పాగ మాయావిరుల్ "

(4 ఆ - 9 ప)

" కనఁ దిలకంబుఁ గేసరము గల్లుఖియన్ రహిఁ బాడఁ బ్రేంకణం
బు నిమురఁ మావి నవ్వ సురపొన్న ముఖాంబుజ మెత్త జంపకం
బు నెఱగవుంగిలం గొరవి మూర్కొన వావిలిఁ దన్న వంజుళం
బు నుడువ గోఁగు నై తరుణి ! పూచు సురద్రుమ మిన్నిపువ్వులన్ "

(4 ఆ - 10 ప)

ఏవృక్షమును దలంచి స్త్రీలు దోహదక్రియ చేసిన నావృక్షపుపూవులను పూచువిచిత్ర మైనమహిమ పారిజాతమున కున్నట్లు మొదటిపద్యము చెప్పుచుండగా - ఆయావృక్షములను స్మరింపకుండగనే ఆయాదోహద క్రియ లొనర్చిన నాయావిభిన్నపుష్పములను పూచుశక్తి పారిజాతమున కున్న దని "కసఁదిలకంబు" అనుపద్యమున కృష్ణుడు సత్యకు చెప్పుచున్నాడు. పారిజాతతరుప్రశస్తి యిందు వర్ణింపబడినవిశేషము.

"ఈపగిదిన్ మురారి హృదయేశ్వరి నూఱడఁ బల్కి నిర్జరేం
ద్రోపవనస్థలంబునఁ బయోరుహనేత్రయుఁ దానుఁ జేరి పు
ష్పాపచయప్రమోదభరితాత్మకుఁ డై చిదిమెన్ లతాంతముల్
గోపవధూకుచస్తబకలోలవిశాతనఖాంకురంబులన్"

(4 ఆ - 13 ప)

శ్రీకృష్ణుడు పారిజాతసుమగుచ్ఛమును సత్యకు కర్ణావతంసముగా నిడి యామె కభీష్టముగా సురతరువు నామెకిత్తు ననుటచే సత్యభామకన్నులు తామరలై వికసించినవి! కనుక "పయోరుహనేత్ర" శబ్ద మిక్కడ సాభిప్రాయము. గోపవధూకుచస్తబకలోలనిశాతనఖాంకురములచే కృష్ణుడు లతాంతములను చిదిమినాఁ డనుట కావ్యమునందలిశృంగార ప్రాధాన్యమును జాటుచున్నది.

"ఎలదేఁటుల్ తమవాఱఁగన్గవలపై నిందీవరభ్రాంతిచే
మెలఁగం జేరలఁ గప్పుకోనలవి గామిం జీఁదఱం జెంది యి
చ్చలఁ గాంక్షించిరి నిర్నిమేషజలజాస్యల్ మానుషత్వంబు న
య్యలిభీతిన్ ముకుళీకృతాక్షి యగుసత్యాకాంత వీక్షించుచున్"

(4 ఆ - 14 ప)

దేవకాంతలకు నిర్నిమేషత్వము బాధాకరముగా పరిణమించిన దనియు మానవాంగన యైనసత్యభామ కున్నసుఖము వారికి లేకుండుటచే వారు మానవత్వమునే మనసులలో వాంఛించి రనియు వర్ణించుటలోనిచమత్కారము సహృదయహృదయైకవేద్యము. సురలోకవాసముకన్న నర

లోకవాసమే ప్రీతిపాత్ర మని - ముఖ్యముగా - పారిజాతతరువున కిది వర్తించునట్లు ధ్వనింపజేయుట కవిలక్ష్యము కావచ్చును.

" అంబరచారిపంకజదళాక్షులు చంపకపుష్పరేణుజా
లంబులయందు సర్వశుభలక్షణరేఖలఁ బొల్చునట్టిపీ
తాంబరుపాదపంకజము లంటినతావులు ద్రొక్కి నోడి పా
ర్శ్వంబుల సంచరింతురు పరస్పరకేళివచఃప్రసంగతిన్ "

(4 ఆ - 15 ప)

శ్రీకృష్ణునిపాదములందు పద్మరేఖ లున్న వనియు, నవి ఆయనయడుగు జాడలలో నగుపించుచున్న వనియు, వానిని ద్రొక్క నోడి యాప్రక్కల సురలోకసుందరులు సంచరించి రనియు చెప్పుట ఆదివ్యాంగనలకృష్ణ భక్తికి నిదర్శనము. కృష్ణునిపాదములే పంకజములు. ఆదివ్యాంగనలు - పంకజదళాక్షులు. ఈపాదము లాదివ్యాంగనలకన్నుల రూపు దాల్చిన వన్నమాట ! అనగా - కృష్ణునిపాదములను వారు కన్నుల నిల్పుకొని రనియు, కన్నుల కద్దుకొని రనియు విశేషార్థము లిందు స్ఫురించు చున్నవి ! ఆకృష్ణునిపాదపంకజము లంటినతావులపార్శ్వములందు చరింతురనగా ఆదివ్యాంగనలు శ్రీహరియడుగుజాడలకు ప్రదక్షిణము చేయుదు రనియు భావము !

" చనుఁగవప్రేఁకమున్ జఘనచక్రభరంబును మోవలేక యొ
య్యనఁ బదపంకజంబు లలసాలసవై ఖరి మోపుచున్ జనా
ర్దనుభుజ మూఁత గాఁగ వనితామణి యేఁగెఁ బరస్పరాంగమే
ళనమున రోమహర్షముకుళవ్రజ మొండొరుమేన నిండఁగన్ "

(4 ఆ - 25 ప)

సత్యభామ మందగమన యగుట కామెవక్షోజజఘనభారమే కారణ మనుట సరసముగా నున్నది. జనార్దనుభుజ మూఁతగా నడచుట సత్యా కృష్ణులయన్యోన్యప్రేమకు నిదర్శనము. ఆమెపాదాహతికే యొడలు పులకించినకృష్ణుని కామె తనభుజము నూఁతగాఁ గొని నడచినపుడు

మేను పులకించుట వింత కాదు. నాయికానాయకులపరస్పరాంగసమ్మేళనమున పులకాదులు పొడముట శృంగారరసప్రధాన మైనకావ్యమున హద్దు మీరనిముద్దు.

"సకలసురై కవంద్యుఁ డగుచక్రధరుం డిదె నేఁడు తన్ను న
ర్వికిఁ గొనిపోవ వచ్చె నని వెక్కస మైనమనః ప్రభూతకౌ
తుకమునఁబోలె సంభ్రమముతో నటియించె నభీష్టవస్తుదా
యకతరుచక్రవర్తి యపు డాతతవాతవిధూతశాఖమై"

(4 ఆ - 51 ప)

ఈపద్యము పారిజాతవృక్షము పుడమిని జేరితీరు నని సూచించుచున్నది. సురలోకమున నుండుటకన్న సురై కవంద్యుఁ డగుచక్రిసన్నిధినే పారిజాతము ధన్య మగు నని కవిహృదయము.

"శౌరి యిదె పారిజాతముఁ
గోరికఁ గొని చనుచు మనలఁ గొనిపోఁ డని లోఁ
గూరినవెవ్వగఁ దక్కిన
భూరుహములు మధురసాశ్రుపూరము నించెన్"

(4 ఆ - 52 ప)

సురలోకముననే నిలచిపోవుకల్పతరువులకన్న హరిసన్నిధి నుండుటకై పుడమికి దిగుపారిజాతమే యదృష్టవంత మైన దని భావము. మధురసాశ్రుపూర మనుటచే కల్పవృక్షములకన్నీరుకూడ తీయగా నుండు ననుట. ఆచెట్లపూలనుండి అంతటిపువ్వుదేనె స్రవించిన దనుట.

"జలరుహనాభుఁ డిట్లు రథసంబున నందనపారిజాతమున్
బలిమిఁ బెకల్చి యెత్త విటపంబుల వ్రేలెడుకూలపల్లవం
బులు వడి బట్టి యీడ్చుఁ గొనిపోవఁగ నీక పెనంగులీలఁ గ
ల్పలతిక లెల్ల - వల్లభలు ప్రాణవిభుం బెడ బాయ నేర్తురే?"

(4 ఆ - 54 ప)

కృష్ణవల్లభసత్యభామ సురలోకమునకుకూడ ప్రాణవిభునితో వచ్చు టచే నీయర్థాంతరన్యాసము మఱింతసార్థక మైనది. లతలమిషమున పతివియోగము ననుభవించుకాంతలమనఃస్థితి యిందు దయనీయముగా వర్ణింపబడినది. సత్యాసమేతుఁ డై శ్రీకృష్ణుఁ డమరావతికి వెడలగా రుక్మిణ్యాదికృష్ణభార్య లనుభవించువేదన మిందు ధ్వనించుచున్నది. అభిజ్ఞానశాకుంతలమున నత్తవారింటికి పోనున్నశకుంతలవియోగమును భరింపలేనిచేతనాచేతనములదయనీయస్థితిని కాళిదాసమహాకవి రమణీయముగా వర్ణించినశ్లోకములను గుర్తునకు తెచ్చుచున్నది తిమ్మన గారియీపద్యము.

"గరుడనిఱెక్కలం బొడముగాడ్పులసోఁకునఁ దక్కవేలుపుం
దరువులుఁ బెల్లగిల్లి గగనంబునఁ దోడన వెంట నంటి రా
నరిగెడుపారిజాతహరణాచరణవ్యసనై కలోలు నా "
హరిఁ గని యడ్డ మై పలికి రచ్చటినందనపాలు రందఱున్ "

(4 ఆ - 55 ప)

గరుడనిరెక్కలవలన పుట్టినది ప్రభంజనమే కాని సామాన్య మైనగాలి కాదు. కనుకనే కవి దానిని గాడ్పుగా వ్యవహరించినాడు. "ఖగకుల నాథుపక్షములగాడ్పు సహింపలేక " అని యింతకుముందు (2 ఆ–32ప) " గాడ్పు " అనుశబ్దమునే తిమ్మకవి ప్రయోగించినాడు. దీనినిబట్టి ఈకవి తనకావ్యమున నాద్యంతమును పదప్రయోగమునకూడ నెంత జాగరూకత వహించినాడో స్పష్ట మగును. పారిజాతమునకు పట్టనున్న హరిసాన్నిధ్యభాగ్యము తమకబ్బలే దని మధురసాశ్రుపూరము నించిన తక్కినసురభూరుహములకు ఈగాడ్పు తాత్కాలికోపశాంతిని గలిగించిన ట్లున్న దీవర్ణనము. వనపాలకు లడ్డుపడనిచో నింద్రుని కొక్కసుర తరువుకూడ దక్కి యుండెడిది కాదు. ఆవృక్షములన్నింటిని గైకొనుట కృష్ణునిసంకల్పము కానేకాదు కనుక తక్కినవి స్వర్గమున మిగిలిపోవలసి వచ్చె ననుట సముచితము.

" నా విని సత్యభామ వదనంబున లేనగ వంకురింప నే
మే వచియింపఁబోవుహృదయేశ్వరువిం గనుసంజ్ఞ మాన్చి చన్
గ్రేవల జాఱుకొంగు సవరించుచు వీడినకొప్పుఁ బల్మఱుం
జే వెడదోపుచుం బలికెఁ జెంగొవచూపులు క్రేళ్లు దాఁటఁగన్ "

(4 ఆ - 57 ప)

మగనిని కనుసన్నలలో నిలుపుకొన్నమగువగా విమతులపై కత్తిగట్టు పేరాంగనగా సత్యభామ యిందు చూపట్టును. లేనగవులు నవ్వుట, వీడినకొప్పు పల్మఱు వెడదోపుట, చెంగొవచూపులు క్రేళ్లుదాఁటుట, - ఈసత్యభామయవస్థాచిత్రణ మెంతనిసర్గరమణీయముగా నున్నదో !

" గళితశృంఖల లయ్యె నకాలనిద్ర
గనుఁగవలఁ గ్రాలఁ దమయంతఁ గదల వయ్యె
దారుణాధోరణప్రయత్నమునఁ గొని
నముచిమథనునివీట శుండాలఘటలు "

(4 ఆ - 67 ప)

అనుపద్యమునుండి

" నను నని సేయఁ బంపు .... దండహస్తుఁడై "

(4 ఆ - 74 ప)

అనుపద్యమువఱకును గలయన్నిపద్యములలోను దేవేంద్రునికి కృష్ణునిచే కలుగబోవుపరాజయ మనునమంగళమే సూచింపబడుట గమనింపదగిన విశేషము.

" హేమనిభగాత్రి ! నీభాగ్య మేమి చెప్ప ?
జిష్ణుభూజంబు నీపెట్టుచెట్టు జేసి
సవతులన కాదు త్రిభువనేశ్వరి యనంగఁ
బొలుచుపౌలోమి గెలిచితి వలఘుమహిమ "

(5 ఆ - 54 ప)

సవతి యైనరుక్మిణియందలియీర్ష్యచే పారిజాతతరువును తన పెరటిచెట్టుగా చేసికొన్నది సత్యభామ. సవతులనుమాత్రమే గెలువవలె నని మొదట నామె సంకల్పించినను శచీదేవి కిష్ట మైనతరు వామెకు దక్కుటతో మూఁడులోకముల కేలికదొరసాని యై వెలుగునింద్రాణిని గెలుచుటగా పర్యవసించిన దామెసంకల్పము. కనుకనే నారదుడు సత్యభామ యదృష్టమును ప్రశంసించినాడు. ఆశచీదేవివలెనే పారిజాతమును గైవస మొనరించుకొన్న ఈసత్యభామయు నాశచీదేవివలెనే పుణ్యక వ్రతాచరణవైభవ మందవలె ననునుద్దేశముతో నారదు డీమాటల నన్నాడు.

"పరమాచారధురీణు నధ్యయనసంపన్నున్ శుభాకారు శా
స్త్రరహస్యజ్ఞు విశిష్టవంశజుఁ బ్రశాంతస్వాంతు నుద్యద్దయా
పరతంత్రున్ విదితాత్ము భూసురవరుం బ్రార్థించి యాచార్యుఁగా
దరళాక్షీ ! నియమింపఁగాఁ దగు వ్రతోద్యానక్రియావేళకున్"

(5 ఆ - 59 ప)

పై పద్యములో చెప్పబడినయుత్తమలక్షణము లన్నియు మూర్తీభవించినవాఁడు నారదుడు. కనుకనే కృష్ణుడు పుణ్యకవ్రతమహోత్సవసందర్భముగా సత్యభామచే తన్ను దానముగా గ్రహించుటకై నారదుని ప్రార్థించి యంగీకరింపజేసినాడు.

"పరమమునిమానసాలానబంధనమునఁ
గుదురు వడకుండుయాదవకుంజరంబు
వికచరాజీవనేత్రచే వేల్పుమ్రానఁ
గమ్మఁబూవులదండచేఁ గట్టువడియె"

(5 ఆ - 80 ప)

"ఇన్ని దినంబులున్ సవతు లిందఱలో నల సత్యభామకన్నన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై యన విందు" నని నారదుఁ డన్నాడు. పారిజాతహరణమున కడ్డువచ్చినవనపాలకుల కేమే వచియింపబోవుహరిని

కనుసన్నచే మాటాడకుండ చేసినది సత్యభామ. కనుక సకలలోకాధీశుఁడైనశ్రీహరిని కైవసమొనరించుకొని తామర లై వికసించినకన్నులామెవి ! అందుచే సత్యభామను కవి "వికచరాజీవనేత్ర" యనుచున్నాఁడు. పరమమునులమానసము లనెడికట్టుకొయ్యలకుకూడ కట్టువడని దిట్టయైనయదుకుంజరుఁ డావికచరాజీవనేత్రచే వేల్పుమ్రానుపారిజాతమునకు విచిత్రముగా కట్టువడినాఁడు — అనుచున్నాఁడు కవి. కుంజర మాలానబంధమునకు కట్టువడును. కాని — ఈయదుకుంజర మెట్టి యాలానబంధమునకును కట్టువడకపోవుట వింత. నిర్మము లైనమునులకు కూడ నందుబాటులో నుండనిపరమేశ్వరుడు మమతలు పూచినమగువకు పట్టువడుట వింతయే కదా ! ఇది యీపద్యమునందలిచమత్కారము.

> "నిగమాంతప్రతిపాద్యు నాద్యు నభవున్ నిత్యున్ గుణాతీతు వి
> శ్వగురున్ జిన్మయు నవ్యయుం బరము నిశ్శంకం బనుల్ గొంచు మా
> నిగరిష్ఠుండు కృతార్థుఁ డయ్యె నన సందేహింపఁగా నేల భ
> క్తగణాధీనుఁ డనంగ నవ్విభుఁడు లోకఖ్యాతిఁ బెంపొందఁడే ?"
>
> (5 ఆ - 87 ప)

పారిజాతాపహరణకథానాయకుఁడైనకృష్ణునియుత్కర్ష నీపద్యము వేనోళ్ళ చాటుచున్నది. "ప్రామినుకులపూఁబోఁడులసీమంతపుఁజెందిరంబుచే బలెనరుణశ్రీ మించునతనిపదము" లని తిమ్మకవి ద్వితీయాశ్వాసములో భంగ్యంతరముగా చేసినశ్రీకృష్ణవర్ణనమునకు ఈ "నిగమాంతప్రతిపాద్యుఁ" డన్న దొకకుదింపు. ఆభగవంతునిలక్షణము లన్నియు నీపద్యమున వివరింపబడినవి. ఆయన యభవుడు. అట్టివాఁడు మఱి శ్రీకృష్ణుడుగా పుట్టుట యేమి ? అది యంతయు నొకలీల. ఆలీలను మాత్ర మాయన యేల ప్రదర్శింపవలయు ననఁగా —

> " పరిత్రాణాయ సాధూనాం
> వినాశాయచ దుష్కృతాం
> ధర్మసంస్థాపనార్థాయ
> సంభవామి యుగే యుగే "

అని యోగీతాకారుఁడు శ్రీకృష్ణుఁడే స్వయముగా వ్రాసిచ్చినాడు. ఆయన గుణాతీతుఁడు. ఆయన కొకరియందు రాగము కాని, మఱియొకరియందు ద్వేషముకాని లేదు. మఱి- ఆయన సత్యభామావిధేయుఁడుగా నీకావ్యమున గోచరించుచున్నాఁ డేమి ? మహానీయ మైనయామె మధురభక్తి కాభక్తవశంకరుడు కట్టువడినాడు !

అట్టిభగవంతుని తనభక్తిజ్ఞానవైరాగ్యతీవ్రతచే నారదుడు వశ మొనరించుకొని - " ఓ సత్యభామా ! ఈకృష్ణుడు నీకే కాదు - నాకును విధేయుడేసుమా ! " యని యామెకు కనువిప్పు కలిగించి యామెలోనియహంకారమును పటాపంచలు చేయుటకే - అదికూడ ఆకృష్ణునిసంకల్పము ననుసరించియే - నారదుడు సత్యభామచే పుణ్యక వ్రతము చేయించినాడు. ఆభగవంతునిచే పనులు గొన్ననారదుడు మానిగరిష్ఠుడే. ఆయనకును, భగవంతునికిని కలసాన్నిహిత్యమునుగూర్చి శాస్త్రప్రమాణము లెన్నో యున్నవి.

కృష్ణుడు పరమాత్మస్వరూపు డనియు, పూర్ణావతారపురుషు డనియు - నందుచే నతనిపరముగా పరబ్రహ్మస్వరూపమును చక్కఁగా నిరూపించుట తిమ్మకవిగారియభిజ్ఞతకు తార్కాణ.

తిమ్మకవివర్ణనలలో ఆయనయూహాశాలితయు, లోకజ్ఞతయు పురాణవిషయజ్ఞతయు, వేదవేత్తృతయు, రసజ్ఞతయు, సౌందర్యాది దృష్టియు భాసించుచుండును. ఆయన చేసినవర్ణనము వర్ణనముకొఱకు కాక - ప్రధానకథతో పెనవైచుకొనిపోవుట మనము గమనింతుము.

అభంగగంగాప్రవాహాభంగిమలతో నలవోకగా సాగిపోవు కథలో నెందును వెలితి కనబడకుండ తనరచనావిన్యాసముచే, వర్ణనానైపుణ్యముచే, రసపిపాసువు లైనపాఠకులను కౌతుకవ్యగ్రులుగా చేయునైపుణ్య మాయనకు వెన్నతో పెట్టినవిద్య.

తిమ్మనగారు వర్ణనము నెదోకల్పనము నాశ్రయించి చేయును. ప్రతికల్పనలోను శృంగారరసధునులు ప్రవహింపఁజేయును. ఇట్టిసందర్భములందు కావ్యముయొక్క-యంగిరస మేది? యనురసతాత్పర్యమును సూచించుదృష్టితో ఆయన యీవర్ణనలు చేయును. రసతపస్వియైన కవిమాత్రమే యట్లు చేయగలడు కాని – కేవలవిదగ్ధమాత్రుఁడైనకవి శబ్దజాలముతో నింద్రజాలము చేయును. ఆవిదగ్ధమాత్రుల కందనిశిఖరాగ్రములలో నుండినరససిద్ధుఁడైనమహాకవి తిమ్మనగారు.

" కొన్నిజీవులు చిదిపిడాల్ కొఱికి బ్రతుకఁ
గొన్ని మనులేఁతవెన్నెలల్ గ్రోలి పొదలు "

నని కాశీఖండమున శ్రీనాథుఁ డన్నట్లు – విదగ్ధమాత్రులు శబ్దజాలముతోనే తృప్తిపడగా – రెండవకోవకు చెందినకవిచకోరచక్రవర్తి తిమ్మనగారు!

సర్వసాధారణముగా ప్రబంధకవులు తమపాండిత్యపరాక్రమ ప్రదర్శనార్థమును, లోకజ్ఞతాశాస్త్రజ్ఞతాప్రకటనార్థమును వర్ణనలనొకగరిడిసాలగా చేసికొందురు. కాని – తిమ్మకవి అంగిరసస్ఫోరకములుగను, ప్రధానకథాసందర్భసూచకములుగను తనకల్పనలను వర్ణనాజీవాతువులుగను, స్వప్రతిభావైభవసందీపకములుగను పన్ని, యొకమహాకావ్యశిల్పి ననిపించుకొన్నాఁడు!

# 11. రచనా వైచిత్రి

విచిత్రముయొక్క భావము వైచిత్రి. చిత్ర మనగా 1. రంగు రంగులుగా నుండుట. 2. అసాధారణత్వము.

వర్ణహీనత్వస్థితి తెలుపు. దానిపై గీచినరంగు రంగు కాని - తెలు పన్నది రంగు కాదు.

చిత్ర మనగా అసాధారణత్వము. ఆశుచిత్రవిస్తరమధుర కవితావిభాగమును దాక్షిణాత్యులే చేసిరి కాని యాలంకారికు లెవ్వరును చేయలేదు. విశేషముగా చిత్ర మైనది విచిత్రము. (అనగా నసాధారణ మైనది.) దానిభావము వైచిత్రి.

ఇక కవిత్వములో వైచిత్రి యన నేమో చూతము. కవి కథాకథనములో వర్ణనలో అక్కడక్కడ రచన పాఠకహృదయావర్జకముగా నుండుటకు వైచిత్రిని చూపును. కథామధ్యమున నక్కడక్కడ నీరససందర్భము లేర్పడినప్పుడు పాఠకునియాసక్తి దిగజారకుండ నీవైచిత్రిని వలచినకవులు దానిని ప్రయోగింతురు. ఇది విదగ్ధకవులపరిపాటి. ఇట్టిచో - తా నెంతసంయమము కలకవి యైనను తిక్కనగారికికూడ నిది తప్పనిసరి యైన దని స్త్రీపర్వము సాక్ష్య మిచ్చుచున్నది. అట్టిచో వైచిత్రికి పెట్టినది పే రైనప్రబంధయుగమునకు చెందినతిమ్మకవిగారి మాట వేఱుగా చెప్పవలెనా? పెద్దనాదులవలె నతడును ప్రౌఢప్రాబంధికఘుంటాపథనిరాఘాటప్రస్థాననిష్ణాతుడే.

అసలీవైచిత్రిపరమార్థ మేమి? కవిత్వము, శిల్పము, చిత్రలేఖనము సంగీతనృత్యాదులును కళలుకదా! కళాజగత్తును మానవు డేల సృష్టించుకొన్నాడు? తన దైనదైనందినజగత్తువలె నదికూడ నున్నచో కళాసృష్టియవసరమే లేదు. ఈలోకము లోపభూయిష్టమైనది. ఇక్కడియానంద మానందాభాసముమాత్రమే. అదికూడ పరిమిత

మైనదిమాత్రమే. పరిపూర్ణతృప్తి యీలోకములో మానవు డెవడును చేదుకొనలేడు. కనుక మనసున కూరట కలుగవలెనన్నకోరికతో -- ఈలౌకికజగత్తులో లభింపని - కనీసము ఊహాగమ్య మైనయానందోపలబ్ధికై యతడన్వేషణ మారంభించినాడు.

పరమేశ్వరు డీజగత్తును సృష్టింపగా - నందలిమానవుడు కళాజగత్తును సృష్టించినాడు.

లోకములో నొకలోకోత్తరసౌందర్యరాశి యున్న దనుకొందము. ఆమెయందమేయొక్క-యదృష్టవంతునకో కాని-అందఱికి నందుబాటులో నుండదుకదా. మఱి - ఆజగన్మోహినియే యొకకావ్యమున వర్ణింపబడినచో నామెయందము నెంద రనుభవించినను తఱగదుకదా! అక్కడ నాసంపశబ్దవాచ్య మైనపదార్థము పుష్కలముగా నెంద అనుభవించినను తఱుగునది కాదు. అలౌకిక మైనయానందానుభూతి యిట్టిది కాగా - లౌకికానుభవముమాత్ర మందఱికిని దక్కునది కాదు. దమయంతి నలునికిమాత్రమే సొంతము. కాని - ఆదమయంతీసౌందర్యవర్ణన మందఱికిని ననుభవైకలభ్యము. అందుచే కళాజగత్తులోని యనుభూతి సమగ్రమును, లోపరహితమును అందఱి కందుబాటులో నుండి, యెంద ఱెంతగా ననుభవించినను తరుగని దగుట స్పష్టము.

"యథాస్మై రోచతే విశ్వం
తథేదం పరివర్తతే. [1]

ఏవంవిధానుభూతికై కవి విలక్షణత్వము నాశ్రయింపక తప్పదు. హరిశ్చంద్రమహారాజుభార్య చంద్రమతి యన్నసతీతిలక ముండె నని కవులు చెప్పిరి. ఆమె నిజముగా నొకప్పు డుండెనో లేదో మన మెఱుగము. ఒకవేళ నిజముగా నట్టిచంద్రమతి యుండినను నానాఁటియాచంద్రమతికిని - నీనాఁటిమనకును సంబంధ మేమియు లేదు. రంగస్థలమున నా

1. ధ్వన్యాలోకము - ఆనందవర్ధనుఁడు.

చంద్రమతిపాత్రను నటించునది మఱియొకస్త్రీమూర్తి. అస లుండెనో లేదో మన మెఱుంగని – ఉన్నను మన కెట్టిసంబంధమును లేనిచంద్రమతి పడినకష్టముల నీనటి యభినయించుచుండగా చూచి మనము – నిత్యజీవితములో మనకు దెబ్బ తగిలినప్పుడు మాత్రమే ఏడ్చుమనము – పరులబాధల నిసుమంతయు పట్టించుకొననిమనము – నిజముగా మనకే ఆచంద్రమతియాపద లన్నియు వచ్చిపడినట్లు – వలవల ఏడ్తుము. దీనికి కారణము విచిత్రముగా నుండును.

విలక్షణ మైన – సమగ్ర మైన – లోపరహిత మైన – సార్వజనీన మైన తఱగని దైనయీయనుభూతిని కళాస్రష్ట కళాజగత్తులో వైలక్షణ్యము నాశ్రయించి సృష్టింపగా – ద్రష్ట దాని ననుభవించుచున్నాడు. సామాజికునియనుభూతులను రేకెత్తించవలె నన్నచో కవి వైలక్షణ్యము నాశ్రయింపక తప్పదు. ఆవైలక్షణ్యమే వైచిత్రి.

రామాయణమును రచించినఆయాకవులు శ్రీరాముఁ డొనర్చినశివధనుర్భంగము నొక్కొక్క రొక్కొక్కరీతిగా రచించియున్నారు. ప్రతికవియు శ్రీరామునిశివధనుర్భంగమును రచించుచో నీకవితావైచిత్రిని పాటించిరి. అంతవఱకు నొకవిధముగా రచన సాగించిన మల్లికార్జునభట్టు శబ్దాలంకారచారువుగా, మొల్ల మఱియొకవిధముగా నాసన్నివేశమును రచించిరి. శ్రీరాముడు శివునిధనువు నెక్కువెట్టునప్పటిఆకోదండపాండితి భూదేవికిని, ఆమెను వహించునాదిశేషుడు మొదలైనవారికిని కంపము కలిగించు నని యందు చెప్పబడగా – కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు తమరామాయణకల్పవృక్షమున నచిరభావి మైనయీమహాకార్యపు లోకోత్తరత్వమును స్ఫురింపజేయుటకై రచించినపద్యములలో నెంతో వైచిత్రిని పాటించిరి. రాముడు చేపట్టిన శివధనుస్సు రాక్షసుల కొకవిధముగా – దేవతల కొకవిధముగా శివలోకమునందలిప్రమథాదుల కొకవిధముగా – నచ్చట సమావేశమైన

యసూయాగ్రస్తు లై నరాజలోకమున కొకవిధముగా - నిట్లొక్కొ-క్కరి కొక్కొక్క-విధముగా తోఁచి భ్రమాసినట్లు వర్ణించి విశ్వనాథవారు శిల్పసుందర మైనరచనా వైచిత్రిని మెఱయించినారు.

శబ్దముతో గారడి చేయుటయు, బంధకవిత్వాదులునుకూడ నీవైచిత్రిక్రిందికే వచ్చును. ఈవైచిత్రి యన్నది శబ్దార్థరసపాత్రకవి సమయశైలీభావ, భావవ్యక్తీకరణశిల్పముల నాశ్రయించి యుండును. ఏవంవిధకతిపయముఖ్యసందర్భములను పారిజాతాపహరణమునుండి అంతదూరమున నున్నపారిజాతసౌరభ మింతదాపునకు వచ్చుటకు యథాశక్తి నెన్నిక చేసి చూపుటకు యత్నింతును :-

> " శ్రీమదికిం బ్రియం బెసఁగఁ జేర్చినయుయ్యెలలీల పైజయం
> తీమిళితాచ్ఛకౌస్తుభమునిద్దపుఁగాంతి దనర్చి యాత్మవ
> క్షోమణివేదిఁ బొల్పెనఁగఁజూడ్కు-లపండువు పేయువేంకట
> స్వామి కృతార్థుఁ జేయ నరసక్షితినాథునిఁ గృష్ణరాయనిన్. "

శ్రీదేవి నాత్మవక్షోమణివేది నిల్పినవేంకటస్వామి వర్ణింపబడిన యీపద్యము కావ్యములోనిశృంగారరసప్రాధాన్యమును సూచించుచున్నది.

2. " పాలఁతుల్ కౌఁగిటఁ గ్రుచ్చి యెత్తి తలఁబ్రాల్ వోయించునవ్వేళ నౌ
దలగంగం దనసీడఁ దాన కని మౌగ్ధ్యం బొప్ప వేఁబొక్క-తొ
య్యలి యంచున్ మది నెంచుపార్వతియసూయావాప్తికిన్ నవ్వుక్రొ
న్నెలపూఁదాలుపు కృష్ణరాయనికి నందించున్ మహైశ్వర్యముల్. "

(1 ఆ - 2 ప)

ఈపద్యములోని " నెల " శబ్దము రాయలవంశమునకు మూలపురుషుఁడైన చంద్రుని, " పూ " శబ్దము కావ్యమున ప్రధానస్థానము నాక్రమించు పారిజాతపుష్పమును సూచించుచున్నవి. ఈపార్వతియసూయలో సత్యభామయసూయ వ్యజ్యమాన మగుట యొకచమత్కారము.

3. " సరసపుటల్కఁ దీర్చుతటి శార్ఙ్గసుదర్శననందకాబ్జసం
భరణగుణాప్తి నెన్నడుముపైఁ గటిపై జడపై గళంబుపై
హరినలఁగేలు పైకొన సుఖాంబుధి నిచ్చలు నోలలాడునిం
దిర కృపఁ జూచుఁగాత నరదేవశిఖామణిఁ గృష్ణరాయనిన్ "

(1 ఆ - 4 ప)

అర్ధాంగిసరసపుటల్కను దీర్చుతటి శార్ఙ్గసుదర్శననందకాబ్జసంభరణగుణాప్తి కలనాలుగుచేతులను హరి యుపయోగింపవలసి వచ్చిన దఁట ! సత్యభామప్రణయకోపమును బోనాడుటకై హరి పారిజాతహరణమునకు గడంగి యడ్డువచ్చినయింద్రాదిసురల నెదిరించుటకై యాయుధములను చేత పట్టవలసివచ్చుట యిందు సూచింపబడిన దనవచ్చును.

4. " తనమృదుగీతికాపరిణతధ్వనిపై ఖరిఁ బల్కు మంచు నిం
చినరహిఁ జేతివీణియకుఁ జెక్కులు గీఁటుచు నేర్పులీల నొ
య్యన నఖరాంకురంబుల నయమ్మునఁ దంత్రులు మీటి గాన మిం
పొనరఁగఁ జేయువాణి ప్రతిభోన్నతుఁ జేయుతఁ గృష్ణరాయనిన్ "

(1 ఆ - 5 ప)

ఇందలి " చెక్కులు మీటుట ", " నఖరాంకురమ్ముల నయమ్మునఁ దంత్రులు మీటుట " యనునవి యొకవిధముగా కావ్యమునందలి శృంగారరసప్రాముఖ్యమును సూచించుచున్న వనవచ్చును.

" తనమృదుగీతికాపరిణతధ్వనిపై ఖరి కలవాణి "– మృదుత్వమును, (గీతికా) లాలిత్యమును, పరిణతత్వమును, ధ్వనిసంపదయు పుష్కలముగా నున్నతనవాణినిగూర్చియే గడుసుదనముగా – ఆత్మశ్లాఘాదోష మంటకుండునట్లుగా – తిమ్మకవి చెప్పినట్లు భావించుట తప్పు కాదు. కృష్ణరాయలయంతఃపురకలహమును బురస్కరించుకొని యాప్రభువునకు ధ్వనిమయ మైనయుపదేశ మున్న ట్లీపద్యము సూచించుచున్నది.

5. " వలిమలయల్లుఁవాడు తలవాఁక ధరించినపూవుగుత్తి, వే
ల్పులగమిజీవగఱ్ఱ, యుడివోవనిచల్వలచెంకి, వెన్నెలల్

మొలచినపాదు, పాల్కడలిముద్దులపట్టి నృసింహకృష్ణరా
యల౯ గరుణారసంబు వినపారెడిచూపుల౯ జూచు౯గావుతన్ ”

(1 ఆ - 6 ప)

రాయలవంశపూర్వుఁడైనచంద్రుడు “ వెన్నెలల్ మొలచినపా ” దఁట ! ఆవెన్నెలలు పైనుండి క్రిందికి (భూమికి) దిగజాఱగా – నీరాజు (కృష్ణ రాయల) కీర్తిచంద్రిక లుర్వినుండి యూర్ధ్వముఖముగా సాగుట విశేషము.

కృత్యాదిని చంద్రస్తుతి చేసిన తెలుగుకవి తిమ్మకవి యొక్కఁడే. కృతిభర్తవంశమునకు మూలపురుషుఁడగునీచంద్రునిస్తుతి కావ్యము నందలిశృంగారరసప్రాధాన్యమును సూచించుట విశేషము. ఈవిధముగా నీస్తుతిచే తిమ్మకవికి తీర్థమును స్వార్థమును కలసివచ్చినవి. సంప్ర దాయానుసారముగా తనకు పూర్వులైనశ్రీనాథాదులు చేసినపూర్వ కవిస్తుతిని తిమ్మకవి చేయకపోవుటకూడ ఆయనరచనలోని ప్రత్యేకతయే.

6. “ తామసవృత్తి లేదు, సతతంబును నుగ్రుఁడు గాఁడు, పౌరుషం
బేమియు వెర్తి గాదు, తన కెందును బైమఱి రాజు లేదు, సం
గ్రామములోన నొక్కనరుగాసికి వాసి దొఱంగఁ డీశ్వర
క్ష్మామహిళామనోహరువిపాటియె యీశ్వరుఁ డెన్నిభంగులన్ ; ”

(1 ఆ - 9 ప)

ఈపద్యము తిమ్మకవిరచనావైచిత్రికి పరమోదాహరణము. తాను “ శివపరాధీనమతి ” నని చెప్పికొన్నతిమ్మకవిగంటమునుండి యిట్టి కవనపుపంట పండుట యపూర్వమైనవిశేషము. “ వర్ణనానిపుణః కవిః ” యనునాలంకారికనిర్వచనమున కీపద్యము నిండుదన మిచ్చినది. ఇందలి లోకోత్తరచమత్కారమునకు పులకింపని తెలుగుగుండె యుండదు కదా !

7. “ కుంతలేశ్వరుఁడు సిక్కువడంగ విద్యాపు
రంబుఁ గైకొని నిజప్రౌఢి నెఱపె ”

(1 ఆ - 13 ప)

కుంతలము లనగా తలవెండ్రుక లనియు నర్థము. అవి చిక్కు వడినచో చెన్ను తఱిగి యథాపూర్వస్థితి నందుట దుర్లభ మన్నచమత్కార మిం దున్నది. "కుంతలేశ్వరుఁ" డనగా కుంతలములకే ప్రభు వని చమత్కారమును గ్రహింపవచ్చునుగదా !

"చోళవల్లభునకు సురవధూమధురాధ
రము లిచ్చి మధురాపురంబుఁ గొనియె"

(1 ఆ - 13 ప)

చోళరాజున కేదో యిచ్చి దానికి బదులుగా ఆయననుండి మధురా నగరిని గొనినట్లు పైపైచూపున కనిపించుచున్నను - మధురాపుర మునకుబదులు మధురాధరము లిచ్చినట్లు చెప్పుట - లో నారసి చూడగా - ఆయనను వీరస్వర్గమున కంపి, యారాజుపురమును కైవస మొనర్చుకొన్నట్లు తోఁచుట - ఈచమత్కారము చక్కగా నున్నది.

8. ఆరూఢోన్నతిచే కృష్ణరాయుడు రాజ్యసింహాసన మారోహింపగా విరోధులు గహనశైలారోహాముం జేసి రఁట ! విరోధు లున్న సింహాసనమునుండి దిగజాఱినను - నెత్తైనస్థానమున (గహనమైన) కొండకొమ్మున వా రున్నట్లుచెప్పుట విచిత్రమేకదా !

9. "మును వొకకొండవీటికడ మూఁతత రుద్రుఁడు కృష్ణనందనున్
మనసిజునిన్ హరించె - నది మానుషమే ? నరసేంద్రుకృష్ణరా
యనృపతి కొండవీట శరణాగతుఁ డైనప్రతాపరుద్రనం
దనుఁ డగువీరభద్రుఁ గరుణామతిఁ గాఁచె జగత్ప్రసిద్ధిగన్"

(1 ఆ - 21 ప)

కృష్ణరాయలు తనకొండవీటిదండయాత్రలో ప్రతాపరుద్రగజపతి కుమారుఁడైనవీరభద్రగజపతిని చంపక విడిచిపెట్టినవిషయము చమత్కార ముగా నిందు వర్ణింపబడినది. "రుద్రుడు (శివుడు) కొండవీటికడ (కైలాసముకడ) కృష్ణునికొడు కైనమన్మథుని భస్మము చేసినాడు.

ఆక్రోధమును మనసులో పెట్టుకొనక కొండవీటికడ (ప్రతాప) రుద్ర నందనుఁ డైన వీరభద్రుని కృష్ణరాయలు కాచినాఁ డఁట ! శ్రీకృష్ణునికిని శ్రీకృష్ణరాయలకును నభేదము వ్యంగ్యము.

" కోరి తొలుమేనఁ దన కైనకొదువ లెల్ల
మాన్చుకొనఁ గోరి భువనైకమాన్యలీల
నవతరించినకృష్ణుఁ డౌ ననఁగ "

మించినకృష్ణరాయలు " చక్రవర్తిమహాప్రశస్తి నాఁడును నేఁడుఁ జెలఁగి ధర్మక్రమస్థితి ఘటించె" నని శ్లేషించి, తిమ్మకవిఆయభేదమును వ్యంగ్య మొనర్చుటద్వారా అదనముగా నొకచమత్కారమును సాధించి నాడు. " [1] తనకొడుకును జంపినవానికొడుకును గాచినకృష్ణుడే (కృష్ణ రాయలే) యుదారుఁ డని కవి చమత్కరించినాఁడు !

10. " వినుకొండ (కనుక దానిని) మాటమాత్రన " హరించుట, " కూటముల్ సెదరంగ గొండవీ " డగలించుట, " బెల్లముకొండయ చ్చెల్ల జెఱచుట, " " కంబంబుమెట్టు గ్రక్కున నదల్చుట " - ఈపద ప్రయోగము తిమ్మకవిరచనావైచిత్రిని జాటును.

11. భగవంతుఁ డైనకృష్ణుడే కృష్ణరాయలుగా నవతరించె (1 ఆ - 17 ప) నని చెప్పినతిమ్మకవి ఆకృష్ణునివలెనే ఈకృష్ణరాయలు కూడ ధూర్తారిధరిత్రీవరసంగతి సుభగంభావుకరణముదితకలహాపారణముని " యనుట సమంజసముగా నున్నది.

12. షష్ఠ్యంతములలో తిమ్మకవి శ్రీకృష్ణరాయలను " విబుధసదయుఁడు "గా (1 ఆ - 26 ప) వర్ణించినాడు. ప్రభు వట్టివాడు. కను కనే కవుల కెంతో చన విచ్చి మన్నించినాడు. కనుకనే

---

1, సారస్వతనీరాజనము - పుట 67. డా. యస్వీజోగారావుగారు.

"ప్రతివర్షవసంతోత్సవ
కుతుకాగతసుకవినికరగుంభితకావ్య
స్మృతిరోమాంచవిశంకిత
చతురాంతఃపురవధూప్రసాదనరసికా !"

యని కృష్ణరాయలను సంబోధించుధైర్యము తిమ్మకవికి చిక్కినది.

13. "ఏయేవేళల నేసరోజముఖి యేయేలీలలం గోరుఁ దా
నాయావేళల నాసరోజముఖి నాయాలీలలం దేల్చి యే
చాయం జూచినఁ దాన యై మెలఁగుచున్ సౌఖ్యాబ్ధి నోలాడు భో
గాయత్తుం డయి పెక్కురూపముల మాయాకల్పనాచాతురిన్"
(1 ఆ - 40 ప)

ఈపద్యములో శైలీవిన్యాసమును, వల్లీపల్లవునిబహుముఖవాల్లభ్యమును, సులభప్రసన్నతయును గోచరించును. దక్షిణనాయకుడు శ్రీకృష్ణుడు. ఏసరోజముఖి యేలీలఁ గోరునో యిక్కడ చెప్పలేదు-కాని, కావ్యాంతమున

"భోజకన్యాసరిద్రాజహంసము - సత్య
భామాశుకీకేళిపంజరమ్ము"

అనుపద్యమున తిమ్మకవి వివరించినాడు. కృష్ణుడు భోజకన్యామనసున విహరించుచు, సత్యభామాశుకికి కేళిపంజర మై, నిశకు చంద్రోదయము వలె దర్శనమాత్రముచేతనే జాంబవతికి శోభ నిచ్చుచు, సరోజినియం దిందిందిరమువలె కాళిందితో క్రీడించుచు, కలాపినిని ప్రావృడంబుద మట్లు భద్రను పులకింపజేయుచు, రసాలమున పికమట్లు సుదంతతో మెలగుచు, వనికి చైత్రాగమమువలె మిత్రవిందకు శోభ గూర్చుచు, హారయష్టికకు నాయకరత్నమువలె లక్షణకు ప్రకాశమిచ్చుచు, షోడశ సహస్రకామినీధేనుకావారణేంద్ర మనఁబరగి, యఖిలావనైకవర్తిష్ణుడై, సౌఖ్యాంబునిధి నోలలాడినాఁ డఁట !

"పెక్కు-రూపముల" నుండుటచే ఆయనది కానిరూపము లేదు కదా!

"ఏచాయం జూచినఁ దాన యై మెలఁగు" వాఁడు కనుక రుక్మిణీసౌధమున తా నున్నను సర్వాంతర్యామి యై సత్యభామచేష్టలను కనిపెట్టుచునే యున్నాఁ డని సూచన!

14. "జడలు మోక్షద్రుపల్లవశంక సేయ
గగనమునమండి వచ్చె నాకస్మికముగ
నారివేరంపుఁ దపసి దైత్యారికడకు"
(1 ఆ - 44 ప)

ఆరివేరంపుఁదపసి కనుక ఈనారదుడు పెట్టినకలహము కారణముగా స్వర్గమునుండి పారిజాతము భూమికి దిగి వచ్చుట యనుభవిష్యత్కథ చమత్కారముగా నీనారదాగమనములో సూచింపబడినది. అసుర సంయమివరునిరాకచే తాను "కృతార్థుఁడ నైతి" నన్నాడు కృష్ణుడు. పారిజాతమును దివినుండి భువికి దించుటయే ఆకృతార్థత. ఈభావ మింతచిత్రముగా చెప్పబడినది!

"హే! విశ్వజనీనచరిత! యెఱుఁగనె నిన్నున్?"

అన్నాడు నారదుడు. అనగా శ్రీకృష్ణునిసంకల్ప మేమో నారదుఁ డెఱుంగు నన్నమాట! ఆసంకల్పానుసారమే నారదుడు భూలోకమునకు వచ్చినాఁ డని దీనినిబట్టి స్పష్ట మగును.

15. సోమకాసురుని సంహరించి నీవు ప్రామినుకులను దెచ్చి యీకున్నచో లోకమున వైదికక్రతువులే లేక – యింద్రాదులకు హవిర్భాగము లుండెడివే కా వనియు – అవన్నియు న టుంచి, ముఖ్యముగా

"తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పులఁ గూటి
చవిఁ దేల్చినట్టికచ్ఛపము నీవ!"
(1 ఆ - 49 ప)

అనగా నీదయవలననే వేల్పులకు అమృతాహార మబ్బిన దనియు, లేనిచో వారు కూటికి మోము వాచువా రనియు, అట్టియింద్రాదులు నీకు శాశ్వతముగా ఋణపడియున్నారు కనుక నీ వడుగగానే వారు పారిజాతతరువు నీయవలసినబాధ్యత వారిపై నున్న దనియు - ఇంతయర్థ మీమాటలలో నిమిడి యున్నది.

"దితిజు మెట్టినయాపొట్టిదిట్ట వీవ!"

అనగా - నీవు తలంచికొన్నచో - ఆదితిజుని మెట్టినట్లే అదితిజునికూడ మెట్టగల వనియు - నీసంకల్పమునకు వికల్పము లేదు - అనియు నారదునియాంతర్యము.

నారదుడు విష్ణునిదశావతారములను ప్రశంసించుచున్నట్లు కనిపించునీసంభాషణములో నిన్ని యంతరార్థములు నిన్ని కలహబీజములు నున్నవి! ఈరచన నిట్లు చేయుట తిమ్మకవిగారికి సహజముగానే యబ్బినవిద్య.

16. "ద్వారక వైకుంఠపురం
బీరుక్మిణి లక్ష్మి - మీరలిచ్చట నునికిన్
సారెకుఁ గొల్వఁగ వత్తును
గోరికతోఁ గంసహర! ముకుంద! మురారీ!"
(1 ఆ - 51 ప)

ఇది యథాలాపముగా నన్నమాట కాదు - ఇంతటితో తనరాకపోక లాగిపోవట! మరల వత్తు ననుచున్నాడు. ఎందులకు? సత్యభామచే పుణ్యకవ్రతము చేయించి కృష్ణునితో కలసి తా నొకయాట యాడుటకు! ఓహో! తిమ్మకవిగారిగంటము సహృదయులగుండెపొలములలో రస ధారలు పెల్లుబుకునట్లు చేసినది!

17. నారదుడు పారిజాతపుష్పమును తనకు సమర్పింపగానే కృష్ణుడు "భీష్మకనందనఁ గనుగొని సత్యభామ తలపున నిలువన్"

కంటితో మాత్రమే రుక్మిణిని, మనసుతో సత్యభామను చూచినాడు! ఆయనమనసునిండ నున్నది సత్యయే – రుక్మిణి కానేకాదు. ఆపారిజాతము సత్యభామకే చెందవలె నని కృష్ణునిసంకల్పము. చివరి కాపరమేశ్వరసంకల్పమే నెఱవేఱినది.

"ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో
మది సాత్రాజితి - దాని కే నిపుడు ప్రేమం బంపినన్ ?"
(1 ఆ - 54 ప)

ఈ "ప్రేమన్" అన్నది పాదపూరణార్థము వేసినవ్యర్థపదము కాదు. కృష్ణునిప్రేమ యంతయు సత్యభామయందే యున్న దని ఆకృష్ణుడే యనుకొన్నాడు. ఆమాట పెదవి దాటినచో రుక్మిణి చిన్నబుచ్చుకొనును కదా. చిట్టచివరకు భగవంతుఁడైనకృష్ణునిసంకల్పము నెఱవేఱినది! పారిజాతసుమమే యన నేల? ఆతరువే యామెకు పెరటిచెట్టయినది!

అదిసరే – ఇక్కడ కృష్ణు డేమి చేసినాడు? మునినాథుని కన్నుసన్న నిచ్చినాడు రుక్మిణికి – ఆనారదుడు రుక్మిణికి పూవి మ్మని తననోటితో చెప్పలేదు – మౌనముగానే యుండి కనుసైగ చేసినాడు. ఆయనకన్నుకూడ మౌనముగానే సైగ చేసినది. కనుక "మునినాథుని కన్నుసన్న" నిచ్చినట్లు తిమ్మన సార్థకపదప్రయోగము చేసినాడు. కృష్ణుడు నిండుమనస్సుతో పారిజాతపుపూవును రుక్మిణి కీయలేదు. కనుకనే ఆయనకనుగవలో చిన్ననవ్వుమాత్రమే తొలకినది. అది నిండైన నవ్వు కాదు. మాలాకారుడు పూవువెనుక పూవును గ్రుచ్చినట్లు ప్రత్యక్షరమును ఆచి తూచి వేసినతిమ్మకవి యెంతమెలకువగా నీకావ్యమును రచించినాడో మఱి!

18. ఆనారదుడు జలజాసనుపట్టి – అయినను కలహాసంభ్రమపరుడు. (1 ఆ – 57 ప) ఆయనలోనియీకలహాసంభ్రమపరత్వమే ఆయన

నూర్ధ్వలోకమునుండి క్రిందికి దిగజారునట్లు చేసినది! పారిజాతమహిమను వర్ణించుచు నారదుడు :

> " జలజాక్షి! యిది పారిజాతప్రసూనంబు
> నరులకు ధరియింప నరిది సూవె
> పౌలోమి పార్వతి పద్మ పద్మజురాణి
> యను శిరంబునఁ దాల్తు రనుదినంబు
> హరిబహిఃప్రాణంబ వగుట నేఁ డెఱిఁగంగ
> వచ్చ నీ కిపు డిది యిచ్చెఁ గాన "
>
> (1 ఆ - 58 ప)

" ఈరుక్మిణి లక్ష్మి " (1 ఆ - 51 ప) యని నారదు డిదివఱకే చెప్పుటచే నామె నరాంగన కా దనుట నిశ్చయమే. మఱి - మానవాంగన యెవ్వరు? సత్యభామ - ఆమె కిది ధరియింప నరిది - అని యామెను రెచ్చగొట్టుటయే నారదునియుద్దేశము.

పసిబిడ్డలను బుగ్గ గిల్లి యేడిపించి, వా రేడ్చుచుండగా ముద్దు పెట్టుకొందురు కొందఱు! అట్టిది యీనారదునితత్త్వము! ముందుగా సత్యభామ నేడిపించి యాపిమ్మట నామెను సంతోషపెట్టుట ఆయన సరదా. ఆయన దే మున్నది? అది యంతయు కృష్ణలీల!

పారిజాతము ననుదినము ధరించువారిలో పౌలోమిపేరే ముందుగా చెప్పినాఁ డేమి? ఆమె కన్ను మిన్ను గానక వచ్చిన యతిథులనుసైతము చిన్నబుచ్చుస్థితిలో నున్న దని సంస్కృతగ్రంథము చెప్పుచున్నది. కనుక సత్యాకృష్ణులచే పౌలోమిపరాభవ మొనరింపజేయవలె ననియే నారదు డామెపేరును ముందుగా చెప్పుట జరిగినది.

ఇంత చేసి - రుక్మిణిని " హరిబహిఃప్రాణంబవు " అన్నాఁ డేమి? " నీవు హరి కివ్వలిదానవే - ఆయనలో నున్నది - ప్రాణములో ప్రాణ మైనది సత్యభామయేసుమా! " అని గడుసరి యైననారదుడు

సూచించినాడు ! ఆయమాయికురాలు రుక్మిణి యీయంతరార్థమును గ్రహించినట్లు లేదు !

19. పారిజాతమును నెత్తికొప్పున చెరివికొన్నరుక్మిణిని "అలినీలాలక !" అని సంబోధించినాడు నారదుడు. ఆమెనీలాలకములు అలిసమూహామువలె నామెముఖపద్మమున ముసరుకొనుచున్న వన్నమాట ! అలికిని, విరికిని కలహొత్తు సహృదయు లెఱిగినదే – ఈపూ వామెయలినీలకైశ్యమును జేరినది. సరే. పూ విచ్చినవాఁ డాయాలుమగలను సుఖముగా నుండుఁ డని దీవించుటకుబదులు – "లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబుఁ గల్పించు" ననుట యేల ?

ఇంద్రోపేంద్రులనడుమ నిక జరుగనున్నది ఆయుధములతోడి సంగరమే – కనుక. లేనిచో – ఆమాటనే వాడనక్కఱ లేదు. రతి యని కాని – సురత మని కాని – యనవచ్చునుకదా !

" నెలకొని వేసవిఁ జలువయుఁ జలివేళల నుష్ణగుణము సముచితభంగిం గలిగించు నీలతాంతము." – అనగా నాపూవు వారినివాస మందిరములో సమశీతోష్ణస్థితిని (AIR-CONDITION) సమకూర్చు నన్నమాట !

"కూపోదకం వటచ్ఛాయా
తాంబూలం తరుణీ కుచం
శీతకాలే భవే దుష్ణం
ఉష్ణకాలే తు శీతలం"

ఈ వస్తువులలో పారిజాతముకూడ చేరు నన్నమాట !

అంతమాత్రమే యైనచో దానిలో పస లేదు. అది సరసాన్న ప్రదానము, అశుభనివారణము, మీదుమిక్కిలి – సవతులు వచ్చి రుక్మిణిచరణసారసయుగ్మము నాశ్రయించునట్లు చేయుట – ఇ వన్నియు రుక్మిణికి కావలసినవే.

20. " ఇన్నిదినంబులున్ సవతు లిందఱిలో నల సత్యభామకన్
సన్నలఁ ద్రిమ్మరున్ హరిహిశంవదుఁ డై యన విందుఁ గాని - యో
కన్నియ ! నీయెడం గలుగుగారవ మెయ్యెడఁ జూచి కాన "

(1 ఆ - 65 ప)

అన్నాడు నారదుడు. ఇది నిజమే. ఇన్నిదినములే కాదు - అన్నిదినములును హరి సత్యభామకనుసన్నలఁ ద్రిమ్మరువాఁడే. ఆమెయందంతప్రేమ యున్నది. రుక్మిణియందు గారవ (గౌరవ) మున్నది. అది పట్టమహిషి యన్న గౌరవము. తనయందారాధనాభావముతో రుక్మిణి తన్ను పెండ్లాడినది. అందుచే రుక్మిణియందు కృష్ణునికి గౌరవ మున్నది. మఱి - సత్యభామ తన్ను ప్రేమస్వరూపునిగా చూచుకొనుచున్నది. ఆమె తన్ను కన్నులలో నుంచుకొనక క్షణమైన నుండలేదు. అందుచే నామెకనుసన్నలలోనే కృష్ణుడు ద్రిమ్మరుచున్నాడు. భగవంతుడు తన్నెవ రెట్లు చూచిన వారి నట్లు కటాక్షించును. ఇది యిందలిరహస్యము. ఈతత్త్వ మెఱింగినవాడు నారదుడు.

21. " చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ బే
రెక్కినదాన నంచుఁ బతి యెంతయు నా కనురక్తుఁ డంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య...."

(1 ఆ - 66 ప)

ఇది సత్యభామయందు నారదుడు చూచినలోపము. ఇంతకాలమును సత్యభామచూపిన నిక్కెక్క లెక్కలోనిదా? ఇటుపై నామె స్వర్గమంతమెత్తునకు నిక్క నున్నది. ఆమెని క్కెకపట్టమున నణగునది కాదు. ఆమెయహంభావము నణచి సవతుల నామె గౌరవించునట్లు చేయుటకును, ఆసత్యభామావిధేయుని తనదాసుడుగా చూపి సత్యభామ నిక్కడంచుటకును, నామెచే ముందుముందు పుణ్యకవ్రతము చేయించనున్న నారదుఁ డన్నమాట లివి.

కృష్ణునిగౌరవమున కర్హురా లైనరుక్మిణికి పారిజాతము పరిమితకాలము (ఒకవత్సరము) మాత్రమే యుండగా భగవంతునిప్రేమకు నోచుకొన్నసత్యభామకు పారిజాతతరు వారామనిత్య మగుట విశేషము.

"మగుడ నివ్విరి తరుణీ ! అల పారిజాతతరువున కరుగున్" (1 ఆ – 67వపద్యము) అప్పటి కాతరు వుండునది సత్యభామపెరటిలో. ఇది మఱింతచిత్ర మైనవిషయము. రుక్మిణి కేవలము కృష్ణభక్తురాలు మాత్రమే. కాగా – సత్యభామ శృంగారరసాధిదేవత. ఆమెబహిరంతర వాతావరణమే అట్టిది. ఆమన్మథజనకునిప్రేయసి యకుగు మోపునణు వణువునను మన్మథపరివారమే. శృంగారవనములో గిరి. ఆగిరిపొంత పూఁదేనియ యేటికాలువ. ఆదరిని చెంగల్వపుప్వొల్లు నించినచంద్రో పలవేది. అలికులరావములు, కిసిలయములు, కిసలయాకులకోకిలకాకు కాకలీకలకలనాదములు. కమ్మనితమ్మికొలంకు తెమ్మెరలు – అన్నియు శృంగారభావోద్దీపకములే.

మన్మథసామగ్రీసామగ్ర్యపరిపూర్ణ సురభిళమైనయాపూవుఁ దోఁటలో – పువుబోణి సత్య ఒంటరితన మనుభవించుచున్నది. కమ్మని తమ్మికొలముగుండెనిండ నలికులములు చేరి ఝుమ్మని కమ్మనిగాన ముతో పులకింపజేయుచున్నవి. ఆప్రణయినిహృత్పద్మమును పులకింప జేయుకృష్ణభృంగముమాత్ర మచ్చుట లేదు.

22. అంతట నొక్కనాఁడు – ధవళాంబుజనేత్రుఁడు వచ్చి రుక్మిణీ కాంతగృహమ్ములోన శశికాంతశిలామయవేదిమీఁద నేకాంతము నందు జూదమత్యంతవినోదకేలిమెయి నాడుచున్నాడు. ఇప్పుడే కాదు– నిత్యజీవితములో రుక్మిణీసత్యభామలజీవితములతో జూద మాడుచునే యున్నాడు. రుక్మిణిదగ్గరజూదములో గెలిచినను సత్యభామతోడి జూదములో నోడిపోయినాడు. ఆయోటమికి కారణ మక్కడ నున్న మృగాయతనేత్రలు. వారిలో సత్యభామచెలికత్తె ముఖ్యురాలు. ఆమె

ఆయతనేత్రయే కాని - అందు - మృగముపోలిక లున్నవి. తనచర్యల వలన తనపలుకులవలన నెదుటివారిమన సెట్లు నొచ్చునో యన్నజ్ఞానము లేనిది. పెంచినవారిపట్ల నభిమానముగా నుండుట యొక్కటే మృగమునకు తెలియును. సత్యభామచెలికత్తెలో నీలక్షణము పుష్కలముగా నున్నది. ఆమెయట్టి దని యాధవళాంబుజనేత్రుఁ డెఱుంగును. కనుక "సాత్రాజితిబోఁటి నావలనఁ దా నేమేమి కల్పించెనో" యని కంగారు పడుచునే యున్నాఁడు. ఆయనమనస్సు మనస్సులో లేదు. అది సత్యభామకడ నున్నది. నారదుఁ డాడినపలుకులు వేఱువేఱన సఖులు తమ తమదేవేరులకు విన్నవింపగా వారు చిన్నవోయియు (1 ఆ - 68 ప) నెట్టెటో మనసున సరిపెట్టుకొన్నారు. (1 ఆ - 69 ప)

ఈసత్యభామచెలికత్తెమాత్ర మింకను నేమేమి జరుగునో చూతమని తక్కినరాణులదాసీజనులు వెళ్ళిపోయినను రుక్మిణిసౌధముననే యుండి యాలస్యముగా సత్యభామామందిరమునకు వచ్చినది. కనుకనే తిమ్మకవి కృష్ణుని యితరభార్యలు మనసున సమాధానపడిరని (1 ఆ - 69 ప) చెప్పి, యీ చెలికత్తెసంభాషణమును 75 వపద్యములో ప్రారంభింపజేసినాడు. ఈనడిమికాల మంతయు నీచెలికత్తె రుక్మిణీమందిరముననే యున్న దన్నమాట ! పద్యములపూర్వాపరస్థితిని బట్టికూడ కథలోనియెడము సరిదిద్దినకళాకుశలుడు తిమ్మకవి !

23. ఆసఖి వచ్చుచునే సత్యభామను చూచి, మెవోకొంప లంటుకొన్నట్లు తొట్రుపడుచు "అమ్మా ! యే మని చెప్పుదు ?" నని తన సంభాషణ మారంభించినది. ఇది యిట్లు కావలె ననియే కలహాశనుని యాశయము. అది యీసత్యాసఖివలన నెఱవేఱినది. "నీవిభుఁడు రుక్మిణీసతిమణిసౌధమున" నున్నాఁ డన్నది.

"నీయింట నుండవలసినవాడు పరాయిచోటనున్నాడు సుమా !" అని హెచ్చరించుట యిం దున్నది. సత్యభామ కొక్కతెకే కృష్ణుడు మగ డైనట్లు మాట్లాడిన దామె.

24. " మి న్నంది వేగఁ గైకొవి
కన్నుల నొత్తికొని మ్రొక్కి గారవ మెసఁగన్
వెన్నుఁడు రుక్మిణి కొసఁగెను
వన్నెలఁతయుఁ గొప్పులోన నవ్విరిఁ దాల్చెన్ "

(1 ఆ - 77 ప)

అది యింటిపూవుకదా! కనుక మి న్నంది గైకొన్నాడు వెన్నుఁడు! సత్యభామతో కృష్ణుడు మి న్నంది పారిజాతతరువును వేగ గైకొను నని భవిష్యత్కథాసూచన మిం దున్నది.

" వెన్నుఁడు " - ఈశబ్దవికృతి కృష్ణునిమనోవికృతికి ప్రతీకగా నున్నది.

25 " రాజబింబాస్య రుక్మిణి తేజరిల్లె
సానఁ బట్టినమకరాంకుశస్త్ర మనఁగ "

(1 ఆ - 78 ప)

రుక్మిణి లక్ష్మికదా. సోదరుఁడైనచంద్రునిపోలిక. సత్యభామయీర్ష్యయీరాజబింబాస్యపాలిటియమువస మైనది. మకరాంకునితల్లియే యైన యామె మకరాంకుశస్త్రమో యనున ట్లొప్పుట వింత కాదు. ఈపారిజాతసుమధారణముచే నామె సానఁ బట్టినమకరాంకుశస్త్రమో యన వింతచెలువు లొలుకబోసినది. అయినను రుక్మిణికన్న నధికురాలై సత్యభామయే కృష్ణు నాకర్షించినది.

26. " ఆకుసుమంబుఁ దాల్చినమహామహిమంబునఁ దోడికామినీ
లోకము మచ్చరంబు మదిలోనఁ దొలంగి భజించుమండి " రఁట!

(1 ఆ - 79 ప)

సత్యభామ ఆతోడికామినీలోకములో చేరునది కాదు. ఎంతమహిమాన్వితమయినను ఆకుసుమప్రభావ మీామెపై పడలేదు. ఇది సత్యప్రత్యేకత.

రుక్మిణిప్రాభవమును కంటగించుకొనుసత్యభామచెలికత్తె ఆ సురలోకసుమమును "సుమ" మనక "కుసుమ" మనుట విచిత్ర మైనవిషయమే. తనయజమానురాలికి కానియీపూ వెంతగొప్పదై నను - ఆమెదృష్టిలో నది కుసుమమే. ఇది యీశబ్దప్రయోగములోని వైచిత్రి.

27. " ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు ! "

ఇది పలుకుబడిలోనిసొగసు !

"శౌరి వినంగ, రుక్మిణీకాంత వినంగ, నేను వినఁగాఁ బలికెన్ " ఇం దుత్తరోత్తరములు బలీయములు. ఇవి చాల వన్నట్లు సాభిప్రాయమైన "మానినీ!" శబ్ద మొకటి! సత్యభామలో మానరోష మును రెచ్చగొట్టుట కెంత చేయవలెనో యంతయు చేసిన దాచెలికత్తె:

28. " ఆరణభోజనుమతకము
లారుక్మిణినటన లామురాంతకుచెయ్వుల్
చేరి కనుంగొనుచో నె
వ్వారికి గోపంబు రాదు (వారిజనేత్రా) "
(1 ఆ - 81 ప)

ఎవ్వరికైనను గోపము వచ్చు నని యాచెలికత్తెయుద్దేశము. ఎవరికిని కోపము రాదు - వినోదముగా మాత్రమే యుండు నని యర్థాంతరము. యధార్థమునకు (సత్యభామకును) నామెచెలికత్తెకును గోపము వచ్చి నది కాని - నారదునికిని, శ్రీకృష్ణునికిని నొకవిధముగా నిది వినోదమే.

29. " పలు దెఱఁగుముళ్ళమాటలు
కలహమె కల్యాణ మని జగంబులవెంటన్
మెలఁగెడుమౌనికి సహజము
వల దని వారింపవలదె వల్లభు డతనిన్ ? "
(1 ఆ - 85 ప)

ముళ్ళమాట లనగా ముడులమాటలు. అనగా - వానిజుట్టు వీనికిని వీని జుట్టు వానికిని ముడిపెట్టుమాట లని పైపై యర్థము. మనసు మనసును మఱింతసన్నిహితముగా ముడి వేయుమాట లనియు నర్థము. సత్య మారసినచో సత్యాకృష్ణుల ప్రేమబంధము మఱింతగా ముడిపడుటకు నుపకరించినవి యీనారదునిమాట లేకదా !

కలహామె కల్యాణ మని జగంబుల వెంట తిరుగువాఁ డఁట నారదుడు. నిజమే. జితేంద్రియు డైనయీ దేవర్షి సత్యాకృష్ణులనడుమ కల్పించినకయ్యముచేతనే వైకుంఠ డైనమహావిష్ణు (కృష్ణుడు) వడుగు మోపుటచే సురలోకకళ్యాణమును, నొకవిధముగా నారదప్రేరణచే నింద్రోపేంద్రులకు కలిగినకలహముచే పారిజాతవృక్షము భువి కవత రింపగా ద్వారకావాసులకు కుంటితనమును, గ్రుడ్డితనమును, ముసలితన మును మొదలైనయరిష్టములు తొలంగి భూలోకమే నాకముగా మారుటచే మానవలోకకళ్యాణమును, సత్యభామకు పారిజాతతరు ప్రాప్తితోబాటు పుణ్యకవ్రతఫలప్రాప్తియు సంభవించినవి. ఇందఱి కిన్నిరకములైనకల్యాణములు ప్రాప్తించుటకు కారణము కలహాశనుని ముళ్ళమాటలేకదా ! మానరోషవివశయైనసత్యభామ నిందార్థకముగా పలికినయీపలుకులు మఱియొకవిధముగా ప్రశంసాసూచకములే యైనవి. ఇది సిద్ధహస్తు డైనతిమ్మనగారి లేఖిని మెఱయించినయింద్రజాలము !

ప్రణయకుపిత యైనసత్యభామను ప్రసన్నురాలి నొనరించు కొనుటకై యామెపాదతాడనమును సహించి, పారిజాతము నామె పెరటిచెట్టుగా నాటి, యెన్నటికిని తాను సత్యావిధేయుడనే యని నమ్మించి, సత్యభామడెందమును మఱింతగా చూఱగొన్నాడు కృష్ణుడు. ఈవిధముగా నారదుడు పెట్టినకలహము ఆయాలుమగలమనసులు మఱింతగా ముడిపడునట్లు చేయుటచే నారదునిమాటలు ఈదృష్టితో చూచినను ముళ్ళ (ముడుల) మాటలే యైనవి !

సత్యభామ విసువుదలగా నన్నమాటలలో నెంతపస యున్నదో! తిమ్మనగారిగంటమున కిరువైపుల నెంత వాడి యున్నదో!!

30. "ముని యేమి సేయు? రుక్మిణిఁ
గొనఁ గారణ మేమి? ధూర్తగోపాలుఁడు సే
సినచెయిద మేమి చెప్పుదు?"

(1 ఆ - 86 ప)

ఇక్కడ "ముని" శబ్దము సాభిప్రాయము. నోరు మెదపక ముక్కుమూసికొని పడి యుండుముని యేమి చేయగలడు? అతని కంతటియల సిచ్చినది ధూర్తుఁడైనయాపసులకాపరియే యని - సత్యభామకోపము తనకు లోకువ యైనమగనిమీఁదికే మళ్ళినది. అనాగరకుడు, అరసికుడు ననునుద్దేశముతోనే సత్యభామ "ధూర్తగోపాల" శబ్దము వాడినది.

31. "పరికింపరు తమజాడలు
తరుణులతగులములు నమ్మఁదగ దంద్రు"

(1 ఆ - 87 ప)

"గురివెందగింజ తనక్రిందినలుపెఱుంగ" దనుసామెతను గుర్తుచేయు మాట లివి!

"శరదంబుదచలచిత్తులు
పురుషులెపో వారి నమ్మఁబోలునె?"

(1 ఆ - 87 ప)

శరదంబుదము - పేరునకు మాత్రమే అంబుదము. దానిలో నంబు వుండదు. తేలికమన స్తత్వము గలమగవారు శరదంబుదమువలె అరస హృదయులై గాలి యెటు వీచిన నటు చలించిపోవుదురు. కనుక వారు చలచిత్తులు. రసహీన మైనమబ్బును నమ్ముకొన్నవారి కాశాభంగమే మిగులును. అట్లే - రసహృదయము లేనిచలచిత్తులైనపురుషులను నమ్మినప్రణయినులకు మిగులునది నిరాశయే యని సత్యభామసిద్ధాంతము.

సత్యభామ మొదలు తెలియనికోపములో నీమాట లన్నను ఆకృష్ణమేఘుఁడు రసహృదయుఁడే. ఈమె ఆయనడెందమున జాజ్వల్యమానముగా మెఱయుతటిల్లతయే! కనుకనే కృష్ణమేఘముతో కలసి యామె యందనిగగనాలలో విహరించి సురలోకమును జేరి యీప్సిత ప్రాప్తి నందగలిగినది. పురుషజాతిపై సత్యభామ తెచ్చినయభియోగము తొందరపాటుతో చేసినదే యని కాలస్వరూపు డైనకృష్ణుడు తన ప్రేమామృతవృష్టిచే నిరూపించినాడు !

32. "జలజాక్షి ! ఇది పారిజాతప్రసూనంబు"

(1 ఆ - 58 ప)

అన్నాడు రుక్మిణితో నారదుడు.

"ఆచపలాక్షి కిచ్చె నఁట యాతఁడు నవ్విరి" అని చెలికత్తెతో అన్నది సత్యభామ.

నారదునిదృష్టిలో "జలజాక్షి" గా భాసించినరుక్మిణి సత్యభామదృష్టిలో "చపలాక్షి" గా (చపలచిత్తగా) అనినది ! ఈయొక్కమాటలో సత్యభామాసపత్నీమాత్సర్యసర్వస్వమును తిమ్మకవి ప్రదర్శించినాడు.

33. "పూనుకొని మేలుగీళ్ళకు
లోనయి విహరించువారి లోక మెఱుఁగదో !
ఆనరకాసురదమనుఁడు
తా నెఱుఁగడొ ! భోజకన్య తా నెఱుఁగదొకో !"

(1 ఆ - 91 ప)

ప్రాణములకు తెగించి నరకునితోడియుద్ధమునకు పతి నంటి పోయినది తాను. కుడిచి కూర్చుండి యింటిలో కులుకుచు - 'తగుదు నమ్మా !' యని సురలోకసుమమును సిగలో తుఱిమికొన్నది తనసవతి ! ఆహా ! లోకములో న్యాయ మెక్కడ నున్నది ? యిచ్చినమగనికి వివేకము లేకున్నను - పూవును పుచ్చుకొన్నరుక్మిణికైన బుద్ధియుండవలదా ?

అన్నయా వేదనయు, అక్కసును నీమాటలలో కొట్టవచ్చినట్లు కన్పట్టు చున్నది. ఇందు ' నరకాసురదమనుడు ' శబ్దము సాభిప్రాయము. ' ఆ నరకాసురసంహారము తనప్రయోజకత్వమే యనుకొనుచున్నాఁ డావెఱ్ఱి గొల్లడు! తాను మూర్ఛిల్లినసమయమున నేనే విల్లమ్ము లందుకొననిచో నీయన యే మయ్యెడివాడో! అంత చేసిననా కింత చేసినకృతఘ్ను డీపసులకాపరి ' – ఇవి యాయనురాగరసతరంగిణి యైనసత్యభామలో నిక్కడ పొంగి పొరలెడుభావతరంగములు.

34. " కలకాల మొక్కగతిఁ బూ
సలలో దారంబుమాడ్కి సతిమదిలోనన్
మెలఁగెడుపురుషులు గలుగుట
తొలుజన్మమునోముఫలము (తోయజనేత్రా)

(1 ఆ - 93 ప)

ఇది సత్యభామకోరిక. ఇది యిట్లే జరిగినది. ఎట్లనగా – దార మొక్కటే కాని–అది యేకకాలమున నెన్నో పూసలలో నంతర్లీనముగా నుండును. అట్లే కృష్ణుడు తా నొక్కడే యనేకానేకభార్యలలో నేక కాలమున విహరించుచున్నాడు. ఏదో – మాటవరుసకు " పూసలలో దారమువలె సతిమదిలో పురుషుడు మెలగవలె నన్నది కాని – తానే సతి ననియు, తన (యొక్కతె) తోమాత్రమే యాత డుండవలె ననియు – అది తొలుజన్మలనోముఫలముగామాత్రమే ప్రాప్తించు ననియు సత్యభామయాంతర్యము.

తాను కొఱనోములు నోచుటచేతనే తనపతి యన్యకాంతా సక్తుఁడైనాఁ డన్నవేదన సత్యభామమనసులో నున్నది. కనుకనే నారదుడు పుణ్యకవ్రతప్రసక్తి తేగానే ఆవ్రతాచరణమున కామె సిద్ధపడినది.

35. " కలలోననైన నవ్వులకైన నామాట
జవదాఁట వెఱచు నో చంద్రవదన !

యేపదార్థంబు నాయెదుటఁ బెట్టకమున్న
యెవ్వారి కొవఁగఁ దోయిగురుఁబోఁడి :
(1 ఆ - 94 ప)

అన్నది సత్యభామ. ఇది యథార్థమే. ఆమెయెదుట పెట్టక పారిజాత పుష్పమును రుక్మిణి కిచ్చిననేరమునకు ప్రాయశ్చిత్తముగా కృష్ణుఁ డింద్రునితో పోరి పారిజాతవృక్షమునే పెకలించి తెచ్చి సత్యభామ పెరటిచెట్టుగా నాటినాడు.

" చెలులు నాతో నేమి చెప్పుదురో యని
లంచంబు లిచ్చు నోచంచలాక్షి :

ఇదియును సత్యమే. " చెంతం బొంచి వీక్షించిపోయినసాత్రాజితిబోఁటి నావలనఁ దా నేమేమి కల్పించెనో " యని సందేహించుచు కృష్ణుఁ డతిథిగా వచ్చినదేవర్షి నికూడ విడిచి యరదము నెక్కి- కేతనపటాంచల చంచల మైనతాల్మితో, తురగజవంబు మున్ గడవఁద్రోచి కడంగెడు తత్తరంబుతో, సత్యసముదంచితకాంచనసౌధవీథికి చనుదెంచినాడు. చిన్నబోయినసత్యమేడను జూచి " పద్మముఖితోడ నెవ్వరేఁ బారిజాత పుష్పవృత్తాంత మెఱిఁగింపఁబోలునొక్కొ ? " యని యారాట మంది నాడు.

" కనకపంజరశారికలకుఁ జక్కెర వెట్టి
చదివింప రేలొకో సకియ లిపుడు ?
కరతాళగతుల మందిరమయూరంబుల
నాడింప రేలొకో యతివ లిపుడు ?
క్రొవ్వాడిగోళ్ళఁ దంత్రులు మీటి వీణియల్
వలికింప రేలొకో భామ లిపుడు ?
కలికిరాయంచబోదల నెల్ల నెలయించి
నడిపింప రేలొకో పడఁతు లిపుడు ?
ఇన్నిదినములవలె నుండ దేమి నేఁడు ?
చిన్నబోయిన దీమేడ చెప్పు దళిగి "
(1 ఆ - 106 ప)

ఈమాటలు కవివి కావు. సత్యభామసౌధమును జూచి కృష్ణుడు తనలో తా ననుకొన్నవి. నేరము చేసినవాడు కృష్ణుడుకదా ! కనుక సత్యభామ కోసమై ఆ వెదకులాట – ఆయవస్థ ఆయననే పడనిమ్ము – మన కేమి పట్టినది ? అన్నట్లు కవి తెరమఱుఁ గై యపరాధి యైనకృష్ణునే ముందు నకు నెట్టినాడు.

" పద్మముఖితోడ నెవ్వరేఁ బారిజాతపుష్పవృత్తాంత మెఱిఁగించిరేమో "

యనుకొనుకృష్ణునియాందోళనమును జాటునీపద్దెము ముద్దు లొలుకు చున్నది.

36. మానరోషము మనసును గలంపగా హరిచందనకోటరమునకు నాగ తరుణివలె సత్యభామ కోపసదనమున కేగినది. (1 ఆ – 98 ప) హరి చందనపరిమళముచే నాగతరుణి కుద్ధతి హెచ్చునట్లు కోపసదనవాసము సత్యభామయుద్ధతిని పెంచినది. ఆయుద్ధతి పాదాక్రాంతు డైనపతిశిరము నామె తాడించునంతవఱకును హెచ్చినది.

కోటరమునవలెనే కోపగృహమునకూడ చీఁకటి నిండి యుండుటచే నీపోలిక సముచితముగా నున్నది.

హరిచందన మనగా మంచిగంధపుచెట్టనియే కాక – కల్ప వృక్షమనియు నర్థ మున్నది కనుక భవిష్యత్తున సత్యభామ పారిజాత తరువును సమీపించు ననువిషయ మీయుపమానమున ధ్వనించుచున్నది.

37. మచ్చర మనువిస మాపాదమస్తకము వ్యాపింపగా సత్య భామకు పెల్లగుమోహము, నెవ్వగ, కంపము, స్వేదము, విన్నఁబాటు పరితాపమును గలిగిన వఁట. (1 ఆ – 100 ప) సత్యభామలో పొడ సూపినయీసాత్త్వికభావములను సర్పదష్టలలో పొడసూపునవలక్షణము లుగా శ్లేషించుట చమత్కారముగా నున్నది. ఈపోలిక యపూర్వము.

38. " ఈలలితాంగిచంద మొకయించుక చూచెద నంచు ధూర్తగో
పాలుఁడు తాలవృంత మొకభామిని సత్యపిఱుంద నుండి మం
దానిలలీలమై విసర నాదటఁ గైకొని వీచెఁ దద్వపుః
కీలితపంచసాయకశిఖిం దరిగొల్పుచు నున్నకైవడిన్ "

(1 ఆ - 109 ప)

"ధూర్తగోపాలుఁడు చేసినచెయిద మేమి చెప్పుదు? " నని సత్య భామ యింతకుముందు కృష్ణుని నిందించినది. తిమ్మకవికూడ సత్యతో గొంతు కలిపి "ధూర్తగోపాలుఁ" డని యదేమాట తానును ననుచు న్నాడు.

ఒక్కసారి స్పృశించినంతనే పారిజాతపరిమళములు కృష్ణునితో సత్యాకోపసదనమునకు వచ్చినది. పారిజాతమును తాకినచేతితో తాలవృంతమును పట్టి కొంటెగా సత్యకు విసరుచున్నాడు కృష్ణుడు. అంతట నంతటను పారిజాతకుసుమాగతనూతనదివ్యవాసన లలమికొని, యాపూవు పంచసాయకునస్త్ర* మగుటచే సత్యలోనిపంచసాయకశిఖిని కృష్ణుడు దరికొల్పిన ట్లయినది. ఇది ధూర్తచర్యయే కదా! గోకుల ములో గోపికలను నవ్వులాటలకైనను నేడిపించినవాడే యీగోపాలుడు. ఆలక్షణము కృష్ణునిలో నెప్పటికిని పోలేదు. కనుకనే కవికూడ కృష్ణుని 'ధూర్తగోపాలుఁ' డనుచున్నాడు. ఆధూర్తత్వమునకు తగినప్రతిఫల ముగా సత్యభామాపాదతాడనము ననుభవించినాడు. అయినను రసికా వతంసుడు కనుక కాంతాపాదస్పర్శకే పులకించి "నను భవదీయ దాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తాఁచిన నది నాకు మన్న నయ" యని సంతృప్తిపడినాడు.

---

* " అరవింద మశోకంచ
చూతంచ నవమల్లికా
నీలోత్పలంచ పంచైతే
పంచబాణస్య సాయకాః " - అమరకోశము.

39. " ఓ ర్వాకయింత లేనివికచోత్పలలోచనచిత్తవీధిఁ జి
లార్పఁగ నీలనీరదశుభాంగుఁడు వే ననుదెంచె నంచు "

(1 ఆ - 112 ప)

కందర్పహుతాశనుని వెలికిఁ దార్చుసఖుండునుబోలె వేఁడినిట్టూర్పు దళంబుగా నిగిడె నఁట ! ఆనీలనీరదశుభాంగునిహృదయమునఁ దటిల్లత యై వర్తించు లావణ్యసీమ సత్యభామ. ఈనీరదశ్యాముఁ డాతటిల్లతతో నాకాశపుటంచుల కెగిరి యమరలోకమున కేగి, మొదట చల్లని వాడుగా గోచరించి, పారిజాతపరిమళములను పుడమిని గుబాళింపజేయు యత్నమున నుండగా తన కడ్డువచ్చినవజ్రధారిని శరవర్షమున ముంచివేసి సకలాశాంతముల నాక్రమింపబోవుకథ యంతయు నీయొక్కయుపమాన ములో స్ఫురించుచున్నది.

ఈవిధముగా తిమ్మనగారిరచనలో నక్షరరమ్యతయే కాక యర్థగాంభీర్యమును గలదు. కనుకనే తిమ్మకవిమాటలు ముద్దుల మాటలు.

40. మానక్రోధములచే కుమారిలుచున్నసత్యను జేరి కృష్ణుడు
" ఇందునిభాస్య ! మైతొడవు లేల ధరింపవు ? నున్నకావు లీ
వెందును మానలేవు, తెలు పేటికిఁ గట్టితి ? వీటికారుచుల్
కెందలిరాకుమోవిఁ దులకింపగఁ జేయక యున్కి యేమి ? నీ
చందము వింత యయ్యెడు, నిజంబుగ నా కెఱుఁగంగఁ జెప్పుమా "

(1 ఆ - 119 ప)

ఆమాయామానుషవిగ్రహుడు తానుమాత్రము తనచందము నామెకు చెప్పడు - ఆమె చందమును చెప్పవలె ననుచున్నాడు. "ఈలలి తాంగిచంద మొకయించుక చూచెద" నని వచ్చినవాడు తాను

" మన మరయం దలంచి యొకమార్గము వన్నితొ ? నవ్వటాలకో ?
నను వెఱపించెదో ? అకట ! నాయెడ నిక్కము తప్పుగల్గెనో ? "

అని యేమియు నెఱుఁగనట్లు మాట్లాడుచున్నాడు. ఇదియొకవిచిత్ర మైనసన్ని వేశము.

41. సత్యాపాదతాడనము నందినకృష్ణుడు "అల్కమానవుకదా యిఁకనైన నరాళకుంతలా!" యని ప్రాధేయపడగా నామానినీతిలకము మే యుఱ దోఁప (నిక్కి) లేచి, పీడినజుట్టుముడిని వెడనెడఁ దోపుచు, పైటచెఱఁగును గ్రక్కునఁ జనుదోయిని జేర్చినది. ఇవన్నియుఁ దనయధరమును, పరీరంభమును, కటాక్షమును గోరినకృష్ణునికి తనయం దున్న కోరికను మఱింతగాఁ బెంచుటకై చేసినపనులు కావచ్చును – ఈక్రియ లన్నియు స్త్రీజాతిసహజములు. మోమున లేఁజెమ రంకురించుట యామెయులసటనుకాని కోపమునుకాని, యామెలోనిసాత్వికభావో దయమును గాని సూచించును. ఆమె చలితాధరపల్లవాగ్ర యగుట యామానినిమానరోషమునే ప్రకటించును. జంకెననెఱిచూపు చూచుట యాతరువాత నామె పలుకనున్ననిష్ఠురోక్తులకు నాంది. ఆమెదృష్టిలో కృష్ణుడు అరసికుడైనపసులకాపరి. మోసగాఁడు. ఈభావము నామె మనసులో దాచుకొనలేదు. "ఎఱుంగునే పసులకాపరి భావజమర్మ కర్మముల్?" అని మోమోట విడిచి కృష్ణుని మోముపైనే యొక్క దులుపు దులిపినది.

కృష్ణుని వల్లవీకింకరుడుగా, పవిత్రప్రణయిని యైనతనగుట్టును దోఁచుకొన్నమాయలవాఁడుగా నామె వర్ణించినది.

42. తాను చేసినపని కామెమనసు మానరోషముచే మండిపోవు చుండగా

" వాలుఁగన్నుల నునుసిగ్గు నూల్కొనఁ గనుంగొన వేల ?
యురఃస్థలంబుఁ జన్నుల నెదురొత్తి మక్కువ ననున్
బిగికౌఁగిటఁ జేర్ప వేఁటికే చిలుకలకొల్కి ! "

యని మనసున పట్టరానిమదనోద్రేకమును బ్రదర్శించినాడు. ఆమెకోప భర మెప్పాటను దీర్పరాక యాజగన్నాటకసూత్రధారి యాప్రణయిని కర్నిలి మ్రొక్కి యామెపాదతాడన మంది, యది మన్ననగా నెంచి మనసును సమాధానపఱచుకొని యానీరజనాభుఁడు సత్యభామను నిండు కౌగిట బుజ్జగించినాడు. నీరజనాభుడు కనుక తనచల్లనికౌఁగిలింతచే నామెతాపమును హరించినాఁ డని చమత్కారము.

ఆరమణీలలామమది నంటినకోపభరము – సహజముగా నుండి నది కాదు. – ఆమది నంటినకోపభరము అంబుదశ్యామునిస్పర్శచే కరగి జాఱిపోయినది. ఆయనగర్భితమధురవాక్కుల కామె కడిమిచెట్టువలె నిలువెల్ల పులకించినది.

43. "ఇటఁ దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్" (1 ఆ–135 ప) అని పలుకునంబుదశ్యామునిగర్జామధురవాక్యముల సత్యామానిని నీపల తికవోలెం గనుపట్టె సఖీమయూరికలు సెలరేఁగన్" (1 ఆ–137 ప) అన్నాడు తిమ్మకవి.

"శరదంబుదచలచిత్తుఁ" డని (1 ఆ–87 ప) సత్యభామ నిరసించినకృష్ణుని "నీలనీరదశుభాంగుఁడు"గా, "అంబుదశ్యాముఁడు" గా నభివర్ణించి, సత్యభామ ప్రయోగించిన "శరదంబుదచలచిత్తుఁ" డనునిందను తిమ్మకవి ఖండించినాడు. కృష్ణుడు "ధూర్తగోపాలుఁ" డన్నసత్యభామమాటను సమర్థించినతిమ్మకవి యిక్కడ కృష్ణునిపక్షము వహించి, తననిష్పాక్షికతను నిలబెట్టుకొనుట నిజముగా విచిత్రమే మఱి!

"ప్రామినుకులపూఁబోఁడుల
సీమంతపుఁజెందిరంబుచే బలె నరుణ
శ్రీ మించునతనిపదముల
భామామణి యొత్తు పయిఁడిపావలు తొడిగెన్"
(2 ఆ - 7 ప)

శ్రీకృష్ణుడు వేదాంతవేద్యుడు. ఆయనపాదములు అరుణశ్రీరంజిత ములు. ఇట్లనుటకుబదులుగా నాయనపాదముల నాశ్రయించినయుపని షద్భామలపాపటలయందలిసిందూరపుబొట్టుచే శ్రీకృష్ణునిపాదము లెఱ్ఱని కాంతితో ప్రకాశించిన వనుచున్నాడు కవి. ఈభావసౌకుమార్యమును, ఈయుక్తివైచిత్రియు ముద్దులు మూటగట్టుచున్నవి.

45. " కంపనలీలమై నసదుఁగొ నసియాడఁ గుచద్వయంబు న
ర్తింప లలాటరేఖ చెమరింపఁగ హారలతాగుళుచ్ఛముల్
తుంపెసలాడఁ గంకణమృదుధ్వని తాళగతిం జెలంగఁగా
నంపెఁగమానె యంబె నొకచంద్రనిభానన కంసవైరికిన్ "

(2 ఆ - 9 ప)

ఈవర్ణనము పురుషాయితక్రీడానిమగ్నురాలైనయొకయంగనయంగ భంగిమలను నితరలక్షణములను గుర్తుచేయుట విచిత్ర మయినవిష యము. కవి యెదోవర్ణనము చేయుచుండగా శృంగారరసప్రధాన మైన యీకావ్యమున నిట్టిభావము స్ఫురించుట గమనింపదగినవిశేషము.

46. " తామరదోయిలోఁ దగిలి దాఁగెడుతేఁటులవోలెఁ బెన్నెఱుల్
వేమఱు చేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులం
గోమలలీల దువ్వి తెలిగొజ్జఁగినీ రెడఁ జల్లి చల్లి గం
ధామలకంబు వెట్టె నొకయంగన కాళియనాగభేదికిన్ "

(2 ఆ - 10 ప)

కృష్ణునిస్నానవేళ నొకయంగన ఆయనపెన్నెఱులను తనరెండుచేతు లతో పిడిచి విప్పి విదిర్చినది. ఆమెచేతులు తామరపూలవలెను, ఆయన పెన్నెఱులు తేఁటులవలెను, నుండుటచే - తామరదోయిలోఁ దవిలి దాఁగెడుతేఁటుల ట్లున్న వని కవి వర్ణించినాడు. మధురాతిమధుర మైన విచిత్ర మైనభావన యిది.

47. శ్రీకృష్ణునిస్నానవేళ నొక్కలేఁజిగురుఁబోఁడి కొనగోళ్ళతో నెఱులు చిక్కులు వాపి మెల పొలయ శిర సార్చెనఁట. ఆమె చిగురుఁ

బోఁడి కనుక నామెకొనగోటితాకిడి శ్రీహరికి నొప్పి కలిగింపలే దని కవిహృదయము. (2 ఆ - 12 ప)

" వెన్నెలనిగ్గులు వెదజల్లెడుమడుంగు
అందిచ్చె నొక్కపూర్ణేందువదన "
(2 ఆ - 12 ప)

పూర్ణేందువదన కావుననే వెన్నెలనిగ్గులు వెదజల్లుమడుంగు లిచ్చె ననుట సాభిప్రాయము. అట్లే " విరులసరు లిచ్చె నొకయరవిందగంధి '' యన్నప్పుడును సాభిప్రాయపదప్రయోగమే చేయబడినది.

48. మజ్జన మాడి దువ్వలువలు ధరించినకృష్ణునికి కొందఱు నెలఁతలు ముత్యాలహారతు లిచ్చి రఁట. (2 ఆ-13 ప) అప్పుడులక్ష్మీనిలయుఁ డైనయాజగన్మోహనునియతనుశోభకు వాల్గంటులకంటితళుకు లును, మణిదీపశిఖలును తడబడిన వఁట ! మణిదీపశిఖలును వాల్గంటుల కన్నులతళుకలును పోటీపడి యేవిగొప్పవో తేల్చుకొనలేక తడబడిన వనియును, నారెండును నామన్మథజనకునిసోయగముముందు డిందువడిన వనియును నర్థము లిందు స్ఫురించుచున్నవి.

49. తనకు నమస్కరించినసత్యభామతో నారదుడు

" పతి నీ వై విహరింపఁగా జనము సంభావింపఁగా బంధుసం
తతి నిన్నుం గొనియాడఁగా సవతికాంతల్ సూచి లజ్జింపఁగా
నతులప్రాభవవైభవోన్నతులఁబ్రో వై యిట్లు వర్తించునీ
కితరస్త్రీజనబుద్ధి దీవనలు నే నే మిచ్చెదన్ మానినీ ; "
(2 ఆ - 24 ప)

అన్నాడు. " పతియే నీవు - నీవే పతి - మీరిరువురు నేకాత్మనా వర్తించునాలుమగలు '' - అని యొకయర్థము. " ఈకృష్ణునికి నీవే మగడవు '' అని యంతరార్థము. ఆయనకు నీవు లోబడి యుండుటకు

బదులు నీవే ఆయనను లోబరచుకొన్నావు " అని చెప్పినపుడు పీమాట లలో గర్భిత మై యున్నది.

" అనికై నం బళి నిన్నుఁ బాసి చనునో ? " (2 ఆ - 25 ప)
ఇది గతమునకు (నరకాసురవధకు) ను, భవిష్యత్తు (ఇంద్రునితోడి పోరు) నకునుకూడ వర్తించువిషయము.

" చనవుల్ నీవలె నెవ్వరేఁ గనిరొ " - " మితిమీరిన చనవు గైకొని నీవలె పతిని పాదముతో తాడించినవా రెందైన నుందురా ? " యని వ్యంగ్యము.

" అటులైనం గాని మ్మో
కుటిలాలక ! నీకు మగఁడు కోరినకోర్కుల్
ఘటియించుఁగాక తా నెం
తటికార్యంబైన డించి నాదీవనలన్ "
(2 ఆ - 28 ప)

కృష్ణుడు కోపగృహమున సత్యాపాద తాడన మంది, యామెను " అరాళకుంతలా ! " యని సంబోధింపగా - నారదుడు పదిమందియెదుటను " కుటిలాలక ! " యని సాభిప్రాయముగా నామెను సంబోధించినాడు. నారదుఁ డామెనుకుకుచేష్టను దివ్యదృష్టిచే నెఱింగియే వ్యంగ్యధోరణిలో నీమాట నన్నట్లు స్పష్టమే. లేనిచో నామెకుటిలాలకలప్రసక్తి యాదివ్యర్థి కవసరము లేదు. ఇట్టిది యొకవిచిత్ర మైనసన్నివేశము.

ఇక నారదుఁ డిచ్చినయాదీవన యింద్రోపేంద్రులకు పారిజాతతరువిషయమున జరుగబోవుసంఘర్షణకు సూచన. ఈవిధముగా ఆరివేరంపుఁదపసి తాను ద్వారకకు వచ్చినపనిని యథేచ్ఛముగా ముగించుకొన్నాడు.

50. " అదితి మెఱుంగి కుండలము లానరకుండు హరించె, వాని నేఁ
గదనములోనఁ ద్రుంచి యని కైకొని దాఁచితి నాఁటనుండియున్ "
(2 ఆ - 28 ప)

అని యింద్రాదిదేవతలకు తాను చేసినయుపకారమును స్మరించి, ఆ కుండలముల నప్పగించుటకై నేనే స్వయముగా వచ్చుచున్నా నని దేవేంద్రుని వంచించి పారిజాతమును గొనకొంచి కలహాశనసంయమిచే గోపవధూవంచకు డంపినవర్తమాన మిది. ఇక్కడ 'కలహాశన సంయమి,' "గోపవధూవంచకుఁడు –" అనుపదములు సాభిప్రాయ ములు.

51. "యాదవీజనమదిరారసారుణవిశాలదృగంచలవంచకచ్ఛవితో దినకరమండలం బపరదిగ్గిరికూటమును జేరిన" దఁట ! (2 ఆ – 29 ప)

ఈవంచనాప్రసక్తి యుపేంద్రు డింద్రుని వంచింపబోవుటకు సూచనగా నున్నది.

52. "ఇనుదెసఁ జూడ నోడి తల లెత్తక నీటఁ దదీయబింబమున్
గని వగఁ జక్కవల్ మొగమొగంబులు సూచుచుఁ గుంది మూర్ఛఁ జెం
దినదెసఁ జూడలేక జలదేవత 'హా' యని కన్నుమోడ్చెనా
వనరుహముల్ ముడింగె" (2 ఆ - 31 ప)

నని చెప్పుచు కవి "సహవాసులదుఃఖము నెయ్యు రోర్తురే ?" యను నర్థాంతరన్యాసమును నిక్షేపించి, సత్యభామదుఃఖము నామెనెయ్యుఁడైనకృష్ణుఁ డోర్వజాలఁ డనియు, నామెకోరిక తీర్చుటకై పారిజాత హరణమునకుఁ గడంగు ననియు సూచించినాడు తిమ్మకవి. ప్రకృతివర్ణనలో నీవిధముగా కథను ధ్వనింపజేయుట మహాకవిమార్గము.

53. "ఒకభృంగంబు పరాశిపీమదనతంత్రోన్మాది ప్రాణేశ్వరిన్
మకరందాసవమత్త నబ్జగృహసీమం బెట్టి తాఁ బోయి"
(2 ఆ - 33 ప)

దఁట !

ఏకపత్నీవ్రతమును ద్రోసిపుచ్చి, నిద్రావివశయైన తిరుమల దేవిని (తత్పాదస్పర్శకు కినిసి) విడిచిపోయి చిన్నాదేవితో విహరించు శ్రీకృష్ణరాయల (నన్యాపదేశముగా) నీభృంగవర్ణనమిషమున తిమ్మకవి ధ్వనిమార్గమున తప్పు పట్టుచున్నాడు !

54. జగతి నాక్రమించినయంధకారము "తనమణి పడిపోవ ధరణీతలంబున నెమకంగ వచ్చిననింగి యనంగ" నున్న దట ! స్వర్గలోకము పారిజాతతరువును గోల్పోవుట కిది సూచన.

55. " చిలుకతేరును నల్లచెఱకువిల్లును గల్వ
విరితూపు నిత్తుము మరుఁడ : నీకు
వనమాలికయు నూత్నవంశనాళమును విం
ఛము సమర్పింతుము శౌరి : నీకుఁ
గప్పుఁ గప్పడమును, గుస్తూరియును గాటు
కయు నివేదింతుము కాళి : నీకు
నేరేడుపండ్లు వినీలచామరలు దూ
ర్వలు, నొసంగుదు మిభవక్త్ర : నీకు
నిట్టిలోకోపకారికి నిరులవౌరకుఁ
జంద్రసూర్యాదిదుర్దోషశాంతి వొదలి
నిత్యత వహింపఁజేయంగ నేర్తురేని
యనుచుఁ బ్రార్థించి రభిసారికాబ్జముఖులు "
(2 ఆ - 35 ప)

చిలుకరంగు పచ్చన. అయినను పచ్చఁదనమును నల్లఁదనముగా వర్ణించుట కవిసమయము [1]

---

1. " మాతా మరకతశ్యామా మాతంగీ మదశాలినీ
కుర్యా త్కటాక్షం కల్యాణీ కదంబవనవాసినీ "
— కాళిదాసవిరచితదేవీ స్తవము.

2. " శుకాంగనీలోపలనిర్మితానాం "
అన్నాఁడు మాఘుఁడు

తాము సమర్పించునల్లనివస్తుసముదాయమును స్వీకరించి, తమకు నల్లనిచీఁకటినే దయచేయు మని యభిసారికలు కోరుకొనుట మిక్కిలి సరసముగా నున్నది. ఆయా దేవతలవస్తువులనే వారివారి కుపహారములుగా నిత్తుమనుట యిదొకచమత్కారము!

56. నక్షత్రములు "జగము గెల్వంగ దండెత్తుమగనిమీఁద లీల రతి చల్లుదీవనఁబ్రాలనంగ" నున్న వఁట! (2 ఆ - 37 ప) ఆరాత్రి సత్యాసౌధమున శ్రీకృష్ణుఁ డున్నాఁడు. వారిశృంగారమున కీవర్ణన మొకసముచితమైనసూచన.

57. చంద్రోదయావసరమున తూర్పున తోఁచుపాండిమము కృష్ణుడు పారిజాతమును హరించు నని యింద్రరాజ్యలక్ష్మిముఖమండలంబున వసించినవెల్లఁదనముకైవడి నున్న దఁట! (2 ఆ - 38 ప) ప్రకృతివర్ణనలో నిట్లు కథను జోడించుటయు,, కావ్యార్థసూచన చేయుటయు సిద్ధహస్తులైనకవులసంప్రదాయము.

58. "తారకాధీశుకిరణకదంబకంబు
చిలికెఁ బలుచనివలిపంపుజిలుఁగుమంచుఁ
గైరవశ్రీవధూకరగ్రహణవేళ
వెలికిఁ గ్రమ్మినసాత్త్వికస్వేద మనఁగ"
(2 ఆ - 48 ప)

సమకాలీనులైనపెద్దనాదికవులు

"సహసానఖంపచస్తనదత్తపరిరంభ
మామూలపరిచుంబితాధరోష్ఠ"

మిత్యాదిగా రతివర్ణన మొనర్చుప్రబంధయుగమున తా నుండియు, ఏటి కెదురీది, శృంగారరసప్రధానమైనతనప్రబంధమున నంగనలయంగ ప్రత్యంగవర్ణనమునకును, నాయికానాయకరతివర్ణనమునకును పాల్పడక ప్రకృతివర్ణనలోనే కావ్యగతమైనశృంగారరసమును సుకుమారముగా ధ్వనింపజేసినతిమ్మకవినిగ్రహము కొనియాడదగినది.

59. శృంగారరసమున కుద్దీపనవిభావము లైనవానిలో వెన్నెల యొకటి. విరహులమై సోఁకి వేఁడి యౌ వెన్నెల, కలువపువ్వొళ్ళు చేఁగస లైనవెన్నెల, చంద్రకాంతపునీటఁజా లైనవెన్నెల, సతులమై పూఁతఁ బిసాళించు వెన్నెల – (2 ఆ – 49 ప) తమరచనలో నిన్ని విధము లైనవెన్నెలలచలువలు కురియించినకవులు తెలుగులో నెంద రున్నారు?

60. " కామినీమానమేఘశ్రేణి విరియంగఁ
దొగతెల్లగుంపులు దొంగలింప

నభినవశరత్సమాగమం బనఁగ మించు
నట్టిరాకానిశావేళ నలరువింట
గొనయ మెక్కించి వలరాజు కిముక మీఱ
విరహిజనములపై దండు వెడలె నపుడు "

(2 ఆ - 50 ప)

మబ్బులు తొలగిపోవుట, తెల్లపొదలు విరియుట, నీరు నిర్మల మగుట, పంకము లింకుట, జలధు లుప్పొంగుట, జాజులు ముకుళించుట, హంసలు చెలరేఁగుట – అనునవి శరత్కాలధర్మములు. రాబోవు యుద్ధమును సూచించుటకై శరద్వర్ణన మొనర్చుట కవిసంప్రదాయము. వసంతర్తువర్ణనమును, చంద్రోదయాదివర్ణనమును శృంగారరస సూచనలు.

సత్యాకృష్ణులు ద్వారకలో శృంగారకేళీవినోదముల నున్న ఘట్ట మిది. అందుచే చంద్రోదయవర్ణన మీసన్నివేశమున సార్థకతను సంతరించుకొన్నది.

61. " వేణుప్రమానియందు వేడుకపడుకూర్మి
సతులకోర్కిఁ దీర్పఁజాలి యపుడు
హరియు హరియు.... (5 ఆ - 23 ప)

పోరు " ఘట్టము ముందుముందు రా నున్నది. దానిని సూచించుటకై శరదృతువర్ణన మొనర్చుట సముచిత మైనమార్గమే. ఆవీరత్వప్రదర్శనమునకు కారణ మీశృంగారము, కనుక అంగి యైనశృంగారమున తదంగ మైనవీరరసపూరంగు లద్దుటకై కవి యిక్కడ చంద్రోదయధర్మములను, శరత్కాలధర్మములను మేళవించి, యపూర్వ మైనకవితా వైచిత్రినిఁ బ్రదర్శించినాడు !

62. " నలినాప్తుండు మదీయబంధు లని తా నక్షత్రసంఘంబులన్
గలపన్ వచ్చుచు నున్నవాఁ డనుచు ము న్గల్గంగ నాత్మీయశి
ష్యుల మందేహులఁ బో రొనర్పఁ జను దంచుం బంపి యేతెంచెనాఁ
బొడమెన్ వేగురుఁజుక్క కాలఫణభృద్భోగోల్లసద్రత్నమై "

(2 ఆ - 54 ప)

తెలతెలవారుచుండగా మింట శుక్రనక్షత్రోదయ మైనది. స్వపక్షనక్షత్రసంఘరక్షణకై నలినాప్తు నెదిరింపు డని తూర్పుదెసకు తనశిష్యులైనమందేహుల నంపి, యావెనుక తానును వచ్చెనో యనునట్లు - కాలసర్పశిరోమాణిక్య మై వేగురుఁజుక్క పొడమినదఁట ! మందేహులు సూర్యుని బాధింతురు రనియు, ద్విజసమర్పితార్ఘ్యప్రదానబలముచే సూర్యుడు మందేహులబారినుండి తప్పించుకొను ననియు వేదము చెప్పుచున్నది. తూర్పుదెస జరుగుయుద్ధమునుగూర్చి చెప్పుచు, తిమ్మకవిగారి వేదపాండిత్యమును చాటుచున్నయీపద్యమున - స్వర్గమున కృష్ణునితోడి పోరున ప్రాగ్దిశాధినాథుఁ డైనయింద్రుని కాలసర్పము కాటువేయుట వ్యజ్యమాన మైనది.

63 " శరధిక్రోడనివేశ ! శార్ఙ్గధర ! శిష్టధ్యేయ ! శీతాంశుభా
స్కరనేత్రద్వయ ! శుభ్రపంకరుహభాస్వన్నాభ ! శూరాన్వయా
భరణా ! శేషశయాన ! శైలధర ! శోభారమ్యసర్వాంగ ! శౌ
ర్యరసోదంచిత ! శంఖచక్రధర ! శర్వాణీసహాయప్రియా ! "

(2 ఆ - 57 ప)

ప్రతిసమాసమునందును తొలియక్షరములు గుణితక్రమములో నుండుటచే చిత్రకవిత్వమున కీపద్య ముదాహరణముగా నుండి తిమ్మనగారిరచనా వైచిత్రిని ప్రదర్శించుచున్నది.

64. "జలరుహమిత్రుఁ డాత్మరుచిసంపదఁ జీఁకటిబం దెకానికిం
గలఁగుచు వీవిలోన నిడి క్రైకొన నమ్మికకాఁపు లంచుఁ జ
క్కఁదొర యెండదాడి విని గ్రక్కునఁ దాను గాంతి వీవిలో
వల నెలకొల్పెనాఁ బలుకఁబాతె నిశాంతనిశాంతదీపముల్"

(2 ఆ - 60 ప)

అస్తమించువేళ చీఁకటిని మునుంగఁబోవుచున్న నభోమణి తనకాంతిసంపదను పుడమి నుండుగృహదీపములకడ న్యాసముగా నుంచి, మనోనైర్మల్యము గలిగి నమ్మికకాఁపులై నయాదీపములనుండి మరునాటియుదయమే గైకొనుచున్నాఁడఁట. ఆకాశమునందలిసూర్యకాంతి న్యాసముగా భూమిని చేరునట్లే ఓడిపోయినయింద్రుడు చీఁకట్ల నడంచుపరంజ్యోతియైనకృష్ణునికి పారిజాతము తనచీకటిరోజులలో కొంతకాల ముండి మరల తనకు ప్రాప్తించువిధముగా నమ్మికకాఁపైనకృష్ణుని కర్పింపనున్నాడు. ఈన్యాసము ఆన్యాసమునకు సమాంతరసంఘటనము.

65. "సమయాభీరకుమారుఁ డేపునఁ దమిస్రారూపన క్తంచరిం
గమలారి స్తనమండలాంకవిషసంక్రాంతప్రభాదుగ్ధపూ
రముతో రూ పణఁ జేయ శోషిలుచుఁ దారల్ సోల నిట్టూర్పు సాం
ద్రముగా నూర్చె ననంగఁ బె ల్లెసఁగెఁ బ్రాతఃకాలవాతూలముల్"

(2 ఆ - 62 ప)

ఇది యొకయపూర్వ మయిన విచిత్ర మైనవర్ణనము. ఇందు కాల పురుషుడుగా వర్ణింపబడినబాలగోపాలుడే అసురసంహారమున నింతగా పరాక్రమించె ననుటచే నవలీలగా నమరుల జయింపగల డని యిందు సూచింపబడినది.

66. కృష్ణుడు పతంగపుంగవుని తలంపగనే తార్క్ష్యుడాయనదగ్గరకు వచ్చుట సంకల్పసిద్ధుడైనకృష్ణభగవానునిమహిమను చాటును.

వజ్రంబునకు నీఁక వైచినబలిశాలి యీగరుత్మంతుడు. (2 ఆ – 72 ప) అదితి వర్ణించినట్లు మత్స్యావతారములో తన "వాలముతాకునన్ గిరులు వజ్రనిపాతము సంస్మరింప" జేసినజగజెట్టి యీ కృష్ణుడు. (3 ఆ – 28 ప)

"జననిదాస్యంబు నీఁగినకులశ్రేష్ఠుం" డీపతంగపుంగవుడు. నరకుని జంపి నరకాపహృతకుండలములను దేవమాత యైనయదితి కర్పింపనున్నవాఁ డీయుపేంద్రుడు.

"దుర్లభామృతపశ్యతోహరు" డాయన – దుర్లభామరతరుపశ్యతోహరు డీయన!

"కమలాప్తసారథిగారాబుతమ్ము" డాయన – అమరేశుగారాబుతమ్ము డీయుపేంద్రుడు.

"కశ్యపకృతపుణ్యకర్మఫల" మాగరుత్మంతుడు – అదితి కశ్యపపుణ్యఫల మీహరి.

"ఈహరికి తగినవాహన మాగరుత్మంతుడు. ఆపక్షిరాజునకు కూర్చుప్రభు వీనారాయణుడు. ఇట్టివా రిరువురును గలసిన నెట్టికార్యమైనను సఫలము కావలసినదే.

67. "మునిపతిరాకయు, గుసుమముం దన కిచ్చినలాగు, రుక్మిణీవనితకుఁ దా నొసంగుటయు, మానినికోపము, వేడికొంటయుం దనదు ప్రతిజ్ఞయు తార్క్ష్యునకెంతో యాదరమున తెలుపుటనుబట్టి ఆగరుత్మంతుడీకృష్ణుని కెంతటియాంతరంగికుడో స్పష్టము కా గలదు.

బలాసురవైరి తనపక్షముఁ గొన్ననాఁటిపగ తీర్చుకొందు నన్నాడు పక్షిరాజు. "నీవంతటివాడవే" యని వెన్నుడు వెన్ను తట్టినాడు.

68. సత్యాకృష్ణులు విహగావతంసమునంసము నధిరోహించి యమరలోకమునకు పయన మైనారు.

ఎక్కె విహగాధిపుఁ దానును సత్యభామయున్" (2 ఆ - 76ప) "ఎక్కిరి" - యనుటకు బదులుగా "ఎక్కె" నని యేకవచనప్రయోగమును చేయుటచే సత్యాకృష్ణు లిద్ద రైనను నొక్కరుగానే లెక్క యని కవి చెప్పిన ట్లయినది.

వారి కిరుగ్రేవల నందకశార్ఙ్గరథాంగగదాయుధములు వచ్చినవి. ఇది సమరసూచన. గరుత్మంతునిఱెక్కలగాలికి విష్ణునిపాంచజన్యము తనంత తానుగా ఘుమఘుమ మ్రోసినది. (2 ఆ - 78 ప) ఈఘుమఘుమమ యన్నది పరిమళమునకు సూచన. కనుక అది విజేత యై విష్ణువు సురభిళపారిజాతముతో తిరిగి వచ్చుటకు చిహ్నముగా మ్రోసిన విజయశంఖ మని ఇక్కడ నర్థము చెప్పుకొనవలసియున్నది. విష్ణునికి శుభసూచనగా కవి యీపద్యమును (2 ఆ - 78 ప) చెప్పినాడు.

69. గగనతలలక్ష్మి కానుక పెట్టినమౌక్తికస్తబక మనునట్లు అంబుధరజాలముక్తము లైనజలకణములు సాత్రాజితికై శికమున పాలిచిన వఁట! (2 ఆ - 79 ప) ఈస్తబకశబ్దము పారిజాతస్తబకమునకు సూచన. కనుక నామె పారిజాతమును స్వర్గమునుండి కానుకగా గొని వచ్చు నని ధ్వని.

70. తమ్ముఁడైనయీగరుత్మంతునిఱెక్కలగాడ్పునకు సూర్యరథరజ్జువు లైనపన్నగములు తట్టుకొనలేక రథముక్రిందికి పోయినవి. ఆరథాశ్వములునొగలనుండి వదలించుకొని నిలువగా తాను నడుపురథమును

సరిచేయుట కాయనయన్నయనూరు డెంతో శ్రమపడవలసివచ్చినది. అట్లే తనతమ్ము డైనయీాయుపేంద్రునిదెబ్బకు తట్టుకొనలేక నీఁకముం దాయనయన్న మైనయింద్రు డెంతో చిక్కుపడుట చిత్రముగా నిందు వ్యజ్యమాన మైనది (2 ఆ - 82 ప)

71. కృష్ణుడు అంతవఱ కెన్నడును నామార్గము చూడనియిల్లాలి కాయాదృశ్యములు సవిశేషముగా పరిచయము చేసినాడు. ఎట్టయెదుట మేరువు కనిపించినది. అందములో ఆబంగారుకొండ రెండవదైన తేయుఁడే. అందములోమాత్రమే కాదు - అదియు గరుడనివలె వజ్రపుదెబ్బ తిన్నది. ఆదెబ్బతో రెక్కలు తెగి అది నగ మై చతికిలబడగా దేవత లందఱును దానినె త్తెక్కి యున్నారు. ఆదెబ్బ తిన్నను నొకయీాఁక మాత్రము వైచి ఈగరుడ డెప్పటివలె ఖగరాజుగానే యుండి మఱి యొకసారి యమరేంద్రునిమీాఁదికి దూసికొనిపోవుచున్నాడు. ఆమేరు నగము దేవతలకోరికలు తీర్చుచుండగా - నీఖగరాజు శ్రీమహావిష్ణుని మనోరథమును దీర్చుటకై ఆయనను సపత్నీకముగా నమరావతికి చేర్చుచున్నాడు.

72. ఆమరుత్కుధరము జీర్ణపర్ణద్రుసంకీర్ణాహిమాణివిభామాయాకిసలవంచ్యమానపిక మఁట! అంతే కాదు - అది శశికాంతరుచిమృషాసలిలసంస్ఖాలనశ్లథివిషాణోద్విగ్నసైరిభమఁట! గోమేధికప్రభాంకూరమిథ్యామధుద్రవలిలిహౌమిళద్భల్లుక మఁట! మఱియు - నీలగండప్రస్తరాళీకగజభేదశీర్యన్నఖముఖోద్ధసింహాకుల మఁట! గారుడాచ్ఛచ్ఛవిచ్ఛటాకపటయవసపూతికాచర్వణవ్యగ్రశాలమృగవిలంఘ్యమానాబ్జరాగశిలావితానకూటదావాగ్ని యఁట! ఆదేవనగమున నిన్నివిధములుగా భ్రాంతి రాజ్యము చేయుచున్నది. ఈభ్రాంతి - ఉపేంద్రుడు తనకు తమ్ముడే కనుక బలాదివిషయము లన్నిటిలోను దనకన్న చాలచిన్నవాడే యనుకొనుచున్నయమరేంద్రునిభ్రాంతికి ప్రతీకగా నున్నది. (2-86 ప)

73. ఆగిరిసానువులందు చెంచెతలు వంచనమై పొంచి, చేరువకు వచ్చినచంద్రునిజింక నేసి హర్షించియు, దత్సుధారసనిషేచనచే నది చావకుండుట చూచి, యేటు తప్పె నని లజ్జించి, చేతివిల్లమ్ములను పారవైతు రఁట! ఇవి కృష్ణభగవానునివాక్కులు. చావు లేనిజింకను చంపబూనిభంగపాటు నందినచెంచెతలస్థితి యిందు వర్ణింపబడినది. అప జయము లేనిశ్రీకృష్ణుని జయింపవచ్చు నను భ్రాంతితో ఆయనపై వజ్రాయుధమును విసరినదేవేంద్రునిభంగపా టేకముందు తటస్థింపబోవు చున్నది. ఈచెంచెతలు జ్ఞానము లేనివారు. ఆయింద్రుడును భగవంతుని పట్ల నజ్ఞానిగానే ప్రవర్తించినాడు! ఆచెంచెతలు లజ్జించి పారవేయుటకు వారిచేతులలో విల్లమ్ములైన మిగిలినవి — ఈయింద్రు డట్లు లజ్జించి పారవేయుట కేమియు మిగులలేదు. ఆయన కుండినయొక్కగానొక్క యాయుధము (వజ్రాయుధము) శ్రీహరిచే చిక్కువడిపోయినది. వేఱు గతి లేక ఉపేంద్రుని కింద్రుడు పాదాక్రాంతు డై "సామ్మన నెద్ది? యే ననఁగ సొమ్మన కెవ్వఁడ? కర్త వీవు — నీసొమ్మఖిలప్రపంచమును"— అని లొంగిపోయి పారిజాతతరు వాహరి కర్పించి, "నీవు భూలోకమును విడిచినపిమ్మటనైన నాతరువును నా కి" మ్మని ప్రాధేయపడి — శ్రీకృష్ణు డుదారముగా తిరిగి యిచ్చినవజ్రాయుధమును పుచ్చుకొన్నాడు.

ఈచెంచెతలభంగపాటును వర్ణించుటలో తిమ్మనగారిదృష్టి అంతదూరము సాగివచ్చినది. "నానృషిః కురుతే కావ్యం". అణువు నుండి బ్రహ్మాండమువఱకును కవిసునిశితకవితాదృష్టిముం దొదిగి పోవనివిషయ ముండదు. అంతర్దృష్టి లైనకవులు భూతభవిష్యద్వర్త మానముల నొకేవిధముగా సందర్శించి, వాని కొకసమైక్యమును సాధించుటే వారిపని. ఇప్పుడు తిమ్మనగారు చేసిన దిదియే.

74. ఆపసిడికొండ నుండుబాలశిఖావళములు "అత్యంతనిర్మల స్ఫటికాధిత్యకలం గానవచ్చుపాతాళవాతాశిప్రతిబింబంబులం గని మును తమకలచినయురగంబులం బొఱవిడు" నఁట! ఇచ్చటను భ్రాంతియే వర్ణింపబడినది.

75. ఆబంగరుకొండయందు దొక్కొక్కచోట కొండచిలువ లున్న వట! అవి "సురపతితటుచుమెఱుఁగు లడరుకటకుభిదురము గొని తటిమి మెఱకలు విఱుగ నటికినయెడల సెలలకు నిడినజలగపోలుపు నంజుల నెరగొని పొరలుజరదజగరనికరంబు" లఁట! తిమ్మనగారి దెంతటియూహావైచిత్రియో!!

76. ఆపసిడికొండ "సుధర్మాప్రదేశంబునుంబోలె శక్రపుర మహిళాలికుచచందనసుగంధాగురువాతపోతమేదుర" మఁట! "జల నిధియునుంబోలె నీలనలపనసకీలితతుంగసేతుసహిత" మఁట! "వల్లకి యునుంబోలె లలితప్రవాళకకుభ" మ్మఁట! "భారతంబునుంబోలె శతపర్వచమత్కృతం బఁట! "సంగీతంబునుంబోలెనిషాదభరితం" బఁట! "గ్రావనిబద్ధఘనౌఘం" బయ్యు నగ్రావనిబద్ధఘనౌఘం" బఁట! "గవయస్థానం బయ్యును నగవయస్థానం" బఁట! "వైణ వారావాసితం బయ్యును నవైణవారావాసితం బఁట!

ఓహో! ఏమి యీసభంగాభంగశ్లేషవైచిత్రి! ఏమి యీయభేదాధ్యవసాయప్రయోగప్రావీణ్యము!! ఇంతటియనర్ఘ సాహితీసంపద నందించి పోయినతిమ్మనమహాకవిఋణము నీతెలుగుజాతి తీర్చుకొనజాలదు.

77. యదుపుంగవుఁడు చెంగట నున్నయంగనకు గంగనుం గను చూపుమేరం గానిపించి యిట్లన్నాఁడు :-

"అంగన! కనుంగొను మనంగహరమౌళితట
రంగనటి జహ్నుమునిపుంగవవిశాలో
త్సంగశిశువుం గపిలునింగలపుఁజూపుసెక
లం గలయునాసగరువంగడము మోక్షో
త్తుంగమణిసౌధమునకుం గడపుతాపగగ
నాంగణమహీతలభుజంగనిలయంబుల్

జంగ గొనునేర్పరిఁ బతంగజయనుంగుఁజెలి
యం గనఖిలాచలయుగంగ సురగంగన్ "

(2 ఆ - 94 ప)

అభంగగంగాతరంగములపొం గంతయుం గన్నులం గట్టుచున్నదికదా యీసురగంగావర్ణనము !

78. శ్రీకృష్ణునికి స్వాగత మొసంగ నెదురు వచ్చినదేవేంద్రుడు మత్తకరిని డిగ్గి, యిలానిహితాత్మశిరఃకిరీటు డైనాడు. ఇప్పటి కిలా నిహిత మైనది యింద్రునిశిరస్సే - ఇటుపై నతని పారిజాతమును ఇలా నిహితము కా నున్నది !

తనయడుగులం బడినయమరాధిపు నాదరమున హరి నూత నాంభోదము సానుమచ్చికరమును రభసమ్మునఁ గప్పుకై వడి కౌగిలించు కొన్నాడు. పర్వతము దిగువనే యుండగా నంభోదము దానిపై నుండునుకదా ! ఈయింద్రపర్వతము నాకృష్ణమేఘము శరవర్షముచే కప్పివేయుట యీయుపమానముచే వ్యంజిత మైనది. కృష్ణుడు నీలమేఘ శ్యాముడు. కనుక నీయుపమాన మన్వర్థము.

"ఓ ర్వొకయింత లేనివికచోత్పలలోచనచిత్తవీథిఁ జల్లార్పఁగ నీలనీరదశుభాంగుఁడు వేచనుదెంచె నంచు " అని యొకపర్యాయమును,

" అంబుదశ్యామునిగర్జామధురవాక్యముల సత్యామానిని నీపలతికవోలెం గనుపట్టె " నని మఱియొకమాఱును,

" తటిల్లతయున్ జలదంబు యామినీపతి వెనుకొన్నకై వడి " సత్యాకృష్ణులు భుక్తిశాలకు నారదునివెంట వెళ్ళి రని మఱొక్క పర్యాయమును,

– ఇట్లు అవకాశము చిక్కినపు డెల్ల కృష్ణుని నీలమేఘముతో పోల్చుచున్నాడు తిమ్మకవి. ఆకృష్ణుఁ డెంతరసహృదయుఁడో

ఈయింద్రుఁ డంతకఠినాత్ముఁడు! కనుకనే ఇంద్రుని సానుమచ్ఛిఖరముతో నుపమించుటయు, నతనికన్న నున్నతుఁ డైనకృష్ణు నంభోదముతో పోల్చుటయు సముచితముగా నున్నది.

79. హరి "గోత్రారీ! రమ్ము గజమ్ము నెక్కు" మని నాగారాతిపై నెక్కె" నఁట!

ఈ "అరి", "అరాతి" శబ్దప్రసక్తి యింద్రోపేంద్రుల నెయ్యములో రానున్నకయ్యమునే సూచించుచున్నది.

80. "హుడుక్కాఢక్కాపటహధ్వానము లక్కజముగఁ బొంగి నింగి యఱచినభంగి" నున్న దఁట! (8 ఆ - 9 ప) ఈనింగి యఱచుట యింద్రుని కశుభసూచన యనవచ్చును.

81. "నారదముఖామరసంయమికీర్తనీయుఁ డై వైహాయసవీథి నతసీకుసుమాసిత దేహుఁ డేఁగినా" డఁట! (8 ఆ - 10 ప)

మఱల నిక్కడ నారదుఁడు ప్రత్యక్షమైనాడు. నారదుఁ డెక్కడ నున్నను కలహమునకు ప్రతీకయే. మఱి - ఆయన సంయమి కదా! ఆయన సంయమము తప్పకయే - కలహము పెట్టినట్టుండకయే - జుట్టు జుట్టు ముడి వేయగలడు! ఆయనకలహప్రియత్వముచే సంయమము చెడి అల్లరిపా లగునది యితరులే!

82. అంతటిస్వర్గములో శ్రీకృష్ణునికి తగినసరియైనకానుక యొక్క చోటనే గోచరించిన దఁట!

"కాళియభేదిఁ జూచుతమకంబున మజ్జన మాడుచున్న నీలాలక యోర్తు గంధసలిలార్ద్రకచంబులు చన్నుదోయిపై వ్రాలిచి సందిటం జొదివి రాజపథంబున కేఁగుదెంచె" నఁట!

ఎట్లు?

" గోపాలకమూర్తి కాన శిఖిబర్హము కామకఁ దెచ్చెనో "
యమనట్లు :

(3 ఆ - 14 ప)

సముచిత మయినయీయుత్ప్రేక్షలో సౌందర్యదిదృక్షువైనకవియూహ యెంతవిచిత్రముగా సాగినదో !

83. హరినిఁజూచువేళ నొడలు చెమరించి - అలఁదినచందనము వృథ యౌ నని, సమ్మదాశ్రువులచే కనుంగవకాటుక కరిగిపోవు నని, గగుర్పాటుచే చెక్కులమకరీవిలాసము పేటు లెత్తు నని - కృష్ణ సందర్శనలాలస యైనయొకచేడియ కయిసేయవ ద్దని తనచెలికి చెప్పుచున్నది. కృష్ణునిసకలజగన్మోహనత్వ మొకవంక నీమాటలలో ధ్వనించుచుండగా - మఱియొకవంక - రతిక్రీడాఖిన్న లైనయంగనలయందు కానవచ్చుస్వేదాదిలక్షణములు వర్ణింపబడి శృంగారరసప్రధాన మైన యీకావ్యమునకు శోభను చేకూర్చుచున్నవి !

84. పద్మనాభునిఁ జూడఁగాఁ దనదేహవల్లికఁ గడల్కొను సాత్త్వికలీలను సౌధశిఖాగమనశ్రమంబున మేనునఁ గలిగినబడలిక యని బొంకిన దఁట యొక్కయన్నుతోదరి ! సాభిప్రాయపదప్రయోగములో తిమ్మనగారి దండె వేసినచేయి !

85. " వేడుక నీకె కాని మఱివేఱొకయింతికినైన లేదె ? త్రో
పాడెదవేల ? మచ్చర మొకప్పుడు మానకపోయి తీవు ; పెన్
త్రోదవు గాన నిన్నె కనుఁబో - యతఁ డెవ్వరిఁ జూడఁ డంచు నో
నాడె సపత్ని నొక్కతె మురారిఁ గనుంగొనువేళ నీసునన్ "

(3 ఆ - 16 ప)

శ్రీకృష్ణసందర్శనమాత్రముననే మగువ లింతగా మచ్చరించుకొనుచుండగా - మఱి - ఆమోహనాంగునితో కాఁపురము చేయుకాంతలలో నెంత యీర్ష్య యుండునో ! అంతవఱ కేల? ఆప్రభువును బూజించుటకై యొకేతన్వియంగకములు పరస్పర మెట్లు పోటీ పడినవో చూడుఁడు !

" దనుజనిరోధిమీఁద నొకతన్వి కరంబున లాజ లెత్తి చ
ల్లిన నెటివేణి యీసునబలెన్ విరిపూవులఁ జల్లెఁ; జల్లె లో
చనములు సమ్మదాశ్రువులు; చల్లె లలాటము ఘర్మబిందువుల్;
చనుఁగవ చల్లె సంభ్రమవశత్రుటితామలమౌక్తికాదులన్ "

(3 ఆ - 19 ప)

ఇది యెుకవిచిత్రమైనభావనకదా !

86. " అలికులవేణి యొక్కతె మురారిఁ గనుంగొని మ్రానుపాటుమై
నెలకొని యున్నచో సడలునీవిక లేఁజెమ రంటి నిల్చె; నం
జలిపరిపూర్ణలాజలను సాధ్వసకంపము తాన చల్లె; న
చ్చెలువకు సాత్త్వికోదయము చేసినమే లిఁక నేమి చెప్పుదున్, "

(3 ఆ - 17 ప)

ద్రౌపదీమానసంరక్షకుఁడైనశ్రీకృష్ణభగవానుఁడు తనదర్శనముచే పర వశించినపడంతికి మానభంగము కానిచ్చునా? ఓహో! శైవుఁడైన తిమ్మనగారికృష్ణభక్తి!! ఇట్టిభావసంపద బహుజన్మతపఃఫలముకదా!

87. " జలరుహనేత్రుఁ గాంచి సరసత్వము మీఱఁగ నొక్కవేలుపుం
జిలుకలకొల్కి రాచిలుకచేఁ బిలిపించిన సత్యభామ కా
కలికితెఱంగు శౌరి కడకన్నులఁ సన్నలఁ జూపెఁ గోపకం
దళకలుషాయితాక్షివలనంబుల నాసతి తన్నదల్పఁగన్ "

(3 ఆ - 20 ప)

చిలుకలకొల్కి చిలుకచే కబు రంపిన దఁట! ఆయిరుపురికిని గల సన్నిహితత్వ మట్టిది! ఆమెగుట్టును రట్టు చేయుట కృష్ణునికొంటె తనము! అంతే కాదు – " ఓసత్యా! సురలోకసుందరాంగులు నాపై నెంతవలపు నిలిపి యున్నారో చూడు – అయినను నేనుమాత్రము నీవాఁడనేసుమా!" అని అంతకుమున్ను ద్వారకలో తన్ననుమా నించినసత్యభామకు తనపై నమ్మకము కలిగించుటకై కృష్ణుడు చేసినపని యిది! ఇది యిట్లుండగా ఆసురసుందరి కోపకందళకలుషాయితాక్షి

వలనములచే కృష్ణు నదలించుట సహజసుందర మైనసన్నివేశము. సవ తులపీడ తాత్కాలికముగానైనను వదలించుకొని మగనితో స్వర్గ మునకు పోయినను - సవతులు కానిసవతులవంటియువతులు తటస్థించుట ఆసత్యభామజాతకమహిమ కాఁబోలును!

88. "అనిమిషపురజాలకములు
వనితాజనతామయములు - వనితలహృదయం
బనురాగరసమయం - బ
య్యనురాగము శౌరిమయము నయ్యెడ నయ్యెన్"
(8 ఆ - 21 ప)

"రసో వై సః" అనువేదవాక్యానకు చక్కనిరూపకల్పన మీపద్యము. ప్రేమస్వరూపు డైనపరమేశ్వరు డందఱివాఁడు నని - అందఱిడెంద ములం దుండువాఁ డని - ఆయనయందు లగ్న మయినయనురాగమే యనురాగ మని చెప్పునీపద్యము హృద్యముగా - కావ్యఫలశ్రుతిగా నున్నది.

89. కృష్ణుఁ డదితిని "కని సత్యారమణీయుతంబుగ నమస్కారంబు గావించి" నాఁడు. "యద్య దాచరతి శ్రేష్ఠః తత్త దేవేతరా జనాః" అని గీతాచార్యు డైనకృష్ణపరమాత్మ యర్జునుని కుపదేశించెను. కనుక నాభగవంతుడు దేవమాతకు నమస్కరించుట యితరులకు మార్గోప దేశము నాచరణపూర్వకముగా చేయుటయే.

"భౌమనిశాటాహృతకుండలద్వయము నాత్మస్వర్ణచేలాగ్రబం
ధనమున్ వీడ్చి యొసంగె"

సత్యతో కలసి తాను సంపాదించినయాకుండలములను సత్యాయుతుడు గనే దేవమాత కర్పించుట శ్రీకృష్ణునియుచితజ్ఞతను జాటును.

90. ఇంద్రమాత యుపేంద్రుని "మే నిమిరి శిరసు మూర్కొని" నది. ఇది యామెమాతృస్నేహము. తనరచనలో నింతచిన్నవిషయ

మనుకూడ నేమరకుండుట తిమ్మకవియుచితజ్ఞతాలోకజ్ఞతలకు నిదర్శనము. అదితి చేసినదశావతారస్తుతిలో నెన్నో విశేషము లున్నవి. "వర్ణనలు" అన్నశీర్షికక్రింద నవి ప్రత్యేకముగా చూపబడినవి.

91. వచ్చినపని నేమరలేదని సత్యభామకు చెప్పుటకో యనునట్లు కృష్ణుడు సత్యభామను నందనారామమునకుఁ దోడ్కొని వెళ్ళినాడు. ఘృతాచీ, మేనకా, మంజుఘోషా, రంభా, హరిణీముఖత్రిదివయోషారత్నములు వారిని సేవించుచు వెంట నున్నారు.

92. ఆనందనమున "రంభామహోరోజకుంభపరీరంభకుసుమితమైన కురవక మున్నది. మంజుఘోషావక్త్రకంజాతచకచకస్తబకితచంపకక్ష్మారుహ మున్నది. హరిణీముఖప్రసూనాసవార్పణకోరకితలతావేల్లితకేసర మున్నది. ఉర్వశీనవయావకోజ్జ్వలాంఘ్రిఘనివేశపుష్పితకంకేళిభూరుహ మున్నది. మేనకామోదనిశ్వాసమృదుసమీరకుట్మలితసిందువార మున్నది. (8 ఆ - 44 ప) ఇందలి కుసుమితము, స్తబకితము, కోరకితము, పుష్పితము, కుట్మలితము - ననుపదములు పదపదమున పారిజాతసుమమును గుర్తు చేయుచున్నవి.

తనయురోజకుంభపరీరంభముచే కురవకమును కుసుమితమొనర్చినరంభ యాసరసనే యున్నది. అట్లే తక్కినతరులతలు పుష్పవతులగుటకు దోహదము చేసినయుర్వశీమేనకాహరిణీమంజుఘోష లున్నారు. అన్ని చెట్లును నిండుగా పూచినయానందనము మనోనందనముగా, నానందకందముగా, మన్మథవిహారభూమిగా నున్నది. పద్మాజాని సత్యావధూసహితుఁడై విహరింప వచ్చినాఁడని షడృతువులు నక్కడ నొక్కసారిగా సాక్షాత్కరించిన వనుటకు నిదర్శనముగా క్రమముగా నచట విద్యున్నటీనాట్యవిలసనములు, వాపికాజలజాతవాచాలహంసవ్రజము, సేవంతికాగంధినీహారకణములు, పుష్పితఫలినీలవంగవాసితశైత్యవైభవములు, తామ్రపర్ణీజలార్ద్రచందనాచలపవమానకందళములు మల్లికాపాటలీచంపకోత్పలప్రౌఢిమములు చూపట్టినవి.

93. "గురివెందమ జైత్రుఁ డొందఁగా నలుకచే మావి యోడు
గలచినమనువాతెరమీఁదఁ గన్పట్టుపలువరుసయో యనునట్లు
ననలు పల్లవముపై మొనసిన వఁట।
(3 ఆ - 48 ప)

ఖండితనాయికగా వర్తించినసత్యభామ యడుగు మోపినయమరోద్యాన మున మఱియొకఖండితనాయికగా మావి కన్పట్టుట విచిత్రము !

94. "మలయసమీరణచ్యుతసమంచితపాండుపలాశలైనపాదుల నునుపోఁగతీఁగలను జూడగనే యదువల్లభునికి తీరవస్త్రలయి, పంక రుహాకరమధ్యసీమల నిలచినముగ్ధగోపరమణీరమణీయవిలాసరేఖలు గుర్తు వచ్చిన వఁట ! (3 ఆ - 50 ప)

పండుటాకులు రాలినపచ్చనితీఁగలను చూడగనే ఆవెనుకటి మధురస్మృతి రసజగత్సమ్రాట్టయినకృష్ణునిలో మెదలుట చమత్కారము. వెనుకటితనయాకోంక్షచేష్టకు ఆరసికశేఖరుడు తనమనసున నొచ్చుకొన్నాఁడో ? - మెచ్చుకొన్నాఁడో ? ఆమధురస్మృతి కృష్ణునిలో వేఱొకమధురస్మృతికిచోటిచ్చి తప్పుకొన్నది.

95. పోఁకపొత్తులనుండి పుడమి రాలిననవకోరకములను సత్యభామకు చూపి, నందనవనశ్రీయు, వసంతుడును దమపాణిపీడనవేళ నొండొరులపై పోసికొన్నసేసఁబ్రాలవలె నున్న వన్నాడు కృష్ణుడు. ఎదుట నున్నయీదృశ్య మెన్నడో జరిగినతమపాణిగ్రహణమును గుర్తు చేసినది కాఁబోలు - ఈప్రౌఢనాయిక సత్యభామ నవవధువై, ఆరస హృదయునితలపులలో మెదలినది కాఁబోలు ! (3 ఆ - 53 ప)

96. చిలుకలు వాడిచంచువులతో చించినలవలీదళముల నంటిన ఫలరసరేఖలు వసంతుడు లతాలలనలగండదర్పణముల రచించినకుంకుమ పత్రభంగముల ట్లున్న వని కృష్ణుడు సత్యభామ కాదృశ్యమును జూపినాడు. ఈకృష్ణుడే ఆవసంతుడు. ఆయనస్వీయానుభవమునకు ప్రతిబింబమే యీవర్ణనము ! (3 ఆ - 54 ప)

97. ఆపిమ్మట కృష్ణుడు మదోన్మాదితరాజకీరవదనత్రుటితోరు ఫలచ్యుతము లైనదాడిమబీజములను సత్యభామకు చూపి, యవి శక్ర గోపములవలె నున్న వని వర్ణించినాడు. రసికావతంసు డైనకృష్ణుని మన సేదంతక్షతమునుగూర్చి యాలోచించుచున్నదో! ఈమధుర భావము లాయనలోనే పొడసూపి, ఆయనయంతరంగములోనే యంత రించినచో – ఈసొగసు లేదు – తనమధురభావములను సత్య కందించుట లోనే యున్నది సగము సొగసు!

98. " తలిరాకుమెఱుఁగువాతెర
కలకంఠవిటుండు గముఁవఁగాఁ జూతలతా
లలన విదిర్చెను గంటివె?
యలికంకణముఖరవిటపహస్తముల సతీ!"

(3 ఆ - 56 ప)

" మావికొమ్మచిగురుపెదవిని కోకిలవిటుడు కొఱుకఁగా తుమ్మెదరొద యనుకంకణరవముతో కదలెడుశాఖ లనెడుచేతులతో నావిటుని విద లించుచున్నది. సత్యా! ఈదృశ్యమును చూచితివా?" యని యాముగ్ధావ్యాపారము నారసికశిఖామణి తనజంటకు చూపుచున్నాడు! (3 ఆ – 56 ప) ఇది యేచెలితోడితొలినాఁటిముచ్చటయో!

99. "తనుఁ గనుఁబ్రామి యొండొకలతం బతి వేఁకతేఁటిబోఁటిపొ
త్తున విరితేనె గ్రోలఁగ నెదుర్పడి సంపఁగితావివెల్లిలోఁ
గనలునఁ గూలఁబోవునలికామినిసాహస మేమి చెప్ప? న
య్యనుఁగుఁబ్రియుండు నెచ్చెలులు నాగిన మాన దరాళకుంతలా!"

(3 ఆ - 57 ప)

ఖండితనాయికగా వర్తించుప్రౌఢ యైనయలికామిని ప్రియుడును, నెచ్చె లులును నెంత చెప్పినను వినక మరణమున కుద్యమించుచున్నది. ఆదృశ్య మును సత్యభామకు కృష్ణుడు చూపినాడు. ఇది యలికామినిమిషమున సత్యభామకథ నామెకే గుర్తు చేసి – "ఓసత్యా! అతుమ్మెదకన్న నీ

వెంతమంచిద్దానవో!" యనుటగా మనము భావింపవచ్చును. "నీవు నాడెందమును దోచునందగత్తెవే" అనునర్థములో నిక్కడ "అరాళ కుంతలా!" యని కృష్ణుడు సత్యభామను సంబోధించియుండవచ్చును.

అట్లు సత్యభామతో సరసోక్తులు పచరించుచు హరి యామె భుజముపై చేయి వైచి తనశృంగారవిహారమునకై నందనవన దేవత సిద్ధము చేసినదివ్యవనమున సంచరించినాఁడఁట!

100. "మరుద్వృదాతటస్థశత్రుమండలీగళాంతర
క్షరన్నవాసృగాపగాభిసారికాదృతాంబుధీ।
(3 ఆ - 61 ప)

కృష్ణరాయలు కావేరీతీరమునం దున్నతనశత్రువులకంఠములనుండి జాఱు నెత్తురుటేఱ్ఱనెడునభిసారికలచే సముద్రుడు సంతోషించునట్లు చేసినాఁడఁట! వీరములో సైతమీవిధముగా శృంగారపుపొంగులు చూపుట తిమ్మకవికే చెల్లినది!

101. నందనవిహార మొనర్చుచు పారిజాతతరువుదగ్గఱకు వచ్చి శ్రీకృష్ణుడు దానిని సత్యభామకు చూపి

"కాంతా! చూచితే పారిజాతము భూమీరుహచక్రవర్తి" అని యింకను దానిప్రశస్తిని వర్ణించినాడు. యథార్థమున కది భూమీరుహము కాదు. అయినను - అవితథవాక్కయినశ్రీహరి యట్లన్నాఁడు కనుక నాతరువునకు భూలోకనివాసము తప్ప దనియు, నది పరమేశ్వరసంకల్ప మనియు తెలియుచున్నది.

102. "తనపాదుజలములోనం
గనుపట్టెడునీడ నీనగము విలసిల్లున్
మనకన్న మున్న తా మే
దినికిన్ డిగి యేఁగుచున్నతెఱఁగునఁ దరుణీ।"
(4 ఆ - 7 ప)

కల్పవృక్షము భూమి కవతరించుట తప్ప దని సూచించి, సత్యభామ కుల్లాసము గలిగించుటకే కృష్ణు డిట్లు ప్రేక్షించినాడు. ఇది యమోఘ వచస్కుఁ డైనకృష్ణభగవానునివాక్కు.

103. "వారణరాజయాన ! సురవల్లభుఁ డాశచి నంకపీఠముం
జేరిచి సోగవెంద్రుకలఁ జిక్కులు వాపి వియన్నదీనవాం
భోరుహనాళసూత్రములఁ బొందుగ దీనిలతాంతముల్ సరుల్
గా రచియించి నించుఁ గుతుకంబున వీఁగుమెఱుంగుక్రొవ్వెదన్"
(4 ఆ - 8 ప)

ఆయింద్రునికి శచీదేవియందు గలప్రేమ అంతటి దని చెప్పుట - ఇంత కాలమును నాశచి కబ్బినయదృష్ట మిఁకమీఁద సత్యభామకు కలుగు నని సూచించుటకే. శచీదేవేంద్రులశృంగారలీలలను వర్ణించుటచే కృష్ణుడు సర్వాంతర్యామి యనియు, సర్వజ్ఞుఁ డనియు తెలియుచున్నది.

104. పారిజాతపుపూవును రుక్మిణికి "కనుఁగవఁ బిన్న నవ్వు తోలఁకన్ మునినాథునికన్నుసన్న నిచ్చిన" కృష్ణుడు స్వహస్తములతో "ఆతరురత్నగుచ్ఛ మిదిమెం గర్ణావతంసంబుగన్" (4 ఆ - 12 ప) అని కవిచెప్పుటచే సత్యభామయందు కృష్ణునికిఁ గలప్రేమాతిశయము వ్యక్త మగుటయే కాక - పారిజాతతరు విచ్చుటకన్న మున్నుగానే తత్పుష్పమునే యిచ్చి ముందుముం దామె పొందనున్నయానంద మిట్టి దని కృష్ణుఁ డామచ్చెకంటికి మచ్చు చూపిన ట్లయినది.

105. అంతట నామె పయోరుహనేత్ర యైన దఁట ! అనగా నామె కన్నులు వికసించిన వని భావము. గోపవధూకుచస్తబకలోలనిశాతన ఖాంకురములచే కృష్ణుడు లతాంతమును చిదిమినాఁ డనుట యీకావ్యము నందలిశృంగారరసప్రాముఖ్యమును జాటుచున్నది. అక్కడ కృష్ణుడు చేయుచున్నది పుష్పాపచయము కనుక "కుచస్తబక" శబ్దప్రయోగము సముచితముగా నున్నది. స్తబకమున నెన్ని పూవులైన నుండవచ్చును.

అట్లే " గోపవధూకుచ స్తబక " మనుటచే కృష్ణుఁ డెందఱో గోపికలతో క్రీడించినాఁ డని భావింపవచ్చును.

106. " ఎలదేఁటుల్ తమవాలుఁగన్నవలపై నిందీవరభ్రాంతిచే
మెలఁగం జేరలఁ గప్పుకో నలవి గామిం జీదఱం జెంది, యి
చ్ఛలఁ గాంక్షించిరి నిర్నిమేషజలజాస్యల్ మానుషత్వంబు న
య్యలిభీతిన్ ముకుళీకృతాక్షి యగుసత్యాకాంత వీక్షించుచున్ "
(4 ఆ - 14 ప)

అనిమిషత్వముకన్న నరత్వమే మిన్న యని యిందు చిత్రముగా చెప్ప బడినది ! సత్యభామ కబ్బినయదృష్టము సురాంగనలకు దక్కని దని యిందలిచమత్కారము.

107. "అంబరచారిపంకజదళాక్షులు చంపకపుష్పరేణుజా
లంబులయందు సర్వశుభలక్షణరేఖలఁ బొల్చునట్టిపీ
తాంబరుపాదపంకజము లంటినతావులు త్రొక్క నోడి పా
ర్శ్వంబుల సంచరింతు ...." (4 ఆ - 15 ప)

రఁట !

అసలే అవి చంపకపుష్పరేణుజాలములు. ఆపరిమళమునకు పీతాంబరునిపదపంకజములతావులు తోడై, యపూర్వసౌరభము కృష్ణుడు నడయాడినతావుల గుబాళించినది.

భగవంతుఁ డైనకృష్ణునియడుగుఁదమ్ములజాడలను త్రొక్కుటకు జంకుటకు ఆదివ్యాంగనలకృష్ణభక్తియే కారణము. కనుకనే ఆతావులను త్రొక్కవలసివచ్చు ననెడిభయముచేతనే తమపాదముల నందు మోపక వా రాకాశమున సంచరించినారు. కనుకనే వారు అంబరచారు లైనారు ! ఇది యిందలిసారస్యము. కృష్ణుడు పద్మ పాదుఁడు కనుక ఆయనయడుగు మోపుతావులు తావులు విరజిమ్ముట సహజమే. ఇక్కడ " అంబరచారి " శబ్దము సాభిప్రాయముగా ప్రయో

గింపబడినది. ఈయనపాదములు పంకజములు. ఆదివ్యాంగనలయక్షులు పంకజములు. అనగా - శ్రీహరి పాదము లైనపద్మములే వారికన్నుల నున్నవి! ఇది వారికృష్ణభక్తిని జాటుచమత్కారము!

"పీతాంబరుపాదపంకజము లంటినతావులు త్రొక్క-క, యాపార్శ్వముల సంచరింతు" రనఁగా - శ్రీహరియడుగుజాడలకు దివ్యాంగనలు ప్రదక్షిణ మొనర్తు రనియు భావము.

108. బెడిద మగునెండసోఁకున లతలనుండి జాఱిననలు వనదేవత మేన పొడమినలేఁగమ్మఁజెమ్మటబొట్ల ట్లున్న వఁట! మాధవుఁడు చెంగట విహారింపగా వనలక్ష్మికి సాత్త్వికస్వేదోద్గమ మగుట సహజమే కదా! కావ్యమునందలిశృంగారము నిన్నివిధములుగా ధ్వనింపజేసిన తిమ్మకవిరచనావైచిత్రి యక్షరరూపము నందినది.

109. "దానవవైరి దివ్యవనితానికురుంబముతోడ జహ్నుక
న్యానవపంకజాతనివహంబులఁ గందుకకేళి సల్పినన్
మేనఁ దదబ్జపత్రములు నిండఁగ నంటిన నొప్పు నెంతయుం
దాను నుపేంద్రుఁ డౌట నయనమ్ములు పెక్కు-లు దాల్చెనో యనన్
(4 ఆ - 34 ప)

ఈవర్ణనములో నెంతో చమత్కార మున్నది. తాను నుపేంద్రు డౌటచే కృష్ణుఁ డింద్రునివలెనే పెక్కు-నయనములు దాల్చిన ట్లుండు ట టుంచి, యింతకాలమును నాయింద్రుఁ డనుభవించినపారిజాత మిటుపై నాతనితమ్ముఁ డైనయుపేంద్రునికి చెందు ననువిషయ మిందు ధ్వనించుచున్నది. ఇంద్రుని కనుభవార్హము లైనవస్తువితతి ననుభవించునర్హత యుపేంద్రునికికూడ కలదుకదా!

110. "ఘనసాంధ్యరాగవినతా
తనయగరుత్పఋతికడిఁదితాఁకున్నధర ద్రా
లివగగనఫణిఫణామణి
యన రవిమండలము పశ్చిమాంబుధిఁ గ్రుంకెన్"
(4 ఆ - 45 ప)

ఎఱ్ఱగా నున్న గరుత్మంతుని పక్షములతో సంజకెంజాయ పోల్చబడుట సముచితమే. గగనమునెడిసర్పముమీఁది కెగిరి, తచ్ఛిరోభాగమున వెలుంగుమణి యైనసూర్యుని గరుడుడు క్రిందికి పడఁద్రోసెనో యనునట్లు సూర్యమండలము పడమటిసంద్రమున వ్రాలిపోయినది. ఇది గరుత్మంతుని దెబ్బ. నభోమణి జాఱిపోవుట పారిజాత మింద్రునిచేయి జాఱిపోవుటకు సూచన. గరుత్మంతునితాకిడికి తట్టుకొనలేక యింద్రుఁ డిదివఱలో నమృతభాండమును దాత్కాలికముగానైనను వదలుకొనవలసివచ్చెను. అట్లే యింద్రుడు పారిజాతమును నష్టపోవుటలోకూడ గరుత్మంతుని పాత్ర యెంతో యున్నది. అది ఈవర్ణనమున సూచింపబడినది.

111. అష్టదిక్కుల నలమికొన్నచీఁకటి యింద్రదిద్విపదానశోభను, అగ్నిధూమమును, యమవాహనవర్ణమును, నిరృతికత్తిరంగును, వరుణునిటెక్కెమును, వాయుదేవునిలేడికాంతిని, కుబేరునినీలప్రభను, నీలకంఠునికంఠకాంతిని బోలినది. (4 ఆ – 46 ప) ఈచీఁకటులు అష్టదిక్కుల నాక్రమించినట్లు వర్ణించుటచే కృష్ణునిచే నోటువడఁగా నష్టదిక్పాలకులగుండెల నలమికొననున్నచీఁకట్లను సూచించుచున్నవి!

112. ప్రాచీమహీధరోత్తుంగసరణి నుదయించినతరణి
"మొగుడుఁదమ్ములఁ జిక్కమగతేఁటియలుగులు
సడలిపోఁజేయువిశల్యకరణి" (4 ఆ - 49 ప)

యఁట! ఈవర్ణన మాసన్నమైనయింద్రోపేంద్రులయుద్ధమునకు సూచనగా నున్నది."

"రే యనువాలునఁ బాయలైనరథాంగ
తతుల హత్తించుసంధానకరణి" (4 ఆ - 49 ప)

పరస్పరము ఘర్షించుకొనునింద్రోపేంద్రులు మఱల పొత్తొనర్చుకొనుట నీవర్ణనము సూచించును.

సూర్యుఁడు కర్మసాక్షి కనుక నాయనయుదయమును వర్ణించు పద్యములో నీయుద్ధసూచనమును, సంధిసూచనమును నుండుటచే

నీ రెండుకర్మలకును నాతరణి సాక్షిగానుండబోవుచున్నాడు కనుక నీవర్ణ
నము సమంజసమే.

113. ఆతతవాతవిధూతశాఖ మైనపారిజాతతరుచక్రవర్తి చక్ర
ధరుఁడు తన్నుర్వికి గొనిపో వచ్చె నన్నకౌతుకముచేవలె సంభ్రమ
ముతో నటింపఁగా – (4 ఆ – 51 ప) ఆయదృష్టము తమ కబ్బలే దని
నెవ్వగచే దక్కినసురభూరుహములు మధురసాశ్రుపూరము నించిన
వఁట ! (4 ఆ – 52 ప) ఆకృష్ణభగవానునిసన్నిధి తమ కబ్బలే దని
యాతరువులు విచారించినట్లు చెప్పుట యాచితీశోభితముగా నున్నది.
ఈయుత్ప్రేక్షలో జరుగబోవుకథ స్ఫూర్తిమంతముగా నున్నది.

114. తనతో సమానముగా పారిజాతముకూడ "సురలోకాభి
మతప్రదాన మొనరించుచున్నదే !" యన్నయీర్ష్యచేతనో యన్నట్లు
కృష్ణుడు గోవర్ధనోద్ధరణప్రస్తుత మైనతనహస్తముచే పారిజాతధరణీ
జాతము నుత్పాటించి, గరుడస్కంధముమీఁద లీలగా నిల్పి తనయిం
టికి కౌతూహలమునిల్పినాడు. (4 ఆ – 53 ప) కథ ముందునకు సాగు
టకు తోడ్పడినది సత్యభామలోని (సపత్నీ) మాత్సర్యము. ఆమెసహ
వాసదోషముచేతనో యన్నట్లు కృష్ణునిలోకూడ నీర్ష్య జనించినట్లు
చెప్పుట రమ్యముగా నున్నది ! ఆమెయీర్ష్య కులరూపవాల్లభ్యములచే
తనతో పోటీకి వచ్చురుక్మిణిమీఁద – ఈకృష్ణునియీర్ష్య సురలోకాభి
మతప్రదానమున తనంతటిది మైనయాసురతరుచక్రవర్తిమీఁద ! సురల
కోరికలు తీర్చుటకు తా నుండఁగా నిఁక నీతరు విక్కడ నుండు టేల ?
యని దానిని భూలోకమునకు తరలించుచున్నాడు శ్రీహరి. "ఏకక్రియా
ద్వ్యర్థకరీ బభూవ" యనునట్లు – తనయీర్ష్యయు, తనయిల్లాలికోరి
కయు తీరుపని కృష్ణుడు చేసినా డని చమత్కారము ! చేతితో కొండనే
ఎత్తినవానికి చెట్టును పెకలించి యెత్తుట యొకలెక్కయా ? యని కవి
ఆంతర్యము కానోపు. కనుకనే శ్రీకృష్ణునిహస్తము గోవర్ధనోద్ధరణ
ప్రస్తుత మైన దనుచున్నాడు కవి.

ఇక్కడ మఱియొకచమత్కార మున్నది. ఆగోవర్ధనోద్ధరణ మును నీపారిజాతోత్పాటనమును నుపేంద్రుఁ డింద్రునికి వ్యతిరేకముగా చేసినచర్యలే. కనుక నాపూర్వగాథ నిక్కడ స్మరించుట కవియుచితజ్ఞ తకు తార్కాణము.

115. కృష్ణునిచర్యచే నొక్కపారిజాతమునుమాత్రమే సురలోకము గోల్పోయి యుండెడిది. కాని – అంతటితో కథ ఆగలేదు – "గరు డనిఱెక్కలవలనిగాడ్పులు సోకి, తక్కినవేలుపుందరువు లన్నియు పెల్ల గిల్లి గగనంబున తోడన వెంట నంటి పోవుచున్నవి.

116. దానిని చూచి వనపాలకు లడ్డము రాఁగా కృష్ణుఁ డేమో చెప్పబోయినాఁడు. ఒక్కకన్నుసన్నతో కృష్ణుడు మాటలాడకుండు నట్లు చేసి సత్యభామ కచ్చ బిగించుకొని, కన్ను లెఱ్ఱఁజేసి, (చెందొవ చూపులు క్రేళ్ళు దాఁటగా)

"వినుడు సురేశ్వరవనపాలకులు :"

అని తనరాజస మంతయు నొలుకఁబోసి, వారిని కేవలము సేవకమాత్రు లుగా తృణీకరించి, తనవాదము నారంభించినది.

"బలభేది విన్న మేలే నీకున్" అనికదా నందనవనపాల కులు కృష్ణుని బెదరించినారు ? ఈసందర్భమున "బలభేది" యనఁగా బలాసురభేది యనిమాత్రమే కాక – "నీబలమును భేదించువాఁడు" అని కృష్ణు నుద్దేశించి వనపాలకు లన్నట్లును విశేషార్థ మున్నది. వారి మాటలు విన్నసత్యభామ కావేశము హెచ్చి వారితో ని ట్లన్నది :-

"ఇది స్వర్గరుహము కాదు – వార్ధిఁ బొడమినదివ్యభూరుహ మున కింద్రాణి యెవ్వతె ? ఇంద్రుండు నెవ్వఁడు ? తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ దధిపుఁ డై ధరియించె నతఁడె (ఆకృష్ణుఁడే) చేకొ నుఁగాక – లెక తేర యిది యేమి యొకరిసొమ్మ ?" అని సత్యభామ

తర్క-శాస్త్రోపాధ్యాయినివలె వాదించినది. ఈవాదము వనపాలకులకు మ్రింగుడువడక వారు గ్రుడ్లు మిటకరించి నిరుత్తరులైరి. వారు నోరు మూసికొనుటతో నీమె మఱింతగా విజృంభించినది !

"ఇదె నాదువిభునిచే నీవదాన్యనగంబు నొడియించుకొని యేఁగుచున్నదాన" నని తెగబడి మాట్లాడినది !

"తా వీరపత్నియేని మీశచీదేవి తనదుప్రాణేశుఁడైన మఘువు నిటఁ బంపి సత్యభామావిధేయువలన మరలంగఁ గొనుటెపో వాసితనము" అని మీసము మెలిపెట్టినట్లు – తొడ చఱచినట్లు – మాట్లాడినది !

"తాను వీరపత్ని" ననుటచే – శచి భీరపత్ని యనియే వ్యంగ్యము ! అప్రతిమానవీరుఁడైనజగత్పతి తనకు విధేయుఁడని సగర్వముగా చెప్పుకొన్నది !

117. ఆమెమాటలతో వనపాలకులకు తల తిరిగిపోయినది. ఆమె గర్వోక్తులకు వారు విస్మితులైపోయి పులోమజాస్వామియైనయనిమిష పతి కామాటలు చెప్పినారు. ఒకయేఁడుది – యందును మానవాంగన యన్నయవమానకరమైనయాపలుకులు – తనభార్య వినుచుండగా – తనసేవకులు చెప్పుటతో దేవతాసార్వభౌమునికి తల కొట్టివేసినట్లయినది ! కోపోద్రేకమున నాయనవేయికన్నులొక్క-సారిగా జేవురించినవి. అంతకుఁ బూర్వము గరుత్మంతుడు తన "వజ్రంబునకు నీఁక వైచినబల శాలి" యని యింద్రునికి పూర్తిగా తెలియును. అయినను తన యర్ధాంగిముందు పరువు నిలుపుకొనుటకై

"తార్క్ష్యుఁడైనన్ మదీయామోఘాశనిపాత మిట్టి దని యహో ! తెల్పెఁడామెంజుమీ" అనియు,

"ఏమేమీ? కృష్ణుడు మందలోఁబలెనె తా నింద్రద్రు మోత్పాటనం బీమె నిచ్చటఁ జూపవచ్చె నిది మేలే?" యనియు పలికి

"పోదు నిగె సత్యాగర్వభారంబు, దివ్యనగంబున్ విడిపించి వత్తు" ననియు

నింద్రుఁ డాలిమెదుట పలుకవలసినబీరము లెవో పలికి యుద్ధసన్నద్ధుఁ డైనాడు.

118. "గీర్వాణులఁ బోకుఁ డంచు మొర వైచెనొకో యన" నిస్సాణము మ్రోసిన దట!

దీనికి తోడు – శుండాలఘట లకాలనిద్రఁ జెందుట (4 ఆ – 68 ప) హయములు పల్యాణములు భరింపకపోవుట, (4 ఆ – 69 ప) యింద్రభటునిచేతికత్తి ముక్కలగుట, (4 ఆ – 70 ప) అకారణముగా వేల్పుజోదువింటినారి తెగుట, (4 ఆ – 71 ప) అనిమిష భటునివింట గొనయము నెంత త్రోసినను గనయమున కెక్కకుండుట, (4 ఆ – 72 ప) యొకసురవీరుని రణమునకు పోవ ద్దని భార్య వారించుట, యుద్ధోన్ముఖు డైనయింద్రభటుడు భార్యను కౌగిలించుకొనుట, యొకసురవీరుని కర్ధాంగి యడ్డు నిలుచుట – ఇవి యన్నియు నింద్రుని పక్షమున కమంగళమునే సూచించినవి. యుద్ధము జరుగకముందే ఫలితము తేలిపోయినది! శచీదేవి కిష్టమైనపారిజాతము చేయిజాఱిపోవుచుండుటచే – నింద్రుఁ డింద్రుఁడుగా కాక, శచీజానిగా మాత్రమే (4 ఆ – 76 ప) యుద్ధమునకు వచ్చినాడు. ఇక్కడ నీ "శచీజాని" శబ్దము సాభిప్రాయము.

119. "చండస్థూలరదద్వయద్వయమహాస్తంభంబులం బూని యు
ద్దండస్ఫారపతాకికాసహిత మై దానచ్ఛటాచిత్రవ

ద్గండాభోగవిశాలకుడ్యములచేఁ గన్పట్టునద్దేవతా
శుండాలం బరుదెంచె సంగరరమాశుద్ధాంతసౌధం బనన్
(4 ఆ - 78 ప)

ఈయింద్రునిమత్తేభము వలెనే యీపద్యమును ఠీవిగా నడిచినది !

120. ' బాహాసంభృతకాలదండజనితస్ఫారస్ఫులింగాళికిన్
సాహాయ్యంబు ఘటించి కోపరసఘూర్ణన్నేత్రదీప్తుల్ పయో
వాహాంతర్గతవైద్యుతప్రభలతేవం జూప వాహద్విష
ద్గాహోత్తంసము నెక్కి పోరి కడరెన్ వైవస్వతుం డుద్ధతిన్ "
(4 ఆ - 80 ప)

గౌడీరీతిలో సాగినయీపద్యములో నావైవస్వతోద్ధతి యంతయు రూపు గట్టినది.

121. " దారుణభంగి నొండొకటిఁ దాఁకెడునస్త్రముఖంబులన్ ఖణా
త్కారము లుల్లసిల్ల బెడిదంబుగ " సందడి పుట్టిన దఁట.

ఖణిల్లుఖణిల్లు మనెడియాయుధములసవ్వడిచే బెడిదముగా సందడి పుట్టుట సహజమే. యుద్ధభూమియందలికోలాహలమును చెవు లున్న మనసులకు వినిపింపజేయువర్ణన మిది.

122. " సురవల్లభుసేనలు భర్గజూటకాంతారముఖంబునన్ వెడలు శైవలసింధుఝరంబులో యనునట్లు వెడలిన వఁట. (4 ఆ - 90 ప) భర్గజూటమును జేరినశైవలసింధుఝరములు విష్ణుపదము నాశ్రయించి పుట్టినవే. ఈసురవాహినియు విష్ణుపదము నాశ్రయింపక తప్ప దను భవిష్యదర్థ మీయుపమానమున స్ఫురించుచున్నది.

123. బాణద్విణ్మథితాంబుధిధ్వనికళాపాణింధమానీకని
స్వాణస్వానభిదేలిమాద్రితట ః నిస్సామాన్యచాపాగమ
ద్రోణాచార్య ః సురీసమూహవరణోద్యుక్తాహితశ్రేణిని
శ్రేణీభూతకృపాణ ః మాంసలభుజాశేషాహిపత్యుద్ధరా ః "
(4 ఆ - 91 ప)

ఇది కృష్ణరాయల నుద్దేశించి చతుర్థాశ్వాసాంతమున తిమ్మకవి రచించినపద్యము. కృష్ణు నెదిరి దారుణ మైనయపహాసముపాలు కానున్న యింద్రాదులయుద్ధాటోపమును వర్ణించినవెంటనే యపజయమెఱుంగని యపరశ్రీకృష్ణు డైనకృష్ణరాయలశత్రునాశంకరసమరాటోపము నిట్లు వర్ణించుట కావ్యమునందు చెప్పబడుశ్రీకృష్ణప్రతాపముతో సంవదించుచు హృదయంగమముగా నున్నది.

124. సురసేనలు తన్ను చుట్టుముట్టగా కృష్ణుడు సత్యభామను, పారిజాతతరువును డించి, రోషనటద్భ్రుకుటీవిలాసు డై తనశార్ఙ్గమున కాచ్ఛాదనముగా నున్న శేషునికుబుసమును దొలంగించినాడు. (5 ఆ - 4 ప) కుబుస మూడ్చినపామువలె ప్రకాశించుచు కృష్ణునివిల్లు తనక్రోధమునకు కారణ మైనవారిపై పగ తీర్చుకొను ననుభావ మిందు స్ఫురించుచున్నది.

125. భిన్నాసురాస్త్రములచవి నేకాని యంతవఱ కెఱుంగనిహరి శిలీముఖము లప్పు డమరులక్రొత్తనెత్తురుచవి నెఱింగి క్రోలుట విచిత్ర మైనవిధివిలాసము. (5 ఆ - 6 ప)

126. నిఖిలలోకాద్భుతావహానిర్నిరోధవిక్రమస్ఫూర్తి యైనఖగరాజచక్రవర్తి యమృతగంధమునం దాసక్తి గలతనచంచుపుటమున సురలోకసింధురములను పొడిచి యెత్తవలసివచ్చినది. (5 ఆ - 8 ప) హరియాశుగములకన్న మున్నే చని, లక్ష్యములను దళించినాడు. అనగా నాశుగములకన్న నాశువుగా గమించినా డన్నమాట ! ఇంతటివేగము కలవాడు కనుకనే తా నొక డయ్యును భటులపై, హరులపై, బహురథాగ్రములపై పెక్కుగతుల తోచినాడు. ఒక్క డయ్యును పెక్కుగతుల తోచువాడు కృష్ణుడు. ఈగరుత్మంతుడును యజమాని యైన కృష్ణునంతటివాఁ డన్నమాట ! కనుకనే హరి ఈయనను వాహనముగా నెన్నుకొన్నాడు.

127. " శార్ఙ్గబాణవర్షసమ్మర్దదుర్దినవ్యాప్తివలన నప్పు డెదిరించు పన్నిద్ద అహిమకరులును గానఁబడలేక తేజోవిహీనులై " నా రఁట ! (5 ఆ - 9 ప) నిజముగా దేవతల కది దుర్దినమే.

128. " చుక్కలరాణివాసమున సోయగపుంజనుదోయి(తెక్కనన్ జిక్కన యైనరేవెలుంగునక్క యదుసింహుని బాణపరంపరాహతిచే (వక్కలు కాఁగా గాఁయురుధిరమునఁ దోఁగి, రణమున నభ్యుదయ మేదియు గెం పెక్కినచాయ దాల్చెనఁట ! (5 ఆ - 10 ప)

చుక్కలతో శృంగారమున మునింగి తేలవలసినవాఁడు రేవె లుంగు కావున పగలు కనరానివాఁడు - హరితోడియుద్ధమున కీడ్వఁ బడి, కాళ్ళు చల్లఁబడి, యక్క (వక్కలై కెం పెక్కినవా డైనాడు. ఆశీతరోచిదయనీయస్థితి విచిత్రముగా వర్ణింపబడినది.

129. భవరోగవైద్యుడై నయంబుజోదరుని డాసినంతనే యతఁభర్త అపగతాసాధ్యగదుఁ డైనాఁడు ! (అనగా - గదరోగము తొలంగినవాఁ డనియు, తనగదను గోల్పోయినవాఁ డనియు రెండర్థములు.) ఆ భవ రోగవైద్యుని డాసినంతనే రుద్రులు నిర్ముక్తశూలు లైరి. (అనగా - శూలరోగము తొలంగినవా రనియు, తమచేతిశూలములను గోల్పోయి నవా రనియు రెండర్థములు !) (5 ఆ - 11 ప) అహో ! తిమ్మనగారిశ్లేష రచనావైచిత్రి !

130. " జలరుహోదరసవ్యాపసవ్యముక్తనిష్ఠురాస్త్రింబు లొండొండ నిగుడఁగా-"
" నిర్భగ్నశృంగుఁడై నిజవాహనముఁ దాను
వైవస్వతుఁడు లాఘవంబు నొందె "
(5 ఆ - 12 ప)

కృష్ణుడు పరాక్రమించుటచే యమవాహన మైన మహిషము నకు కొమ్ములు విఱిగి ఆకొమ్ములబరువు తగ్గుటచే తేలికదనమును పొందిన దని మహిమపర మైనయర్థము. శృంగభంగ మై - అనగా - అవమా

నముపా తై యముడు (లాఘవము) చులకఁదనమును పొందినాఁ డని యమపర మైనయర్థము. దిక్పాలకులదుర్గతికి వినోదించుచు - తిమ్మన గారిశ్లేషవైచిత్రి శైలూషి యై యిందు నర్తించినది !

నిర్ధూతహేతియై (నశించినజ్వాలలు కలవాఁడై) ఎగురఁ గొట్టఁబడినశక్తి కలవాఁడై నిలువు సీఱుగ) నిశ్చేష్టుడై, నిలు వెల్ల బూడిద యై యగ్నిదేవుడు నిర్వాణతేజుఁ డయ్యె ననగా నశించిన తేజము గలవాఁ డయ్యె ననియు - ఆరిపోయినకాంతి కలవాఁ డయ్యె ననియు - రెండర్థములు.

" భయపలాయనవేళఁ బవమానునకు నాత్మ
జవసత్త్వములకల్మి సఫల మయ్యె "

వాయువు మహావేగము గలమహాబలుడు కనుక ఆయనశక్తులు రెండును రణరంగమునుండి పారిపోవుట కుపయోగించిన వని కవి పరిహసించు చున్నాడు.

" వరుణునకు డాఁగికొనఁ జోటు వలఁతి యగుట
నుదధినాయకభావంబు నుపకరించె " నఁట :

మఱి - యీకృష్ణుడు నారాయణుడు కనుక నుదధియందు దాగుటకు వరుణుడు జంకినట్లు తిమ్మకవి చెప్పినచో మఱింత బాగుండెడిది.

ముద్దుపలుకులకు పేరొందినతిమ్మనగారిశైలి పూవువలె మెత్తని దైనను యుద్ధవర్ణనలలో నుద్ధతముగా సాగినసందర్భములుకూడ నున్నవి!

131. " మఱియు నమ్మధుమథనుసముద్దండదోర్దండమండలీకృతశార్ఙ్గకోదండనిర్ముక్తనిర్భరక్రూరనారాచధారానిపాతంబున గవాక్షితవక్షు లగుయక్షులును, జక్రనిర్వక్రవిక్రమక్రీడలం బరిచ్ఛిన్నకర్ణనాసాధరు లగువిద్యాధరులను ............... (5 ఆ - 13 ప) - ఈవిధముగా సుదీర్ఘ సమాసములతో ప్రౌఢనిర్భరముగా సాగిన దాయుద్ధవర్ణనము.

132. " గిరితటముఁ దాఁకి తిరిగెడు
తరంగిణియుఁబోలె దేవతాపతియాజ్ఞన్
మరలి వియచ్చరవాహిని
మురహరునిం బొదివిఘోరముగా
పోరిన దఁట ! (5 ఆ - 15 ప)

శ్రీకృష్ణుడు పర్వతమువంటివాఁడు కనుక వియచ్చరవాహిని యింతగా తర గెత్తినను ఆయన నేమియు చేయజాల దని యీాయుప మానము చెప్పక చెప్పుచున్నది.

వియచ్చరవాహిని విష్ణుపాదోద్భవ కావున - నది ఆయన పాదముల నాశ్రయింపక తప్ప దని సూచన. ఆవాహిని యెంత పొంగి పొదివినను - నది నారాయణు డగునాకృష్ణు నేమియు చేయజాలదు కదా !

133. " అనలుఁడు రెండు, మూఁడు యముఁ డాసురనాథుఁడు నాలుగైదు తో
యనిధిపుఁ డాఱు గంధవహుఁ డర్థపుఁ దేఁడు మహేశుఁ డెన్మిదిన్
ఘనవిశిఖంబు లేయ మురఘస్మరుఁ డన్నియుఁ ద్రుంచి శార్ఙ్గసం
జనితమహోగ్రభల్లముల జర్జరితాంగులఁ జేసె నందఱన్ "
(5 ఆ - 22 ప)

తూర్పుదిక్కుతో మొదలుపెట్టి చూచినచో నాగ్నేయము రెండవది. ఆదిక్కున కధిపతి యనలుఁడు కనుక తనదిక్సంఖ్య గలరెండు బాణములను కృష్ణునిపై నేసినాఁ డనియు, అట్లే మూఁడవదిక్కు (దక్షిణము)ను పాలించుయముఁడు మూఁడుబాణములను వేసినట్లును, ఈవరుసలో నెనిమిదవది కీశాన్యము కనుక దానిని పాలించుమహేశుఁ డెనిమిది బాణములను ప్రయోగించినట్లును తిమ్మకవి చిన్నిచమత్కారము చేసెను. కాని -

జనలోకైకమహారథుండు ద్విజరక్షాదక్షుఁ డాజిం ద్రిలో
చనుఁ డుద్యచ్చతురంగసైన్యుఁడును భాస్వద్రూపపంచాస్త్రుఁ డ

స్వనృపకౌంచషడాననుండు ఘనసప్తాశ్వాన్వయుం డష్టమం
త్రినవద్రవ్యనిధీశుఁడై దశరథాధీశుండు పొల్చెం దగన్. ''

అనిమల్లికార్జునభట్టు తనభాస్కరరామాయణము బాలకాండమునందు రచించినపద్యములో నున్నపాటిచమత్కారమైనను ఈతిమ్మకవిగారి పద్యములో లేదు. అందుచే నీపద్యము పాఠకునిదృష్టిని ప్రక్కకు మళ్ళించునదిగా నున్న దని చెప్పక తప్పుట లేదు.

134. '' వేల్పుమ్రానియందు వేడుకపడుకూర్మి
సతులకోర్కెఁ దీర్పఁజాలి యపుడు
హరియు హరియుఁ బోరి రన్యోన్యజయకాంక్ష
నసురజీవితాపహాశుగముల ''

(5 ఆ - 23 ప)

హరిశబ్దము విష్ణువునకును, నింద్రాదులకును వర్తించును.[2] ఈయుద్ధమున పాల్గొనుప్రతిద్వంద్వు లిరువురిపేరును, వారియుద్ధకారణమును, వారియాశుగములస్వభావమునుకూడనొకటే యగుట విచిత్రము !

ఇంద్రోపేంద్రులబాణములు అసురజీవితాపహము లని కవి చెప్పనే చెప్పినాడు - కనుక - పరిశేషన్యాయముచే ఆబాణములు సురలజీవితముల నేమియు చేయ వని తాత్పర్యము. మఱి యీసమరమో ? ఇ దంతయు పరమేశ్వరలీలమాత్రమే ! ఈచమత్కారముల ట్లుంచి - రసపరిష్కారమునకు బాగుగా నుపయోగించుపద్య మిది. '' కూర్మిసతులకోర్కె తీర్చుటకై సంకల్పింపబడినయుద్ధ మిది ! '' అనగా - శృంగారరసమునకు పుష్టి నిచ్చుటకై రచింపబడినవీర మిది ! కనుక నీపారిజాతాపహరణమున అంగిరసము శృంగారము కాఁగా - వీరముదాని కంగ మెనది.

1. భాస్కరరామాయణము - బాలకాండము మల్లికార్జునభట్టు.
2. '' యమానిలేంద్రచంద్రార్కవిష్ణుసింహాంశువాజిషు
శుకాహికపిభేకేషు హరి ర్నా కపిలే త్రిషు '' — అమరుఁడు.

135. " అలుగుల దట్టమై పొదమునగ్నికణంబులు సోఁకి పైగఱల్
వాలిసయుఁ దొంటివేగ ముడివోక క్రమంబున నొండొకంటిఁ బిం
జలు గొని త్రోచికొంచు శరసంఘము లక్ష్యముఁ దాఁకు విస్మితా
ఖిలసురసిద్ధసాధ్యముగఁ గృష్ణుడు జిష్ణుడుఁ బోర నయ్యెడన్ "
(5 ఆ - 25 ప)

పరస్పరబాణసంఘర్షణమువలన నగ్నికణములు రేఁగి యింద్రోపేంద్రుల బాణములరెక్కలు దగ్ధములైనను - రెక్కలు లేనియాబాణములే యొండొంటిని రాపాడుచుఁ బోయి లక్ష్యములఁ దాఁకుచున్న వఁట !

కృష్ణుడు భగవంతుడు కనుక ఆయనబాణములు లక్ష్యములను దాఁకుట కాయనసంకల్పబలమే చాలును - బాణములకు రెక్కలే కావలె నని లేదు. అస్త్రవిద్యలో నింద్రుడును తుల్యబలుడే యని దీనిఫలితార్థము. శస్త్రాస్త్రవిద్యలు తెలియనివానితో పోరి విజయము సాధించుట కృష్ణుని కుత్కర్ష నాపాదింపదు. " వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే " కనుక నింద్రుడును తక్కువవాఁడు కాఁడు. అయినను భగవంతునంతటివాఁడు కాఁడు కనుక కృష్ణునిచే పరాజితుఁ డయినాఁడు. ఇదివరలో నెన్నోయుద్ధములు చేసిచేసి యప్పుడప్పుడు రాక్షసులచే నింద్రుఁ డోడింపబడినప్పుడు శ్రీమహావిష్ణు వాయనపక్షము వహించి యుద్ధమున దనుజుల సంహరించినాడు. అట్టివిష్ణువుతో భార్యా ప్రీతికై పారిజాతమును దక్కించుకొనుటకై యింద్రుడు పోరుట యవి వేకము. ఆయవివేకమునకు ఫలమే దారుణమైనయోటమి.

136. " అలనాఁటినన్ను మఱచితె ?
నిలు నిలుమీ తగినయాజ నీకిదె ! యనుచుం
బలుఁగులఱప సురంద్రుం
డలుఁగులపెనుగూటఁ జిక్కునట్టుగఁ జేసెన్ "
(5 ఆ - 27 ప)

గరుత్మంతుడు పక్షీంద్రుడు కనుక సురేంద్రు డాయన నలుగులపెను గూటిలో చిక్కునట్లు చేసె ననుట చమత్కారము. అలుఁగులపంజర

మున పక్షిరాజు బంధింపబడలేదు గూటిలో చిక్కినాడు. గూటిలో నుండుట పక్షికి రక్షణమేకాని యొకవిధముగా పెద్దగా బాధాకర మైన విషయమే కాదు. కనుక నాయలుంగులపెనుగూడు గరుత్మంతునికి నంతగా క్లేశమును గలిగింపలే దనిభావము.

137. ఇతని కితండె సాటి యగు, నీతని కీతఁడె సాటి వచ్చుఁ గా కితరులు వీరిఁ బోలఁగలరే ? యనుచారణసిద్ధసాధ్యసం

స్తుతులు సెలంగె - ఆరణము సూచి రణాశనమౌని నింగిపైఁ
గుతుకరసాతిరేకమునఁ గుంచియ వీచి నటించె నయ్యెడన్ "

(5 ఆ - 29 ప)

ఇక్కడితో నాయారివేరంపుఁదపసి ద్వారకకు వచ్చినలక్ష్యము నెఱవేఱినది. ఆయన కీనాఁడుమృష్టాన్నభోజన మబ్బిన ట్లయినది. తాను క్రిందికి దిగి, కృష్ణుని నింగికి రప్పించిన దిందులకే!

138. ఇంద్రోపేంద్రులకు జరిగిన దొకవింతయుద్ధము.

" కినిసి బిడౌజుఁ డాగ్నేయాస్త్రి మదరింప
నది శార్ఙ్గితేజమునందు డిందె '' నఁట ;

ఏమి చేయవచ్చు ? నీశ్వరుం డఖిలాత్ముఁ
డతని గెల్వఁ దనకు నలవి యగునె ? "

(5 ఆ - 30 ప)

అని కవియే చెప్పుచున్నాడు.

సర్వాత్మకుఁ డైనకృష్ణునిలో నగ్నియు నొకభాగమే కనుక నింద్రునియాగ్నేయాస్త్రము శార్ఙ్గి తేజమునందు డిందువడినది. అట్లే

వృద్ధశ్రవుఁ † డేసినయనిలాస్త్రము ఆపరమేశ్వరునియూర్పుగాలిలో కలసిపోయినది. సూర్యచంద్రులు విష్ణునిదక్షిణవామనేత్రములు కావున బలారి ప్రయోగించినసూర్యదేవతాక మైనయస్త్రము కృష్ణునికడికంట నడంగిపోయినది. విష్ణునినాభికమలమున పుట్టినవాఁడు బ్రహ్మదేవుడు కనుక నింద్రుఁ డేసినబ్రహ్మాస్త్రము * కృష్ణునినాభియం దడంగినది. శివకేశవు లభిన్నులు * కనుక నింద్రుడు ప్రయోగించినపాశుపతాస్త్రము కృష్ణునియర్ధాంగశివరూపమున నడంగిపోయెను. కనుక నింద్రునియస్త్ర శక్తి కృష్ణునియందు నిష్ఫల మైనది.

---

† వృద్ధశ్రవా శ్శునాసీరః పురుహూతః పురందరః — అమరుడు

*1. పరమాత్మావ్యవస్థితః సబ్రహ్మ సశివ స్సహరి స్సేంద్ర స్సోక్షరః
సమస్స్వరరాట్ — నారాయణీయము.

2. భవానహంచ విశ్వాంత స్త్వేకమేవహి కారణమ్
జగతోఽస్య జగత్యర్థే భేదేనావాం వ్యవస్థితౌ
త్వయా య దభయం దత్తం తద్దత్త మఖిలం మయా
మత్తో విభిన్నమాత్మానం ద్రష్టుం నార్హసి శంకర
యోఽహం సత్వం జగ చ్చేదం స దేవాసురమానుషమ్
అవిద్యా మోహితాత్మానః పురుషాభిన్నదర్శినః — విష్ణుపురాణము

3. "విష్ణో రన్యంతు పశ్యంతి యే మాం బ్రహ్మాణ మేవచ
కుతర్క మతయో మూఢాః పచ్యంతే నరకేష్వధః" — భవిష్యపురాణము.

4. "శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయగుం శివః"

5. "ఏకో మూర్తి స్త్రయో దేవా రుద్రవిష్ణుపితామహాః
రుద్రస్య పరమో విష్ణుః విష్ణోశ్చ పరమ శ్శివః
ఏక ఏక ద్విధాభూతే లోకే చరతి నిత్యశః
నవినా శంకరం విష్ణు ర్నవినా కేశవం శివః
తస్మా దేకత్వ మాయాతౌ రుద్రోపేంద్రౌతు తౌ పురా"
(హరివంశము - 184 అధ్యాయము)

పరిణమించినది. కృష్ణుడు తనశరములచే బలభిద్భద్రేభకుంభంబును వ్రక్కలు చేయగా నందుండి ముత్యాలజల్లు హిమాచలశృంగావతరన్న భశ్చరధునీచంచత్ప్రవాహాకృతితో జలజల రాలినది. ఇంద్రుని వెల్ల యేనుగును హిమవంతముగా, జలజల రాలుముక్తాశ్రేణిని మంచుఁ గొండపైనుండి జాఱునాకాశగంగగా నుపమించుట మనోహరముగా నున్నది.

ఇంద్రునివింటినారి తెగిపోగా శ్రీకృష్ణునియర్ధచంద్రబాణా హతిచే నింద్రునిటెక్కెము "ఓరుగాలికి మొద లూడఁగాఁ గూలెడు మ్రానికై వడి" (5 ఆ - 31 ప) కూలిపోయి యింద్రునికి ఘోర మైనయమంగళమును సూచించినది.

140. "భగ్నభ్రూకుటిదుర్ముఖుం డగుచు నాస్ఫోటించుచున్ లోనిరో
షాగ్నిజ్వాలలు బాహ్యనిర్గతము లైన ట్లుత్కటారణ్యని
ర్మగ్నం బై కనుపట్టులోచనసహస్రం బొప్ప మౌర్వీలతా
భగ్నం బైనశరాసమున్ విడిచి జంభద్వేషి యత్యుగ్రతన్"

(5 ఆ - 32 ప)

శింజిని తెగి, టెక్కెము కూలి, దురమున ఘోరవిపత్తుతో కుత్తుక బంటిగా కూరుకొనిపోయినమహేంద్రుఁడు తనయితరాస్త్రము లన్నియు నిష్ఫలములై కృష్ణునియందు డిందగా తెగబడి తనచిట్టచివరియాయుధ మైనవజ్రాయుధమును తనతమ్ముఁ డైనయుపేంద్రునిపై ప్రయోగింప సంకల్పించినాడు. ఈపద్యమునందలిక్లిష్టప్రాసము ఆయింద్రుడు తల పెట్టినయాక్లిష్టకార్యమును స్ఫురింపజేయుచు - నిందలిపదాడంబర మా యింద్రునిరణాటోపమును జాటుచున్నది. ముద్దుపలుకులకు పేరొందిన ముక్కు తిమ్మనగారేనా ఈపద్యమును రచించిన? దనిపించునంతటి యుద్ధతితో సాగినది యీశార్దూలపద్యము !

141. " కులవసుధాధరావళికిఁ గుంటితనం బొదవించె నెద్ది యా
బలితపుఁగ్రైదుపుం గొని, సుపర్వకులాగ్రణి వేయుఁగన్నులం
దలకొని కౌస్తుభ స్తబకితం బగుశౌరియురంబు సూచినన్
జలజదళోదరోదకముచాడ్పున నల్లలనాడె లోకముల్. "

(5 ఆ - 33 ప)

కులపర్వతములరెక్కలను వజ్రాయుధము భేదించుటచే (పూర్వమువలె) నవి పైకెగురలేక యచలములైనవి! ఆయచలత్వముమే కుంటితన మనుచున్నాడు తిమ్మకవి!

కౌస్తుభరత్నము విష్ణునియురమున పూచినపూలగుత్తివలె నున్నది. ఆయనహృదయము పూవుకన్న మెత్తనిది. కనుకనే - పూవున వెలసినపువుబోణి కది సుఖావాస మైనది. ఇంతకుపూర్వమే పారిజాత సుమగుచ్ఛమును తనప్రేయసి సత్యభామకు కర్ణావతంసముగా నిడి (4 ఆ - 12 ప) యున్నాడు కృష్ణుడు. ఇపు డాయనహృదయమున సుమ కోమలాంగి యైనసత్యభామయు, నామెకు ప్రీతిపాత్ర మైనపారిజాత స్తబకమును నిండి యున్నవి. అందుచే హరియురము కౌస్తుభ స్తబకిత మనుట సముచితమే.

చేత వజ్రాయుధమును బూని యింద్రుడు పువుబోణి యైన రమ నివసించుహరియురమును పువుగుత్తిగానే భావించి దానిని తన కరమునందలివజ్రముతో భేదించుట సుకర మని తలంచినాఁ డని కవి హృదయము. ఆయింద్రునిదారుణసంకల్ప మెఱింగినలోకము లన్నియు జలజదళోదరోదకముచాడ్పున నల్లలనాడినవి.

నీరు మిక్కిలిమృదు వైనపదార్థము. దానినుండి పుట్టిన తామరపూవును మృదులమే. ఆపువు రేకున చేరినజలకణము చిరుగాలికి కూడ చలించిపోవుట సహజము. జలహృదయముననే జలజ ముండు నట్లు లోకములలోనే పరమేశ్వరుఁ డున్నాడు. ఆజలజములోని జలము వలె నాపరమేశ్వరునిలో లోకము లుండును. ఇది సృష్టిరహస్యము.

తామర రేకులోనినీటివలె విష్ణువులోనిలోకములు చంచల మైన వని కవిభావము. అవి వజ్రిచేతివజ్రాయుధమును జూచి బెదరుచు మఱింతగా నల్లల నాడిన వని యర్థము. కుంటివారికి కుంటితనమును బోనాడు పారిజాతమును [1] హరి కోరగా – కులపర్వతములకుకూడ కుంటితనమును తెచ్చిపెట్టినకర్కశ మైనవజ్రాయుధముతో హరియురము నింద్రుడు కొట్టఁదలచినాడు. (ఇది విధివైపరీత్యము.)

142. " వీరుఁడ వౌదు దీనిబలువ్రేటున కోరిచి నిల్చితేని యం
భోరుహనాభ ! యంచు సురపుంగవుఁడు
కులిశాయుధరాజము బూఁచి వైచినాడు

(5 ఆ - 34 ప)

ఇక్కడ " అంభోరుహనాభ " శబ్దము సాభిప్రాయము. విష్ణునురము కౌస్తుభస్తబకితము. ఆయననాభియు పూవే. మిక్కిలి సుకుమారుఁడైనహరి తనవజ్రపుదెబ్బకు తట్టుకొనజాలఁ డనునుద్దేశముతోనే యీ " అంభోరుహనాభ " శబ్దము నింద్రుడు సాభిప్రాయముగా ప్రయోగించినాఁ డనవచ్చును.

143. మహాస్రగ్ధరః –

" శతధారాజాయమానజ్వలనముఖశిఖాచ్ఛాదితాభ్రస్థలం బై
వితతాఖిలధ్వనిశ్రీవిలసనబధిరోద్విగ్నదిగ్వారణం బై
కృతలోకాలోకమఃఖ్యాఖిలగిరిచలనక్షిప్తభూమండలం బై
పతయాశుద్వాదశాత్మప్రకరఖరకరౌపమ్య మై యేఁగుదేరన్ "

(5 ఆ - 35 ప)

1. " లఘుత్వము మీరన్ జన నేర్చిరి వికలాంగులు
ననిమిషతరుకుసుమసౌరభావేశమునన్ "

(పారిజాతాపహరణము 5 ఆ - 47 ప)

సామాన్యముగా నాయుధముల నొకవైపుననే పద నుండును. సాధారణముగా పద్యములో నొకేయతిస్థాన ముండును. నూఱంచులవజ్రాడంబరమును వర్ణించునీపద్యములో రెండు యతు లున్నవి. అష్టదిగ్వారణములు దుర్భరధ్వనిబధిరోద్విగ్నములుగా, వ్యోమచక్రము చక్రవాళాద్యద్రిచలనక్షిప్తముగా, పతద్ద్వాదశఖరకరోపమ మై సాగుభయంకరవజ్రార్భాటమారభటీవృత్తిలో సాగినయీమహాస్రగ్ధరలో రౌద్రపువెల్లువలు పొంగులెత్తినవి.

144. అంత నాశతమన్యుప్రయుక్తశతకోటిని కని యేమాత్రమును చలింపక నెమ్మోమునఁ బిన్ననవ్వు తొలంకగాఁ గంసారి నిశ్శంకం దార్క్ష్యుని నడ్డంబుగఁ ద్రిప్పి వేగరసతేజోదుస్సహస్ఫూర్తిమై తను డాయఁగా, కటాక్షనిరీక్షాంచితనందకత్సరుకిణాంక మైనహస్తముతో శతపత్రక్రీడ సలుపునట్లు పట్టినాఁ డఁట! (5 ఆ – 36 ప) పిన్నటనాఁటి నుండియు విరోధిసంహార మలవాటైనవాఁడే యనునుద్దేశముతో "కంసారి" శబ్దమును కవి సాభిప్రాయముగా ప్రయోగించినాడు.

145. తనముఖ్యతరాస్త్రి మైనవజ్రాయుధమును క్రీడాపద్మమువలె కృష్ణుడు పట్టుకొనగా లజ్జాభయములతో వచ్చి దేవేంద్రుడు తా నపరాధి నని శ్రీహరికి జాగిలబడి మ్రొక్కఁగా కృష్ణుఁ డుదారుఁడై "సురేంద్రా! నీతప్పు లేదు – నీమఱఁదలు కోరగా నీవదాన్యభూరుహమును గొంటిని _ నీసొమ్ము నీవు కొను" మని వజ్రము నిచ్చి, పారిజాతము నీయఁబోవఁగా – నప్పటికి జ్ఞానోదయ మయినయింద్రుడు"

"సొమ్మన నెద్ది? యే ననఁగ సొమ్మున కెవ్వఁడ? కర్త వీవు; నీ
సొమ్మఖిలప్రపంచమును; శూరకులమ్మ నలంకరించునీ
వమ్మహి నుండునంతకు ననన్యదురాపము పారిజాతభూ
జమ్మును నుండు .................."

(5 ఆ - 40 ప)

నని కృష్ణునికి పారిజాతము నర్పించి సెలవు గైకొన్నాడు. కృష్ణునిపారిజాతహరణకథ యింతముచ్చటగా ముగిసినది !

వాసవునితోడియుద్ధపువార్తలు సత్యభామకు చెప్పుచు, పారిజాతసుమాలసొమ్ములామెయంగములఁ జేర్చుచు కృష్ణుడు ద్వారకకు జేరినాడు.

146. అనాఘ్రాతపూర్వములైనపారిజాతమహీజాతపరీమళము లంతటను బుగులుకొన్నవి. ఆసురతరుమహిమచే దరిద్రు లష్టైశ్వర్యముల తులదూగిరి. వృద్ధులు యౌవన మందగా, అవిటివారికిని నాయువ లక్షణములు తొలంగినవి. వినతాసుతుని గారవమున వీడుకొలిపి, "ప్రతిన వచ్చెఁ గదా యిదె పారిజాతము" అని కృష్ణుఁ డర్పింపగా సత్యభామ సమ్మోద మంది, తనయారామమధ్యమున నాతరువును బ్రతిష్ఠించి, యనుదినము పూజించినది.

"సతి యనఁగా సత్యభామయే – పతి యనఁగా కృష్ణుఁడే – ఇంతటియనిర్వచనీయప్రేమ మెందును నుండ" దనిపదాఱువేవురు సవతులును సతా లను సంసుతించిరి.

147. సత్యభామాగృహారామనిత్యమైనపారిజాతము వీటి కెల్ల పెరుగుచు, పెనువ్రేలంత యగుచు, వివిధభూరుహాపుష్పపరీమళము లీనుచు, పరిపక్వఫలము లిచ్చుచు, నభిలషించినరూపము నభినయించుచు నుల్లమునఁ గోరుకోరిక లెల్ల నొసంగుచు విస్మయావాది యైనది !

ఇట్లు సంతోషితస్వాంతయైనసత్యభామచే నారదుడు పుణ్యకవ్రతము చేయించి, యామెలోనిగర్వమును, సపత్నీమాత్సర్యమును నశింపజేసినాడు. ఆవ్రతసందర్భముగా సత్యభామ కృష్ణుని నారదునికి ధారోదకపూర్వకముగా దాన మిచ్చినది ! అపుడు

148. " పరమమునిమానసాలానబంధనమునఁ
గుదురువడకుండుయాదవకుంజరమ్ము
వికచరాజీవనేత్రచే వేల్పుమ్రానఁ
గమ్మఁబూవులదండచేఁ గట్టువడియె ! "
నఁట ! (5 ఆ - 80 ప)

బలిదనుజేంద్రుని గట్టినహరి సత్యభామపుష్పదామకముచే కట్టువడె నని యామెచెలులు మేలమాడిరి !

నారదుడు కృష్ణునిచే నవ్వులాలకు పనులు గొని మరల నాహారిని సత్యభామ కిచ్చినాడు. నారదుడు చేసినకృష్ణస్తుతిలో

149. " నాయశరగసారవిరయ
తాయనజయసారసుభగధరధీనియమా
మాయనిధీరధగభసుర
సాయజనయతాయరవిరసాగరశయనా ! "
(5 ఆ - 92 ప)

అనునను లోమవిలోమకంద మున్నది. ఇది కాక - పాదభ్రమకము, గోమూత్రికాబంధము, నాగబంధము, ఛురికాబంధము, చక్రబంధము ద్వ్యక్షరికందము, ద్వికందక్రౌంచపదము, భుజంగప్రయాతగర్భస్రగ్విణి, యనువిచిత్రచ్ఛందము లున్నవి ! ఈకావ్యేతివృత్తము విచిత్రగతిలో నడచుటకు కారణభూతుఁ డైననారదునిచే నీచిత్రగతిచ్ఛందములలో కృష్ణస్తుతి చేయించుట తిమ్మకవిగారిచమత్కారదృష్టిని చాటును !

1. ఇలలో నెనుబదినాలుగు నిలయంబులు నగు పయోదనిభనీలాంగా !
మెలి గొన్నపామువలె వెలుప లగున్ దల తోఁకనాగబంధంబునకున్
(అప్పకవీయము)

2. " వర్ణానా మేకరూపత్వం యద్యేకాంతరమర్ధయోః
గోమూత్రికేతి తం ప్రాహు ర్దుష్కరం తద్విదో విదుః "
(దండికావ్యాదర్శము)

150. " సౌఖ్యాంబునిధి నోలలాడుచుండెఁ
గృష్ణుఁ డఖిలావనైకవర్ధిష్ణుఁ డగుచు "
(5 ఆ - 107 ప)

అని అటు శ్రీకృష్ణభగవానునికిని, ఇటు కృతిపతి శ్రీకృష్ణరాయలకును వర్ణించునట్లు మంగళాంతముగా రచించుట తిమ్మకవిరచనావైచిత్రికి నిదర్శనము !

151. " చిత్తజభిదంఘ్రియుగచింతనకళాభిగతజిష్ణుసమవైభవవిశేషా
విత్తరమణామరగవీతరణిభూజలదవిభ్రుతకరాంబురుహ గోష్ఠీ
నృత్తమణిరంగతల ః నీతిమనురాజనిభ ః నిర్భరదయారసపయోధీ ః
మత్తగజయూథమదమగ్నసుఖితాశిరవమాన్యగృహమంగళమహాశ్రీ "
(5 ఆ - 111 ప)

అనుమంగళమహాశ్రీవృత్తముతో తనపారిజాతాపహరణకావ్యమును బరిసమాప్త మొనరించినాడు తిమ్మకవి.

" మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే
వీరపురుషా ణ్యాయుష్మత్పురుషాణి చ భవంతి అధ్యేతారశ్చప్రవక్తారో
భవంతి " - యనునార్యోక్తి ననుసరించియు, [1]

" అంతే కావ్యస్య నిత్యత్వా త్కుర్యా దాశిష ముత్తమమ్
సర్వత్ర వ్యాప్తయే విద్వాన్ నాయకేచ్ఛానురూపిణీమ్ " [2]

అనుసారస్వతాలంకారము ననుసరించియు మంగళమహాశ్రీవృత్తముతో కావ్యమును పూర్తిచేయుటయే కాక - శ్రీకారముతో కావ్యమును ప్రారంభించి, శ్రీకారముతోనే కావ్యమును బరిసమాప్త మొనరించి కవి సంప్రదాయమును పాటించినాడు.

1. పాతంజలమహాభాష్యము.
2. సారస్వతాలంకారము.

కావ్యాంతమున (పంచమాశ్వాసాంతమున) నున్నయీపద్య సంఖ్య నూటపదునొకండు. దీనినిగూర్చి విచిత్ర మైనవ్యాఖ్యాన మొకటున్నది! నడుమనడుమ నెన్నికలంతలు, నెన్నియపార్థములు వచ్చినను- చివరకాలుమగ లొకటే - యొకటే - యొకటే - యని ముమ్మాఱు నొక్కి- వక్కాణించుటకు గుర్తుగా నీయొక డంకె ముమ్మాఱు ప్రయుక్త మైన దనియే ఆవ్యాఖ్యానము !

వైష్ణవుఁ డైనకృతిభర్తను సంతోషితస్వాంతునిం జేయుటకే తిమ్మకవి తిరునామమును బోలినయీసంఖ్య గలపద్యముతో పంచమాశ్వాసమును బరిసమాప్తి నొందించె నదునది మఱియొకయుక్తి వాదము !! మొత్తముమీఁద నీరెండువాదములును చమత్కారముగానే యున్నవి !!!

# 12. ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకు

అందఱు కవులకును తమ దైనశైలి లేదు! తన దైనయొక ముద్ర వేసికొన్నశైలి నన్నయగారికిని, తిక్కయజ్వకును, శ్రీనాథ పోతనాదులకు కొందఱికినిమాత్రమే కలదు. కవు లందఱును వాడునవి ఆగణములే - ఆయతిప్రాసములే యైనను - నెవరిశైలి వారిదే! " STYLE IS THE MAN " అన్నట్లు కవియొక్కస్వభావము, మార్దవము, ప్రౌఢి, జటిలత, ఆడంబరము మున్నగుగుణములు ఆయాకవులశైలిలో ప్రస్ఫుట మగుచుండును. శైలి యన్నది కవికి దైవదత్త మైనవరము. అది కవి చెప్పినభావము నెల్ల చేవదేరునట్లు చేయును. కావ్యమున కది ప్రాణస్నాయువు. కవిభావనావలను సహృదయపాఠకహృదయ సాగరములకు చేర్చునట్టిరసస్రవంతి యది. తన దైనయొకశైలిని సృష్టించుకొనగలిగినకవులసంఖ్య మిక్కిలి స్వల్పము.

శ్రీనాథునికవితాశైలిలో మార్దవము, ప్రౌఢి, జటిలత, యనుమూడుగుణములు కలవు. ఆయనప్రౌఢి అల్లసాని పెద్దనగారి కబ్బగా, జటిలత తెనాలి రామకృష్ణునిసొమ్మైనది. ఇక ఆకవిసార్వ భౌమునిమార్దవమును తిమ్మకవి పుణికి పుచ్చుకొన్నాడు.

" ఏమేమీ? కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా?
ఆమాటల్ చెవి యొగ్గి తా వినియెనా యాగోపికావల్లభుం
డేమే మాడెను రుక్మిణీసతియు? నీ విం కేఁటికిన్ దాఁచెదే?
నీమోమోటలు మాని నీరజముఖీ! నిక్కంబు బెల్చింగింపవే"

తిమ్మకవిలేఖినినుండి యలవోకగా వెలువడి జీవకళ లుట్టిపడుచున్న మాట లివి.

వర్ణనలో, సంవాదములో, కథాకథనములో, వివిధరస సందర్భములలో శైలీవిన్యాసభేదము కనుపట్టును. శృంగారసందర్భము

లందు సుకుమారముగా సాగినతిమ్మనగారిశైలి యుద్ధవర్ణనలలో ఉర వడించినది.

ఇద్దరువిభిన్నవ్యక్తులసదృశానుభూతులతుములస్పందనమునకు నిమిత్తభూత మైనది ముద్దు. ఈముద్దుపెట్టుకొన్నవానికే కాక - ముద్దు పెట్టుకొనబడినవారిలోకూడ స్పందనము కలుగుట సహజము. పాఠ కులకు హృదయస్పందనము కలిగించుపలుకులు కనుక ముక్కుతిమ్మ నార్యుపలుకులు ముద్దుపలుకు లైనవి.

తిమ్మనగారిశబ్దము లొకదానితో నొకటి పొంది పొసగునట్లు చేయులక్షణమే యీముద్దుపలుకులలో నున్నది. ఇది శ్రవఃపేయమే కాక, హృదయస్పందికూడ.

అందముగా భావింపగలప్రతివాఁడును అందముగా చెప్పలేడు. సుకుమారముగా చెప్పగలవానికి రమణీయముగా భావింపగలశక్తి యుండకపోవచ్చును. తిమ్మనగారిలో నీరెండు శక్తులును గలవు. అంద ముగా, ప్రతిస్పందబంధురముగా భావించుటయు, రచించుటయు తిమ్మ కవిసొమ్ము. రమణీయభావనను రమణీయ మైనశైలిలో నందించుపద్ధతి "మిన్నేటిపసిండినెత్తమ్మిచిగురుటాకునం జొ ది వి న పా రి జా తం పుఁ గ్రొ న్న న" వలె నుండును. దీనికి పారిజాతాపహరణకావ్యము నంత టిని నుదాహరింపవలసివచ్చును కనుక కతిపయసందర్భము లీక్రింద నెత్తి చూపబడుచున్నవి :-

నరసరాజు చోళరాజును చంపినాఁ డని చెప్పుటకుకూడ "సురవధూమధురాధరము లిచ్చినాఁ" డని తిమ్మకవి సుకుమారముగా శృంగారపురంగు పులుముట ముద్దుముద్దుగా నున్నది.

" అసుహృదసుపవనవిసర
గ్రసనరసవ్యసనవశవికసదసిరసనా

ప్రసరణశయఫణవిలసన
విస్మృమరమరువకితసమరపీఠీస్థలికిన్ !

(1 ఆ - ప)

మద్దెలదరువువలె ముద్దుగా సాగినయీపదగుంఫనమున వృత్త్యనుప్రాస మెంతో మనోహరముగా నున్నది.

"తలిరాకుఁబోణి యొక్కతె
జలకమునకు వేళ యనుచు శౌరికి వీణా
కలకలములఁ గలకల నగు
పలుకులమెల పొలయ విన్నపముఁ గావించెన్"

(2 ఆ - 5 ప)

ఇందలిభావము సామాన్య మైనదే. కాని - తద్వ్యక్తీకరణములో ముక్కు తిమ్మనగారిముద్ర యున్నది. ఆమె తలిరాకుబోణి కనుక ఆమె పలుకులవిన్యాసమును తలిరాకులరెపరెపలవలెనే మనోజ్ఞముగా నున్నది.

" అలరుంబోఁడులలోపల
నలరుం బోఁడుములు నీకు నగ్గల మగుచున్
దలపూ వాడక యుండుము
తలపూవు ధరించి వికచతామరసాక్షీ !"

(1 ఆ - 64 ప)

ఈశబ్దాలంకార మెంత మనోహరముగా నున్నదో కదా పునరుక్తవదా భాసాలంకారభాసుర మై.

సుకుమారభావములను చిత్రించునప్పుడును, సుందరదృశ్యములను వర్ణించునప్పుడును, శృంగారాదిరసములను పోషించునప్పుడును మాత్రమే కాక వీరరౌద్రరసపోషణమునకూడ తిమ్మకవి సుకుమారమైన పదబంధమునే ప్రయోగించును. అందుల కుదాహరణములుగా కొన్నిపద్యము లీక్రింద చూపబడుచున్నవి :-

శా. " శ్రీరంగేశ్వరనాభిపంకజరజశ్శ్రీకంబె జోశేంద్రత
స్వీరాజత్కుచపాళికుంకుమముకంబెన్ సహ్యాభూభృత్తటీ
నీరంధ్రీకృతగైరికద్రవముకంబెన్ వన్నెఁ గావించెఁ గా
వేరీతోయముఁ గృష్ణరాయఁ డహితోర్వీనాథరక్తప్రభన్ "

(1 ఆ - 18 ప)

చ. " వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించినపూవుగుత్తి, వే
ల్పులగమిజీవగఱ్ఱ, యుడివోవనిచల్వలచెంకి, వెన్నెలల్
మొలచినపాదు, పాల్కడలిముద్దులపట్టి నృసింహకృష్ణరా
యలఁ గరుణారసంబు నినుపారెడిచూపులఁ జూచుఁగావుతన్

(1 ఆ - 6 ప)

మ. " తనశృంగారవనంబులోన గిరిపొంతం జక్కఁగా దిద్ది తీ
ర్చినపూఁదేనియయేటికాలువదరిం జెంగల్వపుప్పొళ్ళ నిం
చినచంద్రోపలవేదిపై సరసగోష్ఠిన్ బోఁటియుం దాను న
వ్వనజాతాయతనేత్ర శౌరిగుణముల్ వాక్రుచ్చి వర్ణించుచున్ "

(1 ఆ - 71 ప)

సీ. " కనకపంజరశారికలకుఁ జక్కెర పెట్టి
చదివింప రేలొకో సకియ లిపుడు ;
కరతాళగతుల మందిరమయూరంబుల
నాడింప రేలొకో యతివ లిపుడు ;
క్రొవ్వాడిగోళ్ళఁ దంత్రులు మీటి వీణియల్
పలికింప రేలొకో భామ లిపుడు ;
కలికిరాయంచబోదల నెల్ల నెలయించి
నడిపింప రేలొకో పడఁతు లిపుడు ;

తే. ఇన్నిదినములవలె నుండ దేమి నేఁడు ?
చిన్నవోయిన దీమేడ చెప్పు తఱిఁగి;
పద్మముఖితోడ నెవ్వరేఁ బారిజాత
పుష్పవృత్తాంత మెఱిఁగింపఁబోలునొక్కొ ? "

(1 ఆ - 106 ప)

ఉ. " పాటలగంధిచిత్తమునఁ బాటిలుకోపభరంబు మాన్ప నె
ప్పాటునఁ బాటు గాఁచి, మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియ వెట్ట నాజగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె - మ్రొక్కవన్

(1 ఆ - 120 ప)

ఉ. " ఈసునఁ బుట్టి డెందమున హెచ్చినశోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖ మైనమోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్. "

(1 ఆ - 133 ప)

ఉ. " ఓలలితేంద్ర నీలశకలోపమకైశిక ! యింతవంతనీ
కేల ? లతాంతమాత్రమున కేఁ గలుగన్ ? విను - నీకు దేవతా
కేళివనంబు సొచ్చి యనికిన్ బలసూదనుఁ డెత్తి వచ్చినన్
దీలు పడంగఁ దోలి యిటఁ దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్. "

(1 ఆ - 135 ప)

క. " ప్రామినుకులపూఁబోఁడుల
సీమంతపుఁ జెందిరంబుచే బలె నరుణ
శ్రీ మించునతనిపదముల
భామామణి యోర్తు పయిఁడిపావలు తొడిగెన్ "

(2 ఆ - 7 ప)

చ. " అమరులబోనపుట్టిక సహస్రమయూఖునిజోడుకోడె సం
తమసమువేరువిత్తు కుముదంబులచక్కిలిగింత పుంశ్చలీ
సమితికిఁ జుక్కవాలు నవసారసలక్ష్మి తొలంగుబావ కో
కములకు గుండెతల్లడము కైరవమిత్త్రుఁడు తోఁచెఁ దూర్పునన్. "

(2 ఆ - 41 ప)

తే. " తారకాధీశుకిరణకదంబకంబు
చిలికెఁ బలుచనివలిపంపుజిలుఁగుమంచు

గై రవశ్రీవధూకరగ్రహణవేళ
వెలికిఁ గ్రమ్మినసాత్త్వికస్వేద మనఁగ. "

(2 ఆ - 48 ప)

చ. " దనుజవిరోధిమీఁద నొకతన్వి కరంబున లాజ లెత్తి చ
ల్లిన నెటివేణి యాసునబలెన్ విరిపూవులఁ జల్లెఁ జల్లె లో
చనములు సమ్మదాశ్రువులఁ జల్లె లలాటము ఘర్మబిందువుల్
చనుఁగవ చల్లె సంభ్రమవశత్రుటితామలమౌక్తికాదులన్. "

(3 ఆ - 19 ప)

చ. " మలయసమీరణచ్యుతసమంచితపాండుపలాశ లైనపా
దులనునుసోగతీఁగలు యదుప్రభునిం దలపించె బాలచా
పలహృతతీరవస్త్ర లయి పంకరుహాకరమధ్యసీమలన్
నిలిచినముగ్ధగోపరమణీరమణీయవిలాసరేఖలన్. "

(3 ఆ - 50 ప)

చ. " దానవవైరి దివ్యవనితానికురుంబముతోడ జహ్నుక
న్యానవపంకజాతనివహంబులఁ గందుకకేళి సల్పినన్
మేనఁ దదబ్జపత్రములు నిండగ నంటిన నొప్పు నెంతయున్
దాను నుపేంద్రుఁ డౌట నయనంబులు పెక్కులు దాల్చెనో యనక

(4 ఆ - 34 ప)

తే. " తనమనోవల్లభునిభుజాస్తంభ మూఁది
సలిలవిహరణ మొనరించె సత్యభామ
యలసవైఖరి వీచిడోలాంతరావి
హారసంగతనవరాజహంసి యనఁగ. "

(4 ఆ - 35 ప)

మ. " వనజశ్రీధనపశ్యతోహరుఁడు, జీవంజీవజీవంబు, ప
చ్చనివిల్కానికి మామ, చల్వగని, పశ్యత్పాలజూటాగ్రమో
హనరత్నంబు, సుధాకరుం డపుడు ప్రాగద్రిస్థలీవీథి నొ
య్యనఁ దోతెంచె వియత్తటీకషణలీలాసీతశంఖాకృతిన్. "

(4 ఆ - 47 ప)

తే. " పరమమునిమానసాలానబంధనమునఁ
గుదురుపడకుండుయాదవకుంజరంబు
వికచరాజీవనేత్రచే వేల్పుప్రమానఁ
గమ్మఁబూవులదండచేఁ గట్టువడియె "

(5 ఆ - 80 ప)

ఈవిధముగా తిమ్మనగారిముద్దుపలుకుల కెన్నిపద్దెములనయిన నుదాహరింపవచ్చును.

ముద్దున పాల్గొనుపెదవు లొకరివి కావు – ఇద్దరివి. అనగా – భిన్నము లైనవి. కాని–రెండును పెదవులే ! అనగా–సదృశము లైనవి. భిన్నశబ్దసంపుటీకరణమున తిమ్మనగారు సాధించునాదమాధుర్య మట్టిది !

పెట్టినముద్దు గట్టి దైనను – పెదవులు మెత్తనివే ! తిమ్మనగారు వ్యక్తము చేసినభావము తీవరించియున్నను – పలుకుబడి పరమసుకుమార మైనది ! సంభోగమునందు కేవలలైంగికక్రీడ పాశవిక మైనది. కాని – దానికి మునివాకిటిముగ్గువంటియనుభూతి యైనముద్దు నాగరిక మనోజ్ఞ మైనది. తిమ్మనగారితీ ర్పట్టిది ! శృంగారరసప్రధాన మైనతన కావ్యమున పాశవిక మైనలైంగికక్రీడాప్రసక్తి చొరకుండ ముద్దుపలుకులతో నింతముద్దుగా నిర్వహించినాడు కవిలోకపారిషదుడు తిమ్మనగారు !

" తిమ్మన్నపలుకుబడి ముద్దు ....
అతనిభావములు ముద్దు.
అతనికథావస్తువు ముద్దు.
ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకు - అన్నమాట యీరీతిగా
ముప్పేటగా నున్నది. "

అన్నవిశ్వనాథవారిమాటలు * సముచితముగా నున్నవి.

ముక్కు తిమ్మనగారు గంటము చేపట్టినముహూర్త మెట్టిదో కాని - ఆ కాకమానురాయఁ డభినందించినవేళావిశేష మెట్టిదో కాని - ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకు సర్వాంధ్రసారస్వతప్రపంచమునను నొక సామెత యై, జాతి కొకయామెత యైనది !

* పారిజాతాపహరణము - ఎమెస్కో-ప్రచురణము - విశ్వనాథ సత్యనారాయణగారి పీఠిక — ×××× పుట.

# 13. ఔచిత్యవిచారము

తిమ్మనగారిపారిజాతాపహరణమున కొన్ని యనౌచిత్యములు దొరలిన వందురు. అవి యీ క్రింద చర్చింపబడుచున్నవి :-

1. పారిజాతాపహరణమునందలి ప్రథమాశ్వాసములోని నారదాగమనమును వర్ణించుసందర్భమున 'సరిగమపదనిసస ప్తస్వరంబుల మహతి నభోవాయునిహతి మొఱయ' అనుసీసపద్యమున -

'భాగీరథీపయఃపరిపూర్ణమణికమం
డలువు హస్తంబునఁ జెలువు మిగుల'

నని కవి చెప్పుట యుచితముగా లేదు. ఏలన - 'గగనమునుండి యాకస్మికముగ' వచ్చునారదుడు స్వర్గంగాజలమును - అనఁగా మందాకినీ సలిలములను తనకమండలువున గొనివచ్చును కాని, (భగీరథుడు తెచ్చుటచే భూలోకగత మైన) భాగీరథినుండి పయస్సులను ప్రత్యేకముగా గ్రహించె నని చెప్పుట సమర్థనీయము కాదు. కనుక నారదుడు మందాకినీపయస్సులను తెచ్చె ననుటయే యుచితము.

2. సత్యాసమేతు డై దేవలోకమున విహరించుకృష్ణుడు ఆకాశగంగలో జలక్రీడ లాడు సందర్భమును వర్ణించుచు కవి -

'దానవవైరి దివ్యవనితానికురుంబముతోడ జహ్నుక
న్యానవపంకజాతనివహంబులఁ గందుకకేళి సల్పినన్
మేనఁ దదబ్జపత్రములు నిండఁగ నంటిన నొప్పు నెంతయుం
దాను సుపేంద్రుఁ డౌట నయనంబులు పెక్కులు దాల్చెనో యనన్'

(4 ఆ - 34 ప)

అనుపద్యమును రచించినాడు. జాహ్నవి యనుపేరు పాతాళగంగకు మాత్రమే వర్తించును. అట్టిచో కవి సత్యాకృష్ణులు స్వర్లోకమున జలకేళి సల్పినయాకాశగంగను జహ్నుకన్య యనుట యుచితము కానేరదు.

3. ఇవి శబ్దగతము లైనచిన్నియనౌచిత్యములు కాగా - నర్థగతమైనయనౌచిత్య మొకటి యున్న దని విమర్శకులు వ్రేలెత్తి చూపుచున్నారు - నారదుడు స్వర్లోకమునుండి తాను శ్రీకృష్ణునికి కానుకగా తెచ్చినపారిజాతపుష్పమహిమను రుక్మిణికి వివరించి చెప్పుసందర్భమున-

" అలినీలాలక ! నీవు నీపతి రహస్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబుఁ గల్పించును
జ్జ్వలదీపాంకుర మై * రతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబుల్ తొలఁగింపఁగా సురటి యై రంజిల్లు నిచ్ఛాగతిన్ "

అని చెప్పినట్లు తిమ్మకవి చేసినరచనలో ' రహస్యక్రీడ, లతాంతాయుధసంగరము, రతిశ్రమతనూసంజాతధారాళఘర్మలవంబుల్ తొలఁగింపఁగా సురటి యగును ' అనుట యనుచిత మని యొకతీవ్రమైన విమర్శ కలదు.

" ద్వారక వైకుంఠపురం బీరుక్మిణి లక్ష్మి " (నీవు శ్రీమన్నారాయణుడవే) యని గుర్తించి కీర్తించినదేవర్షి తాను బ్రహ్మచారియైయుండి సాక్షాద్విష్ణుసముఖమున నాయనయిల్లాలితో నిట్లు పలుకుట తగుంతవ్యము కానియనౌచిత్య మని విమర్శకులయభిప్రాయము.

ఈసందర్భమును దృష్టిలో నుంచుకొని సుప్రసిద్ధకవివిమర్శకులు డాక్టర్ యస్వీజోగారావుగారు తమ ' సారస్వతనీరాజనము ' అను వ్యాససంపుటిలో 1 - " ఆఁడుపసి తగులనినారదుఁ డేమిటి ? అందును మహర్షి పరస్త్రీతో నట్లాడు టేమిటి ? ఒకవేళఁ దా నేదో తాతగారి వరుస భావించుకొని పెద్దతనము నెత్తిని వేసికొనెనేమో యని యెంత యనుకొంద మన్నను - లోకములో నెందఱు తాతలు తమమనుమ

---

* ' శృంగార శ్శుచి రుజ్జ్వలా ' యని అమరము. ఉజ్జ్వలరసమనఁగా శృంగారరసము. ఉజ్జ్వలదీపాంకురము=శృంగారరసానుభవమున కనుకూలమైన చిఱుదివ్వె.

1. సారస్వతనీరాజనము - ఆచార్య యస్వీజోగారావుగారు, పు॥లు 70 - 71

రాంద్రతో మాటవరుసగా మోటసరసము లాడుట మనము చూచు చుండుటలేదు ? అని సరిపెట్టుకొంద మన్నను – నవి యేమిమాటలు ? తమపెద్దతనము సాకుపెట్టుకొని మాటలలోఁ దమయావ తీర్చుకొనఁ జూచుతాతలే అనలే రామాటలు. అంతవాచ్యముగా, అంతపచ్చిగా "రహస్యక్రీడ" "లతాంతాయుధసంగరంబు" "రతిశ్రమ" అను మాట లానోట పలికించుట నారాయణ ! నారాయణ ! ఘోరమైన యనౌచిత్య మనక తప్పదు." అని తప్పుపట్టినారు.

డాక్టర్ జోగారావుగారు రచించినఈవ్యాససంపుటికి పీఠిక వ్రాసినకవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు తమపీఠికలో తిమ్మనకవిని సమర్థించుచు నిట్లన్నారు –

" .... ఇంకొకవిషయము చెప్పకుండ మానలేకున్నాను. "అలనీలాలక ! నీవు నీపతి రహస్యక్రీడ వర్ణించువేళ" అన్నపద్యము మీఁదివిమర్శ వదలిపెట్టరాకున్నది. .... ఒకచిన్నకథ – చెప్పెదను. శుకమహర్షి ముక్తచయుఁడై సన్యాసియై వివస్త్రుఁడై పదునెనిమిదేండ్ల వాఁడు పోవుచుండగా చెఱువులో వివస్త్రలై తానమాడునచ్చరలు కదలలేదు. ముదుసలి యైనవ్యాసుఁడు వస్త్రధారియై పోవుచుండఁగా వారు గగ్గోలుపడి లేచి చీరలు ధరించిరి. నారదుఁడు దేవర్షి. సంగరహితుఁడు. కృష్ణుడు భగవంతుఁడు. ఇతఁడు జన్మ మెత్తినాఁడు. సర్వసృష్టి కార్యమునం దున్నాఁడు. నారదునకు సృష్టికార్యము లేదు. కొంచెము మోటుగాఁ జెప్పినచో మనము దారివెంటఁ బోవుచుందుము. పశువులును జంతువులును సంగమకార్యములు చేయుచుండును. మన కేమి పట్టినది ? కాముకులు వానివంకకూడ కలుషితదృష్టులతోఁ జూడ వచ్చును. యోగి కది యేమి పట్టినది ? చెప్పినవానియం దంతనిర్మమత యున్నది. వినెడితల్లి మహాలక్ష్మి. ఆరుక్మిణీకృష్ణులకు దానియందు భావమే లేదు. ఉన్నట్లు నటింతురు. వట్టిచమత్కారము. వారి కిది శృంగారరసము కాదు. సృష్టికి మూలహేతు వైనయొక కార్యము.

" ప్రజార్థై గృహమేధినాం " అక్కడశృంగారరస మున్నదా? ఇక్కడ అసలు లేదు. ఇట్లు సమన్వయించుకొనవచ్చునేమో?" - ఇది తిమ్మన కవిగారిపక్షమున శ్రీవిశ్వనాథవారిసమర్థనము.

విశ్వనాథవా రనినట్లు నారదుఁడు నిర్మముఁడును, నిస్సంగుఁడును - నిజమే. మఱి నారదునిచే నట్టిమాట లనిపించుటలో తిమ్మన కవియాంతర్యమేమి ? యని విచారింపవలసియున్నది.

పారిజాతాపహరణకావ్యమున సత్యభామాకృష్ణులు నాయికానాయకులు. ఈకథానాయిక సత్య కారుక్మిణి సవతి. ఈసత్యభామసపత్నీమాత్సర్యము జగద్విదితము. సత్యభామకు " దక్షిణాంసచూచుకనయనప్రకంపగుణసూచనలు " కలుగగానే యామెమనసు కీడు శంకించినది. ఆమెదృష్టిలో తనకు కీడైనవిషయ మొక్కటే - " ప్రాణనాథుఁడొండొకచపలాక్షిఁ గూడి నను నొల్లనిచెయ్దము లేమి చేసెనో " యని. నిరంతర మామెమనసునందు దిగు లిదియే. దానికి తోడు " కులమును రూపమున్ మగనికూరిమియుం గలదాన నంచు " రుక్మిణి తనతో పోటీకి వచ్చుచున్నది. అట్టిరుక్మిణితో కృష్ణు డుండుటయే సత్యకు భరింపరానివిషయము. ఈవిషయము సర్వజ్ఞుడైననారదునకు తెలియనిది కాదు. సత్యభామలోనియామాత్సర్యమును మఱింతగా రెచ్చగొట్టుటయే నారదునియుద్దేశము. సత్యకు రుక్మిణిపై నున్నంతఈర్ష్య తక్కినసవతులపై లేదు. అట్టిరుక్మిణితో కృష్ణు డున్నసమయము కనిపెట్టి - కావలె ననియే నారదు డచ్చటికి వచ్చినాడు. ఎందఱోభార్య లున్నకృష్ణుని కొకేయొక్కపూవును నారదుడు కానుకపెట్టుటలోననే కలహము పెట్టుట యున్నది. అది చాల దన్నట్లు రుక్మిణీకృష్ణులకలయికనే సత్యభామ కంటగించుకొనుచుండగా వారిమన్మథసంగరమున కుల్లాసమును కల్పించి రతిశ్రమతనూసంజాతధారాళఘర్మలవములను దొలగించు సురటియైనసురలోకసుమము రుక్మిణికి చెందుట సత్యభామకు హృదయశల్యమేకదా ! అంతటిమానసికవ్యథ యామెకు కలిగించి,

తద్ద్వారా పారిజాతతరువునకై యాసించునింద్రోపేంద్రులకు యుద్ధము కల్పించుటయే కలహభోజనునిసంకల్పము. అందులకే నారదు డంత పచ్చిగా మాటాడినాడు. ఆపచ్చిగా మాటాడుట సత్యభామమనసు నొచ్చునట్లు చేయుటకేకాని - నిర్మముడును నిస్సంగుడును నైననార దునిలో నెట్టివికారమును లేదు. నిస్సంగు డైనవాఁడు లోకపుపోకడగా సందర్భవశమున సంగముప్రసక్తి తెచ్చినను వానికి దోష మంటదు. మనసే ప్రధానము కాని - మాట ప్రధానము కాదు. యథార్థమునకు నారదునియీమాటలకు రుక్మిణీకృష్ణు లీయనిప్రాధాన్యము నిచ్చి మన సున మలమల మరిగినది మాత్సర్యగ్రస్తురాలగుసత్యభామమాత్రమే. అదియే నారదునికి కావలసినది. పైగా - నారదునిమాటలలో మఱి యొకముఖ్యవిషయ మున్నది.

‘ జలజాక్షి ! ఇదిపారిజాతప్రసూనంబు
నరులకు ధరియింప నరిదిసూవె !
పౌలోమి పార్వతి పద్మ పద్మజురాణి
యను శిరంబునఁ దాల్తు రనుదినంబు ’

నని రుక్మిణితో నారదు డన్నాడు. పారిజాతము నింతవఱకు ధరించు పౌలోమియు, పార్వతియు, పద్మయు, పద్మజురాణియు దేవతలు. కనుక స్వేద మెఱుంగనివారు. చెమట పట్టుట మానవశరీరలక్షణము. రుక్మిణీ కృష్ణులు లక్ష్మీనారాయణులే యైనను మానవరూపముల నున్నవారు. రతిశ్రమతనూసంజాతధారాళఘర్మలవంబుల్ తొలఁగింపఁగా సురటి యై రంజిల్లుపారిజాతపుష్పమువలనిసౌఖ్యము దేవతలకన్న మానవులే యెక్కు వగా ననుభవింపగలరు. అనగా - పౌలోమియు, పార్వతియు, లక్ష్మి సరస్వతులును నెన్నడు నెఱుఁగనిహాయి రతికేళిలో రుక్మిణికి నారదు డిచ్చిన పూవువలన లభించిన దన్నమాట ! సవతి కంతటిసంతోషము కలిగినదే ! సత్యభామ కింతకన్న సంతాపకారణ మే మున్నది ? అంత కన్న నారదునికి కావలసిన దే మున్నది ? అతడు ‘ జలజాసనుపట్టి ’. కలహసంభ్రమపరుఁ డై (1 ఆ - 57 ప) తరువాత రుక్మిణితో చేసిన

సంభాషణ మంతయు సత్యభామను రెచ్చగొట్టుటకే. సత్యలోకమునుండి వచ్చినయాజలజాసనుపట్టి సత్యమునే వాక్రుచ్చినాడు. ఆసత్యభాషణ ములో నున్న దనిపించునవౌచిత్య మీదృష్టితో చూచినచో పరాస్తము కాఁగలదు. నారదు డాడిన

' అలినీలాలక ! నీవు నీపతి రహస్యక్రీడ .... నిచ్ఛాగతిన్ '

అనుమాటలలో నవౌచిత్యము లేదు సరికదా – ఇన్నివిధములుగా నౌచిత్యము తొణకిసలాడుచున్నది. అట్లు కాక నారదుడు చేసినరతి ప్రసక్తి దోషమే యన్నచో – కాళిదాసమహాకవి చెప్పినట్లు –

" ఏకోహి దోషో గుణసన్నిపాతే
నిమజ్జతీందోఃకిరణే ష్వివాంకః "

తిమ్మనగారి రచనలోని దిది ఘోరమైనయనౌచిత్య మని కంఠోక్తిగా చెప్పినఆచార్య జోగారావుగారుకూడ చిట్టచివరకు " అయితే తాత గారిపారిజాతపరిమళము నీనీహారలేశ మొకటి యాకట్టలేదు. " – అని నిర్ణయించి తమసహృదయమును చాటుకొనుట సంతోషింపదగినవిష యము.

ఈసందర్భమున మఱొక్కమనవి. వీరభారతము అనునొక కావ్య మున్నది. అందు నాయిక సంయుక్త. తనతండ్రి కిష్టములేని పృథ్వీరాజును వరించినది. ఆదాంపత్యము నిష్టపడనిజయచంద్రుడు పృథ్వీరాజును నాశనము చేయుటకై సంకల్పించి మహమ్మదుఘోరీని భారతదేశమున కాహ్వానించినాడు. కడకు ఘోరీచేతులలో నాయ ల్లుఁడుమామ లిద్దఱును చిక్కి సిలుగులపా లయినారు. ఇది యాకావ్య ములోనియొకప్రధానవిషయము.

సంయుక్తాపృథ్వీరాజులశృంగారక్రీడలను చిత్రించుసన్నివేశ ములో ఆవీరభారతకర్త రచించినపద్య మొకటి యున్నది. అది యిది :–

'వక్షోరాజ్యరమాధిపత్యవిషయస్పర్థాళు లయ్యంగనా
వక్షోజమ్ములు మచ్చరించుకొని రాపాదంగ భూజాని త
చ్ఛిక్షాపారగుఁ డై నఖక్షతములన్ శిక్షించె; మద్రి త్తతన్
గక్షల్ గాంచి పెనంగువా రొరులచే గాసిల్లు టాశ్చర్యమే ?'

ఇందు నఖక్షతవర్ణనము ప్రధానముగాఁ గనిపించుచున్నను బ్రధాన మైనవిషయ మది కానేకాదు. ఘోరీచేతులలో జయచంద్రుడును, పృథ్వీరాజును నలిగిపోవుట యనెడిభవిష్యత్కథను సూచించుటయే యిందుఁ గవియుద్దేశము. అయినను ఒక్కొక్కపాఠకుఁ డొక్కొక్క విధముగా పద్యము నర్థముచేసికొనును. అది వానిదోషము కాదు. కవిత్వములో నున్నచమత్కారమే అట్టిది !

అట్లే – 'అలినీలాలక ! నీవు నీపతి రహస్యక్రీడ వర్తించు వేళ....' అనుపద్యమునుగూర్చినవిమర్శకు తిమ్మనకవి సజీవుఁ డైయు న్నచో నేమి జవా బిచ్చెడివాఁడో మఱి.

4. ప్రథమాశ్వాసమునందలి 88వ పద్యములో సత్యభామ తన చెలికత్తెను 'కన్నియ !' యని సంబోధించును. నారదుడు కృష్ణుని పట్టమహిషి యైనరుక్మిణిని 'కన్నియ !' అని (1 ఆ – 65 ప) సంబోధించి నాడు. అవివాహిత యనునర్థములో కాక స్త్రీసామాన్యవాచకముగా మాత్రమే యీశబ్దము ప్రయోగింపబడినట్లు స్పష్టమగును. ఇది యనౌ చిత్యము కాదు కాని తిమ్మనగారిరచనలో నిది యొకవిలక్షణ మైన ప్రయోగము.

5. 'పుష్కరము' అనుశబ్దము కరిహస్తాగ్రవాచక మైనను – తిమ్మనగారి 'కర' శబ్దప్రయోగము స్పష్టార్థ మనియు, నిట్టిప్రయోగ ములు మహాకవులగ్రంథములలో కానబడుచుండుటచే వీనిని పునరుక్తి యని చెప్ప నొప్పదు– అనియు నాగపూడి కుప్పుస్వామయ్యగారు తమ

పరిమళోల్లాసవ్యాఖ్యలో [1] సౌందర్యలహరినుండి యుదాహరణ మిచ్చి 'అయ మేవ హి పంథాః మహాకవీనాం' అన్నమల్లినాథసూరివాక్యము నుటంకించినారు. కనుక నిది యొకశాబ్దికదోషముగాకాని పునరుక్తి దోషముగా కాని పరిగణింపబడరాదు.

6. 'అలఘఫణిభోగరత్నములు నాదిగిభోత్కటగండగంధముల్
తలఁపునఁ బాఱి నవ్వ వసుధాసతి భూభుజుకీర్తిమౌక్తిక
చ్ఛలమునఁ గృష్ణరాయనృపచంద్రునిబాహువునందు భూషణో
జ్జ్వలమణులున్ మృగీమదమువాసనయుం గని, ధూర్తలంగనల్'

(1 ఆ - 20 ప)

ఒకవంక 'సతి' యనుచునే మఱల 'ధూర్త' యనుట పరస్పరవిరుద్ధములైనపదములను ప్రయోగించుటకదా.

'కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్?'

అన్నప్పుడు పెద్దనగారును, ఇక్కడ తిమ్మకవియు 'సతీ' శబ్దమును స్త్రీసామాన్యవాచకముగామాత్రమే ప్రయోగించినా రనవలయును. దీనిని సమర్థించుట కిది యొక్కటే మార్గము. మదము మృగమునకేకాని మృగి కుండుట యసహజము. ఇట్టియనౌచిత్యములు మహాత్ప్రయోగములం గలవు.

7. ఇతరకవులవలె తిమ్మనగారు తనకావ్యనాయికచే చంద్ర, మన్మథ, మలయానిలదూషణము చేయింపకపోవుట కావ్యజగత్తున నిజముగా నొకవిప్లవము తెచ్చినట్లే భావింపవలసియున్నది. అయినను - ద్వారకలోనిజారిణులప్రసక్తి నీకావ్యమునం దవసరము కానిదానిని

........................................................................

1. పారిజాతాపహరణమునకు పరిమళోల్లాసవ్యాఖ్య, పు. 119 — నాగపూడి కుప్పుస్వామయ్యగారు.

2. చూడుఁడు - రామాయణకల్పవృక్షము - బాలకాండము - విశ్వనాథ వారిది.

తెచ్చిపెట్టి యుండుటచే సమకాలీనప్రభావమునుండి తిమ్మకవి పూర్తిగా తప్పించుకొనలేకపోయినా డనవలసివచ్చుచున్నది.

8. పారిజాతమును సత్యభామకు చూపి కృష్ణుడు ఆవృక్షము 'రమామనోహరునురంబుం గౌస్తుభంబున్ బలెన్' ఉన్న దని చెప్పుట అంతగా సమంజసముగా లేదు. రుక్మిణి నెక్కువ చేసి తన్ను తక్కువగా చూచుచున్నా డని యిప్పటికే సత్యభామ తనమగని ననుమానించు చుండగా – సత్యభామతోనే తాను రమామనోరముండ ననుట యనౌచిత్యభంగమే యనిపించును. కాని – లోనారసి చూచినచో మఱొక్కరహస్య మిందు గోచరింపవచ్చును. రమామనోరముం డైనతన కాకౌస్తుభ మెంతటియలంకారమో యీపారిజాత మింద్రుని నందనమున కంతటిశోభాకర మనియు, నట్టిదానిని తాను సత్యభామ కీయఁదలంచుట తన కామెయందలిప్రగాఢప్రణయమునకు చిహ్న మనియు శ్రీకృష్ణునియాంతర్య మైనట్లు చెప్పుకొన్నచో నది యుచితమే కదా! అంతే కాదు – తాను రమామనోరముఁ డయ్యును (సత్య భామనుమాత్రమే స్వర్లోకమునకు తోడ్కొనివచ్చి పారిజాతము నామె కర్పింపనుండుటచే) తనమన స్సంతయు నిండియుండునది సత్యమాత్రమే యనియు నిందలిధ్వని! ఇప్పుడు పై ననుకొన్నయనౌచిత్యమునకు తా వుండదు.

అమృతసరసివంటితిమ్మనగారికావ్యములో నొండు రెండు నెఱసు లున్నను నవి యంతగా పట్టించుకొనదగినవి కా వని సహృదయు లంగీకరింతు రని యాశించుట తప్పు కాదుకదా.



# 14. కావ్యప్రశస్తి

" నైసర్గికీచ ప్రతిభా శ్రుతంచ బహునిర్మలమ్
అమంద శ్చాభియోగోఽస్యాః కారణం కావ్యసంపదః "

అని దండి కావ్యాదర్శమున చెప్పి యున్నాడు.

" శక్తి ర్నిపుణతా లోకకావ్యశాస్త్రాద్యవేక్షణాత్
కావ్యజ్ఞశిక్షయాభ్యాస ఇతి హేతు స్తదుద్భవే "

అని కావ్యప్రకాశికలో మమ్మటుడు కావ్యహేతువులను పేర్కొన్నాడు.

" అపూర్వవస్తునిర్మాణక్షమా ప్రజ్ఞా "

అని యొకయాలంకారికుడు నిర్వచించినప్రజ్ఞావైభవము తిమ్మకవిలో పుష్కలముగా నున్నది.

" కవయః క్రాంతదర్శినః "

క్రాంతదర్శి యైనకవి దర్శింపనివస్తువు లేదు.

" ప్రతిభైవచ కవీనాం కావ్యకారణకారణమ్ "

అన్నాడు రాజశేఖరుడు.

ఈయుత్తమలక్షణము లన్నియు పుణికిపుచ్చుకొన్నమహాకవి నంది తిమ్మన.

" అలంకారా స్త్వలంకారా
గుణా ఏవ గుణా స్సదా
ఔచిత్యం రససిద్ధస్య
స్థిరం కావ్యస్యజీవితమ్ " 1

(కావ్యమున అలంకారములు మనము ధరించునలంకారములవంటివి. గుణములు మనగుణములవంటివి. రససిద్ధ మైనకావ్యముయొక్క స్థిరజీవితము ఔచిత్యము. అది మనజీవితమువంటిది) అన్నాడు క్షేమేంద్రుడు.

1. క్షేమేంద్రుడు.

ఈయౌచిత్యమే రసమునకు ప్రాణ మని యానందవర్ధనుని సిద్ధాంతము.

" అనౌచిత్యాదృతే నాన్య
ద్రసభంగస్య కారణమ్ "

(అనౌచిత్యముకన్న రసభంగకారణము వేఱొకటి లేదు.) అని ధ్వన్యాలోకము. " కవిత్వ మనఁగా భావావేశవ్యక్తీకరణము కాదు - భావ సంయమము " " Poetry is not expressing emotion but the withstanding it." అన్నాఁ డొకయాంగ్లపండితుడు. *

ఈనిర్వచనముల కుదాహరణభూతముగా నిలిచినది పారిజాతాపహరణము.

తిమ్మనగా రాగర్భకవి. " శ్రావ్య మైనశబ్దముద్వారా రమ్య మైనయర్థమును హృద్య మైనయనుభూతిగా పరిణమింపజేయునది కవిత్వము. శ్రావ్య మైనశబ్దము లనగా సందర్భసుందరము లై, తదర్థశక్తి సందీపకము లై ఝుడితిస్ఫురణకరణపటువు లై వీను లున్నమది కించు నట్టివి." అని ఆచార్య యస్వీ జోగారావుగారియాభాషణము. [1]

కళాకౌశలపేశల మై, స్వతంత్రభావరమణీయ మై, రసహృదయుల కానందమరందము నందించుకావ్యపారిజాతము తిమ్మనగారిపారిజాతాపహరణము. ప్రతిభావ్యుత్పత్తు లొకదానితో నొకటి పోటీపడిన రచన తిమ్మనగారిది.

* కావ్యశిల్పసమీక్ష - పుట 117 - ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు.

1. కచ్ఛపీశ్రుతులు - మహాకవి ఆదిభట్ల నారాయణదాసుగారు—
డాక్టర్ యస్వీ జోగారావుగారిసంపాదకీయము.

" జాలంధరోడ్యాణమూలాఖ్యబంధత్రయీబంధుసంధుక్షిత స్పర్శనస్పర్శనిర్గ్రంథితగ్రంథిషట్కాంతరోన్నిద్రకద్రూసుతశ్రీముఖజ్వాలవల్లీపరిస్రంసమానేందునిష్యందసర్వాంగనిష్పందయోగీంద్రహృద్వేదికావాస " -

అని తిమ్మకవి యదితిపాత్రచే చేయించినశ్రీకృష్ణవర్ణనమాయన యోగవిద్యావిదు డని చాటుచున్నది.

" జలరుహమిత్రుఁ డాత్మరుచిసంపద చీఁకటిబందెకానికిం
గలఁగుచు వీనిలోన నిడి కైకొనె నమ్మికకాఁపు లంచుఁ జు
క్కలదొర యెండదాడి విని గ్రక్కునఁ దానునుఁ గాంతి వీనిలో
పల నెలకొల్పెనాఁ బలుకఁబాటె నిశాంతనిశాంతదీపముల్ "

(2 ఆ - 60 ప)

" ఆదిత్యో వా స్తమయ న్నగ్ని మనుప్రవిశతి " అన్నది కృష్ణయజుర్వేదము. పై పద్యము తిమ్మకవివేదపాండిత్యమునకు నిదర్శనము. [1]

" ప్రణవమంత్రావృత్తిపావనస్ఫటికాక్ష
వలయంబు కర్ణశష్కులిక వ్రేల "

ఇది నారదవర్ణనపద్యములోనిది. " స్ఫాటికో మోక్షదాయకః " అను ప్రమాణమును దృష్టిలో నుంచుకొని తిమ్మకవి పై పద్యపంక్తిని రచించి నట్లు స్పష్ట మగును.

1. " అగ్నింవా వాదిత్య స్సాయం ప్రవిశతి
తస్మా దగ్ని ర్దూరా న్నక్తం దదృశే
ఉభేహి తేజసీ సంపద్యతే
ఉద్యంతం వా వాదిత్య మగ్ని రనుసమారోహతి
తస్మాద్ధూమ ఏవాగ్నే ర్దివా దదృశే. "
అని శ్రుతివాక్యము.

" రంభామహోరోజకుంభపరీరంభ
కుసుమితప్రత్యగ్రకురవకంబు
మంజుఘోషావక్త్రికంజాత .... .... ....
.... .... .... .... .... .... .... ....
.... .... .... .... .... .... .... ....
.... .... .... .... .... .... .... ....
దైవతాధీశనందనోద్యానసీమ "
(3 ఆ - 44 ప)

ఈసీసపద్యము కవికి కలతరులతాదోహదక్రియకు సంబంధించినవిజ్ఞానము నెలుగెత్తి చాటును.

" ఏడుకరంబులన్ వరుస నెత్తినతోమరశక్తి చాపశ
స్త్రీడమరుస్రువవ్యజనదివ్యమహత్తరసాధనంబు లా
మ్రేడితకాంతితో నిజశరీరరుచిం బచరింప వచ్చె న
య్యేడికరాచతత్తడిపయిన్ హుతవాహుఁ డుదగ్రమూర్తియై "
(4 ఆ - 79 ప)

అగ్నిధ్యానశ్లోకము లాధారముగా నీపద్యము రచింపబడినది.

" ప్రోడశనంబులు మీఱఁగ
జేడియ లడుగులును మొగముఁ జేతులు మెఱయన్
వేడుక నీఁదఁగ నపు డా
మ్రేడితజలజాత మయ్యె మిన్నే ళెల్లన్ "
(4 ఆ - 32 ప)

ఆమ్రేడితజలజాత మయ్యె ననుట వ్యాకరణశాస్త్రమునకు సంబంధించిన యొకచిన్నిచమత్కారము.

ఈవిధముగా తిమ్మకవిపాండితినిగూర్చి యెన్నియుదాహరణములైన నీయవచ్చును.

ఇక నీకవియితివృత్తనిర్వహణశిల్పమును, రచనావైచిత్రియు నీవఱకే వివరింపబడినవి. ఖండితనాయికగా సత్యభామయు, ప్రోరోగిరము

తెండిపోతుగా నారదుడును మొదలైనయాయాపాత్రలస్వభావజీవలక్షణ ములు తిమ్మకవికావ్యమునందే తెలుగుజాతికి సుపరిచితములైనవి.

సత్యభామసపత్నీమాత్సర్య మనువునాదిపై పారిజాతాపహరణకథాసౌధము వినిర్మింపబడినది. "సురలోకాభిమతప్రదానసమతా సూయంబలె కృష్ణుడు పారిజాతతరువును పెకలించినట్లు వర్ణించి, యీర్ష్యాగ్రస్తురాలయిన సత్యభామాప్రియునిలోకూడ నసూయాగుణము నారోపించుట తిమ్మకవిచమత్కారదృష్టికి నిదర్శనము.

పారిజాతపుష్పమహిమను వర్ణించుచు నారదుడు "బడలిక జెందనీక యశుభంబు లడంచు" నని ద్వారకలో రుక్మిణికి చెప్పగా – "తరుణీ! యీతరుశాఖాంతరలోలదుకూలమారుతము లింద్రాణీపరివారవారసతులకుఁ బరువవువిరికోఁతఁ బొడముబడలిక నడఁచున్" అని కృష్ణుడు నందనోద్యానమున విహరించుసందర్భమున సత్యభామకు చెప్పెను. ప్రథమాశ్వాసమున చెప్పబడినదానికిని, చతుర్థాశ్వాసమున చెప్పబడినదీనికిని చక్కనిసమన్వయము నిట్లు సాధించుట కవిమెలంకువను సూచించును.

"ఖగకులనాథుపక్షములగాడ్పు సహింపఁగలేక రజ్జుప
న్నగములు" రవితేరిక్రిందికి చన్న వని (2 ఆ - 82 ప)

రెండవ యాశ్వాసములో వర్ణించినకవి

"గరుడనిఱెక్కలం బొడముగాడ్పులసోఁకునఁ దక్కువేలుపుం
దరువులు పెల్లగిల్లి" న (4 ఆ - 55ప)

వని చతుర్థాశ్వాసములో చెప్పి, అక్కడను, నిక్కడనుకూడ నొకేపదమును ("గాడ్పు" అని) ప్రయోగించి, గరుత్మంతునిఱెక్కలకదలికచే వచ్చునది గాడ్పే కాని – గాలి కాదని – యుద్దేశపూర్వకముగా చెప్పినాడు. అల్పాల్పములైనపదములను బ్రయోగించుపట్టునకూడ నింత జాగ్రత్త వహించినవారు కవులలో నరుదుగా కనిపింతురు. పూర్వప్రక

రణములలో వివరింపబడినట్లు కావ్య మాద్యంతమును సూచ్యార్థ సూచనామయ మై యీకవిశిల్పకళానైపుణ్యమును వేనోళ్ళ చాటు చున్నది.

తిక్కనగారు "కలకలనవ్వులు, పిన్ననవ్వులు, వెడవెడ నవ్వులు" ఇత్యాదిగా నవ్వులలో పలురకములను వర్ణించినట్లుగా - తిమ్మకవి "వేఁడివెన్నెల, పచ్చివెన్నెల, కసటువెన్నెల, వలిపవెన్నెల, ముదురువెన్నెల, తఱిపివెన్నెల" - అని వెన్నెలలో నెన్నోరకములను (2 ఆ - 49 ప) వర్ణించుట గమనింపదగినది.

"గ్రావనిబద్ధఘనౌఘం బయ్యు నగ్రావనిబద్ధఘనౌఘం బై, గవయస్థానం బయ్యు నగవయస్థానం బై" ఇత్యాదిరచనయు,

"సుధర్మాప్రదేశంబునుంబోలె శక్రపురమహిళాలికుచచందన సుగంధాగురువాతపోతమేదురంబును, భారతంబునుంబోలె శతపర్వాచమ త్కృతంబును" నై పసిండికొండ యున్నదఁట! (2 ఆ - 88వసంఖ్య కలవచనము) ఈప్రబంధరీతి తిమ్మకవిశ్లేషరచనాప్రావీణ్యమున కొక మచ్చుతునక.

"తామసవృత్తి లేదు - సతతంబును నుగ్రుఁడు కాఁడు" - అని యీశ్వరరాజుపరముగాను,

"మునుపొకకొండవీటికడ మూఢత రుద్రుడు కృష్ణనందనున్
మనసిజునిన్ హరించె - నది మానుషమే? ...."

అని శ్రీకృష్ణరాయులపరముగాను తిమ్మన రచించినపద్యములు ఆయన రచనాచమత్కృతికి సహృదయులనమస్కృతు లందింప జేయునవి.

సర్వసాధారణముగా కవులు ఛందోనియమాదులను సక్రమ ముగా పాటించుటకై కర్తృకర్మక్రియాక్రమమును తారుమారొనరించి వాక్యవిన్యాసమునకు వైపరీత్యము తెచ్చిపెట్టుకొందురు. కాని - తిమ్మన

గారిరచనలో అన్వయవ్యుత్క్రమము మచ్చునకైన కానరాదు. అత డాతపమునుగూర్చి చెప్పునపు డెండపొడయు, చంద్రాతపమునుగూర్చి చెప్పునప్పుడు వెన్నెలపొడయు (డాక్టర్. పి. యశోదా రెడ్డిగా రన్నట్లు) సహృదయపాఠకులకన్నులఁ గట్టును.

సత్యాకృష్ణులస్నిగ్ధశృంగారమును లలితలలితముగా, స్వచ్ఛముగా, సహజముగా, ఔచిత్యపుటవధులు దాఁటకుండ పోషించినఖ్యాతి తిమ్మనగారిది.

సత్యాకృష్ణు లాకరేయి యమరపురిలో వైజయంతమున గడపిరి.

“ ఆరాత్రి సత్యఁ గూడి ము
రారి ముదం బెసఁగ వైజయంతమున మనో
భూరాజ్యసౌఖ్యనిద్రా
పారీణత నుండుచోఁ బ్రభాతం బయ్యెన్. ”
(4 ఆ - 48 ప)

అని నాయికానాయకులశృంగారమును తిమ్మకవి సూచనప్రాయముగా చెప్పి వదలినాడు. అదేవిషయమును ప్రబంధయుగమునకు చెందిన మఱియొకకవి యైనచో - అంగనలయంగప్రత్యంగవర్ణనలతో ప్రారంభించి,

“ సహసానఖంపచ స్తనద త్తపరిరంభ
మామూలపరిచుంబితాధరోష్ఠ ”

మని - దొరికినయవకాశమును మఱింత దొరకబుచ్చుకొని తనయుబలాటము నంతయు చూపి, రతివర్ణనమును కన్నులఁ గట్టించువాడు. స్వర్గమున రంభాదులశృంగారము నసభ్యముగా వర్ణింపవచ్చును. అవకాశమున్నను నసభ్యశృంగారమునుకాని, అతివేల మైనశృంగారమునుగాని స్పృశింపకపోవుట - అందులోను - శృంగారరసప్రధాన మైనతనకావ్యమున నింతటిసంయమనమును పాటించుట యొక్క తిమ్మకవికే చెల్లినది. ఈసందర్భమున మఱొక్కమాట చెప్పక తప్పదు. తిమ్మకవి

" అలినీలాలక ! నీవు నీపతి రహస్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబుఁ గల్పించుమ
జ్జ్వలదీపాంకుర మై రతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబుల్ తొలఁగింపఁగా సురటి యై రంజిల్లు విద్యాగతిన్ "

అని నారదపాత్రచే రుక్మిణికి చెప్పించుట యనుచితము కాదా ? యని కొందఱనవచ్చును. ఇది యనుచితము కా దని " యనౌచిత్యవిచార చర్చ " లో చూపబడినది. నారదుడు నిరంతరశృంగారక్రీడాలోల మైన సురలోకమును చూచి వచ్చినవాఁ డయ్యెను, ఆమాటల నట్లు చెప్పక తప్పనిస్థితిలో చెప్పినట్లు తిమ్మకవి రచించెను. ఆసంభాషణము కృష్ణుని సమక్షముననే జరిగినది. నారదుడు రాగానే కృష్ణుడు

" సురసంయమివర ! మీ రిట
కరుదేరఁగ నిప్పు డేఁ గృతార్థుఁడ నైతిన్ "

అనుట లోకపుపోకడగా నన్నది కాదు. నారదు డిట్టిరతిప్రసక్తి తెచ్చిన పిమ్మటకూడ సత్యాసౌధమునకు వచ్చి స్వర్గమున కేఁగుచుండగా - ఆదివ్యర్షి చే నింద్రునికి రాయబార మంపుచు, అదితికుండలములను " ఇదె చనుదెంచి యిత్తుననుమీ శతమన్యునితోడ సంయమీ ! " (2 ఆ - 28 ప) అనియే నారదుని సంయమిగానే కృష్ణుడు భావించి సంబోధించెను. కనుక సత్యభామలో మానరోషమును రెచ్చగొట్టుటకే నారదు డామాటల నన్నట్లును, అక్కడికిని - నారదుడు సంయమమును గోల్పోవలే దనియు చెప్పదగును.

శృంగార మంగిరసమై దానికి వీర మంగరస మైనయీ కావ్యమున ఆవీరములోకూడ అంగిరస మైనశృంగారమే దోబూచు లాడునట్లు రచించుట తిమ్మకవిప్రత్యేకత. దీని కుదాహరణముగా -

" చక్కలరాణివాసముల సోయగపుంజనుదోయిత్రెక్కునం
జిక్కనయైనయక్కు యదుసింహుఁడు బాణపరంపరాహతిన్

్రవక్కలు సేయఁ గాఁబురుధిరంబునఁ దోఁగుచు రేవెలుంగు కెం
పెక్కినచాయ నభ్యుదయ మేదియుఁ దాల్చె రణాంగణంబునన్ ''

(5 ఆ - 10 ప)

అనుపద్యమును చూపవచ్చును.

" వేల్పుభ్రమానియందు వేడుకపడుకూర్మి
సతులకోర్కిఁ దీర్పఁ జాలి యపుడు
హరియు హరియుఁ బోరి రన్యోన్యజయకాంక్ష
నసురజీవనాపహారుగముల ''

(5 ఆ - 23 ప)

అనుసీపద్యమున శృంగారనాయకు లైనయింద్రోపేంద్రులమనఃస్థితికి మహాభాష్యము పలికినాడు తిమ్మకవి.

ఇంద్రునిపక్షమున నుపేంద్రునిపై నెత్తి వచ్చినయష్టదిక్పాలకులును శృంగభంగము నంది కాందిశీకు లైనా రని వర్ణించుచు

" నిర్భగ్నశృంగుఁ డై నిజవాహనముఁ దాను
వైవస్వతుఁడు లాఘవంబు నొందె "

అను పద్యమును తిమ్మకవి చెప్పెను. ఇట్లు దేవేంద్రునిశృంగారములో వీరము పొంగారునట్లు చేసి, ఆవీరమున హాస్యమును జొప్పించి, అప హాస్యముపా లైనదిక్పాలకులదీనస్థితిని ఈపద్యము పట్టి యిచ్చుచున్నది.

ఈకావ్యమున తిమ్మకవి బహుకావ్యవేదశాస్త్రపురాణకోవిదుడుగా, సంప్రదాయవాదిగా, శివకేశవాద్వైతవాదిగా, గోచరించుచున్నాడు. శబ్దాలంకారప్రియత్వము, సూక్ష్మాంశములనుసైతము సునిశితముగా భావించుట, పలుకుబడిలో తెనుగుదన ముట్టిపడుట, పద్యములు కమ్మెచ్చున లాగినవెండితీవలవలె సాగుట – ఇట్టిలక్షణము లీకావ్యమున కోకొల్లలు.

ఈకవి రసగ్రంథిని విప్పారజేయునుద్దేశముతో నందందు మూలమును ప్రపంచించినాడు. మూలభావము చేవదేరునట్లు చేయుటకై అక్కడక్కడ కుదించినాడు. కేవలము కథాకథనప్రధానముగా సాగినమూలము నాలంబనముగామాత్రమే గైకొని, యిసుకనుండి తైలము తీసినట్లు తిమ్మనమహాకవి శృంగారరసనిర్భరమైనమహాప్రబంధమును తెలుగున వెలయించినాడు.

"మూలగ్రంథదర్పణమునకు కావ్యత్వపుకళాయి పెట్టిన ఆయనవ్యక్తిత్వాంశలలో అతిముఖ్యమైన దాయనరసికత. రసికత యనగా కేవలము శృంగారైకదేశస్వారసికమైనచిత్తవృత్తి కాదు. సర్వరసాభిముఖ్యము గలసౌమనస్యము." అని ఆచార్య యస్వీజోగారావుగారు తిక్కనమహాకవినిగూర్చి చెప్పినమాటలు[1] ఈతిమ్మకవికి కూడ వర్తించును.

ఉపదేశ మాశయముగా గలహరివంశమునుండి రసమరందములూరుపారిజాతకావ్యమును సృష్టించినతిమ్మన మూలమునందలిఛాందసమును, పునరుక్తిని పరిహరించి, తనరచనమును శిల్పసుందరముగా మలచుట గమనింపదగినవిశేషము.

కవి యేమి చెప్పుచున్నాడు? అనుదానికన్న - ఎట్లు చెప్పుచున్నాడు? అన్నది కళాధర్మవేత్తలు పట్టి చూచువిషయము. ఈపరీక్షలో తనకు తానే సాటి యనిపించుకొన్నజగజెట్టి తిమ్మనగారు. శృంగారవీరులైనయింద్రోపేంద్రులు యుద్ధవీరులుగా మారినను తిమ్మనగారిలేఖిని తనసహజసౌకుమార్యమును వీడక ముద్దుముద్దుగానే సాగిపోయినది. వాగర్థములవలె పెనవైచుకొన్నశివపార్వతులను తనలో నిలుపుకొన్నఈకవి తనరచనలో ఆవాగర్థమహాయోగమును అద్భుతముగా ప్రకటించినాడు. ప్రాచీనాధ్వపథికులలో నధికుడై సర్వతంత్ర

1. మహాకవిమార్గము - డాక్టరు యస్. వీ. జోగారావుగారు – పుటలు 128, 129.

స్వతంత్ర మైనవ్యక్తిత్వము గలవాడు కనుకనే అమూలక మైనసత్యా పాదతాడనఘట్టమును తనరచనలో చొప్పించి యుద్దిష్టప్రయోజనమును సాధించుకొన్నాడు.

" అమరులతోనపుట్టిక సహస్రమయూఖునిజోడుకోడె సం
తమసమువేరువిత్తు కుముదంబులచక్కిలిగింత పుంశ్చలీ
సమితికిఁ జుక్కవాలు నవసారసలక్ష్మి తొలంగుబావ కో
కములకు గుండెతల్లడము కైరవమిత్రుఁడు తోఁచెఁ దూర్పునన్ "

అని తిమ్మనగారు చంద్రుని వర్ణించినపద్యమునే సాగదీసి పెద్దనగారు తనమనుచరిత్రపీఠికలో

సీ. " కలశపాథోరాశిగర్భవీచిమతల్లి
కడుపార నెవ్వానిఁ గన్నతల్లి
యనలాక్షుఘనజటావనవాటి కెవ్వాఁడు
వన్నె వెట్టుననార్తవంపుఁబువ్వు
సకలదైవతబుభుక్షాపూర్తి కెవ్వాఁడు
పుట్టుఁ గాననిమేనిమెట్టపంట
కటికచీఁకటితిండికరములగిలిగింత
నెవ్వాడు తొగకన్నె నవ్వఁజేయు

తే. గీ. " నతఁడు వొగ డొందు మధుకైటభారిమఱఁది
కళలనెల వగువాఁడు చుక్కలకు ఱేఁడు
మిసిమిపరసీమ వలరాజుమేనమామ
వేవెలుంగులదొరజోడు రేవెలుంగు "

(మనుచ. - 18 ప)

అనుపద్యమును రచించినట్లు సహృదయు లంగీకరింతురు. అటనట మాటలు మార్చినను తిమ్మనగారు వాడిన " చక్కిలిగింత " యనుపద మునే " గిలిగింత " యని పెద్దనగారు గ్రహించుటనుబట్టి తిమ్మనగారి చిన్నిపద్యమే పెద్దనగారిపెద్దపద్యమునకు మార్గదర్శక మైన దని నిస్సం

దేహముగా చెప్పవచ్చును. ఈవిధముగా - కవులలో పెద్ద యనిపించు కొన్న పెద్దనయంతటిమహాకవి తిమ్మనగారిభావము ననుకరించుట తిమ్మ కవియౌన్నత్యమునకు తార్కాణము.

సీ. " భోజకన్యాసరిద్రాజహంసము సత్య
భామాశుకీకేళిపంజరంబు
జాంబవతీనిశాచంద్రోదయంబు కా
ళిందీసరోజినీందిందిరంబు
భద్రాకలాపినీప్రావృడంబుదము సు
దంతారసాలలతాపికంబు
మిత్రవిందావనీచైత్రాగమము లక్ష
ణాహారయష్టికానాయకంబు

తే. గీ. " షోడశసహస్రకామినీస్తోమధేను
కారిరంసామదోత్కటవారణేంద్ర
మనఁగ సౌఖ్యాంబునిధి నోలలాడుచుండెఁ
గృష్ణుఁ డఖిలావనైకవర్తిష్ణుఁ డగుచు "
(5 ఆ - 107 ప)

అని కృష్ణుని వర్ణించుచు తనకావ్యాంతమున తిమ్మనగారు రచించిన సీసపద్యమునకు ఛాయగా రఘునాథనాయకుడు తనరఘునాథాభ్యుదయ కావ్యమున (89వ పుటలో)

సీ. " భోజకన్యాముఖాంభోజరాజమరాళ
సత్యాఘనస్తనస్తబకభృంగ
జాంబవతీవిలోచనచకోరశశాంక
మిత్రవిందాతటిన్మేఘరూప
భద్రావశావశాభద్రదంతావళ
వరసుదంతామనోవనమృగేంద్ర
లక్షణారూపకలాపినీపర్జన్య
భానుసుతాలతాపారిజాత

తే. గీ. షోడశస్త్రీసహస్రచక్షుః ప్రసార
హారసారమసారమోహనశరీర
విజయరాఘవభూపాలభజనలోల
కేలు మోడ్చెద రాజగోపాల నీకు "

(4 ఆ - 89 పుట)

అనుపద్యమును రచించినాఁడు.

మక్కికి మక్కిగా మాటలతో సహా ఆయన రచనావిధానమును తరువాతికవు లెందఱో అనుసరించుటనుబట్టి నందితిమ్మనగారి ప్రభావము తరువాతికవులపై నెంతగానో పడిన ట్లీక్రిందిపద్యములు నిరూపించుచున్నవి -

" చక్కఁదనమున కొకవింతచక్కఁదనము
జవ్వనంబున కొకవింతజవ్వనంబు
విభ్రమంబున కొకవింతవిభ్రమంబుఁ
గలిగె నద్దివ్యకుసుమంబుకతన సతికి "

(1 ఆ - 58 ప)

పై తిమ్మనగారిపద్యముయొక్కనోటిలోనుండి యూడిపడిన ట్లున్నముద్దుపళనిపద్యము చూడఁదగినది -

" చూపులోపల నొకవింతచూపుతళుకు
వడుపులోపల నొకవింతవడుపుబెళుకు
నుండునునికికి నొకవింతనుండుకులుకు
వచ్చెఁగదవమ్మ ! మనయిళావనిత కిపుడు "

— రాధికాసాంత్వనము

" వలిజక్కవలపెక్కువలు తక్కువగ నిక్కు
చనుదోయి కొకవింతచాయ దోఁచె "

— పారిజాతాపహరణము 1 ఆ - 56 ప

అని తిమ్మనగారు చెప్పగా -

" అలజక్కవలపెక్కవలఁ ద్రొక్కబలునిక్క
గలగుబ్బపాలిండ్లు గలఁగె నమ్మ "
అని రాధికాసాంత్వనము - 3 ఆ - 87 ప

" కలలోననైన నవ్వులకైన నామాట
జవదాఁట వెఱచునో నన్నుతాంగి "
- పారిజాతాపహరణము.

" ఏఁ జూచి చూడక యేమాట చెప్పిన
జవదాఁట వెఱచు నోసన్నుతాంగి "
- రాధికాసాంత్వనము - 3 ఆ - 31 ప

" ఏపదార్థంబు నాయెదుటఁ బెట్టకమున్న
యెవ్వారి కొసఁగఁ దోయిగురుఁబోఁడి "
- పారిజాతాపహరణము - 1 ఆ - 94 ప

" ఏపదార్థంబునైన నాయెదుటఁ బెట్ట
కెవరికి నొసంగఁబోవఁ డోయింబువదన ! "
- రాధికాసాంత్వనము

" కపట మెఱుఁగనిమమతలఁ గలసిమెలసి
యున్నవిభుఁ డిట్లుసేయునే యోలతాంగి "
- పారిజాతాపహరణము

" చేరి యటు లున్నవిభుఁ డిట్లు చేసెనేని
తిరుగ బ్రతుకాడవలె నఁటే శరదవేణి ! "
- రాధికాసాంత్వనము

ఈవిధముగా తరువాతికవు లెందఱో తిమ్మనగారిరచనమును అనుకరించుట గమనింపదగినవిశేషము.

ముత్తరాజు సుబ్బారావుగారి 'తులాభారనాటకము'[1] నకు ముక్కుతిమ్మనగారి కావ్యమునందలి పుణ్యకవ్రతమే దోహదము కల్పించినది. ఆసుబ్బారావుగారీపారిజాతాపహరణపద్యరచనము నెక్కువగా ననుకరించిరి.

డాక్టర్ యస్వీజోగారావుగారు రచించిన ప్రసన్నకుసుమాయుధ[2] కావ్యములో తిమ్మనగారొకపాత్రమై అట్లుకూడ శాశ్వతత్వమును సంతరించుకొన్నారు.

"ప్రమదలఁ గూడిమాడఁగనె వారిమనోగతు లెల్లఁ దేటతె
ల్లముగ స్ఫురించె నంచును దలంతురువో మగవార లౌర! స
త్యముఁ గనుఁగొన్న నెంతరసికాగ్రణికైనను నారికేళపా
కముగద కామినీహృదయకావ్యరసగ్రహణంబు మిత్రమా!"

తులాభారములోని ఈపద్యమున భావసంపదలో, రసతాత్పర్యములో, పద్యరచనావిధానములో సుబ్బారావుగారు తిమ్మకవి ననుకరించినారు. లింగనమఖి కామేశ్వరకవి విరచిత 'సత్యభామాసాంత్వనము' నకును, విజయరాఘవనాయకాదిశృంగారశూరులైనదక్షిణాంధ్రకవులశృంగారాభిరుచిసురుచిరత్వమునకును నోజ్జబంతులు తీర్చినది యీపారిజాతాపహరణకావ్యమే. దక్షిణాంధ్రకవులశృంగారరసపోషణమునందలి కసకు వారిలోపలిస్వయంపాకము కారణము కాఁగా - పసకు కారణము పారిజాతాపహరణమే.

"కావ్యస్యాత్మా ధ్వని రితి బుధై
ర్యస్సమామ్నాతపూర్వః"
"యత్రార్థశ్శబ్దోవా తమర్థ ముపసర్జనీకృతస్వార్థౌ
వ్యఙ్క్తః కావ్యవిశేష స్స ధ్వని రితి సూరిభిః కథితః"[3]

1. తులాభారనాటకము - ముత్తరాజు సుబ్బారావుగారు.
2. ప్రసన్నకుసుమాయుధము - డాక్టర్ యస్వీజోగారావుగారు
3. ధ్వన్యాలోకము - ఆనందవర్ధనుడు.

అని ధ్వన్యాలోకమున నానందవర్ధనుడు చెప్పినదాని కీపారిజాతాపహరణము లక్ష్యభూతముగా నున్నది.

రసానుభవమున కుద్దీపనము లైనవర్ణనలును, కథాంశమును తలోకదారి కాక పరస్పరము వియ్యమందినయీకావ్యములో తిమ్మన గారు తనభావనాబలమునంతటిని ముడుపు కట్టి తెలుగుజాతి కందించి నాడు.

వేంకటరామకృష్ణకవు లలంకారగ్రంథములను – ముఖ్యముగా క్షేమేంద్రునియౌచిత్యవిచారచర్చను, కవికంఠాభరణమును మొదలైన [1] గ్రంథముల ననువదించినసందర్భమున ప్రాచీనాంధ్రకవులపద్యములను లక్ష్యములుగా నుదాహరించుపట్టున నీపారిజాతాపహరణపద్యములను పలుతడవు లుటంకించుట గమనింపదగినవిశేషము.

సత్యాకృష్ణులకును, నారదపాత్రకును నింతటిప్రశస్తి లభించుటకు కారణ మీపారిజాతాపహరణకావ్యమే.

సత్యా లను తెలుగువారిగుండెకు దగ్గఱగా తెచ్చి, తెలుగుపలుకుబడులతో తెలుగుజాతిజీవనవిధానముతో చిత్రించినతిమ్మకవి మన కారాధ్యుడు. తరువులో చెఱువులో ప్రకృతియందలి యణువణువులో ప్రేమతత్త్వమును దర్శించినమహాభావుకు డాయన. కాలపురుషుని పూతనాంతకు డైనబాలకృష్ణుడుగా దర్శించినవేదాంతి ఆయన. రసభావనిర్భర మైనరచనావిధానముతో నందఱిడెందములను స్పందింపజేసినకవిదిగ్గజ మాయన.

శృంగారమునకును, ప్రకృతికిని గలదగ్గఱచుట్టఱికమును సత్యభామతో కృష్ణుడు చేసినప్రసంగములో లలితముగా కవి ప్రదర్శించి నాడు.

1. వేంకటరామకృష్ణకవులయలంకారగ్రంథానువాదములు

కేవలము కథాకథనదృష్టితోమాత్రమే సంస్కృతహరివంశమునందలిపారిజాతాపహరణేతివృత్తము పురాణఫక్కిలో రచింపబడగా తిమ్మకవి ఆకథను రమణీయవర్ణనాకర్ణనీయముగా, రసభావబంధురముగా, లలితశయ్యాకలితముగా నాటకీయముగా తీర్చిదిద్దుట ప్రశంసార్హము.

ఆచార్య జోగారావుగా రన్నట్లు - 'నాటకీయత యనగా వట్టి సంవాదముమాత్రమే కాదు. పాత్రలనడుమ సంవాదము లేనప్పుడు తద్భావప్రతిస్పందనసమున్మీలనముతో ఆసన్నివేశమున కొకనాటకీయమైన విన్నాణ మేర్పడును. [1] ఖండితనాయికగా సత్యభామచేష్టలన్నియు దీని కుదాహరణముగా చూపవచ్చును.

ప్రకృతిసౌందర్యసర్వస్వము నాపోశనము పట్టినది తిమ్మకవిగారి నిశితదృష్టి.

ఇతివృత్తము కావ్యశరీరము కాగా రసము కావ్యమున కాత్మ. ఈకావ్యమున సత్యాకృష్ణులశృంగారము ప్రణయమధుర మైనశృంగారమే కాని కామకలుషిత మైనశృంగారము కాకపోవుట తిమ్మకవిగారి రచనలోనిప్రత్యేకత. కావ్యనాయిక యైనసత్యభామయందు మానవిప్రలంభము చక్కగా పోషింపబడినది. ఆమెప్రణయము విరహపునీతమైనది.

" శృంగారీ చేత్ కవిః
కావ్యేజాతం రసమయం జగత్ "

అని ఆనందవర్ధను డన్నట్లు పరమసుకుమారమై, రసమయమైనకళాఖండమిది.

---

1. మహాకవిమార్గము - పుట 16 - ఆచార్య యస్వీజోగారావుగారు

కృష్ణు డెట నున్న నచ్చట నొకశృంగారప్రపంచము రూపు దిద్దుకొనును. ఆయనతో నమరాంగనలు జలక్రీడ లాడునప్పుడును అది యొకరతిక్రీడగా భాసించి, అత్రిదశమదవతులు రతిశ్రమఖిన్నలను బోలి నట్లు రచించినమహాభావుకుడు తిమ్మనగారు. ఆజలకేళి యొకరాసకేళి వలె రక్తికట్టినది. కృష్ణునిపాదము సోకినయమరగంగయు నాయంగన లలో నొక్కతె యై పొంగిపోయినది. ఇట్లు శృంగారవీరరససింధువుగా సహృదయులకు సన్నిహితబంధువుగా నిలిచినాడు తిమ్మకవి. ఆయన లోకజ్ఞతారసజ్ఞతలు ఆంధ్రులకు శిరోధార్యములు. పరుసవేదివంటి ఆయనలేఖిని సోకి బంగారుబొమ్మ యైనసత్యభామ చైతన్యచకచ్చకిత మూర్తి యైనది. ఆయనవర్ణనావైదగ్ధ్యము, చమత్కారచారుత్వము, తత్త్వజ్ఞత, జగన్నాటకసూత్రధారి యైనజగన్నాయకుడు నాయకు డైనయీతిమ్మకవికావ్యము నాటకీయముగా సాగి పఠితలమనఃఫలకము లపై శాశ్వతముద్ర వైచుకొన్నది. ఆచార్య యస్వీ జోగారావుగా రనినట్లు "హరివంశఖనినుండి బయల్వెడలినయనర్ఘమణి పారిజాతా పహరణము. తిమ్మనగంటపుశాణోపలమునఁ బడి జాతిరత్న మైనది. ఇందలిప్రతిపాత్ర, వర్ణన, ప్రతిరసభావసన్నివేశము "మిన్నేటిపసిండి నెత్తమ్మిచిగురుటాకునం బొదివినపారిజాతంపుఁగ్రొన్ననయే".

[ఆచార్య జోగారావుగారి 'సారస్వతనీరాజనము']

శరవేగముతో సాగిపోయినయిందలికథ, రమణీయమైన కథాకథనవిధానము పరమరమణీయముగా నున్నవి. ఇందలి సన్ని వేశములు స్వల్పములే యైనను ఆయాపాత్రలస్వరూపస్వభావాదిచిత్రణ ముచే నాటకీయముగా నడచినవి. నారదకృతకృష్ణస్తుతి సందర్భోచితమై అందు చిత్రకవితావైచిత్రి తొణకిసలాడుచున్నది.

"సత్యాగ్రహసన్నివేశము ఈకావ్యమునందలికండపట్టు. అక్కడ తిమ్మనతాతగారికవితాపారిజాత మపూర్వసౌరభములు గుబా ళించినది." కవిగారికంటము కలకంఠకంఠ మై కావ్యగాన మొనరింపగా

రసప్రసన్నముగా రచన ముద్దులు మూటకట్టుచు నొయ్యారముగా సాగి పోయినది. ముక్కుతిమ్మనగారినాయిక యేడుపుకూడ బాలపల్లవగ్రాస కషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనితో ముద్దుముద్దుగా నుండుట తెలుగుజాతియదృష్టము. ఇంతటిశైలీలాలిత్యము గలకావ్యము తెలుగున మఱియొకటి లేదు.

ఈకావ్యమునందు శయ్య ఎంత మృదులమో ప్రక్రియ అంత ప్రౌఢము.

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగా రన్నట్లు ' తిమ్మన పలుకుబడి ముద్దు. అతనిభావములు ముద్దు. అతనికథావస్తువు ముద్దు.

ముద్దుపలుకులతో ముచ్చటగొలుపుచున్నంతమాత్రమున ప్రౌఢత్వమును, అవసరమైనపట్టుల కాఠిన్యమును, శ్లేషచమత్కారమును నిందు లోపింపకపోవుట విశేషము. కనుక ఈకావ్యము తేలికగా చూడదగినది కాదు. ఏసన్నివేశమున కాసన్నివేశ మిది యిట్లే యుండ వలయు నన్నట్లు తరువాతిసన్నివేశముతో పొత్తు కుదుర్చుకొనుట ఈ కావ్యమునందలివిశేషము. రసోచితరచనావిధానములో, శైలీలాలిత్యములో, చమత్కారచారుత్వములో, రూపకోచితచతురసంవిధానములో, సుకుమారభావుకతలో, సునిశితమానవమనఃపరిశీలననిపుణతలో కల్పనాచతురతలో పేరెన్నిక గన్నది పారిజాతాపహరణము.

తాను ' శివపరాధీనమతి ' నని కావ్యాంతమున చెప్పుకొన్నను తిమ్మకవి శివకేశవాద్వైతభావన కలవాఁ డని " పాకదమన ముక్తపాశుపతాస్త్రంబు హరినిజార్ధతనువునందు డించె " (5 ఆ - 80 ప) నని ఆయన రచించినపద్యము స్పష్టము చేయుచున్నది.

ఆపారిజాతముమాట యటుంచి నందితిమ్మనగారిమెడంద నందనమున విరబూసినయీకావ్యపారిజాతముమాత్రము " పరిమళము

చెడనిది. వాడనిది. పరువము తప్పనిది. అనురాగరసభరితమై నిరతము జగదేకమనోహరమైనది. "

అల్లసానిపెద్దనగారిమనుచరిత్రలో లేనివస్త్వైక్యము; ఏక నాయకాశ్రయత్వము, వర్ణనాప్రాచుర్యము, శృంగారరసప్రాధాన్యము, శయ్యానైగనిగ్యము - ననుప్రబంధలక్షణములను సమగ్రముగా సంత రించుకొన్నచతురస్రమైనరచనమైనయీపారిజాతాపహరణ మర్వాచీన సరణి కొజ్జబంతులు తీర్చినది.

తిమ్మనగారిప్రతిపద్యము నొకరత్నమే. అట్టిరత్నము లేర్చి కూర్చినతనపారిజాతకావ్యహారమును ఆకవి భగవత్కైంకర్యదృష్టితో- శ్రీకృష్ణునవతార మని తాను విశ్వసించినశ్రీకృష్ణరాయప్రభునిరా సిక్యమున కుపహారముగా, ప్రేమభక్తిసమన్వితముగా సమర్పించినాడు. మనుచరిత్రము తెలుగుజాతి యున్నంతవఱకును మనుచరిత్రమైనచో నీపారిజాతకావ్యము తెలుగుగుండెలో రసజ్ఞత నిండారువఱకును వలపు లెగజిమ్ముచునే యుండును.

" జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః "



# ఉపయుక్త గ్రంథములు


| | |
|---|---|
| అగ్నిధ్యానశ్లోకములు | |
| అనురాగం | శ్రీ ఇలపావులూరి పాండురంగారావు |
| అప్పకవీయము | |
| అనర్ఘరాఘవము | |
| అభిజ్ఞానశాకుంతలము | కాళిదాసు |
| అమరకోశము | |
| అమరుకము | |
| అలంకారగ్రంథానువాదములు | వేంకరామకృష్ణకవులు |
| అలంకారశేఖరము | |
| అష్టమహిషీకల్యాణము | తాళ్లపాక చిన్నన్న |
| ఆంధ్రకవితరంగిణి | చాగంటి శేషయ్యగారు |
| ఆంధ్రకవిసప్తశతి | |
| ఆంధ్రకవుల చరిత్ర | కందుకూరి వీరేశలింగంగారు |
| ఆంధ్రనామ సంగ్రహము | |
| ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము | చలమచర్ల రంగాచార్యులుగారు |
| ఆంధ్రమహాభాగవతము | బమ్మెర పోతన |
| ఆంధ్రమహాభారతము | నన్నయ |
| ఆంధ్రమహాభారతము | తిక్కన |
| ఆంధ్రమహాభారతము | ఎఱ్ఱన |
| ఆంధ్రవాఙ్మయచరిత్ర | కాశీనాథుని నాగేశ్వరరావుగారు |
| ఆంధ్రవాఙ్మయచరిత్ర | చేకుమళ్ళ అచ్యుతరావుగారు |
| ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక | సంపుటి 47, సంచికలు 2, 3 |
| ఉత్తరరామచరిత్ర | భవభూతి |
| ఉత్తరహరివంశము | నాచన సోమన |
| ఏకావళి | విద్యాధరుడు |
| ఔచిత్యవిచారచర్చ | క్షేమేంద్రుడు |
| కవికంఠాభరణము | క్షేమేంద్రుడు |

| | |
|---|---|
| కచ్ఛపీశ్రుతులు | ఆదిభట్ల నారాయణదాసుగారు (ఆచార్య యస్వీ జోగారావుగారి పీఠిక) |
| కవికర్ణరసాయనము | సంకుసాల నృసింహకవి |
| కవికల్పలత | |
| కవిజనమనోరంజని | కనపర్తి అబ్బయామాత్యుడు |
| కవిజీవితములు | గురజాడ |
| కవిమనోరంజని | కూచిమంచి వెంకటరాయకవి |
| కాత్యాయన వార్తికములు | |
| కామాయని (హిందీకావ్యము) | జయశంకరప్రసాద్ |
| కావ్యపరిచయాలు | యమ్వీయల్ (అకాడమీ ప్రచురణ) |
| కావ్యపరిమళము | విశ్వనాథ సత్యనారాయణగారు |
| కావ్యప్రకాశిక | మమ్మటుడు |
| కావ్యమీమాంస | రాజశేఖరుడు |
| కావ్యలహరి | యువభారతి ప్రచురణ |
| కావ్యశిల్పసమీక్ష | ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు |
| కావ్యాదర్శము | దండి |
| కావ్యాలంకారచూడామణి | విన్నకోట పెద్దన |
| కావ్యాలంకారసంగ్రహము | భట్టుమూర్తి (సన్నిధానంవారి వ్యాఖ్యతో) |
| కాశీఖండము | శ్రీనాథుడు |
| కృష్ణకర్ణామృతము | లీలాశుకుడు |
| కృష్ణరాయల నందిదుర్గశాసనము | |
| కృష్ణరాయ విజయము | కుమార ధూర్జటి |
| గీతగోవిందము | జయదేవుడు |
| చాటుపద్యమణిమంజరి | వేటూరి ప్రభాకరశాస్త్రిగారిసంపాదకీయముతో |
| జయమంగళవ్యాఖ్య | యశోధరుడు |
| తులాభారనాటకము | ముత్తరాజు సుబ్బారావుగారు |
| తైత్తిరీయోపనిషత్తు | |
| దశరూపకము | ధనంజయుడు |
| దేవీ సవము | కాళిదాసు |

| | |
|---|---|
| ధ్వన్యాలోకము | ఆనందవర్ధనుడు |
| నలకీర్తి కౌముది | అగస్త్య మహాకవి |
| నాట్యశాస్త్రము | భరతుడు |
| నారాయణీయము | నారాయణపండితుడు |
| నీతిశాస్త్రము - ప్రథమభాగము | |
| | ఎఱ్ఱన |
| పంచకల్యాణి | డాక్టర్ యస్వీ జోగారావుగారు |
| ప్రబోధ చంద్రోదయము | నందిమల్లయ, ఘంటసింగయ |
| ప్రతాపరుద్రీయము | విద్యానాథుడు |
| ప్రసన్నకుసుమాయుధము | డాక్టర్ యస్వీ జోగారావుగారు |
| పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి |
| పారిజాతాపహరణము | తిమ్మకవి (విశ్వనాథవారి పీఠికతో) |
| పారిజాతాపహరణము | నాగపూడి కుప్పుసామయ్యగారి వ్యాఖ్యతో |
| పారిజాతాపహరణము | దూసి రామమూర్తిశాస్త్రిగారి వ్యాఖ్యతో |
| పారిజాతాపహరణము | తాపీ ధర్మారావుగారి పీఠికతో |
| పారిజాతాపహరణపర్యాలోచనము | డాక్టర్ పి. యశోదారెడ్డి |
| పారిజాతము (నవల) | వక్కలంక లక్ష్మీపతిరావు |
| పారిజాతసౌరభము (పద్యకావ్యము) | వక్కలంక లక్ష్మీపతిరావు |
| పాతంజలమహాభాష్యము | |
| పృథుచరిత్ర | పట్టమట్ట సరస్వతీ సోమయాజి |
| బ్రహ్మవైవర్త పురాణము | |
| బాలకాండము | మల్లికార్జునభట్టు |
| బాలవ్యాకరణము | పరవస్తు చిన్నయసూరి |
| భాస్కరరామాయణము | |
| భగవద్గీత | |
| భజగోవిందశ్లోకములు | |
| భట్టగోపాలునియలంకారగ్రంథము | |
| భామహాలంకారము | |

| | |
|---|---|
| భారతి (1925 జూలై) | |
| భారతి 1971 జూలై | |
| భామాకలాపము | సిద్ధేంద్రయోగి |
| భీమఖండము | శ్రీనాథుడు |
| భువనవిజయము | ధూళిపాళ శ్రీరామమూర్తిగారు |
| మహాకవిమార్గము | డాక్టర్ యస్వీ జోగారావుగారు |
| మణిమాల (ముక్తకములు) | వక్కలంక లక్ష్మీపతిరావు |
| మనుచరిత్ర | అల్లసాని పెద్దన |
| మేఘసందేశము | కాళిదాసు |
| రఘునాథాభ్యుదయము | రఘునాథనాయకుడు |
| రఘువంశము | కాళిదాసు |
| రసగంగాధరము | జగన్నాథపండితుడు |
| రసార్ణవసుధాకరము | |
| రాజగోపాలవిలాసము | కాళకవి |
| రాజశేఖరచరిత్ర | మాదయగారి మల్లన |
| రామాయణకల్పవృక్షము | విశ్వనాథ సత్యనారాయణగారు |
| రాయవాచకము | విశ్వనాథనాయకుని స్థానాపతి |
| రాధికాసాంత్వనము | ముద్దుపళని |
| లోచనవ్యాఖ్య | అభినవగుప్తుడు |
| వర్ణనరత్నాకరము | దాసరి లక్ష్మణకవి |
| వక్రోక్తిజీవితము | కుంతకుడు |
| వరాహపురాణము | |
| వసుచరిత్రము | రామరాజభూషణుడు |
| వాక్యపదీయము | వరరుచి |
| వాత్స్యాయనకామసూత్రములు | |
| వాల్మీకిరామాయణము | |
| విక్రమోర్వశీయము | కాళిదాసు |
| విష్ణుపురాణము (సంస్కృతము) | |
| వీరరసము | డాక్టర్ జి. వి సుబ్రహ్మణ్యముగారు |
| వీరభారతము | వక్కలంక లక్ష్మీపతిరావు |

| | |
|---|---|
| శిశుపాలవధ | మాఘుడు |
| శ్రీనాథునికవితాసామ్రాజ్యము | గడియారం వేంకటశేషశాస్త్రిగారు |
| సంస్కృతహరివంశము | |
| సమగ్రాంధ్రసాహిత్యం | ఆరుద్ర |
| సారస్వతనీరాజనము | డాక్టర్ యస్వీ జోగారావుగారు |
| సారస్వతాలంకారము | |
| సత్యభామాసాంత్వనము | లింగనమఖి కామేశ్వరకవి |
| సంగీతశాస్త్రము | నారదుడు |
| సంస్కృతిపత్రిక | డా. యస్వీ జోగారావుగారి వ్యాసము |
| సరస్వతీకంఠాభరణము | భోజదేవుడు |
| సాహితీవాల్లభ్యము | |
| సాహితీసుధాలహరి | సముద్రాల నాగయ్య |
| సాహిత్యసురభి | విశ్వనాథ సత్యనారాయణగారు |
| సాహిత్యదర్పణము | విశ్వనాథుడు |
| హరివంశము | ఎఱ్ఱన |
| హరివంశము (సంస్కృతము) | |
| హితోపదేశము | నారాయణపండితుడు |
| The Number of Rasaas | Dr. K. V. Raghavan |




లలితా ప్రింటింగ్ వర్క్సు, స్టేడియంరోడ్, రాజమంద్రి-1.

# డా॥ వక్కలంక లక్ష్మీపతిరావుగారిరచనలు

1. వీరభారతము (మహాకావ్యము)
2. పారిజాత సౌరభము (పద్యకావ్యము)
3. జలదగీతి (కాళిదాసకృతికి ఆంధ్రీకృతి)
4. పారిజాతము (వచనమహాకావ్యము)
5. సుమాంజలి (గేయకావ్యము)
6. స్వతంత్రభారతి (భారతప్రభుత్వబహూకృతి నొందినగేయకృతి)
7. బాలభారతి (గేయకృతి)
8. రాధికాప్రణయము (గేయకావ్యము)
9. కవితాలోకము (గేయకృతి)
10. కవితావసంతము (గేయకృతి)
11. కాంతిజలపాతము (గేయకృతి)
12. మణిదీపాలు (గేయకావ్యము)
13. స్వతంత్రభారతం (గేయకృతి)
14. కవితాపుష్పకము (గేయకృతి)
15. హరివిల్లు (గేయకృతి)
16. మనిషీ ! ముందుకు చూడు (గేయకృతి)
17. గీతాంజలి (రవీంద్రునికృతి కాంధ్రీకృతి)
18. నర్తనశాల (ధ్వనిప్రధానరూపకము)
19. భువనవిజయము (నాటకము)
20. * వెలుతురుపిట్టలు (నాటిక)
21. ఉత్తరకుమారప్రజ్ఞలు (నాటిక)
22. వీరబభ్రువాహన (బుఱ్ఱకథ)
23. ఆదర్శశిఖరాలు (సాంఘికనవల)
24. చిన్నారిలోకం (నవల)

25.– రాగబంధం [illegible] H. (నవల)

26. విధివంచితులు (చిన్నకథలు)

27. స్వాతంత్ర్యలక్ష్మి (సంగీతరూపకము)

28. వెన్నెలకన్నెలు (సంగీతరూపకము)

29. పచ్చతోరణం (సంగీతరూపకము)

30. సంక్రాంతిలక్ష్మి (సంగీతరూపకము)

31. వెన్నెలపండుగ (సంగీతరూపకము)

32. ఆలయాలసీమ (సంగీతరూపకము)

33. విజయదశమి (సంగీతరూపకము)

34. దేవయాని (సంగీతరూపకము)

35. వరూధిని (సంగీతరూపకము)

36. మణిమాల (ముక్తకములు)

37. పూజాసుమాలు (పద్యరచన)

38. ఆంధ్రపుణ్యక్షేత్రములు (భక్తిగీతాలు)

39. The Jasmins (ఆంగ్లగేయములు)

40. పారిజాతాపహరణప్రబంధ సౌందర్యసమీక్ష (పరిశోధనగ్రంథము)